# తెలుగు వ్యుత్పత్తి కోశం

## (య-వ)

### సప్తమ సంపుటం


ప్రధాన సంపాదకుడు

డా॥ లకంసాని చక్రధరరావు, ఎమ్.ఏ., పిఎచ్.డి.

సహాయకులు

డాక్టర్ బాల అరుణకుమారి, ఎమ్.ఏ., పిఎచ్.డి.
డాక్టర్ ఎలవర్తి విశ్వనాథరెడ్డి, ఎమ్.ఏ., పిఎచ్.డి.
డాక్టర్ లక్కింశెట్టి కోట మల్లేశ్వరరావు, ఎమ్.ఏ., పిఎచ్.డి.
డాక్టర్ కందాళ కనకమహాలక్ష్మి, ఎమ్.ఏ., పిఎచ్.డి.
డాక్టర్ శ్రీపాద సీతామహాలక్ష్మి, ఎమ్.ఏ., పిఎచ్.డి.
డాక్టర్ వెలువోలు నాగరాజ్యలక్ష్మి, ఎమ్.ఏ., పిఎచ్.డి.
డాక్టర్ సజ్జా మోహనరావు, ఎమ్.ఏ., పిఎచ్.డి.
శ్రీ షేక్ విజయకుమార్, ఎమ్.ఏ.
డాక్టర్ పాలడుగు సుమతీదేవి, ఎమ్.ఏ., పిఎచ్.డి.



1989

ఆంధ్రా యూనివర్సిటీ ప్రెస్సు

వాల్తేరు, విశాఖపట్టణం 530 003

కాపీలు 1,500 మార్చి 19...



సీరిస్ నెం. 196

వెల: రూ. 75/-

ప్రతులకు :

డైరెక్టరు
ఆంధ్రా యూనివర్సిటీ ప్రెస్సు
వాల్తేరు, విశాఖపట్టణం 530 003

ముద్రణ-ప్రచురణ : డైరెక్టరు, ఆంధ్రా యూనివర్సిటీ ప్రెస్సు, వాల్తేరు, విశాఖపట్టణం 530 003

# ప్రముఖ విద్యావేత్త



## ఆచార్య కనిశెట్టి వెంకట రమణ

ఎమ్.ఏ . ఎమ్.ఎస్.డబ్ల్యు. (ఆంధ్ర విశ్వకళాపరిషత్), ఎమ్.ఏ., పిఎచ్.డి. (ఇలినాయిస్, యు.ఎస్.ఏ.)

ఆంధ్ర విశ్వకళాపరిషదుపాధ్యక్షులు

# తొలిపలుకు

మన భారతదేశంలో అత్యంత ప్రాచీనకాలంలోనే కోశాలు వెలుగొందాయి. వీటిలో క్రీస్తు పూర్వం ఆరో శతాబ్దానికి చెందిన యాస్కాచార్యుని వ్యుత్పత్తి ప్రదర్శకమయిన 'నిరుక్తమ్' ప్రపంచంలోనే మొట్టమొదటిది. అమరకోశంగా ప్రసిద్ధిపొందిన నామలింగానుశాసనానికి వెలువడ్డ గురుబాల ప్రబోధికాది పదవృత్తులలో వ్యుత్పత్తులు ప్రదర్శితాలైనప్పటికి యాస్కుని తర్వాత ఆ కృషి కొనసాగినట్లు ఆధారాలు లేవు. నేటికీ ఆంగ్ల భాషకు తప్ప ఏ ఇతరభాషకూ సమగ్ర వ్యుత్పత్తి కోశం లేదు. ఈ వ్యుత్పత్తికోశ ప్రాధాన్యాన్ని గుర్తించిన ఆంధ్ర విశ్వకళాపరిషదుపాధ్యక్షులు (1949-61) డా. వి.ఎస్. కృష్ణ, బి.ఎ. (ఆక్స్‌ఫర్డ్), పిఎచ్.డి. (వియన్నా) గారు, ఆచార్య గంటిజోగి సోమయాజి, ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తి (ఉపాధ్యక్షులు, హైద్రాబాదు కేంద్ర విశ్వవిద్యాలయం) గార్లను 1957 లో ప్రోత్సహించి తెలుగు వ్యుత్పత్తికోశ ప్రాదుర్భావానికి కారకులయ్యారు. తర్వాత ఆచార్య తూమాటి దొణప్పగారు (ఉపాధ్యక్షులు, తెలుగు విశ్వవిద్యాలయం) 1970-76 లో తెలుగు వ్యుత్పత్తికోశ పథక స్థిరీకరణకు దోహదం చేశారు. 1976 నుంచి నేటివరకు తెలుగు వ్యుత్పత్తికోశ పథకానికి డైరెక్టరుగాను ప్రధాన సంపాదకులుగాను మన విశ్వవిద్యాలయంలో ఉన్న డాక్టర్ లకంసాని చక్రధరరావు, ఎమ్.ఎ., పిఎచ్.డి., రీడరు, తెలుగు శాఖ అధ్వర్యంలో మొత్తం నిఘంటు నిర్మాణ కార్యక్రమం 30-6-1986 నాటికి పూర్తిచేయబడింది. 1-4-1984 నుంచి నేటివరకు నాలుగు, ఐదు, ఆరు, ఏడు సంపుటాల ముద్రణకు సర్వవిధాల సహకరించినందుకు వీరిని అభినందిస్తున్నాను. 10,132 పదాలతో కూడిన ఈ సప్తమ సంపుటాన్ని (య – వ) మీకు అందిస్తూ ఎనిమిదో సంపుటం (శ – హ) త్వరలోనే మీముందుంచగలమని మనవి చేస్తున్నాను.

ఆంధ్రప్రదేశ్ ఉన్నత న్యాయస్థాన ప్రధాన న్యాయమూర్తులుగా ఆంధ్ర విశ్వకళా పరిషదుపాధ్యక్షులు (1980 – 83) గా, ఆంధ్ర ప్రదేశ్ లోకాయుక్త (1983 – 88) గా సమర్థవంతముగా పనిచేసిన డాక్టర్ ఆవుల సాంబశివరావు, బి.ఎ., బి.ఎల్., ఎల్‌ఎల్.డి. గారికి ఈ సంపుటాన్ని అంకితమిస్తున్నందుకు సంతోషిస్తున్నాను. లక్ష పదాలకు పైబడి ఉన్న ఈ తెలుగు వ్యుత్పత్తికోశం మొత్తం ముద్రణ నా హయాంలో పూర్తి కావడంతున్నందుకు నాకు చాలా ఆనందంగా ఉంది. దీనికి కారకులయిన తెలుగు వ్యుత్పత్తికోశ పథక సిబ్బందిని, సలహాసంఘ సభ్యులను ఈ సప్తమ సంపుటాన్ని చక్కగా వేగంగా అచ్చొత్తించిన ఆంధ్ర విశ్వకళాపరిషన్ముద్రణాలయ డైరెక్టర్ ఆచార్య డి.వి. కృష్ణారావు గారిని అభినందిస్తున్నాను.

ఇట్లు

విశాఖపట్నం

తేది 2-3-1989

(కనిశెట్టి వెంకటరమణ)

# పీఠిక

1957 లో ప్రారంభించబడ్డ ఈ తెలుగు వ్యుత్పత్తి కోశ ముద్రణ బహుముఖ ప్రజ్ఞామూర్తులు ఆంధ్ర భాషాయోషాప్రియులు ఆంధ్ర విశ్వకళాపరిషత్కులపతులు ఆచార్య కనిశెట్టి వెంకటరమణ, ఎమ్. ఏ., ఎమ్. ఎస్. డబ్ల్యు. (ఆంధ్ర విశ్వకళాపరిషత్), ఎమ్. ఏ., పిఎచ్. డి. (ఇల్లినాయిస్ యు.ఎస్.ఏ.) గారి ఆధ్వర్యవంలో పూర్తికావడం నాకు ప్రమోదాన్ని కల్గిస్తోంది. 10,132 ఆరోపాలతో కూడిన ఈ తెలుగు వ్యుత్పత్తికోశ సప్తమ సంపుటం (య – వ) అచిరకాలంలో అచ్చొత్తించబడింది. ఎనిమిది వేల పదాలతో కూడిన ఎనిమిదో సంపుటం అనతి కాలంలోనే ఆచార్య వెంకట రమణగారి ఆశీస్సులతో మీముందుంచగలం. అంతఃస్థలయిన య ర ల వ లలో వకారాది పదాల సంఖ్య అధికమవటంలో ఆశ్చర్యం లేదు. తెలుగులో ఉభయోష్ఠ్యవర్ణమైన వకారం అనంతరకాలంలో కొన్ని మండలాలలో దంతోష్ఠ్యంగా మారింది. ఉభయోష్ఠ్యవర్ణాల ప్రాముఖ్యం ప్రాచుర్యం తెలుగు వ్యుత్పత్తికోశం అయిదు ఆరు సంపుటాలలో గమనించాంకదా.

ఈ సప్తమ సంపుటిలో భాగస్వాములు: ఈ సంపుట ప్రధాన సంపాదకులు – డా॥ లకంసాని చక్రధరరావు కాగా సహాయ సంపాదకులుగా ఉన్నవారు – డా॥ బాల అరుణ కుమారి, డా॥ ఎలవర్తి విశ్వనాథరెడ్డి, డా॥ లక్కింశెట్టి కోట మల్లేశ్వరరావు, డా॥ కందాళ కనక మహాలక్ష్మి, డా॥ శ్రీపాద సీతామహాలక్ష్మి, డా॥ వెలువోలు నాగరాజ్యలక్ష్మి, డా॥ సజ్జా మోహనరావు, శ్రీ షేక్ విజయకుమార్, డా॥ పాలడుగు సుమతీదేవి. శ్రీ గోనెళ్ళ వెంకట సీతారాం టైపిస్టుగాను, శ్రీ బోర వెంకటరమణారెడ్డి అటెండరుగాను ఈ పథకంలో పనిచేశారు.

మద్రాసు ఆంధ్ర ప్రదేశ్ ఉన్నత న్యాయస్థానాలలో న్యాయవాదిగాను, ఆంధ్ర ప్రదేశ్ ఉన్నత న్యాయస్థానంలో న్యాయమూర్తిగా, [illegible] న్యాయమూర్తిగా వివిధ విధులను ధర్మ బద్ధంగా ఆదర్శమూర్తిగా నిర్వహించిన మహాత్ములు, [illegible] పరిషదుపాధ్యక్ష పదవిని 1980 నుంచి 1983 వరకు అత్యంత సమర్థంగా తమ బాధ్యతలను నెరవేర్చిన ప్రతిభాశాలులు, ఆంధ్ర ప్రదేశ్ లోకాయుక్త పదవీబాధ్యతలను శ్లాఘాపాత్రంగా 1983 నుంచి 1985 వరకు నిర్వహించి సర్వుల ప్రశంసలను పొందిన కర్మయోగులు, సహృదయ సార్వభౌములు, సద్గ్రంథ కర్తలు, బహు గ్రంథ భర్తలు, సాహితీ సద్విమర్శకులు, నిఘంటు ప్రియులు అయిన డాక్టర్ ఆవుల సాంబశివరావు, బి.ఏ., బి.ఎల్., ఎల్.ఎల్.డి. గారికి ఈ 'తెలుగు వ్యుత్పత్తి కోశం (సప్తమ సంపుటం)'ను అంకిత మివ్వటానికి అనుమతించిన ఆంధ్ర విశ్వకళాపరిష దధికారులకు కృతజ్ఞతలు.

తెలుగు వ్యుత్పత్తి కోశ పథక నిర్వహణకు ముద్రణకు ఆర్థిక సహాయాన్ని అందిస్తున్న నా మాతృసంస్థ ఆంధ్ర విశ్వకళాపరిషత్తుకు కృతజ్ఞతలు.

ఆచార్య కనిశెట్టి వెంకట రమణగారు విశాఖపట్నం జిల్లా తుమ్మపాలలో 1935 లో జన్మించి ప్రాథమిక విద్యను అక్కడే అభ్యసించి, ప్రాథమికోన్నత విద్యను అనకాపల్లిలో అధ్యయనం కావించి, రాజమండ్రి ప్రభుత్వ కళాశాలలో ఇంటర్మీడియేట్ ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులై, 1954 లో ఆంధ్ర విశ్వకళాపరిషత్తులో బి.ఏ. పూర్తిచేసి ఎమ్.ఏ. (సోషల్ వర్క్) పరీక్షలో మొదటికోటి (ర్యాంక్)ని పొందారు. 1966 లో ప్రపంచ ప్రఖ్యాతమయిన అమెరికా లోని ఇల్లినాయిస్ యూనివర్సిటీ నుండి అత్యల్పవ్యవధిలో ఎమ్.ఏ. పట్టాను, పిఎచ్.డి. పట్టాను సాధించిన విజ్ఞానఖని ఆచార్య కె.వి. రమణగారు. వీరు ఆంధ్ర విశ్వకళాపరిషత్‌లోని సోషల్ వర్క్ విభాగంలో 1961లో ఉపన్యాసకులుగా ప్రవేశించి 1969లో రీడరు పదవిని, 1974లో ఆచార్య పదవిని అలంకరించారు. 1975లో సోషల్ వర్క్ విభాగాధిపతులుగాను, ఎన్.ఎస్.ఎస్.

ప్రత్యేక సలహాదారునిగాను నియమితులయ్యారు. 1984 – 85 సంవత్సరాలకాలంలో ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వంవారు వీరిని ఉత్తమ ఉపాధ్యాయులుగా ప్రకటించి సత్కరించారు. ఆంధ్రా యూనివర్సిటీ ఆర్ట్స్ కళాశాల హాస్టల్స్ వార్డెన్‌గాను, పరీక్షల డీన్‌గాను, ఎక్స్‌టెన్షన్ సర్వీసెస్ శాఖ డైరెక్టరుగాను శ్రీ కె. వి. రమణగారి పరిపాలన దక్షతను గమనించి విశాఖ వినియోగదార్ల సంఘం వ్యవస్థాపాధ్యక్షులుగా, అంతర్జాతీయ మానవహక్కుల పరిరక్షణ సంస్థ విశాఖ విభాగాధ్యక్షులుగా, ప్రగతి ట్రస్ట్ చైర్మన్‌గా, గ్రేటర్ విశాఖ లెప్రసీ ట్రీట్‌మెంట్ సంస్థ చైర్మన్‌గా, శ్రామిక విద్యాసంస్థ చైర్మన్‌గా, గ్రామీణాభివృద్ధి కార్యక్రమమగ్నులుగా నిరంతర ప్రజాసేవాపరాయణులుగా వీరు కావిస్తున్న కృషికి అలరిన ఆంధ్ర ప్రదేశ్ అధికారులు ఆంధ్ర విశ్వకళాపరిషత్కులపతులుగా నియమించగా 24-3-88 తేదీని పదవీ బాధ్యతలను స్వీకరించి అత్యంత సామర్థ్యంతో సర్వజనరంజకంగా పరిపాలిస్తున్నారు. వీరు ఈ గ్రంథానికి సమకూర్చిన తేటతేనెవంటి తొలిపలుకు తెలుగుతల్లికి వెలుగు. తెలుగు వ్యుత్పత్తికోశ పథకానికి వీరందిస్తున్న ప్రోత్సాహం తెలుగు భాషయందు వీరికి గల ఆదరాభిమానాలు అందరి హృదయాలను ఆకట్టుకొన్నాయి. ఏవంవిధ పరిపాలనదక్షులు, సుగుణ ఖనులు, ఆంధ్ర భాషాభిమానులు, సహృదయ సమ్రాట్టులు, ప్రజాహిత నిరంతర కార్యక్రమమగ్న మనస్కులు, తెలుగు వ్యుత్పత్తికోశ పథక సలహాసంఘాధ్యక్షులు, ఆంధ్ర విశ్వకళాపరిషత్కులపతులు ఆచార్య కనిసెట్టి వెంకట రమణ, ఎమ్. ఏ., ఎమ్. ఎస్. డబ్ల్యు. (ఆంధ్ర విశ్వకళాపరిషత్, వాల్తేరు), ఎమ్. ఏ., పిహెచ్. డి. (ఇల్లినాయిస్, అమెరికా) గారికి మనస్ఫూర్తిగా తెలుగు వ్యుత్పత్తికోశ పథక స్ఫూర్తికి దోహదం చేస్తున్నందుకు హృదయపూర్వక కృతజ్ఞతాంజలులు.

తమ అమూల్యాలైన సలహాలద్వారా శుభాశంసలద్వారా ఈ తెలుగు వ్యుత్పత్తి కోశ పథక పరిసమాప్తికి కారకులయిన అనుభవజ్ఞులు మేధావులు పండితులు తెలుగు వ్యుత్పత్తి కోశ పథక సలహాసంఘ సభ్యులు: డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి, ఆచార్య జి. ఎన్. రెడ్డి, డాక్టర్ వడ్లమూడి గోపాల కృష్ణయ్య, డాక్టర్ వావిలాల గోపాలకృష్ణయ్య, శ్రీమతి టి.ఎన్. అనసూయాదేవి, ఆచార్య చేకూరి రామారావు గార్లకు—

తెలుగు వ్యుత్పత్తి కోశ పథక నిర్మాణకార్యక్రమానికి మొదటినుంచి సంపూర్ణ సహకారాన్ని అందించి నన్ను ప్రోత్సహిస్తున్న ఆంధ్ర భాషాయోషాదయితులు, సరసులు, విజ్ఞాన విరాజితులు, ఆంధ్ర విశ్వకళాపరిషత్కులసచివులు డాక్టర్ మద్ది గోపాలకృష్ణారెడ్డి, ఎమ్.ఏ. (ఆనర్స్), బి.ఎల్., పిహెచ్.డి. గారికి—

ఈ తెలుగు వ్యుత్పత్తికోశ సప్తమ సంపుటాన్ని సర్వాంగసుందరంగా తీర్చిదిద్దటంలో సహకరించిన సహృదయులు, మితహితవచస్కులు, ఆంధ్ర విశ్వకళాపరిషన్ముద్రణాలయ డైరెక్టర్ ఆచార్య డి. వి. కృష్ణారావు, ఎమ్. ఎస్‌సి., పిహెచ్.డి. గారికి, డిప్యూటీ డైరెక్టర్ శ్రీ జి. మదనరాజ్, బి.ఏ. గారికి—

హార్దిక కృతజ్ఞతలు

తమ నిరంతర కృషివల్ల ఈ కోశ సంపూర్తికి కారకులయిన మా తెలుగు వ్యుత్పత్తి కోశ పథక సిబ్బందికి—

మనఃపూర్వకాభినందనలు.

లకంసాని చక్రధరరావు
డైరెక్టరు, ప్రధాన సంపాదకులు
**తెలుగు వ్యుత్పత్తి కోశ పథకం**
కార్యదర్శి, సభ్యులు
తెలుగు వ్యుత్పత్తి కోశ పథక సలహా సంఘం

విశాఖపట్నం

8-3-1989

ఆంధ్ర రాష్ట్ర అవతరణకు

అసువులను అర్పించిన



అమరజీవి

## శ్రీ పొట్టి శ్రీరాములు

# తెలుగు వ్యుత్పత్తి కోశ సలహాసంఘం

అధ్యక్షులు:

**ఆచార్య కసిశెట్టి వెంకటరమణ**, ఎమ్.ఏ.; ఎమ్. ఎస్. డబ్ల్యు.
(ఆంధ్ర విశ్వకళాపరిషత్); ఎమ్.ఏ.; పిఎచ్.డి. (ఇలినాయిస్, యు.ఎస్.ఏ.)
ఉపాధ్యక్షులు, ఆంధ్ర విశ్వకళాపరిషత్, విశాఖపట్నం

సభ్యులు:

**డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి**, డి.లిట్.
సుదర్శన భవన్, నెల్లూరు

**ఆచార్య జి.ఎన్. రెడ్డి**, ఎమ్.ఏ.; పిఎచ్.డి.
యు.జి.సి. ఎమిరిటస్ ఫెలో
శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి

వాఙ్మయమహర్షి
**డాక్టర్ వట్లమూడి గోపాలకృష్ణయ్య**
కళాప్రపూర్ణ
హైదరాబాదు

**డాక్టర్ వావిలాల గోపాలకృష్ణయ్య**
కళాప్రపూర్ణ
సత్తెనపల్లి

**శ్రీమతి టి.ఎన్. అనసూయాదేవి**
మదనపల్లి

**ఆచార్య చేకూరి రామారావు**, ఎమ్.ఏ.; పిఎచ్.డి.
భాషాపీఠాధ్యక్షులు, తెలుగు విశ్వవిద్యాలయం
హైదరాబాదు

**డాక్టర్ లకంసాని చక్రధరరావు**, ఎమ్.ఏ.; పిఎచ్.డి.
కార్యదర్శి, సభ్యులు
డైరెక్టర్, ప్రధాన సంపాదకులు
తెలుగు వ్యుత్పత్తి కోశపథకం
ఆంధ్ర విశ్వకళాపరిషత్, విశాఖపట్నం

xiii

# అంకితం

ప్రతిభాశాలి



**డాక్టర్ ఆవుల సాంబశివరావు,** బి.ఏ., బి.ఎల్. ఎల్ఎల్.డి.

ఆంధ్ర విశ్వకళాపరిషత్ భూతపూర్వ కులపతులు,
ఆంధ్రప్రదేశ్ ప్రప్రథమ లోకాయుక్త,
ఆంధ్రప్రదేశ్ మాజీ ప్రధాన న్యాయమూర్తులు

# య

య వి. నాద తాలవ్యాంతస్థం. అన్ని ద్రావిడభాషల్లోనూ ఈ వర్ణం ఉంది. పదాది యకారం లేదని తెలుగు వ్యాకర్తల మతం. తెలుగు లేఖనంలో శాసనాల్లోనూ, ఇతరత్రా తాల వ్యాచ్చుల ముందు పదాది యకారం కనిపిస్తుంది. అయితే దీనికి అర్థభేదక సామర్థ్యం లేదు. మూలద్రావిడంలో పదాది యకారాన్ని గుర్తించారు. తాలవ్యాచ్చులతో మొదలయ్యే పదాలు యకారాదిగానే వ్యవహారంలో వినిపిస్తున్నాయి. కాని కోశాల్లోని పదాలు మాత్రమే ఇందు గ్రహించబడ్డాయి.

< మూ.ద్రా. *య.

యకరారు రూ.చూ. యెకరారు. వి. అంగీకారం.

యకాయకి రూ.చూ. ఎకాయకి. క్రి.విశే. అకస్మికమైన, త్వరితమైన.

యక్షప్రశ్న వి. కఠిన ప్రశ్న. భారతంలో యక్షుడు పాండవుల్ని కొన్ని కఠిన ప్రశ్నలు వేస్తాడు. కాబట్టి కఠిన ప్రశ్న అని అర్థం.

నం. యక్షప్రశ్న-. యక్షుడి ప్రశ్న.

< నం. యక్షప్రశ్న- (అర్థవిపరి.).

యజమాని రూ. యజమాను. వి. 1. ఇంటి సొంతదారు ; 2. భర్త.

నం. యజమాన-. యజ్ఞం చేసేవాడు. ఇంటిపెద్ద లేక తెగపెద్ద.

< నం. యజమాన-.

యజమాను రూ.చూ. యజమాని. వి. ఇంటిసొంతదారు.

యజ్ఞసాల వి. వర్షానికి తడవకుండా పైన పూరిపాక వేసిన అము.

నం. యజ్ఞశాలా. యజ్ఞం చేసే శాల.

< నం. యజ్ఞశాలా.

యటమటము చూ. ఎటమటము. వి. చిక్కు.

యట్లము రూ.చూ. ఎట్లము. వి. కంపతొడుగు.

యడం రూ.చూ. ఎడము. వి. దూరం.

యడబెట్టు స.క్రి. దూరమగు. < యడం + పెట్టు.

యడబెట్టు చూ. యడం.

యడ్డామడ్డి రూ.చూ. ఎడ్డెమడ్డె. విశే. ఎడ్డిమడ్డి, మొరటు.

యంబె వి. నూనె, దేవునికి తైలార్పణంగనం. ద.హిం.శా. సంపు. 5. శా.సం. 874, క్రీ.శ. 1620.

క. ఎణ్ణె. నూనె ; త. ఎణ్ణెయ్. నూనె. నువ్వులనూనె; మ. ఎణ్ణ. నూనె.

యతామతమగు చూ. యతామతము.

యతామతము రూ.చూ. యతిమతము. వి. వెర్రివాలకం.

యతామతమగు అ.క్రి. వెర్రిఅగు. < యతామతము + అగు.

యతిమతము రూ. యతామతము. వి. వెర్రివాలకం.

నం. యతిమత-. సన్యాసి అభిప్రాయం.

< నం. యతిమత- (అర్థవిపరి.).

యత్తవారి రూ. యత్వారి. వి. ప్రయత్నం.

నం. యత్న- ప్రయత్నం ; పార. -వార్.

< నం. యత్న-. + పార. -వార్.

యత్వారి రూ.చూ. యత్తవారి. వి. ప్రయత్నం.

యథాయథము అవ్య. చెల్లాచెదరు. వేంక. పంచ. 2.177.

నం. యథాయథా. క్రమక్రమంగా, సరిగా.

< నం. యథాయథా (అర్థవిపరి.).

యథాయథలు అవ్య. చెల్లాచెదరు. దశకు. 10.65.

యథాయథలు చూ. యథాయథము.

యదబడు రూ.చూ. ఎదవడు. అ.క్రి. భయపడు.

యదార చూ. ఎద. వి. 1. ఆసక్తి ; 2. చీకూచింత.

యదాస్తు రూ. యాదస్తు, యాదాస్తు. వి. జ్ఞాపకార్థం రాసుకున్నది; మెమోరాండం.

హిం.ఉ.పార. యాద్-దాశ్త్. స్మరణశక్తి, జ్ఞాపకం కోసం రాసిపెట్టుకొన్న సంగతి.

క. యాదాస్తు. చిత్తుగమనిక, జ్ఞాపకచిహ్నం, మెమోరాండం ; త. యాతాస్తు ; మ. యాదాస్తి.

< ఉ. యాద్-దాశ్త్.

యద్దేవా వి. హేళన.

నం. 'యద్దేవదేవహేళనమ్' అనే మంత్రంలో యద్దేవ తర్వాత హేళనం అని ఉన్నది. వైదికపరిభాష ననుసరించి 'యద్దేవ'కు తర్వాతి పదమైన దేవహేళనకు ఉన్న అర్థమే కలిగింది.

< నం. యద్దేవ- (అర్థవిపరి).

యద్వాతద్వాలాడు చూ. యద్వాతద్వాలు.

యద్వాతద్వాలు వి.బ.వ. అస్తవ్యస్తంగా. హేమా. పు. 83.

నం. యద్ వా. ఏప్రకారంగా అయినా, ఏమైనప్పటికీ ; తద్ వా. అదికాని.

< నం. యద్వా తద్వా (అర్థవిపరి.).

యద్వాతద్వాలాడు స.క్రి. అస్తవ్యస్తంగా మాట్లాడు. < యద్వాతద్వాలు + ఆడు.

యమ విశే. మిక్కిలి, చాలా.

నం. యమ. యముడు.

< నం. యమ- (అర్థవిపరి.).

యమగండడు వి. చాలా సాహసం కలవాడు. నం. యమ-. యముడు. యమచిక్కు వి. గట్టిచిక్కు. యమయాతన పడు అ.క్రి. నానాబాధలు పడు.

యమరాలపచ్చ రూ.చూ. యమరాళ్ళపచ్చ. వి. 1. ఒకరకం

పచ్చరంగు; 2. పసిమిలో నలుపుఛాయ కలిసిన రంగు; 3. దమయంతి పచ్చకంటె లేతరంగు; 4. లేలపువ్వు, పచ్చవన్నెలు కలిసిన రంగు.

**యమరాళ్ళపచ్చ** రూ. ఎమ్మాల్లపచ్చ, యమరాలపచ్చ. వి. 1. ఒకరకం పచ్చరంగు; 2. పసిమిలో నలుపుఛాయ కలిసిన రంగు; 3. దమయంతి పచ్చకంటె లేతరంగు; 4. లేల పువ్వు, పచ్చవన్నెలు కలిసిన రంగు.
ఇం. *Emerald*. మరకతం.
< ఇం. Emerald + పచ్చ.

**యములాళ్లు** వి.బ.వ. 1. యమదూతలు, యమభటులు; 2. పీడించేవాళ్ళు.
సం. యమ-. యముడు.
< క. యమనాళు. యమదూత.
సం. యమ- + -లు + ఆ[11] + వాళ్లు.

**యంబ** రూ.చూ. ఎంబ[1]. వి. 1. చీకాకు; 2. వేడిమి.

**యంబన్న** చూ. యంబ్రహ్మ. వి. తెలివితక్కువవాడు.
< యంబ్రహ్మ + అన్న.
**యంబన్నచేయు హాస్యము** వి. తెలివిలేనివాడు చేసే వేళాకోళం. శివ.శ.సా. 22.

**యంబ్రహ్మ** వి. 1. పిసినిగొట్టు; 2. తెలివితక్కువవాడు; 3. చేతగానివాడు.
'యంబ్రహ్మగుప్తయే' అనే వైదిక మంత్రభాగాన్నిబట్టి ధనాన్ని గుప్తంగా దాచేవాడనీ ఏడుముళ్ళు వేసి దాచేవాడనీ అర్థం కలిగి, తర్వాత అనేక నిందాపూర్వకార్థాలు తెలుగులో సంస్కృత 'యంబ్రహ్మ'కు కలిగాయి. వైదిక పరిభాషనుబట్టి 'యంబ్రహ్మ' తర్వాత పదమైన 'గుప్తి'ని బట్టి ఈ అర్థాలు ఈ పదానికి కలిగాయి.
< సం. యంబ్రహ్మ-. (అర్థవిపరి).

**యలగ** రూ.చూ. వెలగ. వి. వృక్షవిశేషం.

**యల్లాబాగా** చూ. ఎల్ల.[2] క్రి. విశే. తేరగా.

**యళవు** రూ.చూ. ఎళవు. వి. 1. రోగం; 2. అశుభమైన మాట.

**యవ** వి. బట్టీ పెట్టక ముందు గుట్టలుగా పెట్టిన ఇటుక.
సం. యవ- ధాన్యవిశేషం.
< సం. యవ- (అర్థవిపరి.).

**యువ్వనము** వి. యుక్తవయసు. శాల్ల. సం. 45-179.
సం. యౌవన-వయసులో ఉండటం.
< సం. యౌవన-.

**యాక** రూ.చూ. వేక. వి. మట్టిపాత్రను వర్సేటప్పుడు అడుగుపై భాగంలో చుట్టూ వెన్నులాగా నిలిపిన అంచు.
**యాకకుండ** వి. పక్కల్లో మాడు పెట్టి చేసిన కుండ.
**యాకసిప్ప** (-చిప్ప) వి. మాడు పెట్టిన చిన్నమట్టిపాత్ర.

**యాకటి** రూ.చూ. వేకటి. వి. వేకటి, గర్భిణి.

**యాకండివర** చూ. ఏకాండము. వి. నూతిపైభాగంలో పెట్టే ఒర.

**యాకము** వి. ఐకంతం.
సం. ఏక-ఒక.
< సం. ఏక-.

**యాకరపెట్టు** రూ.చూ. ఏకరువు పెట్టు. స.క్రి. గడగడ వర్ణించు.

**యాకాణము** రూ.చూ. ఏకాండము. వి. మొదలు తుద ఒకటిగా కలిసి ఉండటం.

**యాకాము** చూ. వేకువ. వి. వేకువ.

**యాకిరి బీకిరి** విశే. చిందరవందర, ఒకక్రమంలేనిది.
క. యాంకర్. రాక్షసుడు.

**యాగర** రూ.చూ. ఏగ్రర. వి. సాగు నీటికాలువలు చీలు మొత్తలు, రెగ్యులేటరు.

**యాగట్టు** రూ.చూ. ఏగ్రట్టు. వి. గొబ్బుకు వెనుక చేర్చిన అక్కెడను కలిపి ఉంచే కట్టు.

**యాగాత** వి. చెన్నపట్టణం పరిసరాల కిందితెగల కులదైవమైన ఒక గ్రామదేవత.

**యాగీ** వి. 1. అల్లరి; 2. అనవసరమైన గొడవ.
సం. యాగ-యజ్ఞం.
**యాగీపెట్టు** అ.క్రి. అల్లరిపెట్టు.

**యాంగిలేర్లు** వి. బ. వ. వేలాడగట్టి మొక్కలు పెంచటానికి చేసిన మట్టితొట్టి.
ఇం *Hangers*. వేలాడేవి.
< ఇం. Hangers.

**యాటొలె** రూ.చూ. ఏటవాలు. విశే. ఒరగాఉన్న, ఒరిగిన.

**యాతటిక** (-అటిక) వి. అడుగు బూడ్చిన అటిక.

**యాతబెట్టు** (-పెట్టు) అ.క్రి. ప్రయోగం చేయు.
సం. యాత-గతించింది, గతం.

**యాతర** వి. యాత్ర.
సం. యాత్రా. ప్రయాణం, తీర్థానికి పోవటం.
< సం. యాత్రా.
**యాతరమంది** విశే.బ.వ. నీచులు.

**యాతరాయి** వి. కుండలను నర్సి పెద్ద చేసేరాయి.
< వేత + రాయి.

**యాతరి** వి. 1. మర్యాద తెలియనిది; 2. పోడిచేపశువు.
< వేత + -అరి.

**యాత్రసంచి** వి. ఒకరకమైన చిన్నగోనెసంచి, అసిమి సంచి.
సం. యాత్రా- ప్రయాణం.
< సం. యాత్రా- + సంచి.

**యాదము** క్రి. విశే. గాఢంగా. కు.సం. 11.3.

**యాదర** వి. ఇంటిలోను, ఉమ్మడి కాపురాలల్లోను, ఎవరికి వారు డబ్బును మిగుల్చుకొని చేర్చి పెట్టుకొంటూ రహస్యంగా వస్తువుల్ని ధాన్యాదుల్ని అమ్మి మూటగట్టుకొంటూ ఎవరి సొమ్ముల్ని వారు పెంచుకోవటం.

**యాదస్తు** రూ.చూ. యదాస్తు. వి. జ్ఞాపకం.

**యాదాకు** వి. సుమారు.

**యాదాస్తు** రూ.చూ. యదాస్తు. వి. జ్ఞాపకార్థం రాసుకున్నది, మెమొరాండం.

**యాదిగి** వి. జ్ఞాపకముంచుకున్నది.
హిం. యాద్. జ్ఞాపకం, గుర్తుంచుకోవటం, గుర్తుకు తెచ్చుకోవటం, సుక్క, తునక; మరా. యాద్; ఉ. పార. యాద్; ఉ.హిం. యాద్‌గారీ, స్మరణం;
క. యాది; త. యాతి, యాతు.

< ఉ. యాద్గారీ.

**యానము** వి. అన్నంఎత్తుకొని వెళ్ళేపాత్ర.

సం. యాన- ప్రయాణం.

< సం. యాన-.

**యానాది** రూ.చూ. ఆనాది. వి. దక్షిణదేశంలో ఒకజాతి.

**యానాదిమద్దెల** వి. యానాది వాళ్ళు వాయించే మద్దెల.

**యాపిల్** వి. సీమరేగు, ఏపిల్‌పండు.

ఇం. *Apple*. ఒకరకం పండు.

< ఇం. Apple.

**యాపిల్ పండు** వి. సీమరేగు.

**యాబై** రూ.చూ. ఏఁబది. సర్వ. అయిదు పదులు.

**యాభయిలు** చూ. ఏఁబది. వి.బ.వ. సంవత్సరాలు.

**యాభై** రూ.చూ. ఏఁబది. సర్వ. అయిదు పదులు.

**యామ** వి. ఒక విధమైన చేప.

త. యామై- రాత్రి;

సం. యామ- జాము.

**యాయవారము** రూ.చూ. ఆయవారము. వి. ముష్టి ఎత్తుకోవటం.

**యాయవారమెత్తుకొను** (-ఎత్తుకొను) స.క్రి. బిచ్చమెత్తుకొను.

**యాయవారమెత్తుకొను** చూ. యాయవారము.

**యాయివారం** రూ.చూ. ఆయవారము. వి. ముష్టి.

**యార్** వి. మిత్రుడు.

హిం. ఉ. పార. యార్. మిత్రుడు, విటుడు.

< ఉ. యార్.

**యార్లు** వి.బ.వ. నవతి. హిం.ఉ.పార. యార్. మిత్రుడు, విటుడు. < ఉ. యార్ + -లు.

**యార** వి. 1. పనిచేయక వదలివేసినదినం; 2. జాతరలో ముఖ్యమైన ఉత్సవం లేనిదినం; 3. చెట్టును కల్లు ఉట్టనీయకుండా నిలిపిన దినం.

సం. హెూరా. కాలపరిమితి, ఒక గంట.

< సం. హెూరా.

**యారగట్ట** (-కట్ట) వి. వ్యవసాయానికి కావలసిన తాళ్ళు మొ.వి.

**యారదోలు** (-తోలు[1]) స.క్రి. పారదోలు.

**యారదోసు** చూ. త్రోయు. స.క్రి. పారదోలు.

**యారాము** వి. 1. పైరు పెట్టిన, పైరునాటిన కొయ్యలో నీరు బయటికి పోవటానికి చేసిన లోతు తక్కువ, చిన్నపాయ కాలువ, 2. కప్పకాలువ.

హిం.ఉ. ఆరామ్. తోట.

< ఉ. ఆరామ్.

**యారాకిలు** వి.బ.వ. ఆము పడుగులో ఊక కుదుర్లమీద ముందు పెద్దకుండలు పెట్టి వాటిమీద పేర్చే మధ్యరకం సైజుకుండలు.

**యారాసల్రాయి** వి. కడవరాయిలాగా సైజు చిన్నదిగా ఉండే రాయి.

**యారాసుబల్ల** వి. కుదంకొట్టిన తర్వాత పల్చగ సన్నగ సర్చటానికి వాడే నలప.

**యార్లగుంటరాయి** వి. యార్లగుంట ప్రాంతం నుంచి వచ్చే చలపరాయి.

**యాలం** రూ.చూ. ఏలము.[1] వి. అమ్మటంలో ఒక విధం వేలం, పేకాటలోని ఒక ఆట.

**యాలము** రూ.చూ. ఏలము.[1] వి. వేలం.

**యాలాం** రూ.చూ. ఏలము.[1] వి. 1. అమ్మటంలో ఒక విధం; 2. పేకాటలోని ఒకఆట.

**యాలాము** వి. 1. పశువుల్ని కట్టివేయటానికి పొలంలో తాత్కాలికంగా అమర్చిన దొడ్డి; 2. పొలం మధ్య ఏర్పరచిన చిన్న పశువుల దొడ్డి; 3. దుర్గమారణ్యాల్లో వెలసిన దేవతల తిరునాళ్ళకు వచ్చి చేరిన జనం, ముఖ్యంగా కలిగిన వాళ్ళు ఏర్పరచుకొనే తాత్కాలిక వసతి.

త. యాలమ్ రాత్రి.

**యావ** రూ.చూ. ఏవ. వి. 1. అధికాసక్తి; 2. వృథా మానసిక కామేచ్ఛ; 3. పాటు; 4. నైపుణ్యం; 5. వంక, సాకు, మిష; 6. ఎగబడటం; 7. దృష్టి; 8. గాఢేచ్ఛ; 9. ధ్యానం; 10. మనసు.

**యావన్నగాలము** వి. ఎల్లకాలం.

సం. యావత్, మొత్తం కాల. సమయం.

< సం. యావత్ + సం. కాల - + - ము.

**యాష్ట** వి. మానసిక ఆయాసం.

సం. వేష్ట - ఆవరణ వేయటం, కంచె.

< సం. వేష్ట -.

**యాస** రూ.చూ. ఏస. వి. వ్యత్యాసం, తేడా.

**యాసమాటలు** వి.బ.వ. 1. కావరం మాటలు; 2. ఒక ప్రాంతంవారికి ఇంకొక ప్రాంతం వారికి మాటలో కనపడే అపరిచిత ధ్వని. **యాసమూలమట్టం** వి. వంకరగా ఉన్న మూలలు కొలవటానికి తాపీ పనివాళ్ళు వాడే త్రిభుజాకారపు రేకు పరికరం. **యాసమెట్టు** వి. వంకరగా ఉన్న మూలలు కొలవటానికి తాపీ పనివాళ్ళు వాడే త్రిభుజాకారపు రేకు పరికరం.

**యాసరపోవు** రూ.చూ. వేసరుపోవు. అ.క్రి. వేసారు.

**యిజాదా** రూ.చూ. ఇజాదా. వి. ఒడంబడిక.

**యిజాఫా** రూ.చూ. ఇజాఫా. విణ. ఎక్కువ.

**యిజారాదారుడు** రూ.చూ. ఇజారాదారుడు. వి. గుత్తదారు.

**యిజారు** రూ.చూ. ఇజారు. వి. పైజమా.

**యితిల్లాచేయు** అ.క్రి. తెలియజేయు.

హిం. ఇత్తలా. సమాచారం, తెలియచేయటం, సంపాదించిన జ్ఞానం; ఉ. అర. ఇత్తిలా. తెలియజేయు, ప్రకటనచేయు, నిర్ధారించు, అన్వేషించు, జ్ఞానం, సమాచారం;

క. ఇత్తిలె, ఇత్తిలా.

< ఉ. ఇత్తిలా + చేయు.

**యితిఫాక్** వి. సమిష్టిగా నీళ్ళు వాడుకోవటం.

హిం. ఇత్ఫాక్. స్నేహం, అంగీకారం, ఒద్దిక, ఒకమత్యం, సాదృశ్యం. అవకాశం, సంఘటన, అదృష్టం, హఠాత్తుగా సంభవించినది, జాద; ఉ.అర. ఇత్తిఫాక్. ఐక్యత, ఒద్దిక, సమ్మతి, సమానత్వం, స్నేహం, పోలిక, అదృష్టం, ఆకస్మికం, విజయం, సంఘటన, అవకాశం, జాడ.

<ఉ. ఇతిఫ్రాక్.

యినాం రూ.చూ. ఇనామ్. వి. 1. బహుమానం ; 2. శిస్తు మినహాయించిన భూమి.

యినాందారు రూ.చూ. యినాందారుడు. వి. ఇనామును అనుభవించువాడు.

యినాందారుడు రూ. యినాందారు. వి. ఇనామును అనుభవించే వాడు.

ఉ. అర. ఇన్.అమ్- పార. -దార్ ;

క. ఇనామదార ; త. ఇనాం-తార్ ; మ. ఇనాం తార్.

<ఉ. ఇన్.అమ్. పార. -దార్.

యినామతి విశ. బహుమతిగా ఇవ్వబడిన.

ఉ. అర. ఇన్.అమత్. కానుక, ఉపకారం, శిస్తు ముజరా ఇవ్వబడిన భూమి ; పార. ఇన్. అమత్, ఇనామత్, ఇనామతీ.

<ఉ. ఇన్అమత్.

యినామతి తఫరీకు వి. ఇనాంభూములుగల రైతులపైన వేసే పన్ను.

ఉ. అర. ఇన్.అమత్-ఇ-తఫరీక్. ఈనాంభూముల పై వేసే పన్ను.

ఉ. ఇన్, అమత్-ఇ-తఫ్రీక్.

యినాము రూ.చూ. ఇనామ్. వి. 1. బహుమానం ; 2. శిస్తు మినహాయించిన భూమి.

యిన్మడి రూ.చూ. ఇనుమడి. విశ. రెండో.

యిరసాల్ రూ.చూ. యిర్సాలు. వి. ప్రభుత్వానికి కట్టే శిస్తు రూకలు.

యిరసాల్‌చేయు అ.క్రి. పంపించటం.

యిరసాల రూ.చూ. యిర్సాలు. వి. ప్రభుత్వానికి కట్టే శిస్తు రూకలు.

యిరసాలు రూ.చూ. యిర్సాలు. వి. ప్రభుత్వానికి కట్టే శిస్తు రూకలు.

యిరాదా వి. ఉద్దేశం.

హిం. ఉ. అర. ఇరాదా. కోరిక, దృష్టి, ఊహ, ఆలోచన, ఇచ్ఛ, ప్రభావం, ఉద్దేశం.

క. ఇరాదె, కారణం.

<ఉ. ఇరాదా.

యిర్సాలు రూ. యిరసాల్, యిరసాల, యిరసాలు. వి. ప్రభుత్వానికి కట్టే శిస్తు రూకలు.

హిం. ఉ. ఇర్‌సాల్. పంపటం ; మరా. ఇర్సాల!

క. ఇరుసాలు. ప్రభుత్వ కోశాగారంలో డబ్బు కట్టటం ; తు. ఇర్‌సాలు, రిసాలు ; త. ఇరిచాల్, ఇరుచాల్ ; మ. ఇరిసాల్, ఇరుసాల్,

<ఉ. ఇర్‌సాల్.

యిర్సాలునామా వి. ప్రభుత్వానికి పంపే శిస్తు మొత్తాలలెక్క.

హిం. ఉ. అర. ఇర్సాలునామా ;

త. ఇరుచాల్‌నామా.

<ఉ. ఇర్సాల్‌నామా.

యిలాకా రూ.చూ. ఇలాకా. వి. 1. అధికారంలో చేరిన ప్రదేశం. 2. సంబంధం ; 3. డిపార్టుమెంటు.

యిలాకాదార్లు వి. డిపార్టుమెంటువాళ్ళు.

ఉ. అర. ఇలాక- పార. -దార్. ఇలాకా కలిగిన వాడు.

<ఉ. ఇలాక- పార. -దార్ + -లు.

యిలాకు రూ.చూ. ఇలాకా. వి. 1. అధికారంలో చేరిన ప్రదేశం ; 2. సంబంధం ; 3. డిపార్టుమెంటు.

యిలాఖ రూ.చూ. ఇలాకా. వి. 1. అధికారంలో చేరిన ప్రదేశం ; 2. సంబంధం ; 3. డిపార్టుమెంటు.

యిసంవారి ప్రత్య. పేర్ల క్రమప్రకారం.

ఉ. అర. ఇస్మ్, పార. వార్. యిసంక్రమప్రకారం ;

క. యిసముబార ; త. ఇస్మ్ - వార్.

<ఉ. ఇస్మ్ + పార. - వార్.

యిసందార్ వి. అనుభవించేవాడు.

ఉ. అర. ఇస్మ్, పార. దార్. అనుభవం కలిగినవాడు.

<ఉ. ఇస్మ్ + పార. దార్.

యిసము రూ.యానము వి. వ్యక్తి.

ఉ. అర. ఇస్మ్. పేరు. వ్యాకరణంలో నామవాచకం, లేదా నామవాచకం పదం.

క. ఇసము. ఒకపేరు, వ్యక్తి, నామవాచకం ; త. ఇసం, ఇసుం. పేరు, వ్యక్తి.

<ఉ. ఇస్మ్.

యిసవి రూ.చూ. యిసవీ. వి. క్రీస్తుశకం.

యిసవీ రూ. యిసవి వి. క్రీస్తుశకం.

హిం. ఈసవీ, జీసస్ క్రీస్తుతో ప్రారంభమైన ; ఉ.అర. ఇసవీ ;

క. ఇసవి, ఇసవీ, ఇసివి. క్రీస్తుశకం, క్రీస్తు సంబంధమైన

<ఉ. ఇసవీ.

యిస్తిఫా రూ. యిస్తీఫా. వి. విడుదలపత్రం, రాజీనామా.

హిం. ఉ. ఇస్తీఫా, రాజీనామా. మరా. ఇస్తఫా.

<ఉ. ఇస్తీఫా.

యిస్తిహరు రూ.చూ. ఇస్తిహారు. వి. ప్రకటన పత్రం.

యిస్తిహారు రూ.చూ. ఇస్తిహారు. వి. ప్రకటన పత్రం

యిస్తిహారునామా రూ.చూ. ఇస్తిహారునామా. వి. లిఖితపూర్వకమైన ప్రకటన.

యిస్తీఫా రూ.చూ. యిస్తిఫా. వి. విడుదలపత్రం. రాజీనామా.

యిస్త్యా రూ.చూ. ఇస్తిహారు. వి. ప్రకటన పత్రం.

యిస్త్రీ రూ.చూ. ఇస్త్రిరి. అ. క్రి. బట్టలు మడతలు లేకుండా పెట్టెలో నిప్పులు వేసి పైన రుద్దటం.

యానము రూ.చూ. యిసము. వి. వ్యక్తి.

-యు (న్) చూ. ఉన్. ప్రత్య. ఉకారేతర శబ్దాలమీద సముచ్చయార్థాల్లో వచ్చే 'ను' వర్ణానికి ముందు వచ్చేది. ఉదా. కిలయు, మఱియు.

<మూద్రా.* ఉమ్.

యుక్తమగు అ. క్రి. హత్తుకొను.

సం. యుక్త - తగినది, సరియైనది. కూడినది.

<సం. యుక్త - + - ము + అగు.

**యుక్తి** వి. విధం. శివతసా. 154.

నం. యుక్తి. కూడిక కలయిక. ఉపాయం, న్యాయం, ఊహ. వ్యవహారం.

<నం. యక్తి– (అర్థవిపరి.).

**యుక్తిప్రత్యుక్తులు** వి.బ.వ. ఉపాయాలు.

నం. యుక్తి - ఉపాయం, కలిసినది. ప్రతియుక్తి - ఎదురు ఉపాయం.

<నం. యుక్తి - + ప్రతియుక్తి - + – లు.

**యుగచర్యసుద్దులు** వి.బ.వ. పాతకాలం సంగతులు. హంస. 1-190.

నం. యుగచర్యా. యుగంలోనిచేష్ట.

<నం. యుగచర్యా + సుద్దు + – లు.

**యునానీ** విశే. వైద్యంలో ఒకపద్ధతి.

హిం. యునానీ. గ్రీసునంబంధమైన. గ్రీసుదేశస్థుడు. గ్రీసుభాష, వైద్యంలో ఐయోనియన్ విధానం; ఉ. అర. యునాన్. గ్రీసు, యునానీ. ఒకవైద్యవిధానం;

క. యునానీ, త. యునాని,.

<ఉ. యునానీ.

**యెకరారు** రూ. యకరారు. వి. అంగీకారం.

ఉ. ఇక్‌రార్. వాగ్దానం. ఒప్పందం, నిశ్చయం, ఒడంబడిక. అభయం, భరోసా,

త. ఇక్కరార్. అంగీకారం, వాగ్దానం.

**యెండయిరేణి** రూ.చూ. వెండయిరేణి. వి. రంగులు లేకుండా సున్నం మాత్రయే పూసిన అరివేణికుండలు.

**యెతమతం** వి. ఒకరు ఔనన్నదాన్ని కాదనటం లేదా ఒకరు కాదన్నదాన్ని ఔననటం.

నం. మత- అభిప్రాయం.

<ఎదురు + నం. మత – + – ము.

**యెతీపతి** వి. అటూఇటూ తేలని పరిస్థితి

నం. యతి- సన్న్యాసి. పతి - భర్త.

<నం. యతి – + నం. పతి –

**యెదరపు** చూ. ఎదురు. వి. 1. బదులు. 2. సహాయం చేయవలసిన వారు, దానికి మారుగ సహాయం చేయించుకోవటం, 2. రావలసిన బాకీని వసూలు చేసుగోవటానికి ఋణస్థుడికి చేసే ఆర్థిక సహాయం.

**యెదురు** రూ.చూ. వెదురు. వి. మేదరి నిర్మాణద్రవ్యంగా సర్వసాధారణ వాడుకలో ఉన్న తృణవిశేషం.

**యెన్నెలపంతెలు** రూ.చూ. వెన్నెల పంతెలు. వి. దీపం ప్రమిదలాగా గుంతగా ఉండేది.

**యెన్నెలమడుగు** రూ.చూ. వెన్నెలమడుగు. వి. చిప్ప బుడ్లల్లో ఒకరకం.

**యెయిగండ్లదుత్త** రూ.చూ. వెయిగండ్లదుత్త, వి. చిన్నచిన్న చిల్లులు పెట్టినట్టి కాల్చని మట్టిపాత్ర.

**యెయ్‌గండ్లకడవ** రూ.చూ. వెడుగండ్ల కడవ. వి. చిన్నచిన్న చిల్లులు పెట్టినట్టి కాల్చని మట్టిపాత్ర

**యెయ్యికండ్లకుండ** రూ.చూ. వెయికండ్లకుండ వి. చిన్నచిన్న చిల్లులు పెట్టినట్టి కాల్చని మట్టిపాత్ర.

**యెలుగుగూన** రూ.చూ. వెలుగుగూన. వి. ఇంట్లోకి వెలుతురు రావటానికి లేక ఇంటిలోనిపొగ బయటికి పోవటానికి ఇంటి కప్పులో అమర్చిన మట్టివలయం.

**యేకసాలు** వి. ఒకసంవత్సరం.

ఉ. పార. యక్- సాల్. ఒకసంవత్సరం, సంవత్సరానికి సంబంధించిన, ఒకసంవత్సరానికి తీసుకొన్నభూమి.

<ఉ. యక్ – సాల్.

**యేగండ్లకడవ** రూ.చూ. వెయిగండ్ల కడవ, వి. వెయ్యికళ్ళకుండ, చిన్న చిన్న చిల్లు పెట్టి కాల్చని మట్టి పాత్ర, గ్రామదేవతకు మొక్కుబడి ఉన్నవాళ్లు నైవేద్యం పెట్టే పాత్ర.

**యేగండ్లకుండ** రూ.చూ. వేగండ్లకుండ వి. వెయ్యి కళ్ళకుండ.

**యేడి** వి. బండిజల్ల చివరన అకు అడ్డం పెట్టుకు అనుగా కట్టిన తాడు.

క. ఏరు, అర్. నాగలికి కట్టిన ఎడ్లజత, అర్కాలు. నాగలి కింది భాగం, త. ఏర్ — క్ - కాల్. నాగలి కొయ్య.

**యేండిల్‌కూజా** రూ.చూ. హేండిల్‌కూజా. వి. పట్టు కోవటానికి వలయం పెట్టి చేసిన కూజా.

**యేండిల్‌సురాయి** వి. పట్టుకోవటానికి వలయంపెట్టి చేసిన నీళ్ళకూజా.

ఇం. Handle. చేతిలో పట్టుకొనే ఆధారం.

<ఇం. *Handle*. + సురాయి.

**యేండ్లుకూజా** రూ.చూ. హేండిల్‌కూజా, వి. పట్టుకోవటానికి ఆధారం గల కూజా.

**యేనాది** రూ.చూ. ఆనాది. వి. దక్షిణదేశంలో ఒకజాతి.

**యేయికంట్లకుండ** రూ.చూ, వేయికండ్లకుండ. వి. వెయ్యికళ్ళకుండ.

**యేలము** రూ. చూ. ఏలము[1]. వి. వేలం.

**యేలందారుడు** వి. వేలంపాడినవాడు.

ఉ అర. ఇ'లామ్; పార. దార్.

<ఉ. ఇ'లామ్ + దార్.

**యేలాం** రూ.చూ. ఏలము[1]. వి. అమ్మటంలో ఒక విధం, పేకాటలోని ఒక ఆట.

**యేషాగాథ** వి. అస్తవ్యస్తపు మాట. హేమా. పు. 83.

నం. ఏషా. కోరిక, గాథా. కథ.

<నం. ఏషా + నం. గాథా.

**యొక్క** అప. షష్ఠీవిభక్తి ప్రత్యయం, సంబంధార్థకం. శేష షష్ఠిలో వచ్చే ప్రత్యయం. ఉదా. రాజుయొక్క, వనము యొక్క.

<ఒక్క.

**యొమియా** వి. ఒకతరహా భరణం.

ఉ.పార. యౌమియ, యొమియ. దినబత్తెం, పెన్షను దార్లకిచ్చే అలవెన్సు, ప్రతిదినం; అర. యౌమిఅ;

త. యూమియ, యోమియ. ఒకరోజుకిచ్చే అలవెన్సు లేదా పెన్షను. బ్రిటిష్ పాలన ప్రారంభదశలో సేవలకు మెచ్చి మహమ్మదీయులకిచ్చిన రోజు అలవెన్సు లేదా పెన్షను.

<ఉ. యౌమిఅ.

**యోగక్షేమం** వి. కుశలం.

సం. యోగ- + క్షేమ-. సంపద, సంపాదించటం, పదిల పరచటం.

<సం. యోగక్షేమ- (అర్థవిపరి.).

**యోగపట్టము** రూ.చూ. జోగపట్టియ. వి. **1.** యోగులు జందెంలా వేసుకొనే పట్టు మొ. వాటితోనేసిన పట్టె ; **2.** వడ్డాణం.

**యోగపట్టె** రూ.చూ. జోగపట్టియ. వి. **1.** వడ్డాణం. మను. 1.60 ; **2** యోగులు జందెంలా వేసుకొనే పట్టు మొ. వాటితో నేసిన పట్టె. సారంగ. 3.181.

**యోగపట్టెము** రూ.చూ. జోగపట్టియ. వి. యోగులు జందెంలా వేసుకొనే పట్టు మొ. వాటితో నేసిన పట్టె. తాళ్ల.సం. 7.44.

**యోగము** వి. **1.** జాతకం ; **2.** అదృష్టం.

సం. యోగ- కలయిక, కూటమి, ఉపాయం, ధ్యానం, ఇంద్రియ నిగ్రహం.

<సం. యోగ- (అర్థవిపరి.).

**యోగవాగములు** రూ.చూ. యోగవాగలు. వి.బ.వ. అంతరిక్ష మార్గానపోయే యోగసిద్ధులు మెట్టే పావకోళ్ళు. చెన్నబసవ. 387.

**యోగవాగలు** రూ. యోగవాగములు. వి. బ. వ. అంతరిక్ష మార్గాన పోయే యోగసిద్ధులు ధరించే పావకోళ్ళు. పండి. చ. 5.394.

సం. యోగ-. కూటమి, కలయిక, ఉపాయం, చిత్త నిరోధం, ఛలం.

<సం. యోగ- + పాగ + (ము) + -లు. (మిశ్రమ.)

**యోగులమారి** వి. ఉపాయశాలి.

సం. యోగిన్. కలిగియున్నవాడు. యోగాభ్యాసం కలవాడు, సన్యాసి.

<సం. యోగిన్ + -లు + -అ + -మారి.

**యోలియాదార్లు** వి. పెన్షను లేదా భరణం తీసుకొనేవాళ్ళు.

ఉ.అర. యౌమిఅ ; పార. -దార్.

<ఉ. యౌమిఅ- ; పార.- దార్.

# ర

**ర** వి. ఒక అక్షరం. దంతమూలీయతాడితం, నాదం, అల్ప ప్రాణం. మూలద్రావిడ భాషలో ఈ అక్షరం పదాదిని లేదు. దేశ్యపదాల్లో వర్ణవ్యత్యయ కారణంగాను, అన్య భాషాపదాలు ప్రవేశించటంవల్లనూ పదాదిని రేఫతోకూడిన పదాలు తెలుగులో ఏర్పడ్డాయి.

**రకంవారి** రూ. రకవారీ. విశ. రకంప్రకారం.

ఉ.పార. రకమ్-వార్. రకం కలిగిన.

<ఉ. రకమ్-వార్.

**రకతకాయచెట్టు** వి. ఎర్రచందనం చెట్టు (pterocarpus santalinus).

సం. రక్త-. ఎర్రని.

<సం. రక్త- + కాయ + చెట్టు.

**రకము** రూ. రకం, రకము. వి. **1.** సౌందర్యం. ఘటికా. 1.81 ; **2.** శ్రేష్ఠత. ఇందు. **2.60** ; **3.** విధం. లక్ష్మీ వి. **3.40** ; **4.** రంజనం. ఆం.భా. **2.286** ; **5.** జాతి ; **6.** తరహా ; **7.** అంశం ; **8.** గుర్తు ; **9.** రంగు. విశ. **1.** సుందరం. ఇందు. **3.14** ; **2.** శ్రేష్ఠం. ఉ.హరిశ్చ. **1.38.**

హిం. రకమ్. రొక్కం, విధం, ప్రకారం ; మరా. రకమ్, రక్కమ్. సంఖ్య, వస్తువు, ఒక మొత్తం ; ఉ. రకమ్. వ్రాయటం, సహాయం, రొక్కం, వస్తువు, విధం, ధనం ; అర. రకమ్. వ్రాయటం, చేతివ్రాత, శీలం, గుణం, గణితశాస్త్ర సంబంధమైన నోటేషన్ ; పార. రకమ్. రాత, రాయటం, వర్ణనం, చిహ్నం, విధం.

క. రకమ్. ఒక వస్తువుయొక్క అంశం, ఒకమొత్తం, ఒక దోను, ఒక ముక్క ; త. రకమ్. జాతి, విధం.

<ఉ. రకమ్.

**రకంకాస్త** వి. గల్లామక్తా, పంటపండినా పండకపోయినా నిర్ణయించుకున్న డబ్బు ఇచ్చేట్టు ఒప్పందం కుదుర్చుకొని చేసే కౌలు లేక మక్తా.

హిం.ఉ. రకమ్. ప్రకారం, ఖాస్త. హెచ్చుచేయబడ్డది.

<ఉ. రకమ్‌ఖాస్త.

**రకవారీ** రూ.చూ. రకంవారీ. ప్రత్య. రకం ప్రకారం.

**రకాన** రూ.చూ. రకానా. వి. కాగితం మడత.

**రకానా** రూ. రకాన. వి. కాగితం మడత. బే.ప. 59.

మరా. రకానా. కాగితం భాగం.

<మరా. రకానా.

**రక్కరించు** స.క్రి. కాపాడు, సాకు.

సం. రక్ష్. కాపాడు, రక్షా. కాపాడటం ; ప్రా. రక్ఖా. కాపాడటం, రక్ఖ్ సాకు.

<ప్రా. రక్ఖ్ + -ఇంచు[3].

**రక్కసగడ్డి** రూ.చూ. రాకాసి గడ్డి. వి. ఒకరకం గడ్డి.

**రక్కసి** రూ.చూ. రక్కసుఁడు. వి. **1.** రాకాసి, రాక్షసుడు. నిర్వ.రా. 5.21 ; **2.** నైరృతుడు, సోకులరేడు. ఆం.భా. 1.50.

**రక్కసిగొంగ** వి. దైత్యారి, రాక్షసుల శత్రువు, విష్ణువు. సీలా. 2.115. **రక్కసిదాయ** వి. దైత్యారి. రాక్షసుల శత్రువు, విష్ణువు. చమ. 1.104. **రక్కసియొజ్జ(-ఒజ్జ)** వి. రాక్షసుల గురువు, శుక్రాచార్యుడు. **రక్కసిఱేఁడు** వి. రాక్షసరాజు. అచ్చ.రా.అరణ్య. 111. **రక్కసులగొంగ** వి. రక్కసిగొంగ.

**రక్కసియ** రూ.చూ. రక్కసుఁడు. వి. రక్కసి. ఆము. 5.51.

**రక్కసీఁడు** రూ.చూ. రక్కసుఁడు. వి. రాక్షసుడు.

**రక్కసుఁడు** రూ. రక్కసి, రక్కసియ, రక్కసీఁడు, రక్కెస, రాకాశి. వి. 1. రాక్షసుడు. భార. ఆది. 1.130 ; 2. నైర్ఋతుడు. నీలా. 2.18.

నం. రక్షస్, రాక్షస-. రాక్షసుడు. రాక్షసి. రాక్షస స్త్రీ ; ప్రా. రక్ఖస-, రక్ఖసే ; అప. రక్ఖసి ; అ.మా.జై.మహా. పా.శౌ. రక్ఖస-, రక్ఖసి- ; గుజరా. లోక్క- ; శౌ. రంఖసి ; మరా. లక్కశే, లహకశే.

క. రక్కస, రక్కసి, రాకాసి. రాక్షసుడు ; తు. రక్కసె ; త. అరక్కన్, అరక్కి, ఇరాక్కతన్, ఇరాక్కతి, ఇరాట్చన్, ఇరాట్చచి ; మ. అరక్కన్ ; ఒరయాన్. రకస్.

< ప్రా. రక్షస-.

**రక్కసులగొంగ** చూ. రక్కసి.

**రక్కసె** రూ.చూ. రక్కసుఁడు. వి. రాకాసి.

**రక్కామకోట్లు** వి. ఆరణ్యజంతు విశేషం. ప్రబంధ. 182.

హిం.ఉ. రకమ్. చురుకైనది.

< ఉ. రకమ్ + కోటి + -లు.

**రక్కాసీండ్లు** చూ. రక్కసుఁడు. వి.బ.వ. రాక్షసులు.

**రక్కిస** వి. పచ్చపాలు కల ఓషధివిశేషం.

నం. రాక్షస-. రాక్షసుడు ; ప్రా. రక్ఖస-.

< ప్రా. రక్షస-.

**రక్కిసగడ్డి** రూ. రక్కెనగడ్డి. వి. ఒకరకం గడ్డి (Speargrass). **రక్కిసచమురు** వి. రక్కెస చెట్టునుంచి తయారయ్యే మందుగా వాడబడే నూనె.

**రక్కు** రూ.చూ. అక్కు. స.క్రి. గోళ్ళతో గట్టిగా గీకు.

**రక్కెస** రూ.చూ. రక్కసుఁడు. వి. 1. రక్కసి. భార. విరా. 3.37 ; 2. గయ్యాళి, ధూర్తస్త్రీ. వేంక. పంచ. 3.202 ; 3. ఒకరకం ముళ్ళమొక్క. (cyperus clatus) ; విశే. 1. అయుక్తం. భార. ఉద్యో. 3.94 ; 2. దుస్సహం. భార. ఉద్యో. 3.118.

**రక్కెసగడ్డి** రూ.చూ. రక్కిసగడ్డి. వి. ఒకరకం గడ్డి.

**రక్కొను** రూ. రెక్కొను. అ.క్రి. 1. సిద్ధించు, నెరవేరు. ఘటికా. 2.222 ; 2. కల్గు, జనించు. కళత్స. 7.62 ; 3. వర్ధిల్లు, వృద్ధిపొందు. కువ.చ. 3-34 ; 4. తేరుకొను. తెప్పరిలు. విజయ. 3-54 ; 5. వ్యాపించు.

**రక్కొలుపు** రూ.చూ. రక్కొల్పు స.క్రి. రక్కొన చేయు. **రక్కొల్పు** రూ. రక్కొలుపు. స.క్రి. రక్కొనచేయు. చంద్రాంగ. 5.60.

**రక్కొలుపు** చూ. రక్కొను.

**రక్కొల్పు** చూ. రక్కొను.

**రక్తకాటేడిచీర** రూ.చూ. రక్తకాట్రేడు చీర. వి. గర్భవతులు దుష్టగ్రహాలు సోకి గర్భవిచ్ఛిత్తి కాకుండా ఉండటానికి కట్టుకొనే ఒకరకం చీర.

**రక్తకాటేరిచీర** రూ.చూ. రక్తకాట్రేడు చీర. వి. 1. రెండు వేళ్ళ వెడల్పు తెల్లపట్టె, నాలుగు కొలుకులు నీలి, రెండు వేళ్ళ వెడల్పు తెల్లపట్టె, నాలుగు కొలుకులు ఎరుపు చొప్పున నిలువు, పేకనేసిన తెల్లచీర ; 2. ఒక అంచు ఎరుపు, ఒక అంచు నలుపుపెట్టి కమ్మిలో కండ్లుతీసి నేసిన తెల్లచీర.

**రక్తకాటేరుచీర** రూ.చూ. రక్తకాట్రేడు చీర. వి. 1. రెండు వేళ్ళ వెడల్పు తెల్లపట్టె, నాలుగు కొలుకులు నీలి, రెండు వేళ్ళ వెడల్పు తెల్లపట్టె, నాలుగు కొలుకులు ఎరుపు చొప్పున నిలువుపేక నేసిన తెల్లచీర ; 2. ఒకఅంచు ఎరుపు, ఒక అంచు నలుపు పెట్టి కమ్మిలో కండ్లు తీసి నేసిన తెల్లచీర.

**రక్తకాట్టెడి చీర** రూ.చూ. రక్తకాట్రేడు చీర. వి. గర్భవతులు దుష్టగ్రహాలు సోకి గర్భవిచ్ఛిత్తి కాకుండా ఉండటానికి కట్టుకొనే ఒకరకం చీర.

**రక్తకాట్రెకుకోక** రూ.చూ. రక్తకాట్రేకు కోక. వి. దుష్టగ్రహాలు సోకి గర్భ విచ్ఛిత్తి కాకుండా ఉండటానికి గర్భవతులు కట్టుకొనే ఒకరకం చీర.

**రక్తకాట్రేకుకోక** రూ. రక్తకాట్రెకుకోక. వి. దుష్టగ్రహాలు సోకి గర్భవిచ్ఛిత్తి కాకుండా ఉండటానికి గర్భవతులు కట్టుకొనే ఒకరకం చీర.

**రక్తకాట్రేకు చీర** రూ.చూ. రక్తకాట్రేడు చీర. వి. గర్భవతులు దుష్టగ్రహాలు సోకి గర్భవిచ్ఛిత్తి కాకుండా ఉండటానికి కట్టుకొనే చీర.

**రక్తకాట్రేడుచీర** రూ. రక్తకాటేడి చీర, రక్తకాటేరి చీర, రక్తకాటేరు చీర, రక్తకాట్టెడి చీర, రక్తకాట్రేకు చీర, రక్తకాట్రేను చీర, రక్తకాట్రెరు చీర, రక్తకాట్రేలు చీర. వి. గర్భవతులు దుష్టగ్రహాలు సోకి గర్భ విచ్ఛిత్తి కాకుండా ఉండటానికి కట్టుకొనే ఒకరకం చీర.

నం. రక్త-. ఎర్రని.

< నం. రక్త- + కాఁడు + తేఁడు + చీర.

**రక్తకాట్రేను చీర** రూ. రక్తకాట్రేడు చీర. వి. దుష్టగ్రహాలు సోకి గర్భవిచ్ఛిత్తి కాకుండా ఉండటానికి గర్భవతులు కట్టుకొనే ఒకరకం చీర.

**రక్తకాట్రేరు చీర** రూ.చూ. రక్తకాట్రేడు చీర. వి. 1. రెండు వేళ్ళ వెడల్పు తెల్లపట్టె, నాలుగు కొలుకులు ఎరుపు చొప్పున నిలువు పేక నేసిన తెల్లచీర ; 2. ఒక అంచు ఎరుపు, ఒక అంచు నలుపు పెట్టి కమ్మిలో కళ్ళు తీసి నేసిన తెల్లచీర.

**రక్తకాట్రేలు చీర** రూ.చూ. రక్తకాట్రేడు చీర. వి. దుష్టగ్రహాలు సోకి గర్భవిచ్ఛిత్తి కాకుండా ఉండటానికి గర్భవతులు కట్టుకొనే ఒకరకం చీర.

**రక్తకాసె** వి. నెత్తురు పారుకొనే రోగం, మునర.

నం. రక్త-. నెత్తురు, ఎర్రని.

**రక్తక్షామము** వి. ఎర్రనిపట్టువస్త్రం. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 465. క్రీ.శ. 1290.

నం. రక్త-ఎర్రని, నెత్తురు, క్షౌమ-కరవు.

< నం. రక్తక్షామ-(అర్థవిపరి.).

**రక్తగాణి** వి. రక్తవిరేచనాల జబ్బు.

నం. రక్తగ్రహణి. నెత్తురు పారుకొనే జబ్బు.

< నం. రక్తగ్రహణి.

**రక్తగుండాలు** వి.బ.వ. రక్తపాత్రలు. శాల్ల. సం. 6.107.

నం. రక్తకుండ-. నెత్తుటిపాత్ర.

< నం. రక్తకుండ- + -ము + -లు.

**రక్తగొడుగు మావ్యంచేను** వి. నెత్తురుకట్టు, గాయపడిన వారికి

యుద్ధంలో మరణించిన వారి కుటుంబ సభ్యులకు లేదా గాయపడిన వారికి ఇచ్చేఈనాము భూమి. E.C.X. చింతామణి. 155. క్రీ.శ. 1616.

సం. రక్త-నెత్తురు.

<సం. రక్త- + గొడుగు + మాన్యము + చేను.

**రక్తపింజేర చీర** రూ. రగతపింజేరసీర. వి. గర్భవతులు దుష్టగ్రహాలు సోకి గర్భ విచ్ఛిత్తి కాకుండా ఉండటానికి కట్టుకొనే ఒకరకం చీర.

సం. రక్త-. ఎర్రని.

**రక్తవల్లి** వి. 1. ఒంటికి తగిలితే మరద కలిగే కలుప మొక్క; 2. మూత్రంలో నెత్తురు పడటం.

సం. రక్తవల్లి. నెత్తుటితీగ.

<సం. రక్తవల్లీ (అర్థవిపరి.).

**రక్తవాసు** వి. లేఖరి, వ్రాయసకాడు. హంస. 1.141.

**రక్తసూల** వి. రతసూల, మూత్రంలో నెత్తురు పడటం.

సం. రక్తశూల-. నెత్తురు పడటం వల్ల కలిగేనొప్పి.

<సం. రక్తశూల-.

**రక్షరేకు** వి. పీడానివారణార్థం రాగిరేకు మీద ఏదో యంత్రం రాసి తాయెత్తులో వేసి బిగించి చేతికో, మెడకో, నడుముకో కట్టేది.

సం. రక్షా. రక్షణ.

<సం. రక్షా + రేకు.

**రఖము** రూ.చూ. రకము. వి. 1. గుణం; 2. అంశం; 3. వెరైటీ, విధం.

**రగడ**[1] వి. 1. ఛందోవిశేషం. లక్ష. సం. 2.130. హయప్రచారం, తురగవల్గనం, విజయమంగళం, ద్విరదగతి, విజయభద్రం, మధురగతి, హరిగతి, హరిణగతి, వృషభగతి అని రగడలు తొమ్మిది రకాలు. అప్ప. 4-478-490; 2. రచ్చ, వివాదం; 3. కొట్లాట; 4. రాపిడి; 5. పచ్చి బఠానీలు మసాలావేసి ఉడకబెట్టిన భక్ష్యవిశేషం.

సం. *రగ్గ-. ఒరపిడిపెట్టు; ప్రా. *రగడ-. ఒరపిడి; నే. రగ్ఢను. ఒరపిడిపెట్టు; అధికకాలం పనిచేయు; బెం. రగ్డాన. ఒరపిడిపెట్టు; ఒ. రగడిబా; హిం. రగడ్నా. ఒరపిడిపెట్టు, ఇబ్బందిపెట్టు. రగడ్. ఒరపిడి, కలహం; హిం. రగడ్నా. ఒరపిడిపెట్టు, ఇబ్బందిపెట్టు, రగడ్. ఒరపిడి, కలహం; పం. రగఢ్ణా. ఒరపిడిపెట్టు; సిం. రగిడో. పోట్లాడటం;

క. రగళె. ఛందోవిశేషం, వ్యర్థవచనం; త. రకళై. కన్నడ ఛందోవిశేషం, తగాదా, కలవరం.

<ప్రా. రగడ-.

**రగడ**[2] రూ.చూ. రాడు[1]. వి.లో. 1. గుంజ, స్తంభం; 2. సన్నగా పొడుగ్గా ఉండే కొయ్యస్తంభం.

**రగడగుంజ** వి. కొమిరె, సిడె(ఏతంమాను)కు ఆధారంగా నేలలో పాతినకొయ్య, నిలువుకొయ్య.

**రగడాయించు** అ.క్రి. 1. నీళ్ళు చల్లి నున్నపరుచు, గట్టిగా అలుకు; 2. రంగరించు.

హిం. రగడ్నా. ఒరయు, ఘర్షించు.

<హిం. రగడ్(నా) + -ఇంచు[3].

**రగతం** వి. రక్తం.

సం. రక్త-. నెత్తురు, ఎర్రని; ప్రా. రత్త-;

క. రగత. నెత్తురు.

<సం. రక్త-.

**రగతకాట్టెయుచీర** వి. గర్భవతులు దుష్టగ్రహాలు సోకి గర్భ విచ్ఛిత్తి కాకుండా ఉండటానికి కట్టుకొనే ఒకరకంచీర. **రగతకాట్రేనుచీర** వి. దుష్టగ్రహాలు సోకి గర్భవిచ్ఛిత్తి కాకుండా ఉండటానికి గర్భవతులు కట్టుకొనే ఒకరకం ఎర్రచీర. **రగతకాట్రేలుసీర** వి. దుష్టగ్రహాలు సోకి గర్భవిచ్ఛిత్తి కాకుండా ఉండటానికి గర్భవతులు కట్టుకొనే ఒకరకం చీర. **రగతపింజేరసీర** వి. గర్భవతులు దుష్టగ్రహాలు సోకి గర్భ విచ్ఛిత్తి కాకుండా ఉండటానికి కట్టుకొనే ఒకరకం చీర. **రగతసూల** వి. మూత్రంలో రక్తంపడటం. సం. రక్తశూల-. నెత్తురు పడటం వల్ల కలిగే నొప్పి.

<సం. రక్తశూల-.

**రగతకాట్టెయుచీర** చూ. రగతం.

**రగతకాట్రేనుచీర** చూ. రగతం.

**రగతకాట్రేలుచీర** చూ. రగతం.

**రగతపింజేరసీర** చూ. రగతం.

**రగతసూల** చూ. రగతం.

**రగరగ** వి. మెరుపు. ధ్వన్యను.

**రగలబెట్టు** చూ. రగులు.

**రగిలించు** చూ. రగులు.

**రగులు** చూ. రగడ[1]. రూ. రలుగు, రవులు, రౌలు. అ.క్రి. మండిత్తు, మండు. అచ్చ. రా. అరణ్య. 48.

**రగలబెట్టు** స.క్రి. నిప్పు ముట్టించు. <రగులు + -అ[7] + పెట్టు. **రగిలించు** అ.క్రి. రాజచేయు, నిప్పుముట్టించు. <రగులు + -ఇంచు[3]. **రగులుకొను** రూ.చూ. రవుల్కొను. అ.క్రి. నిప్పంటుకొను. **రగులుకొలుపు** రూ.చూ. రౌలుకొల్పు. స.క్రి. మండించు. **రగులుచు** రూ.చూ రగుల్చు. స.క్రి. రగులచేయు, మండచేయు. **రగుల్కొను** రూ.చూ. రవుల్కొను. అ.క్రి. నిప్పంటుకొను. **రగుల్కొలుపు** రూ.చూ. రౌలుకొలు. స.క్రి. మండించు. **రగుల్చు** రూ. రగులుచు. రవులుచు. రవుల్చు, రౌలుచు. స.క్రి. రగులచేయు, మండచేయు. కాశీ. 4.34.

**రగుల్కొను** చూ. రగులు.

**రగుల్చు** చూ. రగులు.

**రగ్గు** వి.రజాయి, ఉన్నితో తయారుచేసిన దుప్పటి.

ఇం. *Rug*. కంబళి, తివాసీ.

<ఇం. Rug.

**రంకాట** చూ. రంకు.

**రంకాడు** చూ. రంకు.

**రంకు** రూ.చూ. ఱంకు. వి.1. వ్యభిచారం. భార. శాంతి. 2.341; 2. వ్యభిచారవృత్తిపై సుంకం. ద.హిం.శా. సంపు.5 శా.సం. 511 క్రీ.శ. 1558; 3. తంటా.

**రంకాట** రూ.చూ. ఱంకాట. వి. జారత్వం చేయటం. <రంకు + ఆట. **రంకాడు** రూ.చూ. ఱంక్కాడు. అ.క్రి. జారత్వంచేయు. <రంకు + ఆడు. **రంకుటాలు** రూ. ఱంకు

టాలు. వి వ్యభిచారిణి. <రంకు+ఆలు. **రంకుతెవులు.** రూ.చూ. లంకుతెగులు. వి. మేహరోగం. **రంకుమగడు** వి. జారపురుషుడు. **రంకుఁబోతు(-పోతు[2])** రూ.చూ. లంకుఁబోతు. వి. జారుడు, జారిణి. **రంకులగొంట్లు** వి.బ.వ. 1. వ్యభిచారులు, దూషణంలో ఉపయోగించే ఒకతిట్టు. పండి.చ. 1.2.343 ; 2. వ్యభిచారిణులు. **రంకులాఁడి** రూ.చూ. లంకులాఁడి. వి. జారిణి. విటకత్తె. <రంకు+-లు+ఆఁడి. **రంకెత** రూ.చూ. లంకెత. వి. రంకులాడి, వ్యభిచారిణి.

**రంకులరాట్టము** రూ.చూ. రంకులరాట్నము. వి. పిల్లలెక్కి తిరిగి ఆడుకొనే యంత్రం.

**రంకులరాట్నము** రూ. రంకులరాట్టము, లంకులరాట్నము. వి. పిల్లలెక్కే గుండ్రని యంత్రం, తిరుగుడు ఉయ్యాల, చక్రడోల.

ప్రా. *రంఖోల-*. గుండ్రంగా తిరుగు, కంపించు, *రంఖోలియా*. కంపితం ; అప. *రంఖోల*. పరిభ్రమణం.

<ప్రా. రంఖోల-+రాట్నము.

**రంకె** రూ.చూ. లంకె. వి. 1. ఎద్దులు మొ.వాటి అరుపు, భార. ద్రోణ. 4.131 ; 2. ధ్వని, రామాభ్యు. 8.242 ; 3. కేక. రుక్మి. 1.17.

**రంకెత** చూ. రంకు.

**రంగంకుడురు** వి. వలయాకారంతో ఒకవైపు తోలు మూసిన మట్టి వాద్యం.

ఇం. *Rangoon*. బర్మా రాజధాని.

**రంగఁడు** వి. శ్రీరంగనాథుడు, పాండురంగడు.

సం. *పాండురంగ-*. పాండురంగ విఠ్ఠలుడు, తెల్లని అవయవాలు కలవాడు.

<సం. పాండురంగ-.

**రంగఁడుకమ్మి** వి. 1. చీరకొంగులో మామూలుగా నేసిన పట్టె ; 2. సన్నని నిలువు గీరలు పెట్టి నేసిన కమ్మి. **రంగని సేవించు** స.క్రి. కల్లుతాగు.

**రంగనిసేవించు** చూ. రంగఁడు.

**రంగపూరంచు** వి. చిట్టచివర రంగులో నేసిన పైన అయిదు కొలుకుల గీరలు పడేట్టు నేసిన అంచు, రంగపూరు గ్రామ నామం కావచ్చు.

**రంగమంటపము** వి. కళ్యాణ మంటపం.

సం. *రంగమండప-*. నాటకరంగస్థలం, యుద్ధరంగం.

<సం. రంగమండప-.

**రంగము** వి. 1. వివాదం, రచ్చ ; 2. సోబె, జోస్యం.

సం. *రంగ-* స్థలం, ప్రదేశం, నాటకరంగం, వన్నె.

<సం. రంగ-. (అర్థవిపరి.).

**రంగమెక్కు** అ.క్రి. ప్రసిద్ధికెక్కు. <రంగము+ఎక్కు.

**రంగమెక్కు** చూ. రంగము.

**రంగంపార** వి. పొడుగాటి కామగల ఒకరకం పార. మట్టి తవ్వకానికి గుల్లగావున్న నేలను ఎత్తిపోయటానికి పనికివచ్చే పరికరం.

ఇం. *Rangoon*. బర్మా రాజధాని.

<ఇం. Rangoon + పార.

**రంగరజవాళ్లు** రూ. రంగరాజువాళ్లు. విశే.బ.వ. రంగులు అద్దే వాళ్ళు.

ఉ.పార. *రంగ్‌రేజ్*. రంగులు వేసేవాళ్ళు.

<ఉ. రంగ్‌రేజ్+వాళ్లు.

**రంగరాజువాళ్లు** రూ చూ. రంగరజవాళ్ళు. విశే.బ.వ. గుడ్డలకు రంగులద్దేవాళ్ళు.

**రంగరి** చూ. రంగు.

**రంగరించు** రూ. చూ. రంగలించు. స. క్రి. ద్రవద్రవ్యంలో మరో వస్తువును చేర్చి వేలితో కలిసేట్లు మెదుపు, కలియబెట్టు, మర్దించు.

**రంగరివేని** చూ. రంగు.

**రంగరీజు** రూ. రంగిరీజు. వి. రంగులు వేసే వృత్తి కలవాడు.

ఉ.పార. *రంగ్‌రేజ్*. రంగులు వేసేవాళ్ళు.

క. *రంగారె*.

<ఉ. రంగ్‌రేజ్.

**రంగలరు** చూ. రంగు.

**రంగలించు** రూ. రంగరించు. స.క్రి. ద్రవద్రవ్యంలో మరొక వస్తువును చేర్చి వేలితో కలిసేట్లు మెదుపు, కలియగలుపు. చంద్రికా. 4.38.

సం. *రంగవత్*. రంగులు కలది, రంజనం కలది ; ప్రా. *రంగిల్ల-* ;

క. *రంగళిసు*. రంగరించు.

**రంగపురేని** చూ. రంగు.

**రంగసాని** వి. భోగంచాన.

సం. *రంగ-*. నాట్యరంగస్థలం.

<సం. రంగ-+సాని[2].

**రంగాయించు** అ.క్రి. రంగువేయు.

హిం. *రంగా(నా)*. రంగు వేయించటం.

<హిం. రంగా(నా)+-ఇంచు[3].

**రంగారి** చూ. రంగు.

**రంగారు** చూ. రంగు.

**రంగిరీజు** రూ.చూ. రంగరీజు. వి. 1. రంగు వేసేవాడు ; 2. రంగులు వేసే తీగ.

**రంగిలు** చూ. రంగు.

**రంగిల్లు** చూ. రంగు.

**రంగు** వి. 1. ఒప్పు, శోభ. కు.సం. 11.171 ; 2. పొంపు, భాగ. 5.28 ; 3. కాంతి, వెల్తురు. మను. 1.5 ; 4. శుక్లాది వర్ణం. వసు. 4.55 ; 5. విధం, రీతి. బిల్హ. 1.120 ; 6. రంజనం, రాణ. ఆం. భా. 2.287 ; 7. ఛాయ ; 8. కాంతికిరణాలవల్ల కంటిలోపలి తెర ఆధారంగా కలిగే వర్ణజ్ఞానం ; 9. వలపు. విశే. 1. ఇంపైన, మనోహరమైన. ఉ.రా. 5.248 ; 2. శ్రేష్ఠమైన. శేషధ. 8.142 ; 3. రంగుకల.

సం. *రంగ-*. రంగు, వన్నె ; ప్రా. *రంగ-* ; పా. *రంగ-*. రంగు ;

క. *రంగు* ; మ. *రంక* ; తు. *రంగ*, *రంగు* ; హిం. *రంగ్*.

<ప్రా. రంగ-.

రంగరి రూ. రంగారి. వి. రంగులు వేసి జీవించే ఒకా నొక జాతి, రంగిరేజు. < రంగు + - అరి. రంగరివేని రూ.చూ. రంగపురేని. వి. సున్నం పూసి నలుపు గీతలు గీసి ఆ గీతల మధ్య ఎరుపు, ఆకుపచ్చ మొ. రంగులతో ఏనుగులు, ఒంటెలు, గుఱ్ఱాలు, నెమళ్ళు మొ. బొమ్మలు వేసిన అరివేణి కుండలు. <రంగు + అరివేని. రంగలరు అ.క్రి. శోభిల్లు, ఒప్పు, ఇందు. 3.58. <రంగు+అలరు. రంగపురేని రూ. రంగరివేని. వి. సున్నం పూసి నలుపు గీతలు గీసి ఆ గీతల మధ్య ఎరుపు, ఆకుపచ్చ మొ. రంగులతో ఏనుగులు, ఒంటెలు, గుఱ్ఱాలు, నెమళ్ళు మొ. బొమ్మ వేసిన అరివేణి కుండలు. < రంగు + అపురేని. రంగారి రూ.చూ. రంగరి. వి. 1. రంగువేసేవాడు ; 2. చిత్ర కారుడు. రంగారు అ.క్రి. 1. ప్రకాశించు, ఒప్పు. ఘటికా. 2.174 ; 2. ప్రశస్తమైన వన్నె కలుగు. ఉ.రా. 1.138 ; 3. విలాసయుక్తమగు. ద్వి.సార.చ. 1.48 ; <రంగు + అరు[1]. రంగిలు రూ.చూ. రంగిల్లు. అ.క్రి. ప్రకాశించు. రంగిల్లు రూ. రంగిలు. అ.క్రి. రంజిల్లు, ప్రకాశించు. కు సం. 5.41. రంగుగా క్రి.విశ. సొంపుగా, సీటుగా, గోటుగా, దివ్యంగా బా. మం. 1.121. < రంగు + అగు + - అ[7]. రంగు గురిగి రూ. చూ. రంగుగురిగె. వి. రంగు కొలుచుకొనే చిన్న పాత్ర. రంగుగురిగె రూ. రంగుగురిగి. వి. రంగు కొలుచుకొనే చిన్న పాత్ర. రంగునూలు వి. రంగు వేసిన నూలు. రంగునేత వి. రంగుదారాలతో నేసిన నేత. రంగు పంటలు వి.బ.వ. సీలి, జాజరా, చీరువేరు మొ.వి. రంగు పాణి(పని?) విశ. ఎరుపురంగు వేసింది. వి. రంగుపని. రంగుపావు వి. రంగు కొలుచుకొనే చిన్న పాత్ర. రంగు పిడతలు వి.బ.వ. దీపావళి పండగప్పుడు ప్రమిదల మధ్యలో పీటపై పెట్టే రంగు పూసిన పిడతలు. రంగుబాన వి. మూరెడు వెడల్పుతో రెండు అంచుల్లో గుండ్రంగా ఉండే పెద్దసైజు బాన. రంగుమండిగ వి. మూరెడు వెడల్పుతో రెండు అంచుల్లో గుండ్రంగా ఉండే పెద్దసైజు బాన. రంగు మార్చు అ.క్రి. 1. తను చెప్పే సిద్ధాంతాల్ని తానే మార్చి చెప్పు ; 2. పార్టీలు మార్చు. రంగుల అద్దకం వి. నూలుకు రంగులు వెయ్యటం. రంగులతొట్టె వి. రంగులు కలిపేతొట్టె. రంగులద్దు అ.క్రి. రంగులు వేయు. <రంగు+-లు+ అద్దు. రంగులాడి వి. వేషకాంత. వన్నెలాడి. <రంగు+ -లు+ఆడి. రంగులువేయు అ.క్రి. నూలుకుగాని బట్టలకు గాని రంగు పట్టించు. రంగువేయు అ.క్రి. నూలుకుగాని బట్టలకుగాని రంగు పట్టించు.

రంగేలీరాజా వి. విలాస పురుషుడు.

హిం. రంగేలీ. విలాసం ; సం. రాజన్. రాజు. దీని ప్రథమైక వచన రూపం. రాజా.

<హిం. రంగేలీ+సం. రాజా.

రచ్ వి. నేత నేసేటప్పుడు పడుగులో పైపోగులను కిందికి కింది పోగులను పైకి జరపటానికి వీలుగా నాలుగు కర్ర లను పడి దారాలతో లంకెలు వేసిన పనిముట్టు.

సం. రచ్. ఏర్పరచు, చేయు, నిర్మించు.

రచ రూ.చూ. రచ్చ[1]. వి. 1. కొట్లాట ; 2. సమావేశం ; 3. రచ్చబండ ; 4. పెద్దగొడవ.

రచియించు స.క్రి. ఇచ్చు, సమర్థించు. ద.హిం.కా. సంపు. 4, కా.సం. 666. క్రీ.శ. 1139.

సం. రచ్. చేయు, ఏర్పరచు, పన్ను, సిద్ధపరచు.

<సం. రచ్+-ఇంచు[3] (అర్థవిపరి.).

రచ్చ[1] రూ. రచ. వి. 1. రాజమార్గం. కు.సం. 8.125 ; 2. (గ్రామాల్లో) పెద్దమనుషులు కూర్చుండే చావడి. భార శాంతి. 4.117; 3. సమ్మర్దం వసు. 2-140 ; 4. గోష్ఠి (హరిశ్చంద్రపక్షం) హ.నల. 2-31 ; 5. కలకలం (నల. పక్షం). హ.నల. 2.31: 6. స్థానం. ఉనికిపట్టు. చిత్రభా. 2-64 ; 7. కొలువు. సభ; సమితి. కళా. 3-243 ; 8. కలహం. అహల్యా. 1.105 ; 9. బాధ. ఉపద్రవం ; 10. రచ్చచేసే చోట నీడకోసం వేసేమాను.

సం. రథ్యా. వీథి ; ప్రా. రథా ; అప. అ.మా.పా. శౌ. రచ్చా ; మా. లచ్చా ;

క. రచ్చె. రగడ, కలకలం, ప్రకటించు. బయలుపరచు. పిల్లలగోల. త. ఐరచ్చై. రచ్చమాను. రచ్చా, అగగణం ; మరియాగోంది. రభ. ముంగిలి.

<ప్రా. రచ్చా.

రచ్చకీడ్చు స.క్రి. వీథికీడ్చు, కలహానికీడ్చు <రచ్చ[1]+ -కున్+ ఈడ్చు. రచ్చకెక్కు అ.క్రి. వీథికెక్కు. నిర్వ.రా. 9-88. <రచ్చ[1] + -కున్ + ఎక్కు. రచ్చకొట్టము. వి. 1. రచ్చచావడి (మండపం) సభామందిరం. భార. అను. 2-61 ; 2. ధర్మశాల. భార. అను. 2-64. రచ్చగూను (-కూను) అ.క్రి. గుంపుగూడు. రామాభ్యు. 5-188. రచ్చచేయు అ.క్రి. 1. తొందరచేయు ; 2. గోల చేయు ; 3. కలహించు. రచ్చజొన్న వి. ఒకరకంజొన్న. రచ్చటరుగు రూ. రచ్చరుగు. వి. గ్రామంలో పెద్దలు. సమావేశమయ్యే అరుగు. <రచ్చ[1]+ అరుగు. రచ్చపట్టు వి. 1. కొలువుకూటం, సభాభవనం. ఉ.హరి. 5-138 ; 2. గోష్ఠి స్థానం. మను. 2-48 ; 3. ఉనికిపట్టు. ఆశ్రయం. రామాభ్యు. 1-82. రచ్చపట్టుకొట్టము వి. సభామండపం ఉ.రా. 3-22. రచ్చపెట్టు అ.క్రి. 1. తొందరపెట్టు ; 2. అల్లరిపెట్టు. రచ్చబండ వి. రచ్చ చేసేటప్పుడు పదిమంది కూర్చునే బండ, రచ్చరాయి. రచ్చబల్ల వి. 1. రచ్చచేసేట ప్పుడు పదిమంది కూర్చునేస్థలం.2 కరుపులోబల్ల. రచ్చమాను రూ.చూ. రచ్చమాను. వు.బొ. జనులు గోష్ఠి చేసే చోట. నీడకోసం పెంచిన చెట్టు. చైత్యం. ఉ.హరి. 5-37. రచ్చం బడు(-పడు) అ.క్రి. వీధినిపడు.తాళ్ల. సం. 14-27. రచ్చ యుండు (-ఉండు) అ. క్రి. సభచేసి కూర్చుండు, కొలు వుండు. ఇందు. ప. 3-33. రచ్చయొనర్చు (-ఒనర్చు) అ.క్రి. 1. కొలువుసేయు. నివసించు. పాండు. 4-48 : 2. కలహించు, సంఘర్షణపడు. రచ్చరావి వి. పెద్దమనుషులు కూర్చునేచోట నీడకోసంవేసిన రావిచెట్టు. వరాహా. 10.120. రచ్చరుగు రూ.చూ. రచ్చటరుగు. వి. గ్రామంలో పెద్దలు సమావేశమయ్యే అరుగు. <రచ్చ[1]+అరుగు. రచ్చరాయి వి. రచ్చచేసేటప్పుడు పదిమంది కూర్చునేరాయి, రచ్చబండ. శుక. 2-407. రచ్చలబడు అ.క్రి. వీధుల్లోపడు. తాళ్ల.

సం. 9–243. <రచ్చ[1] + –లు + –అ[7] + పడు.
**రచ్చలబెట్టు** అ.క్రి. రట్టుచేయు. బాధపెట్టు. <రచ్చ[1] + –లు + –అ[7] + పెట్టు. **రచ్చవేయు** స.క్రి. బహిరంగపరుచు. తాళ్ల. సం. 17–276. **రచ్చసేయు[1] (–చేయు)** అ.క్రి. **1.** గుమికూడు, సభచేయు. ఆము. 4.111 : **2.** కలహించు. ద్వి. సార. చ. 1788 పం ; **3.** గోష్ఠినలుపు. శుక. 2–418 ; స.క్రి. **1.** బాధించు. కువ.చ. 2–23 ; **2.** బయల్పరుచు. కువ.చ. 4–188.

**రచ్చ[2]** రూ. అచ్చ. వి. కాపు, రక్షణం.
సం. రక్షా. రక్షణ, కాపు ; ప్రా. రచ్చా, రక్కా.
<ప్రా. రచ్చా.
**రచ్చకంబడి** వి. తివాచీలాగా పనికివచ్చే మందపాటిగుడ్డ
**రచ్చరేకు** వి. తాయెత్తు. **రచ్చసేయు[2](–చేయు)** అ.క్రి. కాచు, రక్షసేయు. ఘటికా. 1–128.

**రచ్చన** వి. ధాన్యం, కుప్పచుట్టు, ముద్దెర పలుకలేనివాళ్ల బూడిదతో పోసినగుర్తు.
సం. రక్షణ –, రక్షణా. రక్షించటం. కాపు ; ప్రా. రచ్చణ–.
<ప్రా. రచ్చణ –.

**రజ** వి. రజ్జువు, తాడు. వేంక. పంచ. 1–62.
సం. రజ్జు – తాడు ఒ. రొజ్జు ;
క. రజ్.
<సం. రజ్జు –

**రజన** వి. గడన. సంపాదన.
సం. అర్జన – సంపాదన.
<సం. అర్జన –.

**రజను** వి. **1.** అలపంతోగాని ఆకురాయితోగాని బంగారంపై రాసినప్పుడు రాలే బంగారం మొ. వాటిపొడి ; **2.** లోహపుపొడి.
సం. రజస్. ధూళి, దుమ్ము ; హిం. రజ్.

**రజబ్** వి. మహమ్మదీయుల ఏడవనెల.
ఉ. పార్. రజబ్ ;
త. రచబ్.
<ఉ. రజబ్.

**రజమానంబు** వి. సర్కారుకొలత.
సం. రాజయాన – రాజుకొలత.
<సం. రాజమాన–.

**రజము** వి. కొంచెం.
సం. రజస్ దుమ్ము. పుప్పొడి, పరమాణువు.
<సం. రజస్.

**రజా** వి. **1.** సెలవు ; **2.** పర్మానా ; **3.** హాజరు కాకుండటానికి అనుమతి.
హిం. ఉ. రజా. సమ్మతి, అంగీకారం, సెలవు ;
త. రజా. సెలవు, అనుమతి ; త. రచా.
<ఉ. రజా.

**రజాయి** రూ.చూ. రజాయీ. వి. చలికి కప్పుకొనే దుప్పటి.

**రజాయీ** రూ. రజాయి. వి. **1.** మధ్యలో పత్తిపెట్టి కుట్టిన మందమైన దుప్పటి లేదా బొంత ; **2.** కుళ్ళాయి.
ఒ. హిం. రజాఈ, రొజాయి. బొంత, రాజతీవి ;
ఉ. పార. అర. రజా.ఈ. నడుమ పత్తిపెట్టి కుట్టిన దుప్పటి. టోపీ, కుళ్ళాయి, ఒడార్చేవాడు ;
క. రజాయి : త. రచాయ్.
<ఉ. రజా. ఈ.

**రజి** వి. తాడు, రజ్జువు. వేంక. పంచ. 1–62.
సం. –రజ్జు – తాడు, ప్రా. రజ్జా.
<ప్రా. రజ్జు –.

**రజ్జన** రూ.చూ. రజ్జు. వి. ఆత్మస్తుతి.

**రజ్జాడు** చూ. రజ్జు.

**రజ్జు** రూ. రజ్జన, అజ్జు. వి. **1.** దురభిమానం, తగనిగర్వం: కు.సం. 10–151 ; **2.** దుర్భాషణం. భార. విరా. 4–193 ; **3.** ఆత్మశ్లాఘం, డంబం. భార. ఉద్యో. 2–161 ; **4.** అతిశయం. కాశీ. 7–185 ; స.క్రి. పేలు, వదరు. భార. ఉద్యో. 2–161 ; అ.క్రి. ఆత్మస్తుతిచేయు. హరి.పూ. 9–108 ; విణ. వ్యర్థం, భాగ. 6–135.
క. అడచు, అర్చు. పైకి గట్టిగా అరుచు ; త. అడై (–వ్–, –ట్ట్–). మాట్లాడు, వి. ధ్వని. మాట, జవాబు ; కుయి. అస్పు. మాట్లాడు ; కొలా. రజ్ – (రస్త్–). అసందర్భంగా మాట్లాడు.
**రజ్జాడు** అ.క్రి. వ్యర్థవచనాలాడు, వాగు. కాశీ. 2–163. <రజ్జు + ఆడు. **రజ్జులాట** వి. డింబాలాడటం. విక్ర. 4–72. **రజ్జులాడు** అ.క్రి. వదరు, డాబులు పలుకు. <రజ్జు + –లు + ఆడు. **రజ్జులాడి** వి.ణ. **1.** వ్యర్థభాషణచేసేస్త్రీ ; **2.** ఆత్మస్తుతిపరురాలు. <రజ్జు + –లు + ఆడి. **రజ్జులాడు** విణ. **1.** వ్యర్థభాషణుడు. వదరుబోతు. భార.ద్రోణ. 4.245 ; **2.** ఆత్మస్తుతిపరుడు. భార.అరణ్య. 6.63. <రజ్జు + –లు + –ఆడు.

**రంచె** వి. ఏనుగుమీద అంబారి. వరాహ. 4.120.
హిం. రంచ్. కొంచెం, అల్పం.

**రంజకము** వి. తుపాకిచెవిని కాల్చటానికి పెట్టేమందు. ప్రబంధ. 7.88.
సం. రంజక–. ఉద్రేకం కలిగించే.
<సం. రంజక– (అర్థవిపరి.).

**రంజణ** రూ.చూ. రంజణి. వి. గాదెలాంటి కాగు.

**రంజణి** రూ. రంజణ. వి. గాదెలాంటి కాగు.
సం. రంజన–, రంజనా. సంతోషపెట్టేది, రంగు.
<సం. రంజన–.

**రంజన్లు** వి.బ.వ. కల్లు నిలవచేసి అమ్మే పెద్ద సైజు మట్టిపాత్రలు.
సం. రంజన–. ఆనందపరిచే, సంతోషపెట్టే, కామాది వికారాన్ని ఉద్రేకింపచేసేది.
<సం. రంజన– + లు (అర్థవిపరి.).

**రంజాన్** రూ. రమ్జాన్. వి. మహమ్మదీయుల పండగ.
హిం.ఉ. రమ్జాన్. మహమ్మదీయుల పండుగ ; అర. రమ్ఝాన్ ; మరా. రమ్జాన్ ;
త. రంచాన్ ; పర్షి. రమ్జాన్.
<ఉ. రమ్జాన్.

రంజి వి. వేశ్య. వ్య. సంతోషపెట్టేది.

నం. రంజ్. సంతోషపెట్టు.

రంజీతు వి. అప్రియమైన విషయం బయటపడినప్పుడు ఒక వ్యక్తి పడే బాధ.

ఉ. రంజిద్. బాధ.

< ఉ. రంజిద్.

రంజరాలు చూ. రంజణ. వి. పశువులకు నీళ్ళు పెట్టటానికి వాడే మట్టిపాత్ర.

< రంజు + రాయి + -లు.

రటాణి వి. తిరగలి, రాగరాయి. ధ్వన్యను.

రటోడి రూ.చూ. రట్టకుట్ట. వి. 1. చతుర్థజాతివారి (శూద్రుల)లో ఒక రాజవంశానికి చెందినవారి బిరుదు వాచకశబ్దం. నె.శా. సంపు 2, పు. 606-607. క్రీ.శ. 8 వ శతాబ్ది; 2 గ్రామాధికారి.

రట్టకుట్ట చూ. రట్టొళ్లు. రూ. రటోడి, రట్టకుడి, రట్టగుడి, రట్టడి[1], రట్టిడి, రట్టాడ, రట్టాడి, రట్టోడి, రడి[1], రడ్డి, రడ్డోడి, రెడి, రెడ్డి. వి. 1. చతుర్థ జాతివారి (శూద్రుల)లో ఒక రాజ వంశానికి చెందినవారి బిరుదవాచకశబ్దం. E.I. సంపు. 27, శా.సం. 230. వెలుదుర్తి శాసనం. క్రీ.శ. 625-650; 2. గ్రామాధికారి.

రట్టకుడి రూ.చూ. రట్టకుట్ట. వి. 1. చతుర్థజాతివారి (శూద్రుల)లో ఒక రాజవంశానికి చెందినవారి బిరుదవాచక శబ్దం. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 617. క్రీ.శ. 739; 2. గ్రామాధికారి.

రట్టగుడి రూ.చూ. రట్టకుట్ట. వి. 1. చతుర్థజాతి (శూద్రుల)లో ఒక రాజవంశానికి చెందినవారి బిరుదవాచక శబ్దం. ద.హిం. శా. సంపు. 10. శా.సం. 600. క్రీ.శ. 8 వ శతాబ్ది; 2. గ్రామాధికారి.

రట్టగుళ్లు రూ.చూ. రట్టొళ్లు. వి.బ.వ. 1. చతుర్థజాతి వారి (శూద్రుల)లో ఒక రాజవంశంవారు. మాచర్ల శాసనం. క్రీ. శ. 641; 2. గ్రామాధికార్లు. రట్టగుళ్ళు రూ. చూ. రట్టొళ్లు. వి.బ.వ. 1. చతుర్థజాతివారి (శూద్రుల)లో ఒక రాజవంశంవారు. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 599. క్రీ.శ. 625-650; 2. గ్రామాధికార్లు. రట్టగొడ్లు రూ. చూ. రట్టొళ్లు. వి.బ.వ. 1. చతుర్థజాతివారి (శూద్రుల)లో ఒక రాజవంశంవారు. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 217. క్రీ.శ. 745-801; 2. గ్రామాధికార్లు.

రట్టగుళ్లు చూ. రట్టగుడి.

రట్టగుళ్ళు చూ. రట్టగుడి.

రట్టగొడ్లు చూ. రట్టగుడి.

రట్టడము చూ. రట్టడి[1].

రట్టడి[1] రూ.చూ. రట్టకుట్ట. వి. 1. గ్రామాధికారి. నె.శా. సంపు. 3. పుటలు 1202-1203. క్రీ.శ. 1023; 2. చతుర్థజాతివారి (శూద్రుల)లో ఒక రాజవంశానికి చెందిన వారి బిరుదవాచక శబ్దం.

రట్టడము రూ. చూ. రట్టడికము. వి. 1. ప్రభుత్వం, గ్రామాధికారిత్వం. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 1237. 1281; 2. సత్యం. రట్టడికము రూ. రట్టడము. రడ్డికము, రడ్డికము. వి. రట్టడితనం, గ్రామాధికారిత్వం, ప్రభుత్వం. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 1029. క్రీ.శ. 1100. రట్టడితనము[1] వి. గ్రామాధికారం, ప్రభుత్వం. రట్టడ్లు రూ.చూ. రట్టొళ్లు. వి.బ.వ. 1. గ్రామాధికారులు. ద.హిం. శా. సంపు. 6, శా.సం. 250. క్రీ.శ. 742-798; 2. చతుర్థ జాతివారి (శూద్రుల)లో ఒక రాజవంశానికి చెందినవారు. రట్టడ్ళు రూ.చూ. రట్టొళ్లు. వి.బ.వ. 1. గ్రామాధికారులు. ద హిం.శా. సంపు. 10. శా.సం. 600. క్రీ.శ. 8 వ శతాబ్ది; 2. చతుర్థ జాతివారి (శూద్రుల)లో ఒక రాజవంశానికి చెందినవారు. రట్టళ్ళు రూ.చూ. రట్టొళ్లు. వి. 1. గ్రామాధి కారి. శివత. సా. 200; 2. చతుర్థ జాతివారి (శూద్రుల)లో ఒక రాజవంశానికి చెందినవారు.

రట్టడి[3] రూ. చూ. అట్టు. విణ. 2. నింద్యుడు. నింద్యం. రం. రా. కిష్కిం. 205 పు.; 1. దుష్టుడు. దుష్టురాలు. రం.రా. అరణ్య. 161 పు.; 2. అగ్రహం. సానంద. 2.128; 3. వ్యర్థం. శకాం. 3.73; వి. 1 రట్టు,నింద. ప్రబోధ. 1.50; 3. అలుక, కోపం.

రట్టడి చేయు రూ. చూ. రట్టడి సేయు. స.క్రి. నిందించు, రట్టు చేయు. రట్టడితనము[2] వి. కోపం మాఖ. విజయ 3.150. రట్టడిసేయు (- చేయు) రూ. రట్టడి చేయు. స.క్రి. రట్టుచేయు, నిందించు.

రట్టడ్లు చూ. రట్టడి[1].

రట్టడ్ళు చూ. రట్టడి[1].

రట్టణము వి. నాట్యవిశేషం. శ్రీరం. మా. 4.162

నం. రటన -. ధ్వననం.

< నం. రటన-.

రట్టళ్లు చూ. రట్టడి[1].

రట్టిడి రూ. చూ. రట్టకుట్ట. వి. 1. గ్రామాధికారి. ద.హిం.శా. సంపు. 10.శా.సం. 620. క్రీ.శ. 914; 2. చతుర్థజాతివారి (శూద్రుల)లో ఒక రాజ వంశానికి చెందిన బిరుద వాచక శబ్దం.

రట్టు రూ. చూ. అట్టు. వి. 1. నింద, దూరు. శివరా. 3.71; 2. గోల, అల్లరి. వరాహ. 4.19; 3. అపకీర్తి. వరాహ. 7.26; 4. మొర (పిర్యాదు). పారి. 3.39; 5. ఉపద్రవం, ఆపద. ఉ.రా. 2,309; 6. చొరవ, సాహసం. హంస. 5.39.

రట్టు కత్తియ రూ.చూ. రట్టుకత్తె. వి. చొరవగల స్త్రీ, సాహసికురాలు. రట్టుకత్తె రూ. రట్టుకత్తియ. వి. సాహసికు రాలు, చొరవకత్తె. క్రీడా. 129. రట్టుకెక్కు రూ.చూ. అట్టుకెక్కు. అ.క్రి. 1. అల్లరిచేయు. తాళ్ల. సం. 10.208; 2. నిందచేయు. 3. మొరపెట్టు. < రట్టు + -కున్ + ఎక్కు. రట్టుచేయు రూ చూ. రట్టుసేయు. స.క్రి. రట్టడిచేయు, నిందించు, రట్టువడు రూ. రట్టుపడు. అ.క్రి రవ్వపడు. పరిక్ష.4.11. రట్టువడు(-పడు) రూ.చూ. రట్టుపడు. అ.క్రి. ఇతరుల్ని దూరుకు పాల్పడు. శివరా. 3.132. రట్టుసేయు (- చేయు) రూ. రట్టుచేయు. స.క్రి. రట్టడిచేయు, నిందించు.

రట్టాడ రూ.చూ. రట్టకుట్ట. వి. 1. గ్రామాధికారి. గురింద గుంట శాసనం. క్రీ.శ. 10వ శతాబ్ది; 2. చతుర్థజాతివారి

(శూద్రుల)లో బిరుద వాచక శబ్దం.

రట్టొడి రూ.చూ. రట్టకుట్ట, వి. 1. గ్రామాధికారి. ద.హిం.శా. సంపు. 10 ష. సం. 34. క్రీ.శ. 8వ శతాబ్ది, 2 చతుర్థ జాతివారి (శూద్రుల) లో ఒక రాజవంశానికి చెందిన వారి బిరుద వాచకశబ్దం.

రట్టొడ్లు రూ. చూ. రట్టొల్లు. వి. 1. గ్రామాధికారులు. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 598. క్రీ.శ. 925-950; 2. చతుర్థ జాతివారి (శూద్రుల) లో ఒక రాజ వంశానికి చెందినవారు.

రట్టొడ్లు. చూ. రట్టొడి.

రట్టొల్లు రూ. రట్టగుళ్లు, రట్టగుళ్ళు, రట్టగొడ్లు, రట్టడ్లు, రట్టడ్ళు రట్టళ్లు, రట్టొడ్లు, రెడ్లు. వి.బ.వ. 1. గ్రామాధికార్లు కలమళ్ళ శాసనం. క్రీ.శ. 600-625; 2. చతుర్థజాతివారి (శూద్రుల) లో ఒక రాజవంశానికి చెందినవారు.

సం. రాష్ట్రకూట-. గ్రామాధికారి; ప్రా. రట్టఉడ -, రట్టఉ, రడ్డి;

క. రట్టర్, రడ్డి. రెడ్డి. రాజు, పరిపాలకుడు; క్రీ.శ. 1125 నుంచి 1439 వరకు తెలుగునాడును పాలించిన ప్రభువులు. వీరికవ్యవసాయం నేటికీ ప్రధాన వృత్తిగా ఉంది. ఇటీవలి వరకు వీరు గ్రామాధి కారులుగా ఉన్నారు. ఈ శబ్దం రాట్ శబ్ద భవమని కిటెల్; త. ఇరట్టి, ఇరెట్టి; మ. రట్టియక; త. ఇరట్టి. సంస్కృత రాష్ట్రకూట శబ్దానికి క్రీ.శ. 8వ శతాబ్దివరకు ప్రయోగం లేదు. రట్టకుడి, రట్టగుడి, శబ్దాల కృతక ప్రామాణిక శబ్దరూపమే సంస్కృత రాష్ట్రకూట శబ్దమని శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ గారి అభిప్రాయం. రట్ట అనే మహారాష్ట్ర రాజపుత్ర జాతివారు కుట్టు అనే ఆంధ్ర జాతివారు కలిసి రట్టగుళ్ళుగా శాతవాహన సామ్రాజ్య పతనానంతరం ఏర్పడ్డారని వీరి నిరూపణ సారాంశం.

< రట్టొడి + - లు (?).

రట్టోడి రూ.చూ. రట్టకుట్ట. వి. 1. గ్రామాధికారి. E. 1. సంపు. 5. పుటలు. 139-142. క్రీ.శ. 945-970; 2. చతుర్థజాతివారి (శూద్రుల) లో ఒక రాజవంశానికి చెందినవారి బిరుదవాచక శబ్దం.

రడి[1] రూ.చూ. రట్టకుట్ట. వి. 1. కులసూచకశబ్దం, రెడ్డి. చతుర్థ జాతివారి (శూద్రుల) లో ఒక రాజవంశానికి చెందిన వారి బిరుద వాచక శబ్దం. ద.హిం.శా. 4 శా. శం. 1361. క్రీ. శ. 1143; 2 గ్రామాధికారి.

రడిసాని వి. రెడ్డి భార్య. ద.హిం.శా. సంపు. 10. శా. సం. 510. క్రీ. శ. 1315.

రడి[2] రూ. చూ. రెడి[2]. వి. సిద్ధం. తయారు.

రడికర్ర చూ. రాట. వి. గానుగరాతిని తగిలించే కొయ్య దూలం.

రడ్డి రూ.చూ. రట్టకుట్ట. వి. 1. కులసూచకశబ్దం. రెడ్డి, చతుర్థ జాతివారి (శూద్రుల) లో ఒక రాజవంశానికి చెందినవారి బిరుద వాచకశబ్దం. ద.హిం.శా సంపు. 6. శా సం. 250. క్రీ. శ. 742-798. పాండు. 3.75; 2. గ్రామాధికారి.

రడ్డికము రూ.చూ. రట్టడికము. వి. ప్రభుత్వం. గ్రామాధి కారిత్వం. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 91 క్రీ.శ. 1412. రడ్డికము రూ.చూ. రట్టడికము. వి. ప్రభుత్వం, గ్రామాధి కారిత్వం.

ద.హిం.శా. సంపు. 4. శా.సం. 1371. క్రీ.శ. 1253.

రడ్డికము చూ. రడ్డి.

రణపాలాకు వి. పత్రబీజం, హేమసాగరం.

సం. రణ-. యుద్ధం, చప్పుడు.

< సం. రణ-+ పాలాకు (మిశ్రమ.).

రణపెంకి వి. దిట్టుడు, ఎక్కువ పెంకివాడు, మర్మాగ్గుడు.

సం. రణ-. యుద్ధం, చప్పుడు.

< సం. రణ- + పెంకి. (మిశ్రమ.).

రణపెండ్లికొడుకులు వి.బ.వ. ధాన్య విశేషం. హం.స. 4-128.

సం. రణ-. యుద్ధం, చప్పుడు.

< సం. రణ-. + పెండ్లికొడుకు + - లు. (మిశ్రమ.).

రణభేరు వి. 1. పందెం కోడిపుంజు; 2 శునకవిశేషం.

సం. రణ-. యుద్ధం, చప్పుడు, భేరి. వాద్య విశేషం.

< సం. రణభేరీ.

రంటదెప్పరపురచన చూ. రంటు.

రంటు వి. 1. అతుకు. తాళ్ల. సం. 17.221; 2. కలయిక. తాళ్ల. సం. 17-465.

రంటదెప్పరపురచన వి. అతుకుల కూర్పు. తాళ్ల. సం. 10-184.

రండబలపకంప వి. ఆము కాల్పులో వాడే రండ బలప చెట్టు కంప.

రండాగర్భం వి. చెప్పుకో వీలులేనిది.

సం. రండా. విధవ, మగడు చచ్చిన స్త్రీ. గర్భ- ములు, కడుపు.

< సం. రండాగర్భ- (అర్థవిపరి.).

రండిసిరం వి. గట్టిచన్ను, పాలు బాగా రాని చన్ను.

రండు వి. వ్యభిచారం, తాళ్ల. సం. 14.26.

సం. రండా. ముండ, విధవ.

< సం. రండా.

రతనపుగని చూ. రతనము.

రతనపువిల్లు చూ. రతనము.

రతనము వి. రత్నం, మణి. రామాభ్యు. 3.44.

సం. రత్న-. మణి; ప్రా. రయణ-, లదణ; పా. రతన-. మణి; సిం. రవన-.

< పా. రతన-.

రతనపుగని వి. రత్నాకరం, సముద్రం. అచ్చ. రా. కిష్కిం. 82. రతనపువిల్లు వి. ఇంద్రధనుస్సు. రతనాలకుప్పె వి. భూషణ విశేషం. చెన్నబసవ. 2.207. రతనాలపంట వి. రత్నాకరం, సముద్రం.

రతనాలకుప్పె చూ. రతనము.

రతనాలపంట చూ. రతనము.

రతల్ రూ.చూ రతి[1] నలబై తులాల తూకం.

రతలాం రూ.చూ. రాకాళం. వి. గెనుసుగడ్డ, తొక్క నల్లగా ఉండే పెద్దసైజు గెనుసుగడ్డ.

రతళ్ రూ.చూ. రతి[1]. వి. నలబై తులాల తూకం.

**రతి**[1] రూ. రతల్, రతల్. వి. రత్నాల తూనికలో ఉప యోగించే పరిమాణ విశేషం, నలభై తులాల బరువని కొందరు. T.T.D.E.S. సంపు. 3. శా.సం. 37, క్రీ.శ. 1512, విజయ. 1.81.

మరా. రతి, రతల రత్తల. ఒక తూనిక, పౌను; ఉ. పార. అర. రత్ల్ ;

క.త. రతి.

<ఉ. రత్ల్.

**రతి**[2] వి. ఒకరకం నీలంరంగు.

సం. రతి-. మన్మథుని భార్య.

**రతికుండ** వి. జాతర్లలో కుంభం కూడును వండటానికి వాడే మట్టి పాత్ర.

**రతీబు** వి. ఆహారం. చంద్రాంగ. 4.142.

హిం.ఉ. రాతిబ్. పశువులు తినే ఆహారం : మరా. రతిబ్ ఒక వస్తువును రోజూ సరఫరా చేయటం.

<మరా. రతీబ్.

**రత్తగాణి** వి. రక్తవిరేచనాల జబ్బు.

సం. రక్తగ్రహణీ. నెత్తురు పారుకొనే జబ్బు.

<సం. రక్తగ్రహణీ.

**రత్తవసుది** వి. 'రత్నచుడీ' అనే మంచిరకం వడ్లు, ఒరిస్సాలోను, శ్రీకాకుళం జిల్లాలోను ముఖ్యంగా పండేవడ్లు.

**రత్నకంబళి** వి. రత్నకంబలం, ఒకరకం తివాసి. వరాహ. 4.122.

సం. రత్నకంబళ-. ఒకరకం కంబళి.

<సం. రత్నకంబళ-.

**రత్నకేలితములు** వి బ.వ. వస్త్రవిశేషం. సిం.ద్వా. 3.188.

సం. రత్న-. మణి.

**రత్నపురిగడ్డ** వి. గెనుసుగడ్డ. నాలుగైదు నెలల్లో ఒడుపుకు వచ్చే తీగపైరు. దీని దుంపలు కూరకు ఉపయోగ పడతాయి.

సం. రత్న-, మణి.

<సం. రత్న- + పురి + గడ్డ.

**రత్నపొప్పిళి** వి. ఒకరకం గడి.

సం. రత్న-. మణి.

**రత్నవసుది** వి. 'రత్నచుడీ అనే మంచిరకం వడ్లు, ఒరిస్సాలోను, శ్రీకాకుళం జిల్లాలోను ముఖ్యంగా పండే వడ్లు.

సం. రత్న- మణి.

**రత్నసంబావులు** రూ. రత్నసంబావులు. వి.బ.వ. ఒకరకంవడ్లు.

సం. రత్న- మణి.

**రత్నసంబావులు** రూ.చూ. రత్నసంబావులు. వి.బ.వ. ఒకరకం వడ్లు.

**రత్నసరులు** వి బ.వ. రత్నచుడి, అనే మంచిరకం వడ్లు, ఒరిస్సాలోను, శ్రీకాకుళం జిల్లాలోను ముఖ్యంగా పండించే వడ్లు.

**రత్నావలి** రూ చూ. రత్నావళి. వి. 1. ఒకరకం లేతనీలం రంగు ; 2. పచ్చ నిరారంగు కలిసిన వన్నె ; 3. లేత ఆకుపచ్చ రంగు.

**రత్నావళి** రూ. రత్నావలి. వి. 1. ఒకరకం లేతనీలం రంగు ; 2. పచ్చ, నిరారంగు కలిసిన వన్నె ; 3. లేత ఆకుపచ్చ రంగు.

సం. రత్నావళీ-. రత్నాల సమూహం.

<సం. రత్నావళీ-. (అర్థవిపరి.).

**రత్నావళిచీర** వి. ఒకరకం లేతనీలంరంగు చీర.

**రదిఖు** విణ. చిన్న.

హిం. రతిక్. కొంచెం.

<హిం. రతిక్.

**రదెలు** వి. భాగధేయం. ఒకవిధమైన పన్ను లేదా సుంకం. ద. హిం. శా సంపు. 4. శా.సం. 709. క్రీ.శ. 1558.

**రద్ది** రూ. రద్దు.[2] వి. 1. అల్లరి, గోల. భాగ. 2.177, చెన్న బసవ. 5.136 ; 2. గొప్పధ్వని. అని. 3.16 ; 3. అపకీర్తి.

సం. రథ్-, రద్ధ- లోబడినది, క్షతం, రద్ధిక-,

<సం. రథ్.

**రద్దికిడ్చు** స.క్రి. రచ్చకీడ్చు. <రద్ది + -కున్ + ఈడ్చు.

**రద్దిరౌతు** రూ.చూ. రద్దురౌతు. వి. పగిలి పనికిరాని రాయి.

**రద్దు**[1] వి. తీసివేయబడటం. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 795. క్రీ.శ. 1663, విణ. తీసివేయబడిన.

హిం.ఉ. రద్ద్. మార్చబడింది, వేరుచేయబడింది, తీసివేయబడింది ;

క. రద్దు ; త. రత్తు ; మ. రద్ది.

<ఉ. రద్ద్.

**రద్దుచేయు** స.క్రి. కొట్టివేయు. **రద్దుపఱచు** స.క్రి. కొట్టివేయు. **రద్దురాయి** వి. పగిరి పనికిరాని రాయి, **రద్దురౌతు** రూ. రద్దిరౌతు. వి. పగిలి పనికిరాని రాయి.

**రద్దు**[2] రూ.చూ. రద్ది. వి. అల్లరి, గోల. ద్వి సార.చ. 3.166 పం.

**రద్దోది** రూ.చూ. రట్టకుట్ట. వి. రెడ్డి పదానికి పూర్వరూపం. నె.శా. పొదిలి. 23. చోడశాసనం. క్రీ.శ. 1000.

**రంతిలు** చూ. రంతు.

**రంతిల్లు** చూ. రంతు.

**రంతు** రూ. అంతు, అంతె. వి. 1. రతి, సంయోగం, కామకేళి, శృం. నై. 7.151 ; 2. క్రీడ, ఆట. భాగ. 6.328 ; 3. మనవి, విన్నపం. నార. పంచ. 3.112 ; 4. కలకలం. అలబలం, శబ్దం, సద్దు. సింద్వా. 10 125 ; 5. గల్లంతు. తొండర. ఆము. 3.4 ; 6. కలహం, వాక్కలహం, రచ్చ, వాగ్వాదం. ఆము. 6.41 ; 7. సింహనాదం, పెద్దమోత. రామాభ్యు. 6.88 ; 8. మిడిసిపాటు. కళా. 3.185 ; 9. ఒప్పిదం. కవిరాజ. 3.88 ; 10. విఘ్నం. నె.శా. సూళూర్ పేట. 20 ; 11. విలాసం.

సం. రంతవ్య-, రంతి-ఆనందం ; శౌ. రందుణ.

<సం. రంతవ్య-.

**రంతిలు** రూ.చూ. అంతిలు. అ.క్రి. ధ్వనిచేయు, అరుచు. **రంతిల్లు** రూ.చూ. అంతిలు. అ.క్రి. ధ్వనిచేయు, అరుచు, **రంతుకత్తె** వి. క్రీడాపరురాలు. క్రీడా, 128. **రంతుకాఁడు** వి. క్రీడాపరుడు, ద్యూతక్రీడాపరుడు. హరి.ఉ. 3.228. **రంతుకెక్కు** అ.క్రి. మిడిసిపడు. శాళ్ల.సం. 10.273. <రంతు + -కున్ + ఎక్కు. **రంతుచేయు** స.క్రి. అల్లరిచేయు.

తాళ్ల. నం. 6.65.

**రందచెక్క** వి. గరుకుగాఉన్న చోట్లను చదరం చేయటానికి వాడే కొయ్యతో చేసిన తాపి.

**రందా** వి. మరమగ్గంలో పన్నె బిగించిన కందికొయ్య.

**రంది** రూ. రంధి. వి. **1.** ఏకచిత్తత, తత్పరత. పార్వ. 2.153; **2.** వలపుగాని రాకపోకలు; **3.** తీవ్ర కామోద్రేకం; **4.** గొడవ; **5.** కలహం; **6.** విచారం; **7.** పోరు.

సం. రంధి-. అణచివేయటం.

<సం. రంధి-.

రందిపడు అ.క్రి. ఎక్కువగా రోషపడు.

**రంధి** రూ.చూ. రంది. వి. దెబ్బలాట, గొడవ.

**రపణము** వి. **1.** గర్వం. ద్వి. పరమ. వి. **4.304**; **2.** ఉత్సాహం, పాంచాలీ. 3.76, శుక. **1.364**; **3.** సంబరం, సంతోషం; విణ. గొప్పది.

సం. *రపణ-. మాట్లాడటం; ప్రా. రవణ- చప్పుడు చేయటం.

<సం. *రపణ-.

**రవము** చూ. రపణము. విణ. **1.** ప్రచురం. విక్ర. 2.128; **2.** అధీనం. హంస. 5.285; **3.** సిద్ధిపొందినది; వి. **1.** చెల్లుబడి. అని. 3.8; **2.** అధికారం సీతా.వి. 1.25; **3.** సంతోషం, ఉల్లాసం.

**రప-కొట్టు** అ.క్రి. కుండలు నల్లగా రావటానికి గడ్డితోగాని, తాటి కమ్మతో గాని పొయ్యి దగ్గర పొగపెట్టు.

**రపంపెట్టు** అ.క్రి. కుండలు నల్లగా రావటానికి గడ్డితోగాని తాటికమ్మతోగాని పొయ్యిదగ్గర పొగపెట్టు.

**రపాట** వి. **1.** ఒకే లక్ష్యం కలిగిఉండటం; **2.** దెబ్బ.

హిం. రపట్టా. దెబ్బ, కలహం, ప్రయత్నం.

**రపాన** రూ.చూ. రెపాన. వి. **1.** ఎవరికివారు; **2.** తదేకధ్యానం.

**రపాలు** వి. అల్లరి, గోల, గలాభా.

**రప్ప** రూ.చూ. అప్ప. వి. **1.** రాయిలాంటి గట్టివస్తువు. వేంక. పంచ. 4 244; **2.** కట్టుబడిలో పనికిరాని చిన్న రాతి ముక్క.

**రప్పము** వి. గొర్రెలు, మేకలకై కంపలతో నిర్మించిన దొడ్డి.

**రప్పించు** చూ. వచ్చు.

**రప్వ** చూ. రబ్బు². వి. **1.** పోగుతీయటం; **2.** పోగు తీసికట్టటం; **3.** ఇటికతుంప; **4.** చీలికలుగా ఉండే రంధ్రం; **5.** అల్లరి, రవ్వ; **6.** అప్రతిష్ఠ.

ఇం. *Rough*. కఠినమైనది, పూర్తికానిది, సానపెట్ట బడినది, ముతక, తీవ్రవాది.

<ఇం. Rough.

రప్వడు విణ. తుంచిన, విరిచిన. రప్పరాయి రూ.చూ. రఫ్‌రాయి. వి. సాధారణంగా పునాదులు నింపటానికి వాడబడే చెక్కనిరాయి. రప్పెర్లుకొట్టు అ.క్రి. బొబ్బలు పెట్టు.

**రప్పెర్లుకొట్టు** చూ. రప్ప.

**రఫ్రా** రూ.చూ. రఫ్‌రాయి. వి. గుండునింపి కట్టిన చెక్కని రాతి కట్టుబడి.

**రఫ్‌రాయి** రూ. రప్పరాయి, రఫ్రా. వి. సాధారణంగా పునాదులు నింపటానికి వాడబడే చెక్కనిరాయి.

ఇం. *Rough*. మోటు, ముతక, కరకు.

<ఇం. Rough + రాయి.

**రఫ్‌రౌతు** రూ. రబ్బురౌతు. వి. సాధారణంగా పునాదులు నింపటానికి కొన్ని సమయాల్లో గోడల కట్టుబడికి కూడా వాడబడే చెక్కని రాయి.

ఇం. ***Rough***. మోటైన, ముతక, కరకు.

<ఇం. Rough + రాయి.

**రబసము** రూ.చూ. రబ్బసము. వి. కలాటా, రచ్చ. రబ్బసం.

**రబాబు** వి. వాద్యవిశేషం. కువ.చ. 4.112, ప్రబంధ. 605.

హిం. ఉ. రబాబ్. సారంగి వంటి వాద్యవిశేషం.

< ఉ. రబాబ్.

**రబీ** రూ.చూ. రబ్బి. వి. **1.** మధ్యరకం కారుమెరక పంట; **2.** దాళ్వా పంట.

**రబ్బరు** వి. **1.** ఒకరకం చెట్టు నుంచి కారే జిగురు గట్టిపడగా ఏర్పడిన పదార్థం; **2.** రబ్బరు చెట్టు.

ఇం. ***Rubber***. సాగే గుణంగల ఒక పదార్థం తుడిచేది.

<ఇం. Rubber.

**రబ్బరు చేతులు** రూ. రబ్బర్సేతులు, లబ్బర్సేతులు. వి.బ.వ. చేతులకు తొడుక్కొనే రబ్బరు తొడుగులు. **రబ్బరు పాప్పిలిచీర** వి. పడుగులో మూడుగీరలు ఒకచోట మూడు గీరలు మరొక చోట వచ్చేట్టు నేసిన ఒకరకం గడి. **రబ్బరు బొమ్మ** వి. అందమైంది. **రబ్బర్సేతులు** రూ.చూ రబ్బరు చేతులు. వి.బ.వ. చేతులకు తొడుగుకొనే రబ్బరు తొడుగులు.

**రబ్బర్సేతులు** చూ. రబ్బరు.

**రబ్బసము** రూ. రబసము. వి. **1.** అందం; **2.** గలాటా.

సం. రభస-, రభసా. తీవ్రమైనది, తొందరగలది.

<సం. రభస-.

**రబ్బివల్** వి. మహమ్మదీయ సంవత్సరంలో మూడో నెలపేరు.

ఉ. అర. రబి, ఉ-ల్-అవ్వల్. మహమ్మదీయ సంవత్సరంలో మూడో నెల;

త. రబివుల్-అవ్వల్.

<ఉ. రబీ' ఉ-ల్-అవ్వల్.

**రబ్బిష్** వి. సాధారణంగా పునాదులు నింపటానికి వాడబడే చెక్కనిరాయి.

ఇం. ***Rubbish***. చెత్త, తుక్కు, పనికిరాని.

<ఇం. Rubbish.

**రబ్బిసానీ** వి. మహమ్మదీయ సంవత్సరంలో నాలుగో నెల.

ఉ. అర. రబి, ఉ-స్-సానీ. మహమ్మదీయుల సంవత్సరంలో నాలుగో నెల పేరు;

త. రబిఉత్‌జానీ.

<ఉ. రబీ' ఉ-స్-సానీ.

**రబ్బి** రూ. రబీ. వి. **1.** మధ్యకారు మెరకపంట; **2.** దాళ్వా పంట.

హిం. రబీ. వసంతర్తువు, వసంతర్తువులో నాటబడే పంట; మరా. రబీ, రబ్బీ. వసంతర్తు సంబంధమైన పంట; ఉ. రబీఈ. వసంతర్తు సంబంధి, బయటి; అర. రబీఈ.

<ఉ. రబీఈ.

**రబ్బు**[1] వి. **1.** కాంతి. ఇలా. 1.10; **2.** ఆధిక్యం.

హిం. ఉ. రబ్. ఈశ్వరుడు, దేవుడు.

**రబ్బు**[2] వి. గుండునింపి కట్టిన చెక్కని రాతికట్టుబడి.

**రబ్బురౌతు** రూ.చూ. రబ్‌రౌతు. వి. సాధారణంగా పునాదులు నింపటానికి కొన్ని సమయాల్లో గోడల కట్టుబడికి కూడా వాడబడే చెక్కనిరాయి.

**రబ్లింగ్** వి. సాధారణంగా పునాదులు నింపటానికి వాడబడే చెక్కనిరాయి.

ఇం. *Rubble*. గరుకుగా ఉన్న విరిగిన రాళ్ళు ఇటికలు మొ.వి.

**రభస** వి. అల్లరి, గొడవ.

సం. రభస-. తొందర, కోపావేశం, హర్షం, సంతసం, ఔత్సుక్యం, ఉత్కంఠ.

<సం. రభస- (అర్థవిపరి.).

**రమణ** రూ. రవణ, రాణ. వి. **1.** ఉత్సాహం. యుద్ధమల్లుని బెజవాడశాసనం. క్రీ.శ. 8989-34; **2.** విధం. భార. ఆది. 3.27; **3.** ప్రీతి. భార. ఆది. 6.172; **4.** ఆసక్తి. భార. సభా. 1.214; **5.** ఒప్పిదం. కు.సం. 11.91; **6.** ప్రసిద్ధి. సురా. 8; **7.** మనోజ్ఞత; **8.** కోరిక.

సం. రమణ-. ఆనందం, సంతోషం, సరసం; ప్రా. రమణ-, శైంగికానందం; పా. రమణ-. సంతోషపెట్టటం.

<సం. రమణ-(అర్థవిపరి.).

**రమణకెక్కు** అ.క్రి. వన్నెకెక్కు. శోభిల్లు. వసు. 1.13. <రమణ + -కున్ + ఎక్కు. **రమణవోలె** అవ్య. క్రియా. విధంగా. కు.సం. 3.29. **రమణించు** రూ. రవణించు. అ.క్రి. ఒప్పిదమగు, ఒప్పు. నిర్వ. రా. 1.52. <రమణ + - ఇంచు.[3]

**రమణా** వి. బర్మాలోని ఇరావతీ నదీ ముఖద్వారం వద్ద ఉన్న ప్రాంతం 'రమన్య' అని ప్రాచీన వ్యవహారం. హర. పీఠి. 28.

**రమణించు** చూ. రమణ.

**రమరమి** రూ.చూ. రమారమి. వి. క్రమం.

**రమామణిపాప్పిళి** వి. జరీపెట్టి నేసిన ఒకరకం గడిచీర.

సం. రమా. లక్ష్మి, మణి-. రత్నం.

**రమారమి** రూ. రమరమి, రమారమీ. వి. **1.** క్రమం. కృష్ణ. 4.81; **2.** సుమారు; **3.** సరాసరి. క్రి. విశ. క్రియా. ఇంచుమించుగ, సుమారుగ, సరాసరిగ.

ఉ. పార. రమారామ్. అధికం, కూడిక, ఎక్కువ కావటం.

త. రమారమి. సుమారు, సరాసరి.

<ఉ. రమారామ్.

**రమారమీ** రూ.చూ. రమారమి. వి. **1.** సుమారు; **2.** సరాసరి.

**రమ్‌జాన్** రూ.చూ. రంజాన్. వి. మహమ్మదీయుల పండుగల్లో ఒకటి.

**రంప** రూ.చూ. అంపము. వి. చిన్నకత్తెర.

**రంపంరేకు పద్ధతి** చూ. రంపము.

**రంపకాఁడు** చూ. రంపము.

**రంపటిలు** చూ. రంపు.

**రంపటిల్లు** చూ. రంపు.

**రంపపు సంసారము** చూ. రంపము.

**రంపము** రూ.చూ. అంపము. వి. **1.** కరగసం, తరగంపియ, తరగంపె; **2.** పన్నెకట్టుబడి కోసం వెదురుదండెలు మోసేపనిముట్టు.

**రంపంరేకుపద్ధతి** వి. మూసతీసే పద్ధతి వంటి దూలం తయారుచేసే విధానం. **రంపకాఁడు** రూ.చూ. అంపకాఁడు. వి. రంపంతో పలకలు కోసేవాడు. **రంపపుసంసారము** వి. కటకటగా నడిచే సంసారం. తాళ్ల.సం. 5.122. **రంపము పళ్ళు** వి.బ.వ. రంపానికి ఉండే పళ్ళు. **రంపంపేటు** వి. రంపం పళ్ళ మాదిరిగా మొనలు దేలినట్లు వేసిన డిజైను. <రంపము + పేటు. **రంపంపొట్టు** వి. కలపను రంపంతో కోయగా రాలేపొడి. <రంపము + పొట్టు.

**రంపంపేటు** చూ. రంపము.

**రంపంపొట్టు** చూ. రంపము.

**రంపవు** చూ. రంపు.

**రంపి**[1] రూ.చూ. అంపు. వి. **1.** అతిదారుణమైన చప్పుడు; **2.** రట్టు, రవ్వ, రాయిడి.

**రంపి**[2] రూ.చూ. అంపము. వి. కొయ్యను కోయటానికి పనికివచ్చే ఇనప రేకుతో చేసిన పరికరం.

**రంపియ**[1] రూ. రంపె[1], అంపియ, అంపె. వి. **1.** మాదిగవాడు తోలు కోసే సాధనం; **2.** తాటాకులు మట్టగించి కోసే సాధనం.

**రంపియ**[2] రూ.చూ. అంపము. వి. **1.** రంపం; **2.** దారుణ కృత్యం.

**రంపిలు** చూ. రంపు.

**రంపిల్లు** చూ. రంపు.

**రంపు** రూ.చూ. అంపు. వి. **1.** రాపిడి ఒరిపిడి. అహల్యా. 3.75; **2.** గోడు; **3.** బలవంత; **4** పీడ; **5.** గొడవ.

**రంపటిలు** రూ.చూ. అంపటిల్లు. అ.క్రి. **1.** కలహించు, పోరాడు; **2.** చెలరేగు, విజృంభించు. **రంపటిల్లు** రూ.చూ. అంపటిల్లు. అ.క్రి. కలహించు, పోరాడు; **2.** చెలరేగు, విజృంభించు. **రంపవు** అ.క్రి. మనోహరమగు. తాళ్ల. సం. 5.42 <రంపు + అవు. **రంపిలు** రూ.చూ. అంపిల్లు. అ.క్రి. **1** పోరాడు; **2.** విజృంభించు, చెలరేగు; **3.** వ్యాపించు; **4.** అతిశయించు; **5.** వర్ధిల్లు; **6.** అరచు. **రంపిల్లు** రూ.చూ. అంపిల్లు. అ.క్రి. **1.** పోరాడు. యయా. 3.107; **2.** విజృంభించు. చెలరేగు; **3.** వ్యాపించు; **4.** అతిశయించు; **5.** వర్ధిల్లు; **6.** అరచు.

**రంపె**[1] రూ.చూ. రంపియ[1]. వి. **1** మాదిగవాడు తోలుకోసే సాధన విశేషం; **2.** తాటాకులు మట్టగించి కోసే సాధనవిశేషం.

రంపె² రూ.చూ. అంపము. వి. 1. కొయ్యను కోయటానికి పనికి వచ్చే పరికరం ; 2. దారుణకృత్యం.

రంపెలగొట్టు (-గొట్టు²) వి. 1. దారుణకృత్యాలు కలవాడు ; 2. దారుణకృత్యాలు కలది. రంపెలాఁడి వి. దారుణకృత్యాలు కలస్త్రీ, రాక్షస కృత్యాలుగలస్త్రీ, పోరు పెట్టేది. వేంక. పంచ. 3.183. <రంపె³+-లు+-ఆఁడి.

రంబచెక్కిళ్ళు వి.బ.వ. ఒకరకంవడ్లు.

సం. రంభా. దేవవేశ్య.

<సం. రంబా+చెక్కిలి+-లు.

రంబారావుళ్ళు రూ.చూ. రంబారూళ్లు. వి.బ.వ. మరాముళ్ళు, చిక్కులు. పుర్రాకులు.

రంబారూళ్లు రూ. రంబారావుళ్ళు, రంబారూళ్ళు, వి.బ.వ. ఇక్కట్లు. ద్వి. పరమ.వి. 4.311.

సం. రంభా. దేవవేశ్య.

<సం. రంబా+రాపిడి+-లు.

రంబారూళ్ళు రూ.చూ. రంబారూళ్లు. వి.బ.వ. చిక్కులు ఇక్కట్లు

రంబు¹ వి. వీరణం అనే చర్మవాద్యవిశేషం.

రంబు² రూ.చూ. డ్రమ్ము. వి. పెద్దరేకుపాత్ర.

రంభ వి. అంచమైంది.

సం. రంభా. దేవవేశ్య.

<సం. రంబా (అర్థవిపరి.).

రంభచెక్కిళ్లు వి.బ.వ. ఒకరకం ధాన్యవిశేషం. ప్రబంధ. 112. రంభరావిడి చూ. రంబారూళ్లు. వి. పెద్ద అల్లరి.

రమ్మకూజా వి. కొళాయి బిగించి డ్రమ్ము ఆకారంలో ఉండే కూజా.

ఇం. *Drum*. డోలు, ఢంకా.

<ఇం. Drum + కూజా.

రయతు రూ.చూ. రైతు. వి. కాపు, పంటకాపు.

రయిక రూ.చూ. అవిక. వి. రవిక.

రయితు రూ.చూ. రైతు. వి. పంటకాపు.

రయితువారి రూ. రయిత్వారి, రైతువార్, రైతువారి, రైత్వారి. వి. జమీందారు ప్రమేయం లేకుండా వ్యక్తిగతంగా వ్యవసాయం చేసుకునే పద్ధతి.

ఉ. పార. ర. ఇయ్యత్ - వార్. ఒక్కొక్క రైతు క్రమ ప్రకారం.

<ఉ. ర. ఇయ్యత్ - వార్.

రయిత్వారి రూ.చూ. రయితువారి. విణ. జమీందారు ప్రమేయం లేకుండా వ్యక్తిగతంగా వ్యవసాయం చేసుకొనే పద్ధతి.

రయ్యి వి. శీఘ్రగతియొక్క అనుకరణం.

రలిగించు చూ. రలుగు.

రలుగు రూ.చూ. రగులు. అ.క్రి. నిప్పు అంటుకొను, ముట్టుకొను.

రలిగించు అ.క్రి. నిప్పు ముట్టించు. <రలుగు+-ఇంచు³.

రవ¹ రూ. రవ్వ, అవ. విణ. 1. చిరు, అల్పం. శృం.నై. 7.150 ; 2. సన్నది, సున్నితం. చెన్నబసవ. 2.233. వి. 1. వజ్రం హర. 5.44 ; 2 అణువు, రేణువు. యయా. 5.89 ; 3 ఖండం. శకలం విజయ. 1.85 ; 4. ఓర్వలేనితనంతో ఆడిపోసుకోవటం : 5. చిన్న చిన్న ముక్కలుగా చేయబడ్డ ధాన్యం.

సం. లవ-.తునుక, ముక్క, ఖండం ; ప్రా. పా. రవ-. రేణువు, అణువు ; హిం. ఉ. అర. రవా. చిన్న ముక్క, ఒకధాన్యపుగింజ, ఒక అణువు, రేణువు, ఒక స్ఫటికం, తుపాకిమందు, రేణువు ;

క. రవె ; త. ఇరవై.

<ప్రా. రవ-.

రవకారము రూ. లవకారం, లవాకారం, లొవకారం, లోకారం, లోవకారం. వి. 1. పల్చని గచ్చు పూత ; 2. రాళ్ళసందుల్లో నీళ్ళు చల్లి సున్నం రుద్దటం. రవకుంచి రూ.చూ. రవ్వకుంచె. వి. సుమారు రెండు జేసల బౌడు గుండే ఒకరకం కుంచె. రవగాడ్పు వి. పిల్లగాలి, నెమ్మదిగా వీచే చల్లగాలి. రవంత రూ. రవ్వంత. విణ అల్పం, కొంచెం. <రవ¹+అంత. రవన్ని విణ. కొన్ని. <రవ¹+అన్ని. రవపాళము విణ. 1. చాలా సన్నపాటిది ; 2. మిక్కిలి సన్నబట్ట. రవసెలా రూ.చూ. రవసెల్ల. వి. మిక్కిలి సన్నిబట్ట. రవసెల్ల రూ. రవసెలా, రవసెల్లా వి. చాలా సన్నపాటి సెల్లా. వేంక. మా. 4.261. రవసెల్లా రూ.చూ. రవసెల్ల. వి. ఉల్లిపొరలాంటి బట్ట.

రవ2 రూ.చూ. అవ్వ. వి. 1. రవగాలు, అశ్వగతివిశేషం. రామాభ్యు. 8.63 ; 2. ధ్వని. పాండు. 1.81.

రవగాలు రూ.చూ. రవాలు. వి. అశ్వగతి విశేషం. ఉ. రా. 1.68. రవనడ వి. అశ్వగతి విశేషం. వేంక. అం. తిర్య. 81. రవపలుకు వి. మణితం. రవమంచము వి. నకినలమంచం. రవాలు రూ. రవగాలు, రవాగాలు. వి. 1. అశ్వగతివిశేషం. అచ్చ.రా. కిష్కిం. 108 ; 2. గుర్రం సాంబ. తిర్య. 71.

రవడి¹ వి. అప్పు, ఋణం.

రవడి² రూ.చూ. రవలి. వి. ధ్వని, చప్పుడు.

రవణ రూ.చూ. రమణ. వి. ఒప్పిదం. ఇందు. 4.40.

సం. రమణ-, ప్రా. రవణ - క్రీడ. సురతం ; అప. రవణ ; క. రవణి ; త. ఇరణి.

<ప్రా. రవణ-.

రవణించు రూ.చూ. రమణించు. అ.క్రి. 1. ఒప్పిదమగు. దశా. 7.78 ; 2. ఒప్పు, కలుగు. <రవణ+-ఇంచు³. రవణింపు వి. ఒప్పిదం. వైజ. 1.32. రవణిలు రూ.చూ. రవణిల్లు, అ.క్రి ఒప్పిదమగు. రవణిల్లు రూ. రవణిలు. అ.క్రి. ఒప్పిదమగు. అప్ప. 4.230వ.

రవణము వి. 1. భూషణం. భార. విరా. 3.132 . 2. సాటి. సామ్యం. ఉ.రా. 4.163 . 3. సొగసు, సౌందర్యం; 4. పెద్దది.

సం. రచన-సృష్టి, కృతివిన్యాసం. ప్రా. రయణ-. రయణ-అలంకారం ; అప. రవణు.

<ప్రా. రవణ-.

రవణించు చూ. రవణ.

రవణింపు చూ. రవణ.

రవణిలు చూ. రవణ.

రవణిల్లు చూ. రవణ.

రవన చూ. రవణము. వి. వలయాకారం.

రవరవ రూ. అవఅవ. వి. 1. ధ్వన్యనుకరణం. క్రీడా. 17 ; 2. స్పర్ధ, జగడం. పారి. 1.42 ; 3. కాంతి విశేషం. మను. 6.94 ; 4. స్పర్ధలో అనుకరణం. చమ. 3.108 ; 5. పంతం. విజయ. 1.151 ; 6. మెరవటంలో అయినధ్వనికి అనుకరణం.

రవరవలువెఱపు అ.క్రి. మనస్తాపం కలిగించు. విజయ. 1 150. రవరవలు పొరము అ.క్రి. మనస్తాపాలు కలుగు.

రవలి రూ. రవడి², రవళి, అవాలి, అవళి. వి. ధ్వని. చప్పుడు. భీమ. 1.104.

సం. రవ- చప్పుడు, ధ్వని, రవణ-, పా.రవ.ధ్వని, అరుపు, రవణ, గర్జన ;

క. రవళి. ధ్వని.

రవళి రూ.చూ. రవలి. వి. 1. ధ్వని. వరాహ. 8 78 ; 2. హుంకారం, గర్వధ్వని. రసిక. 2.77.

రవళించు రూ. రవాళించు. అ.క్రి. ధ్వనించు. గౌ. హరి. పూ. 125పం. క. రవళిసు. వదరు. <రవళి + -ఇంచు³.

రవా రూ.చూ. రవాయి. వి. రవాయి, మందాళి, రత్నం.

రవాకార్చి రూ.చూ. రవ్వాకుఅర్చి. వి. పక్కభాగాలు వంపు లొంపులుగా ఉండేఅర్చి.

రవాగాలు రూ.చూ. రవాలు. వి. రవనడ, అశ్వగతివిశేషం.

రవాణము చూ. రవాణా. వి. గుర్రానికిపెట్టె ఆహారం. ఆం. భా. 2.199.

రవాణా రూ. రవానా. వి. 1. పంపటం ; 2. జాబుపోదగిన గ్రామం ; 3. ప్రయాణం, యానం

హిం. రవాణా. ప్రయాణం, పంపటం ; మరా. రవానా. విడవటం ; పార. ఉ. రవానా ;

క. రవానె. పంపటం, ఒర్మిట్టు ; త. రవాణా.

<ఉ. రవానా.

రవాణాచేయు రూ.చూ. రవానాచేయు. స.క్రి పంపు.

రవాతు రూ.చూ. రైతు. వి. సేద్యగాడు.

రవానా రూ.చూ. రవాణా. వి. 1. పంపటం ; 2. జాబు పోదగినగ్రామం ; 3. ప్రయాణం, యానం.

రవానాచేయు రూ. రవాణాచేయు. స.క్రి. పంపు.

రవాయి రూ. రవా. వి. కృత్రిమ పద్మరాగిణి.

హిం. ఉ. రవా, ఉచితం, ఒప్పిదమైనది, ప్రచలిత మయినది.

<ఉ. రవా.

రవాలు చూ. రవ².

రవాళి చూ.చూ. రవలి. వి. రవళి, ధ్వని. నిరంకు. 4.82.

రవాళించు రూ.చూ. రవళించు. అ.క్రి. రవళించు, ధ్వనించు.

రవిక రూ.చూ. అవిక. వి. కంచెల. పల్నా. పు. 65.

రవిజె వి. గంట. వాల్మీ. 3.36.

సం. రవణ-. ధ్వనించేది ; ప్రా. రవణిఅ, రవణ-. <ప్రా. రవణిఅ.

రవిది రూ.చూ. రవిదె. వి. ఆకు, మొక్కజొన్న, జొన్న మొ పైర్ల ఆకు.

రవిదె రూ. రవిది, రొవిదె. వి. ఆకు, జొన్న, మొక్కజొన్న మొ. పైర్లఆకు.

రవిరేక రూ.చూ. రావిరేక. వి. బిడ్డలు, కూకటిలో ధరించే రావిఆకులాంటి నకకం. కాశీ. 3.240.

రవిలించు చూ. రవులు

రవీసు రూ.చూ. రవేసు. వి. 1. లంచం ; 2. ఫీజు ; 3. కమిషన్ ; 4. బ్రోకరేజి.

రవుతు రూ.చూ. రావుతు(డు. వి. సాది, రౌతు, గుర్రాన్నెక్కే వాడు. భార. ద్రోణ. 1.378 ;

రవులు రూ.చూ. రగులు. అ.క్రి. మండు, ప్రజ్వలించు. శివరా. 7.122.

రవిలించు స.క్రి. రగుల్చు. మండించు. పార్వ. 2.78, అచ్చ. రా. సుం. 166. <రవులు + -ఇంచు³. రవులుకొను రూ.చూ. రవుల్కొను. అ.క్రి. మండు. కాశీ. 7.76. రవులుకొలుపు రూ.చూ. రౌలుకొల్పు. స.క్రి. మండించు. రవులుకోలు రూ. రౌలుకోలు. వి. రవులుకోవటం. ఆము. 4.127. రవులుచు రూ.చూ. రగుల్చు. స.క్రి. రగులుచేయు, మండచేయు. రవుల్కొను రూ. రగులుకొను, రగుల్కొను, రవులుకొను ; అ.క్రి. మండు. కాశీ. 5.158. రవుల్కొలుపు రూ.చూ. రౌలుకొల్పు. స.క్రి. మండించు. రవుల్చు రూ.చూ. రగుల్చు. స.క్రి. రగులచేయు, మండచేయు.

రవుల్కొను చూ. రవులు.

రవుల్కొలుపు చూ. రవులు.

రవుల్చు చూ. రవులు.

రవేరాగడి వి. నాలుగురంగుల పోగులు పెట్టి నేసిన గడి.

సం. రవి-సూర్యుడు, రాట్. రాజు.

రవేసు రూ. రవీసు. వి. 1. లంచం ; 2. ఫీజు ; 3. కమిషన్ ; 4. బ్రోకరేజి.

హిం. ఉ. రవిశ్. గతి, పద్ధతి.

<ఉ. రవిశ్.

రమేసుఆకులు వి.బ.వ. లేతాకులు.

రవ్వ¹ రూ.చూ. రవ¹. వి. 1. వజ్రం. బహుళా. 4.82 ; 2. బూడిదనుంచి జల్లించివేసే బొగ్గుముక్క ; 3. కట్టుబడిలో పనికిరాని చిన్న రాతిముక్క, 4. పినరు ; 5. సరిచేసే టప్పుడు పడుగు బాగా బిరుసెక్కటానికి పైన చిలికే గంజీ ; 6. ఉప్మానూక ; 7. చిన్నచిన్న ముక్కలుగా చేయబడ్డ ధాన్యం.

రవ్వకట్టు అ.క్రి. నన్నటి బద్దల్తోగాని పుల్లల్తోగాని కప్పు. రవ్వకుంచి రూ.చూ. రవ్వకుంచె. వి. సుమారు రెండు జీనల పొడుగుండే ఒకరకం కుంచె. రవ్వకుంచె రూ. రవకుంచి రవ్వకుంచి. వి. ఒకరకం కుంచె, సుమారు రెండు జానల పొడుగుండేది. రవ్వగట్టె వి. అముకాల్పుకు ముళ్ళ కంపల్ని తీసికొని రావటానికి వాడే పంగలకర్ర. రవ్వగోధుమ వి. ఎర్రగోధుమ రవ్వంత రూ. రవంత ; వి. అల్పం,

కొద్ది. <రవ్వ[1] + అంత. రవ్వవేయు అ.క్రి. నరిచేసేటప్పుడు పడుగు బాగా బిరిసెక్కటానికి పైన గంజి చిలుకు.

రవ్వ[2] రూ.చూ. అవ్వ. వి. **1.** నింద, దూరు. గౌ. హరి. ఉ. 1050 ; **2.** దౌష్ట్యం. భాగ. 10 పూ. 322. **3** అల్లరి ; **4.** అపకీర్తి

రవ్వపడు అ.క్రి. నిందపడు. తాళ్ల. సం. 6.163. రవ్వ మాలు విణ. పోకిరితనంకల పాండు. 3.66. రవ్వ యొనరించు (-ఒనరించు) స.క్రి. రచ్చ చేయు. శుక. 1.548. రవ్వయొనర్చు (-ఒనర్చు) స.క్రి. రచ్చ చేయు. రవ్వరట్టు చేయు స.క్రి. రచ్చ చేయు. రవ్వలమారి వి. కలహశీలి. మదన. 70. రవ్వాడు రూ.చూ. అవ్వాడు. అ.క్రి. నిందించు. < రవ్వ[2] + ఆడు. రవ్వెన వి. అల్లరి. తాళ్ల. సం. 14.244.

రవ్వాకుఅర్చి రూ. రవాకార్చి, రివ్వాకు అర్చి. వి. పక్క భాగాలు వంపు లొంపులుగా ఉండే అర్చి.

రవ్వాడు చూ. రవ్వ[2].

రవ్వెన చూ. రవ్వ[2].

రశీదు రూ.చూ. రసీదు. వి. చెల్లుపత్రం, ఏదైనా ముట్టినట్లు రాసిచ్చే పత్రం.

రస్ చూ. వరుస. రూ. రసు. వి. తివాసీ నేసేటప్పుడు పడుగులో ఉన్నదారం దూర్చి పంజా కొట్టి నేసిన వరస.

రసగుండు వి. పాదరసం పూసిన గోళాకార వస్తువు.

సం. రస-. ద్రవం, పాదరసం, నవరసాలు.

<సం. రస -+ గుండు (మిశ్రస.).

రసంగి రూ.చూ. బసంగి. వి. గోదావరి డెల్టాలో పండించే వడ్లలో ఒకరకం, ఉప్పుడు బియ్యానికి పనికి వచ్చే వడ్లు. రసంగులు వి.బ.వ. ధాన్యవిశేషం.

రసంగులు చూ. రసంగి.

రసంగూన వి. బెల్లం తయారీలో చెరకు పాలు నింపటానికి వాడే మట్టి తొట్టి.

సం. రస -.సారం.

<సం. రస-+గూన.

రసచెక్కలు వి.బ.వ. కాచు కలిపిన వక్కలు.

సం. రస.ద్రవం, నవరసాలు, పాదరసం.

<సం. రస-+చెక్క +-లు. (మిశ్రస ).

రసదాడి రూ. రసదాళి, రస్తాళి. వి. **1.** ఒకజాతి చెరుకు. వసు. 1.113 ; **2.** ఒకజాతి అరటి చెట్టు, అరటి పండు. బహుళా. 4.48.

సం. రసదాలికా. ఒకరకం చెరకు ;

క. రసదాలి, రసదాళి, రస్తాళె. ఒకరకం చెరుకు.

<సం. రసదాలికా.

రసదాళి రూ.చూ. రసదాడి. వి. **1.** ఒకజాతి చెరకు ; **2.** ఒక జాతి అరటి చెట్టు ; **3.** ఆ చెట్టు అరటిపండు.

రసనగరయాలు వి.బ.వ. మలామా చేయబడినకుండలు. ద. హిం.గా. సంపు.గా.సం. 938. క్రీ.శ. 1349.

రసపుగొట్టు (-కొట్టు[1]) స.క్రి. పొడిచేయు.

రసపిచ్చి వి. **1.** అధికాసక్తి ; **2.** కామాతురత ; **3.** బంగారం చేసే ఆకాంక్ష.

సం. రస-.రుచి, మద్యం, ప్రేమ, కరుణాదిరసాలు

<సం. రస-+పిచ్చి (మిశ్రస.).

రసాభాసం వి. విఫలం.

సం. రసభాస-. బాహ్యదృష్టికి రసంలాగా కనిపించటం.

<సం. రసాభాస – (అర్థవిపరి.).

రసాభాసు వి. చెడటం, అభాసు.

సం. రసాభాస-. రసాన్ని అనుచిత రీతిగా స్పష్టం చేయటం.

<సం. రసాభాస-.

రసాలు వి.బ.వ. రసానికి ఉపయోగించే ఒకరకం మామిడి

సం. రస-. సారం.

<సం. రస-+-ము+-లు.

రసావళులు రూ.చూ. రసావళ్లు. వి.బ.వ. అపూపం వంటి భక్ష్య విశేషం.

రసావళ్లు రూ. రసావళులు. వి.బ.వ. అపూపం లాంటి భక్ష్య విశేషం, చారులో నాన వేసిన వడలు (?). విష్ణుపు. 3.377.

సం. రసావళి -. రసాలసముదాయం.

<సం. రసావళి-+-లు (అర్థవిపరి.).

రసి రూ.చూ. రసిక. వి. పుండు మీద చీము.

రసిక రూ.రసి. వి. పుండు మీద చీము.

సం. రసిక-. రసంతో కూడినది ; అ.మా. ప్రా. రసిఅ, రసియా ;

క. రసిగె. పుంటిచీము.

<సం. రసిక-(అర్థవిపరి.).

రసీదు రూ.రశీదు. వి. చెల్లుచీటి, వస్తువు ముట్టినట్టు రాసిఇచ్చే పత్రం

హిం. రసీద్. గమనిక, చెల్లుచీటి, డబ్బు ముట్టినట్లు రాసిఇచ్చే పత్రం ; ఉ.పార. రసీద్ ;

క. రషీది, రషీదు, రసితి ; త. రచీతు ; మ. రసితి.

<ఉ.రసీద్.

రసీదు బిళ్ళ వి. ప్రామిసరీ నోట్లు మీద రసీదుల మీద అంటించే స్టాంప్.

రసు రూ.చూ. రస్. వి. తివాసీ నేసేటప్పుడు పడుగులో ఉన్ని దారం దూర్చి పంజాకొట్టి నేసిన వరస.

రస్టుకలరు వి. తుప్పు రంగు.

ఇం. *Rust Colour*. తుప్పు రంగు.

<ఇం. Rust Colour.

రస్తా వి. రోడ్డు, వీథి.

ఒ. రస్తా ; బెం. రస్తా ; హిం. రస్తా, రాస్తా. మార్గం; మరా. రాస్తా ; ఉ. రాస్తా. రీతి, దారి ; పార. రస్తా, రాస్త, రాస్తా. రోడ్డు, వీథి, దారి, కార్ఖానాల వరుస, మార్గం, రక్షించబడిన, తప్పించుకున్న ;

క. రసై. దారి ; త. రస్త.

<ఉ. రాస్తా.

రస్తాళి రూ.చూ. రసదాడి. వి. ఒకరకమైన అరటిపండు.

రస్తు[1] వి.1. వస్తుసంబారం. హంస. 1.109 ; **2.** సేనకోసం నిల్వచేయబడిన ఆహార పదార్థం. కృష్ణరా. 3.67.

హిం. రసద్. ఆనందాన్నిచ్చేది, రస్‌తా. రసత్వం.

**రస్తుచేయు** అ.క్రి. సామగ్రులు నిలవ చేయు. **రస్తుమీాఱు** విఱ. ప్రకాశవంతమైంది, విలువైంది, శుక. 2 100.

**రస్తు**[2] చూ. వచ్చు. అ.క్రి. రమ్ము, రారమ్ము (పిలుపు).

సం. అస్తు. అగుగాక.

<వచ్చు + -అ[7] + సం. అస్తు.

**రస్న**[1] వి. నాలుక.

సం. రసనా. నాలుక ; హిం. రస్‌నా.

<హిం రస్‌నా.

**రస్న**[2] వి. మొలనూలు.

సం. రశనా, రసనా. మొలనూలు ; ప్రా. రసణా పా. రసనా ; హిం. రశ్‌నా, రస్‌నా.

<హిం. రస్‌నా.

**రస్మ** వి. రాబడి, లాభం.

హిం. ఉ. రసమ్, రస్మ. రీతి. కలయిక.

**రహ** వి. ప్రయాణం.

హిం. రాహ్. దారి, రోడ్డు, పద్ధతి, మార్గం ; మరా. రహా. రోడ్డు, దారి ; ఉ. పార. రాహ్. ప్రయాణం, రోడ్డు, పద్ధతి, మార్గం : ఉ. రస్మ.

<ఉ. రాహ్.

**రహజనీ** వి. దారిదోపిడి.

హిం. రాహ్-జనీ. దారిదోపిడీ ; ఉ. పార. రహ్‌జని రాహ్‌జనీ ;

త. రహాజన్.

<ఉ. రాహ్‌జనీ.

**రహట్** రూ. రహాటము, రహత్, రాటు[3] వి. రాత్, నీళ్ళు తోడే మరచక్రం.

హిం. రహాట్. రాట్నం.

<హిం. రహాట్.

**రహటము** రూ.చూ. రహట్. వి. ఘటయంత్రం, నూతిరాట్నం గిరక.

**రహటు** వి. రట్టు.

**రహత్** రూ చూ. రహట్. వి. రాత్, నీళ్ళుతోడే మరచక్రం.

**రహదారి** రూ. రహదారీ, రాదారి, రాధారీ, రాహదారీ. వి. **1**. స్వేచ్ఛగాఅందరు పోదగినదారి ; **2.** పాస్‌పోర్టు : **3.** మార్గం ; **4.** పర్మిట్టు ; **5.** లైసెన్సు.

హిం. ఉ. పార. రాహ్-దారీ. శిస్తువసూళ్ళకు సంబంధించిన ఒక అధికార విభాగం, దక్షినీభాషలో ఈ పదానికి గైడు, పాస్‌పోర్టు, వారంటు, పర్మిటుఅనే అర్థాలు ఏర్పడ్డాయి.

క. రహదారి, రాదారి ; త. రహదారి : మ. రహదారి.

<ఉ. రాహ్-దారీ.

**రహదారీ** రూ.చూ. రహదారి. వి. **1**. పాస్‌పోర్టు ; **2.** మార్గం ; **3.** పర్మిట్టు ; **4** లైసెన్సు.

**రహదారీపడవ** వి. ప్రయాణీకుల పడవ.

**రహి.** వి. **1.** ఆనందం, సంతోషం. విక్ర. 2 77 ; **2.** లాగు. పారి. 2.102 ; **3.** రక్తి. మను. 2.43 ; **4.** ఆసక్తి ; ఆము **1.33** ; **5.** విలాసం. ఆము. 2.20 ; **6**. అందం. ఆము. 5.121 ; 7. ప్రేమ, అనురాగం. ఆము. 6.128 ; **8**. ప్రసిద్ధి, కీర్తి. రామాభ్యు 1 64 ; 9. ఉల్లాసం, మనోవికాసం. వసు. **4.73 ; 10** కాంతి, శోభ. వసు. **4.125** ; **11**. సత్త్వం. బలం. రాఘవ. 4.163 ; **12**. పోలిక, సాదృశ్యం. ఇందు. **1.45** ; **13**. విధం ; రీతి. ఉ.రా. 2.42 ; **14**. ఉత్కర్ష, అతిశయం.

**రహించు** రూ. రహియించు. స.క్రి. **1**. వర్ధిల్లచేయు. రాజ వా. **4.63** ; **2**. పొందు. ఉరా. 1.2 ; అ.క్రి. **1**. వర్ధిల్లు, పెరుగు. ఉ.రా. 1.131 ; **2.** ఒప్పు, శోభిల్లు. దశా. 2.308. **రహియించు** రూ.చూ. రహించు. అ.క్రి. **1**. వర్ధిల్లు, పెరుగు ; **2**. ఒప్పు, శోభిల్లు ; స.క్రి. **1**. వర్ధిల్ల చేయు ; **2**. పొందు.

**రహితు** రూ.చూ. రైతు. వి. పంటకాపు.

**రహీ** వి. సేవకుడు. రంగా. చ. 2.88.

ఉ. రహీ. సేవకుడు, గులాం.

<ఉ. రహీ.

**రా**[1] చూ. వచ్చు.

**రా**[2] రూ. రాచ. వి. వృత్తిలో రాచశబ్దంలోని 'చ' వర్ణం విభాషగా లోపించగా మిగిలినరూపం. శృం.నై. 5.118.

**రాకట్టు**[2] వి. రాజశాసనం, శాసనం. దశా. 2.112. **రాకుటి** వి. రాజకుటీరం. సం. కుటీ. ఇల్లు. కుటీరం. **రాకుమారి** వి. రాజపుత్రిక. సం. కుమారీ. పుత్రిక. **రాకులము** వి. రాజకులం. **రాకొమరుఁడు** రూ. రాచకొమరుఁడు. వి. రాజకుమారుడు ; రాచబిడ్డడు. భార. విరా. 1.173. <రా[2] + కొమరుఁడు. **రాకొమ్మ** వి. రాజుభార్య. అచ్చ. రా. కిష్కి 90. **రాగుత్తి** వి. పూగుత్తి. **రాచందము** వి. రాజువిధం, **రాచిలుక** రూ. రాచిల్క. వి. రాజకీరం. శ్రేష్ఠమైన చిలుక. కు.సం. 3.72. **రాచిలుకజక్కిజోదు** రూ. రాచిల్కజక్కిజోదు. వి. మన్మథుడు, శుకవాహనుడు. **రాచిలుకదొర** రూ.చూ. రాచిల్కదొర. వి, మన్మథుడు, శుకవాహనుడు. **రాచిలుకనెక్కురౌతు** రూ. రాచిల్క నెక్కురౌతు. వి. మన్మథుడు, శుకవాహనుడు. **రాచిల్క** రూ.చూ. రాచిలుక. వి. రాజకీరం, శ్రేష్ఠమైన చిల్క. భార. ఆను. 1.181. **రాచిల్కజక్కిజోదు** రూ.చూ. రాచిలుక జక్కిజోదు. వి. మన్మథుడు, శుకవాహనుడు. **రాచిల్కదొర** రూ. రాచిలుకదొర. వి. మన్మథుడు. రాజవా. 3.76. **రాచిల్కనెక్కురౌతు** రూ.చూ. రాచిలుక నెక్కురౌతు. వి. మన్మథుడు, శుకవాహనుడు. **రాచూలి** వి. రాజకుమారుడు. భార. ద్రోణ. 2.322. **రాతబిసి** వి. రాజర్షి, విశ్వామిత్రుడు. యయా. 3.4 **రానిరాబారి** వి. రాజర్షి, విశ్వామిత్రుడు. అచ్చ. రా. బాల. 17. **రాపట్టి** వి. రాజకుమారుడు. రాజనా. **4.22.** **రాపులుఁగు** రూ. రాఁబులుగు. వి. **1**. కంకం, రాబందు, రాజబందు. భార. స్త్రీ. 2.9 ; **2**. జటాయువు. **రాబోఁడి** వి. రాజస్త్రీ, రాణి. **రాముని** వి. రాజర్షి, విశ్వామిత్రుడు. చంహరా. 2.68. **రాములక** రూ. రాములుక. వి. సర్పాక్షి. ఆం.భా. 2.59. **రాములుక** రూ.చూ. రాములక. వి. నేలములక. నృశి. **రాఁబులుగు** రూ.చూ.

రాపులుగు. వి. **1.** కంకపక్షి ; **2.** జటాయువు. రాయంచ (-అంచ[2]) వి. కాళ్ళు ముక్కు ఎర్రగాఉండే తెల్లజాతిహంస. కు.సం. 3.74. భార. కర్ణ. 2.65. రాయంచగిండి వి. రాయంచలా ఉండే గిండి. జారి. దశా. 7.279. రాయంచ జక్కిజోదు వి. బ్రహ్మ, హంసవాహనుడు. రాయంచజోదు వి. బ్రహ్మ. హంసవాహనుడు. రాయంచబోదలనెలయించు స.క్రి. వెన్నంటుతుండగా తప్పుదారుల్ని పట్టించటానికి అటూ ఇటూ తిరుగు. పారి 1.106. రాయంచవార్వంపుజోదు వి. బ్రహ్మ, హంసవాహనుడు. రారాజు వి. **1.** దుర్యోధనుడు. భార. విరా. 5.196 ; **2** కుబేరుడు హర. 5.43 **3.** రాజులకురాజు, చక్రవర్తి, సార్వభౌముడు. రాఱేఁడు వి. **1.** రాజులకురాజు, చక్రవర్తి. యయా. 5.152 ; **2.** కుబేరుడు ; **3.** దుర్యోధనుడు. రాసాని వి. రాజుభార్య, రాణి. రాజ. వి. 2.59. రాసిరి వి. రాజ్యలక్ష్మి. చెన్నబసవ. 5.347.

రా[3] వి. చంద్రుడు. ఇందు. 3.65

సం. రాజన్. చంద్రుడు.

<సం. రాజన్.

రారేక రూ. రారేకు. వి. **1.** చంద్రరేఖ. ఇందు. 2.141 ; **2.** పిల్లల ఒకరకం నగ. రారేకు రూ.చూ. రారేక. వి. **1.** చంద్రరేఖ ; **2.** ఒకరకం పిల్లలనగ.

రా[4] రూ.చూ. రాయి. వి. శిల, పాషాణం. కు.సం. 8.135.

రాకట్టు[1] రూ. రాకట్టు. వి. శిలారత్నాది నిబద్ధభూమి. నెలకట్టు, కుట్టిమం, గౌ.హరి.పూ. 1691పం.; విణ. రత్నఖచితం, మణులు చెక్కేటి. ధనా. 3.37, హంస. 5.356, రాకొట్టు[1] వి. రాళ్ళు నింపిన కొట్టు, <రాయి+కొట్టు[2]. రాగంట్లమారి వి. పోకిరి. హంస. 5 126. రాగుండియ రూ.చూ. రాగుండియ వి. రాతివంటి గుండె, కఠిన హృదయం. రాగుండె రూ.చూ. రాగుండియ. వి. రాతి లాంటి గుండె, కఠినహృదయం. రాచక్కి వి. రాతిప్రదేశం. శరాహ. 6.87. రాచట్టు వి. చట్టురాయి, భూమగ్నశిల, చట్టు. భీమ 2.153. రాతనము వి. శిలాతత్వం, రాతితనం. ఉ.రా. 2 159. రాదివె వి. రాతిలో నిర్మించపబడిన దీపస్తంభం. ద.హిం.శా. సంపు. 6.శా.సం. 98. క్రీ.శ. 1131. రానారగొను వి. అసాధ్యకార్యాల్ని నెరవేర్చేవాడు (నిరసనార్థంలో). కు.సం. 8.135 ; స.క్రి. రాతిలో నారతీయు రానారమొలువనేర్చు స.క్రి. అసాధ్య కార్యాల్ని చేయు. (నిరసనార్థంలో). పండి. చ. 1.2.359. రాపడు[1] రూ. రావడు. అ.క్రి. **1.** దృఢపడు, గట్టిపడు. భాస్క. రా.యు. 272 ; **2** రాయగు, కాయలాఅగు. ఉ.హరి. 1.131 ; **3.** బ్రూన్పడు. దుఃఖించు. వసు. 5.14. రాపువ్వు రూ.చూ. రాపూవు. వి. రాతిపువ్వు, శిలాజిత్తు. రాపూవు రూ. రాపువ్వు. వి. అశ్మపుష్పం, రాతిపువ్వు, శిలాజిత్తు. ఆం. భా. 2.64. రాపెట్టు స. క్రి. పీడించు. రాపొడి వి. అకురాయి మొ. వాటితో రాసిన బంగారం మొ. వాటి పొడి. మను. 2.30. రాప్రతిమ చక్కిలిగింతలు వి.బ.వ. వ్యర్థ ప్రయత్నాలు. రావడు(-పడు) రూ.చూ. రాపడు. అ.క్రి. రాయిఅగు, జడుడగు.

రాక[1] చూ. వచ్చు.

రాక[2] రూ.చూ. రేక[1]. వి. పంగగా ఉన్న ఒసికర్రల మీద పొడుగ్గా పరిచిన కర్ర.

రాకబద్ద రూ.చూ. లాకబద్ద. వి. పంగగా ఉన్న ఒసికర్రల మీద పొడుగ్గా పరిచిన కర్ర.

రాకచిక్కు చూ. వచ్చు.

రాకడ చూ. వచ్చు.

రాకపోక చూ. వచ్చు.

రాకపోకలు చూ. వచ్చు

రాకయుండు చూ. వచ్చు

రాకాసి రూ.చూ. రక్కసి. వి. రాక్షసి. కాశీ. 2.49.

రాకాసిగడ్డి రూ. రాగిసగడ్డి. వి. ఆఫ్రికానుంచి తెచ్చి పశువుల మేత కోసం పైరు చేయబడుతున్న గడ్డిమొక్క (pennisetum dandesfinum). రాకాసిగుళ్ళు వి.బ.వ. పూర్వం మృతకళేబరాలకు చేసిన భూస్థాపనాలు ఇవి కందుకూరు, కనిగిరి తాలూకాల్లో అక్కడక్కడ ఉన్నాయి. స్థానికులు పూర్వకాలం రాక్షసులు తవన్ను చేసుకొనే మందిరాలనే నమ్మకంతో పై పేరుతో పిలుస్తున్నారు. కాని ఇవి పూర్వుల మృతకళేబరాల నుంచిన స్థలాలని చరిత్ర పరిశోధకుల అభిప్రాయం. రాకాసిప్రోలు వి. లంక, రాక్షస పట్టణం. యయా. 3.37. రాకాసిబుద్ధులు వి బ.వ. పాడుబుద్ధులు. రాకాసిబొగ్గు వి. భూగర్భం నుంచి తవ్వి తీసిన బొగ్గు. రాకాసిములికి రూ. రాకాసిముల్కి. వి. అసురాస్త్రం. అచ్చ. రా. యు. 378. రాకాసిముల్కి రూ.చూ. రాకాసి ములికి. వి. అసురాస్త్రం. రాకాసులయొజ్జ కూఁతురు వి. దేవయాని, రాక్షసగురువు కుమార్తె.

రాకాసులయొజ్జ కూఁతురు చూ. రాకాసి.

రాకించు స.క్రి. మోదు, చిదక్కొట్టు. భీమ. 2.153.

రాకిడి రూ. రాకిటి, రాగిటి, రాగిడి[1]. వి. స్త్రీ శిరోభూషణ విశేషం, జడబిళ్ళ. వేంక. మా. 11.80, ద్వి. సార. చ. 1.258 పం.

సం. రాగిన్. ఎర్రనిది, ఆనందింప చేసేది.

రాకిటి రూ.చూ. రాకిడి. వి. స్త్రీలు తలలమీద పెట్టకొనే నగ, రాకిపున్నమ రూ.చూ. రాకీపున్నమ. వి. శ్రావణ పౌర్ణమి నేతపనివాళ్ళు ముఖ్యంగా చేసుకొనే పండుగ.

రాకీఅంచు వి. బిళ్ళలు బిళ్ళలుగా డిజైను పెట్టి నేసిన ఒకరకం అంచు.

హిం. రాఖీ. రక్షాబంధం.

<హిం. రాఖీ+అంచు.[3]

రాకీపున్నమ చూ. రాఖీ. రూ. రాకిపున్నమ, రాకిపున్నమ. వి. శ్రావణపౌర్ణమి, నేతపనివాళ్ళు ముఖ్యంగా చేసుకొనే పండుగ.

రాకిలపున్నమ వి. శ్రావణ పూర్ణిమ, నేతపనివాళ్ళు ముఖ్యంగా చేసుకొనే పండుగ.

రాకు[1] చూ. వచ్చు.

రాకు[2] స.క్రి. రూడతో చదునుచేయు.

రాకెటు రూ. రాకెట్టు, వి. ఆకాశబాణం, రోదసీ నౌకలు మొ. వాటిని నింగికి పంపే సాధన విశేషం.

<ఇం. *Rocket.*

రాకెటుమగ్గం వి. ఒకరకం మరమగ్గం, మగ్గం చట్రం నిలువులకు రాకెట్టు మాదిరి, గొళ్ళేలకమ్మి అమర్చిన మగ్గం.

<ఇం. రాకెటు+మగ్గము.

**రాకెట్టు** రూ.చూ. రాకెటు. వి. ఆకాశబాణం, రోదసీ నౌకలు మొ. వాటిని ఆకాశంలోకి పంపే సాధన విశేషం.

**రాకెట్టు**[2] చూ. వచ్చు.

**రాకొను** చూ. వచ్చు.

**రాక్కోల** చూ. రాగి.[2]

**రాక్షసిబొగ్గు** వి. భూగర్భం నుంచి తవ్వి తీసిన బొగ్గు.

నం. రాక్షసి. రాక్షసజాతి స్త్రీ.

<నం. రాక్షసీ+బొగ్గు.

**రాక్షసుడు** వి. 1. క్రూరుడు, కఠినాత్ముడు; 2. చెడ్డవాడు.

నం. రాక్షస-.జాతివాచకశబ్దం, దితికుమారులు.

<నం. రాక్షస-(అర్థవిపరి.).

**రాఖా** వి. రక్షానంబంధమయిన. విశ్వే. శ.

హిం.ఉ. రాఖా. రక్షానంబంధమైనది.

< హిం. రాఖా.

**రాఖిమ్** వి. లేఖకుడు. ఘంటికోటకానసములు పు.7.

హిం. రాకిమ్. లేఖకుడు. వకీలుదగ్గర ఉండే గుమాస్తా; ఉ. పార. అర. రాకిమ్. లేఖకుడు. లేఖనం.

<ఉ. రాకిమ్.

**రాఖీ** వి. రక్షాబంధనం.

నం. రక్షా. రక్షణ, కాపు; ప్రా.పా. రక్ఖా; బెం. గు. బీ. హిం. రాఖీ; పం. రక్ఖిఆ; సిం. రఖ్.

<హిం. రాఖీ.

**రాగ** రూ.చూ. బాగ. వి.1. దుష్టుడు; 2. జారిణి; క్రి.విఔ. గయ్యాళి, దుష్టురాలు.

**రాగతనము** రూ.చూ. బాగతనము. వి. మాత్సర్యం. అప్ప. 2.39. **రాగతుంగ** వి. భద్రముస్తకం (ఒకరకంగడ్డి).

**రాగకాకు** వి. నంగీతంలో ఒకస్వరస్థాయి. బసవ. 3.940 పం.

నం. రాగ-.అనురాగం, కాకు-.ఒకరకం స్వరం.

<నం. రాగకాకు-(అర్థవిపరి.).

**రాగటి** రూ.చూ. రేగడు. వి 1. జిగురుమట్టి; 2. జిగురు మట్టినేల.

**రాగడి** రూ.చూ. రేగడు. వి. 1. నల్లమట్టినేల, సారవంతమైన నేల. పత్తి, తెల్లజొన్న, దనియాలు, కొమ్ముసెనగ మొ॥ పంటలకు శ్రేష్ఠమైన నేల; 2. జిగురు మట్టి.

**రాగడిమన్ను** వి. జిగురుగా ఉండే నల్లమట్టి.

**రాగమంజరి** వి. ఒకానొక రాగం, ఎనిమిది పురుషరాగాల్లో ఒకటి. హంస. 5.123.

నం. రాగమంజరీ. అనురాగపు పూలగుత్తి.

<నం. రాగమంజరీ (అర్థవిపరి.).

**రాగరాయి** రూ. రాగటాయి. వి. తిరగలి, రాగినకల్లు.

**రాగటాయి** రూ.చూ. రాగరాయి. వి. తిరగలి.

**రాగలకట్టె** రూ.చూ. రాగోలకట్టె. వి. 1. నరిచేయటానికి చాపిన ఉన్ని పరుగులో చివర దూర్చిన తలపోలను మోయటానికి ఆధారంగా నేలలో పాతిన పంగల కొయ్య; 2. కంపను నెట్టటానికి కట్టటానికి ఉపయోగించే ఒక చివర పంగలున్న పొడవైన గట్టి కర్ర.

**రాగవుడు** వి. 1. శ్రీరాముడు. అచ్చ. రా. బాల. 192; 2. రఘువంశోద్భవుడు. అచ్చ. రా. అరణ్య. 2.

నం. రాఘవ-.రఘువంశనంబంధి, శ్రీరాముడు; ప్రా. శౌ. రాహవ-.

<నం. రాఘవ-.

**రాగాకు** చూ. రాగి[3].

**రాగాపాగా** చూ. వచ్చు.

**రాగాల** రూ.చూ. రాగోల. వి. ఆముకాల్వకు ముళ్ళకంపల్ని తీసుకొని రావటానికి ఉపయోగించే పంగల కర్ర.

**రాగాలకట్టె** రూ.చూ. రాగోల కట్టె. వి. చివర పంగలున్న పొడుగాటి కర్ర. **రాగాలకర్ర** రూ.చూ. రాగోలు కర్ర. వి. చివర పంగలున్న పొడుగాటికర్ర. **రాగాలకొమ్మ** రూ.చూ. రాగోల కొమ్మ. వి పంగలకర్ర మాదిరి కొనలు క్రమంగా దూరమైన కొమ్మ. రాగోలపన. **రాగాలచెట్టు** వి. ఇసుక నేలల్లో ఉప్పునీరుగాని. ఉప్పు నీటిగాలిగాని బాగా తగిలే ప్రదేశాల్లో. నిటారుగా 50 అడుగుల ఎత్తువరకు పెరిగే చెట్టు.

**రాగాలపెట్టె** వి. 1. హార్మోనియం; 2. గ్రామఫోను.

నం. రాగ-. నంగీతంలో భైరవాదిరాగం.

<నం. రాగ- + -ము + -లు + -అ[13] + పెట్టె.

**రాగావళిచీర** వి. ఒకరకం గడిచీర.

సం. రాగావళి-. రాగాలవరుస.

<నం. రాగావళి- + చీర.

**రాగి**[1] వి. 1. తామ్రం, పంచలోహాల్లోఒకటి. ద.హిం. శా. నంపు. 7. శా. నం. 734. క్రి.శ. 1228, భార. భీష్మ. 1.36; 2. ఎరుపు, రక్తవర్ణం. సారంగ. 3.28; విఔ. 1. తామ్రంతోచేసినది; 2. రాగిలా ఎర్రని వర్ణం కలది.

నం. రాగిన్. ఎర్రనిది.

<నం. రాగిన్ (అర్థవిపరి.).

**రాగిజుట్టు పిట్ట** వి. కోడి, తామ్రచూడం. అచ్చ.రా. యు 208. **రాగితీగలు** వి బ.వ. ఒకరకం వడ్లు. **రాగిదేలు** (-తేలు. అ.క్రి. ఎరుపెక్కు. పాండు. 3.182.

**రాగి**[2] వి. 1. సస్యవిశేషం. చోళ్ళు. తవిదపైరు. శుక. 2.335 (Cynosurus Coracanus).

క. రాగి; కొడ. ఎరి; తు. రాగి; త. ఇరాకి; మ. రాగి, ఊయి; తొ. ఇరక్వ;

పో.చూ. నం. రాగ-, రాగిన్.

**రాక్కోల** రూ.చూ. రాగికోల. వి. 1. వరితెగులు; 2. దుంప ఎండిపోయి వట్టి కంకి ఏర్పడే దుంప తెగులు. **రాగికోల** రూ. రాక్కోల, రాగికోలు, రాయికోలు. వి. 1. వరితెగులు; 2. దుంప ఎండిపోయి వట్టి కంకి ఏర్పడే దుంప తెగులు. **రాగికోలు** రూ.చూ. రాగికోల. వి. 1. వరితెగులు; 2. దుంప ఎండిపోయి వట్టి కంకి ఏర్పడే దుంప తెగులు. **రాగిగంజి** రూ. రాగ్గంజి. వి. తైదలగంజి రాగులు పిండికొట్టి కాచినగంజి. **రాగిసుబ్బు** వి. రాగిక

కుల్చి కళ్ళంలో తొక్కించినప్పుడు వచ్చే నన్నని నుసి. రాగిముచ్చు వి. రాగి తెగులు, చీడపురుగుల (aphidsormifes) వల్లకాడ ఎఱ్ఱబడే తెగులు. రాగసంకటి వి. వండిన రాగిపిండిముద్ద. శుక. 2.335. రాగిసరి వి. రాగులు పిండి కొట్టి కాచిన గంజి. రాగులు వి.బ.వ. తవిదలు, ధాన్యవిశేషం. < రాగి[2] + -లు. రాగ్గంజి రూ. చూ. రాగిగంజి. వి. తైదల గంజి, రాగులు పిండికొట్టి కాచినగంజి.

రాగి[3] రూ.చూ. రావి. వి. రావిచెట్టు.

రాగాకు వి. చెవికి పెట్టుకొనే కమ్మ. < రాగి[3] + ఆకు. రాగికమాను వి. మధ్యభాగం గుమ్మటంలాగా ఉండి పై చివర మొనదేలి ఉండే అర్చి. రాగిచెట్టు రూ. రావిచెట్టు. వి. పిప్పలం, రావిచెట్టు (Ficus religious).

రాగించు అ.క్రి. 1. సంతోషించు. నిర్వ. రా. 6 ; 2. ప్రకాశించు ; 3. గర్వోక్తులు పలుకు

సం. రాగ -. రంగు. రంగువేయటం, ఎరుపు, వలపు, ప్రీతి.

< సం రాగ- + -ఇంచు[3]. (అర్థవిపరి.).

రాగిటి రూ.చూ. రాకిడి. వి. స్త్రీల శిరోభూషణం.

రాగిటినాగలి చూ. రాగిడి[2].

రాగిడి[1] రూ.చూ. రాకిడి. వి. శిరోభూషణం, జడబిళ్ళ.

రాగిడి[2] రూ.చూ. రేగడు. వి. జిగురుగల నల్లమట్టి. పెంకు, ఇటిక తయారీకి పనికివచ్చే నల్లమట్టి.

రాగిటినాగలి వి. రేగడినేలలు దున్నే మెట్టనాగలి.

< రాగిడి[2] + -ఇ[6] + నాఁగలి.

రాగినకల్లు వి. తిరగలి, విసర్రాయి, రటాటి, రాగరాయి.

రాగిలు రూ.చూ. రాగిల్లు. అ.క్రి. 1. సంతోషించు. భార. శాంతి. 2.395 ; 2. అనురాగం కలిగిఉండు. రం. రా. కిష్కిం. 223 పు 20పం ; 2. గర్వోక్తులు పలుకు. రం. రా.యు. 282పు 19పం ; 4. ప్రకాశించు. విప్ర. 3.60 ; 5 అరితేరు.

రాగిల్లు రూ. రాగిలు. అ.క్రి. 1. సంతోషించు. నిర్వ. రా. 2.34 ; 2. ప్రకాశించు ; 3. గర్వోక్తులు పలుకు.

సం. రాగ -. రంగువేయటం, రంగు, ఎరుపు, వలపు, ప్రీతి.

రాగిసగడ్డి రూ.చూ. రాకాసిగడ్డి. వి. ఆఫ్రికానుండి. తెచ్చి పశువుల మేతకోసం పైరు చేస్తున్న గడ్డిమొక్క (Pennisetumclandrfinum).

రాగిసె చూ. రేవన. వి. ఒకరకం కలుపుమొక్క (Arthraxon lancedafus).

రాగుంజు పోగుంజులాట చూ. వచ్చు.

రాగులు చూ. రాగి[2].

రాగె వి. రికాబు, గుర్రం ఎక్కటానికి పక్కన తాడుతో ఏర్పరచిన మెట్టు. ద్విపరమ. వి. 2.82పు.

రాగేలకట్టె రూ.చూ. రాగోల కట్టె. వి. చివర పంగలున్న పొడుగాటి కర్ర.

రాగేలుకట్టె రూ.చూ. రాగోలకట్టె. వి. చివర పంగలున్న పొడుగాటికర్ర.

రాగోల రూ. రాగాల, రాగోలు2, రోగాల, రోగోలు. వి. 1. రాతి పొరలు లేవగొట్టటానికి పనికి వచ్చే పంగల కర్ర ; 2. ఆముకాల్చులో ముళ్ళ కంపలు వేయటానికి ఉపయోగించే పంగల కర్ర.

రాగోలకట్టె రూ. రాగలకట్టె, రాగేలకట్టె రాగేలుకట్టె, రాగోలుకట్టె. వి. చివర పంగలున్న పొడుగాటి కర్ర. రాగోలకొమ్ము రూ. రాగాలకొమ్ము. వి. పంగలకర్ర మాదిరి కొనలు క్రమంగా దూరమైన కొమ్ము. రాగోలవన. రాగోలవన వి. పంగల కర్రమాదిరి కొనలు క్రమంగా దూరమైన కొమ్ములు.

రాగోలు[1] వి. ముదరగాకాలి నల్లబడిన ఇటిక.

రాగోలు[2] రూ.చూ. రాగోల. వి. ఆముకాల్చులో ముళ్ళకంపలు వేయటానికి ఉపయోగించే పంగలకర్ర.

రాగోలుకట్టె రూ చూ. రాగోలకట్టె. వి. చివర పంగలున్న పొడుగాటి కర్ర. రాగోలుకర్ర రూ. రాగాలకర్ర. వి. ఆముకాల్చుకు ముళ్ళ కంపల్ని తేవటానికి ఉపయోగించే పంగల కర్ర.

రాగ్గంజి చూ. రాగి2.

రాంకలర్ రూ.చూ. రామకలరు. వి. 1. ముదురు నీలం రంగు ; 2. పచ్చపయిలెట్ కలిసిన రంగు ; 3. ఒకరకం నీలంరంగు.

రాంగు వి. తప్పు, అక్రమం.

ఇం. *wrong*. తప్పు.

< ఇం. wrong.

రాఁగ రూ.చూ. జాఁగ. వి. 1. జాణ. నిపుణురాలు. తాళ్ల. సం. 17.534.

రాఁగజేయు (-చేయు) స.క్రి. అల్లరిచేయు. తాళ్ల. సం. 13.22. రాఁగతనము రూ.చూ. జాఁగతనము. విశ. అల్లరి. తాళ్ల. సం. 16.2.89.

రాఁగలతటి చూ.వచ్చు.

రాఁగలపంట చూ.వచ్చు.

రాఁగలపని చూ.వచ్చు.

రాఁగు అ.క్రి. అనురాగం, పొందు. తాళ్ల. సం. 17.312.

సం. రాగ -. అనురాగం, ప్రీతి, వలపు.

< సం. రాగ –.

రాచ - రూ.రా2. విశ. రాజసంబంధి, సమానపూర్వావయవం గానే ఇది ప్రయుక్తం. E. I. సంపు 30, 69–71 పు. క్రీ.శ. 699–700.

సం. రాజన్-. రాజసంబంధి ; ప్రా. రాచ-, రాయ-, రాచా, రాచి ; మా. రాయ.

క. అరసు ; కొడ. రాజో ; త. రచన్, ఇరాచన్ ; తుళు. రాజ ; కువి. రాజ. రాజ్యం.

< ప్రా. రాచ-.

రాచఆయము వి. ప్రభుత్వానికి చెల్లించవలసిన పన్ను. ద.హిం.శా. సంపు. 5. శా.సం. 114. రాచఊళ్ళు వి.బ.వ. ప్రభువు సొంతగ్రామాలు. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 563. క్రీ.శ. 1390. రాచకందు వి. రాజకుమారుడు. అచ్చ. రా. అయోధ్యా. 93. రాచకురుపు రూ.చూ. రాచకుఱుపు. వి. ప్రాణాంతకంగా వీపుమీద లేచే పెద్దకురుపు. రాచకుఱుపు

రూ. రాచకురుపు. వి. జల్లెడకురుపు, ప్రాణాంతకంగా వీపు మీద లేచే పెద్ద కురుపు. **రాచకూఁతురు** వి. రాజకన్య. భార. ఆది. 3.148. **రాచకొడుకు** వి. రాజకుమారుడు. భార.ఆది. 5.207. **రాచకొడుక్కులు** వి.బ.వ. రాజకుటుంబంలోనివారు. ద.హిం శా. సంపు. 6. శా.సం. 639. క్రీ.శ. 1147. **రాచకొమరుఁడు** రూ.చూ. రాకొమరుఁడు. వి. రాజపుత్రుడు. **రాచకొలము** వి. క్షత్రియకులం. రాజవంశం. భార.ఆది. 4.47. **రాచకోడి** వి. ఒకరకం కోడి. **రాచగాటె** వి. రాజఘట్టం, ప్రభుత్వపు సుంకం మొ.వి వసూలుచేసే స్థలం. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 56. క్రీ.శ. 1391. **రాచగుమ్మడి** రూ. రాచగుమ్మిడి, రానగుమ్మడి. వి. 1. బూడిదగుమ్మడి; 2. మంచి గుమ్మడిలో చిన్నరకం కాయ. **రాచగుమ్మిడి** రూ.చూ. రాచ గుమ్మడి. వి. 1. బూడిదగుమ్మడి ; 2. మంచిగుమ్మడిలో ఒక రకం కాయ. **రాచగురుదేవర** వి. ప్రభువువారి గురువు. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 396. క్రీ.శ. 1261. **రాచచేను** వి. రాచపొలం. E.I. సంపు. 27. మొదటి అమ్మరాజు చెరువు శాసనం. **రాచజడదారి** వి. 1. రాజర్షి ; 2. విశ్వామిత్రుడు. **రాచజాబిలి** వి. రాజచంద్రుడు. రాజశ్రేష్ఠుడు. నీలా. 1 43. **రాచజిల్లేడు** వి. రాజార్కం. కాష్ఠీలం, **రాచతండరి** వి. ఒక పదవీ విశేషం. ద.హిం.శా. సం.పు. 5. శా.సం. 1056. క్రీ.శ. 1132. **రాచదండము** వి. రాజశిక్ష. H.A.S. సంపు. 19.55. క్రీ.శ. 1330. **రాచదారి** వి. రాజమార్గం, రాచబాట. అచ్చ.రా.బాల. 34. **రాచధర్మువు** వి. ప్రభువు చేసిన ధర్మం. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 702. క్రీ.శ. 1149. **రాచనగరు** వి. రాజ సంబంధమైన గృహం. మను. 3.129. **రాచనెలవు** వి. రాజధాని. రాజు నివసించే చోటు. యయా. 1.19. **రాచపగ** వి. 1. రాజశత్రువు. యయా. 3.13 ; 2. క్షత్రియుడు వహించే విరోధం. **రాచపగనేలనేలుపు** వి. పరశురాముడు, రాజవైరంకల భూదేవుడు. **రాచపట్టి** వి. రాజపుత్రుడు. రాఘవ. 2.109. **రాచపడిహస్త** వి. రాజప్రతినిధి. ద.హిం.శా.సంపు. 5. శా.సం. 1052. క్రీ.శ. 1133. **రాచపదవి** వి. రాజ సంబంధమైన ఉన్నతస్థితి. దశకు 1.21. **రాచపాడి** వి. రాజధర్మం. హరి.ఉ. 6,149. **రాచపుట్టువు** వి. క్షత్రియుడు. శృం.నై. 3.32. **రాచపుండు** వి. రాజవ్రణం. ఆం.భా. 2.130. **రాచపొలము** వి. ప్రభుత్వానికి చెందిన భూమి. తె.శా.కా.శా. 50. క్రీ.శ. 1311. **రాచబాట** వి. రాజమార్గం, రహదారి. **రాచబాఁపడు** వి. విశ్వామిత్రుడు. ఉ. హరిశ్చ 4.167. **రాచబిడ్డ** వి. రాజకుమారుడు. **రాచభాగము** వి. రాజునకు లేదా ప్రభుత్వానికి రావలసిన భాగం నె.శా. ఒంగోలు. 79. **రాచమంగలి** వి. రాజు కొలువులో ఉండే మంగలి. ద.హిం.శా. సంపు. 5 శా.నం. 1009. క్రీ.శ. 1127. **రాచమఅంది** వి. రాజశ్యాలకుడు. ద.హిం.శా.సంపు. 10. శా.నం. 707. క్రీ.శ. 1153 **రాచమాట** వి. మంచి పలుకు. భార.విరా. 2.204. **రాచమానంబు** వి. సర్కారు కొలత. E.I సంపు. 27. 228–229 పు. క్రీ.శ. 600–625. **రాచమామిడి** వి. రాజామ్రము, మామిడిపళ్ళల్లో ఒక రకం. **రాచయీవి(-ఈవి)** వి. రాజులు చేసే దానం. గౌ. హరి. పూ. 1405 పం. **రాచయుసిరిక(-ఉసిరిక)** వి. ఒక రకం ఉసిరి. **రాచయేనుఁగు(-ఏనుఁగు)** వి. విజయకుంజరం. **రాచరికము** రూ. చూ. రాచర్కము. వి. ప్రభుత్వం. **రాచర్కము** రూ. రాచరికము, రాచఱికము. వి. 1. క్షత్రియ తత్త్వం. నిర్వ రా. 1.64; 2. రాజత్వం, రాజధర్మం. **రాచఱికము** రూ.చూ. రాచర్కము. వి. 1. రాజత్వం, రాజధర్మం. వరాహ. 11,14 : 2. క్షత్త్రియత్వం. దశకు. 3.7. **రాచవన్నెలు** వి బ.వ. ధాన్యవిశేషం. ప్రబంధ. 112. **రాచవాఁడు** విణ. 1 రాజు, పాలకుడు. శృం.నై. 1.32 ; 2. క్షత్త్రియుడు. శృం.నై. 1.95; 3. రాజబంధువు. మను. 5.4. **రాచవారు** విణ బ.వ. 1. క్షత్త్రియులు. భార. ఉద్యో. 3.46 : 2. పాలకులు : 3. రాజబంధువులు. **రాచవీడు** వి. రాజధాని. క్రీడా. పీఠి. 60. **రాచవీథి** వి. రాజ సంబంధమైన వీథి. యయా. 4.155. **రాచవెట్టి** వి. రాజులకు చేసే చాకిరి. బ.స.వ. 3.59. **రాచవేఁట** వి. క్షత్త్రియుల వేట, క్షత్త్రియ సంహారం. భాగ. 10పూ. 377. **రాచవేల్పు** వి. రాజశ్రేష్ఠుడు. యయా. 5.149. **రాచసింగము** వి. రాజసింహం. రాజశ్రేష్ఠుడు. భోగినీ, సీలా. 1.36 **రాచసిరి** వి. రాజ్యసంపద, రాజ్యలక్ష్మి. భార. ఉద్యో. 3.366. **రాచసుడి** వి. 1. ముచ్చెలగుంటలో ఉండే సుడి ; 2. వీపుమీద మూపురానికి అంగుళం వెనుక భాగంలో ఉండే సుడి.

**రాచిమకుపోచినుకు** చూ. పచ్చు.

**రాచిరంపమునపెట్టు** చూ. రాచు.

**రాచిరంపానపెట్టు** చూ. రాచు.

**రాచీనామా** రూ.చూ. రాజీనామా. వి. విడుదల చీటి.

**రాచు** చూ. అరయు. రూ. రాచు. స.క్రి. 1. విచారణ చేయు. కు.సం. 3.74 ; 2. అరగదీయు. కు.సం. 5.139 ; 3. నలుచు, నలగచేయు. భార.విరా. 2.220; 4. చెరచు. నశింపచేయు. మను. 3.105 ; 5. సంఘర్షణ చేయు. యయా. 4.7 ; 6. తుడుచు. దశా. 1.84 ; అ.క్రి. 1. అతిశయించు. బసవ. 6.982 పం. ; 2. విజృంభించు, చెలరేగు. బసవ. 7.918 . 3. గీరు. కళా. 7.35.

**రాచిరంపమునపెట్టు** రూ.చూ. రాచిరంపానపెట్టు. స.క్రి. పీడించు, బాధించు. **రాచిరంపానపెట్టు** రూ. రాచిరంపమునపెట్టు. స.క్రి. మిక్కిలి కష్టపెట్టు. **రాచుకొను** అ.క్రి. ఒరసుకొను. హరి. ఉ. 7.92. స క్రి. ఒరయు, సంఘర్షణ చేయు. వల్లభా. 3.98. **రాపడు**[2] అ.క్రి రాపిడిపడు, రాపుడుపడు. వసు. 1.76. **రాపాడు** రూ. రాపాడు. అ.క్రి. ఒరయు. క్రీడా. 92. స.క్రి. 1. రాయు. భాగ. 3 415 ; 2. గానుగ తిప్పు : 3. నూరు. **రాపిడి** రూ. రాపిడి. వి. సంఘర్షణ, ఒరయిక. హర. 6.60. **రాపిడిచేయు** స.క్రి. కరసించు, రాపాడు. **రాపిడిరంపు** వి. చేత్తో అచ్చుకొట్టే అద్దకం రంగు. **రాపిడు** స.క్రి. 1. ఒత్తిడిచేయు ; 2. రాపాడు. **రాపు**[1] రూ. రాఁపు, రాపు. వి. 1. రాపిడి, సంఘర్షణ. హరి.పూ. 8.44, హర. 5 43; 2. నింద. రుక్మా. శుక. 2.144. **రాపుడు** రూ. రావడు. వి. రాయడం. **రాపుడురాయి** వి. గోడలు మొ. వి నునుపవ్వటంకోసం రాసే రాయి. **రాపుబీరాలు**

వి.బ.వ. కఠినోక్తులు. తాళ్ల.సం. 13.120. రాఁపు రూ.చూ. రాపు. వి. రాపిడి, సంఘర్షణ. తాళ్ల.సం. 15.204. రారాపొనర్చు అ.క్రి. గిల్లికజ్జాపెట్టుకొను. శుక. 3.15.

**రాచ్చసిబొగ్గు** వి. భూగర్భంనుంచి తవ్వితీసిన బొగ్గు.

**రాచ్చిప్ప** చూ. రాయి.

**రాజకాల్వ** వి. పెద్దకాలవ, ఏటినుంచి తీసిన పెద్ద కాలవ.
సం. రాజన్. రాజు.
<సం. రాజన్ + కాల్వ (మిశ్రన.).

**రాజకీయం** వి.1. కుట్ర ; 2. రహస్యాలోచన ; 3. మోసం.
సం. రాజకియ –.రాజుకు చెందిన, రాచసంబంధమైన.
<సం. రాజకీయ - (అర్థవిపరి.).

**రాజగరికెలు** రూ. రాజగర్కలు, వి.బ.వ. ఒకరకం వడ్లు.
సం. రాజన్. రాజు, ప్రభువు, క్షత్రియుడు.
<సం. రాజన్ + గరికె + -. లు. (మిశ్రన.).

**రాజగర్కలు** రూ. చూ. రాజగరికెలు. వి.బ.వ. ఒకరకం వడ్లు.

**రాజగుమ్మడి** వి. గుమ్మడిలో మంచిరకం.
సం. రాజన్. రాజు, ప్రభువు, క్షత్రియుడు.
<సం. రాజన్ + గుమ్మడి. (మిశ్రన.).

**రాజన** వి. ఒకరకం కూరాకు. భీమ. 2.56.

**రాజనము** వి. సస్యవిశేషం. కు.సం. 7.98.
సం. రాజాన్న–. రారాజులకు తగిన భోజనం.
<సం. రాజాన్న–.
రాజనములు రూ. రాజనాలు. వి.బ.వ. వడ్లలో ఒకరకం. కాశీ. 2.185. రాజసాలు రూ.చూ. రాజనములు. వి.బ.వ. ఎర్రని రంగులో ఉండే ఒకరకం వడ్లు. హంస. 4.154.

**రాజనారాయణ గద్య** వి. రాజనారాయణ బిరుదాంకితుడైన ప్రభువు వెలయించిన నాణెం. ద.హిం.శా. సంపు. 10.శా. సం. 101. క్రీ.శ. 1137.
సం. రాజనారాయణ -.ఒకరాజు బిరుదు.
<సం. రాజనారాయణ- + గద్య. (మిశ్రన.).

**రాజనారాయణవిణ్ణగరాణువారు** విఙ. బ.వ. రాజనారాయణ నామాంకిత విష్ణుదేవుడు. ద.హిం.శా. సంపు. 5.శా.సం. 81.
సం. రాజనారాయణ -.ఒకరాజు బిరుదనామం.
<సం. రాజనారాయణ + విణ్ణగరాణు + వారు. (మిశ్రన.).

**రాజనాలు** చూ. రాజనము.

**రాజబీజి** వి.1. రాచపుట్టువు ; 2. రాజబంధువు.

**రాజభోగాలు** వి.బ.వ. వడ్లలో ఒకరకం.
సం. రాజభోగ -.రాజార్హమైన భోగం.
<సం. రాజభోగ-. + -ము + -లు (అర్థవిపరి.).

**రాజమండ్రి దవ్వ** వి. రాజమండ్రి ప్రాంతం స్త్రీ, ఉత్తమ స్త్రీ, రాజమండ్రి తూర్పు గోదావరి జిల్లాలోని ప్రధాన పట్టణం.

**రాజమహేంద్రకోక** వి. ఒకరకం నేతచీర. రాజమహేంద్రమే రాజమండ్రి. రాజమండ్రిలో అమ్మబడే కోక.
<సం. రాజమహేంద్ర-. + కోక (మిశ్రన.).

**రాజమామిడి** వి. మామిడిలో ఒకరకం.
సం. రాజన్. రాజప్రభువు.
<సం. రాజన్ + మామిడి (మిశ్రన.).

**రాజమాలుపేటు** రూ.చూ. రాజమాలు పేటు. వి. అంచులో నేసే ఒకరకం డిజైను.

**రాజమాలు పేటు** రూ. రాజమాలుపేటి. వి. అంచులో నేసే ఒకరకం డిజైను.
హిం. రాజ్ మహల్. రాజభవనం.
<హిం. రాజ్‌మహల్ + పేటు.

**రాజమోహిని** వి. ఒకరకం అంచు.
సం. రాజమోహినీ. మిక్కిలి మోహింప చేసేది.
<సం. రాజమోహినీ (అర్థవిపరి.).

**రాజరాజమాడలు** వి.బ.వ. తూర్పు చాళుక్య నృపతి అయిన రాజరాజు వేయించిన నాణెం. దహిం.శా. సంపు. 10.శా.సం. 145. క్రీ.శ. 1159.
సం. రాజ రాజ -.రాజులకురాజు, ఒకతూర్పు చాళుక్య రాజు.
<సం. రాజరాజ- + మాడ + -లు. (మిశ్రన.).

**రాజసుడి** రూ. రాజుసుడి. వి. 1. ముచ్చెల గుంటలో ఉండేసుడి. 2. వీపు మీద మూపురానికి అంగుళం వెనుక భాగంలో ఉండేసుడి.
సం. రాజన్. ప్రభువు, రాజు.
<సం. రాజన్ + సుడి (మిశ్రన.).

**రాజహంస** వి. బట్టలమీద వేసే కలంకారీ అద్దకం డిజైనుల్లో, ఒకరకం.
సం. రాజహంస -.కలహంస.
<సం. రాజహంస-. (అర్థవిపరి.).
రాజహంసపేటు వి. అంచులో నేసే ఒకరకం డిజైను.

**రాజా** వి. రాజు. పద్మ. యు. 27.
హిం. ఉ. రాజా. పాదుషా. రాజు ; మరా. రాజా. రాజు, ప్రభువు.
<హిం. రాజా.
రాజకమలంపేటు వి. అంచులో నేసే తామర పువ్వ డిజైను.

**రాజాబహాదరు** వి. ఒకానొక బిరుదు. రంగా.చ. 1.116.
హిం. ఉ. బహాదూర్. పరాక్రమశాలి.

**రాజాన్నము** వి. రాజనాలు, ఆంధ్రప్రదేశంలో పండే ఒకరకం ధాన్యం.
సం. రాజాన్న -.రాజార్హమైన భోజనం.
<సం. రాజాన్న - (అర్థవిపరి.).

**రాజావళులు** వి.బ.వ. చాలా మంచిరకం పోకవక్క.
సం. రాజావళి -.రాజుల సమూహం.
<సం. రాజావళి.. + -లు (అర్థవిపరి.).

**రాజి**[1] వి. అధికారం. నె.శా. బ్రాహ్మ. 4. క్రీ.శ. 1746.
సం. రాజి -.రేఖ, వరుస, ఒకవిధమైన పాము.
<సం. రాజి -. (అర్థవిపరి.).

**రాజి**[2] రూ.చూ. రావి. రావిచెట్టు.

**రాజికము** వి. రాజ్యోపద్రవం. నె.శా. ఆత్మకూరు7. క్రీ.శ. 1246.
సం. రాజిక -.పంక్తి, వరుస, చేను.
<సం. రాజిక -.(అర్థవిపరి.).

**రాజినామా** రూ.చూ. రాజీనామా. వి. విడుదల చీటి.

**రాజీ** వి. 1. సంధి. మహిమలూరు. ప. 2 ; 2. సమ్మతి, ఇష్టం, సమాధానం.

హిం. ఉ. రాజీ. ప్రసన్నం, సంతుష్టి, అంగీకృతం ; మరా. రాజీ. సంతోషం, సంసిద్ధం ; పార. రాజీ. అంగీకారం, ఒప్పందం, సంతుష్టి.

<ఉ. రాజీ.

**రాజీనామా** రూ. రాచినామా, రాజినామా. వి. పదవీ విరమణ పత్రం.

హిం. ఉ. రాజీనామా ; పార. రాజీనామహ్. సంధి పత్రం.

<ఉ. రాజీనామా.

**రాజ్జు** వి. ప్రభువు, పురుషనామాంతంలో ఉండే బిరుదునామం. ఎర్రగుడిపాడుశాసనం. క్రీ.శ. 575, భార. అది. 5,214 ; 2. చంద్రుడు.

సం. రాజన్. రాజు, ప్రభువు.

<సం. రాజన్.

**రాజుచేతినిమ్మపండు** వి. రాజాదరణ పాత్రుడు. **రాజు బంటువాసి** వి, రాజుకూ సేవకుడికీ ఉన్నంత అంతరం, హస్తిమశకాంతరం. రాధికా. 3.141. **రాజువలచినది దేవులు** వి.బ.వ. రాజు మెచ్చిందే రంభ. తాళ్ల. సం. 7,64, **రాజునుడి** రూ.చూ. రాజనుడి. వి. 1. ముచ్చెలగుంటలో ఉండే నుడి ; 2. వీపుమీద మూపురానికి అంగుళం వెనుక భాగంలో ఉండే నుడి.

**రాజ్యశాసకుడు** వి. కార్యకర్త. ద.హిం.శా. సంపు. 5.శా.సం. 139. క్రీ.శ. 1207.

సం. రాజ్యశాసక -. రాజ్యాన్ని ఏలేవాడు.

<సం. రాజ్యశాసక - (అర్థవిపరి.).

**రాంజీల (చీల)** వి. పిర్రచీల, ఏడికోల పణత దూర్చి ఊడకుండా చివర కొట్టే కొయ్య మేకు.

సం. రాజన్. రాజు.

**రా(జ(బెట్టు** చూ. రా(జు.

**రా(జు** చూ. రాయు. రూ. రాదు. అ.క్రి. 1. (నిప్పు అంటుకొను, ప్రజ్వరిల్లు. కు.సం. 5.49 ; 2. దుఃఖించు. ఉ.హ.. 6.4 ; 3. పొగయు, ప్రధూమితమగు. ఘటికా. 1.42.

<*అర్-అంజ్- <*అర్-అంచ్.

**రా(జ(బెట్టు** స.క్రి. రాజేట్లుచేయు, వృద్ధినొందించు. భార. కర్ణ. 3.124. <రా(జు + -అ[7] + పెట్టు. **రా(జేయు** స.క్రి. 1. పొయ్యిలో నిప్పువేసి మండించు ; 2. పద్యాలు మొ. వాటి కంఠోపాఠం చేయు. <రా(జు + -అ[7] + చేయు.

**రా(జేయు** చూ. రా(జు.

**రాట** రూ.చూ. రాటు. వి. 1. నిట్ట, గొట్టం, కట్టు బడిలో మధ్యవేసే నిలువుగుంజ ; 2. కొయ్య ; 3. స్తంభం ; 4. ఆకుల రాట్నం ఇరుసు బిగించే నిలువు కొయ్య.

**రాటక్ర్ర** వి. గానుగరాతిని తగిలించే కొయ్యదూలం.

**రాటంకాలు** చూ. రాటము.[3]

**రాటంచెయ్యి** చూ. రాటము.[3]

**రాటణము** రూ.చూ. రాటనము. వి. నూలు వడికే యంత్రం.

**రాటనము** రూ. రాటణము, రాటము, రాట్టము, రాట్నము, రాట్లం, రోటం, రోట్లం. వి. 1. చెరుకుగానుగ. కు.సం. 11.171 ; 2. నీరు చేదేయంత్రం. బసవ. 4.64 పం ; 3. గానుగ. మార్క. 2.68.

సం. అరఘట్ట-. నీటియంత్రం ; ప్రా. రహట్ట-, అరహట్ట ; జై. మహా. అరహట్ట-; అ. మా. అప. రహట్ట- ; పా. అరఘట్ట- ;

క. రట్ట, రటు, హాటు, రాటుణ, రాటుళ, రాటువాణ, రాణవళ, రాటాణ, రాటె, ఇరాట్టినమ్ మ. రాట్టె ; ఒరయాన్. రహటా.

<ప్రా. రహట్ట-.

**రాటన్‌ఖానీ** వి. తివాసీనేతలో వచ్చే ఒకరకం డిజైను.

**రాటపాకు** చూ. రాటము.[3]

**రాటపాకులకమ్మి** చూ. రాటము.[3]

**రాటము**[1] రూ.చూ. రాటవము. వి. మల్లబంధ విశేషం, ప్రబంధ. 790.

**రాటము**[2] రూ.చూ. అట్టు. వి. జననమ్మర్దం.

**రాటము**[3] రూ.చూ. రాటనము. వి. రాట్నం.

**రాటంకాలు** వి. పత్తి పట్టేటప్పుడు రాట్నం. కదలకుండా తొక్కి పట్టటానికి అమర్చిన పట్టె. <రాటము[3] + కాలు.[2] **రాటంచెయ్యి** వి. పట్టుదారం వడికే పెద్దరాట్నం కట్టుబడిలో ఇరుసు తిప్పటానికి బిగించిన కొయ్యపిడి. <రాటము[3] + చెయ్యి. **రాటపాకు(-ఆకు)** వి. 1. రాట్నం చక్రానికి ఆకుల్లా ఉండే వెడల్పు చెక్క ; 2. ఒకజాతి ఆకుతీగ, దీన్ని మేకలు కూడా తినవు. **రాటపాకులకమ్మి** వి. రాట్నం ఆకంత వెడల్పు పట్టెలు నేసినకమ్మి.

**రాటవము** రూ. రాటము[1]. వి మల్లబంధవిశేషం. భాగ. 10 పూ. 1345.

సం. రాష్ట్ర-. పీడించటం ; ప్రా. రట్ఠ-.

<ప్రా. రట్ట-.

**రాటి** రూ.చూ. రాడ. వి. గుమ్మటం లాంటి పనిముట్టు.

**రాటిఆకు** రూ. రాటీఆకు. వి. రాటికి పైనాకిందా కట్టిన వెదురు బద్ద. **రాటిక్ర్ర** రూ. రాటెక్ర. వి. రాటి తిరగటానికి ఆధారంగా ఉన్న ఇరుసు. **రాటిగొట్టం** రూ. రాటెగొట్టం. వి. రాటి ఆకులు బిగించిన వెదురుగొట్టం. **రాటిదారం** వి. రాటి ఆకులు కలిపి కట్టిన దారం. **రాటిదిమ్మ** రూ. రాటిదిమ్మె, రాటెదిమ్మె. వి. రాటితిరగటానికి రాటి నూలానికి ఆధారంగా ఉన్న కొయ్య మొద్దు. **రాటిదిమ్మ** రూ.చూ. రాటిదిమ్మ. వి. రాటి తిరగటానికి రాటినూలానికి ఆధారంగాఉన్న కొయ్య మొద్దు. **రాటిదుక్క** వి. రాటి తిరగటానికి రాటి నూలానికి ఆధారంగా ఉన్న కొయ్య మొద్దు. **రాటిపుల్ల** వి. రాటికి పైనా కిందా కట్టిన వెదురు బద్ద ; 2. రాటి తిరగటానికి ఆధారంగా ఉన్న ఇరుసు. **రాటిబద్ద** రూ. రాటెబద్ద. వి. రాటికిపైనా కిందా పెట్టిన వెదురు బద్ద. **రాటిబల్ల** వి. రాటికిపైనా కిందా కట్టిన బద్ద. **రాటిబురక** రూ. రాటెబురక. వి. రాటిపై బద్దల్ని బిగించి వాటి మధ్య బోర్లించి కట్టిన చిప్ప. **రాటిముక్కు** వి. రాటి నూలం పైకొన. **రాటిమొద్దు** వి. 1. రాటి తిరగటానికి

రాటి నూలానికి ఆధారంగా ఉన్న కొయ్య మొద్దు ; **2.** అడ్డగుమ్మి అమర్చే ఫ్రేము. రాటిమొల వి. రాటి తిరగటానికి ఆధారంగా ఉన్న ఇరుసు, మామూలుగా ఇనపది. రాటి సూలం వి. రాటి తిరగటానికి ఆధారంగా ఉన్న ఇరుసు, మామూలుగా ఇనపది.

**రాటీ** రూ.చూ. రాడ. వి. గుమ్మటం లాంటి పనిముట్టు.

**రాటీఆకు** రూ.చూ. రాటి ఆకు. వి. రాటికి పైనా కిందా కట్టిన వెదురు బద్ద.

**రాటు**[1] రూ.చూ. అట్టు. వి. **1.** ఉపద్రవం ; **2.** శ్రమ ; **3.** జనసమ్మర్దం ; **4.** రాపిడి.

**రాటువడు** రూ.చూ. రాట్వడు. అ.క్రి. శ్రమపడు. **రాటుపోటులు** వి.బ.వ. రాపుళ్ళు. శ్రీని. 5.14. **రాట్పడు** రూ. రాటుపడు. అ.క్రి. శ్రమనొందు. కాశీ. 4 210.

**రాటు**[2] వి. **1.** రాకపోకలు ; **2.** అనుభవం.

**రాటు**[3] రూ.చూ రహట్. వి. నీళ్ళు తోడే మరచక్రం.

**రాటె** రూ.చూ. రాడ. వి. గుమ్మటం లాంటి పనిముట్టు.

**రాటెకఱ్ఱ** రూ.చూ. రాటికఱ్ఱ. వి. రాటి తిరగటానికి ఆధారంగా ఉన్న ఇరుసు. **రాటెగొట్టం** రూ.చూ. రాటి గొట్టం. వి. రాటిఆకులు బిగించిన వెదురుగొట్టం. **రాటె తాడు** వి. రాటి ఆకులు కలిపి కట్టిన దారం. **రాటెదిమ్మ** రూ.చూ. రాటిదిమ్మ. వి. రాటి తిరగటానికి రాటి నూలానికి ఆధారంగా ఉన్న కొయ్య మొద్దు. **రాటెబద్ద** రూ.చూ. రాటిబద్ద. వి. రాటికి పైనా కిందా పెట్టిన వెదురు బద్ద. **రాటెబురక** రూ.చూ. రాటిబురక. వి. రాటిపై బద్దల్ని బిగించి వాటి మధ్య బోర్లించి కట్టిన చిప్ప.

**రాట్టము** రూ.చూ. రాటనము. వి. రాట్నం.

**రాట్నంసారె** చూ. రాట్నము.

**రాట్నంగిల్ల** చూ. రాట్నము.

**రాట్నంచెవి** చూ. రాట్నము.

**రాట్నపుగుంఁడ్ర** చూ. రాట్నము.

**రాట్నపుఁజెవులు** చూ. రాట్నము.

**రాట్నము** రూ.చూ. రాటనము. వి. **1.** జలయంత్ర విశేషం. సిం. ద్వా. 6.70 ; **2.** చెఱకు గానుగ. ఆము. **4.152** ; **3.** నూలువడికే యంత్రం, ఏకులరాట్నం. చంద్రాంగ. **1.53** ; **4.** పత్తిరాట్నం, పత్తినిదూది చేసే యంత్రం. ఉ. హరిశ్చ. 4.24.

**రాట్నంసారె** వి. ఆడపిల్లకు పెళ్ళిలో సారెగా రాట్నం ఇచ్చే ఆచారం. <రాట్నము+సారె. **రాట్నంగిల్ల** వి పట్టువడికే పెద్దరాట్నం కట్టుబడిలో ఇరుసుకు బిగించిన ఇనపచక్రం. <రాట్నము+గిల్ల. **రాట్నంచెవి** వి. ఆకుల రాట్నం ఇరుసు బిగించే నిలువు కొయ్య. <రాట్నము+చెవి[2]. **రాట్నపుగుంఁడ్ర** విశే. నిష్ప్రయోజనమైనది. తాళ్ల. సం. 8.50. **రాట్నపుఁజెవులు (-చెవులు)** వి.బ.వ. నిష్ప్రయోజన మైనది. తాళ్ల. సం. 7.216. **రాట్నంపట్ట** వి. పట్టు వడికే పెద్దరాట్నం. ఇరుసుకు బిగించిన రేకు చక్రం. <రాట్నము+పట్ట. **రాట్నంపంటె** వి. రాట్నం కదురుకు తగిలించి నూలు చుట్టే చిన్న పంటె. <రాట్నము+పంటె.

**రాట్నంపట్ట** చూ. రాట్నము.

**రాట్నంపంటె** చూ. రాట్నము.

**రాట్పడు** చూ. రాటు[1].

**రాట్లం** రూ.చూ. రాటనము. వి. నూలు వడికే కొయ్య యంత్రం.

**రాడ** రూ. రాటి, రాటీ, రాటె. వి. గుమ్మటం లాంటి, పనిముట్టు.

**రాడి** రూ.చూ. రాడు. వి.జా. **1.** గుంజ, స్తంభం ; **2.** నన్నగా పొడుగ్గా ఉండే కొయ్యస్తంభం.

**రాడు** రూ. రగట[2], రాట, రాడి, లాడు.[2] వి. జా. **1.** గుంజ. స్తంభం. కు. సం. 6.17 ; **2.** నన్నగా పొడుగ్గా ఉండే కొయ్యస్తంభం.

క. అరళె. గుంజ, స్తంభం, విగ్రహం.

**రాణ** రూ.చూ. రమణ. వి. **1.** అతిశయం, ఆధిక్యం. భాస్క. రా.బాల. 687 ; **2.** ప్రేమ, అనురాగం, ప్రీతి. మను. 4.36. రాఘవ. 1.20 ; **3.** ఒప్పిదం. రాఘవ. 2.6 ; **4.** వేడుక, కుతూహలం. రాఘవ. 2.19 ; **5.** రక్తి, గానమాధుర్యం. ప్రబో. 3.114 ; **6.** విధం. చంద్రాంగ. 6.93 ; **7.** ఆసక్తి. పరమ. 3.145.

**రాణించు** అ.క్రి. **1.** అతిశయించు. భాస్క.రా. కిష్కిం. 435 ; **2.** సంతసించు. రం.రా. కిష్కిం. 199ప. 16పం. **3.** ఒప్పు, శోభించు. ప్రకాశించు. వరాహ. 11.35 ; **4.** ఇష్టమగు. శుక. 1.202. <రాణ+-ఇంచు[3]. **రాణింపు** రూ. చూ. రాణింబు. వి. ఒప్పిదం. సొగసు. శృం. శవ. 1.11 ప. 20ప. **రాణింబు** రూ. రాణింపు. వి. ఒప్పిదం, సొగసు. ఇందు. 4.22. **రాణిల్లు** వి. ఒప్పు, శోభిల్లు. చంద్రాంగ. 5.124.

**రాణి** వి. **1.** రాజుభార్య. భీమ. 3.9 ; **2.** భార్య కాశీ 3.91.

సం. రాజ్ఞీ. రాణి ; ప్రా. రాణీ, రణ్ణీ, రాణిఆ ; పా. రఞ్ఞీ ; అప. రానీ, రాయణీ ;

క. రాణి ; తు. త. మ. రాణి ; కువి. రానీ.

<ప్రా. రాణీ.

**రాణివాసము** వి. అంతఃపురస్త్రీ, రాజుయొక్కభార్య. భీమ. 3.95 ; **2.** భార్య, పెళ్ళాం. పారి. 5.10 ; **3.** అంతఃపురం, అంతిపురం. ఉ.రా. 3.186, తాళ్ల సం. 13.3. **రాణివాసి** వి. అంతఃపురస్త్రీ. వేంక. పంచ. 1.249.

**రాణించు** చూ. రాణ.

**రాణింపు** చూ. రాణ.

**రాణింబు** చూ. రాణ.

**రాణిల్లు** చూ. రాణి.

**రాణువ** వి. **1.** సేన. పల్నా. ప.20 ; **2.** పరివారం. మల్లు. 1.25, శుక. 1.96.

సం. రాజన్. రాజు ; ప్రా. రాణయ, రాణ్ణో. రాఇణో. రాజ సంబంధి, రాణో. రాజు ;

క. రాణువె. సేన, ఆయుధబలం ; త. ఇరాణువమ్.

సేన. మ. రాణువం. సేన.

<ప్రా. రాణయ-.

**రాత** రూ.చూ. వ్రాత. వి. లేఖనం.

**రాతబల్ల** వి. రాసుకోవటానికి ఉపయోగించేబల్ల.

**రాతంకైకిలి** చూ.రాత. వి. అంటుకూలి, సంవత్సరం అంతా ఒకరైతుకే కూలి పని చేసేవాడు.

**రాతనారజలచు** చూ. రాయి[1].

**రాతబుబేరం** వి. పెద్దబేరం.

**రాతము** వి. ప్రతిదినం వారకం.

**రాతయిరేణి** చూ. రాయి[1].

**రాతయిరేని** చూ. రాయి[1].

**రాతరివేణి** చూ. రాయి[1].

**రాతవిరీడి** చూ. రాయి[1].

**రాతవిరేణి** చూ. రాయి[1].

**రాతవేయు** చూ. రాయి[1].

**రాతాళం** రూ. రతలాం. వి. గెనుసుగడ్డ, లొక్కునల్లగాఉండే పెద్దసైజు గెనుసుగడ్డ (gpomaea batafas).

రామ. రాతల్. గెనుసుగడ్డ.

**రాతిఉప్పు** చూ. రాయి[1].

**రాతిఉలి** చూ. రాయి[1].

**రాతికట్నము** చూ. రాయి[1].

**రాతికడే** చూ. రాయి[1].

**రాతికప్పు** చూ. రాయి[1].

**రాతికిబ్రాణంబుదెచ్చు** చూ. రాయి[1].

**రాతికొట్టుడు** చూ. రాయి[1].

**రాతికొడుకు** చూ. రాయి[1].

**రాతిగుండియ** చూ. రాయి[1].

**రాతిగుండె** చూ. రాయి[1].

**రాతిగుబ్బి** చూ. రాయి[1].

**రాతిగొటుబాట** చూ. రాయి[1].

**రాతిగొదవ** చూ. రాయి[1].

**రాతిగొరక** చూ. రాయి[1].

**రాతిచిప్ప** చూ. రాయి[1].

**రాతితాలుపరిగారాపుమామ** చూ. రాయి[1].

**రాతితాల్పరిగారాపుమామ** చూ. రాయి[1].

**రాతినార[1]** చూ. రాయి[1].

**రాతినాల[2]** చూ. రాయి[1].

**రాతినేల** చూ. రాయి[1].

**రాతిపరుపు** చూ. రాయి[1].

**రాతిపాచి** చూ. రాయి[1].

**రాతిపారు** చూ. రాయి[1].

**రాతిపురి** చూ. రాయి[1].

**రాతిపువ్వు** చూ. రాయి[1].

**రాతిపూవు** చూ. రాయి[1].

**రాతిపోటు** చూ. రాయి[1].

**రాతిబదనిక** చూ. రాయి[1].

**రాతిబాటు** చూ. రాయి[1].

**రాతిబొమ్మ** చూ. రాయి[1].

**రాతిమాంసము** చూ. రాయి[1].

**రాతిమాన్యం ధర్మశాసనము** చూ. రాయి[1].

**రాతియుప్పు** చూ. రాయి[1].

**రాతిరి** రూ. రాత్తిరి, రేతిరి, రేత్తిరి, రేత్రి. వి. రేయి, నిశి. శార. ఆది. 6.161.

సం. రాత్రి-, రాత్రి. రేయి ; క. రత్తి ; ఆ.మా. రత్త, రత్తి, రాత్తి, రాఈం, రాయం ; ప్రా.పా. రత్తి ; మా. లత్తి ;

త. ఇరాత్తిరి.

<సం. రాత్రి-.

**రాతిరి తిరుగుమేటి** వి. సోకులరేడు, నిర్భతి. **రాతిరిపని** వి. **1.** వ్యభిచారం. కాళ్ల. సం. 14.13 ; **2.** సంభోగం.

**రాతివడ్డు** చూ. రాయి[1].

**రాతివాలు** చూ. రాయి[1].

**రాతివీరుడు** చూ. రాయి[1].

**రాతిసున్నము** చూ. రాయి[1].

**రాతిసున్ని** చూ. రాయి[1].

**రాత్తిరి** రూ.చూ. రాతిరి. వి. రాత్రి. నిశ, రేయి.

**రాదసాధనాలు** వి.బ.వ. ఒకరకం వడ్లు.

**రాదారి** రూ.చూ. రహదారి. వి. **1.** పాస్‌పోర్టు ; **2.** మార్గం ; **3.** పర్మిట్టు ; **4.** లైసెన్సు.

**రాదారీ** రూ.చూ. రహదారి. వి. **1.** పాస్‌పోర్టు ; **2.**మార్గం ; **3.** పర్మిట్టు ; **4.** లైసెన్సు.

**రాదు** రూ.చూ. రాజు. అ.క్రి. (నిప్పు) అంటుకొను, ముట్టుకొను, మండు.

**రాదెంచు(-తెంచు)** చూ. వచ్చు.

**రాధారీ** రూ.చూ. రహదారి. వి. **1.** పాస్‌పోర్టు ; **2.** మార్గం ; **3.** పర్మిట్టు ;

**4.** లైసెన్సు.

**రాద్దోడి** రూ.చూ. రట్టకుట్ట. వి. రెడ్డి. రెడ్డివదానికి పూర్వ రూపం నె.శా. పొదలి. 22.

**రాధిక.** వి. ఒకరకం నీలంరంగు

సం. రాధికా. ఒక గోపికపేరు.

<సం. రాధికా (అర్థవిపరి.).

**రాద్ధాంతం** వి. తగువు, గొడవ.

సం. రాద్ధాంత-. సిద్ధాంతం, స్థిరపరచబడిన విషయం, చర్చ.

<సం. రాద్ధాంత – (అర్థవిపరి.).

**రాందాడి.** రూ.చూ. రామందాడి. వి. రద్దీ, రాకపోకల ఎక్కువదనం.

**రాప.** వి. ఆము కాల్పుకు ముళ్ళ కంపల్ని తీసికొని రాపటానికి వాడే పంగల కర్ర.

**రాపకర్ర** రూ.చూ. రేపకర్ర. వి. ఆముకాల్పుకు ముళ్ళ కంపల్ని తీసికొని రావటానికి వాడే పంగలకర్ర.

**రాపడు[2]** చూ. రాచు.

**రాపాడు** చూ. రాచు.

**రాపిడి** చూ. రాచు.

**రాపిడిచేయు** చూ. రాచు.

**రాపిడిరంగు** చూ. రాచు.
**రాపిడు** చూ. రాచు.
**రాపు**[1] చూ. రాచు.
**రాపు**[2] వి. ఎగుడు దిగుళ్ళు లేకుండటం.
**రాపుడు** చూ. రాచు.
**రాపుడురాయి** చూ. రాచు.
**రాపుబీరాలు** చూ. రాచు.
**రాబట్‌ఖానీ** వి. తివాసీ నేతలో వచ్చే ఒకరకం డిజైను.
**రాబట్టు** చూ. వచ్చు.
**రాబడి** చూ. వచ్చు.
**రాబందు** రూ.చూ. రాబొందు. వి. 1. రాచపులుగు, కంకపక్షి; 2. జటాయువు, రామబంధువు.
**రామకలరు** రూ. రాంకలర్. వి. 1. ముదురు నీలంరంగు; 2. పచ్చ, వయిలెట్ కలసిన రంగు; 3. ఒకరకం నీలం రంగు.
సం. రామ-. శ్రీరాముడు, ఇం. colour. రంగు.
<సం. రామ - + ఇం. colour.
**రామకుందనం** వి. కల్లు లొట్టి.
సం. రామ-. రాముడు, కుందన. బంగారం.
<సం. రామకుందన - (అర్థవిపరి.).
**రామక్రియ** వి. ఒకనొక రాగం, 24 రాగాల్లో ఒకటి. హంస. 5.124.
సం. రామక్రియా. రాముని చేష్ట.
<సం. రామక్రియా. (అర్థవిపరి).
**రామఖల్లి** వి. ఒకానొకరాగం. చెన్నబసవ. 2.286.
సం. రామ-. శ్రీరాముడు; హిం. ఉ. కలా. కల్లీ. ముఖం నుంచి. గొంతు వరకు ఉన్న భాగం.
<సం. రామ - + ఉ. కల్లీ.
**రామగడలు** రూ. రామగాడి, వి.బ.వ. ముతకవడ్లు, ముఖ్యంగా విశాఖపట్నంలో పండించేవి, అనకాపల్లి 12వ నెంబరు దీనికి చెందిన రకం.
సం. రామ-. శ్రీరాముడు.
**రామగాడి** రూ.చూ. రామగడలు వి.బ.వ. ముతకవడ్లు, ముఖ్యంగా విశాఖపట్నంలో పండించేవి.
**రామగుడాలు** రూ. రామగౌడలు. వి.బ.వ. ఒకరకం వడ్లు.
సం. రామ-. శ్రీరాముడు, *గుడ* - బెల్లం.
<సం. రాముగుడ - + - ము + + - లు.
**రామగుమ్మడి** వి. మంచిగుమ్మడిలో చిన్నకాయరకం.
**రామగౌడలు** రూ.చూ. రామగుడాలు, వి. బ. వ. ఒకరకం వడ్లు.
**రామచక్కని** విశే. అత్యంతం చక్కనైన.
సం. రామ-. మనోహరమైన.
<సం. రాము - + చక్కని. (మిశ్రమ.).
**రామచిలుకపచ్చ** రూ. రామసిలుకపచ్చ. వి. ముదురు ఆకు పచ్చరంగు.
**రామచిలుక** వి. ఒకజాతిచిలుక. రాజ. చ. 189.
సం. రామ-. శ్రీరాముడు, మనోహరమైన,
<సం. రాము-. + చిలుక. (మిశ్రమ.).
**రామటెంకీలు** వి.బ.వ. ఒకవిధమైన నాణెం. E.C. 12. పవుగడ. క్రీ.శ. 1472.
సం. రామ-. శ్రీరాముడు.
<సం. రామ - + టంకాలు. (మిశ్రమ.).
**రామతమ్మ (అమ్మ)** వి.శకం, చిలక, ద్వి. పరమ. వి, 2.56, తపతీ, 3.22.
**రామతాడు** వి. పెద్దతాడిచెట్టు.
సం. రామ-. శ్రీరాముడు.
<సం. రామ - + తాడి. (మిశ్రమ.).
**రామదండు** వి. 1. వానకోసం నడిపే ఆచారం, ఊళ్ళో ఇంటి కొకరు వంతున తలంటి పోసుకొని కర్రలకు లాగి ఆకులు, పసుపుగడ్డలు కట్టుకొని రాములవారి పటం పట్టుకొని మూడూళ్ళుగాని ఐదూళ్ళుగాని తిరుగుతారట, ఆఊళ్ళలో వీరికి అతిధి సత్కారాలు చేస్తారట; 2. కోతులసేన.
సం. రామ-. శ్రీరాముడు.
<సం. రామ- + దండు. (మిశ్రమ.).
**రామదాసు** వి. 1. ఒకపిట్ట; 2. రామునిబంటు; 3. భద్రాచల రామభక్తుడైన గోపన్న.
సం. రామదాస-. శ్రీరామునిబంటు.
<సం. రామదాస —.
**రామనీలం** వి. ముదురు నీలం రంగు.
సం. రామ-. శ్రీరాముడు, నీల-. నీలంరంగు.
సం. రామనీల-. (అర్థవిపరి.).
**రామందాడి** రూ. రాందాడి, రామునిదాడి. వి. 2. అసంఖ్యాకం. లెక్కలేనిది; 2. అసంఖ్యకంగా ప్రజలు గుమ్మికూడటం.
సం. రామ-. శ్రీరాముడు.
<సం. రామ- + దాడి.
**రామన్న** ని. శుకసంబోధనంలో ఉపయోగించేమాట. చమ 3-23.
సం. రామ-. శ్రీరాముడు, మనోహరమైనది.
<సం. రామ- + అన్న.
**రామన్నాట** వి. బాలక్రీడావిశేషం. హంస. 3.46.
సం. రామ-. శ్రీరాముడు.
<సం. రామ- + అన్న + ఆట.
**రామబాణము** వి. 1. ఒకరకంపురుగు, పుస్తకాలను కొట్టేపురుగు; 2. ఒకరకం పువ్వు; 3. చురుకైంది, నిసితమైంది; 4. తిరుగులేనిది, స్థిరమైనది.
సం. రామబాణ-. రామునిబాణం.
<సం. రామబాణ-. (అర్థవిపరి).
**రామబాణాలు** వి.బ.వ. ధాన్యవిశేషం. ప్రబంధ. 112, హంస. 4.128.
**రామబాణాలు** చూ. రామబాణము.
**రామబుడమ** వి. పెద్దబుడమ.
సం. రామ-. శ్రీరాముడు, మనోహరమయిన.
<సం. రామ- + బుడమ. (మిశ్రమ.)
**రామమాడ** వి. పురాతన బంగారునాణెం, (నిష్కం).
సం. రామ -. శ్రీరాముడు.

<నం. రామ-.+మాడ (మి(శమ.).

**రామములక** రూ.చూ. రామములగ. వి.టమోటా.

రామములక్కాయ వి. టమోటా, టక్కోరపు వంకాయ.

**రామములక్కాయ** చూ. రామములక.

**రామములగ** రూ. రామములక, రామ్ములగ. వి.టమోటా. శాక్యాశపుకాయ, చల్లటిచోట్ల తోటల్లో పెరిగే తీగెపైరు (Lycopersicum esculenfum).

నం. రామ -.శ్రీరాముడు, అందమైనది.

<నం. రామ-+ములగ. (మి(శమ.).

**రామరాజ్యము** వి. సుభిక్షంగా ఉన్నరాజ్యం, ఆనంద పదం హాయిని గూర్చేది. శాల్మ.నం. 7.128.

నం. రామరాజ్య -.శ్రీరామచంద్రుని రాజ్యం.

<నం. రామరాజ్య-+-ము (అర్థవిపరి.).

**రామలక్ష్మణులు** వి.బ.వ. ధాన్యవిశేషం. ప్రబంధ. 112.

నం. రామలక్ష్మణ -.రాముడు, లక్ష్మణుడు.

<నం. రామలక్ష్మణ-+-లు. (అర్థవిపరి.).

**రామలింగం కొయ్య** వి. నేతబయలులో చివర పాతిన కొయ్య.

నం. రామలింగ-. రామునిచే స్థాపించబడిన లింగం.

<నం. రామలింగ-+-ము+కొయ్య.

**రామలింగం గూటం** వి. నేతబయలులో చివర పాతిన కొయ్య.

నం. రామలింగ-. రామునిచే ప్రతిష్ఠితమైన శివలింగం.

<నం. రామలింగ-+-ము+గూటము.

**రామలింగప్పగూటం** వి. నేతబయలులో చివర పాతిన కొయ్య.

నం. రామలింగ-.రామునిచే ప్రతిష్ఠించబడ్డ శివలింగం.

<నం. రామలింగ-+అప్ప+గూటము.

**రామలు** వి.బ.వ. మత్స్యవిశేషం.

త. ఇరామ - ముణియణ్. వెండి రంగు చేప ;

నం. రామ -.శ్రీరాముడు, మనోహరమైనది.

<నం. రామ-+-లు.

**రామసాగరములు** వి.బ.వ. వడ్లలో ఒకరకం.

నం. రామసాగర-.రాముని సముద్రం.

<నం. రామసాగర-+-ము+-లు. (అర్థవిపరి.).

**రామసింగు** వి. తుపాకీ లాంటి యుద్ధ సాధనం. రంగా. చ. 3.112.

నం. రామ -.శ్రీరాముడు : హిం. పం. సింగ్. సింహం, క్షత్రియుల బిరుదు.

<నం. రామ-.+హిం. సింగ్ (మి(శమ.).

**రామసిలకపచ్చ** రూ.చూ. రామచిలకపచ్చ. వి. ముదురు ఆకు పచ్చ రంగు.

**రామానుజకూటము** వి. 1. వైష్ణవ బ్రాహ్మణుల వసతి సత్ర గాల. E. 1. నంపు. 16. క్రీ.శ. 1462 ; 2. వైష్ణవుల రాక పోకల కేర్పడిన ఇల్లు.

నం. రామానుజకూట -. శ్రీరామానుజ స్వామివారి కూటం.

<నం. రామానుజకూట - (అర్థవిపరి.).

**రామాపచ్చ** వి. ముదురు ఆకుపచ్చ రంగు.

నం. రామ -.మనోహరమైనది, శ్రీరాముడు, రామా.స్త్రీ.

<నం. రామ-+పచ్చ.

**రామాఫలం** వి. ఒకరకం పండు, పళ్ళచెట్టు (Anon Reficulata) .

నం. రామ -.శ్రీరాముడు, ఫల-. పండు.

<నం. రామఫల-.

**రామాయపట్నమధ్యస్థం** వి. ఒకరు ఇంకొకరి వస్తువును అన్యాయంగా లాక్కొన్నప్పుడు మధ్య వచ్చిన పెద్దమనిషి. రామాయపట్నం గ్రామనామం.

**రామి** చూ. వచ్చు. రూ. రామీ. వి. 1. ఆదాయం, లాభం 2. రాక పోవటం.

రామిగా క్రి. విశ. చవగ్గా.

**రామీ** రూ.చూ. రామి. వి. చవక.

**రాము** చూ. రాయు[1]. వి. 1. వరకట్టటానికి గుడ్డలో పోసి రుద్దటం ; 2. రాయటం, కలియదిప్పటం, ఒక తొట్టిలో రంగు, కాస్టిక్‌సోడా, హైడ్రోసు ద్రావకం వేసి బాగా కలుపుతారు.

**రాముడితరంబ్రాలు** రూ.చూ. రాముడి తలంబ్రాలు. వి.బ.వ. తెల్లగింజల రకం జొన్నలు.

**రాముడితలంబ్రాలు** రూ. రాముడి తరంబ్రాలు. వి.బ.వ. ఒల్లి. కల్. తెల్లగింజల రకం జొన్నలు.

నం. రామ-. శ్రీరామచంద్రుడు.

**రామునిదాడి** రూ.చూ రామందాడి. వి. అసంఖ్యాకం.

**రామురాము** వి. నమస్కారవిశేషం. హంస. 4.214.

నం. రామ -. శ్రీరాముడు ; హిం. రామ్.

<హిం. రామ్‌రామ్.

**రామేశ్వరాలు** వి.బ.వ. ఒకరకం వడ్లు.

నం. రామేశ్వర -.పవిత్రపుణ్యక్షేత్రం.

<నం. రామేశ్వర-+-ము+-లు (అర్థవిపరి.).

**రామ్‌చందర్‌ఖానీ** వి. తివాసీ నేతలో వచ్చే ఒకరకం డిజైను.

హిం. రామ్‌చందర్. శ్రీరామచంద్రుడు.

**రాంబందు** రూ.చూ రాంబొందు. వి. 1. కంకపక్షి ; 2. రామ బంధువు, జటాయువు.

**రాంబొందు** రూ. రాబందు, రాంబందు. వి. 1. పసుపు పచ్చని ముక్కు కలిగి శవాలను తినేపక్షి, కంకపక్షి ; 2. రామ బంధువు, జటాయువు.

నం. రామబంధు-. రాముని చుట్టం, జటాయువు.

<నం. రామబంధు -.

**రాంఫావళ్ళండు** చూ. రామాఫలం. వి. రామాఫలం.

**రా(పు** చూ. రాచు.

**రా(బట్టు** చూ. వచ్చు.

**రా(బట్టుకొను** చూ. వచ్చు.

**రా(బోవు** చూ. వచ్చు.

**రామ్ములగ** రూ.చూ. రామములగ. వి. టమోటా, శాక్యాశపు కాయ, చల్లటి చోట్ల తోటల్లో పెరిగే తీగెపైరు.

**రాయ[1]** రూ. రాయఁడు. వి. 1. ప్రభువు. రాజు. మను. 1.2 ; 2. కొన్ని ఎడల సంజ్ఞావాచకాల చివర ప్రయోగింప బడే బిరుదు. పారి. 1.3.

నం. రాజన్-.ప్రభువు ; ప్రా. రాఅ–, రాయ – ; జై. మహా. రాయా ; శౌ. రాయ –; అ.మా. అప.

రాయ –;

క. రాయ ; త. అరయన్, అరైయన్, ఇరాయన్ ; మ. రాయర్.

<ప్రా. రాయ –.

**రాయగిడిగిడి** వి. ధమామా. ధమాయి. **రాయగేస్తురాలు** వి. రాజపత్ని. విజయ. 1.119. **రాయదొంగ** వి. రాజాజ్ఞ వల్ల దొంగతనం చేసేవాడు. ద్వి. పరమ. వి. 7.519. **రాయమెచ్చులు** వి.బ.వ. ధాన్యవిశేషం. ప్రబంధ. 172. **రాయరి** వి. రాయడు, ప్రభువు, బిరుదనామం. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 91. క్రీ.శ. 1182. <రాయ$^{1}$+-అరి. **రాయరికము** వి. 1. ప్రభుత్వం. ఆం.భా. 2.182 ; 2. రాజత్వం ; 3. క్షత్రియత్వం ; 4. రాష్ట్రం. **రాయలు** వి.బ.వ. 1. రాజులు ; 2. శ్రీకృష్ణదేవరాయలు. **రాయశృంగారములు** వి.బ.వ. వస్త్ర విశేషం. సిం.ద్వా. 3.188. **రాయసము$^{1}$** వి. ఠీవి, రాచఠీవి. ఇందు. 1.45. **రాయసరులు** రూ.చూ. రాయసర్లు. వి.బ.వ. ధాన్య విశేషం. ప్రబంధ. 112. **రాయసర్లు** రూ. రాయసరులు. వి.బ.వ.ధాన్యవిశేషం హంస. 4.128.

**రాయ$^{2}$** రూ.చూ. రాయి. వి. 1. భిన్న ఖనిజాల కలయిక వల్ల ప్రకృతిలో సహజంగా ఏర్పడిన ఘనపదార్థం, శిల ; 2. భిన్న మృత్తికలను కలిపి కృత్రిమంగా కాల్చి తయారు చేసిన ఘనపదార్థం.

**రాయకాల్వ** చూ. రాయ$^{1}$. వి.బ.వ. పిల్లకాల్వ, మడిదగ్గర బోదెలన్నీ చీలే పెద్దకాలవ.

**రాయంగేసలు** వి.బ.వ. రెండజాలు.

**రాయడి** చూ. రాయు.

**రాయడించు** చూ. రాయు.

**రాయఁడు** రూ.చూ. రాయ$^{1}$. వి. 1. ప్రభువు, రాజు. సాంబ. మాన. 11 ; 2. కొన్నియెడల సంజ్ఞా వాచకాల చివర ప్రయోగించబడే బిరుదం.

**రాయతి** రూ. రాయతీ, రాయితి, రాయితీ, రాయితు, రాహితీ, రాహితు. వి. తగ్గింపు.

హిం. ఉ. అర. రిఆయత్. తగ్గింపు.

<ఉ. రిఆయత్.

**రాయతీ** రూ.చూ. రాయతి. వి. తగ్గింపు.

**రాయబారం** చూ. రాయబారము. వి. పెంకాములోని పొయ్యి, మంటవేసేది.

**రాయబారం కఱ్ర** రూ.చూ. రాయబారపు కఱ్ర. వి. వేలాడదీసిన పదుగు చుట్టను దగ్గరికిగాని దూరానికిగాని జరుప కోవటానికి వీలుగా మగ్గానికి పైన పెట్టిన కఱ్ర.

**రాయబారంకుండ** వి. సారాయి బట్టీలో గూనలోని ఊట సారాయిగా దిగటానికి వీలుగా కిందభూమి మీద పెట్టిన మట్టిపాత్ర.

**రాయబారం తాడు** రూ.చూ. రాయబారపు తాడు. వి. పదుగు చుట్టకు రెండువైపులా కట్టి మగ్గానికిపైన, కొన్నిచోట్ల రాయబారపు కఱ్రకు వేలాడదీసిన తాడు.

**రాయబారపుకఱ్ర** రూ. రాయబారం కఱ్ర. వి. వేలాడదీసిన పదుగు చుట్టను దగ్గరికిగాని దూరానికిగాని జరుపుకోవటానికి వీలుగా మగ్గానికి పైన పెట్టిన కఱ్ర.

**రాయబారపుకొయ్య** వి. వేలాడదీసిన పదుగుచుట్టను దగ్గరికిగాని దూరానికిగాని జరుపుకోవటానికి వీలుగా మగ్గానికిపైన పెట్టిన కఱ్ర.

**రాయబారపుగొట్టం** వి. రాయబారపుకఱ్రకు వేసినగొట్టం, కొన్నిచోట్ల కొయ్యగిలక.

**రాయబారపుతాడు** రూ. రాయబారం తాడు, రాయిబారు తాడు. వి. పదుగు చుట్టకు రెండువైపులా కట్టి మగ్గానికిపైన, కొన్నిచోట్ల రాయబారపు కఱ్రకు వేలాడదీసిన తాడు.

**రాయబారపు బండి** వి. రాయబారపు కఱ్రకు వేసినగొట్టం, కొన్నిచోట్ల కొయ్యగిలక.

**రాయబారము** వి. దౌత్యం, దూతకృత్యం. శృం.నై. 3.76.

సం. రాజభార-. దౌత్యం ; ప్రా. రాయభార- ; తు. రాయభారి ; కువి. రాయభేరి.

<ప్రా. రాయభార-.

రాయబారం మందు వి. చిచ్చుబుడ్డిలో పైన వేసే నల్లని మందు.

**రాయబారం మందు** చూ. రాయబారము.

**రాయబారి** వి. రాయబారం నడిపేవాడు, దూత. కు. సం. 10.123.

<రాయబారము+-ఇ$^{9}$.

**రాయంమట్టం** చూ. రాయ$^{1}$. వి. రెండు రూపాయలు.

**రాయరు** వి. రాజుగారు, ప్రభువు.

క. రాయరు. విజయనగర ప్రభువుల బిరుదు ; త. రాయర్.

<క. రాయరు.

**రాయల్‌బ్లూ** వి. ఒకరకం నీలంరంగు.

ఇం. *Royal blue*. ఒకరకం నీలిరంగు.

<ఇం. Royal blue.

**రాయసకాఁడు** చూ. రాయసము.

**రాయసగాఁడు** చూ. రాయసము.

**రాయసము** రూ. వ్రాయసము. వి. 1. రాజలేఖ, జాబు. వరాహ. 12.60 ; 2. వ్రాయసకాడు, లేఖరి. భోజసుతా. 1.104 ; 3. కార్యదర్శి పని, రాత.

క. రాయస. ఉన్నతాధికారిలేఖ, గుమస్తాపని ; త. ఇరాయజ, రాయచమ్. రాతపని.

**రాయసకాఁడు** రూ. రాయసగాఁడు. వి. 1. జాబులు రాసే ఉద్యోగి, లేఖరి ; 2. గుమాస్తా. **రాయసగాఁడు** రూ. చూ. రాయసకాఁడు. వి. 1. లేఖరి ; 2. గుమాస్తా.

**రాయస్త** వి. రాయసం, కార్యదర్శి, కరణం, విజయనగరం పరిపాలనలో ఒక ఉద్యోగం. T.D.I. సంపు. 6. శా. సం. 37.

**రాయాకు తాపీ** చూ. రాయి$^{2}$.

**రాయాకు తెగులు** రూ.చూ. రావేకు తెగులు. వి. పొగాకు తెగులు, ఒకరకం పేను తెగులు.

**రాయి$^{1}$** రూ.చూ. జాయి. వి.బొ. 1. శిల, పాషాణం. భార. ఆది. 7.120 ; 2. పర్వతం. సుద. 2.30 ; 3. భిన్న మృత్తికలను కలిపి కృత్రిమంగా కాల్చి తయారు చేసిన

ఘనపదార్థం.

**రాచ్చిప్ప** యూ.చూ. రాతిచిప్ప. వి. 1. రాతిచిప్ప. రాతిని మలచి చేసిన పాత్ర, పచ్చళ్ళు, పులుసు మొ. వి. పెట్టుకొనేది; 2. తలివిలేనిమొద్దు. **రాతనార ఒలచు** స.క్రి. అసాధ్యకార్యాల్ని చేయు. శాశ్ల. సం. 14.298. <రాయి+-అ$^{7}$+నార+ఒలుచు. **రాతయిరేటి** యూ.చూ. రాతరివేటి. వి. సున్నంపూసి నలుపుగీతలు గీసి ఆగీతల సందుల్లో ఎరుపు, ఆకుపచ్చ మొ. రంగులతో ఏనుగులు, ఒంటెలు, గుర్రాలు, పుష్పాలు, నెమళ్ళు మొ. బొమ్మలు వేసిన అరివేటికుండలు. **రాతయిరేని** యూ.చూ. రాతరివేటి. వి. సున్నం పూసి నలుపుగీతలు గీసి ఆగీతల సందుల్లో ఎరుపు, ఆకుపచ్చ మొ. రంగులతో ఏనుగులు, ఒంటెలు, గుర్రాలు, పుష్పాలు, నెమళ్ళు మొ. బొమ్మలు వేసిన అరివేటి కుండలు. **రాతరివేటి** యూ. రాతయిరేటి, రాతయిరేని, రాతవిరీడి, రాతవిరేటి, రావిఅవిరేడి. వి. సున్నంపూసి నలుపుగీతలు గీసి ఆగీతల సందుల్లో ఎరుపు ఆకుపచ్చ మొ. రంగుల్లో ఏనుగులు, ఒంటెలు, గుర్రాలు, పుష్పాలు, నెమళ్ళు మొ. బొమ్మలు వేసిన అరివేటి కుండలు. <రాయి$^{1}$+-ఇ$^{6}$+అరివేటి. **రాతవిరీడి** యూ.చూ. రాతరివేటి. వి. సున్నం పూసి నలుపు గీతలుగీసి, ఆగీతల సందుల్లో ఎరుపు, ఆకుపచ్చ మొ. రంగుల్లో ఏనుగులు, ఒంటెలు, గుర్రాలు, పుష్పాలు, నెమళ్ళు మొ. బొమ్మలు వేసిన అరివేటి కుండలు. **రాతవిరేటి** యూ.చూ. రాతరివేటి. వి. సున్నం పూసి నలుపుగీతలు గీసి ఆగీతల సందుల్లో ఎరుపు ఆకుపచ్చ మొ. రంగుల్లో ఏనుగులు, ఒంటెలు. గుర్రాలు, పుష్పాలు, నెమళ్ళు మొ. బొమ్మలు వేసిన అరివేటి కుండలు. **రాతవేయు** స.క్రి. వ్యర్థంచేయు, శాశ్ల. సం. 10.161. <రాయి$^{1}$+-అ$^{7}$+వేయు. **రాతిఉప్పు** యూ.చూ. రాతియుప్పు. వి. భూమిని తవ్వి తీసేది, సైంధవ (సింధుదేశం) లవణం. **రాతిఉలి** యూ.చూ. శాతియులి. వి. రాతిని తొలిచే ఉలి. **రాతికట్టనము** యూ.చూ. రాతికట్నము. వి. నాల్గువైపుల రాతితోకట్టిన గట్టు. **రాతికట్నము** యూ. రాతి కట్టనము. వి. నాల్గువైపుల రాతితోకట్టినగట్టు. ద.హిం.శా. సంపు. 4. శా. సం. 702. క్రి.శ. 1518. <రాయి$^{1}$+-ఇ$^{6}$+కట్నము. **రాతికడి** వి. గోడబలం కోసం కట్టేటప్పుడు మూలల్లో పక్కల నిలిపే బలమైన పెద్దరాయి. <రాయి$^{1}$+-ఇ$^{6}$+కడి. **రాతికప్పు** వి. వాసాలమీద రాళ్ళుపరిచి సున్నంతో అతికి వేసిన కప్పు. <రాయి$^{1}$+-ఇ$^{6}$+కప్పు$^{1}$. **రాతికి(బ్రాణంబు(దెచ్చు** అ.క్రి. చైతన్యం తెచ్చు. ద్వి. పరమ. వి. 3.1845. సం. ప్రాణ-.జీవితం. <రాయి$^{1}$+-ఇ$^{6}$+-కున్+సం. ప్రాణ-+-ము+-ను+తెచ్చు. **రాతికొట్టుడు** వి. గట్టిగా ఉండే నేల, పునాది ఇక్కడినుంచి కట్టుకురావటం మేలు. <రాయి$^{1}$+-ఇ$^{6}$+కొట్టుడు. **రాతికొడుకు** వి. మండూకం. కప్ప. పాండు. 5.314; విణ. నిశ్చలుడు. విప్ర. 3.56. <రాయి$^{1}$+-ఇ$^{6}$+కొడుకు. **రాతిగుండియ** యూ.చూ. రాతిగుండె. వి. కఠినుడు. **రాతిగుండె** యూ. రాతిగుండియ. శాతిగుండియ, శాతిగుండె. వి. కఠినుడు. శాశ్ల. సం. 8.99. <రాయి$^{1}$+-ఇ$^{6}$+గుండె. **రాతిగుబ్బి** వి. సారె సులువుగా తిరగటానికి వీలుగా రంధ్రం ఉన్నరాయికి మట్టి, వరిపొట్టు కలిపి భూమిలో పాతిపెట్టిన మట్టిదిమ్మ. రాయి+-ఇ$^{6}$+గుబ్బి. **రాతిగొట్టుబాట** వి. పట్టిరాళ్ళు గుళ్ళుఉన్న దారి. <రాయి$^{1}$+-ఇ$^{6}$+కొట్టు$^{1}$+బాట. **రాతిగొడవ** వి. ఒకరకం చేప. **రాతిగొరక** యూ.చూ. శాతిగొరక. వి. మత్స్యవిశేషం. <రాయి$^{1}$+-ఇ$^{6}$+గొరక. **రాతిచిప్ప** యూ.చూ. రాచ్చిప్ప. వి. గుండ్రంగా లోతుగా అంచులో ఉండే మట్టిపాత్ర. <రాయి$^{1}$+-ఇ$^{6}$+చిప్ప. **రాతికాలుపరిగారాపుమామ** యూ. రాతికాల్పరిగారాపుమామ. వి. సముద్రం. వేంక. ఆం. 16. <రాయి$^{1}$+-ఇ$^{6}$+కాలుపరి+గారాపుమామ. **రాతికాల్పరిగారాపుమామ** యూ.చూ. రాతికాలుపరిగారాపుమామ. వి. సముద్రం. **రాతినార$^{1}$** వి. ఒకరకం కృత్రిమపుపట్టు. <రాయి$^{1}$+-ఇ$^{6}$+నార. **రాతినార$^{2}$** యూ.చూ. శాతినార. వి. ఒకమందుదినుసు. <రాయి$^{1}$+-ఇ$^{6}$+నార. **రాతినేల** వి. గట్టిగాఉండేనేల. <రాయి$^{1}$+-ఇ$^{6}$+నేల. **రాతిపరుపు** వి. వాసాలమీదరాళ్ళుపరిచి సున్నంతో అతికి వేసినకప్పు. <రాయి$^{1}$+-ఇ$^{6}$+ పరుపు. **రాతిపాచి** యూ.చూ. శాతిపాంచి. వి. రాతికి పట్టిన పాచి, ఒకదినుసుమందు (Lichenrot undatus). **రాతిపారు** వి. అడుగున రాయి ఉన్ననేల. <రాయి$^{1}$+-ఇ$^{6}$+పారు. **రాతిపురి** వి. రాతి కట్టడం పైభాగం. <రాయి$^{1}$+-ఇ$^{6}$+పురి. **రాతిపువ్వు** యూ.చూ. శాతిపువ్వు. వి. శిలాపుష్పం. **రాతిపూవు** యూ.చూ. శాతిపువ్వు. వి. శిలాపుష్పం. **రాతిపోటు** వి. తవ్వినప్పుడు భూమిలోరాయి తగలటం. విప్ర. 2.18. <రాయి$^{1}$+-ఇ$^{6}$+పోటు. **రాతిబదనిక** యూ.చూ. శాతివదనిక. వి. పర్వతాల్లో పుట్టే ఓషధీవిశేషం. ప్రబంధ. 133. **రాతిబాటు** వి. కఠినశిలల ఉపరితలాన్ని అరగదీసి మెరుగు పెట్టటానికి వాడే ఒకానొక శిలాభేదం, ఒరపిడిరాయి. <రాయి$^{1}$+-ఇ$^{6}$+పాటు. **రాతిబొమ్మ** వి. రాతితోచేసినబొమ్మ. <రాయి$^{1}$+-ఇ$^{6}$+బొమ్మ. **రాతిమాంసము** వి. 1. పచ్చడి; 2. ఊరుపిండి. సం. మాంస-. ఆమిషం, మాంసం. <రాయి$^{1}$+-ఇ$^{6}$+ సం. మాంస-+-ము. **రాతిమాన్యంధర్మశాసనము** వి. మాన్య దానంఇస్తూ రాయించిన శిలాశాసనం. నె.శా. ఆత్మకూరు. 17. క్రి.శ. 1549. సం. మాన్య-. మన్నించతగింది, ధర్మశాసన-. ధర్మం కొరకైన శాసనం. <రాయి$^{1}$+-ఇ$^{6}$+సం. మాన్య-+-ము+సం. ధర్మశాసన-+-ము. **రాతియుప్పు** యూ. రాతి ఉప్పు. వి. సముద్రంలో పుట్టేఉప్పు, అక్షేబం. <రాయి$^{1}$+-ఇ$^{6}$+ ఉప్పు. **రాతివడ్డు** వి. మలిచేపని. **రాతివాలు** యూ.చూ. శాతివాలు. వి. వజ్రాయుధం. **రాతివీరు(డు** వి. వీరుడి విగ్రహం. శాశ్ల. సం. 7.260 సం. వీర-. శూరుడు, <రాయి$^{1}$+-ఇ$^{6}$+సం. వీర. **రాతిసున్నము** వి. రాతితో చేసిన సున్నం. <రాయి$^{1}$+-ఇ$^{6}$+సున్నము. **రాతిసున్ని** వి. సారె మొలదించటానికి గుచ్చిరాయి మధ్యలోని రంధ్రం. <రాయి$^{1}$+-ఇ$^{6}$+సున్ని. **రాయిగీయి** వి. రాళ్ళను పేర్కొంటూ వాడే

ఊతపదం. రాయిగుద్దిచెప్ప రూ. రాయిగ్రుద్దిచెప్పు. అ.క్రి. బల్లగుద్దిచెప్పు, దృఢంగాచెప్పు. రాయిగొట్టినగొడ్డలి(-కొట్టి. గొడ్డలి) వి. మొండివాడు. గా. హరిశ్చ.ఉ. 646 పం రాయిగ్రుద్దనేల చేయినొవ్వనేల అవ్య. అనవసర కార్యాలకి పోవటం. రాయిగ్రుద్దిచెప్ప రూ.చూ. రాయిగుద్దిచెప్పు. అ.క్రి. దృఢంగాచెప్పు. రాయితాయి వి. రాళ్ళను పేర్కొంటూ వాడే ఊతపదం. రాయినేత వి. దంతులమీద రాళ్ళను పేర్చటం. రాయిపరుపు వి. వాసాలమీద రాళ్ళు పరిచి సున్నంతో అతికివేసిన కప్పు. రాయిబండ వి. సున్నపురాయి కణాలు తీవ్రతాపోష్ణ పీడనాలవల్ల స్ఫటికీకరింపబడిన దిట్టపడి చక్కని ఆకారం పొంది ఏర్పడే చలవరాయి. రాయిబారం రూ.చూ. రాయిభారం. వి. దండెదగ్గర పడుగులో దూర్చిన చువ్వకిందికి జారకుండా దారంకట్టి దండె అవతలికి వేలాడదీసినరాయి. రాయిబిల్ల వి. గానుగకున్న రాతిచక్రం. రాయిభారం రూ. రాయిబారం వి. దండెదగ్గర పడుగులోదూర్చిన చువ్వకిందికి జారకుండా దారంకట్టిదండె అవతలికి వేలాడదీసిన రాయి. రాయిరప్ప వి. రాయి మొ వి. రాలగుంట రూ.చూ. రాలగుంటి. వి. నట్టింట నేలమట్టానికి పాతిపెట్టి ఉంచిన కొద్ది గుంజ కలిగిన పలకరాయి. రాలగుంటి రూ.చూ. రాలగుంట. వి. నట్టింట నేలమట్టానికి పాతిపెట్టి ఉంచిన కొద్దిగంట కలిగిన పలకరాయి. రాలచేలకు గుంట్రకతోలు అ.క్రి. కష్టసాధ్యమైన పనినిచేయు. రాలు[2] వి.బ.వ. రాళ్ళు. పల్నా. వ. 26. రాల్లరగించు స.క్రి. రాళ్ళనుకూడాకరగించు (పాటపాడి). అతిమనోహరంగా పాడు. మను.2.43. <రాలు[2]+కరఁగించు. రాళ్లమిడ్సట్టి వి. పప్పు ఎనపటానికి గులకరాళ్ళను అడుగుభాగంలో పొదిగించి చేసిన చిన్న మట్టిపాత్ర. రాళ్లరాసిగాఁడు వి. 1. రాజమూషికం, పందికొక్కు. వేంక. ఆం. 91; 2. ఎలక. రాళ్ళు వి.బ.వ. 1. డబ్బులు ; 2. నవరత్నాలు ; 3. మట్టిపొయ్యికి పైభాగంలో పాత్రలకు ఆధారంగా తీర్చిన మట్టి ఉబ్బులు ; 4. వడగళ్ళు, వానమాదిరి పడే చిన్న మంచుగడ్డలు. <రాలు[2]+-లు.

రాయి[2] రూ.చూ. రావి. వి. రావిచెట్టు.

రాయాకుతాపి వి. రావిచెట్టు ఆకు ఆకారంలో ఉండే రేకుగల తాపి. <రాయి[2]+ఆకుతాపి.

రాయికోలు రూ.చూ. రాగికోల. వి. 1. వరితెగులు ; 2. దుంప పండిపోయి పట్టికంకి ఏర్పడే దుంప తెగులు.

రాయిటిమన్ను రూ.చూ. రేగటిమన్ను. వి. నల్లబంకమన్ను.

రాయిడి చూ. రాయు[1].

రాయిడికత్తియ చూ. రాయు[1].

రాయిడికత్తె చూ. రాయు[1].

రాయిడికాఁడు చూ. రాయు[1].

రాయిడిగిడిగిడి చూ. రాయు[1].

రాయిడిచేయు చూ. రాయు[1].

రాయిడించు చూ. రాయు[1].

రాయిడు చూ. రాయు[1].

రాయితి రూ.చూ. రాయతి. వి. 1. చౌక ; 2. తగ్గింపు.

రాయితీ రూ.చూ. రాయతి. క్రి. విశ. 1. చవక ; 2. విమోచన ; 3. ఉపకారం ; 4. తగ్గింపు.

రాయితు రూ.చూ. రాయతి. వి. 1. చౌక ; 2. తగ్గింపు.

రాయింత చూ. రాయు[1].

రాయిబారుతాడు రూ.చూ. రాయబారపుతాడు. వి. దండెకు ఒకవైపు చువ్వకు కట్టి రెండోవైపున నవలక్ష గుండు వేలాడదీసిన తాడు.

రాయు[1] అ.క్రి. 1. ఒరయు. స్పృశించు. కు.సం. 7.94 ; 2 కలహించు. భార. భీష్మ. 1.28 ; 3. ప్రతిఘటించు హరి. పూ. 7.115 ; 4. రాల్పడు, (గొంతు) కంపించు. రం.రా. ఉ. 122పు. 26పం ; 5. ప్రకాశించు. క్రీడా. 51 ; 6. దొమ్ము, ప్రవేశించు. కువ.చ. 3.78 ; స.క్రి. గంజి పడగట్టటానికి గుడ్డలో పోసిరుద్దు.

క. అరె, ఆరి. రుబ్బు, నూరు, అరయిసు, అరిసు, కొడ. అర. తిరగలితో గుండ చేయు, నూరించు ఆరెయుని, ఆరెవుని, అరెపిని. పొడిచేయు ; త. అరై. రుబ్బు, నూరు, రాపిడివల్ల నశింపచేయు, అరక్కు. అరచేత్తోనలుపు, మ. అరయుక. నల్లగొట్టు, అరెక్క పొడిచేయు ; గోం. అరీ. ఈడ్చు ; కుయి. రాగ. చింపు (రాపిడివల్ల) ; కువి. రాచ్. ఛిద్రంచేయు ; కొలా. రాక్. పళ్ళుతోము.

మూ. ద.ద్రా, మూ.మ.ద్రా.*అర్–, ఆ–.

<మూ.మ. *అర్–అ.

రాయడి రూ.చూ. రాయడి. వి. బాధ, ఉపద్రవం. ఉ.రా. 2.19. రాయడించు స.క్రి. బాధించు. తాళ్ల సం. 14.93. <రాయడి+ -ఇంచు.[3] రాయిడి రూ. రాయడి వి. 1. కలహం, వివాదం. రం.రా. యు. 300పు. 15 పం. ; 2. ఒరయిక. నృసింహ. 3.75 ; 3. బాధ, ఉపద్రవం. వేంక. పంచ. 1.294 ; 4. దూరు, నింద. సీల. 1.79. రాయిడికత్తియ రూ.చూ. రాయిడికత్తె. వి. ఉపద్రవం చేసేస్త్రీ. ధనాభి. 2.60. రాయిడికత్తె రూ. రాయిడికత్తియ. వి. ఉపద్రవం చేసే స్త్రీ. విక్ర. 6.73. రాయిడికాఁడు వి. ఉపద్రవం చేసేవాడు, హాని చేసేవాడు. రాయిడిగిడిగిడి వి. ఢమామి (ఒకరకం వాద్యవిశేషం). రాయిడిచేయు స.క్రి. వేధించు. రుక్మాం.చ. 5.111 రాయిడించు అ.క్రి. 1. కలహించు, వివాదపడు. హర. 5.44 ; 2.ఒరయు. రాజవా. 5-54 ; 3. అతిశయించు. విష్ణుపు. 6.14 ; స.క్రి. బాధించు. చంద్రభా. 1.19 <రాయిడి+- ఇంచు[3]. రాయిడు స.క్రి. ఒరిసికొను, ఒత్తుకొను. <రాయు[1]+ఇడు. రాయింత వి. రాయిడి. గంధ. 226. రాయుడు వి. రాపిడి. రారాపిడి వి. మిక్కిలి రాపిడి. రారాపు వి. మిక్కిలి ఒరయిక, ఉపద్రవం. మను. 3.68.

రాయు[2] రూ.చూ. వ్రాయు. అ.క్రి. లిఖించూ, వ్రాయు.

రారానియెడ చూ. వచ్చు.

రారాపిడి చూ. రాయు[1]

రారాపు చూ. రాయు.[1]

రారాపొసర్చు చూ. రాచు.

రారేక[2] రూ.చూ. రావిరేక. వి. 1. పిల్లలకు ముందుసిగను

కట్టే రావి ఆకులాంటి ఒకనగ. వరాహ. 66; **2.** కర్ణ భూషావిశేషం. ఆం.భా. 2.148.

**రాలగుంట** చూ. రాయి$^{1}$.

**రాలగుంటి** చూ. రాయి.

**రాల(గొట్టు** చూ. రాలు$^{1}$.

**రాలచేలకుగుంటకతోలు** చూ. రాయి$^{1}$.

**రాలించు** చూ. రాలు$^{1}$.

**రాలిపడిపోవు** చూ. రాలు$^{1}$.

**రాలిపాటు** చూ. రాలు$^{1}$.

**రాలు**$^{1}$ అ.క్రి. **1.** గళితమగు, కిందపడు. భార. విరా. 2.236; **2.** నశించు. ఇందు. 4.58; **3.** అతిశయించు. సుదంతా 2.157; **4.** విరిగిపడు. దశా. 1.286.

త. అరల్, నరుకు; గోం. అ(రానా. పడు; కొండ. అర్. పడు; నా. రాల్-(రాట్-) పడిపోవు, రాల్ప్-పడచేయు, పడేయు.

**రాల(గొట్టు** స.క్రి. రాల్చు, రాలేట్టుచేయు <రాలు$^{1}$+-అ$^{7}$. +కొట్టు$^{1}$. **రాలించు** స.క్రి. రాల్చు, రాలేటట్లుచేయు. రామ లిం.శ. 94. <రాలు$^{1}$+-ఇంచు$^{3}$. **రాలిపడిపోవు** అ.క్రి. నోటికి వచ్చినట్లు తిట్టు. <రాలు$^{1}$+-ఇ$^{13}$+ పడిపోవ **రాలిపాటు** వి. గర్వం, అహంకారం. **రాలుగాను (-కొను)** అ.క్రి. గళితమగు, కిందపడు. కు.సం. 6.110. **రాలు(గాయ (-కాయ)** రూ. రాలు(గాయి. వి. 1 పనికిరానివాడు; 2. ఘటికుడు. **రాలు(గాయతనము** వి. దుండగం. హంస. 5.110. **రాలు(గాయి** రూ.చూ. రాలు(గాయ. వి. తుంటరి. దుష్టుడు. **రాలుచు** రూ.చూ. రాల్చు. స.క్రి **1.** రావేట్లుచేయు, భాస్క. రా.సుం. 33;, **2.** వదలించు, దులుపు; **3.** చల్లు. **రాలుడు** వి. **1.** చెట్టునుంచి తమంతరాలినవి; **2.** వరి మొ. పైరులు ఇచ్చే ఫలితం. **రాలువడు** రూ.చూ. రాల్పడు. అ.క్రి. (ఎలుగు) కంపించు. భార. శాంతి. 3 329. **రాలుపాటు** వి. గద్గదం, కంపనం. ఉ. హరి. 5.112 **రాలుపు** వి. **1.** రాలటం. ఆము. 5.117; **2.** దిగుబడి. **రాలుపుడు** వి. కంపం, వణకు. **రాలుబడి** వి. **1.** ఫలసాయం, దిగుబడి; **2.** రాలటం. **రాలువారు(పారు$^{1}$)** రూ. రాలువాఱు. అ.క్రి. జారు, ప్రవహించు. కు.సం. 1.36. **రాలువాఱు** రూ.చూ రాలు. వారు అ.క్రి. **1** జారు, ప్రవహించు; **2.** పడు; **3.** ఊడు. **రాల్చు** రూ. రాలుచు. స.క్రి. **1.** రాలేట్లుచేయు. భార.విరా. 2.240; **2.** విదిలించు, దులుపు. గౌ. హరి. పూ. 12 1. పం.; **3.** చల్లు. వసు. 1.150; వి. వరి మొ: పైరులిచ్చే ఫలితం. **రాల్పడు** రూ. రాలుపడు. అ.క్రి. (ఎలుగు) కంపించు. భార. ద్రోణ. 2.232.

**రాలు**$^{2}$ చూ. రాయి$^{1}$.

**రాల్గర(గించు** చూ. రాయి$^{1}$.

**రాల్చు** చూ. రాలు$^{1}$.

**రాల్పడు** చూ. రాలు$^{1}$.

**రాళ్ళమిర్చట్టి** చూ. రాయి$^{1}$.

**రాళ్ళరాసిగా(డు** చూ. రాయి$^{1}$.

**రాళ్ళు** చూ. రాయి$^{1}$.

**రావ** వి. వరదల్లో కొట్టుకొని వచ్చిన మెత్తటి మట్టి.

**రావమన్ను** రూ.చూ. రేవమన్ను వి. సన్నని ఒండ్రు మట్టి.

**రావడి** రూ.చూ. హావళి. వి. **1.** ఉపద్రవం; **2.** బాధ.

**రావణహస్తం** వి. వాద్యవిశేషం, ప్రబంధ. 605.

సం. రావణహస్త – రావణుని చేయి.

<సం. రావణహస్త – (అర్థవిపరి.).

**రావణాసురునికాష్ఠం** వి. ఎడతెగనిది.

రావణాసురుని చితిలోని కర్రలు ఎప్పటికీ ఆరవని జానపదోక్తి.

**రావతి** చూ. వచ్చు.

**రావి** రూ. రాగి$^{3}$, రాజి$^{2}$, రాయి$^{2}$, వి. అశ్వత్థం. కాశీ. 6-46, గౌ. హరి. పూ. 1207. (Ficus Religiosa).

క. అరసె, అరిసె, అళలి, అళ్ళె, రావి; కొడ, అరళు-మర; త. అరచు, అరచ-మరమ్; మ. అరయాల్, అరసు; కొలా. ర.వి.

**రావిఆకు** వి. రావి ఆకు రూపంలో చేయబడిన అడ్డిగలు, కంఠాభరణ విశేషం. **రావిచెట్లు** రూ. చూ. రాగిచెట్టు. వి. పిప్పలం. అశ్వత్థం, రాగిచెట్టు. **రావిపూజనాలు** వి. బ. వ. ధాన్య విశేషం. **రావిమూని పూపులు** వి. బ.వ. తేనివి, తుందేటికొమ్ములు. తాళ్ల. సం. 7-34. **రావిరేక** రూ. రవిరేక, రారేక$^{2}$. రావ్రేక. వి. **1.** పిల్లలకు ముందు సిగమీద ఉంచే రావిఆకులాంటి ఆభరణవిశేషం. హరి, పూ. 5.191; **2.** కర్ణభూషా విశేషం. సారంగ. 1.50. **రావేకు తెగులు** రూ. రాయాకు తెగులు. వి. పొగాకు తెగులు. ఒకరకం పేను తెగులు. **రావ్రేక** రూ.చూ. రావిరేక. వి. పిల్లలకు ముందుసిగలో పెట్టే రావి ఆకులాంటి భూషణ విశేషం. కాశీ. 3.240.

**రావిఅవిరేడి** రూ. చూ. రాతరివేణి. వి. సున్నంపూసి నలుపుగీతలు గీసి ఆగీతల సందుల్లో ఎరుపు, ఆకుపచ్చ మొ. రంగులతో ఏనుగులు, ఒంటెలు, గుర్రాలు, పుష్పాలు, నెమళ్ళు మొ. బొమ్మలు వేసిన అరివేణి కుండలు.

**రావిగడ్డి** వి. ఒకరకంగడ్డి.

**రావించు** చూ. వచ్చు.

**రావు**$^{1}$ వి. **1.** పూర్వం వెలమదొరల పట్టపు పేరు. శ్రీనాథుని చాటుప; **2.** రాజు. రామాభ్యు. 8.67; **3.** పేరుచివర 'రావు'పదాన్నిచేరుస్తారు; **4.** ఠీవి; **5.** ముఖకాంతి.

సం. రాజన్. రాజు, ప్రభువ; ప్రా. రాయ-; మరా. రాఓ. రాజు, మహారాష్ట్రులబిరుదు; ఉ. రాఓ;

క. రావ్. రాజు; త. రావ్. మహారాష్ట్రుల బిరుదు.

<మరా. రాఓ.

**రావు**$^{2}$ రూ.చూ. త్రావ$^{2}$. వి. దూలంమీద అడ్డంగా గాని, దూలానికి బదులుగా గాని గోడలమీద కప్పుకు ఆధారంగా వేసే చెక్కన వానం.

**రావుత** రూ.చూ. రావుతు(డు. వి. **1.** గుర్రంఎక్కేవాడు; **2.** అధిపతి.

**రావుతు** రూ.చూ. రావుతు(డు. వి. **1.** అధిపతి; **2.** గుర్రం ఎక్కేవాడు.

**రావుతు(డు** రూ. రవుతు, రావుత, రావుతు, రావుత్తు, రావుత్తు(డు, రాహుతు, రాహుతు(డు, రాహుత్త. రాహు

త్తఁడు, రాహుత్తి, రాహుత్తు, రాహుత్తుఁడు, రౌత, రౌతు. వి. రౌతు, అశ్వసాది. నిర్వ. రా. 1.42.

సం. రాజపుత్ర-; ప్రా. రాఉత్త-, రాయఉత్త- రాజపుత్రుడు, శూరుడు, క్షత్రియుడు; శౌ. రాఅఉత్త; మా. లాఉత్త-; పా. రాజపుత్త-; అప. రాఅపుత్త-;

క. రావుత, రార్త, రాహుత. అశ్వారోహకుడు, సేనాని, రావుతికె. అశ్వారోహకధర్మ; తు. రావుతె. సాహిణి, రాజమాతశబ్దమని కొందరు.

<ప్రా. రాఉత్త-.

**రావుత్తు** రూ.చూ. రావుతుఁడు. వి. రౌతు. అశ్వసాది. భీమ. 1.2.

**రావుత్తుఁడు** రూ.చూ. రావుతుఁడు. వి. రౌతు, గుర్రంరౌతు పాండు. 4.51.

**రావుబహదూరు** రూ. రావుబహద్దూర్ వి. బిరుదవాచకశబ్దం.

ఉ. రావ్-బహాదూర్, బిరుదవాచకశబ్దం.

<ఉ. రావ్-బహాదూర్.

**రావూరురసికుడు** వి. నెల్లూరు నెరజాణకు ఎదురుద్దిగా పేరు గాంచిన కల్పిత పురుషుడు, రావూరు గ్రామనామం.

**రావెడలు** చూ. వచ్చు.

**రావేకుతెగులు** చూ. రావి.

**రావోలిచీర** వి. పచ్చకపిల, కర్మంజి రంగులు వచ్చేట్టు పట్టు, నూలుకలిపి నేసిన చీర.

**రావ్రేక** చూ. రావి.

**రాశికెక్కు** రూ. రాసికెక్కు. అ.క్రి. గణనకెక్కు, వాసికెక్కు. పంచ. చ. 1.2.385.

సం. రాశి-పోగు, మొత్తం, అధికం, లెక్కకై వేసిన అంకె.

<సం. రాశి-+-కున్+ఎక్కు.

**రాశిగోడ** వి. రెండు మిద్దెలను కలుపుతూ కట్టినగోడ.

సం. రాశి-పోగు, మొత్తం, కుప్ప.

**రాశిసేద్యం** వి, ఉమ్మడిసేద్యం, చిన్నరైతులు కొంతమంది కలిసిచేసే సేద్యం.

సం, రాశి-కుప్ప, గుంపు, మొత్తం.

**రాష్ట్రకూటము** వి. రట్టడికము, ప్రభుత్వం. ద. హిం. గా. సంపు. 4. గా.సం. 1237. క్రీ.శ. 1107.

సం. రాష్ట్రకూట-రాజవంశ భేదం.

<సం. రాష్ట్రకూట-(అర్థవిపరి).

**రాష్ట్రము** వి. దేశంలో ఒకభాగం, ప్రదేశం.

సం. రాష్ట్ర-దేశం, రాజ్యం.

<సం. రాష్ట్ర-(అర్థవిపరి).

**రాసకమ్మి** చూ. రాచ. వి. నాలుగు కొలుకుల దారంతో తల చిట్టెనేసి కొంగ వేలెడు వెడల్పు నందు, పదహారు కొలుకులుగా గాని ఇరవై కొలుకులు గాని ఒక పట్టెనేసిన కమ్మి.

**రాసకాల్వ** చూ. రాచ. వి. ఏటినుంచి చెరువుకు నీళ్ళువచ్చే కాలువ.

**రాసగడ్డి** చూ. రాచ. వి. ఒకరకం కలుపుమొక్క.

**రాసగుమ్మడి** రూ.చూ. రాచగుమ్మడి. వి. 1. బూడిదగుమ్మడి; 2. మంచి గుమ్మడిలో చిన్నరకం కాయ.

**రాసి** వి. 1. మొత్తం. హర. 2.141; 2. పోగు, పుంజం. భాగ. 10 పూ. 1672; 3. మేషాదిరాశి. ద్వి. పరమ. వి. 5.357.

సం. రాశి-గుంపు, మొత్తం, మేషాదిరాశి; ప్రా. రాసి. కుప్ప, గుంపు, మేషాది ద్వాదశరాశి; జై. మహా. అ.మా. పా. అప. రాసి; శౌ. రాసి; మా. లాసి;

క. రాసి. పోగు; త. ఇరాచి. మొత్తం. గుంపు, ద్వాదశరాశి; కువి. రాసి. సేనలు.

<ప్రా. రాసి.

**రాసికెక్కు** రూ.చూ. రాసికెక్కు. అ.క్రి. ప్రసిద్ధి కెక్కు. శాల్ల. సం. 3.630. **రాసిపడు** వి. కుప్పపడు, పోగుపడు. **రాసిపెట్టిఉండు** అ.క్రి. విధి నిర్ధారితమైఉండు. **రాసిపొలి** వి. ధానం కుప్పకు పూజ చేసి పెట్టే నైవేద్యం. **రాసిసుడి** రూ. రూసెసుడి, రాస్సుడి, వి. మూపుమీద ఉండే సుడి. **రాసిసేయు** (-చేయు) స.క్రి. ప్రశంసించు. శాల్ల. సం. 7.250.

**రాసిక** రూ. రేస్క. వి. రాసగడ్డి, ఒకరకం కలుపుమొక్క.

**రాసికడంచీర** వి. నిలువుకు తెలుపు, పేకకు మరొకవన్నె పెట్టి నేసిన గళ్ళచీర.

**రాసెన** వి. చిన్నసైజు గుంటక.

**రాసెసుడి** రూ.చూ. రాసిసుడి. వి. మూపుమీద ఉండే సుడి.

**రాస్తచీర** రూ.చూ. రాస్తాచీర. వి. రెండుకొలుకులు పచ్చ, ఒక కొలికి నలుపు చొప్పున పడుగుపోగులు అతికి నేసిన చీర,

**రాస్తా** వి. 1. మార్గం, దారి. అని. 3.19; 2. అంచులో నేసిన ఒకరకం గీర.

హిం ఉ. రాస్తా. మార్గం, రీతి; మరా. రస్తా. మార్గం; పార. రాస్తా. మార్గం, దారి, తిన్నగాఉండేది.

<ఉ. రాస్తా.

**రాస్తాకమ్మి** వి. మరమగ్గంలో పన్నె బిగించిన కింది కొయ్య.

**రాస్తాచీర** రూ. రాస్తచీర. వి. రెండుకొలుకులు పచ్చ, ఒక కొలికి నలుపు చొప్పున పడుగుపోగులు అతికినేసిన చీర.

**రాస్తాబొగ్గు** వి. భూగర్భంనుంచి తవ్వితీసినబొగ్గు, నేల బొగ్గు.

**రాస్సుడి** రూ.చూ. రాసిసుడి వి. మూపుమీదఉండే సుడి.

**రాహదారీ** రూ.చూ. రహదారి వి. 1. పాస్‌పోర్టు; 2. మార్గం; 3. పర్మిట్టు; 4. లైసెన్సు.

**రాహితీ** రూ.చూ. రాయతి. వి. తగ్గింపు.

**రాహితు** రూ.చూ. రాయతి. వి. తగ్గింపు.

**రాహుతు** రూ.చూ రావుతుఁడు. వి. రవుతు. రం. రా. యు. 406పు. 26పం.

**రాహుతుఁడు** రూ.చూ. రావుతుఁడు. వి. రౌతు. భార. విరా. 5.51, రం.రా.యు. 407పు. 2పం.

**రాహుత్త** రూ.చూ. రావుతుఁడు. వి. అశ్వసైనికుడు. E.C.X. బాగేపల్లి 76.1729 A.D.

**రాహుత్తఁడు** రూ.చూ. రావుతుఁడు. వి. రౌతు, అశ్వసాది.

**రాహుత్తి** రూ.చూ. రావుతుఁడు. వి. 1. పందెం కోడిపుంజు;

2. వేటకుక్క.

**రాహుత్తు** రూ.చూ. రావుతుఁడు. వి. రౌతు, సాది. శ్రీనాథుని చాటువు. రం.రా.యు. 406. 26పం.

**రాహుత్తుఁడు** రూ.చూ. రావుతుఁడు. వి. రౌతు, సాది.

**-రికము** రూ.చూ.-ఇకము. అప. భావార్థంలోవచ్చే ప్రత్యయం. ప్రబా. 3.88.

**రికరించు** రూ.చూ. రికిరించు. స.క్రి. నిక్కబెట్టు.

**రికాబి** రూ. రికాబు[2], రికావు, రికీబు[2], రికేబి. వి. మట్కిలపై మూతగా మూసే మట్టి మూకుడు.

**రికాబు[1]** వి. అంకవన్నియ, అంకవన్నె.

హిం. ఉ. అర. *రికాబ్*. అంకవన్నె; పార. *రకాబ్*.

క. *రికావు*, *రికాబు*. అంకవన్నె, త. *రికా. ప్*.

< ఉ. రికాబ్.

**రికాబు[2]** రూ.చూ. రికాబి. వి. మట్కిలపై మూతగా మూసే మట్టి మూకుడు.

**రికామిగా** రూ. రికాముగా. అవ్య. ద్రు. పనిపాటలు లేకుండా.

క. *రికామి*. శూన్యం. ఖాళీ;

మరా. *రికాము*. వ్యర్థం.

**రికాముగా** రూ.చూ. రికామిగా. అవ్య. ద్రు. 1. తీరిగ్గా; 2. వ్యర్థంగా.

**రికార్డు** వి. కోమటి యొక్క రహస్యపు లెక్క.

ఇం. *Record*. నమోదు చేసింది.

< ఇం. Record.

**రికావు** రూ.చూ. రికాబి. వి. మట్కిలపై మూతగా మూసే మట్టి మూకుడు.

**రికిరించు** రూ. రికరించు. స.క్రి. నిక్కబెట్టు. రసిక. 1.113.

**రికీబు[1]** వి. సేవకుడు, గులాము. వి.ప. 3 28.

హిం. *రికాబ్*. దానగుణం; ఉ. *రికాబ్* దానగుణం; పార. *రికాబ్*. కొనబడిన బానిసలు; అర. *రికాబ్*. బానిసలు.

**రికీబు[2]** రూ.చూ. రికాబి. వి. మట్కిలపై మూతగా మూసే మట్టి మూకుడు.

**రికేబి** రూ.చూ. రికాబి, మట్కిలపై మూతగా మూసేమట్టి మూకుడు.

**రిక్క[1]** వి. నక్షత్రం. భాస్క. రా.యు. 354.

సం. *ఋక్ష-*. ఎలుగుబంటి, నక్షత్రం; ప్రా. *రిక్ఖ-*, *రిచ్ఛ-*; జై. మహా.శౌ. *రిక్ఖ*; శౌ.అ.మా. *రిచ్ఛ*; పా. *ఇక్క-*, *రుక్ఖ-*. అప. *రుక్ఖ*,

బ్రా. *రిఛ్*. ఎలుగుబంటి.

< ప్రా. రిక్ఖ-.

**రిక్కగోచి** వి. దిక్కగోచి. **రిక్కదారి** వి. ఆకాశం. ఆం.భా. 1.69. **రిక్కదొర** వి. చంద్రుడు. రాజవా. 3.65. **రిక్కరక్కసుడు** వి. తారకాసురుడు. **రిక్కరక్కసుమిత్తి** వి. కుమారస్వామి, తారకాసురుని మృత్యువు. **రిక్కరాయఁడు** వి. చంద్రుడు. వసు. 1.80. **రిక్కతేఁడు** వి. నక్షత్రేశుడు, చంద్రుడు. అచ్చ. రా. కిష్కిం. 53. **రిక్కలదొర** వి. చంద్రుడు. రామరా. 3.71. **రిక్కలనంటు(-అంటు[1])** వి. చంద్రుడు. **రిక్కలరాయఁడు** వి. హర. 5.5.

**రిక్క[2]** రూ.చూ. చిక్క. వి. 1. గుర్రం నడవటం కోసం గుర్రంరౌతు నోట వెలువడే ధ్వన్యనుకరణం; 2. పశువుల్ని తోలేటప్పుడు చేసేధ్వని.

**రిక్క[3]** వి. పొగచెట్టు కాడకు, ఆకుకు మధ్య వేసేపిలక, తలకొమ్మ గిల్లిన తరవాత వేసే చిగురు.

**రిక్కతీయు** అ.క్రి. పొగచెట్టు కాడకు ఆకుకు మధ్య వేసే పిలకను తీసివేయు. **రిక్కతెగులు** వి. రాగితెగులు, కంకిలోని రెక్కలు విరిగి పడిపోయే తెగులు. **రిక్కలగుంటక** వి. పైరులో కలుపు మొక్క తియ్యటానికి తోలే రెండు మూడు పలుగుల గుంటక. **రిక్కలదంతె** వి. మెట్లగుంటక, మూడు పలుగుల గుంటక, పైరులో గడ్డి కలుపు పోవటానికి తోలేది. **రిక్కవేయు** అ.క్రి. పొగచెట్టు కాడకు ఆకుకు మధ్య వేసే పిలకను తీసివేయు.

**రిక్కరించు** చూ. రిక్కు.

**రిక్కలిడు** చూ. రిక్కు.

**రిక్కలు** వి.బ.వ. వేత్రహస్తులు. ధ్వన్యను.

**రిక్కవెట్టు** చూ. రిక్కు.

**రిక్కించు** చూ. రిక్కు.

**రిక్కు** రూ. చిక్కు. వి. 1. తోకతిప్పటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. హరిశ్చ. 2.49; 2. బెత్తం కదపటంలో అయ్యే ధ్వనికి అనుకరణం; 3. నిక్కు; 4. కొయ్యకు సహజంగా ఉన్న పాయ.

**రిక్కరించు** రూ.చూ. రిక్కించు. స.క్రి. నిగుడించు. ప్రబంధ. 186. **రిక్కలిడు** స.క్రి. ఒళ్ళు విరుచుకొను. < రిక్కు + -లు + ఇడు. **రిక్కవెట్టు (-పెట్టు)** స.క్రి. ఒళ్ళు విరుచుకొను. **రిక్కించు** రూ. రిక్కరించు. స.క్రి. నిక్కచేయు. రామాభ్యు. 6.93.

< రిక్కు + -ఇంచు[3].

**రిక్షా** వి. మనిషిలాగే రెండుచక్రాల బండి. ఇప్పుడు ఇవి వాడుకలో లేవు. మూడు చక్రాలసైకిల్‌రిక్షాలు వాడుకలో ఉన్నాయి.

ఇం. *Jinrikshaw, Rikshaw*. మనిషిలాగే రెండు చక్రాల బండి. జపనీస్ Jin మనిషి Riki శక్తి sha బండి.

జపనీస్ 'జిన్ రికిషా' పదం ఆంగ్లంలోకి ఎరవుమాటగా వచ్చి తర్వాత ఆంగ్లంనుంచి తెలుగులోకి ప్రతిదేయపదంగా వచ్చింది.

< ఇం. Rikshaw.

**రిక్షావాల** రూ. రిక్షావాలా. వి. రిక్షాతొక్కేవాడు.

ఇం. *Rikshaw*. మనిషి లాగే మూడు చక్రాల బండి; హిం. -వాలా. సంబంధ సూచక ప్రత్యయం.

< ఇం. Rikshaw + హిం. -వాలా.

**రిక్షావాలా** రూ.చూ. రిక్షావాల. వి. రిక్షాతొక్కేవాడు.

**రింగార్చి** చూ. రింగు.[3]

**రింగిబండి** చూ. రింగు.[3] వి. గూడుబండి, పైన గూడున్న ప్రయాణపు బండి.

**రింగు**[1] రూ.చూ. టింగు.[2] వి. **1**. బాణం సంధించేటప్పుడు అయ్యే ధ్వనికి అనుకరణం. చమ. **3.77**. **2**. పైకెగర టంలో అయ్యేధ్వనికి అనుకరణం. చంద్రాంగ. **6.90**; **3**. బాణాలు విసిరేటప్పుడు ధ్వనికి అనుకరణం. ప్రబంధ. 788 ; **4**. పిట్టరెక్కల ధ్వనికి అనుకరణం, చాటువ. ధ్వన్యను.

**రింగు**[2] రూ.చూ. టింగు[1]. వి. వస్త్రంకుచ్చె. వస్త్రంకుచ్చెళ్ళు. రామాభ్యు 2.109.

**రింగులు** వి బ. వ. బట్టకుచ్చెళ్ళు. కాశీ. **2.146**. **రింగులుజాఱు** అ.క్రి. పింజలు జారు. విప్ర. 2.79.

**రింగు**[3] వి. **1**. మరాను ఒగ్గుల పట్టెకు బిగించిన చిన్న ఇనపచుట్టు ; **2**. చేతినాడె గాడెలో బుసిపుల్లకు వేసిన చిన్న చుట్టు ; **3**. దాటీగొలుసు బద్దల్ని. కలిపిన ఇనప చుట్టు ; **4**. పిడిగల వలయాకారపు ఇనుప బద్దీ, పగల గొట్టుతున్న రాతి పలుకులు పక్కలకు ఎగిరిపోకుండా ఆపిఉంచే బద్దీ ; **5**. లక్కాకు, చక్రం కుండ అరగకుండా ఉండటానికి ఇరుసును దూర్చే రంధ్రానికి వెలివైపునా లోవైపునా వేసిన ఇనపకట్టు ; **6**. ఉంగరం.

ఇం. *Ring* ఉంగరం, వలయం.

<ఇం. Ring.

**రింగార్చి** వి. గుండ్రంగా ఉండే ఆర్చి. <రింగు[3]+ ఆర్చి. **రింగురాయి** వి. గుండ్రంగా ఉండేరాయి. **రింగులబద్ద** వి. మరాను కట్టుబడిలో పడుగు పోగులు దూర్చే ఉంగరాలు. రేకు ముక్క బిగించిన కొయ్యపట్టె. **రింగ్‌కూజా** వి. వలయాకారంగా చేసిన సీళ్ళకూజా. ఇం. ***Ring***. వలయం ఉంగరం. <ఇం. Ring+కూజా.

**రింగ్‌కూజా** చూ. రింగు[3].

**రిచ్చ** రూ.చూ. టిచ్చ. వి **1**. నిశ్చేష్టత, ఏమీతోచక ఉండటం ; **2**. దిగులు ; **3**. మ్రాన్పాటు.

**రిచ్చకోరింద** వి. కోరింద (గోరింట) లో ఒకరకం. **రిచ్చగొను (-కొను)** స.క్రి. దిగులుపడు. **రిచ్చపడు** రూ.చూ. టిచ్చపడు. స.క్రి. దిగులుపడు. **రిచ్చపాటు** రూ.చూ. టిచ్చపాటు. వి. ఆశ్చర్య పడు, నిశ్చేష్టత. **రిచ్చపిట్ట** వి. ధ్వని ఎక్కువగా చేసే ఒకపిట్ట. **రిచ్చలు** వి.బ.వ. ఒకరకం వడ్లు. **రిచ్చలుపడు** స.క్రి. దిగులుపడు, విచారుపడు. **విష్ణుపు**. **7.139**.

**రిజర్వు** వి. పన్ను కట్టందే పశువుల్ని మేపుకోవటానికి వీల్లేని అడవి.

ఇం. *Reserve*. మినహాయింపు.

<ఇం. Reserve.

**రిజర్వుకల్ల** వి. ఆముకాల్చటానికి అడవినుంచితెచ్చిన ముళ్ళకంప. ఇం. *Reserve*. మినహాయింపు.

<ఇం. Reserve+కల్ల[2].

**రిజాల** రూ.చూ. రిజాలా. విణ. **1**. నీచమయిన ; చెడ్డ ; **2**. **3**. మోటు.

**రిజాలబ్రాహ్మణులు** చూ. రిజాల. వి.బ.వ. నేపాళదేశ బ్రాహ్మణులు.

జాలా రూ. రిజాల. వి. **1** వ్యభిచారం . **2**. పనిలేమి.

హిం.ఉ. *రిజాలీ*. సిగ్గులేమి, నిర్లజ్జత ; పార. *రజీల్*. నీచమయినది.

<ఉ. రిజాలీ.

**రించకొర్ర** చూ. రిచ్చ. వి. కొర్రల్లో ఒకరకం.

**రింజ** వి. మల్లబంధవిశేషం, కాలుపట్టుకోవటానికి వెళ్తే, కాలు తప్పించి నందిటిలో మెడవొదివి పట్టేపట్టు. ఉ. హరి. 3.69.

**రింజాకుండ** వి. వాయిద్యాలకు వాడే ఒకరకం మట్టికుండ.

**రిటన్‌వొర** రూ.చూ. లిట్రిన్‌వొర. వి. పాయకానా దొడ్లకు ఉపయోగించే ఒర.

**రిట్ట** వి. ఒకానొకచెట్టు, కుంకుడుచెట్టు.

మరా. *రిఠే*. వృక్షవిశేషం.

<మరా. రిఠే.

**రిట్టకాయ** వి. కుంకుడుకాయ. **రిట్టమ్రాను** వి. వృక్షవిశేషం, కుంకుడుచెట్టు. E I. సంపు. **10**. క్రీ.శ. **1102**. (Sopindus enarginatus).

**రిత్త** రూ. రుత్త. విణ. **1**. వ్యర్థం, నిరర్థకం. కు. సం. **4.28** ; **2**. వట్టిది, శూన్యం. భార. అను. **1.136** ; **3**. ఇతరమైంది. భాస్క. రా. యు. **876** ; **4**. కల్ల. శృం. నై. 8.70 ; వి. **1**. కల్ల. అబద్ధం. భార. ఉద్యో. 2.193 ; **2**. వ్యర్థత. శృం. నై. 7.183 ; క్రి. విణ. **1**. ఊరక, వ్యర్థంగా. భార. ద్రోణ. **3.68** ; **2**. నిష్కారణంగా ఊరక. విక్ర. 2.182.

సం. *రిక్త* – శూన్యం ; ప్రా. *రిత్త* – శూన్యం, అభావం ; అ. మా.పా. *రిత్త-*, పా. *రిత్తకో*..

<ప్రా. రిత్త–.

**రిత్తకత్తియ** రూ.చూ. రిత్తకత్తె. వి. సంబంధంలేనిస్త్రీ, తేరకత్తె. **రిత్తకత్తె** రూ. రిత్తకత్తియ. వి. సంబంధం లేని స్త్రీ, తేరకత్తె. **రిత్తకాఁడు** రూ.చూ. రిత్తగాఁడు. వి. తేరకాడు. సంబంధం లేనివాడు. **రిత్తకురిత్త** క్రి. విణ. ద్రు. **1**. కేవలంగా, నిష్కారణంగా. భార. విరా. **2.250** ; **2**. మిక్కిలివ్యర్థంగా. భార. విరా. 3.70 ; **3**. తేరగా. అనాయాసంగా. భోజ. **2.182**. **రిత్తగాఁడు** రూ. రిత్తకాఁడు, వి. తేరకాడు, సంబంధం. లేనివాడు నిర్వ.రా. **3.92**. **రిత్తచను** అ.క్రి. వ్యర్థమగు. కళా. 2.6 **రిత్తచేతులు** వి.బ.వ. వట్టిచేతులు. శుక. **3.251**. **రిత్తచేయిచూపు** స.క్రి. లేదను. సుమతీ. 70. **రిత్తజంకించు** స.క్రి. ఊరికే బెదిరించు. పారి. **4.67**. **రిత్తపుచ్చు** రూ.చూ. రిత్తిపుచ్చు. స.క్రి. వ్యర్థపుచ్చు. **రిత్తపోవు** రూ.చూ రిత్తవోవు. అ.క్రి. వ్యర్థమగు. **రిత్తవడు(-పడు)** అ.క్రి. శూన్యమగు. కకుత్థ్స. **1.142**. **రిత్తవాఁడు** విణ. రిక్తుడు, ఏమీ లేనివాడు. వేంక. పంచ. 4.90. **రిత్తవుచ్చు(-పుచ్చు)** రూ.చూ. రిత్తపుచ్చు. స.క్రి. వ్యర్థపుచ్చు. భార. ద్రోణ. **3.161**. **రితవోవు(-పోవు)** రూ. రితపోవు. అ.క్రి. వ్యర్థమగు. భార. విరా. **5.23**. **రిత్తసడి** వి. వట్టి అపవాదు, తప్పుచేయకుండా చేరాడన్న అపనింద, చెడ్డపేరు. పండి. చ. 2.3.49. **రిత్తసావుసచ్చు** అ.క్రి. వ్యర్థంగా చనిపోవు. భార. కర్ణ. 2.17. <రిత్త+ చావు+చచ్చు.

**రిత్రిక** వి. తమ్మునిభార్య, మరదలు.

సం. రిక్త్రికా. తమ్ముడిభార్య, మరదలు.

**రిపరు** రూ.చూ. రీపరు. వి. ఇంటికప్పు వేయటంలో వాడే పల్చని చెక్క, దంతుల మధ్య బిగించేబద్ద.

**రిపరుబద్ద** వి. ఇంటికప్పు వేయటానికి వాడే పలచని చెక్క.

**రిపా** రూ.చూ. రీపరు. వి. ఇంటికప్పు వేయటంలో వాడే పల్చని చెక్క, దంతులమధ్య బిగించే బద్ద.

**రిపెరు** రూ.చూ. రీపరు. వి. ఇంటికప్పు వేయటంలోవాడే పల్చని చెక్క, దంతులమధ్యబిగించేబద్ద.

**రిప్ప** వి. 1. వెలిత, లోటు. యయా. 3.63 ; 2. పీనర పీనరం, తొర్రి.

**రిప్పన** రూ.చూ. టిప్పన. క్రి. విశ. ద్రు. 1. వడిగా ; 2. శీఘ్రంగా.

**రిబ్బ[1]** రూ.చూ. రిమ్మ. వి 1. పిచ్చి ; 2. తిక్క

**రిబ్బ[2]** వి. రెళ్ళ, కంకిలోని గింజలకు ఆధారంగా ఉండేకాడ.

**రిబ్బనంచు** చూ. రిబ్బను.

**రిబ్బను** వి. స్త్రీలు జడకు కట్టుకొనే సన్నని పొడవాటిగుడ్డ.

ఇం. *Ribbon*. సన్నని పొడవాటిగుడ్డముక్క.

< ఇం. Ribbon.

**రిబ్బనంచు** రూ. రిబ్బెనంచు. వి. జెడరిబ్బను. మాదిరి అంచు. < రిబ్బను + అంచు[3]. **రిబ్బనుకమ్మి** వి. జెడరిబ్బను మాదిరిగా నేసిన ఒకరకం కమ్మి. **రిబ్బనుగడిచీర** వి. అంగుళం పొడుగు, అంగుళం వెడల్పు చొప్పున గళ్ళు పడేటట్లు నేసిన చీర, **రిబ్బనుబార్డరు** వి. జెడరిబ్బను. మాదిరిఅంచు. **రిబ్బనుబార్డరుపేటు** రూ. రిబ్బను బార్డుపేటు. వి. రెండుమూడు వేళ్ళవెడల్పున అంచులో అయి మూలగా నేసిన డిజైను. **రిబ్బనుబార్డుపేటు** రూ.చూ. రిబ్బను బార్డరుపేటు. వి. రెండుమూడు వేళ్ళవెడల్పున అంచులో అయిమూలగా నేసిన డిజైను.

**రిబ్బు** స.క్రి. ఆకులు మొగ్గలు మొ. వాటి గోళ్ళతో తెంచు.

**రిబ్బెనంచు** రూ.చూ. రిబ్బనంచు. వి. జెడరిబ్బను మాదిరి అంచు.

**రిమిషను** రూ. రెమిషను. వి. పన్నుతగ్గింపు.

ఇం. *Remission*. పన్నుతగ్గింపు.

< ఇం. Remission.

**రింబ** రూ.చూ. రిమ్మ. వి. ఉన్మాదం. ఆం.రా. 1.136.

**రిమ్మ** రూ. రిబ్బ, రింట. వి. 1. ఉన్మాదం. శుక. 2.453 ; 2. తిక్క.

**రిమ్మగొను(-కొను)** అ.క్రి. ఉన్మాదంపొందు. చిత్రభా. 8.94. **రిమ్మతెగులు** వి. చెడ్డబుద్ధి. **రిమ్మవట్టు** రూ. రిమ్మపట్టు. అ.క్రి. రిమ్మెక్కు. జైమినిభా. 5.76. **రిమ్మలుగొను(-కొను)** అ.క్రి. ఉన్మాదం పొందు. భాగ. 10పూ. 904. **రిమ్మవట్టించు(-పట్టించు)** స.క్రి. వెర్రెత్తించు వర.రా. అరణ్య. 130పు. 6పం. **రిమ్మవట్టు(-పట్టు)** రూ.చూ. రిమ్మపట్టు. అ.క్రి. రిమ్మెక్కు. భాగ. 5.2.156. **రిమ్మవొడము(పొడము)** అ.క్రి. బుద్ధిపట్టు శుక. 2.454.

**రిమ్ము[1]** స.క్రి. (చిమ్మనగ్రోవిమొ. వాటితో) చిమ్ము.

**రిమ్ము[2]** వి. సైకిలుమొ. వాటికి చుట్టూ ఉండే అంచు.

ఇం. *Rim*. ఏవస్తువుకైనా చుట్టూ ఉండే అంచు.

< ఇం. Rim.

**రిమ్మెన** రూ.చూ. రుంబెన. వి. గొర్రు, గుంటకమొ. వాటి దిండుకు అమర్చిన మేడి.

**రిల్ల** రూ.చూ. రెల్ల[1]. వి. 1. కసె, పొగచెట్టు తలకొమ్మగిల్లిన తర్వాత పుట్టే చిగురు ; 2. పైరు మొక్కవేసే పక్కపిలక ; 3. పక్క కొమ్మలకు వేసిన చిన్నకొమ్మ లేక రెమ్మ. లేత కొమ్మ.

**రిల్లగాళ్లు(-కాళ్లు)** వి.బ.వ. తొర్రగాళ్ళు. **రిల్లతెగులు** రూ.చూ. రెళ్ళతెగులు. వి. వరి, కొర్ర, రాగి మొ. పైర్ల తెగులు.

**రిల్లనొప్పి** వి. పిల్లగిట్టదగ్గర వాపు, నొప్పి.

**రిల్లు** వి. ఇలకోడి, ఈలకోడి, చిమట, భృంగారి, చీరి, ఝిల్లి.

**రివట** రూ.చూ. రివ్వ[1]. వి. 1. ఉపశాఖ, రెమ్మ. భోజ. 4-23 ; 2. లేతఆకు ; 3. కొంచెం ; 4. సున్నం.

**రివరివ** వి. కుచ్చెళ్ళధ్వని కనుకరణం. ప్రబంధ. 18.

**రివరివమను** అ.క్రి. కదలటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. చను. 3.108.

**రివల్యూషన్‌బద్ద** వి. మరాసు కట్టుబడిలో రంపాన్ని నిలిపే బద్ద.

ఇం. *Revolution*. విప్లవం.

< ఇం. Revolution + బద్ద.

**రివాజు** వి. 1. వాడుక, అలవాటు, మామూలు ; 2. మర్యాద.

హిం. ఉ. *రివాజ్*. ఆచారం ; మరా. *రివాజ్*. ఆచారం, సంప్రదాయం ; అర. *రివాజ్* ;

క. *రివాజు* ; త. *రివాజా*.

< ఉ. రివాజ్.

**రివ్వ[1]** రూ. రివట, రివ్వట, రీట, రెవట. వి. 1. రెమ్మ. ఉపశాఖ. కు.సం. 8.159 ; 2. సన్నగా పొడుగ్గాఉన్న వెదురుబొంగు ; 3. బెత్తం, చువ్వ ; 4. దూలాన్ని గోడలో కదలకుండాఉంచే కొయ్యముక్క.

సం. రేవటు-వెదురు.

< సం. రేవట-.

**రివ్వకొమ్ము** వి. చువ్వ. **రివ్వలుగ** క్రి. విశ. ద్రు. అధికంగా. **రివ్వలుగ** క్రి.విశ. ద్రు. అధికంగా. తాళ్ల.సం. 17.102.

**రివ్వ[2]** వి. పక్షివిశేషం. పార్వ. 6.77.

**రివ్వట** రూ.చూ. రివ్వ[1]. వి. 1. రెమ్మ, ఉపశాఖ ; 2. పొడుగు వెదురు ; 3. బెత్తం.

**రివ్వాకుఆర్చి** రూ.చూ. రవ్వాకు ఆర్చి. వి. పక్కభాగాలు వంపులు వంపులుగాఉండే ఆర్చి.

**రివ్వు** రూ.చూ. టివ్వు. వి. 1. శీఘ్రం ; 2. పక్షి రెక్కల శబ్దం.

**రివ్వున** రూ.చూ. టివ్వున క్రి. విశ. ద్రు. శీఘ్రంగా, ఝుడి త్వర్థకం. **రివ్వురివ్వున** అవ్య. ద్రు. అతివేగంగా హంస 3.29.

**రిసల్దార్** రూ.చూ. రిసల్దారు. వి. అశ్వదళాధిపతి.

**రిసల్దారు** రూ. రిసల్దార్, రిసాల్దార్, రిసాల్‌దారు. వి. అశ్వదళాధిపతి.

హిం. *రిసాల్‌దార్.* అశ్వదళానికి నాయకుడు; మరా. *రిసాలా.* అశ్వదళం; ఉ. *రిసాలహ్‌దార్.* సైన్య విభాగానికి నాయకుడు; పార. *రసాలహ్, రిసాలహ్ దార్.* దళాధిపతి; అర. *రిసాలహ్.* దళం, సైన్య విభాగం.

< హిం. రిసాల్‌దార్.

**రిసాల్దార్** రూ.చూ. రిసల్దారు వి. అశ్వదళాధిపతి.

**రిసాల్‌దారు** రూ.చూ. రిసల్దారు. వి. దళాధిపతి.

**రీజను** వి. సబబు, హేతువు.

ఇం. *Reason.* కారణం.

< ఇం. Reason.

**రీట** రూ.చూ. రివట[1] వి. తీగ, ఉలవ, వేరుసెనగ, అలచంద, అనుము, పెసర మొ. మొక్కలతీగ.

**రీతిసాతీలేకుండు** అ.క్రి. నీతినియమం లేకుండు.

సం. *రీతి*-పద్ధతి; హిం. *సాథీ.* స్నేహితుడు.

**రీపరు** రూ. రిపరు, రిపా, రిపెరు, రిఫరు, రీపా. వి. ఇంటి కప్పు వేయటంలో వాడే పల్చనిచెక్క, దంతులమధ్య బిగించే చెక్క.

రీపరుబద్ద వి. 1. పేటుదారాలకు ఆధారంగా డాబీ చట్రంలో అమర్చిన సన్నబద్ద; 2. ఇంటికప్పుకు వాడే పల్చనిచెక్క. రీపర్సుపెంకు వి. అచ్చుమీద సావుగా పల్చగా నల్చదరంగా తీసి కాల్చిన పెంకు.

ఇం. *Reaper.* కోతకోసే యంత్రం.

< ఇం. Reaper + పెంకు.

**రీపర్సుపెంకు** చూ. రీపరు.

**రీపా** రూ.చూ. రీపరు. వి. ఇంటికప్పు వేయటంలోవాడే పల్చని చెక్క, దంతులమధ్య బిగించేచెక్క.

**రీము** వి. ఇరవైదస్తాల కట్ట.

ఇం. *Ream.* ఇరవైదస్తాల కట్ట

< ఇం. Ream.

**రీలి** రూ.చూ. రీలు. వి. అచ్చుకట్టేటప్పుడు అచ్చుకర్రలకు కట్టే పురిదారం.

రీలుదారం రూ.చూ. రీలుదారం. వి. 1. అచ్చుకట్టే టప్పుడు అచ్చుకర్రలకు కట్టే పురిదారం; 2. దర్జీకుట్టుకు ఉపయోగించే దారం.

**రీలు** రూ. రీలి. వి. బరుపకట్టిన అంచు పేటుదారాలు తగిలించే కొయ్యగిలక.

ఇం. *Reel.* నూలుచుట్ట, పంటెకోల.

< ఇం. Reel.

రీలుదారం రూ. రీలుదారం, రీల్దారం. వి. అచ్చుకట్టే టప్పుడు అచ్చు కర్రలకుకట్టే పురిదారం. రీలుదారంగిరకీ రూ. రీలుదారం గిర్కా. వి. గంటానికి బిగించిన రీలుదారం బండి. రీలుదారంగిర్కా రూ.చూ. రీలుదారంగిరకీ. వి. గంటానికి బిగించిన రీలుదారంబండి. రీలుదిమ్మ వి. అచ్చు కట్టేటప్పుడు మిషనుదారం బండి తగిలించిన కొయ్యమొద్దు. రీలుపూస వి. మరమగ్గం నాడెను ఒకసొరుగులోనుంచి మరొకసొరుగులోకి నెట్టటానికి, సొరుగులోకి వచ్చిన నాడెను నిలపటానికి అమర్చిన కొయ్యగిలక. రీలుబిల్ల రూ.చూ. రీలుబిళ్ళ వి. మిషను వడిదారం చుట్టిన కొయ్య గిలక. రీలుబిళ్ళ రూ. రీలుబిల్ల. వి. మిషనువడిదారం చుట్టిన కొయ్యగిలక. రీలువడి వి. అచ్చుకట్టేటప్పుడు అచ్చు కర్రలకుకట్టే పురిదారం. రీల్దారం రూ.చూ. రీలుదారం వి. అచ్చుకట్టేటప్పుడు అచ్చు కర్రలకుకట్టే పురిదారం.

**రీల్దారం** చూ. రీలు.

**-రు[1]** ప్రత్య. 1. మహద్బహువచన ప్రత్యయం. ఉదా. బాలురు, అల్లురు; 2. 'కూఁతు' శబ్ద ప్రథమైన వచన ప్రత్యయం.

< మూ.ద్రా. -*ర్.

**-రు[2]** ప్రత్య. వర్తమాన భవిష్యత్తద్ధర్మాద్యర్థక ప్రథమ పురుష బహువచన ప్రత్యయం. ఉదా. (వారు) వచ్చు చున్నారు, వచ్చెదరు, వత్తురు.

< వారు. < మూ.ద్రా. *అర్.

**-రు[3]** ప్రత్య. వర్తమాన భవిష్యత్తద్ధర్మాద్యర్థక మధ్యమ పురుష బహువచన ప్రత్యయం. ఉదా. (మీరు) వచ్చు చున్నారు, వచ్చెదరు. వత్తురు.

< *-ఈర్ < మూ. ద్రా. *నీర్.

**-రు[4]** ప్రత్య. ప్రార్థనార్థక మధ్యమ పురుష బహువచనానికి ఎదాదులను ప్రయుక్తమైనప్పుడు ఆదేశంగావచ్చే ప్రత్య యం. భాగ. పూ. 10.1011.

**-రు[5]** వి. మాడ, రూకలకు సంగ్రహరూపం. ద.హిం.శా. సంపు. 6. శా.సం. 183. క్రీ.శ. 1156.

**రుకలు** రూ.చూ. రూకలు. వి.బ.వ. రూపాయలు, నాణేలు.

**రుక్క** రూ.చూ. రుక్కా. వి. 1. చిన్నచీటి; 2. రహస్య లేఖ.

**రుక్కా** రూ. రుక్క. వి. 1. చిన్నచీటి; 2. సంగతులుండి విలాసంలేని రహస్యపు జాబు.

హిం. ఉ. *రుక్కా.* చిన్నఉత్తరం; అర. *రుకఅ.*

< ఉ. రుక్కా.

**రుక్కాముపుంజు** వి. ఒకజాతి కోడిపుంజు. ప్రబంధ. 788.

సం. *రుక్మ.* బంగారం; హిం. *రుకుమ్.*

**రుక్కుపెట్టు** స.క్రి. కంఠస్థం చేయు, బట్టీపట్టు.

సం. *ఋక్.* వేదమంత్రం.

< సం. ఋక్ + పెట్టు.

**రుంకము** వి. రోక, రంధ్రం.

**రుచి** వి. 1. కమ్మన. కార. అరణ్య. 1.44; 2. రీతి, విధం. పాండు. 4.254; 3. ఉప్పు.

సం. *రుచి-.* కాంతి, సూర్యకిరణం, అందం.

< సం. రుచి-. (అర్థవిపరి.).

రుచిగాయ (-కాయ) వి. ఆవకాయ. రుచిగొను (-కొను) స.క్రి. 1. ఆదరించు. రాఘవ. 2.36; 2. చవిచూచు.

**రుచిచూచు** స.క్రి. చవిచూచు.

**రుచించు** స.క్రి. భక్షించు, తిను. దశకు. 10.69.

సం. *రుచ్.* ప్రకాశించు, ఇష్టమగు.

< సం. రుచ్ + -ఇంచు[3].

**రుజము** వి. 1. పెంపు ; 2. అభివృద్ధి.
సం. ఋజు-. తిన్ననిది.
< సం. ఋజు-.

**రుజువు** రూ. రుజ్వు. వి. నిదర్శనం, తార్కాణం, సాక్ష్యం, రూఢి.
హిం. రుజూ. ఆరోగ్యం, ఇష్టం ; ఉ. రుజూ. ప్రవృత్తం, ఆకర్షణం ; పార. అర. రుజూఅ్.
< ఉ. రుజూ.
**రుజువు పఱచు** రూ.చూ. రుజువుపఱుచు. స.క్రి. తార్కాణించు, నిరూపించు. **రుజువుపఱుచు** రూ. రుజువు పఱచు. స.క్రి. తార్కాణించు, ఉదాహరించు, దృష్టాంతీకరించు, నిరూపించు.

**రుజ్జు** రూ.చూ. రుద్దు. స.క్రి. 1. నీళ్ళు చల్లి నున్నబరుచు ; 2. గట్టిగా అలుకు.

**రుజ్వు** రూ.చూ. రుజువు. వి. సాక్ష్యం.

**రుంజ** వి. చర్మవాద్య విశేషం, డంగురం. పల్నా. 4.
ప్రా. రుంజియ-. ధ్వని, గర్జన ;
త. ఉరుంచల్. చర్మవాద్యవిశేషం.
< ప్రా. రుంజియ-.
**రుంజకట్టె** వి. పంటెకు నూలుచుట్టేటప్పుడు పంటెకామకు ఊనికగా పెట్టేకొయ్య. **రుంజకాఁడు** వి. రుంజ వాయిస్తూ కంసాలుల్ని యాచించే ఒక జాతివాడు. రామలిం. శ. 23; విణ. రుంజవాయించేవాడు. **రుంజవాఁడు** విణ. ఆనద్ధం వాయించేవాడు.

**రుంజాయించు** స.క్రి. దులిపివేయు.
హిం. రుంజ్. వాద్యవిశేషం.

**రుంజు** స.క్రి. 1. నూలు చుట్టటానికి పంటె తిప్పు ; 2. ముక్కుతో పీల్చు ; 3. లాగు.
**రుంజుకొను** అ.క్రి. 1. విసుక్కొను ; 2. విదలించు ; 3. ముక్కుతో గ్రహించు. **రుంజుడుమొద్దు** రూ. రుంజె మొద్దు. వి. పంటెకు నూలు చుట్టేటప్పుడు పంటెకామకు ఊనికగా పెట్టేకొయ్య.

**రుంజెమొద్దు** రూ.చూ. రుంజుడుమొద్దు. వి. పంటెకు నూలు చుట్టేటప్పుడు పంటెకామకు ఊనికగా పెట్టేకొయ్య.

**రుటము** విణ. 1. రూఢం. రాజవా. 3.106 ; 2. దృఢం, బలాఢ్యం. చంపూరా. 5.62, బహుళా. 4.5 ; 3. తీక్ష్ణం. ఆం. భా. 1.84 ; వి. 1. రూఢి. బహుళా. 5.124. 2. ఒప్పిదం. బహుళా. 5.129 ; 3. దార్ఢ్యం; సుదంతా. 4.60.
సం. రుష్ట-. కోపించటం, దూషించటం ; ప్రా. రుట్ఠ-. కోపంతోకూడి ఉండటం.
< ప్రా. రుట్ఠ-.

**రుణపఱుచు** చూ. రుణము.

**రుణము** వి. అప్పు.
సం. ఋణ-. అప్పు.
< సం. ఋణ-.
**రుణపఱుచు** స.క్రి. రుణపడేటట్టుచేయు. లాక్ష. సం. 6.11.

**రుణానుబంధం చీర** వి. పెద్ద గళ్ళలో చిన్నగళ్ళు వచ్చేట్లు నేసిన ఒకరకం చీర. వ్యు. 'ఋణానుబంధం' అనే చలనచిత్రం లోని చీరను బట్టి వ్యవహారం కలిగి ఉంటుంది.
సం. ఋణానుబంధ-. అప్పుడే కలిగిన సంబంధం.
< సం. ఋణానుబంధ- + -ము + చీర.

**రుండము** వి. క్షుద్రజలజంతువు.
సం. రుండ-. మొండెం, కబంధం.
< సం. రుండ-(అర్థవిపరి.).

**రుత్త** రూ.చూ. రిత్త. విణ. రిత్త, వట్టిది. లాక్ష. సం. 6.115. ఆం.భా. 3.15 ; వి. 1. నాశం; 2. శూన్యం.
**రుత్తవోవు (-పోవు)** అ.క్రి. వ్యర్థమగు. లాక్ష. సం. 16.2.66.

**రుత్తి** వి. చిన్నమూతి, లావుపొట్ట కలిగినజాడీ.

**రుత్తు** స.క్రి. కొట్టు, ప్రహరించు.
సం. రుధ్. అటంకపరచు, అడ్డుకొను.

**రుదురక్క** రూ.చూ. రుదురాక. వి 1. రుద్రాక్షం. అచ్చ.రా. అరణ్య. 53 ; 2. శివభక్తుల తావళపు పూస.

**రుదురాక** రూ. రుదురక్క, రుదురాచ, రుదురాచ్చ. వి. రుద్రాక్షపూస. ఆము. 4.46.
సం. రుద్రాక్ష-. రుద్రాక్ష ; ప్రా. రుద్దక్ఖ-;
త. ఉరుత్తిరాక్కమ్, ఉరుత్తిరాట్టమ్.
< సం. రుద్రాక్ష-.

**రుదురాచ** రూ.చూ. రుదురాక. వి. రుద్రాక్ష.

**రుదురాచ్చ** రూ.చూ. రుదురాక. వి. రుద్రాక్ష. చెన్నబసవ. 4.206 (Eloeocarpus). ; 2. మాల ఫలవృక్షం యొక్క విత్తు.
**రుదురాచ్చపిల్లి** వి. మోసగాడు. వ్యు. రుద్రాక్షలు ధరించిన పిల్లి రుద్రాక్షలు తిప్పుతూ జపం చేస్తున్నట్లు నటిస్తూ మోసంచేసేది. దీన్నిబట్టి మోసగాడు అనే అర్థం ఈ పదానికి కలిగింది.

**రుద్దకంబిల్ల** చూ. రుద్దు.

**రుద్దకంబిళ్ళ** చూ. రుద్దు.

**రుద్దంతసేవు** చూ. రుద్దు.

**రుద్దు** రూ. రుజ్జు. స.క్రి. 1. మర్దించు, రాయు. శకా. 2.24 ; 2. తోము, నిర్మలం చేయు. ఆం.భా. 3.127 ; 3. ఉతుకు ; 4. చలువ చేయు ; 5. నీళ్ళు చల్లి నున్నబరుచు. గట్టిగా అలుకు ; 6. ఆరోపించు.
క. రుద్దు. (చప్పుడుకాకుండా) కొట్టు, ఉద్దు, ఒద్దు. రుద్దు, రాయు. తుజ్జు. రాయు ; తు. ఉద్దుని. రుద్దు, మెరుగుపెట్టు ; కువి. రూబ్, రుబ్బ్. పూయు, అలుకు, రాయు.
మూ.ద.ద్రా. *ఒర్-అ, ఉర్-వ్-, మూ.మ.ద్రా. ఉర్-అ-1-ఉ-.
**రుద్దకంబిల్ల** రూ.చూ. రుద్దకం బిళ్ళ. వి. అచ్చుకర్రకు కట్టిన పడిదారం బిర్రుగా ఉండటానికి పై మెలికల మీద రుద్దే దుప్పికొమ్ము. **రుద్దకంబిళ్ళ** రూ. రుద్దకంబిల్ల. వి. అచ్చుకర్రకు కట్టిన పడిదారం బిర్రుగా ఉండడానికి పై మెలికల మీద రుద్దే దుప్పికొమ్ము. **రుద్దంతసేపు** వి. ఎంతో

సేవ. <రుద్దు+అంతసేవ. **రుద్దుగంజి** వి. అన్నం జావగా వండి వస్త్రకాలితం చేసిన ద్రవం. **రుద్దుచెక్క** వి. పొడుగ్గా సన్నగా ఉండే కొయ్యతాపి, చెక్కసున్నం పట్టించిన తరవాత ఎచ్చుపెచ్చులు లేకుండా సరిచేయటానికి తాపీ పనివాళ్ళు వాడే పరికరం. **రుద్దుడు** వి. తోమకం, తోమటం, రుద్దుడు. ఆం. వా. 2.160.

**రుద్రజడ** వి. రుద్రజట, సువాసన ఉన్న ఒకానొక మొక్క.
సం. రుద్రజటా. రుద్రజడచెట్టు.
<సం. రుద్రజటా.

**రుద్రపీణియ** రూ. రుద్రపీణె. వి. ఒకరకం వీణ. ప్రబంధ. 605.
సం. రుద్రవీణా. ఒకరకం వీణ.
<నం. రుద్రవీణా.

**రుద్రపీణె** రూ.చూ. రుద్రపీణియ. వి. ఒకరకం వీణ. రసిక 4.4.

**రుద్రవేణి** వి. దర్వాజాలు, తలుపులు చేయటానికి పనికివచ్చే కలపనిచ్చే ఒక చెట్టు.
సం. రుద్రవేణీ. కపర్దం, శివునిజటాజూటం.
<నం. రుద్రవేణీ. (అర్థవిపరి.).

**రుద్రాక్షఅంచు** రూ. రుద్రాక్షిఅంచు, రుద్రాక్షఅంచు. వి. రుద్రాక్షకాయ ఆకారంలో డిజైను నేసినఅంచు.
సం. రుద్రాక్ష – రుద్రాక్షపూస.
<నం. రుద్రాక్ష – + అంచు[3]. (మిశ్రన.).

**రుద్రాక్షకమ్మి** వి. రుద్రాక్ష ఆకారంలో డిజైనునేసినకమ్మి.
నం. రుద్రాక్ష – రుద్రాక్షపూస.
<నం. రుద్రాక్ష – + కమ్మి. (మిశ్రన.).

**రుద్రాక్షగడి** వి. ఒకరకంనేతగడి.
నం. రుద్రాక్ష – రుద్రాక్షపూస.
<నం. రుద్రాక్ష – + గడి. (మిశ్రన.).

**రుద్రాక్షధోతి** వి. అంచుకు రుద్రాక్షపువ్వు మాదిరి డిజైను నేసిన పంచె.
నం. రుద్రాక్ష – రుద్రాక్షపూస.
<నం. రుద్రాక్ష – + ధోతి. (మిశ్రన.).

**రుద్రాక్షపిల్లి** చూ. రుమరాచ్చపిల్లి. వి. మనోగతమైన భావాన్ని కప్పిపుచ్చి పైకి సాధువుగా కన్పడే వంచకుడు, వంచకుడు (పైకి విరాగిలా నటిస్తూ ఇతరుల్ని మోసం చేసేవారిపట్ల వాడతారు.).
నం. రుద్రాక్ష – రుద్రాక్షపూస.
<నం. రుద్రాక్ష – + పిల్లి (మిశ్రన.).

**రుద్రాక్షపువ్వు** రూ. రుద్రాక్షపూవు.వి. రుద్రాక్షపువ్వు ఆకారంలో నేసినడిజైను.
సం. రుద్రాక్ష – రుద్రాక్షపూస.
<నం. రుద్రాక్ష – + పువ్వు. (మిశ్రన.).

**రుద్రాక్షపూవు** రూ.చూ. రుద్రాక్షపువ్వు. వి. రుద్రాక్షపువ్వు ఆకారంలో నేసిన డిజైను.

**రుద్రాక్షపేటు** రూ. రుద్రాచ్చపేటి. వి. రుద్రాక్ష పువ్వు ఆకారంలోనేసిన డిజైను.
సం. రుద్రాక్ష–. రుద్రాక్షపూస.
<నం. రుద్రాక్ష – + పేటు. (మిశ్రన.).

**రుద్రాక్షపేటుఅంచు** రూ. రుద్రాచ్చపేటిఅంచు. వి. రుద్రాక్ష కాయ ఆకారంలో డిజైన్లు నేసిన అంచు.

**రుద్రాక్షపన్నెలు** వి.బ.వ. వస్త్రవిశేషం. సిం.ద్వా. 3.188.
నం. రుద్రాక్ష – రుద్రాక్షపూస.
<నం. రుద్రాక్ష – + పన్నె + – లు. (మిశ్రన.).

**రుద్రాక్షిఅంచు** రూ.చూ. రుద్రాక్షఅంచు. వి. రుద్రాక్షకాయ ఆకారంలో డిజైన్లు నేసిన అంచు.

**రుద్రాచ్చపేటి** రూ.చూ. రుద్రాక్షపేటు. వి. రుద్రాక్షపువ్వు ఆకారంలో నేసిన డిజైను.

**రుద్రాచ్చపేటిఅంచు** రూ.చూ. రుద్రాక్షపేటుఅంచు. వి. రుద్రాక్షకాయ ఆకారంలో డిజైన్లు నేసిన అంచు.

**రుద్రాష్టఅంచు** రూ.చూ. రుద్రాక్ష అంచు. వి. రుద్రాక్షకాయ ఆకారంలో డిజైన్లు నేసిన అంచు.

**రుప్వు** రూ.చూ. రువ్వు. స.క్రి. రాయి మొ. వాటిని విసరు.

**రుఫాయ** రూ.చూ. రూపాయ. వి. ఒకరూపాయి.

**రుఫాయి** రూ.చూ. రూపాయ. వి. ఒకరూపాయి.

**రుబ్బారుళ్లు** రూ.చూ. రుబ్బాబుళ్లు. వి.బ.వ. చెల్లాచెదర్లు.

**రుబ్బాబుళ్లు** రూ. రుబ్బారుళ్లు. వి.బ.వ. చెల్లాచెదర్లు. వేంక. పంచ. 3.284.

**రుబ్బు** స.క్రి. 1. నానినపప్పు మొ. వాటిని రోటిలోవేసి పొత్రంతో మెదుపు. చా.మం. 1.136 ; 2. పాతం మొ. వాటిని బట్టిపట్టు ; వి. నానబెట్టిన ధాన్యాదుల్ని రుబ్బి పశువులకు వేసేదాణా.

**రుబ్బుగుంట** వి. రుబ్బురోలు. **రుబ్బుగుండు** వి. రుబ్బే పొత్రం. **రుబ్బుగుండ్రాయి** వి. రుబ్బుపొత్రం. **రుబ్బుడుగొయ్య** వి. రుబ్బుడు పొత్రపు పిడి. **రుబ్బుడుబత్రం** రూ. రుబ్బు పొత్రము. వి. రుబ్బటానికి వాడే గుండ్రటిరాయి. **రుబ్బు పాత్రము** రూ.చూ. రుబ్బుడు బత్రం. వి. రుబ్బేపొత్రం. **రుబ్బురాయి** వి. రుబ్బుపొత్రం **రుబ్బురోలు** రూ.చూ. రుబ్బుబోలు. వి. రాతిరోలు. **రుబ్బుబోలు** రూ. రుబ్బురోలు. వి. నానిన పప్పు మొ. వి. రుబ్బటానికి రాతితో చేసే సాధనం. శుక. 2.408. **రుబ్బులాడి** వి. వారివి వీరివి అనక అందరికోకలు ధరించే స్త్రీ.

**రుమడి** రూ.చూ. రుంబెన. వి. గొర్రు, గుంటక మొ. వాటి దింపుకు అమర్చిన మేడి.

**రుమాణము** రూ.చూ. రువాణము. విణ. ఆకారం.

**రుమాల్.** రూ.చూ రుమాలువు. వి. తలపాగ ఒకవిధమైన తలగుడ్డ.

**రుమాల** రూ.చూ. రుమాలువు. వి. చేతిగుడ్డ, ఒకరకం తలగుడ్డ.

**రుమాలా** రూ.చూ. రుమాలువు. వి. 1. చేతిగుడ్డ ; 2. తలకు కట్టుకునే గుడ్డ.

**రుమాలు** రూ.చూ. రుమాలువు. వి. 1. తలపాగ. ఒకవిధమైన తలగుడ్డ. దశా. 1.71 ; 2. రుమాలుగుడ్డ, చిన్నరుమాలు, చేరుమాలు.

**రుమాలుగుడ్డ** వి. చేరుమాలు, చిన్నరుమాలు. వైజ. 2.47.

**రుమాలువు** రూ. రుమాల్, రుమాల, రుమాలా, రుమాలు. వి.

తలపాగ, ఒకవిధమైన తలగుడ్డ. రాజవా. 2.44. పాంచాలీ. 1.68.

హిం. రుమాల్. ముఖాన్ని చేతుల్ని తుడుచుకొనేగుడ్డ; మరా. రుమాల్. జేబురుమాలు, తలపాగా; ఉ. రూమాల్. కరపటం, జేబురుమాలు; పార. రూ ముఖము మాల్. తుడుచునది. రూమాల్. ముఖాన్ని తుడిచేది, జేబురుమాలు. గాత్రమార్జని.

< ఉ. రూమాల్.

**రుమీ** రూ. రుమ్మి, రుమ్మీ. వి. 1. తురుష్కభాష. యయా. 1.58 2. రుమీచురకత్తి, రుమీదేశాన్నుంచి తెచ్చిన చిన్నకత్తి.

హిం. రూమీ. రూమ్‌దేశసంబంధి, రూమ్‌దేశ వాసి; ఉ. రుమీ. రూమ్. దేశానికి చెందిన, రూమ్‌దేశవాసి, తురుష్కుడు; పార. రూమీ రోమను, గ్రీకుదేశ సంబంధమైన వస్త్ర విశేషం; అర. రుమీ. తురుష్కుడు.

< ఉ. రుమీ.

**రుమీచురకత్తి** వి. చిన్నకత్తి, నురియ. రాజవా. 2.52.

**రుంబ** రూ.చూ. రుంబెన వి. గొర్రు, గుంటక మొ. వాటి దిండుకు అమర్చిన మేడి.

**రుంబెన** రూ. రిమ్మెన, రుమడి, రుంబ, రుమ్మెర, రొంబడి. వి. దిండుసోగ, గొర్రు, గుంటక మొ. వాటి దిండుకు అమర్చిన మేడి.

**రుమ్మి** రూ.చూ. రుమీ. వి. 1. తురుష్కభాష. రాజవా. ష. 80; 2. రుమీ చూరకత్తి.

**రుమ్మీ** రూ.చూ. రుమీ, విశ. రుమీదేశం. శుక. 2.410; వి. 1. తురుష్కభాష; 2. రుమీచూరకత్తి.

**రుమ్మీఫిరంగి** వి. గుండ్రని ఒకరకం ఫిరంగి. సుదంలా. 2.157.

**రుమ్మెన** రూ.చూ. రుంబెన. వి. గుంటుకుయొక్క పట్టు గర్ర.

**రుయిపూలంచు** రూ. రుయ్యి పూలంచు. వి. చిన్న పత్తిపూల డిజైను నేసిన అంచు.

హిం. రూఈ. పట్టు.

< హిం. రూఈ + పూలు + అంచు[3].

**రుయ్యిపూలంచు** రూ.చూ. రుయి పూలంచు. వి. చిన్న పత్తి పూల డిజైను నేసిన అంచు.

**రుళి** వి. గాలి అందె.

సం. రవళి - ధ్వని.

**రువా** వి. బూరుగు పువ్వు. రతికల్యాణం (యక్షగానం).

హిం. ఉ. రువా. బూరుగు పువ్వు.

< ఉ. రువా.

**రువాణము** రూ. రుమాణము. విశ. 1. చక్కనిది, సుందరం విజయ. 2.21; 2. కాంతి; 3. ఆకారం.

సం. రూపణ -. ఆలంకారిక రచన మనోజ్ఞమైన వర్ణం; ప్రా రూవణ-.

< ప్రా. రూవణ-.

**రువారము** విశ. 1. సవిలాసం. విక్ర. 8.8; 2. ఇంపు. ఇందు. 2.55; వి. ఒయ్యారం, విలాసం. రఘునా. 32ప. 12 పం.

సం. రూపకార -. శిల్పి; ప్రా. రూఆర-;

క. రువార, రుహారి. శిల్పి.

< ప్రా. రూ ఆర-.

**రువారించు** అ.క్రి. కదలు, చలించు. < రువారము + -ఇంచు[3].

**రువారించు** చూ. రువారము.

**రువు** రూ.చూ. రువ్వ[1]. వి. ఒకసారి తిరిగిన తిప్పు.

**రువ్వ[1]** చూ. రూక. వి. 1. దమ్మిడి; 2. అయిదు కాసుల నాణెం; 3. రెండు కాసుల నాణెం.

**రువ్వ[2]** వి. చేతిబెత్తం, బరికె, జువ్వ.

**రువ్వపులుగు** రూ. రువ్వ(బులు(గు, ఉవ్వ పులు(గు. వి. కాటుక పిట్ట. అం.భా. 2,91.

**రువ్వము** రూ. రువ్వు[2]. వి. తడవ, ఆవృత్తి. హరిఉ. 10 283.

సం. రూప -. ఆకృతి, సౌందర్యం, శుక్లాదివర్ణం. మూర్తి. స్వభావం, సంఖ్యావాచకం; ప్రా. రూఅ-, రూవ.

< ప్రా. రూవ-.

**రువ్వు[1]** రూ. రుప్పు, రువు, రూవు. స.క్రి. 1. విసరివైచు. భీమ. 5.120; 2. గుద్దు, పొడుచు. పల్నా. 4.107; 3. చిమ్ము, చల్లు. వరాహ. 7.7; అ.క్రి. విసరు. వీచు. గౌ. హరి. పూ. 2157 పం; వి. ఆక్షేపం, విసరటం. పాండు. 3.66.

క. ఉరుబు. (గాలి మొ. వాటి) తీవ్రత; కొలా. రువ్ - (రువ్‌త్ -. విసురు, రుసి. (గాలి మొ. వాటిని) విసురు.

**రువ్వు[2]** రూ.చు. రువ్వము. వి. ఆవృత్తి, వల్లె. ద్వి. పరమ. వి. 2.127ప.

**రువ్వు[3]** రూ.చూ. ఉవ్వు. వి. వేగంలో అయ్యే ధ్వనికి అనుకరణం. వేంక. పంచ. 1.483.

**రువ్వు(బులు(గు** రూ. ఉవ్వు(బులు(గు. వి. ఖంజరీటం. కాటుక పిట్ట.

**రుసుము** రూ.చూ. రుసుము. వి. 1. పీజు; 2. సుంకం.

**రుషిచుక్కలు** వి.బ.వ. మంచంకోళ్ళు, సప్తర్షి మండలంలో మంచం కోళ్ళ మాదిరి ఉండే నాలుగు చుక్కలు. వాటి వెనక వరుసగా మరి మూడు చుక్కలుంటాయి. వాటిని దొంగలంటారు.

సం. ఋషి-. ముని.

< సం. ఋషి- + చుక్క- + లు.

**రుసరుస** వి. కోపం యొక్క అనుకరణం. ధ్వన్యను.

**రుసరుసలాడు** రూ. రొసరొసలాడు. స.క్రి. కోపించు.

**రుసి** వి. రుషి. భీమ. 2.12.

సం. ఋషి-. ముని; ప్రా. శౌ.జై. మహా. అ.మా. రిసి; పా. ప్రా.శౌ. ఇసి; మా. విసి; అప. ఇసి;

క. రసి, రుసి; తు. రూశి. ఋషి; త. ఇరుటి; మ. ఇరిసి.

< సం. ఋషి-.

**రుసుము** రూ. రుశుము, రున్సుము. వి. 1. రాబడి. నె.శా. తామ్ర. 23 క్రీ.శ. 1348; 2. వట్టం, పన్ను. భే.ప. 77; 3. లంచం; 4. లాభం.

హిం. రుసుమ్; మరా. రుసూమ్; ఉ. రుసూమ్. రీతి, రివాజు, నియమం. సర్కారు ఖర్చు, తపాలాఖర్చు మొ. నవి; పార. రుసూమ్. ఆచారవ్యవహారాలు, పన్నులు,

న్యాయసూత్రాలు ; అర రుసూమ్. సుంకం, తపాలా ఖర్చు, కష్టం ;

క. రుసుము. అవ్వు, పీజు ; త. రుసుమ్.

<ఉ. రుసూమ్.

**రుస్సుము** రూ.చూ. రుసుము. వి. **1.** ఫీజు ; **2.** సుంకం.

**రూక** రూ. రోక². వి. **1.** ఒకానొక నాణెం. భార. ఆది. **6.271 ; 2.** గద్యం. ద.హిం.కా. సంపు. 6. కా.సం. 990. క్రీ.శ. 1158 ; **3.** ధనం ; **4.** ఒకటింపాలణా ; **5.** రెండు అణాలు.

సం. రుక్మ-. బంగారం.

పో.చూ.క. రొక్క. డబ్బు, ధనం ; త. రొక్క, రొక్కమ్.

<సం. రుక్మ-.

**రూకమాడలు** వి.బ.వ. వెండిమాడలు. ద.హిం.కా. సంపు. 10. గా.సం. 5. క్రీ.శ. 1165. రూకరుట్ట వి. డబ్బు. నిరంకు. 2.123.

**రూకలు** రూ. రుకలు. వి.బ.వ. రూపాయలు, నాణేలు.

**రూకపతి** రూ. చూ. రూకపాత్కె. వి. మాగాణిలో పెరిగే పాకుడు తీగ. దీని ఆకును కూరగా వండు కొంటారు.

**రూకపాత్కె** చూ. రూక. రూ. రూకపతి, రూకాబతిక. రూకాబత్తె. వి. ఓషధీవిశేషం. హంస. **4.132.**

**రూకాబతిక** రూ.చూ. రూకపాత్కె. వి. మాగాణిలో పెరిగే పాకుడు తీగ. దీని ఆకును కూరగా వండు కొంటారు.

**రూకాబత్తె** రూ.చూ. రూకపాత్కె. వి. రాకపతి గడ్డి మాగాణిలో పెరిగే పాకుడు తీగ. దీని ఆకును కూరగా వండు కుంటారు.

**రూటము** వి. తప్పు చేసినందుకు కట్టే ధనశిక్ష.

సం. రూఢ -. ఎక్కినది, ఆరూఢం ; హిం. రూడే. కఠోరం, కఠిన మైనది.

**రూడ** రూ.చూ. రోడ. వి. కొయ్యతో చేసిన తాపి, గరుకుగా ఉన్న చోట్లను చదరం చేయటానికి వాడేది.

**రూడచెక్క** రూ.చూ. రోడచెక్క. వి. కొయ్యతో చేసిన తాపి, గరుకుగా ఉన్న చోట్ల చదరం చేయటానికి వాడేది.

**రూఢి** వి. **1.** స్థైర్యం. భార. ఆది. **8.156 : 2.** నిశ్చయం. గా.హరి. ఉ. 2481 పం. : **3.** ప్రసిద్ధి ; **4.** నిక్కం.

సం. రూఢి -. ప్రసిద్ధి, పరంపరాగతం, సంప్రదాయం ; ప్రా. రూఢి ;

క. రూఢి ; తు. రూఢి. సంప్రదాయం, వాడుక ; త. ఉరూటి.

<ప్రా. రూఢి-.

**రూఢికెక్కు** అ.క్రి. ప్రసిద్ధికెక్కు. భార. ఆశ్ర. 1.168. <రూఢి + -కున్ + ఎక్కు.

**రూణించు** చూ. రూడి. స.క్రి. మల్లులోకవిధంగా బంధించు.

**రూణింపు** వి. మల్లబంధవిశేషం. హంస. 1.206.

**రూణింపు** చూ. రూణించు.

**రూపం** వి. పాత్రలు తీర్చి దిద్దటానికి సారిపలకమీద లింగాకారంగా పెట్టిన మట్టిముద్ద.

సం. రూప -. ఆకారం.

<సం. రూప - (అర్థవిపరి.).

**రూపకం** వి. పద్ధతి.

సం. రూపక-. ఆకారం, రూపు.

<సం. రూపక-.(అర్థవిపరి.).

**రూపగు** చూ. రూపు.

**రూపడగు** చూ. రూపు.

**రూపడచు** చూ. రూపు.

**రూపణగు** చూ. రూపు.

**రూపణచు** చూ. రూపు.

**రూపరి** చూ. రూపు.

**రూపఱు** చూ. రూపు.

**రూపసి** చూ. రూపు.

**రూపాడించు** స.క్రి. రూపించు, రుజువుచేయు.

**రూపాయ** రూ రుపాయ, రుపాయి, రూపాయి¹, రూపాయీ, ర్వాయ, ర్వాయి, వి. ఒకవెండినాణెం. నె.శా. 4. క్రీ.శ. 1746. రా.వా.ఫు. 26.

హిం. రుపయా. సంపద, ధనం, ఒకరూపాయ ; మరా. రూపాయా ; రుపయా ; ఉ. రుపయా, రుపియా, రుపియా, రుపైయా. ఒకరూపాయ, రెండు షిల్లింగుల విలువకు సమానమైన ఒకనాణెం.

<మరా. రూపాయా.

**రూపాయరంగుకాల్వు** వి. నల్లకాల్వులో కొంత తెల్లగా కాలిన కాల్వు.

**రూపాయి¹** రూ.చూ. రూపాయ. వి. ఒకవెండినాణెం. ఖడ్గ. **45.**

**రూపాయిగడి** వి. ఒకరకం నేతగడి.

**రూపాయి²** వి. ఒకరకం కొలబద్ద. ఒకవైపున 36 అంగుళాలు, రెండోవైపున 24 తస్సులు గుర్తించబడ్డ కొలబద్ద.

**రూపాయీ** రూ.చూ. రూపాయ. వి. ఒకరూపాయి.

**రూపార్చు** చూ. రూపు.

**రూపాఱు** చూ. రూపు.

**రూపాఱుచు** చూ. రూపు.

**రూపావతారుడు** వి. శిల్పి, విగ్రహాలు చేసేవాడు. గుణవృత్తి జయదేవుని చేత్రోలు శాసనం.

సం. రూపావతార-, రూపుయొక్క ఆవిర్భావం కలవాడు.

<సం. రూపావతార-(అర్థవిపరి.).

**రూపించు** చూ. రూపు.

**రూపు** వి. **1.** స్థితి. భార. ఆది. 4.30 ; **2.** ఆకారం. భార. ఆది. 5.232 ; **3.** నిజం, సత్యం, భార. ఉద్యో. **4.206 ; 4.** దేహం, శరీరం. భార. ద్రోణ. 4.70 ; **5.** సౌందర్యం, చక్కదనం. హరి. ఉ. 3.96 ; **6.** కన్నెపిల్ల మెడలో కట్టిన బంగారునాణెం. వసు 2.55 ; **7.** దానం, ధర్మం. ద. హిం. గా. 6.114 ; **8.** పైకప్పుకూ కింది నేలకూ మధ్యనున్న భాగం.

సం. రూప-; ప్రా. రూఅ, రూవం ; శౌ. రూపం. ముచ్చు ; పా. రూపం ; అప. రూఅ-.

క. రూపు, రూపు ; తు. రూపు ; త. ఉరుప్పు, ఉరువయు, ఉరుప్ప, ఉరువమ్.

<సం. రూప-.

**రూపగు** అ.క్రి. 1. సంపన్నుడగు. భార. శాంతి. 5.3 ; 2. ప్రసిద్ధికెక్కు. వరాహ. 10.120 ; 3. ఏర్పడు, కల్గు. మను. 2.10. ప్రబోధ. 4.12. <రూపు+అగు. **రూపడగు** రూ. రూపణగు. అ.క్రి. 1. చచ్చు. భార. కర్ణ. 2.200 ; 2. నశించు. దశ. 9.166. <రూపు+అడగు. **రూపడచు** రూ. రూపణచు. స.క్రి. 1. నశింపచేయు. భార. భీష్మ. 2.5 ; 2. రూపుమాపు. చంపు. ఉ. హరి. 2.64. <రూపు+అడచు. **రూపణగు** రూ.చూ. రూపడగు. అ.క్రి. 1. చచ్చు ; 2. నశించు. **రూపణచు** రూ.చూ. రూపడచు. స.క్రి. 1. నశింపచేయు ; 2. చంపు. **రూపరి** వి. రూపవంతుడు. సౌందర్యవతి మల్లభూ. నీతి. 46. <రూపు+-అరి. **రూపఱు** రూ. రూపాఱు. అ.క్రి. 1. చచ్చు, మృతినొందు. భార. విరా. 1.74 ; 2. విరూపమగు. భార. శల్య. 1.9. ; 3. నశించు, చెడు. భార. శాంతి. 3.421. <రూపు+-అఱు[1]. **రూపసి** వి. 1. సౌందర్యవంతుడు. భార. ద్రోణ. 2.190 ; 2. సౌందర్యవతి. **రూపార్చు** రూ. రూపాఱుచు. స.క్రి. 1. రూపుమాపు ; 2. చంపు. <రూపు+ఆర్చు. **రూపాఱు** రూ.చూ. రూపఱు. అ.క్రి. 1. నశించు, చెడు ; 2. చచ్చు. **రూపాఱుచు** రూ.చూ. రూపార్చు. స.క్రి. రూపుమాపు. **రూపించు** స.క్రి. 1. నిర్ణయించు. భార. ఉద్యో. 1.25 ; 2. విమర్శించు. రం. రా. యు. 316పు. 14పం. <రూపు+-ఇంచు[3]. **రూపుకట్టు** అ.క్రి. ఆకారమేర్పడు. **రూపుచెడు** రూ.చూ. రూపుసెడు. అ.క్రి. నశించు. ఉ. హరి. 1.148. **రూపుచేసుకొను** స.క్రి. చెల్లించటానికి నిశ్చయం చేసుకొను. ద. హిం. గ్రా. సంపు. 6. గ్రా.సం. 282. క్రి.శ. 1514. **రూపుజేయు(-చేయు)** స.క్రి. దారు మొ. వాటితో గట్టిగాకట్టు. **రూపుదప్పినవాడు (-తప్పినవాడు)** విణ. పనికిమాలినవాడు. **రూపుపడు(-పడు)** అ.క్రి. పొదగట్టు. **రూపుమాపించు** స.క్రి. నాశనంచేయించు, చెడగొట్టించు. ఉ.హరి. 3.36. <రూపుమాపు+-ఇంచు[3]. **రూపుమాపు** స.క్రి. 1. నశింపచేయు. నిర్వ.రా. 1.34 ; 2. చంపు. మృతినొందు. శుక. 1.176. **రూపుమాయు** అ.క్రి. నశించు, చచ్చు. భార. కర్ణ. 2.355. **రూపుమాలు** అ.క్రి. నశించు. శివరా. 1.51. **రూపురేఖలు** వి.బ.వ. ఆకార విశేషాదులు, వంపుసొంపులు. పండి.చ. 1.1.74పు. **రూపులుమాపు** స.క్రి. 1. నశింపచేయు ; 2. చంపు, మృతినొందు. **రూపులుమాయు** స.క్రి. 1. నశింపచేయు ; 2. చంపు, మృతి నొందించు. **రూపుసెడు(-చెడు)** రూ. రూపుచెడు. అ.క్రి. నశించు, చెడు. భార. శాంతి. 4.55. **రూపేదు** అ.క్రి. రూపుమాయు, స్వరూపనాశనమగు. పాండు. 5 253. <రూపు+ఏదు[3].

**రూపుకారి** వి. ముఖాముఖి, ఎదుట.

హిం. రుమ్‌కారీ. వ్యాజ్యంయొక్కరికార్డు ; ఉ.పార. రూ-బ-కారీ. వాఙ్మూలం, ఒక వ్యవహారంయొక్క పూర్వకమైన రికార్డు ;

క. రూబకారి. ఒకకేసు యొక్క లిఖితపూర్వకమైన రికార్డు ; త. రూప్‌కారి. న్యాయ విచారణ సంబంధ వ్యవహారాలు.

<ఉ. రూ-బ-కారీ.

**రూపుబూపున** రూ. రూబురూబు. క్రి.విణ. సమ్ముఖాన.

**రూపేదు** చూ. రూపు.

**రూబరు** వి. సన్నిధి, సమ్ముఖం.

హిం. రూబరూ. ఎట్టయెదుట, సమక్షం ;

ఉ. రూబరు. సమ్ముఖం, ప్రత్యక్షం ; పార. రూబరూ. ముఖాముఖి, ప్రత్యక్షం.

<ఉ. రూబరూ.

**రూబి** రూ.చూ. రూబీ. వి. బచ్చలపండు రంగు.

**రూబీ** రూ. రూబి, రోబీ. వి. బచ్చలపండు రంగు.

ఇం. Ruby. ఒకరకం ఎరుపురంగు.

<ఇం. Ruby.

**రూబురూబు** క్రి.విణ. స్వయంగా.

హిం. రూబ్‌రూ. ఎదుట, ముందర, ముందు ; ఉ.పార. రూ-బ్-రూ. సమ్ముఖం, ముందర, ముఖాముఖి ;

క. రూబరూ, రూబరూబు, రూబురూబు ; త. రూప్రూ రూప్రూ, ర్యూప్రూ, రూప్‌రూప్. వ్యక్తిగతంగా, స్వయంగా, ముఖాముఖి.

<ఉ. రూ-బ-రూ.

**రూమరు** వి. పుకారు, గాలిమాట, వదంతి.

ఇం. Rumour. జనప్రచారం, పుకారు.

<ఇం. Rumour.

**రూము** వి.గది.

ఇం. *Room*. గది.

<ఇం. Room.

**రూల్** రూ.చూ. రోలరు. వి. 1. మగ్గంమీద అచ్చుతాళ్ళు తగిలించిన రోకలివంటి గుండ్రటి పొడుగు కర్ర ; 2. దానినుండి కిందికి వేలాడే లావుదారాలు దూర్చిన ఈనెల చట్రం.

**రూలరు** రూ.చూ. రోలరు. వి. 1. మగ్గంమీద అచ్చుతాళ్ళు తగిలించిన రోకటి వంటి గుండ్రటి పొడుగు కర్ర ; 2. ఒకరకం దోనె, రోలరు మగ్గంలో నేతగుడ్డ చుట్టే గుండ్రటి దూలం ; 3. దానిలో అడ్డంగా బిగించిన కొయ్యగుండు ; 4. మగ్గం చివర పడుగు నూలు చుట్టే కొయ్యదూలం.

**రూలరుకర్ర** వి. పల్లిరును చెవుకట్లకు ఆధారంగా పైన బిగించిన పొడుగు చెక్క. **రూలరుతాడు** రూ. రోలరుతాడు, లోలరుతాడు. వి. పల్లిరునుకు వేసిన అచ్చు సూత్రం. **రూలరుబద్ద** వి. పుల్లిరును నిలవటానికి పైపట్టెకు బిగించిన చెక్క.

**రూలు**[1] వి. 1. పద్ధతి, చట్టం ; 2. సమమైనగీత.

ఇం. *Rule*. నియమం, గీత.

<ఇం. Rule.

**రూలుకట్ట** రూ. రూళ్ళకర్ర. వి. రూళ్ళుగీసేకర్ర.

**రూళ్ళకర్ర** రూ.చూ. రూలుకట్ట. వి. రూళ్ళుగీసేకర్ర.

**రూలు**[2] రూ.చూ. రోలరు. వి. 1. మగ్గంమీద అచ్చుతాళ్ళు తగిలించిన రోకటి వంటి గుండ్రటి పొడుగుకర్ర ; 2. ఒకరకం దోనె, రోలరు మగ్గంలో నేతగుడ్డ చుట్టే గుండ్రటి దూలం ; 3. దానిలో అడ్డంగా బిగించిన కొయ్యగుండు ;

4. మగ్గం చివర పడగు నూలు చుట్టే కొయ్యదూలం; 5. డాబీనుండి కింది వేలాడే లావుదారాలు దూర్చిన ఈనెల చట్రం.

రూలుకఱ్ఱ వి. రంగు అద్దిన నూలు లడీల్లో పిండేకఱ్ఱ. రూలుగుండు వి. మగ్గంమీద అచ్చుతాళ్ళు తగిలించిన రోకలివంటి గుండ్రటి పొడుగుకఱ్ఱ. రూలుగుండుబొమ్మ వి. పుల్లిరుసు నిలవటానికి పైపట్టెకు బిగించిన చెక్క. రూలు చక్రం వి. డాబీ దిండుకు పక్కగా అమర్చిన చక్రం. రూలుచెవు వి. పుల్లిరుసుచెవు, పుల్లిరుసు నిలవటానికి పైపట్టెకు బిగించిన చెక్క. రూలుపట్టి రూ.చూ. రూలు పట్టె. వి. పుల్లిరుసు చెవుకట్లకు ఆధారంగా పైన బిగించిన పొడుగుచెక్క. రూలుపట్టె రూ. రూలుపట్టి. వి. పుల్లిరుసు చెవుకట్లకు ఆధారంగా పైన బిగించిన పొడుగుచెక్క. రూలుమొల వి. పుల్లిరుసు చెవిలో దూర్చిన ఇనపపుల్ల.

రూ|లు రూ.చూ. రోలరు. వి. మగ్గంమీద అచ్చుతాళ్ళు తగిలించిన రోకలి వంటి గుండ్రని పొడుగు కఱ్ఱ.

రూళ్ళకఱ్ఱ చూ. రూలు[1].

రూవు రూ.చూ. రువ్వు. స.క్రి. విసరు.

రె రూ.చూ. రే. అవ్య. ఆశ్చర్యార్థకం, వాక్యాలంకారం అయిన 'అగు' 'అట' 'బాపు' మొ. వాటికి అను ప్రయుక్తం. ఉ.రా. 6.135, కలు.శ. 18.

రెక్క రూ.చూ. ఱెక్క. వి. 1. పక్షం. రం. రా. బాల. 27వ; 2. పక్షతి, రెక్కమొదలు. ఆం. భా. 2.99, ప్రభా. 4.86; 3. ద్వారబంధానికి రెండు అరలుగా బిగించిన తలుపుల్లో ఒకటి; 4. పొగాకులో ఈనెకు ఒకవైపు భాగం; 5. తలుపు రెండు చెక్కలలో ఒకటి; 6. కొబ్బరిదాపలోని దళ్ళు కట్టటానికి వాడే చివరిభాగం; 7. ఒంటి ఆకు, ఆకులోని సగంచీలిక; 8. మరమగ్గం బొమ్మకు, నిలువుపట్టెకు, ఏటవాలుగా బిగించిన కఱ్ఱ; 9. మొక్క తలెత్తిన తరవాత విస్తరిల్లే పచ్చని భాగం.

రెక్కచాపు వి. 1. ఒక పంచె, ఒక కండువా కలిసి ఉన్న నేతబట్ట; 2. పైమీద వేసుకొనే కండువా; 3. ఒక పంచె. రెక్కతలుపు రూ.చూ. ఱెక్కతలుపు. వి. ద్వారానికి రెండు పక్కల ఉండే రెండు పలకలతో ఏర్పరచిన తలుపు. రెక్కతాడు వి. మగ్గం ఉదతకు పైన కట్టిన దారం. రెక్కదుప్పటి వి. ఒకే పొరఉన్న దుప్పటి. రెక్కపట్టె రూ. రెక్కాని పట్టె. వి. బండిపరం బిగువు కోసం దొలుపు కొననుండి పోలుగఱ్ఱ వరకు అడుగున వేసిన పట్టె. రెక్కపలక వి. మరమగ్గం బొమ్మకు, నిలువు పట్టెకు ఏటవాలుగా బిగించిన కఱ్ఱ. రెక్కపాయ వి. 1. కోడి; 2. రివటపాయ. రెక్కపాయలు రూ.చూ. ఱెక్క పాయలు. వి.బ.వ. ఒకరకం వడ్లు. హంస. 5.157. రెక్కబద్ద వి. మరమగ్గం చట్రంలో పక్కగా బిగించిన పొడుగుపట్టె. రెక్కమాను వి. మరమగ్గం చట్రం నిలబెట్ట టానికి నేతబయలులో పాతిన ఒకరకం నిలువుగుంజ. రెక్కముక్కాడనీయక అవ్య. చేయి కదల్చనీయక. రెక్కల కష్టము వి. కాయకష్టం. సం. కష్ట-. కీడు, పీడ, శ్రమ. రెక్కలతలుపు రూ. రెక్కల్తలుపు. వి. రెండు రెక్కలు గల తలుపు. రెక్కలతేజి వి. గరుత్మంతుడు. ద్వి. పరమ. వి. 7.494. రెక్కలపండుగ వి. శ్రమజీవులు చేసుకొనే పండుగ. రెక్కలపురుగు వి. సుంకుతినే కుమ్మరిపురుగు, వేరుసెనగ కాయలు తొలిచే 'నల్లబల్లి' పురుగు. రెక్కల బొండేం వి. ఒకరకం మోట బొక్కెన. రెక్కలువచ్చు అ.క్రి. స్వయంగా బతకగల వయసు వచ్చు. రెక్కల్తలుపు రూ.చూ. రెక్కలతలుపు. వి. రెండు రెక్కలు గల తలుపు. రెక్కవిరుపు వి. పరితెగులు, వెంట్రుకల్లాంటి నాచుపుట్టి పైరు పెరుగుదల తగ్గే తెగులు. రెక్కవేయు అ.క్రి. మొక్క తలెత్తిన తరవాత పచ్చటి భాగం విస్తరిల్లు. రెక్కసరిచేయు అ.క్రి. పడుగు మడత విప్పి సరిచేయు. రెక్కానిపట్టె రూ.చూ. రెక్కపట్టె. వి. బండిపరం బిగువుకోసం దొలుపు కొన నుంచి పోలుగఱ్ఱవరకు అడుగున వేసిన పట్టె. ఇటు వంటివి రెండు పక్కలా రెండుంటాయి. రెక్కాములు రూ.చూ. ఱెక్కాములు. వి.బ.వ. ధాన్య విశేషం. హంస. 4.156.

రెక్కానిపట్టె చూ. రెక్క.

రెక్కాములు చూ. రెక్క.

రెక్కొను రూ.చూ. ఱక్కొను. అ.క్రి. 1. వర్ధిల్లు. సారంగ. 1.72; 2. తేరుకొను.

రెక్కొలుపు స.క్రి. 1. వర్ధిల్లచేయు. చంద్రాంగ. 4.20; 2. తేరుకొనేటట్లు చేయు. రెక్కోలు వి. 1. పేర్కొనటం, వర్ధిల్లటం; 2. తేరుకొనటం.

రెక్కొలుపు చూ. రెక్కొను.

రెక్కోలు చూ. రెక్కొను.

రెగ్గత్తి వి. ఒకరకం చెట్టు (Capparis grandis).

రెచ్చరించు చూ. రెచ్చు.

రెచ్చించు చూ. రెచ్చు.

రెచ్చిలు చూ. రెచ్చు.

రెచ్చిల్లు చూ. రెచ్చు.

రెచ్చు అ.క్రి. 1. విజృంభించు, చెలరేగు. వాల్మీ. 3.114; 2. పశువులు అదుపు తప్పి ప్రవర్తించు.

త. ఇఱు (ఇఱ-, న్ఱ్-.).

*ఎచ్చ్-. <ఎళ్-.చ్-<మూ.ద్రా. ఏళ్; ఎళ్-.

రెచ్చరించు రూ. రెచ్చించు. స.క్రి. రెచ్చచేయు. వాల్మీ. 2.128. <రెచ్చు+-. ఇంచు.[3] రెచ్చించు రూ.చూ. రెచ్చరించు. స.క్రి. రెచ్చగొట్టు. రెచ్చిలు రూ.చూ. రెచ్చిల్లు. అ.క్రి. విజృంభించు, చెలరేగు. రెచ్చిల్లు రూ. రెచ్చిలు. అ.క్రి. విజృంభించు, చెలరేగు.

రెచ్చెల చూ. రెచ్చు. విణ. జగడాలమారి.

రెంచ చూ. రెండు, వి. (జూదంలో) రెండుకు పరిభాష.

రెంజితుంజి క్రి. విణ. సంపూర్ణంగా, పూర్తిగా. అష్టమ. క. 5.241 వ. 14పం.

రెట్ట[1] వి. పక్షిమలం. మను. 4.58.

సం. అరిష్ట-, రిష్ట-. దురదృష్టం, కీడు, నాశం; ప్రా. రిట్ఠ-.

<ప్రా. రిట్ఠ-.

రెట్ట(బెట్టు(-పెట్టు) అ.క్రి. (పక్షి) మలవిసర్జనంచేయు.

శేయా. 3.45.

రెట్ట[2] చూ. ఎఱక. రూ. ఱెట్ట. వి. 1. భుజం. గౌ. హరి. ఉ. 901 పం.; 2. పక్షిరెక్క; 3. సారెపలకను చుట్టను కలుపుతూ బిగించే కొయ్యముక్క.

క. అఱ్టె. పిట్టరెక్క, చేతిపైభాగం. తెఱ్టె. చేతిపైభాగం.

రెట్టకట్టు వి. రెక్కల ఆకృతి విశేషం, రెక్కలకూర్పు. ప్రబంధ. 1.91. రెట్టకాయ వి. రెండూ ఒకటిగా కలిసిన కాయ, అమడకాయ. రెట్టకొలుపు వి. కమ్మిపక్కన వరుసగా నేసిన రెండుకొలుకుల రంగు దారాలు. రెట్టగోడ వి. ఇంటిపక్క గోడలమీద ఇరుపక్కలా కప్పు దించటంలో ఏటవాలు ఏర్పరచటానికి అటు ఇటు వాటంగా కట్టిన నెత్తి గోడ. రెట్టంచు వి. జంటఅంచు. <రెట్ట[2]+-అంచు[3]. రెట్టనాడి క్రి. విశ. 1. బలిష్ఠమైన; 2. లావైన. రెట్టనాడి గుఱ్ఱము వి. బలిష్ఠమైన గుఱ్ఱం. రెట్టపట్టు స.క్రి. వివాహమాడు, పెళ్ళాడు. రెట్టపొయ్యి వి. రెండు పొయ్యిల్ని ఒకటిగా చేర్చి చేసినపొయ్యి. రెట్టపోగు వి. కమ్మిపక్కన నేసిన రెండు పోగుల జమిలిదారం. రెట్టబట్టియాతలబడవైచు స.క్రి. లాగి పారవేయు. రెట్టబిడ్డలు వి.బ.వ. అమడబిడ్డలు, కవలలు. రెట్టవడగట్టు స.క్రి. దావగొట్టు.

రెట్టమతము చూ. రెడ్డి. వి. సామాన్యప్రజలు సాధారణంగా అనేదానికి వ్యతిరేకంగా చెప్పేమాట. వ్యు. రెడ్డిగారి అభిప్రాయం. ఇది సాధారణ జనాభిప్రాయానికి వ్యతిరేకంగా ఉండటంచేత ఈ పలుకుబడి ఏర్పడింది.

సం. మత-.అభిప్రాయం.

రెట్టమతమువాఁడు విశ. 1. అవివేకి; 2. మొండిపట్టున్నవాడు.

రెట్టి విశ. ద్విగుణం. భార. అరణ్య. 2.347; వి. రెండవ పర్యాయం. కాశీ. సం. 8.195.

త. ఇరండై. జత, జంట, కవలలు. సరిసంఖ్య, ఇరట్టైయర్. కవలలు, ఇరట్టి. రెట్టింపు; మ. ఇరట్టు. రెట్టింపు. ఇరట్టి. రెట్టింపు; కుయి. రేహె. రెండుసార్లు.

రెట్టించు రూ. ఱెట్టించు. అ.క్రి. ద్విగుణమగు, ఇనుమడించు. కు.సం. 11.27, భార.స్త్రీ. 2.53; స.క్రి. ద్విగుణంచేయు, ఇనుమడించు. అప్ప. 4.143. <రెట్టి+-ఇంచు[3]. రెట్టిత్రాగుడు రూ.చూ. రెట్టిత్రావుడు. వి. ద్విపం, ఏనుగు. రెట్టిత్రావుడు రూ. రెట్టిత్రాగుడు. వి. ద్విపం, ఏనుగు. శ్రీరం. మా. 4.80. రెట్టింపు వి. రెండురెట్లు. ప్రబంధ. 153. త. ఇరట్టిప్పు. రెట్టింపు; మ. ఇరట్టు-.

రెట్టు చూ. రెట్టి. వి. ముతకబట్ట. జంటనేతబట్ట.

రెడాక్సైడు వి. ఇనుమునిచ్చే ఖనిజ శిలలకు మూలరూపమైన 'ఓకర్.'

ఇం. *Redoxide*. ఇనుముకు మూలరూపమైన ఖనిజ శిల.

<ఇం. Redoxide.

రెడి[1] రూ.చూ. రట్టకుట్ట. వి. 1. చతుర్థజాతివారి (శూద్రుల) లో ఒక రాజవంశానికి చెందినవారి బిరుద వాచక శబ్దం. ద.హి.శా. సంపు. 4. శా. సం. 766. క్రీ.శ. 1268, వేంక. పంచ. 4.453; 2. గ్రామాధికారి; 3. కులసూచక శబ్దం.

రెడి[2] రూ. రడి[2], రెడీ. వి. సిద్ధం.

ఇం. *Ready*. సిద్ధమైన.

<ఇం. Ready.

రెడీ రూ.చూ. రెడి[2]. వి. సిద్ధం.

రెడ్డన చూ. రెడ్డి.

రెడ్డమ్మ చూ. రెడ్డి.

రెడ్డి రూ.చూ. రట్టకుట్ట. వి. 1. చతుర్థజాతివారి(శూద్రుల) లో ఒకరాజవంశానికి చెందినవారి బిరుద వాచకశబ్దం. ద. హిం.శా. సంపు. 4. శా.సం. 762. క్రీ.శ. 1130, కాశీ. 1.24; 2. గ్రామాధికారి. ఉ. హరిశ్చ. 4.12; 3. కులసూచకశబ్దం.

రెడ్డన వి. రెడ్డన్న, రెడ్డి. శుక. 2.338. <రెడ్డి+అన్న. రెడ్డమ్మ వి. వాయల్పాడు సమీపంలోని గ్రామదేవత, ఈమె మహమ్మదీయ సేనలతో పోరాడి చివరికి కొండలోని బండను బద్దలుచేసికొని లోనికి వెళ్ళిన స్త్రీ. <రెడ్డి+అమ్మ. రెడ్డిఇనాం వి. గ్రామ మునసబును రాయలసీమ నెల్లూరు ప్రాంతాల్లో రెడ్డి అంటారు. అతనికిచ్చిన ఇనాం. రెడ్డికము రూ. రెడ్డిగము. వి. కూర్చోవటంలోని ఒకరకం, ఎడంకాలి తొడమీది మోకాలు మీదగా ముడుచుకొన్న కుడికాలిపాదం మోపి ఆకాలును వీపును వస్త్రంతో బిగించి కూర్చోవటం. వరాహ. 10.114. పూర్వం గ్రామాధికారులైన రెడ్లు ఈ విధంగా అపరాధుల్ని శిక్షించి ఉంటారు. రెడ్డికుంబ్రోళ్లు వి.బ.వ. కుమ్మర్లలో ఒకతెగ. <రెడ్డి+కుమ్మరి+వారు+లు. రెడ్డిగము రూ.చూ. రెడ్డికము. వి. కూర్చోవటంలోని ఒకరం, ఎడంకాలి తొడమీది మోకాలు ముడుచుకొన్న కుడికాలిపాదం మోపి ఆకాలును వీపును వస్త్రంతో బిగించి కూర్చోవటం, పూర్వం గ్రామాధికారులైన రెడ్లు ఈ విధంగా అపరాధుల్ని శిక్షించిఉంటారు. రెడ్డిచుక్క రూ. రేడిచుక్క. వి. మూలచుక్క, బృహస్పతి పేరుతో ఉండే నక్షత్రం. రెడ్డిపసంద్ వి. తీపిఎక్కువఉండే మామిడి పండు. హిం.ఉ. పసంద్. ఇష్టం. రెడ్డిపాలవంకెలు వి. బ.వ. ధాన్య విశేషం. హంస. 4.128. రెడ్డిపాదుపుచుక్క రూ. రెడ్డిబోదుపుచుక్క. వి. మూలచుక్క, బృహస్పతి పేరుతోఉండే నక్షత్రం. రెడ్డిబొర్డరు వి. రెండుపువ్వుల మధ్య రెండురకాల డిజైన్లు పడునట్లు నేసిన ఒకరకం అంచు. ఇం. *Boarder*. అంచు. <రెడ్డి+ఇం. Boarder. రెడ్డిబోదుపుచుక్క(-పాదుపుచుక్క) రూ. రెడ్డిపాదుపు చుక్క. వి. మూలచుక్క, బృహస్పతి పేరుతో ఉండే నక్షత్రం. రెడ్డిమాన్యం వి. గ్రామమునసబుకిచ్చిన మాన్యం. రెడ్డివంకెలు వి. బ. వ. ధాన్యం విశేషం. ప్రబంధ. 112. రెడ్డివారి దున్నపోతు వి. 1. తానుచేయక ఒకరిని చేయనీయనివాడు; 2. అన్నిటికీ అభ్యంతరపెట్టే వ్యక్తి. రెడ్డివారినానుబ్రాలు వి. ఒకానొక ఓషధి, పటువర్ణి. రెడ్డిసాని కాటికెలు వి. బ. వ. కృష్ణకాటుకలు, ధాన్యంలో ఒకరకం. రెడ్డొచ్చే మొదలాడు స.క్రి. కొంత జరిగిన తరువాత తిరిగి చెప్పు. హరికథ, భామాకలాపం, నాటకం, యక్షగానం

ము. వాటిని ప్రదర్శించేటప్పుడు రెడ్డి(మునసబు లేదా మోతుబరి రైతు)గారు ఆలస్యంగా రాగా తిరిగి వీటిని మొదటినుంచీ ప్రదర్శించు. దీన్నిబట్టి ఈ పలుకుబడి ఏర్పడింది. రెడ్డొచ్చే మొదలెత్తు చూ. రెడ్డొచ్చే మొదలాడు. అ. క్రి. కొంత జరిగిన తరువాత తిరిగి చెప్పు. <రెడ్డి+వచ్చెను+మొదలెత్తు. రెడ్డోరి ఆవలెద్దు వి. 1. రెడ్డివారి ఆబోతెద్దు ; 2. చూపులకేగాని చేతలకు పనికిరాని ఎద్దు ; 3. ఒకపని తానుచేయక, ఇంకొకరిని చేయనీయని బయటి పటాటోపం మనిషి. రెడ్లు రూ.చూ. రట్టొళ్లు. వి. బ. వ. 1. చతుర్థజాతివారి (శూద్రుల)లో ఒకకులంవారు. ఆము. 4.134 ; 2. గ్రామాధికారులు.

రెడ్డొచ్చే మొదలాడు చూ. రెడ్డి.

రెడ్డొచ్చే మొదలెత్తు చూ. రెడ్డి.

రెడ్డోరి ఆవలెద్దు చూ. రెడ్డి.

రెడ్‌బ్రవును రూ.చూ. రెడ్‌బ్రౌను. వి. 1. గోధుమవన్నెలో ఎరుపుచాయ కలిసిన రంగు ; 2. ముదురు పొగాకు కాడ కంటె ఎరుపువన్నె.

రెడ్‌బ్రౌను రూ. రెడ్‌బ్రవును. వి. 1. గోధుమవన్నెలో ఎరుపు చాయ కలిసిన రంగు ; 2. ముదురు పొగాకు కాడకంటె ఎరుపువన్నె.

ఇం. *Red brown*. ఒకరకం ఎరుపురంగు.

<ఇం. Red brown.

రెడ్లు చూ. రెడ్డి.

రెంట చూ. రెండు.

రెంటక్రాగుడు చూ. రెండు.

రెంటక్రాగుడుతిండి చూ. రెండు.

రెంటక్రాగుడుమెకము చూ. రెండు.

రెంటనాల్కలుగలాఁడు చూ. రెండు.

రెంటఁద్రాగుడుమెకము చూ. రెండు.

రెంటపంజులు చూ. రెండు.

రెంటపేట చూ. రెండు.

రెంటము చూ. రెండు. రూ. రెంటెము, రేఁటెము. వి. 1. జమిలినూలుబట్ట. క్రీడా. 46, 2. రొంటి, పార్శ్వంలో కట్టే బట్ట మడత. ఆము. 6.19.

రెంటాడు చూ. రెండు.

రెంటాన చూ. రెండు.

రెంటాము వి. ఎద్దుమూపురం.

రెంటాలకుపోవు చూ. రెండు.

రెంటికింజెడు చూ. రెండు.

రెంటికిపోవు చూ. రెండు.

రెంటెము రూ.చూ. రెంటము. వి. గెంటెం, జంటనేతవస్త్రం వరాహ. 9.88, ఆము. 1.13.

రెంటేలు చూ. రెండు.

రెండడుగులుచను చూ. రెండు.

రెండరామడ చూ. రెండు.

రెండవకులము చూ. రెండు.

రెండవచెవికితెలియకుండ చూ. రెండు.

రెండవదేవేంద్రుఁడు చూ. రెండు.

రెండవపంట చూ. రెండు.

రెండవవంగడంపుపబువు చూ. రెండు.

రెండవవారము చూ. రెండు.

రెండవసూతకము చూ. రెండు.

రెండాడు చూ. రెండు.

రెండాయిలంగోదపాయ్యి చూ. రెండు.

రెండాయిలపొయ్యి చూ. రెండు.

రెండాయిలపెంకు చూ. రెండు.

రెండాయిలంపొయ్యి చూ. రెండు.

రెండాయిలాలపొయ్యి చూ. రెండు.

రెండింట చూ. రెండు.

రెండు రూ. రొండు, సర్వ. ఔ. 1. ద్విశబ్దార్థకం. భార. ఆది. 3.19 ; 2. ఇద్దరు. ద.హిం.గా. సంపు. 10. గా.సం. 188. క్రీ.శ. 1173.

క. ఎరడు, ఎర్డు, ఎరడ్. రెండు, ఇరు, ఇర్. రెండవ; తు. రడ్డు, రెండు, ఇరు-ఇర్. రెండవ ; త. ఇరండు. రెండు. రెండు, ఇరండామ్, ఇరండావతు. రెండవది, ఇరట్టియర్. కవలలు ; మ. రండు. రెండు, రండామ్. రెండోది ; గోం. రండ్, రెండ్. కుఇ. కువి. రీ. రెండు; పెంగొ. మండ. రి ; పర్జి. ఇర్డు. రెండు ; గ. ఇండి, కురు. ఏర్, ఏండ్ ; మాల్తొ. ఇవ్, - ఇస్ ; బ్రా. ఇరట్.

<మూ.ద్రా. *ఇరంట్.

రెంట వి. 1. రెండవటం. ఆము. 5.23; (నీతి) ద్వైదీభావం. ఆం.భా. 2.189 ; విశే. రెండర్థాలున్నది (వాక్య). శృం.నై. 8.128. రెంటక్రాగుడు వి.ద్విపం, గజం. ఏనుగు. ప్రబంధ. 153. రెంటక్రాగుడుతిండి వి. సింహం. వేంక. పంచ. 1.349. రెంటక్రాడుడుమెకము రూ.చూ. రెంటఁద్రాగుడుమెకము. వి. ద్విపం, ఏనుగు. రెంటనాల్కలు గలాఁడు విశే. సర్పం. రెంటఁద్రాగుడుమెకము రూ. రెంటక్రాగుడుమెకము. వి. ద్విపం, గజం. రామాభ్యు. 5.51. రెంటపంజులు వి.బ.వ. రాయిడి, ఒరపిడి. రెంటపేట వి. జములు. రెంటాడు (-అడు) స.క్రి. రెండువిధాలుగా పలుకు. శ్రీరాం.మా. 2.124. రెంటాన క్రి.విశే.క్రమ. రెండుగా మడచిన దానిమీద. రెంటాలకుపోవు అ.క్రి. మలవిసర్జనకు పోవు. రెంటికింజెడు అ.క్రి. ఇహపరాలకు దూరమగు. మను. 3. 105. రెంటికిపోవు అ.క్రి. దొడ్డికిపోవు. రెంటేలు వి. అధికారమనం. <రెండు+ఏలు. రెండడుగులుచను అ.క్రి. కొంతదూరంపోవు. విప్ర. 2.67. <రెండు+అడుగులు+చను. రెండరామడ వి. ఒకటి రెండు ఆమడలు. కాశ. 4.55. రెండవకులము వి. క్షాత్రకులం. బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర కులాల్లో రెండోకులం. రెండవచెవికితెలియకుండ క్రి.విశే.క్రమ. అతిరహస్యంగా. రెండవదేవేంద్రుఁడు వి. అపర దేవేంద్రుడు. కళా. 5.2. సం. దేవే ద్ర-. దేవప్రభువైన ఇంద్రుడు. రెండవపంట వి. ఎడకారు, దాళవా. రెండవ వంగడంపు పబువు వి. క్షత్త్రియుడు. రెండవవారము వి. సోమ వారం. రెండవసూతకము వి. మృతశౌచకం, మైల. పాండు. 4.149. రెండాడు అ.క్రి. 1 ద్రోహంతలచు, శత్రుత్వం వహించు. ద.హిం.గా. సంపు 5. గా.సం. 628. క్రీ.శ.

1224; 2. రెండు మాటలాడు, అసత్యమాడు. సిం.ద్వా. 5.195; 3. నిందించు, ఎదురుచెప్పు, ప్రతిఘటించు. కొణిదెనశాసనం. <రెండు+ఆడు. రెండాయిలంగోడపొయ్యి వి. అరుగులో బిగించిన రెండాయిలంపొయ్యి. రెండాయిలపొయ్యి రూ.చూ. రెండాయిలంపొయ్యి. వి. ఒకేమంటతో రెండు పాత్రలుడకటానికి వీలుగా చేసిన పెంకు పొయ్యి. రెండాయిలంపెంకు వి. ఒకేమంటతో రెండు పాత్రలుడకటానికి వీలుగా చేసినట్టి పెంకు పొయ్యి. రెండాయిలం పొయ్యి రూ. రెండాయిల పొయ్యి, రెండోయేలు పొయ్యి. వి. రెండుపొయ్యిల్ని ఒకటిగా అతికించినట్లు చేసిన పొయ్యి. రెండాయిలాల పొయ్యి. వి. రెండు పొయ్యిల్ని ఒకటిగా అతికించినట్లు చేసిన పొయ్యి. రెండింట క్రి. విశే. ద్రు. రెండింటితో. రెండు కన్నులు చాలకుండు అ.క్రి. అత్యంత దర్శనీయంగా ఉండు. మనోహరంగా ఉండు. కు సం. 8.54. రెండుకళ్ళచ్చు వి. ఒకేసారి రెండు ఇటికలు చేసే అచ్చు. రెండుకాళ్ల కన్నాకులు వి.బ.వ. మనుష్యులు. రెండు జన్మలు గలవారు విశే. బ.వ. ద్విజులు. రెండుజేనకోల వి. రెండుజేనల పొడవుగల కొలతబద్ద. ద. హిం. శా. సంపు. 5. శా.సం. 1052. క్రీ.శ. 1133. రెండుచేతులా అవ్య. ధారాళంగా. రెండుట్టి రూ. రెన్నువట్టి. వి.బ.వ. రెండుపట్లు. లక్ష్మీపుర శాసనం. క్రీ.శ. 681. రెండుతడవలు వి. బ. వ. రెండుసార్లు. రెండుతలచు రూ. చూ. రెండుదలచు. అ. క్రి. ద్రోహంచేయు. రెండుతలలపాము వి. ఒకరకంపాము. రెండుతాంబూలాలు వి.బ.వ. గౌరవప్రదంగాఇచ్చే తాంబూలద్వయం. రెండుదలచు రూ. రెండుతలచు. అ.క్రి. కపటంగా ప్రవర్తించు. జైమినిభా. 1.86. రెండునాలుకలవాడు విశే. 1. ఆడినమాట తప్పిపోయి మరోరకంగా మాట్లాడేవాడు; 2. పాము. రెండునాలుకలుగలది విశే. 1. పాము; 2. అబద్ధాలాడేది. రెండువాల్కలుగలాడు విశే. 1. పాము: 2. అబద్ధాలాడేవాడు. రెండునూఱులు వి.బ.వ. రెండువందలు. రెండునెఱుగు అ.క్రి. విచక్షణ కలిగిఉండు, వివేకం కలిగి ఉండు. రెండునొకటగు అ.క్రి. ఏకీభావం పొందు. శాశ్ల. సం. 3.55. <రెండు+న్+ఒకటి+అగు రెండునొకటి (-ఒకటి) వి. మూడు. రెండుమాఱులు వి.బ.వ. రెండుసార్లు. రెండుముఖములుగలవాడు విశే. అగ్ని. ద్విజిహ్వుడు. రెండుముళ్ళకాయ వి. ఒకరకంముళ్ళకాయ, తేలుకొండికాయ. రెండురెండో అవ్య. రెండురెండో, జతజతగా. కు.సం. 8 26. రెండుసంధ్యలు వి.బ.వ. రెండుసంధ్యా కాలాలు. ద. హిం. శా. సంపు. 5. శా.సం. 182. క్రీ.శ. 1192. రెండెడ్లబండి వి. 1. సామాన్లబండివంటి కప్పుగల గూటిబండి; 2. రెండుఎద్దుల్ని కట్టేబండి. <రెండు+ఎడ్లు+-అ[11]+బండి. రెండెర వి. రెండున్నర, సార్ధద్వయం. భార. విరా. 4.232. <రెండు+అర[1]. రెండొకటిగను (-కను[2]) అవ్య. నిస్సందేహంగా, నిర్ద్వంద్వంగా. భాస్క. రా. అరణ్య. శుక. 1.209. రెండోపాలు వి. రెండోపంట. <రెండు+-అవ+పాలు. రెండోమేలుపొయ్యి రూ.చూ. రెండాయిలంపొయ్యి. వి. రెండుపొయ్యిల్ని ఒకటిగా అతికించినట్లు చేసిన పొయ్యి. రెండంకాలు వి. రెండిటిపై పావు, రెండుంపావు. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 778. రెన్నువట్టి (-పుట్టి) రూ.చూ. రెండుట్టి. వి. రెండుపట్లు.

రెండెడ్ల బండి చూ. రెండు.

రెండెర చూ. రెండు.

రెండొకటిగను చూ. రెండు.

రెండోపాలు చూ. రెండు.

రెండోమేలు పొయ్యి చూ. రెండు.

రెండంకాలు చూ. రెండు.

రెన్నీళ్లు పోయు స.క్రి. పాడుచేయు.

రెన్నువట్టి చూ. రెండు.

రెపరెప వి. 1. నిప్పు మండటంలో అయ్యే ధ్వనికి అనుకరణం; 2. గాలి వీచటంలో అయ్యే ధ్వనికి అనుకరణం.

రెపరెపమను అ.క్రి. 1. మండు, ఆకలగు; 2. గర్వించు. <రెపరెప+అను. రెపరెపలాడు. అ.క్రి. 1. కొంచెంకొట్టుకొను; 2. కొనప్రాణంతో ఉండు. <రెపరెప+-లు+ఆడు.

రెపాన రూ. రపాన. వి. ఎవరి పాటికివారు; 2. తదేకధ్యానం.

రెప్ప రూ. ఱెప్ప. వి. 1. నేత్రపక్ష్మం. కు.సం. 6.135, భార. ద్రోణ. 1.14; 2. ఇలారానికి ఉండే ద్వారం; 3. ఆకుకప్పులో కప్పిన ఆకు కింది భాగం; 4. తాను చివరి భాగం.

క. ఱెప్పె, ఱెప్పె. కనురెప్ప; త. ఇరప్పై.

రెప్పనాము వి. దర్వాజా నిలుపు పట్టెకు రంగులు వేయటానికి తీసిన గాడి. రెప్పపాటు రూ. ఱెప్పపాటు. వి. నిమేషం. రెప్పలు విచ్చి చూడకుండు స.క్రి. కన్నెత్తి చూడకుండు. కళా. 4.109. రెప్పవేయు స.క్రి. కన్నుమూయు. రెప్పార్పక చూచు స.క్రి. తదేక ధ్యానంతో చూచు. పరమ. 6.138. <రెప్ప+అర్పక చూచు.

రెప్పము విశే. పూర్ణం, నిండినది. ఉ. హరి. 4.195.

రెప్పముగా క్రి. విశే. ద్రు. పూర్ణంగా.

రెప్పాడ వి. ఒకరకం ఆకెరువు మొక్క.

రెప్పార్పక చూచు చూ. రెప్ప.

రెప్పాల వి. వన్య వృక్షవిశేషం. ద్వి. పరమ. వి. 2.54.

రెబ్బ రూ చూ. రెమ్మ. వి. రెమ్మ. ఉపశాఖ. ఆం.భా. 2.37.

రెబ్బసాగు రూ.చూ. రెమ్మసాగు. అ.క్రి. చెట్టు పక్క కొమ్మకు చిన్న కొమ్మ వేయు.

రెబ్బు స.క్రి. సంహరించు, చంపు. బహుళా. 1.20.

ప్రా. రేఫ -.దుష్టుడు, అధముడు, నీచుడు, క్రూరుడు, నిర్దయుడు, దరిద్రుడు.

<ప్రా. రేభ-.

రెబ్బుగా క్రి. విశే. ద్రు. గుబులుగా.

రెమక రూ.చూ. రెమ్మ. వి. ఉపశాఖ, చిన్నకొమ్మ.

రెమకపుట్టు అ.క్రి. చిన్నకొమ్మవేయు. రెమకవిడుగు అ.క్రి. చిన్నకొమ్మవేయు. రెమకసాగు రూ.చూ. రెమ్మసాగు. అ.క్రి. చెట్టు పక్క కొమ్మకు చిన్న కొమ్మలు వేయు.

రెమిషను రూ.చూ. రిమిషను. వి. పన్ను తగ్గింపు.

రెంబ రూ.చూ. రెమ్మ. వి. శాఖ, కొమ్మ.

రెమ్మ రూ. రెబ్బ. రెమక, రెంబ, తెమ్మ, లిమ్మ. వి. 1. పూరేకు. పుష్పదళం. ఘటికా. 2.25 ; 2. కొమ్మ, ఉపశాఖ. వసు. 1.156.

క. రమ్మె, రెమ్మె. కొమ్మ మొ.వి.

రెమ్మసాగు రూ. రెబ్బసాగు, రెమకసాగు. అ.క్రి. చెట్టుకొమ్మకు చిన్న కొమ్మవేయు.

రెమ్మ స.క్రి. దృఢంగా పట్టుకొను, ఒడిసి పట్టుకొను. వాల్మీ. 2.96. విజయ. 1.9.

కొం. ఱ్లె్. లాగు, గుంజు ; కుయి. రెజలి.

రెయి రూ.చూ. రేయి. వి. రాత్రి. ఆము. 5.150.

రెయివెల్గు వి. చంద్రుడు. ఆం. భా. 1.77.

రెయిలుపెంకు రూ.చూ. రైలుపెంకు. వి. యంత్రంలో తయారు చేసే పెద్దపెంకు.

రెయిలువారిపెంకు రూ.చూ. రైలువారిపెంకు. వి. యంత్రంలో తయారు చేసే పెద్దపెంకు.

రెయ్య రూ.చూ. రొయ్య[2]. వి. రొయ్య. ఒకరకం చేప.

రెయ్యనాచు వి. వరితెగులు, వెంట్రుకల్లాంటి నాచు పుట్టి పైరు పెరుగుదల తగ్గించే వరితెగులు.

రెయ్యికాలు గడ్డి వి. ఒకరకం కలుపు మొక్క.

రెలిసేయు చూ. రెలుచు.

రెలు రూ.చూ. రెల్లు. వి. కాకిరెల్లు, రెళ్ళు, శరం.

రెలుచు రూ. రెల్చు. స.క్రి. ఆకులు, పువ్వులు మొ. వాటిని కోయు, గిల్లు, చిదుము.

రెలిసేయు స.క్రి. దూసివేయు, తీసివేయు. రెలుపు వి. మందు వేసిన పొగాకు ఒక్కొక్కటి తలపటం.

రెలుపు చూ. రెలుచు.

రెల్చు రూ.చూ. రెలుచు. స.క్రి. ఆకులు, పువ్వులు మొ. వి. కోయు, గిల్లు, చిదుము.

రెల్ల[1] రూ. రిల్ల, రెళ్ళ. వి. వరి మొ. వాటి ఎన్నులో ఒక భాగం. కణిశైకదేశం. పద్మ. 9.226 ; 2. మెతుకు.

రెల్ల[2] వి. వ్యవసాయ పరికరాలకు ఉపయోగపడే కలపనిచ్చే చెట్టు. (Cassia fistula).

రెల్ల[3] రూ.చూ. రెల్లు. వి. నీటివారల్లోను, చెమ్మనేలల్లోను పెరిగే తృణ విశేషం (Saccharum Spontancum).

రెల్లకానుపుతాత వి. హేమాద్రి.

రెల్లరుపు వి. రిల్లవాపు, కాలుకుంటటం.

రెల్లి[1] వి. ఒకానొక జాతి.

రెల్లి[2] రూ.చూ. రెల్లు. వి. నీటివారల్లోను, చెమ్మనేలల్లోను పెరిగే తృణ విశేషం (Saccharum Spontaneum).

రెల్లు రూ. రెలు. రెల్ల,[3] రెల్లి[2], రెళ్ళ, తెల్లు. వి. తృణ విశేషం. కు.సం. 11.91. (Saccharum Spontaneum).

క. రెళ్ళు. రెల్లు (Saccharum Sara).

రెల్లుకానుపు రూ. రెల్లుకాన్పు. వి. కుమారస్వామి, శర జన్ముడు. రెల్లుకానుపుతాత రూ. రెల్లుకాన్పుతాత. వి. హిమవంతుడు. శర జన్ముడైన కుమారస్వామి తాత. రెల్లుకాన్పు రూ.చూ. రెల్లుకానుపు. రెల్లుకాన్పుతాత రూ.చూ. రెల్లుకానుపుతాత. వి. హిమవంతుడు. రెల్లుగడ్డి వి. రెల్లు. రెల్లుచూలి రూ.చూ. తెల్లుచూలి. వి. సుబ్రహ్మణ్యస్వామి, కుమారస్వామి. రెల్లుజొన్న వి. పశువుల పచ్చిగడ్డికి మాత్రం పెంచేరకం రెల్లుదీవి రూ.చూ. తెల్లుదీవి. వి. ద్వీ కుశపం.

రెళ్ళ రూ.చూ. రెల్ల[1]. వి. 1. రిబ్బ, జొన్న, సజ్జ మొ. వాటి కంకిలో గింజల కాధారమైన రేకు (లు) లేక సన్నటికాడ. (లు) ; 2. కొన్నిచోట్ల మొక్కకు వేసే పక్క పిలక.

రెళ్ళకంకి వి. జల్లికంకి, రెళ్ళలు వదులుగా ఉన్నకంకి.

రెళ్ళ తెగులు రూ. రిల్లతెగులు, రెల్లు తెగులు. వి. వరి. కొఱ్ఱ, రాగి మొ. పైర్ల తెగులు.

రెళ్ళు రూ.చూ. రెల్లు. వి. రెల్లు, కాకిరెల్లు.

రెవట రూ.చూ. రివ్వ[1]. వి. 1. లేతకొమ్మ ; 2. లేతఆకు.

రెవెల్ రూ.చూ. లెవలు. వి. అంతటా ఒకే ఎత్తులో ఉండటం.

రెశం రూ.చూ. రేషము. వి. 1. పట్టు ; 2 పట్టుతోనేయబడ్డ బట్ట.

రే[1] రూ.చూ. రేయి. వి. రాత్రి, నిసి కు.సం. 5.139, భార. అరణ్య. 5.358.

త. మ. ఇరవు. రాత్రి.

రేకంటు వి. సూర్యుడు. రేగాము వి. రాక్షసుడు, నిశాచరుడు. ఉ.రా. 1.83. రేచీకు[1] విశ. రాత్రికళ్ళుకనపడనిది. తపతి. 2.17. < రే[1] + చీకు. రేచుక్క రూ. రేచు. వి. మూలచుక్క, బృహస్పతి పేరుతో ఉండే నక్షత్రం. ఈశాన్యమూల పొడిచే నక్షత్రం. రేచెల్వ వి. భోగంస్త్రీ. వేశ్య. < రే[1] + చెల్వ. రేజవరాలిమగడు వి. చందమామ. రేజోతి వి. చంద్రుడు. ఘటికా. 2.66. < రే[1] + జోతి. రేచీకటి వి. రాత్రి కళ్ళు కనపడనిజబ్బు. < రే[1] + చీకటి. రేతల వి. రాత్రి సమయం. కు. సం. 5.159. రేదొర వి. నిశాపతి, చంద్రుడు. సమీర. 2.6. ఉ.రా. 4.160. రేద్రిమ్మరి (-త్రిమ్మరి) వి. రాత్రించరుడు, రాక్షసుడు. దశా. 2.413. < రే[1] + త్రిమ్మరి. రేద్రిమ్మరీడు వి. 1. నిరృతి. ఆం.నా.సం. దేవ. 20 ; 2. నిశాచరుడు. రాక్షసుడు. రేపగలుసేయు(-చేయు) స.క్రి. అసంభవాల్ని సంభవాలుచేయు. పండి. చ. 1.2.359. రేపులుగు వి. చకోరం, వెన్నెల పురుగు. చంద్రికా. 4.107. < రే[1] + పులుగు. రేపొలతి వి. వేశ్య. రేపొలతిమగడు వి. చందమామ. రేమగడు వి. నిశాపతి, చంద్రుడు. రామాభ్యు. 2.95. < రే[1] + మగడు, రేబగలు వి. రోజు, రాత్రి పగలు. < రే[1] + పగలు. రేయింతి (-ఇంతి) వి. వేశ్య. రేయింతిమామ వి. సముద్రుడు. < రే[1] + ఇంతి + మామ. రేయుట్టిసంధ్య వి. సాయంకాలసంధ్య. పూజాసమయం. ద. హిం. గా. సంపు. 5. గా. సం. 66. రేయెండ[1] వి. వెన్నెల. సూర్య. 1.50. < రే[1] + ఎండ. రేయేలిక (-ఏలిక) వి. చంద్రుడు. రేరాచరేక వి. చంద్రరేఖ. రేరాచలాయి వి. చంద్రకాంత శిల. యయా. 4.74. రేరాజు వి. చంద్రుడు. ఇందు 1.158. రేరాయడు వి. చంద్రుడు. రేరేచెల్లెలు వి. లక్ష్మి. రేరేనితోబుట్టు వి. లక్ష్మి. రేరేయి వి. నడిరేయి. రేఱేడు వి. చంద్రుడు. శృం.నై. 6.22. రేలుబవళ్లు వి.బ.వ. ఎల్లప్పుడూ, అహోరాత్రులు. కుశ. 3.524. రేవగటివేళకుమానిసి వి. పౌరుషవంతుడు, నిర్భీకుడు. ఆము. 6.21. రేవగలు (-పగలు) వి అహోరాత్రం. కు. సం. 4.98. రేవెలుగు రూ. రేవెల్గు.

వి. చంద్రుడు. వేమ. 274. రేవెలుఁగుజోడు వి. సూర్యుడు. రేవెలుఁగుతీవ వి. సోమలత. తిప్పతీగ. రేవెలుఁగునల్లుఁడు వి. మన్మథుడు. రేవెలుఁగుఱాయి వి. చంద్రకాంతశిల రేవెల్గు రూ.చూ. రేవెలుఁగు. వి. చంద్రుడు. రేవెల్గుజోడు వి. సూర్యుడు. రేవేలుపు రూ.చూ. రేయివేలుపు. వి. చంద్రుడు. రేవేల్పు రూ.చూ. రేయివేలుపు. వి చంద్రుడు.

రే[2] చూ. అరే. రూ. రె. అవ్య. 1. ప్రశంసార్థకం. భార. అను. 1.228 ; 2. సంబోధనార్థకం. దశకు. 3.48.

క. రే. పిలుపులో వ్యవహరించబడేశబ్దం.

రే[3] వి. జిగురుగల నల్లమట్టి, పెంకు, ఇటిక తయారీకి పనికివచ్చేది.

రేక[1] రూ. రాక[2], లాక, లాఁక, లేక[3]. వి. 1. నిరంతరపంక్తి నడుమ ఎడం లేకఉండే వృక్షలతాదులవరస. హర. 6.45 ; 2. విధం, రీతి. గౌ. హరి. 3.104 ; 3. సౌందర్యం. ఘటికా. 2.87 ; 4. గీర, గీత. కకుత్థ. 3.35 ; 5. విలాసం. శుక. 2.117 ; 6. నాట్య గతిభేదం. ప్రబంధ 108 ; 7. (కత్తిమొ. వాటి) నాటు, క్షతి ; 8. జాబు, లేఖ ; 9. పంగగాఉన్న ఒసికర్రలమీదపొడుగ్గా పరిచినకర్ర ; 10. విదియనాటి చంద్రుడు ; 11. గాయం ; 12. మట్టి. పాత్రను నర్సే టప్పుడు అడుగుపైభాగంలో చుట్టూ వెన్ను. లాగా నిలిపిన అంచు.

సం. రేఖా. గీర, గీత, వరుస ; ప్రా. అప. అ.మా.పా రేహా. పంక్తి, శ్రేణి, గీత. గీర ;

క. రేకె ; తు. రేకె ; త. ఏక్కై, ఇరేకై.

<సం. రేఖా.

రేకఅగు అ.క్రి. గీసుకొనిపోయి రక్తంచిందు, గాయపడు. రేకచీరణము వి. రేకలుతీర్చే చిన్నఉలి. రేకంచు వి. కండువాలకు నేసే ఒకరకం అంచు. రేకతాడు వి. పురిబిసి, ఒసికర్రలపై వేసిన నర్సాలను పారు పట్టకు కట్టేతాడు. రేకదాక వి. వెడల్పు మూతి బోడంచు లోపల లోవాయి ఉండే మట్టిపాత్ర. రేకదొమ్మ వి. లక్షణం, నోటివెంబడి బొంగ. రేకపెట్టు అ.క్రి. అటక, దాక మొ. వాటిని నర్సేటప్పుడు పక్కభాగంలో అంచుపెట్టు. రేకబద్ద వి. పర్నం, పంగలగా ఉన్న ఒసికర్రలపై పొడుగ్గా వేసిన కర్ర. రేకమోచు అ.క్రి. (కత్తిమొ. వాటి) నాట్లుతిను, దెబ్బతిను. విజయ. 3.158. రేకమోవకగెల్చు అ.క్రి. గాయపడకుండా విజయం పొందు. విజయ. 1.40. రేకయగు (-అగు) అ.క్రి. గాయపడు. రేకలకమ్మి వి. ఒక్కొక్కరంగు ఒక్కొక్క కొలికి బొప్పున అయిదు రంగుపోగులు పడేట్లు నేసిన కమ్మి. రేకలదారం రూ. రేకల్దారం, రేకులదారం. వి. 1. రాట్నం ఆకులకు చుట్టినదారం ; 2. రాటిఆకులు పైపీ కిందపీ కలిపి కట్టినదారం. రేకల్దారం రూ.చూ. రేకలదారం. వి. 1. రాట్నం ఆకులకు చుట్టిన దారం ; 2. రాటి ఆకులుపైపీకిందిపీ కలిపికట్టిన దారం. రేకవాఱు (-పాఱు) అ.క్రి. గాయపడు. వర. రా.యు. 216పు. 13పం. రేకవిరియు అ.క్రి. పూచు.

రేక[2] వి. తాటాకుదొప్ప, తాటాకుచేద.

ఒ. రేక. చేద, బాల్చి.

<ఒ. రేక.

రేకలా వి. ఒకవిధమైన ఫిరంగి.రంగా, చ. 1.158.

మ. రేకలా. పేలేపనిముట్టు, ఒకవిధమైనఫిరంగి.

రేకి వి. కొబ్బరికమ్మ.

సం. రేఖా. గీత, పరస.

రేకిణి వి. ఒకఆభరణం.

హిం. రాక్ టీ. ఆభరణవిశేషం.

<హిం. రాక్ టీ.

రేకు రూ. ఱేకు. వి. 1. పుష్పదళం. భార. ఆది. 4.78 ; 2. దళం. ఆకు. ఘటికా. 2.17 ; 3. బంగారు మొ. వాటి తగడు. రామాభ్యు. 7.5 ; 4. దుప్పటిగా కూర్చనివస్త్రం ఆం. భా. 2.156 ; 5. అరం ; 6. సంసారి వితంతువులు కట్టుకొనే అంచులేని చాయచీర ; 7. తగరం, ఇత్తడి మొ. ధాతువుల పల్చనిఆకు ; 8. ఒంటివరస దుప్పటి ; 9. పల్చని కొయ్యముక్కలను చివ్వటానికి వాడే రేకు పనిముట్టు, ఒకపైపు పదునైన గాడికలది ; 10. బండికండను చక్రాన్ని కలిపే కర్ర ; 11. రసమట్టం మీది కవచం ; 12. మరాసుమీద పడుగు తోడే టప్పుడు అనులు పడేట్టు సోగును జరపటానికి ఒకకొయ్య పట్టెకు బిగించిన రేకు ముక్క ; 13. నేతనేసేటప్పుడు మరమగ్గం యేరుపు పలక సులువుగా ఆడటానికి బిగించిన ఇనపరేకు ; 14. మర నాడె గాడిలో ముల్లుకుగుచ్చిన కండెఊచ ఊడిపోకుండా బిగించిన ఇత్తడిరేకు ; 15. రాట్నం ఇరుసుమీద తిరగ టానికి చక్రం మాదిరిగా అమర్చిన సాపచెక్క ; 16. పంటికామచుట్టూ వంచికట్టిన వెదురుబద్ద ; 17. రాటికపైనా కిందా కట్టిన వెదురుబద్దలు ; 18. తగుడు, వెలగపార రేకు ; 19. 'వి'ఆకు బండికుండను పూటీ (వంపు)ని కలిపేకొయ్య ; 20. అరటిచెట్లు బోదెకున్న పార ; 21. ఈక. కొలా. రెక్క. ఆకు.

రేకుతాపి వి. గచ్చును నున్న బరచటానికి పనికివచ్చే చిన్నతాపి. రేకుపార వి. మట్టిపని చెయ్యటానికి పడ్డెవారు, రైతులువాడే పార. రేకుపెంకు వి. పల్చనిపెంకు. రేకుబద్ది వి. కట్టువేయటానికి పనికివచ్చే పలచగా సన్నగా ఉండే రేకుపట్టె. రేకుబల్ల వి. ఆరుపదును పాత్రలమీద నునుపు, గట్టితనం రావటానికి నర్సేసలప. రేకుబొంగు వి. రేకుగొట్టం, సీరుకప్పునుంచి కారటానికి వీలుగా అమర్చిన గొట్టం. రేకుడొక్కు వి. రంగుకొలుచుకొనే చిన్నపాత్ర. రేకుతొట్టి వి. రంగునీళ్ళు కాచే పెద్ద ఇనపడబ్బా. రేకుపట్టె వి. మర మగ్గం చట్రం నిలువుపట్టెకు పైన బిగించిన అడ్డపట్టె. రేకుమట్టం వి. మూలలు కొలపటానికి తాపీపనివాళ్ళు వాడే పరికరం. ఆంగ్లంలోని '|_' ఆకారంలో చేయబడిన ఇనప బద్దీ. రేకుమడఁగు రూ. రేకుమణఁగు. అ.క్రి. అణగు. దశా. 4.101. రేకుమడచు అ.క్రి. పొగరడగించు. విజయ. 3.165. రేకుమడఁచు రూ. రేకుమణఁచు. స.క్రి. చంపు, సంహరించు. వాల్మీ. 1.100 ; 2. అణగదొక్కు మణగించు. భాను. 3.61, రాజవా. 4.9. రేకుమణఁగించు స.క్రి. మణగచేయు, మణగించు. అష్టమ. క. 2.108 పు. 15పం. రేకుమణఁగు రూ.చూ. రేకుమడఁగు. అ.క్రి. అణగు. రేకుమణఁచు రూ.చూ. రేకుమడఁచు. స.క్రి. 1. అణగ

దొక్కు, మణగించు. భాను. 3.61; 2. చంపు, సంహరించు. **రేకుమూకట** వి. రేకులాగా చదరంగా ఉండి మూతగావాడే మట్టిపాత్ర. **రేకులతాడు** రూ.చూ. రేకుల్తాడు. వి. రాట్నం ఆకులకు చుట్టిన తాడు. **రేకులదారం** రూ.చూ. రేకలదారం. వి. రాట్నం ఆకులకు చుట్టిన తాడు. **రేకుల్తాడు** రూ.చూ. రేకులతాడు వి. రాట్నం ఆకులకు చుట్టిన తాడు. **రేకెత్తించు** స.క్రి. ప్రోత్సహించు. **రేకెత్తు** రూ.చూ. రేకెత్తు. అ.క్రి. వర్ధిల్లు. ఆం.నా.శ. 5. **రేకొత్తు** అ.క్రి. విరియు, విప్పారు. < రేకు + ఒత్తు. **రేక్కుండ** వి మూడు పెట్టి చేసిన మట్టి పాత్ర.

**రేకెత్తించు** చూ. రేకు.

**రేకెత్తు** చూ. రేకు.

**రేకొత్తు** చూ. రేకు.

**రేక్కుండ** చూ. రేకు.

**రేఖ** వి. రీతి, విధం. విప్ర. 1.76, నార. పంచ. 2 156

సం. రేఖా. గీత, మార్గం, వరస.

<సం. రేఖా. (అర్థవిపరి.).

**రేఖానులు** వి.బ.వ. ఒకరకం మెట్టధాన్యం. ప్రబంధ. 112.

హిం. రేఖా.న-. మెట్టభూమి.

**రేగటినేల** చూ. రేగడి.

**రేగటిపాలు** చూ. రేగడి.

**రేగటిమట్టి** చూ. రేగడి.

**రేగటిమన్ను** చూ. రేగడి.

**రేగడ** రూ.చూ. రేగడు. వి. రేగడి, బంకమన్ను.

**రేగడపాలు** రూ.చూ. రేగటిపాలు. వి. ఈనిన, 3,4 రోజులు ఇచ్చేపాలు, జున్నుపాలు. **రేగడబఱ్ఱె** రూ.చూ. లేఁగడబఱ్ఱె. వి. అప్పుడే ఈనిన ఎనుము, లేగడబర్రె. **రేగడమట్టి** రూ.చూ. రేగడి మట్టి. వి. జిగురుగా ఉండే నల్ల మట్టి.

**రేగడి** రూ.చూ. రేగడు. వి. ఔ. బంకమన్ను. 4.20.

**రేగటినేల** వి. నల్లనేల. **రేగటిపాలు** రూ. రేగడపాలు, లేఁగటి పాలు. వి. ఈనిన పదిహేను రోజులదాకా ఇచ్చే పాలు. **రేగటిమట్టి** రూ.చూ. రేగడిమట్టి. వి. జిగురుగా ఉండే నల్లమట్టి. **రేగటిమన్ను** రూ. రాయిటిమన్ను. వి, నల్లబంకమన్ను. **రేగడిదూల** వి. ఒకానొక చెట్టు, కచ్ఛుర, తీటకసింద. **రేగడిపోడు** వి. అడవికొట్టి సాగు చేసే రేగటి భూమి. తె.శా. నం. 1.32. **రేగడిమట్టి** రూ. రేగటిమట్టి, రేగడమట్టి, రేగడిమన్ను, రేవడిమన్ను. వి. జిగురుగా ఉండే నల్లమట్టి. **రేగడిమన్ను** రూ.చూ. రేగడిమట్టి. వి. జిగురుగా ఉంటే నల్లమట్టి.

**రేగడు** రూ. రాగటి, రాగడి, రాగిడి, రేగడ, రేగడి, రేవ, రేవడ, రేవడి, రేవ. వి. రేగటినేల, నల్లమట్టినేల. తె.శా.కా. శాసనం. క్రీ.శ. 1311.

క. ఎరె్త ఎఱ్ఱమన్ను, నల్లరేగడి ; త. ఎరువై. రక్తం. రాగి ; కొలా. ఎఱ్ఱొడి. ఎరువు.

**రేగాల్వ(-కాల్వ)** వి. 1. ఆములో కుండలు కాలీకాలని తీరు ; 2. ముదర కాలిన ఇటిక.

**రేగి** రూ.చూ. రేను. వి. సమారమి 10,12 అడుగుల ఎత్తున పెరిగే ముళ్ళ చెట్టు, పదునైన సన్నటిముళ్ళు, పంగల కొమ్మలు, బూడిదరంగు బెరడు, పసుప్పచ్చ పూలు పూసే చెట్టు (Zyzyphus jujuba).

**రేగిగంప** రూ. రేగ్గంప. వి. 1. తగులుకుంటే వదలక పోట్లాడే స్త్రీ ; 2. రేగుచెట్టుకంప.

**రేగు** రూ.చూ. రేను. వి. వాడి అయిన సన్నటిముళ్ళు పగుళ్ళతో కూడిన బూడిద రంగు బెరడు. పంగలకొమ్మలు, పసుప్పచ్చటిపూలు ఉండి 10,20 అడుగులెత్తు పెరిగే ముళ్ళచెట్టు (Zyzyphus jujuba).

**రేగుచెట్టు భాగవతము** వి. తనకు తెలియకున్నా తెలిసినట్లు నటించటం (సందర్భంలో ఉపయోగించే పలుకుబడి). **రేగుపాలి** వి. ఏట రేగులు తంగేళ్లగ ద్రొక్కికొను స.క్రి. ముళ్ళడొంకల్ని కూడ లెక్కచేయక ప్రాణాలకి తెగించు. **రేగ్గంప** రూ.చూ. రేగిగంప. వి ఆముకాల్పుకు ఆము పడుగులో వేయటానికి వాడే రేని చెల్ల కంప.

**రేగుడు** వి. లింగపొట్ల, ఒకరకం పొకేతీగ. (Hibrac indica).

**రేగులు** రూ.చూ. రేవులు. వి.బ.వ. నల్లామునుంచి పొగ పోవటానికి కాల్వు చూచుకోవటానికి నల్లాము చుట్టూ మంట వెనక్కి రావటానికి వీలుగా దాతు మధ్యగా భూమికి జానెడెత్తులో ఉంచిన మట్టి కదుర్లు.

**రేగ్గంప** చూ. రేగు.

**రేంగుల** వి. రేగు, రేను.

క. రేంగు, ఎర, ఎతచి ; త. ఇరతి, ఇరంతై ; మ. ఇలంత, లంత ; గోం. రేంగా ; పర్జి. రేగ ; పో.చూ. కొలా. రెనా.

< మూ.ద.ద్రా. *మూ.మ.ద్రా. ఇరన్-.

**రేఁగు**[1] రూ. రేవు.[3] అ.క్రి. 1. విజృంభించు, చెలరేగు. కు.సం. 4 105 ; 2. ఉబుకు, పైకివచ్చు. కు.సం. 7.119 ; 3. ఎగయు. భార.విరా. 5.30 ; 4. కోపించు, ఆగ్రహించు. మార్క. 5,29 ; 5. అతిశయించు, వృద్ధినొందు. హరి. పూ. 5.44 ; 6. వుండు మొ. అఘాతాదుల్తో ఉద్దీపితమగు, రేగు ; 7. నిప్పు అంటుకొను, ముట్టుకొను.

**రేఁచిపెట్టు** స.క్రి. 1. ప్రేరించు. భార. ఉద్యో. 2.248 ; 2. అతిశయింపచేయు. కవిక. 3.223. **రేఁచు** స.క్రి. 1. పురికొల్పు, ప్రేరేచు. భార. ఉద్యో. 2.248 ; 2. కోపింపచేయు. భార. శాంతి. 3.20 ; 3. చెదరగొట్టు. హరి. పూ. 5.253 ; భాస్క. రా.యు. 109 ; 4. పుట్టించు, కలిగించు. శృం.నై. 8.42 ; 5. ఎగయుచేయు, ఎగరగొట్టు. మను. 6 29 ; 6. అతిశయింపచేయు, ఉద్రేకింపచేయు. ఉ.రా. 6.94. **రేఁచుకొను** స.క్రి. అతిశయింపచేయు. ప్రబా. 2.59. **రేఁపు** స.క్రి. 1. రేకచేయు. వరాహ. 4.24 ; 2. పుండు మొ. వాటిని అఘాతాదుల వల్ల. ఉద్దీపితం కావించు ; వి. ప్రేరణం సారంగ. 2.68.

**రేఁగు**[2] రూ.చూ. రేను. వి. బదరీవృక్షం. మను. 4.3.7

**రేఁగుపండు** రూ.చూ. రేఁగుపండు. వి. బదరీఫలం.

**రేఁగుడు** వి. లింగపొట్ల.

**రేచిక** రూ.చూ. రేచుకుక్క. వి. 1. ఇది అడవిలో పొంచుండి

పశువుల్ని పట్టి శరీరమంతా రంధ్రాలు చేసి నెత్తురు పీల్చే మృగం, రేచు; 2. వెంటతగిలి విడవకుండా కయ్యం పెట్టుకొనే స్త్రీ, పిచిక.

**రేచిక్క** వి. తలతిక్క.

సం. రేచక-. కల్మషాన్ని పోగొట్టేది, రేచకి. కరకచెట్టు.

**రేచీకు**[2] చూ. రేపు.

**రేచు**[1] రూ. రేసు.[2] వి. రేచుకుక్క, అడవికుక్క. నవనాథ. 97.

క. చిఱు, నాయి, చిరినాయి. అడవికుక్క; గోం. రచ్-నై. అడవికుక్క; పర్జి. ఇరిచ్‌నెట్టు. అడవికుక్క. కొలా. రెస్‌నెఱె. అడవికుక్క.

రేచుకుక్క రూ. రేచిక, రేక్క, రేసుకుక్క. వి. అడవి కుక్క.

**రేంచి** వి. రేవలచిన్ని. ఒకరకం ఆకెరువుమొక్క.

**రేఁచిపెట్టు** చూ. రేఁగు[1].

**రేఁచు** చూ. రేఁగు[1].

**రేఁచుకొను** చూ. రేఁగు.

**రేడ** వి. తేనెపెరడు, తేనెతుట్టె.

**రేడిచుక్క** రూ.చూ. రెడ్డిచుక్క. వి. మూలనుక్క, బృహస్పతి పేరుతో ఉండే నక్షత్రం.

**రేడియో** వి. తంతువిరహిత తారాప్రేషణం.

ఇం. *Radio*. నిస్తంత్రిశ్రవణ యంత్రం.

<ఇం. Radio.

రేడియోపింజార్చి వి. పక్కల నగిషీలు చేసిన జాకార్చి.

**రేడు** రూ.చూ. ఱేడు. వి. రాజు.

**రేణము** వి. మిక్కిలి చిన్నదూడపేడ. హరి. పూ. 5.142.

ప్రా. రేణి-బురద.

<ప్రా. రేణి-.

**రేణి**[1] వి. ఉపయోగం. కకుత్థ. 5.98.

రేణికివచ్చు అ.క్రి. ఉపయోగపడు, పనికివచ్చు.

**రేణి**[2] రూ.చూ. రేను. వి. ఒకానొక చెట్టు. ఆకు, జిగురు, పళ్ళువైద్యంలో ఉపయోగపడే చెట్టు. హంస. 4.11. (Zizphus jujuba).

రేణిగాయపుల్ల వి. రేగుపండురంగు.

**రేణుకలు** వి.బ.వ. నూగుదోస, సం. రేణుక-దుమ్ముకలది.

<సం. రేణుక-. + -లు.

**రేఁటెము** రూ.చూ. రెంటము. వి. జంటపోగులనలువ, జమిలి నేతబట్ట. యయా. 5.75.

**రేతలి** వి. రేణునాశం చేసేది, తుమ్మెద.

సం. రేణు-దుమ్ము.

**రేతిరి** రూ.చూ. రాతిరి. వి. రాత్రి, నిసి. వేంక. పంచ. 3.271.

**రేత్తిరి** రూ.చూ. రాతిరి. వి. రాత్రి, నిసి.

**రేత్రి** రూ.చూ. రాతిరి. వి. రాత్రి, నిసి.

**రేనాటిసీళ్ళు** చూ. రేనాఁడు.

**రేనాఁడు** వి. దేశవిశేషం. హంస. 1.63.

రేనాటిసీళ్ళు వి.బ.వ. రేనాడునుండి పెన్నకు పారివచ్చే ఎర్రటి బురదనీరు.

**రేని** రూ.చూ. రేను. వి. ఒకరకం చెట్టు.

రేనిచెట్టు వి. ఒకరకం చెట్టు, రేగుచెట్టు.

**రేను** రూ. రేగు, రేఁగు[2], రేణి[2], రేని, రేనె, రేవు[1], ఱేఁగు. వి. వృక్ష విశేషం, బదరీవృక్షం. వేంక. పంచ. 4 522.

**రేనె** రూ చూ. రేను. వి. రేగు.

**రేపకడ** చూ. రేపు[1].

**రేపక్ర** రూ. రావక్ర. వి. రాగోలకట్టె, కంచె వేసేటప్పుడు ముళ్ళకంపలు ఎత్తటానికి ఉపయోగించే పంగలకర్ర.

**రేపటమర్నాట** చూ. రేపు.

**రేపటిమంద** చూ. రేపు.

**రేపము** వి. స్వాధీనం.

సం.రేప-నిందింపతగిన, దుష్టమైన, క్రూరమైన.

**రేపల్లె** రూ.చూ. వ్రేపల్లె. వి. గొల్లపల్లె.

**రేపాడి** చూ. రేపు.

**రేపాల** రూ. నేపాల. వి. నేపాలచెట్టు, కంచెమొక్క. (Jatropha cureas).

**రేపావలి** వి. పొలాలలో ఒకరకం మొక్క, రోడ్లపక్కనా, బంజరు నేలల్లోనూ పెరిగి ఆకుపచ్చ ఎరువుగా ఉపయోగపడే చెట్టు. (Porfulaca Species).

**రేపు** రూ. ఱేపు. వి. ఔ. అవ్య. 1. ప్రాతఃకాలం. భార. ఆది. 5.61; 2. అచిరభావికాలం, భావికాలం. భార. ఉద్యో. 2.15; 3. ఎల్లి, మరుసటిదినం, తర్వాతదినం. హరి.ఉ. 1.18; 4. పగలు, దివాభాగం. దశ. 2.139.

త. ఎఱు. ఎక్కు, తీచు (స్వర్గయనుల్లా).

రేచీకు[2] వి. కేవలాంధుడు. ప్రభు. 2.46పు. 5పం. <రేపు + చీకు. రేపకడ రూ. ఱేపకడ. వి. ప్రాంతఃకాలం. భార. ఆది. 2.33. రేపటమర్నాట అవ్య.ద్రు. ఒకటి రెండు రోజుల్లో, త్వరలో. హంస. 5.193. రేపటి మంద వి. పగటిపూట పొలంలోకితోలిన గొర్రెలమంద. రేపాడి రూ. ఱేపాడి. వి. 1. రేపు, ఎల్లి. కాశీ. 2.83; 2. ప్రభాతం, ప్రాంతఃకాలం. కాశీ. 3.349. రేపుమాపు అవ్య. 1. ఎల్లప్పుడు. భాగ. సం. 16.2.47; 2. అనతి కాలంలోనే. పరమ. 3.1247. రేయెండ[2] వి. బాలాతపం, లేతఎండ. కు.సం. 3.18.

**రేపుఁడు** విశే. దూరబడినవాడు.

**రేపెట్టు** వి. మరచిపోయేదాన్ని గుర్తుచేయు.

**రేబ** వి. కయ్యమీద పరుపు.

**రేమిడి** వి. ఒకజాతివృక్షం. పండి. చ. 5.348పు.

**రేఁవు** చూ. రేఁగు[1].

**రేయి** రూ.రెయి, రే[1], ఱేయి. వి.ఔ. రాత్రి. నిసి. భార. ఆది. 6.289.

సం. రాత్రి. రేయి; ప్రా. రత్త, రాఈ-.

<ప్రా. రాఈ.

రేయినడకరి వి. నిశాచరుడు. భోజరాజ. 1.25. రేయి నడుపుచుక్క వి. మూలచుక్క, బృహస్పతిపేరులో ఉండే నక్షత్రం. రేయింద్రిమ్మరి వి. రాక్షసుడు. అచ్చ. రా. బాల. 82. రేయివెలుఁగు రూ. రేయివెల్గు. వి. చంద్రుడు.

రేయివెల్గు రూ.చూ. రేయివెలు(గు. వి. చంద్రుడు. రేయివేలుపు రూ. రేయివేల్పు, రేవేలుపు, రేవేల్పు. వి. చంద్రుడు. రేయివేల్పు రూ.చూ. రేవేలుపు. వి. చంద్రుడు.

రేయు రూ. ఱేయు. అ. క్రి. 1. విజృంభించు, చెలరేగు. కాన్క. రా. యు. 78 ; 2. అతిశయించు రం. రా. అయోధ్యా. 123పు. 3పం. ; 3. అదరు, పూను. రసిక. 1.113; స.క్రి. ఖండించు. రాఘవా. 4.171.

క. ఏఱు. పైకిలేచు, అధికమగు ; కొడ. ఎర్-(ద్రవం మొ.నవి.) తలవరకువచ్చు (లేచు) నిండు ; తు. ఏరుని. ఎక్కు, పైకిలేచు, అధికమగు ; త. ఏఱు (ఏఱి-). పైకిలేచు, ఎక్కు, అధికం, హెచ్చువెల, ఏఱ్ఱు. పైకిలేపు, హెచ్చించు : మ. ఏఱుక. పైకిలేచు, అధికమగు, ఎక్కువ : కొ. ఒ.ర్. పైకిలేచు.

రేయెండ[2] చూ. రేపు.

రేరి చూ. రాతిరి. వి. నిసి. వేంక. పంచ. 3.271, శపధ. 3.256.

రేల రూ.చూ. ఱేల. వి. వృక్షవిశేషం, సువాసనగల తెల్లటి పూలుపూసి రేసెగుజ్జు, రోళ్ళపదునుచేయటానికి ఉపయోగపడే బెరడుగల కాయలుకాసే చెట్టు. (Cassia fistula).

రేలపువ్వు వి. 1. పసుపపచ్చరంగు ; 2. బీరపువ్వులో లేత రంగు.

రేలపూత వి. తంగేడుపువ్వు రంగు.

రేలపూరంగు వి. గుమ్మడిపువ్వు రంగు.

రేలరొట్ట వి. ఆకులేక కాయపొట్టు.

రేవ రూ.చూ, రేగడు. వి. ఒండునేల, వరదల్లో కొట్టుకువచ్చి నిల్చేమట్టి.

రేవగ్ర వి. రేవచెట్టు కట్టె.

రేవటిములగ చూ. రేవడి.

రేవడ రూ.చూ. రేగడు. వి. నల్లనేల. పరమ. 2.12.

రేవడి రూ.చూ. రేగడు. వి. నల్లమట్టి నేల.

రేవటిములగ వి. ఒకరకం కలుపుమొక్క. (Solanum Xanthocarpum). రేవడిమన్ను రూ.చూ. రేగడిమట్టి. వి. నల్లబంక మట్టి.

రేవ(డు చూ. రేవు[2].

రేవనగడ్డి వి. రాగిసె, ఒకరకం కలుపుమొక్క. (Arthraxon lanceolafus).

రేవంతముళ్లు వి.బ.వ. వస్త్రం ధరించటంలోని విశేషం.

రేవమన్ను రూ. రావమన్ను, రేవుమన్ను. వి. సన్నటి ఒండ్రు మట్టి, రేవుమన్ను.

రేవలచిన్ని రూ. రేవల్చిన్ని. వి. వృక్షవిశేషం.

రేవల్చిన్ని రూ.చూ. రేవలచిన్ని వి. వృక్షవిశేషం

రేవలు రూ.చూ. లెవలు. వి. అంతటా ఒకేఎత్తులో ఉండటం.

రేవలుగొట్టు స.క్రి. కుండరూపాన్ని తీర్చిన తర్వాత గట్టిగానున్నగా రావటానికి మూకోసారి నైస్‌నలపతో కొట్టు.

రేవు[1] రూ.చూ. రేను. వి. రేగుచెట్టు. యయా. 2.47.

రేవు[2] రూ. ఱేవు. వి. 1. సముద్రంలో సరుకులు ఎగుమతి దిగుమతి చేసేచోటు. కాశీ. ఆది. 3.36 ; 2. చాకలి. బట్టలుతకటంకోసం బట్టలు తీసుకుపోయే చోటు. విజ్ఞాప్రా. 62 ; 3. నద్యాదుల్లో మనుషులు దిగటానికి అనువుగా ఏర్పరచిన దారి. ఆము. 1.65 ; 4. ఆమునుంచి పొగ పోపటానికి ఉంచినగొట్టం ; 5. వైపు, పార్శ్వం. 6. అగిఆగి వరసపెట్టి తిట్టటం ; 7. మోటబావిలో బొక్కెన మునిగేచోటు.

రేవ(డు వి 1. చాకలివాడు. మను. 3.105 ; 2. అవివేకి. ప్రబోధ. 3.24. రేవుకుపోవు అ.క్రి. 1. భర్త మరణించిన స్త్రీని జలాశయానికి తీసుకుపోవు ; 2. అపరకర్మలకోసం జలాశయానికి పోవు ; 3. చాకలి గుడ్డలనుతకటానికి ఏటికో చెరువుకో పోవు. రేవుకువచ్చు అ.క్రి. 1. ఒక పని వైనమగు ; 2. ఒడ్డుకు వచ్చు. రేవుకువేయు స.క్రి. చాకింటవేయు, చాకలికిగుడ్డలు వేయు. రేవుగుఱ్ఱము వి. గాడిద. వేంక. ఆం. తిర్య 94, శుక. 3.102. రేవుజక్కి వి. గాడిద. రేవుఠావు వి. గతి, మోక్షం. రేవుతాడు వి. అచ్చు కట్టేటప్పుడు వడిదారాల బిగింపుకు అచ్చుకర్రమీద మెలికల్లో దూర్చిన పురిదారం. రేవుతిప్పు వి. అచ్చువళ్ళలో పడుగు పోగులు తగిలే భాగం ; స.క్రి. అచ్చువళ్ళను తిప్పు. రేవుదారం వి. అచ్చు కట్టేటప్పుడు వడిదారాల బిగింపుకు అచ్చుకర్రమీది మెలికల్లో దూర్చిన పురిదారం. రేవున(బడు (-పడు) అ.క్రి. విఫలమగు, కడతేరు. రేవుపడవ వి. నద్యాదుల్లో ఈదరినుండి ఆద్దరికి మనుష్యాదుల్ని దాటించే పడవ. రేవుపొయ్యిలు వి.బ.వ. నల్లాంనుంచి పొగపోవటానికి కాక కాల్పు చూచుకోవటానికి నల్లాంచుట్టూ మంట వెనక్కి రావటానికి వీలుగా దాతల మధ్యగా భూమికి జానెడెత్తులో ఉంచిన మట్టికుదుర్లు. రేవుబెట్టు స.క్రి. తిట్టు. రేవుబోయ వి. ఓడనడిపేవాడు. నిర్వ.రా. 9.8.

రేవులు రూ. రేగులు. వి.బ.వ. నల్లాము నుంచి పొగపోవటానికి, కాల్పు చూచుకోవటానికి, నల్లాము చుట్టూ మంట వెనక్కి రావటానికి వీలుగా దాతు మధ్యగా భూమికి జానెడెత్తులో ఉంచిన మట్టి కుదుర్లు. రేవుమన్ను రూ. రేవమన్ను. వి.బ.వ సన్నని. వండుమట్టి. రేవులు

రేవులు రూ. రేవ్రలేవులు. వి.బ.వ. వెనుగాడి మీది కూన కప్పులో ఒకదానికింద మరొక కూన వచ్చినందున ఏర్పడిన మిద్రుపల్లాలు. రేవులువాఱు (-పాఱు). అ.క్రి. రోమ వీథులేర్పడు. భోజసుతా. 4.139. రేవులువేయు అ.క్రి. ఆము కాల్పులో కాక వచ్చిన తరువాత రేవుల్ని కప్పివేయు. రేవులేని అవ్య. వెరవు చాలని. రేవ్రరేవులు రూ.చూ. రేవులు రేవులు. వి.బ.వ. వెనుగాడిమీది కూన కప్పులో ఒకదానికింద మరొక కూన వచ్చినందున ఏర్పడిన మిద్రుపల్లాలు. రేవువా(డు విఙ. చాకలివాడు.

రేవు[3] రూ.చూ. రే(గు[1]. అ.క్రి. విజృంభించు. కు.సం. 11.103.

రేశం రూ.చూ. రేషము. వి. 1. పట్టు ; 2. పట్టుతో నేయబడినది.

రేశము చూ. రేము. వి. పౌరుషం.

రేళ్కి రూ.చూ. రేచుకుక్క. వి. 1. ఇది అడవిలో పొంచి ఉండి పశువుల్ని పట్టి శరీరం అంతా రంధ్రాలు చేసి నెత్తురు పీల్చే మృగం, రేచు ; 2. వెంట తగిలి విడవ

కుండా పోట్లాట పెట్టుకునే స్త్రీ.

**రేషంఆకు** చూ. రేషము.

**రేషంరంగు** చూ. రేషము.

**రేషంలడీ** చూ. రేషము.

**రేషంగూటంపట్టు** చూ. రేషము.

**రేషన్** రూ.చూ. రేషము. వి. **1**. పట్టుపురుగుల నుంచి వచ్చే దారం ; **2**. కృత్రిమపు పట్టు.

**రేషన్ఆకు** రూ.చూ. రేషంఆకు. వి. పట్టు పురుగు తినే ఆకు. **రేషన్పురుగు** రూ.చూ. రేషం పురుగు. వి. పట్టు ఉత్పత్తి చేసే పురుగు.

**రేషందారం** చూ. రేషము.

**రేషంనూలు** చూ. రేషము.

**రేషము** రూ. రెశం, రేశం, రేషన్, రేషిం, రేషిమి, రేష్మి, రేసము. వి. **1**. పట్టు ; **2**. పట్టుతో నేయబడినది.

హిం. రేశమ్. పట్టు. రేశమీ. పట్టుతో చేయబడిన, పట్టువంటి, పట్టు సంబంధమైన ; ఉ. పార. రేషమ్. పట్టు, రేషమీ, రేషమీన్. పట్టు సంబంధమైన, పట్టుతో నేయబడిన, పట్టుతో తయారుచేయబడిన.

< ఉ. రేషమ్.

**రేషంఆకు** రూ. రేషన్ఆకు. వి. పట్టుపురుగు తినేఆకు. **రేషంరంగు** వి. పట్టుకు వేసే రంగు. **రేషంలడీ** వి. పట్టు దారం లెక్క. **రేషంగూటంపట్టు** వి. దారం తోడటానికి చిలప తగిలించే కొయ్య. **రేషందారం** వి. ఒకరకం పురుగు నుంచి వచ్చేదారం. **రేషం నూలు** వి. ఒకరకం పురుగు నుంచి వచ్చేదారం **రేషం. పట్టు** వి. నారతో తయారైన కృత్రిమపు పట్టు. **రేషంపురుగు** రూ. రేషన్ పురుగు వి. పట్టుదారం ఉత్పత్తి చేసేపురుగు **రేషంమగ్గం** రూ. రేషమ్మొగ్గం. వి. పట్టుబట్టలు నేసే ఒక రకం చేతిమగ్గం. **రేషమ్మొగ్గం** రూ.చూ. రేషం మగ్గం. వి. పట్టుబట్టలు నేసే ఒకరకంచేతి మగ్గం.

**రేషంపట్టు** చూ. రేషము.

**రేషంపురుగు** చూ. రేషము.

**రేషంమగ్గం** చూ. రేషము.

**రేషమ్మొగ్గం** చూ. రేషము.

**రేషిం** రూ.చూ. రేషము. వి. **1**. పట్టు ; **2**. పట్టుతో నేయబడినది.

**రేషిమి** రూ.చూ. రేషము. వి. **1**. పట్టు ; **2**. పట్టుతో నేయబడినది.

**రేష్మి** రూ.చూ. రేషము. వి. **1**. పట్టు ; **2**. పట్టుతో నేయబడినది.

**రేసము** రూచూ. రేషము. వి. **1**. పట్టు ; **2**. పట్టుతో నేయబడినది.

**రేసు**[1] వి. **1**. చులకన. వేంక. పంచ. 1.713 ; **2**. ఈర్ష్య. తాళ్ల. సం. 17.148 ; **3**. ఇటికకు అతుక్కున్న మట్టి పెళుసు. విణ. చులకనిది. తాళ్ల. సం. 6.89.

ప్రా. రేసమ్మి. రేసిమ్మి, నిమిత్తం, కారణం.

**రేసుగుడ్డ** వి. చేతిగుడ్డ. **రేసొద** వి. కంకరి, లేపం.

**రేసు**[2] రూ.చూ. రేచు[1]. వి. ఒకానొక కుక్క.

**రేసు కుక్క** రూ.చూ. రేచుకుక్క. వి. అక్కగార్లముందు పెట్టే. రేచుకుక్క ప్రతికు.

**రేసొద** చూ. రేసు[1].

**రేస్క** రూ.చూ రాసిక. వి. ఒకరకం కలుపు మొక్క.

**రైక** రూ.చూ. రవిక. వి. కంచెల, కంచుకం. పార్వ. 3.53.

**రైకగుడ్డ** రూ. రైగ్గుడ్డ. వి. ఆడవాళ్ళ రవికల కోసం నేసిన బట్ట. **రైకమడత** వి కు.ని, చేలో కోనుగా ఉన్న భాగం. **రైగ్గుడ్డ** రూ.చూ. రైకగుడ్డ. వి. ఆడవాళ్ళ రవికల కోసం నేసినబట్ట.

**రైగ్గుడ్డ** చూ. రైక.

**రైటరు** వి. గుమస్తా.

ఇం. Writer. వ్రాయసకాడు.

< ఇం. Writer.

**రైటు** వి. ఒప్పు. క్రమం.

ఇం. *Right*. ఒప్పు.

< ఇం. Right.

**రైటేరంచు** (-అంచు³) వి. సాదాఅంచుకు పైనగాని కిందగాని నాలుగు గీరలు వచ్చేటట్లు నేసిన అంచు.

**రైతు** రూ. రయతు, రయితు, రవాతు, రహితు. వి. సేద్యకాడు, వ్యవసాయం చేసేవాడు.

హిం. రైఅత్, రైయత్. రైయ్యత్. ప్రజ ; మరా. రయత్, ప్రజ ; ఉ. ర'ఇయత్, 'రఈయత్. ప్రజ, వ్యవసాయదారుడు ; పార. ర'ఇయ్యత్. ప్రజ, భూ. స్వామి. వ్యవసాయదారుడు. అర. ర'ఇయ్యత్'. ప్రజ ; క. రయత, రయిత, రైత. రాజు యొక్క ప్రజ, వ్యవసాయదారుడు, భూమిని గుత్తకు తీసుకొన్నవాడు ; త. రయత్.

< ఉ. ర'ఇయ్యత్.

**రైతుపత్తి** వి. తెల్లపత్తిలో ఒకరకం. **రైతుపిల్లచీర** వి. దీర్ఘచతురస్రపు గడితో వేరేరంగు అడ్డపోగులు వేసి చతురస్రం అయేట్టు నేసిన చీర. **రైతుబిడ్డ** వి. అంచులో నేసే ఒకరకం డిజైను. రైతుబిడ్డ ఒక చలనచిత్రం పేరు. **రైతుబిడ్డగడిచీర** వి. బెత్తెడు వెడల్పున గళ్ళు పడేట్లు నేసిన ఒకరకం చీర

< రైతుబిడ్డ + గడి + చీర.

**రైతువార్** రూ.చూ. రయితువారి. వి. జమీందారు ప్రమేయం లేకుండా వ్యక్తిగతంగా వ్యవసాయం చేసుకొనే పద్ధతి.

**రైతువారి** రూ.చూ. రయితువారి. వి. జమీందారు ప్రమేయం లేకుండా వ్యక్తిగతంగా వ్యవసాయం చేసుకొనే పద్ధతి.

**రైత్వారి** రూ.చూ. రయితువారి. వి. జమీందారు ప్రమేయం లేకుండా వ్యక్తిగతంగా వ్యవసాయం చేసుకొనే పద్ధతి.

**రైత్వారిభూమి** వి. పట్టాభూమి, రైతుశిస్తు చెల్లించి దున్నుకునే సొంతభూమి. శిస్తు చెల్లించే వానికి అనుభవ విక్రయ హక్కులుగల భూమి.

**రైలంచు** చూ. రైలు.

**రైలు** వి. **1**. ఇనపపట్ట ; **2**. పొగబండి.

ఇం. *Rail*. ఇనపపట్టా.

< ఇం. Rail.

**రైలంచు** వి. రైలు పట్టాల మాదిరిగా రెండు సమాంతర

రేఖలు పడేట్టు నేసిన అంచు. <రైలు+అంచు.[3] రైలు చేసర్లు వి.బ.వ. లోకపట్లు. రైలుపట్టా అంచు వి. రైలు పట్టాల మాదిరిగా రెండు సమాంతర రేఖలు పడేట్టు నేసిన అంచు. రైలుపట్టాలంచు వి. రైలు పట్టాల మాదిరిగా రెండు సమాంతర రేఖలు పడేటట్లు నేసిన అంచు. రైలుపప్పళి రూ. రైలుపప్లీ. వి. ఒకరకం గడిచీర. రైలుపప్లీ రూ.చూ. రైలుపప్పళి. వి. ఒకరకం గడిచీర. రైలుపెంకు రూ. రెయిలు పెంకు. వి. యంత్రంలో తయారు చేసే పెద్ద పెంకు. రైలుబొగ్గు వి. భూగర్భం నుంచి తవ్వి తీసిన బొగ్గు. రైలువారిపెంకు రూ. రెయిలువారి పెంకు. వి. యంత్రంలో తయారు చేసే పెద్దపెంకు.

రైల్వే విశ. రైలుకు సంబంధించిన.

ఇం. *Railway*. రైలు మార్గం.

<ఇం. Railway.

రైల్వేబాడరు రూ.చూ. రైల్వేబార్డరు. వి. రైలు పట్టాల మాదిరిగా సమాంతర రేఖలు పడేటట్లు నేసిన అంచు. రైల్వేపెంకు వి. యంత్రంలో తయారు చేసే పెద్ద పెంకు. రైల్వేబార్డరు రూ.చూ. రైల్వేబాడరు. వి. రైలు పట్టాల మాదిరిగా సమాంతర రేఖలు పడేటట్లు నేసిన అంచు.

రొ రూ. రో[1]. అవ్య. 1. సంబుద్ధిలో స్త్రీ వాచకాలకనుప్రయుక్తమయ్యేది. శార. విరా. 3.37. ఉ. అక్కరొ, ఇంతిరొ : 2. ప్రశంసార్థకంలో తద్వాచక శబ్దాల కనుప్రయుక్తమయ్యేది. పాంచాలీ· 5.76. ఉదా. అమ్మరొ.

రొక్కపరుచు చూ. రొక్కము.

రొక్కపుటొడయ(డు చూ. రొక్కము.

రొక్కపుదొర చూ. రొక్కము.

రొక్కపుపూ(ట చూ. రొక్కము.

రొక్కపుతే(డు చూ. రొక్కము.

రొక్కము రూ రొఖము, రొఖ్ఖము, రోఖం. వి. 1. చేతివెల, వెంటనే ఇచ్చే మూల్యం. కు.సం. 8.143 ; 2. నిర్బంధం. భాగ. 6.346 ; 3 ధనం. నీలా. 1.37 ; 4 సమూహం. అచ్చ. రా. అరణ్య. 19 ; 5. వేశ్యాభృతి ఆం.భా. 2.303.

సం. *రొక-. ధనం, సొమ్మిచ్చికొనటం ;

క. రొక్క ; తు. రొక్క ; త. రొక్కమ్ ; మ. రొక్కం. నగదు, డబ్బు ; కువి. రొకొమి.

<సం. *రోక-.

రొక్కపరుచు అ.క్రి. వెంటనే వెలయిచ్చు. < రొక్కము+పరుచు. రొక్కపుటొడయ(డు (-ఒడయ(డు) వి. కుబేరుడు. అచ్చ.రా.యు. 403. రొక్కపుదొర వి. కుబేరుడు. రొక్కపుపూ(ట వి. అరువపూట. రొక్కపుతే(డు వి. ధనాధిపతి, కుబేరుడు. రొక్కములతే(డు వి. కుబేరుడు. రొక్కరూక వి. రొక్కంగా ఇచ్చే రూప్యం. బహుళా 5.96. రొక్కారొక్కములు వి.బ.వ. బహువిధాలు. కాశ. 8.68. రొక్కారొక్కములుదిట్టు (-తిట్టు) స.క్రి. నోటికి వచ్చినట్లు తిట్టు. కాశ. 3.58. రొక్కించు స.క్రి. 1. రొక్కపరచు ; 2. నొక్కినొక్కి అడుగు ; అ.క్రి. నిర్బంధించు. ద్వి. హరిశ్చ. ఉ· 1229. <రొక్కము+-ఇంచు.[3]

రొక్కరూక చూ. రొక్కము.

రొక్కారొక్కములు చూ. రొక్కము.

రొక్కారొక్కములుదిట్టు చూ. రొక్కము.

రొక్కించు చూ. రొక్కము.

రొఖధాన్యాలు చూ. రొఖము.

రొఖము రూ.చూ. రొక్కము. వి. సొమ్ము. నె.శా. నెల్లూరు. 104. క్రీ.శ. 1551.

రొఖధాన్యాలు వి.బ.వ. రొక్కరూపంగా, ధాన్యరూపంగా వచ్చే ఆదాయం. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 282. క్రీ.శ. 1514.

రొఖాసుజాయతు వి. ప్రభువు యొక్క ఆజ్ఞ. ద.హిం.శా. సంపు.10. శా.సం. 759. క్రీ.శ. 1668.

హిం.ఉ. జాహత్. అధికారం.

రొఖ్ఖట చూ. రొఖ్ఖము.

రొఖ్ఖము రూ.చూ. రొక్కము. వి. 1. రోక, చేతివెల, నగదు ; 2. వెంటనే ఇచ్చే మూల్యం ; 3. ధనం ; 4. సమూహం ; 5· వేశ్యాభృతి ; 6. నిర్బంధం.

రొఖ్ఖట వి. డబ్బుకు ఇబ్బంది. <రొఖ్ఖము+కట.

రొఖ్ఖా వి. ఉత్తరం, రసీదు. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 711.27. క్రీ.శ. 1593.

హిం. రుకా్క. చిన్నఉత్తరం, చీటి ; ఉ. రుకా్క. చీటి, కాగితపుముక్క, పార. రికా. చిన్నఉత్తరం, రుక్అ కాగితంముక్క, ఆజ్ఞాపత్రం. చీటి ; అర. రుక్కఅ.

<ఉ. రుకా్క.

రొచ్చు రూ.చూ. రొచ్చు. వి. 1. అడుసు. ఆము. 5.6, రామాభ్యు. 5.194 ; 2. నుచ్చు ; 3. మాలిన్యం ; 4. తూము కాల్వల వెంట పారే మురికిబంద ; 5. అపవాదం ; 6. పశువుల మూత్రంతో ఏర్పడ్డ బురద.

రొచ్చుచేయు స.క్రి. కల్మషదూయిష్ఠం చేయు. వర.రా. అయోధ్యా. 677పు. 23 పం. రొచ్చుపురుగు వి. దోమ, బురదలో ఉండే పురుగు.

రొజ రూ.చూ. రోజా.[1] వి. బండికుండలో బిగించిన ఆకులను పట్టి ఉండే గుండ్రటి కొయ్య చట్రం.

రొజా[1] వి. మహమ్మదీయుల ఒకానొకవ్రతదినం. చంద్రాంగ. 4.208.

హిం. రోజా. వ్రతం. ఉపవాసం ; ఉ. రోజా. వ్రతం, ఉపవాసం ; పార. రోజా. ఉపవాసం, దినం.

<ఉ. రోజా.

రొజా[2] వి. బక్కదారి, రహదారి.

రొజ్జ వి. ముసురు, తెరిపి లేకుండా పడే చిరువాన.

రొజ్జగాలి వి. తేమతో వీచేగాలి.

రొంజు వి. చీమిడి.

రొంజుడు రూ.చూ. రో(జుడు. వి. ప్రలాపం, వదరు. ఆం.భా. 1.116.

రొట్ట రూ. రొడ్డ[1], లొట్ట[2], లొడ్డ[1]. వి. 1. ఉపగాఖ ; 2. ఆకులపోగు ; 3. పందుల పెంట ; 4. పచ్చి ఆకులుగల చిన్నకొమ్మ, లేతకొమ్మ ; 5. పొట్టిగా మందంగా ఉన్న మొక్కమొదలు ; 6. పచ్చి ఆకు మురిగిన ఎరువు ;

7. వంచని పచ్చిపెంకు.

రొట్టి వి. వరి, మినుము మొ. వాటితో చేసే భక్ష్య విశేషం. హిం. ఉ. రోటీ.

<హిం. రోటీ.

రొట్టిపెంకు రూ.చూ. రొట్టెపెంకు. వి. రొట్టెలు కాల్చుకోవటానికి మూకుడులాగా ఉండే మట్టిపాత్ర.

రొట్టిపెనం రూ.చూ. రొట్టెపెనము. వి. మెరగ్గా, వెడల్పుగా, గుండ్రంగా, అంచులేకుండా చదరంగా మూకుడులాగా ఉండే మట్టిపాత్ర.

రొట్టియ రూ. రొట్టె. వి. భక్ష్యం. కాశీ. 7.186.

సం. రోటికా, రోటీ. రొట్టి ; ప్రా. రొట్టియ, రొట్ట-. రొట్టగ.- తండులపిష్టం, రొట్టె. రొట్టియ. రొట్ట ; అ.మా. రొట్టి-. పిండి ;

క. తు.మ. రొట్టె. రొట్టి ; కువి. రుటి, రొటి.

<ప్రా. రొట్టయ-.

రొట్టె రూ.చూ. రొట్టియ. వి. భక్ష్యం.

రొట్టెపెంక రూ.చూ. రొట్టెపెంకు. వి. రొట్టెలు కాల్చుకోవటానికి మూకుడులాగా ఉండే మట్టిపాత్ర. రొట్టెపెంకలరాయి వి. రొట్టె పెనాలు నర్సేదానికి వాడేరాయి. రొట్టెపెంకు రూ. రొట్టిపెంకు, రొట్టెపెంక. వి. రొట్టెలు కాల్చుకోవటానికి మూకుడులాగా ఉండే మట్టిపాత్ర. రొట్టెపెంచు వి. రొట్టెలు కాల్చుకోవటానికి మూకుడు లాగా ఉండే మట్టిపాత్ర. రొట్టెపెనం రూ.చూ. రొట్టెపెనుము. వి. మెరగ్గా, వెడల్పుగా, గుండ్రంగా అంచు లేకుండా చదరంగా మూకుడులాగా ఉండేమట్టిలేదాఇనుముతో తయారు చేయబడ్డపాత్ర. రొట్టెపెనము రూ. రొట్టిపెనం, రొట్టెపెనం. వి. మెరగ్గా, వెడల్పు, గుండ్రంగా అంచు లేకుండా చదరంగా మూకుడులాగా ఉండే మట్టిపాత్ర రొట్టెమూకుడు వి. రొట్టెలు కాల్చుకోవటానికి మూకుడులాగా ఉండే మట్టిపాత్ర. రొట్టెలపెంపు రూ. రొట్లెపెంకు. వి. సజ్జరొట్టెలు కాల్చేమట్టిపాత్ర. రొట్టెలపెండం వి. మెరగ్గా వెడల్పుగా అంచులేకుండా చదరంగా మూకుడులాగా ఉండే మట్టిపాత్ర. రొట్టెలపెనము వి. రొట్టెలు కాల్చుకోవటానికి మూకుడులాగా ఉండేమట్టి లేదా ఇనుముతో తయారైనపాత్ర. రొట్టెలపేలం వి. రొట్టెలు కాల్చుకోవటానికి మూకుడులాగా ఉండే మట్టిపాత్ర రొట్టెవిఱిగినేతిలోపడు అ.క్రి. నష్టం అనుకుంటేలాభం జరుగు. రొట్టెసానిక వి. రొట్టెలు కాల్చుకోవటానికి మూకుడులాగా ఉండే మట్టిపాత్ర. రొట్లెపెంకు రూ.చూ. రొట్టెల పెంకు. వి. రొట్టెలు కాల్చుకోపటానికి వాడే మట్టి లేదా ఇనుం పాత్ర.

రొడ్డ[1] రూ.చూ. రొట్ట. వి. 1. ఉపగాఖ. పచ్చిఆకులుగల చిన్నకొమ్మ ; 2. ఆకులపోగు, 3. పండులపెంట ; 4. విత్తనం చల్లటానికి ముందు ఊడ్పులకు ముందు మళ్ళలో ఎరువుగావేసి తొక్కే చెట్లఆకు ; 5. పొట్టిగా మందంగా ఉన్న మొక్క మొదలు.

రొడ్డ[2] రూ. బొడ్డ, లొడ్డ[2]. వి. ఎడంపక్క.

రొడ్డకొమ్ము వి. రెండూ ఎడంవైపుకి వంగినవి. రొడ్డచెయ్యి వి. ఎడంచెయ్యి. రొడ్డపెట్టుగ్రేయు స.క్రి. ఎడంచేతివాటంగా కొట్టు. వర. రా. సుం. 19పు. 13పం.

రొడ్డు[1] రూ.చూ. రొండు[1]. వి. గ్యానరోగం.

రొడ్డు[2] రూ. రొండు[2]. బొడ్డు, లొడ్డు. వి. పలుపు.

రొడ్డురు రూ.చూ. రోంజుడు. వి. ప్రలాపం.

రొంటబిగింపు చూ. రొండు[3].

రొంటబిసుపు చూ. రొండు[3].

రొండి వి. 1. నడుంయొక్క పార్శ్వభాగం. పల్నా. పు. 68, ఆము. 6.18 ; 2. నడుం పార్శ్వభాగాన ఉండే బట్ట మడత. శుక. 3.345 ; 3 తుంటి.

రొండివేటు రూ. రొండిప్రేటు. వి. మల్లబంధవిశేషం. హంస. 1.206. రొండిప్రేటు రూ.చూ. రెండివేటు. వి. మల్లురపిన్నాణాల్లో ఒకటి.

రొండు[1] రూ. రొడ్డు[1]. వి. 1. రొప్పు, రోజు, గ్యానరోగం ; 2. ప్రలాపం.

సం. రోధ -. అటంకం, నిరోధం.

రొండురు రూ.చూ. రోంజుడు. వి. రొంజుడు, ప్రలాపం, వదరు.

రొండు[2] రూ.చూ. రొడ్డు[2]. వి. పలుపు.

రొండు[3] రూ.చూ. రెండు. వి. ద్విసంఖ్యార్థకశబ్దం.

రొంటబిగింపు వి. రెండు గుజ్జులను నాటటం. రొంటబిగుపు వి. రెండు కొయ్యలుగల కొమర.

రొత్తి వి. మగగురి మీది ముందరితోలు.

రొద వి. 1. ధ్వని. మను. 1.3 ; 2 కలకలధ్వని. కా. 3.21 ; 3. చింత. రసిక. 3.152.

సం. రుత-. ధ్వని ; ప్రా. రుఅ. ధ్వని ; శౌ. రుద- ; పా. రుత - ;

క. రుత. పక్ష్యాదులధ్వని, ఒరె. ధ్వనించు, మాట్లాడు. చెప్పు ; కొడ. ఒరడె. జవాబుచెప్పు ; త. ఉర. పెద్దవప్పుడగు ; మ. ఉరక్క, ఉరెక్క. మాట్లాడు, చెప్పు ; గోం. రోంజానా. ఏడ్చు, దుఃఖించు ; పర్జి. ఉర్. మూలుగు.

<శౌ. రుద-.

రొదగాలి వి. పరగడగాలి, వానవచ్చేముందు దుమ్ముతో బలంగా వచ్చేగాలి. రొదపోవు అ.క్రి. ధ్వనించు. వేంక. పంచ. 1.95. రొదాళము వి. 1. ధ్వని. చంద్రాంగ. 2.128 ; 2. కలకలధ్వని. రొదాళించు అ.క్రి. ధ్వనించు.

<రొదాళము + -ఇంచు[3].

రొదము రూ.చూ. రోదా. వి. బండిచక్రం.

రొదాళము చూ. రొద.

రొదాళించు చూ. రొద.

రొద్దు రూ.చూ. ప్రొద్దు. వి. 1. పొద్దు ; 2. కొంతసేపు.

రొంత వి. ఒకరకం కంచెమొక్క.

సం. రుద్ధ - అడ్డుపెట్టబడినది ; హిం. రుంధ్‌నా. ఆగటం.

రొకది వి. బెండు, చెరకు, జొన్న మొ. వాటి దంటులోపలి భాగం.

రొప్పికొనిపోవు చూ. కొప్పు.

రొప్పించు చూ. రొప్పు.

రొప్పు అ.క్రి. 1. అరచు. భార. అను 4.318; 2. గాండ్రుమను

860 ; **2.** ఇందు. ప. 2.62 ; **3.** ఘుర్ఘరించు (పంది). విక్ర. 2.135 ; **4.** కూయు. వేంక. పంచ. 1.656 ; గాండ్రుమను (పులి). **5.** బొబ్బరించు(ఎలుగు). శుక. 1.500; **6.** బుసకొట్టు(పాము). దశా. 8.61 ; **7.** పీచు. చెన్నబసవ. 5.27 ; **8.** భారంగా శ్వాసను విడుచు. శాళ్ల. సం. 10.2 ; **9.** గొణుగు ; **10.** ఊరికే తప్పులుపట్టు ; **11.** పోరు ; స.క్రి. **1.** భయపెట్టు. భార. ఆది. 7.79 ; **2.** బాధించు. భాగ. 1.355 ; **3.** తరుము. భాగ. 10పూ. 20 ; **4.** కోపించు ; **5.** గోకు ; వి. **1.** శ్వాసం. ఆం. భా. 2.127 ; **2.**మాగాణిలో పలుగొర్రుకోలటం.

క. రొప్ప. గుర్రుమను ; త. ఉఱుంపు. గుర్రుమను, ఘర్ఘరించు ; మ. ఉఱుంపుక. అరుచు ;

సం. రోప -. రోపణ, నొప్పిచే బాధపడటం, ఉపద్రవం.

**రొప్పికొనిపోవు** స.క్రి. తోలుకొనిపోవు. పండి. చ. 1.2.493. **రొప్పించు** స.క్రి. తోలించు. భాగ. 3.939. <రొప్పు+-ఇంచు.³ **రొప్పుడువేట** వి. అరపువేట. **రొప్పువల** వి. జడబిళ్ళ, రాగిడి.

**రొబ్బ** వి. బురద. రొచ్చు.

**రొంప** వి. **1.** పడిసెం ; **2.** పీనసరోగం.

**రొంపి** రూ.చూ. లొంపి¹. వి. బురద, వంకం. భాగ. 10పూ. 764.

**రొంపికంబము** రూ.చూ. రొంపికంభము. వి. వ్యాపనం. శాళ్ల. సం. 14.179. **రొంపికంభము** రూ. రొంపికంబము. వి. అస్థిరం. శాళ్ల. సం. 11.122. **రొంపికరవు** వి. అతివృష్టి వల్ల పైర్లుమురిగి చెడి ఏర్పడ్డ కరువు. **రొంపిదుక్కి** వి. మాగాణికి నీళ్ళుపెట్టిదున్నటం, దున్నిన మాగాణిపొలం ; **2.** నీళ్ళుకట్టిఅడుసుగా దున్నటం. **రొంపినాగేలి** వి. బురద నాగలి, రొంప, నేలలుదున్నేది, దుంప నాగలి. **రొంపిమాను** వి. రొంపిదున్నినతరవాత మిట్టపల్లాల్ని సరిచేయటానికి మీద పారించేమాను. **రొంపులెక్కు** అ.క్రి. రొంపిఅగు. గంధ. 20. <రొంపి+-లు+ఎక్కు.

**రొంపు** రూ.చూ. అంపు. వి. పోరు.

**రొంపులెక్కు** చూ. రొంపి.

**రొంబడి** రూ.చూ. రుంబెన. వి. గొర్రు, గుంటక మొ. వాటి దిండుకు అమర్చిన మేడి.

**రొమ్మడ్డ** చూ. రొమ్ము.

**రొమ్మాని** చూ. రొమ్ము.

**రొమ్ము** రూ.చూ. ఱొమ్ము. వి. వక్షం. కు.సం. 7.36 ; **2.** చూరుకు ఆధారంగా గోడలో నాటిన కర్ర ; **3.** చన్ను, సిరం, ఆవు, గేదె మొ. వాటి పొలచన్ను లేదావాటి చన్ను ; **4.** చంక, పణతకు అరుకు మధ్యఉన్న వంపు లోపలివైపు ; **5.** సెద, చెరువు లోపలివైపు మిట్టగా ఉన్న భాగం.

**రొమ్మడ్డ** వి. గుండె నిలిచిపోయే జబ్బు. <రొమ్ము+అడ్డు+అ¹². **రొమ్మాని** వి.రొమ్ముల కుంపటి, మన్నికవాలు, రొమ్ము మీదఉండే సుడి. **రొమ్ముగూటము** వి. పక్కలోబల్లెం, భయంకరుడు. పండి. చ. 1.4.511. **రొమ్ముత్రొక్కినిల్చు** స.క్రి. జయించు. విజయ. 2.106. **రొమ్మునగుంపటి** (-కుంపటి) వి. బాధాకరం. శాళ్ల. సం. 18.393. **రొమ్ముపేడు** వి. ఏడి కోలను పణతలో దూర్చే చోట ఎలుపు పలుపులకు కొట్టేపేడు. **రొమ్ముబాదుకొను** అ.క్రి. గట్టిగా ఏడ్చు. **రొమ్మురాల్లడుగు** (-ఉడుగు) అ.క్రి. దిగులు తొలగు. రాధికా. 3.62. **రొమ్ములకుంపటి** వి. రొమ్ముసుడి, రొమ్ముమీద ఉండే సుడి కుడివైపున ఉంటే మంచిది. **రొమ్ములకుంపట్లు** వి.బ.వ. బాధాకరులు, రొమ్ముమీద కుంపటి లాంటివారు. పండి.చ. 1.2.343. **రొమ్మువనులు** వి.బ.వ. రొమ్మున బంధించేవి. పరమ. 4.198. **రొమ్ము విరుచుకొను** అ.క్రి. గర్వించు. **రొమ్ముసుడి** వి. రొమ్మాని, రొమ్ములకుంపటి సున్నికవాలు, రొమ్ముమీద ఉండేసుడి.

**రొయి¹** రూ. రొయ్య¹, రొయ్యి¹. వి. కట్టెనిప్పు మీది నిగురు.

**రొయి²** చూ. రోయి¹. వి. నింద.

**రొయ్య¹** రూ.చూ. రొయి¹. వి. వస్తువులు కాలగా మిగిలిన పొడి.

**రొయ్య²** రూ. రెయ్య, రొయ్యి.² వి. మత్స్య విశేషం. హంస. 4.187.

తు. ఎట్టి. రొయ్య ; త. ఇఱవు, ఇఱా, ఇఱాల్. రొయ్య ; కువి. రేజ ; పర్జి. రేశ. రొయ్య ; మాల్తొ. ఇచ. రొయ్య ;

పో.చూ. సం. ఇంచాక-, రొయ్య, రోహిత-. ఎర్రనిది.

**రొయ్యపుర్వు** వి. ఒకరకం రొయ్య చేప. వేంక. పంచ. 4.486. **రొయ్యపొట్టు** వి. కూనరొయ్య. **రొయ్యపారచెట్టు** వి. ఒకరకం చెట్టు.

**రొయ్యి¹** రూ.చూ. రొయి¹. వి. కట్టెనిప్పు మీది నిగురు.

**రొయ్యి²** రూ.చూ. రొయ్య². వి. మత్స్యవిశేషం.

**రొల్ల** రూ.చూ. రొల్లు.² వి. పదుగు తీసిన తరవాత ధాన్యంలో కలిసి ఉన్న గడ్డి పరకలు.

**రొల్లాలుగా ఉండు** అ.క్రి. వదులుగా ఉండు.

**రొల్లాలుగాఉండు** చూ. రొల్ల.

**రొల్లు¹** అ.క్రి. **1.** ప్రలాపించు ; **2.** పలవరించు.

క. ఒఱలు, ఒఱళు. బాధతో ఏడ్చు.

**రొల్లుడు** రూ.చూ. రోఁజుడు. వి. ప్రలాపం, రొందుడు. ఆం.భా. 1.116.

**రొల్లు²** రూ. రొల్ల. వి. పదుగు తీసిన తరవాత ధాన్యంతో కలిసి ఉన్న గడ్డి పరకలు.

**రొవిది** రూ.చూ. రవిదె. వి. ఆకు, జొన్న, మొక్కజొన్న మొ. పైర్ల ఆకు.

**రొవిదె** రూ.చూ. రవిదె. వి. ఆకు. జొన్న మొక్కజొన్న మొ. పైర్ల ఆకు.

**రొవ్వగోధుమ** రూ.చూ. రవ్వగోధుమ. వి. ఎర్రగోధుమ.

**రొష్టు** రూ. రొస్టు. వి. **1.** నిష్ఠూరం ; **2.** మురికి ; **3.** ఇంటి చాకిరి ; **4.** అవమానం ; **5.** పనికష్టం.

సం. రోషణ-.ముక్కోపి, గిటురాయి, రోష-.కోపం <సం. రోషణ-.

**రొష్టుపెట్టు** స.క్రి. అల్లరి పెట్టు.

**రొసరొసలాడు** రూ.చూ. రుసరుసలాడు. స.క్రి. కోపించు.

**రొస్టు** రూ.చూ. రొష్టు. వి. **1.** నిష్ఠురం ; **2.** మురికి ;

3. ఇంటిచాకిరి ; 4. అవమానం, అప్రతిష్ఠ ; 5. పనికష్టం.

రో[1] రూ.చూ. రా. అవ్య. సంబోధనలో తరచు స్త్రీవాచకాల కనుప్రయుక్తమవుతుంది. రం. రా. యు. 515. ప. 6 పం.

రో[2] రూ.చూ. రోయి[1]. వి. కుదువ, తాకట్టు. పండి. చ. 2.122 ; 2. వేశ్యకిచ్చేశుల్కం. విజ్ఞా. ప్రా. 109 ; 3. ఎరువు ; 4. విక్రయం.

రోచెల్వ వి. వేశ్య, వెలయాలు. రోపట్టు వి. శుల్కం. రోవదఁతి వి. వేశ్య, డబ్బుకువచ్చే స్త్రీ, వెలయాలు. రోయాలు (-ఆలు[2]) వి. వేశ్య, వెలయాలు. రోయిడు (-ఇడు) స.క్రి. తాకట్టు పెట్టు. పండి. చ. 1.2.122ప. రోయింతి (-ఇంతి) వి. వేశ్య, డబ్బుకు వచ్చేస్త్రీ, వెలయాలు. రోయీవి(-ఈవి) వి. ధనదాహం. రోమెలనాగ (-ఎలనాగ) వి. వేశ్య, వెలయాలు, డబ్బుకు వచ్చేస్త్రీ. రోవాటు (-పాటు) వి. వేశ్యాభృతి, లంజకిచ్చే సొమ్ము. వైజ. 4.21. రోవెల వి. వేశ్యకిచ్చేధనం. కు. సం. 8.158. రోవెలఁది రూ.చూ. రోయి వెలఁది. వి. వారాంగన. కువ.చ. 2.110.

రో[3] వి. ఆరుబయలు పడుగుకు ఒకవైపు.

ఇం. *Row*-. వరుస.

<ఇం. Row.

రోక వి. మూల, కోణం.

సం. రోక-. రంధ్రం, కదలిక, ఓడ, కాంతి.

<సం. రోక- (అర్థవిపరి.).

రోకమ్మినజ్జ వి. నజ్జల్లో ఒకభాగం.

రోకలి బండ రూ.చూ. రోఁకటి బండ. వి. 1. శతపది, ఒక పురుగు ; 2. పొన్నులు లేని చిన్న రోకలి.

రోకు[1] వి. 1. వికాసం. మార్క. 1.168 ; 2. తెలివి ; 3. పచ్చదనం ; 4. నవ్వు.

సం. రోక-.కాంతి, ప్రకాశం.

<సం. రోక-.

రోకు[2] రూ.చూ. రూక. వి. 1. ఆసక్తి, మోజు ; 2. వైపు, వలను ; 3. వలపు ; 4. చాకిరి ; 5. తగని ప్రీతి, ఎక్కువ ప్రీతి ; 6. ఒకరికి హెచ్చుస్తమానం కష్టపడి పనిచేయటం.

రోకుటిల్లు (-ఇల్లు) వి. ఒక్కగది ఇల్లు.

రోకొమ్మ వి. కపిల.

రోఖం రూ.చూ. రొక్కము. వి. నగదు.

రోగలిపార వి. పికాసిపార, మన్ను తవ్వటానికి చెట్లునరకటానికి ఉపయోగపడేది.

రోగాల రూ.చూ. రాగోల. వి. పంగలకట్టె, చివర పంగలున్న పొడుగుకట్టె.

రోగాలపుట్ట వి. ఎప్పుడూ వ్యాధితో బాధపడేవాడు, వ్యాధిగ్రస్తుడు.

సం. రోగ-. తెగులు.

<సం. రోగ-+ము+లు+-అ-[11]+పుట్ట.

రోగోలు రూ.చూ. రాగోల. వి. పంగిలకట్టె, చివర పంగలున్న పొడుగు కట్టె.

రోఁకటఁజిగురులుగోయనేర్చు చూ. రోఁకలి.

రోఁకటఁజిగుళ్లకోయు చూ. రోఁకలి.

రోఁకటి పోటు చూ. రోఁకలి.

రోఁకటిబండ చూ. రోఁకలి.

రోఁకటి శాస్త్రము చూ. రోఁకలి.

రోఁకలి రూ. రోఁకలి. వి. జౌ. అనా. 1. ముసలం, దంచే సాధనం. కు.సం. 6.47 ; 2. గానుగలో నువ్వులు మొ· వాటిని నలగచేసే సాధనం. పరమ. 1.89.

తు. ఉరెకల్లు, ఒరెకల్లు, గీటురాయి ; త. ఉరైకల్. కల్వం, గీటురాయి ; మ. ఉరకల్లు, ఉరవుకల్లు, రోకలి. రోకలి ; నా. రోకల్. రోకలి ; సం. గోకిల-.ముసలం.

రోఁకటఁజిగురులుగోయనేర్చు అ.క్రి. అనంతవాళ్ళే సంతపింప చేయగలుగు (నెరజాణ). పండి. చ. 1.2-359. <రోఁకలి+-అ[7]+ చిగురు+-లు+కోయు+-అ[7]+ నేర్చు. రోఁకటఁజిగుళ్లకోయు స.క్రి. అసాధ్యమైన పనికొరకొను. కు. సం. 8.135. <రోఁకలి+-అ[7]+ చిగురు+-లు+కోయు. రోఁకటిపోటు వి. దంపుడు, కొట్నం. హరిశ్చ. 5.89. <రోఁకలి+-ఇ[6]+పోటు. రోఁకటిబండ రూ. రోకలిబండ, లోకలబండ. వి. 1. శతపది, ఒకపురుగు. ఆము. 3.80 ; 2. కోష్టుపుచ్చి. నక్కతోకపొన్న. ఆం. భా. 2.55 ; 3. నున్నటి పొడుగాటి ఆకులు, పొట్టికొమ్మలు. పలకలకాడ ఎరుపుకలిసిన నీలరంగు పూలు ఉండి బీటనేలల్లో ఏటాలేచి గుబురుగా పెరిగే కలుపుమొక్క. (Tricholepis Rad cans); 4. ఉన్ని చెయ్యటానికి బండమీద వేసి దంచే కొయ్య ; 5. పొన్నులు లేని చిన్నరోకలి. <రోఁకలి+-ఇ[6]+బండ. రోఁకటి శాస్త్రము వి. చిన్నబిడ్డలు సన్నగా ఉన్నప్పుడు రోటిలో కూర్చోబెట్టి, ముగ్గురు ముత్తైదువులు పసుపుకుంకుమ పూసిన రోకళ్ళనెత్తి 'పొడుతునా వేతునా' అని బెదరించి రోకళ్ళతో తాకటం. ఇలాచేస్తే ఆబిడ్డతుండులా బలుస్తారని నమ్మకం. <రోఁకలి+-ఇ[6]-+ సం. శాస్త్ర-+-ము. రోఁకలికాల్పు వి. బలరాముడు. రోఁకలి పాట వి. అర్థవిచారంలేక ఊరికేపాడేది. బసవ. 7.45 రోఁకలిపాటు వి. రోకటితో దంపుతూ పాడేపాట, నుల్విపాట. బసవ. 7.107. రోఁకలియెక్కువెట్టు స.క్రి. అసాధ్యమైన పనికి పూనుకొను. నలచ. 4.260. <రోఁకలి+ ఎక్కు+పెట్టు.

రోచు రూ.చూ. రేచుక్క. వి. మూలచుక్క.

రోజన్‌కల్ల వి. రోజన్ అనబడే చెట్టుకంప, ఇది ఆముకాల్పుకు ఉపయోగం.

ఇం. Rosin. కర్పూరతైలంలోని మస్తు.

రోజముచెట్టు వి. ఒకరకంచెట్టు. (Canarium Strictum)

రోజా[1] రూ. చూ. రోదా. వి. బండి నడవటానికి ఆకులతో ఉన్న చక్రం.

రోజా[2] వి. 1. గులాబిపువ్వు ; 2. చెంగావిరంగు.

ఇం. *Rose* గులాబి.

<ఇం. Rose.

రోజాపువ్వు వి. గులాబి.

రోజినా రూ.చూ. రోజీనా. వి. దినసరి.

రోజియాదూది వి. ఏసెలు అంగుళంపొడుగు ఉండి ముతకనూలు

తీసేపత్తి.

హిం. రోజా. వ్రతం, గులాబి.

రోజీనా రూ. రోజినా. వి. దినసరి.

హిం. రోజీనా. దినసరివేతనం ; ఉ. రోజీనహ్ ; పార. రోజనహ్.

<ఉ. రోజీనహ్.

రోజు రూ. రోదు. వి. దినం, అహూరాత్రం, 24గంటలు. పల్నా పు. 42.

హిం. రోజ్. దినం, సమయం ; మరా. రోజ్ ; ఉ. రోజ్. దినం, పగలు ; పార. రోజ్. దినం, పగలు, సూర్యుడు. రోజన్. రోజులు, రోజన. ప్రతిదినం, రోజ్ రోజు. దినదినం ; ప్రాచీనపార. రోచ. ఒకరోజు.

<ఉ. రోజ్.

రోజువారి ప్రత్యే. ప్రతిదినమూ లేదా రోజూఇచ్చే.

ఉ. పార. రోజ్. - వారి. దినసరి.

<ఉ. రోజ్-వారి.

రోజేకమ్మి వి. ఒకవైపున చిన్నపట్టె, మరొకవైపున పెద్దపట్టె మధ్య రెండు కొలుకుల తెల్లపోలు పెట్టి నేసినకమ్మి.

రోఁజు అ.క్రి. నిట్టూర్చు, ఉచ్ఛ్వసించు. భార. శల్య. 2.94 ; 2. అధిక శ్వాసం. రొప్పు, శ్వాసం. ఆం. భా. 1.60.

రోఁజుడు రూ. రొంజుడు, రొట్టుడు, రొందుడు, రొల్లుడు. వి. రొంజుడు, ప్రలాపం. ఆం. భా. 1.116.

రోటం రూ.చూ. రాటనము. వి. నూలు వడికే సాధనం.

రోటరుకట్టె వి. పంటెకు నూలు చుట్టటానికి చేత్తో తిప్పే కామకు ఊనికగా తొడమీద పెట్టుకొనే కట్టె.

రోటిదుక్క చూ. రోలు[1].

రోటిమొద్దు చూ. రోలు[1].

రోటు వి. ఈచ, వంకర, కాలుచేతులు ఊచపోవటం.

రోటువోవు(-పోవు) అ.క్రి. (కాలుచేతులు) ఈచపోవు. గౌ. హరి. ఉ. 1087

రోట్లం రూ.చూ. రాటనము. వి. నూలు వడికేసాధనం.

రోట్లు వి.బ.వ. పెద్దమట్టి బానలు.

రోడ రూ. రూఢ, రోడా, లోడ. వి. కొయ్యతో చేసినతాపి, గరుకుగా ఉన్నచోట్లను చదరం చేయటానికి వాడేతాపి.

హిం.ఉ. రోడా, లోడా. పెద్దరాయి.

రోడచెక్క రూ. రూఢచెక్క, రోడాచెక్క. వి. కొయ్యతో చేసిన తాపి, గరుకుగా ఉన్న చోటును రాయటానికి వాడే తాపి.

రోడా రూ.చూ. రోడ. వి. కొయ్యతో చేసినతాపి, గరుకుగా ఉన్న చోట్లను చదును చేయటానికి వాడే తాపి.

రోడాచెక్క రూ.చూ. రోడచెక్క. వి. కొయ్యతోచేసిన తాపి, గరుకుగా ఉన్నచోట్లను చదును చేయటానికి వాడే తాపి.

రోదు అ.క్రి. తగులు, తాకు. హంస. 5.30.

సం. రుధ్. అవరోధించు.

రోడ్డు వి. కంకరపోసినబాట.

ఇం. *Road*. బాట, దారి.

<ఇం. Road.

రోడ్డుకమ్మి రూ. రోడ్డుకమ్మె, రోద్రకమ్మి, రోద్రుకమ్మి వి. మరమగ్గంలో పన్నె బిగించిన కిందికొయ్య.

రోడ్డుకమ్మె రూ.చూ. రోడ్డుకమ్మి. వి. మరమగ్గంలో పన్నె బిగించిన కింది కొయ్య.

రోడ్డుకర్ర రూ. రోద్రుకర్ర. వి. మరమగ్గంలోపన్నె బిగించిన కిందికొయ్య, నేత నేసేటప్పుడు దీనిమీద నాడె ఆడుతుంది.

రోడ్డుపార వి. పొడుగాటి కామగల ఒకరకంపార, మట్టితవ్వ కానికి గుల్లగా ఉన్న నేలను ఎత్తిపోయటానికి పనికివచ్చే పరికరం.

రోడ్డుబల్ల వి. మరమగ్గంలో పన్నెబిగించిన కిందికొయ్య, నేతనేసే టప్పుడు దీనిమీద నాడె ఆడుతుంది.

రోద్రకమ్మి రూ.చూ. రోడ్డుకమ్మి. వి. మరమగ్గంలో పన్నె బిగించిన కిందికొయ్య.

రోద్రుకమ్మి రూ.చూ. రోడ్డుకమ్మి వి. మరమగ్గంలో పన్నె బిగించిన కిందికొయ్య.

రోద్రుకర్ర రూ.చూ. రోడ్డుకర్ర. వి. మరమగ్గంలో పన్నె బిగించిన కింది కొయ్య.

రోణి రూ.చూ. రోయిని. వి. జ్యేష్ఠమాసంలో వచ్చేకార్తె.

రోద రూ.చూ. రోదా. వి. బండి కుండలో బిగించిన ఆకులను పట్టి ఉండే గుండ్రటి కొయ్యచట్రం.

రోదా రూ. రొదము. రోజా[1], రోధ. వి. బండిచక్రం, రథాంగం.

సం. రథ – కొంకణి. రోదా. బండిచక్రం ; సింహ. రోదా, రోదె. చక్రం.

రోదు రూ.చూ. రోజు. వి. దినం.

రోంత రూ.చూ. రవ్వంత. విశే. కొంచెం.

రోందు వి. 1. గుండ్రం ; 2. చుట్టుతిరగటం.

ఇం. *Round*. గుండ్రని.

<ఇం. Round.

రోఁత చూ. రోయు[1].

రోఁతకాఁడు చూ. రోయు[1].

రోఁతగించు చూ. రోయు[1].

రోఁతగొట్టు చూ. రోయు[1].

రోఁతపడు చూ. రోయు[1].

రోఁతలమారి చూ. రోయు[1].

రోఁతిబూడిద వి. బూడిద, కట్టెనిప్పు మీది నిగురు.

రోన్ని విశే. కాసిన్ని.

<రవ్వ[1]+అన్ని.

రోపు వి. కోపం.

సం. రోప -. ఆరోపించటం, నాటబడ్డది.

రోబంటరి చూ. రోయు. రూ. లోబంటరి. వి. అడవి పంది.

రోబీ రూ.చూ. దూబీ. వి. బచ్చల పండు రంగు.

రోమనేల వి. ఎక్కువగా గడ్డి పట్టే నేల.

సం. రోమన్. వెంట్రుక.

<సం. రోమన్+నేల.

రోయి[1] రూ. రో[2], తో[2]. వి. 1. జూదంలో ఒడ్డే పందెం, ధనం. భార. అరణ్య. 2.221 ; 2. వేశ్యకిచ్చేశుల్కం. పండి. చ. 4.281 పు ; 3. కుదువ, తాకట్టు. విజ్ఞా. వ్యవ. 64 ; 4 చేబదులు. విజ్ఞా. వ్యవ. కాం. 69.

సం. రా, రై. సంపద, రుబ్బు, విలువ.

<సం. రై.

రోయివెలఁది రూ. రోవెలఁది. వి. భోగంది, వేశ్య. పాండు. 3.11.

**రోయి²** చూ. రోయు¹.

**రోయించు** చూ. రోయు².

**రోయిణి** రూ.చూ. రోయిని. వి. జ్యేష్ఠమాసంలో వచ్చేకార్తె.

**రోయిని** రూ. రోణి, రోయిణి, రోవిణి. వి. రోహిణి నక్షత్రం.

సం. ప్రా. అ.మా. రోహిణి. ఒకనక్షత్రం ; త. ఉరోని, ఉరోకణి, ఉరోకణ. రోహిణీనక్షత్రం.

<ప్రా. రోహిణీ.

**రోయు¹** అ.క్రి. 1. అసహ్యపడు, ఏవపడు. భార. ఆది. 2.125 ; 2. వెనుదీయు, సంకోచించు. భార. ఉద్యో. 4.235 ; స.క్రి. 1. విడచు. భార. ఆది. 6.211 ; 2. నిందించు. భార. భీష్మ. 3.156 ; 3. అసహ్యించుకొను. విక్ర. 3.25.

క. రోసు. అసహ్యించుకొను. రోయ ; త. ఒఱు (-ప్పు)-,త్-). అసహ్యించుకొను, ఏవగించుకొను. ఒఱుప్పు. అయిష్టత, అసహ్యం, ఏవగింపు.

రోఁత రూ. రోఁత. వి. 1. ఓకిలింపు, ఏవం, జుగుప్స. భార. ఉద్యో. 2.77 ; 2. రోత కలిగించే పదార్థం, బాలుని మలం మొ. వి. నవనాథ. 188పు. 20 పం ; 3. ఏవగించే మాట, జుగుప్సావహ వాక్యం. సారంగ. 2.271 ; 4. అపవాదం, నింద. ఆం.భా. 1.115 ; విణ. ఏవగించేది, జుగుప్సావహం. అచ్చ. రా.యు. 64. రోఁతకాఁడు వి. ఏవకాడు, రోతగొట్టు. రోఁతగించు అ.క్రి. రోతపడు.< రోఁత+- ఇంచు³. రోఁతగొట్టు వి. ఏవకాడు, రోసుబడి. రోఁతపడు అ.క్రి. అసహ్యపడు, ఎగ్గుపడు. శేషధ. 3.44. రోఁతలమారి వి. 1. ఏవపు పనులు చేసే స్వభావంకల వాడు. 5.113 ; 2. నిందితుడు ; 3. ఏవపు పన్లు చేసే స్వభావం కలది. రోయి³ రూ. రోయి. వి. 1. నింద ; 2. అసహ్యం. <రోయు¹+- ఇ¹⁵. రోసినవాఁడు విణ. సిగ్గుమాలిన వాడు.

**రోయు²** రూ. రోయు2. స.క్రి. 1. వెదుకు. భార. ఆది. 5.220 ; 2. తలచు, భావించు. భార. ఉద్యో. 4.227.

క. ఒరు. ఆలోచించు ; త. ఒర్. పరీక్షించు, తెలుసుకొను, ఎంచుకొను, విను, ఒర్చ్చి. పరిశీలన, జ్ఞానం, అవగాహన ; మ. ఓర్క్క. ఆలోచించు, గుర్తు చేసుకొను ; తొ. ఎరిడె. గుర్తు చేసుకొను.

రోయించు స.క్రి. వెదకించు. మార్క. 3.128. < రోయు²+- ఇంచు³.

**రోరవము** వి. నరకం.

సం. రౌరవ -.ఒకరకం నరకం.

<సం. రౌరవ-.

**రోలరు** రూ. రూల్, రూలు², ర్యూలు, రో్రలు, లోరల్, లోలరు. వి. 1. మగ్గం మీద అచ్చుతాళ్ళు తగిలించిన రోకలి లాంటి గుండ్రని పొడుగు కర్ర ; 2. ఒకరకం దోనె, రోలరు మగ్గంలో నేతగుడ్డ చుట్టే గుండ్రని దూలం ; 3. డాబీలో అడ్డంగా బిగించిన కొయ్యగుండు ; 4. మగ్గం చివర పడుగు నూలు చుట్టే కొయ్యదూలం.

ఇం. *Roller*. గుండ్రంగా తిరిగే భారీ పాత్రం.

<ఇం. Roller.

రోలరుఇరుసు రూ. రో్రలుఇరుసు. వి. పల్లిరుసు తిరగటానికి ఆధారంగా చెపుకట్లకు మధ్యగా బిగించిన ఇనుప కడ్డీ. రోలరుకమ్మి రూ. ఉలరుకమ్మి, లోలరుకమ్మి. వి. 1. మర మగ్గంలో పన్నె బిగించిన కింది కొయ్య ; 2. మరమగ్గంలో చట్రంలో కింది పట్టె. రోలరుకొయ్య వి. రోలరు మగ్గాన్ని మోసే గూటం. రోలరుచెక్క రూ. రో్రలు చెక్క. వి. పల్లిరుసు నిలవటానికి పైపట్టెకు బిగించిన చెక్క. రోలరుచెక్రం రూ. రో్రలుచెక్రం. వి. నేతమోకు బిగించటానికి ఒకరకం చేతి గూటానికి కిందవైపు అమర్చిన ఇనుపచక్రం. రోలరుతాడు రూ. రూలరుతాడు, రో్రలుతాడు, లోలరుతాడు. వి. పల్లిరుసుకు వేసిన అచ్చుతాడు. రోలరుమగ్గం వి. మగ్గం మీద చాపి పడుగులో చివరిభాగం చుట్టటానికి ఎదురుగా రోకలి వంటి కొయ్య అమర్చిన మగ్గం.

**రోలాణి** వి. కళ్ళకుపైన వేసుకునే పాలిష్.

హిం. రోలీ. నుదుట పెట్టుకునేందుకు తయారుచేసిన పసుపు, సున్నపు మిశ్రమం : ఉ. రోల్‌లా. సున్నగా చేయు, పాలిష్‌చేయు, సమతలంగా చేయు. రోలీ. పసుపు, బియ్యం, పటికారం, కలిపి తయారు చేసిన తిలకం.

<ఉ. రోల్‌లా.

**రోలు¹** రూ.చూ. రోలు¹. వి. 1. ఉలూఖలం ; 2. బొండి, తూము, రంధ్రం ; 3. గానుగ రాతిచక్రం తిరిగే నన్నని గుండ్రని కాలవ ; 4. కళ్ళంమధ్యభాగం.

రోటిదుక్క వి. గానిగకట్టె తిరగటానికి ఆధారంగా నాటబడిన లావాటి కొయ్యదుంప. <రోలు¹+-ఇ-⁶+ దుక్క. రోటిమొద్దు వి. చెరువులో పైతూము మూసే మొద్దు. <రోలు¹+-ఇ⁶+ మొద్దు. రోలుగుంట రూ.చూ. రోలుగుంట. వి. దంచు కోవటానికి నేల మట్టానికి ఇంట్లో పాతిపెట్టిన చిన్నగుంట గలరాయి, రాలగుంట, రాలగుంటి. రోలుపాపు రూ.చూ. రోలుబాపు. స.క్రి. కళ్ళం మధ్య భాగంలో మెదిగిన గడ్డితీయు. రోలుబాపు రూ. రోలుపాపు. స.క్రి. కళ్ళం మధ్యభాగంలో మెదిగిన గడ్డిని తీయు. రోలుమ్రాను రూ.చూ. రోలుమ్రాను. వి. ఉతక, తలుపు కుసి తిరగటం కోసం కింద అమర్చిన కొయ్యచిప్ప. రోలు రాయి వి. గానుగకున్నరాతిచక్రం. రోళ్లవెంటనేపొళ్లు వి.ఐ.వ. అవినాభావ సంబంధం.

**రోలు²** రూ. రోలు². వి. 1. విలపించు. కు.సం. 11.132 ; 2. కొట్టు.

**రో్రలు** రూ.చూ. రోలరు. వి. 1. మగ్గంమీద అచ్చుతాళ్ళు తగిలించిన రోకలి లాంటి గుండ్రని పొడుగు కర్ర ; 2. ఒకరకం దోనె, రోలరు మగ్గంలో నేతగుడ్డ చుట్టే గుండ్రని దూలం ; 3. డాబీలో అడ్డంగా బిగించిన కొయ్యగుండు ; 4. మగ్గం చివర పడుగునూలు చుట్టే కొయ్యదూలం.

రో్రలుఇరుసు రూ చూ. రోలరు ఇరుసు. వి. పల్లిరుసు తిరగటానికి ఆధారంగా చెపుకట్లకు మధ్యగా బిగించిన

ఇనపకడ్డీ. రోల్రులుచెక్క రూ.చూ. రోలరుచెక్క. వి. పుల్లిరుసు నిలవటానికి పైపట్టెకు బిగించిన చెక్క. రోల్రులుచెక్రం రూ.చూ. రోలరుచెక్రం. వి. నేతమోతు బిగించటానికి ఒకరకం చేతిగూటానికి కిందివైపు అమర్చిన ఇనప చక్రం. రోల్రులుతాడు రూ.చూ. రోలరుతాడు. వి. పుల్లిరుసుకు వేసిన అచ్చుతాడు.

రోళ్లవెంటనే పాళ్లు చూ. రోలు[1].

రోవి వి. వృక్షవిశేషం. యయా. 2.48.

రోవిణి రూ.చూ. రోయిని. వి. జ్యేష్ఠమాసంలో వచ్చేకార్తె.

రోశందాన్ రూ. రోశెందానె, రోషిందాన, రోసిందానె, రోసెందాన. వి. వెలుతురు కోసం గోడల్లో ఎత్తున పెట్టే చిన్న కిటికీ.

హిం. రోశన్‌దాన్. కిటికీ, వెలుతురు వచ్చే కంత.

<హిం. రోశన్‌దాన్.

రోశందానదర్వాజా చూ. రోశందాన్. వి. పైన గాలికిటికీ ఉన్న ద్వారబంధం.

రోశందానె రూ.చూ. రోశందాన్. వి. వెలుతురు కోసం గోడల్లో ఎత్తున పెట్టే చిన్నకిటికీ.

రోషిందాన రూ.చూ. రోశందాన్. వి. వెలుతురు కోసం గోడల్లో ఎత్తున పెట్టే చిన్న కిటికీ.

రోసగా(డు చూ. రోసము.

రోసము వి. కోపం. భార. ద్రోణ. 1.177.

సం. రోష-. క్రోధం; ప్రా. రోస-.; పా.అ.మా. రోస-.; మా. లోద-;

క. రోస ; త. ఉరోచమ్ ; ఒరయాన్. రోస్.

<ప్రా. రోస-.

రోసగా(డు(-కా(డు) వి. రోషవంతుడు. రోషం కలవాడు. శుక. 3.150. రోసమెత్తు అ.క్రి. కోపం వహించు. శుక. 2.373. <రోసము+ఎత్తు[1]. రోసాలపుట్ట వి. ఒకతిట్టు, రోషాల కునికి పట్టు. శుక. 3.15. రోసించు అ.క్రి. రోషించు, కినియు, రోషపడు. విక్ర. 4.109. <రోసము+-ఇంచు.[3]

రోసమెత్తు చూ. రోసము.

రోసాలపుట్ట చూ. రోసము.

రోసించు చూ. రోసము.

రోసినవా(డు చూ. రోయు[1].

రోసిన్ని విణ. సుంత, కొంచెం.

<రవ్వ[1]+అన్ని.

రోసిందానె రూ.చూ. రోశందాన్. వి. వెలుతురు కోసం గోడల్లో ఎత్తున పెట్టే చిన్న కిటికీ.

రోసెందాన రూ.చూ. రోశందాన్. వి. వెలుతురు కోసం గోడల్లో ఎత్తున పెట్టే చిన్న కిటికీ.

రోసు వి. పలుగాకి, దుష్టుడు. హంస. 5.113.

సం. రోష-. కోపం, రోషిన్. కోపం కలవాడు, కోపంకలది.

<సం. రోషిన్.

రోసుబడి చూ. రోయు. విణ. రోతగొట్టిన, సిగ్గు మాలినట్టి. రోసుబడితనము వి. సిగ్గుమాలిన తనం.

రోహిలా వి. మహమ్మదీయ భూతం. విశ్వే.శ.

ఉ. రూహిలాహి. భూతాలు ; పార. రుహుల్లాహ్. భగవదాత్మ, జీసస్ మొ. వారు, రూహఇలాహి. మహమ్మదీయ భూతాలు.

<ఉ. రూహిలాహి.

రౌజు వి. ఏకేటప్పుడు దూదినుంచి రాలిన తుక్కు.

రౌండార్చి చూ. రౌండు.

రౌండు రూ. రౌను. విణ. గుండ్రని ; వి. 1. వృత్తం ; 2. ప్రయాణం.

ఇం. *Round*. గుండ్రని, వృత్తం.

<ఇం. Round.

రౌండార్చి రూ. రౌనార్చి. వి. గుండ్రంగా ఉండే ఆర్చి. <రౌండు+ఆర్చి. రౌండుజరీ వి. రెండు పోగులు కలిపి పురిపెట్టి నేసే జరీ. రౌండుపూజ వి. పాత్రలకు చుట్టూపెట్టిన అలంకరణలో ఒకరకం. రౌండుబట్టీ రూ. రౌనుబట్టీ. వి. గుండ్రటి పెంకుబట్టీ. రౌండుమెట్టు రూ. రౌనుమెట్టు. వి. గుండ్రంగా ఉండే మెట్టు. రౌండునంతె రూ. రౌండ్వంతె, రౌనుతంతె, రౌన్తంతె. వి. గుండ్రంగా ఉండే మెట్టు. రౌండ్వంతె రూ చూ. రౌండు వంతె. వి. గుండ్రంగా ఉండే మెట్టు.

రౌండ్వంతె చూ. రౌండు.

రౌత రూ.చూ. రావుతు(డు. వి. గుర్రం స్వారీ చేసేవాడు.

రౌతు[1] రూ.చూ. రావుతుడు. వి. అశ్వసాహిణి. భార. కర్ణ. 1.177. ద. హిం.శా. సంపు. 10. శా.నం. 263. క్రీ.శ. 1218.

రౌతు[2] వి. 1. భిన్నఖనిజాల కలయిక వల్ల ప్రకృతిలో సహజంగా ఏర్పడ్డ ఘనపదార్థం, శిల ; 2. భిన్నమృత్తి కలను కలిపి కృత్రిమంగా కాల్చి తయారుచేసిన ఘన పదార్థం, ఇటికరౌతు మొ. వి ; 3. ఉన్ని శుభ్రం చేయ టానికి ఉపయోగించేరాయి ; 4. సరిచేసేటప్పుడు ఉన్ని పడుగులో చివర ఎక్కించిన కర్ర బిగింపుకోసం నేలలో పాతినరాయి ; 5. నర్సేటప్పుడు వాటిలోపల మోపుగా పెట్టుకొనే రాయి.

రౌతుకచ్చు వి. రాళ్ళపైకి కనిపించే సున్నపు పూత వేయనిగోడ. రౌతుకన్ను వి. సారెమొల దించటానికి గుబ్బిరాయి మధ్యలోని రంధ్రం. రౌతుకప్పు వి. వాసాల మీద రాళ్ళు పరిచి సున్నంతో అతికి వేసిన కప్పు. రౌతుకాడి వి. అవరణ చుట్టూ తిప్పిన ముళ్ళ తీగకు ఆధారంగా ఉండే రాతిగుంజ. రౌతుపూరిల్లు వి. రాతిగోడలు, గడ్డి కప్పుగల ఇల్లు. రౌతుబిల్ల వి. గానుగకుండే రాతి చక్రం. రౌతురట్ట వి. రాళ్ళను పేర్కొంటూ వాడే ఊతపదం.

రౌనార్చి చూ. రౌను.

రౌను రూ.చూ. రౌండు. వి. 1. వలయాకారం ; 2. ప్రయాణం ; విణ. గుండ్రని.

రౌనార్చి రూ.చూ. రౌండార్చి. వి. గుండ్రంగా ఉండే ఆర్చి. <రౌను+ఆర్చి. రౌనుకమాను వి. గుండ్రంగా ఉండే ఆర్చి. రౌనుకుండ వి. గుండ్రంగా ఉండే సాదామట్టి పాత్ర. రౌనుకూజా వి. గుండ్రంగా ఉండే కూజా. రౌను

గూడు వి. గుండ్రంగా ఉండే గూడు. రౌనచిటీ వి. గుండ్రంగా ఉండే మెట్టు. రౌనతంతె రూ.చూ. రౌండువంతె. వి. గుండ్రంగా ఉండే మెట్టు. రౌనపీపా వి. గుండ్రంగా ఎత్తుగా చేసిన మట్టిపాత్ర. రౌనపొయ్యి వి. ఒకటే కైవారంగా గుండ్రంగా ఉండే పొయ్యి. రౌనబట్టీ రూ.చూ. రౌండుబట్టీ. వి. గుండ్రంగా ఉండే సున్నపు బట్టీ. రౌనబావి వి. గుండ్రటి చుట్టుగోడ గల బావి. రౌనమెట్టు రూ.చూ. రౌండు మెట్టు. వి. గుండ్రంగా ఉండే మెట్టు. రౌనరాతు వి. గుండ్రంగా ఉండేరాయి. రౌన్తంతె రూ.చూ. రౌండువంతె. వి. గుండ్రంగా ఉండే మెట్టు.

**రౌన్తంతె** చూ. రౌను.

**రౌండ్రం** వి. రుద్రజడచెట్టు, ఒకరకం కంచెమొక్క (Ocimum basilicum).

**రౌలి** వి. పూజారి, ముహూర్త నిర్ణయం చేసేవాడు.

హిం, రౌలి. తెల్లని, రౌలా. ధ్వని.

**రౌలు** రూ.చూ. రగులు. అ.క్రి. (నిప్పు) మండు.

**రౌలుకొను** రూ.చూ. రవుల్కొను. అ.క్రి. రగులు. **రౌలుకొలుపు** రూ.చూ. రౌలుకొల్పు. స.క్రి. మండేటట్లు చేయు, రగిలేటట్లు చేయు. **రౌలుకొల్పు** రూ. రగులుకొలుపు, రగుల్కొలుపు, రవులు కొలుపు, రవుల్కొలుపు, రౌలుకొలుపు. స.క్రి. మండేటట్లు చేయు, రగిలేటట్లు చేయు. చంద్రాంగ. 4.110. **రౌలుకోలు** రూ.చూ. రవులుకోలు. వి. రగులుకొనటం. **రౌలుచు** రూ.చూ. రగుల్చు. స.క్రి. రగులుకొనచేయు.

**ర్యాయ** రూ.చూ. రూపాయ. వి. ఒక రూపాయ.

**ర్యాయి** రూ.చూ. రూపాయ. వి. ఒక రూపాయ.

# ఱ

**ఱ** వి. ఒకానొక వర్ణం. దీన్ని 'శకట రేఫ' లేదా 'బండిర' అని వ్యవహరిస్తారు దంతమూలీయ కంపిత నాదవర్ణం. మూలద్రావిడ దంత మూలీయ ఱకారమే శకటరేఫగా తదనంతరం తెలుగు మొ. ద్రావిడభాషల్లో మారిందని నిరూపించ బడింది. ప్రాచీనాంధ్రంలో ఇది ప్రత్యేక వర్ణంగా ఉన్నప్పటికీ (వేరు-వేఱు, నీరు-నీఱు) నేటి తెలుగులో ఇది సవర్ణమే. తొఱ్ఱి, మఱ్ఱి మొ. ద్విత్వం పొందిన సందర్భాల్లోనే ఈ కంపితోచ్చారణ కన్పిస్తోంది. అన్యత్ర తాడితోచ్చారణమే. కాబట్టి నేటి తెలుగులో రేఫ, శకట రేఫలు సవర్ణాలని ధ్వని శాస్త్రజ్ఞుల నిర్ణయం.

< మూ.ద్రా.*ఱ.

**ఱక్కు** రూ. రక్కు. వి. గీరు, బరుకు. రాజ. వి. 2.116; స.క్రి. గీరు, బరుకు.

**ఱంకాట** చూ. ఱంకు.

**ఱంకాడు** చూ. ఱంకు.

**ఱంకియ** రూ.చూ. ఱంకె. వి. అరుపు, ఎద్దరుపు.

**ఱంకు** రూ. రంకు. వి. 1. జారత్వం. భార. శాంతి. 2.257; 2. దూషణం, పరీవాదం; 3. తంటా.

సం. రంఖ్. చరించు, తిరుగు, రమ్. క్రీడించు, రంజ్. సంతోషపెట్టు; ప్రా. రంఖోలియ. స్వైర విహారం గలవ్యక్తి; అప. రంఖోలిర-.విలాసస్త్రీ;

త. అరంకి. రంకులాడి; కువి. రంకు. జారత్వం.

< సం. రంఖ్.

**ఱంకాట** రూ. రంకాట. వి. 1. జారత్వం చేయటం. విజ్ఞా. వ్యవ. 17; 2. ఒకరకం చీట్లాట. **ఱంకాడు** రూ.చూ. ఱంక్కాడు. అ.క్రి. రంకు చేయు, జారత్వం చేయు. కలకడ శాసనం. క్రీ.శ. 972, బసవ. 6.880 పం. **ఱంకుటాలు**(-ఆలు[2]) రూ.చూ. రంకుటాలు. వి. వ్యభిచారిణి, జారిణి. **ఱంకుతదక** వి. మిక్కిలి జారత్వం ఉన్నస్త్రీ. వేంక. పంచ. 4.507. **ఱంకుతెగులు** రూ. రంకుతెవులు, ఱంకుతెవులు. వి. సుఖరోగం, మేహరోగం. **ఱంకుతెవులు** రూ.చూ. ఱంకుతెగులు. వి. సుఖరోగం, మేహరోగం. **ఱంకుమగఁడు** వి. ఉపపతి, జారుడు. భల్లా. 1. **ఱంకుఁబోతు** (-పోతు) రూ. రంకుఁబోతు. వి. జారిణి, జారుడు. రామలిం. శ. 33. **ఱంకురాట్నము** వి. జారిణి, లంజె. వేణు. శ. 88. **ఱంకులగొండి** చూ. రంకులగొంట్లు. విణ. రంకుతనం స్వభావంగా కలది. పండి. చ. 2.116. **ఱంకులాఁడి** రూ. రంకులాఁడి. వి. జారస్త్రీ, లంజె. వేమ. 1.155 < ఱంకు + -లు + -ఆఁడి. **ఱంకులాఁడి కొడుకు** వి. కులటకు పుట్టిన కొడుకు. **ఱంకువెలఁది** వి. జారిణి. అచ్చ. రా.సుం. 8. **ఱంకువోవు**(-పోవు) అ.క్రి. రంకాడు. **ఱంకెత** రూ. రంకెత. వి. జారిణి, జారత్వం కలది. పండి. చ. 2.116 పు. **ఱంక్కాడు** రూ. రంకాడు. ఱంకాడు. అ.క్రి. వ్యభిచరించు. కొలవి శాసనం. క్రీ శ. 892.922. < ఱంకు + ఆడు.

**ఱంకులరాట్నము** రూ.చూ. రంకులరాట్నము. వి. పిల్లలు ఎక్కితిరిగే వలయాకార యంత్రం.

**ఱంకె** రూ. రంకె, ఱంకియ. వి. 1. ఎద్దు మొ. వి. చేసేధ్వని. భార. విరా. 5.165; 2. ధ్వని. రామాభ్యు. 8.242; 3. కేక, అరపు. రుక్మి. 1.17.

సం. రణ్, రణత్కార-, రంఘ్. పలుకు; ప్రా. రణక్కార-, రణత్కారం; నే.గు. రంకో. పెద్దగంటను

చ. 3.21 : 2. జగడం, పోట్లాట.

హిం. ఉ. లడాఈ. యుద్ధం ;

క. లడాయి. పోరు, జగడం ; త. లటాయ్.

< ఉ. లడాఈ.

**లడారి** చూ. లడాయి. వి. ఒకానొక తిట్టు. చెన్నబసవ. 2.24.

**లడి** రూ.చూ. లడీ. వి 1. నిడుపుగా చుట్టిన సరిగ మొ. వాటిచుట్ట; 2. జరీపోగుల లెక్క. నాలుగు వందల వాట్లకు సరిపడే జరీ; 3. పెట్టెలో ఉంచే నూలుకట్ట.

**లడిగ** రూ.చూ. లడీ. వి. నిడుపుగా చుట్టిన నూలుచుట్ట.

**లడిగె** రూ.చూ. లడీ. వి. నిడుపుగా చుట్టిన నూలు మొ. వాటిచుట్ట.

**లడితి** రూ.చూ. లడితీ. వి. జాగు, ఆలస్యం.

**లడితీ** రూ. లడితి. వి. ఆలస్యం, జాగు.

హిం. లడైతా. ప్రియం, దృష్టం.

**లడీ** రూ. లట్టి², లట్టీ², లడి, లడిగ, లడిగె, లడె, లడ్డీ, లద్దు. వి. 1. పెట్టెలో ఉండే నూలుకట్ట. ఏనంబరునూలో అన్ని లడీలు ఒక్కొక్క పెట్టెలో ఉంటాయి ; 2. జరీపోగుల లెక్క, నాలుగువందల వాట్లకు సరిపడే జరీ ; 3. గుత్తి, చేరు

హిం. లడ్, లఢీ. వరుస, ముత్యాలు మొ. వాటిసరం, గొలుసు, తాడుపిరి ; ఉ. లడీ. పూలు. పూసలు మొ. వాటి సరం :

క. లడి. తీగ ; త. లడి. 440 గజాల పట్టుదారం ఉండ.

< హిం. లడీ

**లడీకమ్మి** వి. ఒకలడీనూలు పెట్టినేసిన కమ్మి.

**లడె** రూ.చూ. లడీ. వి. 1. పెట్టెలు ఉండే నూలుకట్ట ; 2 జరీపోగులలెక్క, నాలుగు వందల వాట్లకు సరిపడే జరీ.

**లడ్డిగ** రూ.చూ. లడ్డిగము. వి. నెయ్యి మొ. వాటిని పోసుకొనే సన్నని మూతిఉన్న పాత్ర. చంద్రాంగ. 2.41.

**లడ్డిగము** రూ. లడ్డిగ. వి. నెయ్యి మొ. వాటిని పోసుకొనే సన్నటి మూతిఉన్న పాత్ర. ఆము. 2.97.

సం. లట్టు-. కపెర, కపాలం, భిక్షాపాత్ర.

< సం. లట్ట-.

**లడ్డీ** రూ.చూ. లడీ. వి. 1. పెట్టెలోఉండే నూలుకట్ట, ఏ నంబరు నూలో అన్నిలడీలు ఒక్కొక్క పెట్టెలో ఉంటాయి ; 2. జరీపోగులలెక్క, నాలుగువందలవాట్లకు సరిపడె జరీ.

**లడ్డుగిన్నె** వి. పుచ్చ, నీరింకిన వాగుల్లో సాగుచేసి పండించే తీగపైరు. గుజ్జు ఎర్రగాఉండే పెద్దకాయలుకాసే తీగ (Citrullus Vulgaris).

**లడ్డువము** రూ.చూ. లడ్వము. వి. ఒకరకం పిండివంట. చక్కెరపాకం, సెనగపిండి మొ. వాటితో చేసే భక్ష్య విశేషం. శృం. నై. 6.124.

**లడ్వము** రూ. లడ్డువము. వి. లడ్డు, భక్ష్యవిశేషం. రం. రా. బాల. 13ప. 5పం.

సం. లడ్డుక-, లడ్డు-. లడ్డు : ప్రా. లడ్డుఅ-, లడ్డుగ-. మోదకం ; అ.మా. లడ్డుగ- ; అప. లడ్డుయ ; బెం. లడ్డూ ; ఒ. లాడూ ; హిం. లడ్డూ, లాడూ.

క. లడ్డిగె, లడ్డు, లడ్డుగె. భక్ష్యవిశేషం ; తు. లడ్డిగె ; త. ఇలట్టు, ఇలట్టుకమ్, ఇలట్టువమ్ ; మ. లడ్డు ; కుఇ. లెటు ; ఒరయాన్. లడ్డు.

< ప్రా. లడ్డుఅ.

**లంటుఁడు** వి. గుండులా ఉండేవాడు.

**లంటారొ** వి. తిరగలి, రాగరాయి.

**లండ** రూ.చూ. లండు. వి. 1. మొండితనం ; 2 వ్యర్థుడు.

**లండి** రూ.చూ. లండు. వి. ఒకవిధమైన తిట్టు, ధూర్తుడు. సాంబ. మాన. 9.

**లండికొమ్ము** వి. లండాకొమ్ము, సన్నటి అందమైన కొమ్ము.

**లండీ** రూ.చూ. లండు. వి. ఒకవిధమైన తిట్టు, ధూర్తుడు.

**లండు** రూ. లండ, లండి, లండీ. వి. 1. ఒకవిధమైన తిట్టు, ధూర్తుడు. ప్రభు. 9.186 ; 2 మొండివాడు. ద్వి. సా. చ. 1.31.

హిం. ఉ. లండ్, లౌండా. శిశ్నం ; మరా. లండ-. పురుషలింగం ; పార. లండ్. బాలుడు, యువకుడు, కొడుకు ;

క. లండ. దుర్మార్గుడు ; త. లంటి. దుష్ప్రవర్తన కల స్త్రీ, హరం చేసే స్త్రీ, లంటు. కాఠిన్యం.

< ఉ. లండ్.

**లండుపోతు** రూ.చూ. లండుఁబోతు. వి. కుత్సితుడు.

**లండుఁబోతు** రూ. లండుపోతు. వి. కుత్సితుడు. గౌ. హరి. ఉ. 639 పం.

**లత** వి. చెక్కడప్పని.

సం. లతా. తీగ.

< సం. లతా (అర్థవిపరి.).

**లతకూన** మి. వి. 1. లేతతీగలాంటి ఆడది. రామాభ్యు. 1.129 ; 2. లేతతీగ. ఇందు. 1.156. **లతబోర్డరు** వి. తీగ మాదిరి డిజైనునేసిన అంచు. ఇం. *Border*. అంచు.

**లతాంగి** వి. లతలూ పువ్వులూ డిజైన్లలో నేసిన వస్త్రం.

సం. లతాంగీ. స్త్రీ.

< సం. లతాంగీ. (అర్థవిపరి.).

**లతాడు** వి. వర్షంవల్ల కలిగే బురద.

హిం. లతాడ్‌నా. కాళ్ళతో తొక్కటం, లాత్. పద ఘట్టన ;

క. లతాడు. కలత ; త. లత్తాటు. క్షోభ, కలత.

**లతారిచ్చు** చూ. లతాడు. స.క్రి. అంటుకొనేటట్లు చేయు.

**లత్త** వి. 1. ఆపద ; 2. దెబ్బ.

హిం. లత్, లాత్. పదాఘాతం.

క. లత్తె. దెబ్బ ; త. లత్తా ;

< హిం. లత్.

**లత్తగొట్టు** (-కొట్టు¹) స.క్రి. పాపం తగిలి నశించు.

**లత్తిక** వి. బలుపూ చప్పుడుగల ఒకజాతి గచ్చకాయ.

**లత్తికరోగం** వి. కంఠంలో గింజలు మసిగామారి ముద్దకట్టుకు పోయే జొన్నతెగులు.

**లత్తిచేఁప** వి. మత్స్యవిశేషం (Drepanus Panctatus).

**లత్తు** వి. చెడ్డది. పద్మ. యు. 45.

హిం. ఉ. లత్. దుర్వ్యసనం, దురభ్యాసం

< ఉ. లత్.

**లత్తుకోరు** వి. కొంటెబాలుడు.

**లత్తుక** వి. లాక్షారసం. కు. సం. 4.155.

సం. అలక్తక-. లాక్షాద్రవ్యం, లక్క; ప్రా. అలత్త-, అలత్తయ, అలత్తయ-; పా. అలత్తక-;

క. అలతిగె, అలతికె, అలతె; త. అరత్తమ్. ఎర్రలక్క, అలత్తకమ్ స్త్రీలువాడే లత్తుక.

< సం. అలక్తక-

**లత్తుకబొత్తుకలు** వి. బ. వ. ధాన్యవిశేషం. హంస. 4.128.

**లదిపట్టు** వి. చెక్కలోని పుచ్చి చచ్చే భాగం.

**లద్ది** రూ. లద్దె². వి. గుర్రం మొ. వాటి మలం.

క. లద్ది. గుర్రం, ఏనుగు మొ. వాటిమలం; త. ఇలత్తి, లత్తి; బ్రా. లద్. పశువులపేడ.

**లద్దిపిప్పి** వి. ఒకరకం చీడపురుగు. **లద్దిపురుగు** రూ. లద్దె పురుగు. వి. చివికిన కర్రల్లో ఉండే తెల్లని క్రిమి. **లద్దిబిల్ల** వి. చేదంతె, పొలాన్ని చిన్నచిన్న ముక్కలుగా చేసు కోవటానికి ఉపయోగించే పరికరం. **లద్దిమన్ను** వి. గుర్రం లేక గాడిద పెంటను కలిపి తొక్కిన మన్ను. **లద్దిసుడి** రూ. లద్దెసుడి. వి. మెడసుడి, ముడ్డికి బెత్తెడు దిగువన ఉండే సుడి, లక్ష్మిసుడి.

**లద్దియ** రూ.చూ. లద్దె¹ వి. నేసేవాడు. బట్ట చివర్న విడిచే అంచు కచ్చ.

**లద్దు** రూ.చూ. లడీ. వి. గానుగ దూలానికి చింతకాయను తగిలించే తీగ.

**లద్దె¹** రూ. లద్దియ. వి. నేసేవాడు బట్ట చివర విడిచే కచ్చ.

**లద్దె²** రూ.చూ. లద్ది. వి. గాడిదలు, గుర్రాలు మొ. వాటి పెంట.

**లద్దెగొరుగు** వి. నిమ్మతెగులు, నేలకానుకొని ఉన్న కొమ్మమీద కుక్కగొడుగుల్లాంటివిపుట్టే తెగులు. **లద్దెగొడుగు వేయు** అ.క్రి. నేలకానుకొని ఉన్న నిమ్మకొమ్మల మీద కుక్కగొడుగుల్లాగా పుట్టు. **లద్దెతెవులు** వి. నువ్వు తెగులు, లద్దెపురుగు పడి కాయ ఉండగట్టుకు పోయే తెగులు. **లద్దెపారు** వి. చెక్కలోని పుచ్చిన చచ్చు భాగం. **లద్దెపురుగు** రూ.చూ. లద్దిపురుగు. వి. కంది, జొన్న వేరుసెనగ మొ. వాటి వేళ్ళు కొరికే నల్లటి గొంగళి పురుగు. **లద్దెసుడి** రూ.చూ, లద్దిసుడి. వి. మెడసుడి, ముడ్డికి బెత్తెడు దిగువున ఉండే సుడి, లక్ష్మిసుడి.

**లంద** రూ. లందా. వి 1. పొట్టవాడు, తుందిలుడు, ఎక్కువ లావుగా ఉన్నమనిషి; 2. పెద్దసైజు గోళీకాయ.

హిం. లంబా. పొడవైన.

**లందా** రూ.చూ. లంద. వి. తోళ్ళు నానబెట్టటానికి మాదిగలు వాడే పెద్ద మట్టి పాత్ర.

**లపక** వి. ధనం.

హిం. లపక్. జ్వాల, ప్రకాశం.

< హిం. లపక్.

**లపటాయించు** రూ. లప్టాయించు. స.క్రి. దోచుకొను, కొల్లగొట్టు.

హిం. లప్‌టానా. గిరగిరతిప్పు, పట్టుకొను, బంధించు.

< హిం. లప్‌టా(నా) + -ఇంచు³.

**లపుక్కున** రూ లప్పున. అవ్య. ద్రు. చప్పున.

**లపేట** రూ.చూ లపేటా. వి. 1. చుంగు విడిచి కట్టిన నెత్తిరుమాలు; 2. నూలును చిలపలుగా చుట్టేకొయ్య పనిముట్టు.

**లపేటా** రూ. లపేట వి. 1. చుంగు విడిచి కట్టిన నెత్తి రుమాలు. శుక. 2.427; 2. నూలును చిలపలుగా చుట్టే కొయ్యపనిముట్టు.

హిం. లపేట్. చుట్టటం, బలం, పరిధి; మరా. లపేటా, లపేటు. చుట్టు, ఆచ్ఛాదించు, వేష్టనం, ఆవరణం.

< మరా. లపేటా.

**లప్టాయించు** రూ.చూ. లపటాయించు. స.క్రి. దోచుకొను, కొల్లగొట్టు.

**లప్ప** రూ. లప్పము, లబ్బ. లాప, లొప్ప. వి. 1. పాత్ర విశేషం క్రీడా. 167; 2. రాశి, సుద్ద. ఘటికా. 2.145; 3. తాళం, కప్ప, బీగం; 4. నిక్షేపం; 5. పొడిగా ఉండే మట్టి బెత్తిక; 6. పంచలు దించటానికి వీలుగా అడ్డవాసాలు వేయటానికి అనువుగా ఇంటిగోడల్లో ముందుకు పొడుచుకొని వచ్చేటట్లుగా బిగించిన రాయి; 7. సీల; 8. మేకు; 9. గానుగచక్రం బెనగకుండా బిగించే కొయ్య ముక్క; 10. పత్తిచెట్టుకర్ర; విణ. లావైన.

సం. లేప్య-. లేపనం, పూత; ప్రా. లిప్ప-, లెప్ప-. గోడ; పా. లేప్. పూత; హిం. లేప్. పూయటం; మరా. లేప్.;

క. లెప్ప. లేపనం; త. లప్పమ్. అతకటానికి పెట్టే సిమెంటు.

< ప్రా. లెప్ప-.

**లప్పమోటి** వి. చూరుకు ఆధారంగా గోడలో నాటిన కర్ర. **లప్పలుగట్టు (-కట్టు)** అ.క్రి. రాసులగు. తాళ్ల. సం. 13.144. **లప్పెఁడు** వి. ఎక్కువ. < లప్ప + -ఎఁడు.

**లప్పము** రూ.చూ. లప్ప. వి. 1. రాశి. పోగు. చమ. 2.36; 2. మానిపెట్టె మొ. వాటి సందుగొందుల్ని మెత్తే ఒకదినుసు సున్నం ముద్ద, ముక్కు, సిమెంటు.

**లప్పున** రూ.చూ. లపుక్కున. అవ్య. ద్రు. చిటికెలో, వెంటనే, చప్పున.

**లప్పెఁడు** చూ. లప్ప.

**లఫంగు** వి. అప్రయోజకుడు.

హిం ఉ. లఫంగా. దుశ్చరిత్రుడు, గూండా; పార. లఫంగ.

< ఉ. లఫంగా.

**లబలబ** క్రి. విణ. చేతిలో నోటిమీద కొట్టుకొనేటప్పుడయ్యే ధ్వనికి అనుకరణం.

క. లబా, లబో, లబలబ. ఏడవటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. నోటిమీద చేత్తో కొట్టుకొనేటప్పుడు.

అయ్యే ధ్వని అనుకరణం ; త. లపో-, లపోవ్-, ఎనల్. నోటిమీద చేత్తో కొట్టుకునేటప్పుడు అయ్యే ధ్వని అనుకరణం.

లబలబలాడు అ.క్రి. ఏడ్చిమొత్తుకొను. <లబలబ+-లు+ఆడు.

**లబోదిబో** అవ్య. ఏడుస్తూ మొత్తుకోవటం. ధ్వన్యను.

**లబోదిబోయను** అ.క్రి. విచారించు, దుఃఖించు.

**లబ్బ** మా.చూ. లప్ప. వి. ఎక్కువదనం, పెంపు.

**లబ్బర్లు** వి.బ.వ. పాత్రలు చాలానల్లగ కాలటానికి ఆములో వేసే రబ్బరు ముక్కలు.

ఇం. *Rubber*. రబ్బరు.

<ఇం. Rubber + లు.

**లబ్బర్చేతులు** రూ.చూ. రబ్బరుచేతులు. వి. చేతులకు తొడుక్కునే రబ్బరు తొడుగులు.

**లబ్బి** రూ. లబ్బె. వి. మొదట అరబ్బులుగా ఉండి హిందూ స్త్రీలను వివాహమాడి భారతీయులుగా మారిన మహమ్మదీయ జాతి, మహమ్మదీయుల్లో ఒకతెగవారు.

ఉ. లబ్బా, లబ్బి. మొదట అరబ్బులుగా ఉండి ప్రస్తుతం తమిళ భాష మాట్లాడుతూ మహమ్మదీయ రూపును పోగొట్టుకొని, మావిళ్ళలని పిలవబడే ఒకజాతి ; త. లప్పై. మహమ్మదీయుడు.

<ఉ. లబ్బి.

**లబ్బీసు** వి. పునాదులు దిట్టపరచటం, గ్లాబులు పోతపొయ్యటం, రోడ్లు వేయటం మొ. పనులకు పనికి వచ్చే రాతిముక్కలు.

ఇం. *Rubbish*. పనికిరాని, చెత్త.

<ఇం. Rubbish.

**లబ్బు** వి. తక్కువ.

**లబ్బె** రూ.చూ. లబ్బి. వి. మొదట అరబ్బులుగా ఉండి హిందూ స్త్రీలను వివాహమాడి భారతీయులుగా మారిన మహమ్మదీయ జాతి.

**లభాయిలు** వి.బ.వ. చేతగాని ఏడుపులు.

హిం. లంబాఈ. పొడుగు.

**లమ** వి. ఒకానొక తీగ.

హిం. లమ్. పొడవైన.

**లమిడి** రూ. లమ్డి, లంబిడి,[2] లంబ్డి. వి. లొత్తు.

మరా. లంబడీ. వ్యభిచారిణి.

<మరా. లంబడీ.

**లమ్డి** రూ.చూ. లమిడి. వి. లొత్తు.

**లంప** రూ. లొంప, లొంపి[2], లొంపు. వి. 1. ఒకపెద్ద లోగిలిలో (ఆవరణ) ఉండే కొన్ని ఇళ్ళు ; 2. దగ్గర సంబంధం. ఉన్న కుటుంబాలు, లొంపె ; 3. ఒకే కులం వాళ్ళుండే గ్రామభాగం.

**లంపట** రూ.చూ. లంపటము. వి. 1. శ్రమం, ఆపద. గౌ. హరి. ఉ. 966పం ; 2. తగులాటం ; 3. బాధ. ప్రయాన.

లంపటపడు రూ. లంపటపడు. అ.క్రి. శ్రమపడు, బాధపడు, హైరానపడు. పరమ. 1.68. లంపటపడు(-వడు) రూ.చూ. లంపటపడు. అ.క్రి. శ్రమపడు.

**లంపటము** రూ. లంపట. వి. 1. అలసట, శ్రమ. భాగ. 8.230 ; 2. ఆపద ; 3. కలియబడటం, కొట్టుకోవటం ; 4. దొంగగొడ్డు పరిగెత్తిపోకుండా మోకాళ్ళకు కొట్టుకునేటట్లు మెడకు వేలాడగట్టిన రెండుకొయ్యలపలక.

క. అల, అలుపు. అలపు. లంపరు, లంబఱు. ఆశకల, కోరికగల, లంపటె. అలసట ; త. అల (-ప్పు-,-స్ట్-). బాధపడు, దుఃఖపడు, కష్టపడు, అలమ్. కష్టం, దుఃఖం, ఆపద, అలంతలి. దుఃఖం, కష్టం, కంగారు, అలంబై. కష్టం, శ్రమ, అలతి - కులతి. అక్రమం, గాబరా ; మ. అలంపు. శ్రమ, కష్టం ; కో. అల్వల్. కష్టం, శ్రమ, బాధ.

**లంపటుఁడు** చూ. లంపటము. వి. మిక్కిలి ఆశగలవాడు. భారశాంతి. 2.37.

**లంపటా** వి. దాసీపుత్రుడు.

సం. లంఫతా. దుమకటం, దాటటం.

<సం. లంఫతా.

లంపటావాఁడు వి. దాసీపుత్రుడు.

**లంపు** వి. 1. దొంగమేత. భాగ. 10 పూ. 499 ; 2. మేత. శ్రీరం.మా. 2.251.

ప్రా. లంపిక్క-. దొంగ ;

త. లంపు. కష్టం, స్థిరంగాలేకుండు.

<ప్రా. లంపిక్క-.

లంపులమారి వి. దొంగమేతమేసే స్వభావం కలది, ఒకతిట్టు. హంస. 5.66.

**లంబడంచుధోతి** చూ. లంబడి.

**లంబడి** రూ.చూ. లంబాడీ. వి. 1. ఒకనొక ఆటవికజాతి సుగాలి ; 2. చీపురుకట్టగా పనికివచ్చే ఒకరకం గడ్డి.

లంబడంచుధోతి వి. లంబాడీవాళ్ళు కట్టుకొనే ఒకరకం పంచె. < లంబడి + అంచు[3] + ధోతి. లంబడిచీర వి. లంబాడి జాతివాళ్ళు కట్టుకొనే బట్ట. లంబడిమనుము వి. ఒకసారి వివాహమై అత్త వారింటికి వెళ్ళి ఎంతకాలానికైనా అమ్మగారింటికి తిరిగిరాకపోయే సంబంధం. లంబడివాళ్ళ దుప్పటి వి. చెరుగులో ఒకవైపు ఎర్రరంగు పెట్టి రెండోవైపు మామూలుగా నేసిన దుప్పటి.

**లంబతాడు** రూ. లంబుతాడు. వి. లుంగతాడు, తలేటిమోకును వెనుక కాడికి కలిపికట్టేతాడు.

సం. లంబ-. వేలాడేది, పొడవైనది, పెద్దది.

<సం. లంబ- + త్రాడు.

**లంబాడి** రూ.చూ. లంబాడీ. వి. సుగాలీ, ఒకానొక ఆటవిక జాతి.

**లంబాడికుండ** వి. మొకం భాగంలో అచ్చుకొట్టిన మట్టిపాత్ర. లంబాడిజొన్న వి. నల్లబొంకుతో ఉన్నరకం జొన్న. లంబాడితెగులు వి. వరి, జొన్న, పసుపు, పొగాకు మొ. వాటికివచ్చే తెగులు.

**లంబాడీ** రూ. లంబడి, లంబాడి. వి. 1. ఒకానొక ఆటవికజాతి, పింజారి. నె.శా. గ్రామ 4, క్రీ.శ. 1746 ; 2. నారదారం వడికే వాళ్ళలో ఒకతెగ.

క. లమాణి, లంబాడీ, లంబాణి. సంచారజాతి ;

త. లంబాడి. సంచారజాతి, తిరిగేవాడు, పశువుల్లో ఒకజాతి ; మ. లమ్మాగళ్ :

హిం. ఉ. లంబాడీ. ఒకతెగ.

లంబాడీఅరివేని వి. లంబాడీలు పెళ్ళిళ్ళకు వాడే అరివేణి పాత్రలు. లంబాడీకుండంచు వి. కుండలను బిళ్ళపాటుగా పెట్టే అంచు. లంబాడిచిప్ప వి. దాతు మొ. పూజలు పెట్టి చేసిన చిప్ప. లంబాడీతండా వి. చనుప, బిడారు.

లంబి రూ. లంబిడి[1], లంబీ. లెంబి. వి. కుటుంబం.

సం. లంబ -. పెద్దది, గొప్పది, విశాలమైనది, పొడవైనది.

<సం. లంబ–.

లంబిడి[1] రూ.చూ. లంబి. వి. కుటుంబం

లంబిడి[2] రూ.చూ. లమిడి. వి. స్వైరిణి.

లంబీ రూ.చూ. లంబి. వి. కుటుంబం.

లంబు వి. 1. గొప్పతనం. శశా. 3.48 ; 2. స్థౌల్యం. ద్వి. సార. చ. 1 2పు. 26పం ; 3. దూలం చివర అర్ధగోళంగా చెక్కిన భాగం.

<ప్రా. లంబ-.

లంబుతాడు రూ.చూ. లంబతాడు. వి. కాడిని పోలుగర్రకు కలిపే కట్టెతాడు.

లంబెన వి. హారభేదం. ఆం. భా. 2.148.

ప్రా. లంబూస-. కందుకాకృతిగల ఒక ఆభరణ విశేషం ;

క. లంబళ్ - పొడుగాటిదండ.

<ప్రా. లంబూస-.

లంబ్డి రూ.చూ. లమిడి. వి. స్వైరిణి.

లయ వి. మోసం.

సం. లయ-. కూడి ఉండటం, నక్కటం, సంగీతంలోని కాల విశేషం, విశ్రాంతితీసుకొనే చోటు.

<సం. లయ – (అర్థవిపరి.).

లయకాఁడు వి. మోసకాడు. తాళ్ల. సం. 17.355. లయకారి వి. మోసకాడు. వైజ. 4.92. లయలు రూ. లయ్యలు, లయ్యాలు. వి.బ.వ. నయగారాలు, వగలు. టక్కులు, అభినయాలు. లయలువేయు అ.క్రి. బులావులు వేయు.

లయనుదారి వి. బాట.

ఇం. *Line*. పంక్తి, వరస.

<ఇం. Line + దారి.

లయ్య చూ. లయ. వి. వేశ్య.

సం. లంజా. వేశ్య.

లయ్యలు రూ.చూ. లయలు. వి.బ.వ. నయగారాలు, టక్కులు. వగలు అభినయాలు.

లయ్యాలు రూ.చూ. లయలు, వి.బ.వ. నయగారాలు, అభినయాలు, టక్కులు.

లరయిడి వి. మగగురి.

లలాటశూన్యముచూపు అ.క్రి. ఏమరుపాటుకి చెందకపోవు. తాళ్ల సం. 7.36.

సం. లలాటశూన్య-. నుదుట (ఏబొట్టూలేకుండా) శూన్యం.

<సం. లలాటశూన్య -+-ము+ చూపు.

లలి వి. 1. క్రమం. బార. నభా. 1. 260 ; 2. ఉత్సాహం, నిర్వ. రా. 6.75 ; 3. వికాసం. రం. రా. యు. 285పు. 6పం ; 4. వాక్యాలంకారం. హర. 3.68 ; 5. ప్రేమ, అనురాగం. భీమ. 5.108 ; 6. ఆకాంక్షా భేదం. పి. శకు. 112 ; 7. విలాసం. సీలా. 1.52.

సం. లల-. కోరేది, కోరిక కలది, ఆటలాడేది.

<సం. లల-.

లలితరంగు వి. ఒకరకం ఆకుపచ్చరంగు.

సం. లలిత -. మృదువైన.

<సం. లలిత - + రంగు. (మిశ్రన.).

లలితరంగుచీర వి. లేతచిలక పచ్చరంగు చీర.

లవకారం రూ.చూ. రవకారము. వి. 1. పల్చనిగచ్చుపూత ; 2. రాళ్ళసందుల్లో నీళ్ళుచల్లి సున్నంరుద్దటం.

లవంగపూవు చీర వి. ఒకరకం రంగు చీర.

సం. లవంగ – సుగంధద్రవ్య విశేషం.

<సం. లవంగ-+పూవు+చీర. (మిశ్రన ).

లవంగం మొగ్గ వి. అంచులో నేసే ఒకరకం డిజైను.

సం. లవంగ –.సుగంధద్రవ్య విశేషం.

<సం. లవంగ-+-ము+మొగ్గ.

లవట్లాడు అ.క్రి. పట్టుకాని వేలాడు.

లవణి వి. 1. పాశం, తాడు. వరాహ. 11.105 ; 2. బిగువు. మను. 1.59 ; 3. రామాఫలం.

లవండరు రూ. లవండ్రి, లెవెండర్, లెవెండరు. వి. 1. ఒకరకం లేత నీలంరంగు ; 2. పన్నీరు రంగు ; 3. లేత వంకాయరంగు ; 4. దేవకాంచన పుష్పంరంగు.

ఇం. *Lavender*. సువాసన నిచ్చే తులసి లాంటి మొక్క.

<ఇం. Lavender.

లవండ్రి రూ.చూ. లవండరు. వి. 1. ఒకరకం లేతనీలం రంగు ; 2. పన్నీరు రంగు ; 3. లేతవంకాయరంగు ; 4. దేవకాంచన పుష్పం రంగు.

లవనసు రూ. లౌనసు. వి. జీవనార్థం ఇచ్చే సొమ్ము.

ఇం. *Allowanec*. జీవన భృతి.

<ఇం. Allowance

లవబ్రాహ్మణులు వి.బ.వ. కపూరియ బ్రాహ్మణులు.

సం. లవ-. కోత, కోయటం.

లవలవ వి. 1. కదలటంలో అయ్యేధ్వనికి అనుకరణం. క్రీడా. 1.217 ; 2. భేదిల్లినది, బద్ధలైనది. ధ్వన్యను. గౌ.హరి. పూ. 2067.

లవలవలాడు అ.క్రి. పెనగులాడు, పొకులాడు. <లవలవ+-లు+ఆడు.

లవసంతానం వి. సన్నగా మెత్తగా ఉండే ఒకరకం పట్టు.

సం. లవ –.కొంచెం.

లవాకారం రూ.చూ. రవకారము. వి. 1. పల్చని గచ్చు పూత ; 2. రాళ్ళ సందుల్లో నీళ్ళు చల్లి సున్నం రుద్దటం.

లవాజమా రూ. లవాజుమా, లవాజ్జుమా. వి. వ్యవహారం,

ఉత్తర ప్రత్యుత్తరాలు.

హిం. లవాజిమా. అవసరాలు, కావలసిన వస్తువులు, ఉపకరణాలు; ఉ. లవాజిమా. వ్యవహారాలు, ఎస్టాబ్లిష్‌మెంటు.

<ఉ. లవాజిమా.

**లవాజమా** రూ.చూ. లవాజమూ. వి. గ్రామసేవకుల జీతాల కోసం తీసుకొనబడే కొద్దిపన్ను.

**లవాజ్జమా** రూ.చూ. లవాజమా. వి. వ్యవహారం, ఉత్తర ప్రత్యుత్తరాలు.

**లవిటి¹** రూ.చూ. లవిటీ. వి. 1. పక్షిపుచ్ఛం. ఆం.భా. 2.99; 2. గుర్రంతోక. ఆం.భా. 2.197.

**లవిటి²** విణ. బధిరుడు, చెవిటివాడు. ఆం.భా. 2.120.

**లవిటీ** రూ. లవిటి¹, లవుటి. వి. 1. పక్షిపుచ్ఛం. ప్రబంధ. 7.88; 2. గుర్రంతోక.

హిం. లౌట్. తిరిగిరావటం.

**లవింత (-ఇంత)** చూ. లావు. విణ. ఎక్కువ.

**లవుజు** రూ.చూ. నౌజు. వి. బెల్లం పాకం పట్టి అందులో కొబ్బరి కోరు వేసి అచ్చులుగా చేసే తిను బండారం.

**లవుటి** రూ.చూ. లవిటీ. వి. లావు, పక్షితోక.

**లవుడి** రూ.చూ. లౌడి. వి. ఆయుధవిశేషం. జైమిని భా. 6.173.

**లవుణి** రూ.చూ. లౌణి. వి. ఆయుధవిశేషం. ద్వి.భాగ. 4.71.

**లవ్** వి. ప్రేమ.

ఇం. *Love.* ప్రేమ.

<ఇం. Love.

**లవ్వాడు** స.క్రి. ప్రేమించు. అ.క్రి. పాటుపడు, శ్రమపడు.

ఇం. *Love* ప్రేమ.

<ఇం. Love + ఆడు.

**లశికరి** రూ.చూ. లసికిరి. వి. సైన్యం.

**లష్కర్** రూ.చూ. లసికిరి. వి. సేన. రంగా. చ. 2.124.

**లష్కరీ** వి. యోధుడు.

ఉ. లష్కరీ. సైనికుడు, సిపాయి.

<ఉ. లష్కరీ.

**లష్కరు** రూ.చూ. లసికిరి. వి. సైన్యం.

**లసిక** వి. 1. దొంగ; 2. ఉమ్మి; 3. మెదడు.

**లసికిరి** రూ. లశికరి, లష్కర్, లష్కరు, లస్కరు, లుష్కరు. వి. సైన్యం. రాజవా. 5.31. ఈ ప్రయోగాన్ని బట్టి లను ప ధాతువును కల్పించటం సరికాదు.

హిం. మరా. లశ్కర్. సేన; ఉ. లష్కర్. సేన, గుంపు; పార. లష్కర్, లష్కరు, లస్కరు; త. లష్కర్.

<ఉ. లష్కర్.

**లసుక్కు** వి. పుసుక్కు. ధ్వన్యను.

**లసుగు** రూ.చూ. లొసుగు. వి. 1. నష్టం; 2. చేటు.

**లస్కరు** రూ.చూ. లసికిరి. వి. 1. దండు; 2. స్వదేశీ నావికుడు.

**లస్తరీ** వి. వస్త్రవిశేషం. హంస. 5.350.

త. లస్తర్. గాజుదీపంబుడ్డి; ఇం *Lustre.* కాంతి.

**లస్తి** వి. అందుబాటు.

**లహూవిబ్రాహ్మణులు** వి.బ.వ. నేపాళదేశపుబ్రాహ్మణులు.

**లా** వి. చట్టం, శాసనం.

ఇం. *Law.* చట్టం, శాసనం.

<ఇం. Law.

**లాక** రూ.చూ. రేక. వి. 1. అంకురం. నవనాథ. 2.57పు. 22పం; 2. పడుగులో అక్కడక్కడ చొప్పించే వెదురు. బద్ద. హంస. 2.12; 3. పక్షి ఈక; 4. రెక్కభుజం; 5. మొక్కకు వేసే పక్క పిలక; 6. ఆకు, బండికుండను పూటీ (వంపు) ని కలిపే కొయ్య; 7. రాట్నం ఇరుసు మీద తిరగటానికి చక్రం మాదిరిగా అమర్చిన సాపుచెక్క; 8. కంచెకట్టుబడిలో పురి బిగింపుకు రెండుపక్కలా వేసి కట్టిన వెదురుబద్ద; 9. దోనెగాడిలో బిగించే పొడుగాటి వెదురుబద్ద; 10 పేటుదారాలకు ఆధారంగా దాటీ చట్రంలో అమర్చిన సన్నబద్ద; 11. పంగగా ఉన్న ఒసికర్రలమీద పొడుగ్గా పరిచినకర్ర.

**లాకఇరగుద్దు** రూ.చూ. లాకవిరగుద్దు. అ.క్రి. పట్టు పడుగులో పైపోగులకు కింది పోగులకు మధ్య ఎక్కించిన లాకను చేత్తో తట్టు. **లాకఎక్కించు** అ.క్రి. లాకను పడుగులో దూర్చు. **లాకఏరు** అ.క్రి. లాకలు పోగుచేయు. **లాకకట్ట** వి. లాకలలో చుట్టి ఉంచిన పని ముగియని పడుగు (మగ్గం). ఆం.భా. 3.88. **లాకకట్టు** రూ.చూ. లాకకట్టు. వి. విరిచికట్టిన పెడచేతులకట్టు. **లాకకుట్టు** అ.క్రి. బద్దెలో లాకదూర్చు. **లాకకూర్చు** అ.క్రి. లాకను పడుగులో దూర్చు. **లాకగుచ్చు** అ.క్రి. పడుగులో అడ్డబద్ద దూర్చు. **లాకచీటు** అ.క్రి. నేతపడుగులో లాక జరుపు. **లాకచేయి** వి. లాకబద్ద. **లాకతట్టు** రూ. లాకదట్టు, లేకతట్టు. అ.క్రి. సరి చేసేటప్పుడు పడుగులో నందుపోగులు విడివడటానికి లాకతో తట్టు. **లాకతొక్కు** అ.క్రి. లాకను పడుగులో దూర్చు. **లాకతొడుగు** అ.క్రి. లాకను పడుగులో దూర్చు. **లాకదట్టు (-తట్టు¹)** రూ.చూ. లాకతట్టు. అ.క్రి. సరిచేసేటప్పుడు పడుగులో నందు పోగులు విడివడటానికి లాకతో తట్టు. **లాకదబ్బ** రూ.చూ. లాకబద్ద. వి. పడుగులో దూర్చే వెదురుబద్ద. **లాకదారం** వి. మగ్గానికి బిగించిన పడుగులో అని పోగుల వెంబడి దూర్చిన లాకకు కట్టిన పొడుగుదారం. **లాకదూయు** అ.క్రి పడుగులో అడ్డబద్దలు దూయు. **లాకపచ్చె** వి. కుంచెలాక. కుంచె కట్టుబడిలో పురి బిగింపుకు రెండుపక్కలా వేసికట్టిన వెదురుబద్ద. **లాకపెట్టు** అ.క్రి. లాకను పడుగులో దూర్చు. **లాకబద్ద**, రూ. రాకబద్ద, లాకదబ్బ, లేకబద్ద. వి. 1. తాడుకట్టిన వింటిబద్ద, ఉండేలుబద్ద; 2. పడుగులో కచ్చె వెంబడి దూర్చిన వెదురుబద్ద; 3. దోనెగాడిలో బిగించే పొడుగాటి వెదురుబద్ద; 4. పంగగాఉన్న ఒసికర్రలమీద పొడుగ్గా పరచిన కర్ర. **లాకబద్దకమ్మి** వి. వెదురుబద్ద వరస మాదిరిగా పట్టెలు పడేటట్లు నేసినకమ్మి. **లాకలకట్టు** వి. దండె తర్వాత పడుగులో దూర్చిన లాకలు చివరికి జారకుండా దండెకుకలుపుతూ దారంతో వేసినకట్టు. **లాకలసందు** వి. నవలక్షగుండు, దండెదగ్గర పడుగులో దూర్చిన చుప్ప కిందికి జారకుండా దారంకట్టి దండె అవతలకు వేలాడ

దీసినరాయి. **లాకలుకుట్టు** అ.క్రి. పడుగులో లాకలుదూర్చు. **లాకలుకొక్కు** అ.క్రి. లాకల్ని పడుగులో దూర్చు. **లాకలుకొడుగు** అ.క్రి. పడుగులో అడ్డబద్దలు దూర్చు. **లాకలుదున్ను** అ.క్రి. పడుగులో అడ్డబద్దలు తీసివేయు. **లాకలుదూయు** అ.క్రి. పడుగులో అడ్డబద్దలు తీసివేయు. **లాకలునడుపు** అ.క్రి. సరిచేసేటప్పుడు పడుగులో లాకలుపైకి ఎత్తు. **లాకలులేబట్టు(-పట్టు[1])** అ.క్రి. సరిచేసేటప్పుడు పడుగులో లాకలు పైకిఎత్తు. **లాకలూకాయ** వి. 1. అనామకుడు ; 2. నీతినియమంలేనివాడు. **లాకలెగేయు(-వేయు)** అ.క్రి. పడుగు ఆరుతున్నప్పుడు కచ్చిపోగులు అంటుకుపోకుండా లాకలు ఎత్తు. **లాకలెత్తు** రూ. నాగులెత్తు. అ.క్రి. పడుగు ఆరుతున్నప్పుడు కచ్చిపోగులు అంటుకుపోకుండా లాకలుఎత్తు. <లాక+-లు+ఎత్తు[1]. **లాకలేరు** రూ. నాగులేరు. అ.క్రి. పడుగు ఏరేటప్పుడు లాకల మీది పోగులు సరిదిద్దు. <లాక+-లు+ఏఱు[1]. **లాకలొత్తు** అ.క్రి. దట్టంగా కలుగు, దట్టంగా అంకురించు. విప్ర. 3.86. <లాక+-లు+ఒత్తు. **లాకవిరగుద్దు** రూ. లాకఇరగుద్దు. వి. పట్టుపడుగులో పైపోగులకు క్రిందిపోగులకు మధ్యఎక్కించిన లాకను చేత్తోతట్టు. **లాకవేయు** అ.క్రి. పడుగులో లాకదూర్చు.

**లాకి** రూ.చూ. లాకీ. వి. ఒకవిధమైన ఎరుపురంగు.

**లాకిరంగు** రూ.చూ. లాకిలంగు, వి. ముదురు ఎరుపరంగు.

**లాకిపున్నమ** రూ.చూ. రాకీపున్నమ. వి. శ్రావణపౌర్ణమి, నేతపనివారి ముఖ్యమైనపండుగ.

**లాకీ** రూ. లాకి, లాఖీ. వి. 1. ఎరుపురంగున్న వస్త్రవిశేషం. హంస. 5.356 ; 2. ఒకరకం ఎరుపురంగు.

నం. లాక్షా. లక్క ; హిం. లాఖీ. లక్కరంగు, ఎఱ్ఱగుఱ్ఱపుజాతి.

<హిం. లాఖీ.

**లాకీదమాస్‌చీర** వి. లాకీరంగు పడుగులో మూడేసి వేళ్ళ వెడల్పు పెట్టెలు మూడేసి వేళ్ళ ఎడంలోపడేట్టు నేసిన చీర. **లాకీరంగు** రూ. లాకిరంగు, లాకెరంగు. వి. ముదురు ఎరుపురంగు.

**లాకు[1]** వి. 1. కాలవలోవచ్చే ప్రవాహాన్ని ఆపుతూ వెలువరిస్తూఉండే అడ్డుతలుపులకట్ట ; 2. బండికుండను చక్రాన్ని కలిపేకఱ్ఱ.

ఇం. *Lock*. తాళం, కాలవలో పడవలు మెరకపల్లాల్లో వెళ్ళటానికి తలుపులతో చేసినఏర్పాటు.

<ఇం. Lock.

**లాకుజారీ** వి. పన్నులేనిది.

**లాకు[2]** రూ.చూ. లాగు[3]. వి. లాగు.

**లాకెరంగు** రూ.చూ. లాకిరంగు. వి. ముదురు ఎరుపురంగు.

**లాకేత్వమిచ్చు** అ.క్రి. లేదను.

<లా+-కున్+ఏత్వము+ఇచ్చు.

**లాక్సులగొలుసు** వి. డాబీ కోలలు లేపటానికి గొలుసుమాదిరిగా సన్నబద్దల గూర్చిన సాధనం.

ఇం. *Locks*. తాళాలు.

<ఇం. Locks+-లు+-అ[11]-+గొలుసు.

**లాఖిరాజి** వి. శిస్తు మినహాయింపబడ్డ భూమి.

హిం. ఉ. అర. లా-ఖిరాజ్. పన్నులేనిభూమి ;

త. లాకిరాజ్. పన్ను మినహాయించిన భూమి.

<ఉ. లా-ఖిరాజ్.

**లాఖీ** రూ.చూ. లాకీ. వి. ఒకవిధమైన ఎఱ్ఱనిఛాయ.

**లాగము** వి. 1. నేర్పు, సులువుగా పనిచేసే తెలివి. జైమినిభా. 7.167 ; 2. లాఘవం, తేలిక. ద్వి. పరమ. వి. 4.290.

నం. లాఘవ-. నేర్పు, తేలికయిన ; ప్రా. లాఘవ- ; అ.మా. లాహవ-.

<ప్రా. లాఘవ-.

**లాగముగొను(-కొను)** అ.క్రి. మొగ్గవేయు. భాస్క. రా. యు. 1507.

**లాగాయతి** రూ.చూ. లగాయత్. స. క్రి. మొదలుకొను.

**లాగాలగి** వి. ఒకేవరస.

హిం. లగాలగీ. కలయిక, సంబంధం.

<హిం. లగాలగీ.

**లాగి** విశ. 1. చులకనిది, లఘువు. వాల్మీ. 1.19 ; 2. సులభం. శశా. 4.58.

<లాగము+ఇ[9].

**లాగించు** చూ. లాగు[1].

**లాగివెల్లిపిడతలు** రూ.చూ. నాగవల్లి పిడతలు. వి. బ. వ. 1. పెళ్ళిలో నాగవల్లి సాంగేనికివాడే మట్టిపాత్రలు ; 2. అక్షింతలు వేసి పేరంటాళ్ళకు ఇవ్వటానికి పెళ్ళిలోవాడే పిడతలు.

**లాగు[1]** వి. 1. సొత్తు, సొమ్ము. పండి. చ. 1.19ప ; 2. మర్యాద. పండి. చ. 2.113ప ; 3. విధం. శృం. నై. 4.74 ; 4. ఒప్పు, బాగు. నవనాథ. 86ప. 10పం ; 5. భక్ష్యవిశేషం. ప్రబంధ. 112 ; 6. ధాన్యరుణం మీద వడ్డీగా ఇచ్చేధాన్యం ; విశ. 1. సమ్మతమైన, ఇష్టమైన. ఉ. హరి. 3.120 ; 2. బాగైన. రఘునా. 4.12 ; అ.క్రి. ఆకర్షించు, హరించు. అచ్చ.రా.బాల. 208, చంద్రాంగ. 1.10.

నం. లగ్న-. ఆసక్తం, తగులుకొన్నది ; ప్రా. లగ్గ-. సంసక్తం, సంబద్ధం ;

త. లాకై. రీతి.

<ప్రా. లగ్గ-.

**లాగించు** స.క్రి. 1. పెరుకచేయు, ఆకర్షింపచేయు. భాగ. 10పూ. 1082 ; 2. అపహరించు, దొంగలించు. ద్వి. పరమ. వి. 3.329.11పం ; 3. లాగికొనిపోవు, కొనిపోవు. దశా. 4.232. <లాగు[1]+-ఇంచు[3]. **లాగుకొను** స.క్రి. 1. అపహరించు ; 2. బలవంతంగా తీసుకొను. **లాగుదర** వి. డిజైన్లు నేసేటప్పుడు చేత్తోలాగే పేటుదారాలు. **లాగుడుతాళ్ళు** వి. ఒకరకండిజైను నేతలో అడను గుంజటానికి వేసినతాళ్ళు. **లాగుడుపేటు** వి. పేటుదారాలు చేత్తో

లాగుతూ నేసినదిజైను నేత. లాగులబంధు(డు వి. ఆకర్షించే చుట్టం. తాళ్ల. సం. 7.188. లాగులాడు అ.క్రి. పెనగులాడు. పాంచా. 5.20. <లాగు[1]+-లు+ఆడు.

లాగు[2] రూ.చూ. లావు[1]. వి. బలం, చేవ. హరి. ఉ. 2.60.

లాగు[3] రూ. లాకు[2]. వి. పంట్లాం.
హిం. లాగూ. వేసుకోతగిన.
<హిం. లాగూ.

లాగు[4] వి. గానుగరాతిని తగిలించే కొయ్యదూలం.

లాగెశేయు(-చేయు) స.క్రి. సమర్పించు. ద.హిం.కా. సంపు. 6. గా.సంపు. 72 క్రీ.శ. 1435.
హిం. లాగ్. సంబంధం, ప్రేమ.

లాగోడి వి. ముసాఫా భూమిని కౌలుకివ్వటంవల్ల వచ్చిన లాభం.

లాంగరము విశే. విశాలం. ఐందు. 1.17.
సం. లాంగల-. నాగలి, తాడిచెట్టు, గృహదారు విశేషం.
< సం. లాంగల-.

లా(క రూ.చూ. రేక.[1] వి. పక్షి ఈక.
లా(కకట్టు రూ. లాకకట్టు. వి. విరిచి కట్టిన రెండు చేతుల కట్టు.

లా(గ వి. 1. రంధ్రం, బొరియ, కన్నం. భార. ఆశ్ర. 2.151; 2. గుహ. భాన్క. రా.యు. 350
లా(గదా(గుడు రూ. లా(గదాగుడు. వి. బతేశయం, పాము. అచ్చ. రా. బాల. 8. లా(గదాగుడు రూ.చూ. లా(గ డా(గుడు. వి. పాము. లా(గరి వి. శ్రోత్రం, చెవి. <లా(గ +-అరి.

లా(గించు చూ. లా(గు.

లా(గు వి. 1. లంఘనం. భార. విరా. 1.81; 2. నాట్య విశేషం. శ్రీరం. మా. 4.162; 3. చల్లటం, నగం తొడవరకు తొడుక్కునే గుడిగి. సారంగ. 1.116; 4. మొగ్గ. విజయ. 1.15; 5. మల్లబంధ విశేషం. హంస. 1.206.
సం. లంఘన-. దాటటం; ప్రా. లంఘ్. లంఘించు, లంఘు. లంఘనం;
క. లాగ. పిల్లిమొగ్గ, దుముకు, లాగు. దూకు; తు. లాగియుని, దూకు, లాగ, లాగ్య. దాటు; మ. లాకుక.
<ప్రా. లంఘ్-.
లా(గించు అ.క్రి. 1. లంఘించు, ఉత్పన్నమగు. రం. రా. ఉ. 46పు. 12పం.; 2. అశ్వశిక్షచేయు. పి.శకు. 1.112; స.క్రి. అతిక్రమించు. సమీర. 1.94. క. లాగిసు. వెళ్ళజేయు. <లాగు+-ఇంచు.[3] లా(గుబడి వి. ఖర్చు.

లాచారీమాట వి. నిజం చెప్పిన మాట.
హి. ఉ. లాచార్. వివశమయిన.
<ఉ. లాచార్+మాట.

లాచారు విశే. 1. నిస్సహాయమయిన; 2. నిరాధారమయిన; 3. సిగ్గు కలిగించేది.
హిం. ఉ. లాచార్. వివశమయిన, స్వాధీనంకాని;
క. లాచారు. నిస్సహాయమైన.
<ఉ. లాచార్.

లాచి రూ. లాచీ. వి. 1. గుర్రం మీద గాడిద మీద వేసే గోనె; 2. చిన్న బండి మీద తెచ్చే బరువు.
హిం. లచ్చి. అశ్వవిశేషం.

లాచీ రూ.చూ. లాచి. వి. 1. గుర్రం మీద, గాడిద మీద వేసే గోనె; 2. చిన్న బండి మీద తెచ్చే భారం.

లాచేరీ వి. కక్కుర్తి, ప్రాధేయం.
హిం. ఉ. లాచారీ. వివశత, స్వాధీనం కానిది.
<ఉ. లాచారీ.

లాజ్జలు వి.బ.వ. పేలాలు.
సం. లాజ-. నానబియ్యం, పేలాలు;
క. లాజె. పేలాలు.
<సం. లాజ-+-లు.

లాజిగ క్రి.విశే. పెద్దగ.
హిం. లాజ్. సిగ్గు.

లాజు రూ.చూ. లాదు. అ.క్రి. తారసరాల్తో కప్పు వేయు.

లాంచీ వి. మోటారు పడవ.
పో. లాంప; స్పా. లాంచ-. తెర్లపడవ.
<పో. లాంప.

లా(చు[1] చూ. లా(గు. అ.క్రి. 1. పొంచు. గా. హరి. ఉ. 1052పం.; 2. కవియు. వేంక. పంచ. 2.194; 3. పెనగులాడు. వసు. 2.55.
లా(చుకొను అ.క్రి. పొంచు. భాగ. 1.445. లా(పు వి. 1. దాగటం; 2. ఢీకొనటం; 3. కలియటం.

లా(చు[2] అ.క్రి. ప్రియపడు, కాంక్షించు. ఆము. 2.58.
క. అళిపు. అలుపు. కోరు, ప్రేమ, అళ్వాగ. స్నేహితుడు; త. అళిపు (అళి-స్త్-). ఐతపడు, (అళి-త్త్-). కోరిక కలిగించు, ప్రేమ, కోరిక.

లాట వి. వరి మొ. వాటిని కోసిన దుంప నుండి మొలచిన మొక్క, నాము, లేట (Latoon).
లాటకట్టు వి. కొయ్యకాలు, కోసినపైరు చిగిర్చి పుట్టిన కర్రలు, నాముకర్ర.

లాటరీ వి. చీట్లు కలిపి వస్తువుల నమ్మటం.
ఇం. *Lottery*. చీట్లు కలిపి తీయటం.
<ఇం. Lottery.

లాటి[1] వి. పక్షివిశేషం

లాటి[2] రూ.చూ. లాఠి. వి. దుడ్డుకర్ర.

లాటిను[1] రూ.చూ. లాంతరు. వి. అద్దాలమధ్య వెలిగే దీపంగూడు.

లాటిను[2] ఇండోయూరోపియను భాషాకుటుంబానికి చెందిన ప్రాచీన భాష.
ఇం. *Latin*. ప్రాచీన రోమనుల భాష.
<ఇం. Latin.

లాటీ రూ.చూ. లాఠి. వి. 1. సునుపుగా ఉండే ఒక విధమైన

కఱ్ఱ, దుడ్డు కఱ్ఱ; **2.** దాబీగొలుసుకు అడ్డంగా బిగించిన సన్న బద్ద.

**లాటీకఱ్ఱ** వి. **1.** రంగు అద్దిన నూలు లడేలు గుంజకు తగిలించి పిండే కఱ్ఱ; **2.** దుడ్డుకఱ్ఱ.

**లాటు** వి. **1.** గుంపు, మొత్తం. పాంచా. 2.45; **2.** కట్టెలకుప్ప; **3.** పంపకంలో ఒకభాగం; **4.** మరమగ్గంలో పన్నె.

ఇం. *Lot.* గుంపు.

<ఇం. Lot.

**లాటుకొమ్ము** వి. పడుగు పైపోగులకు కిందిపోగులకు మధ్య పేకదారం పడటానికి కండె అమర్చి కుచ్చు తాళ్ళ సాయంతో విసిరేనాడె. **లాటుకొమ్మురేకు** వి. మరనాడె గాడిలో ముల్లుకు గుచ్చిన కండె ఊచ ఊడిపోకుండా బిగించిన ఇత్తడి రేకు. **లాటుగుంజ** వి. మరమగ్గం చట్రం నిలబెట్టటానికి ఆధారంగా నేత బయలులో పాతిన కొయ్య రాట. **లాటుచెవు** వి. మరమగ్గం బొమ్మకు నిలువు పట్టెకు ఏటవాలుగా బిగించిన కఱ్ఱ. **లాటుదేత(-ఉదత)** వి. మరమగ్గం నాడెను ఒకసొరుగులో నుంచి మరొక సొరుగులోకి నెట్టటానికి, సొరుగులోకి వచ్చిన నాడెను నిలపటానికి కింద, తోలు ఉంగరం బిగించిన కొయ్య బిళ్ళ. **లాటుతొట్టి** వి. మరమగ్గం చట్రంలో పానుపు పట్టెకు ఒకవైపు బిగించిన చెక్కల గూడు. **లాటునాడె** వి. పడుగు పైపోగులకు కింది పోగులకు మధ్య పేకదారం పడటానికి కండె అమర్చి కుచ్చు తాళ్ళసాయంతో విసిరే కొయ్యనాడె. **లాటుపట్టె** వి. నేత బయలులో మరమగ్గం చట్రం నిలబెట్టటానికి నిలువు రాటలకు అడ్డంగా బిగించిన కఱ్ఱ. **లాటుపంటె** వి. అడ్డంగా అమర్చిన రాటి. **లాటుబొమ్మ** వి. మరమగ్గం సొరుగుకు చివర నాడె బయటికి పోకుండా ఆపటానికి బిగించిన కొయ్యచెక్క. **లాటుమగ్గం** వి. ఒకరకం మగ్గం, నేతనేసేటప్పుడు పడుగులో పేకదారం వెయ్యటానికి కుచ్చు పట్టుకొని గుంజే మగ్గం. **లాటూచ** రూ. లాటూన. వి. పేకదారం చుట్టే కొయ్యపుల్ల. <లాటు+ఊచ. **లాటూన** రూ.చూ. లాటూచ. వి. పేకదారం చుట్టే కొయ్యపుల్ల.

**లాటూచ** చూ. లాటు.

**లాటూన** చూ. లాటు.

**లాఠి** రూ. లాటి², లాటీ, లాడి.² వి. నునుపుగా ఉండే ఒక విధమైన కఱ్ఱ.

హిం. లాఠీ. దండం, కఱ్ఱ, దుడ్డు కఱ్ఱ, బడితె; త. లట్టి, లాటి.

<హిం. లాఠీ.

**లాడము** రూ.చూ. నాడాం. వి. ఎద్దు మొ. వాటి గిట్టలకు అరక్కుండా వేసిన ఇనపబిళ్ళ.

**లాడా** విణ. నిడుపైన. చంద్రాంగ. 2.38.

**లాడి¹** వి. **1.** బలి. పాండు. 5.243; **2.** వ్రణం, పెద్దపుండు. హంస. 5.30.

**లాడిగావించు(-కావించు)** స.క్రి. అప్పగించు. అచ్చువేసి వదులు. పాండు. 5.243. **లాడి(బడు(-వడు)** అ.క్రి. బలియగు, వశమగు. తాళ్ల.సం. 10.227.

**లాడి²** రూ.చూ. లాఠి. వి. దుడ్డుకఱ్ఱ.

**లాడికొమ్ము** రూ.చూ. నాడెకొమ్ము. వి. **1.** నేతనేసేటప్పుడు పడుగు పైపోగులకు, కిందిపోగులకు మధ్యవేసే పేకదారం కండె అమర్చిన పనిముట్టు.

**లాడియ** రూ. లాడె² వి. ఎద్దువీపు మీద బరువెక్కించటం.

హిం. లాద్. బరువు వేయటం, లాద్‌నా. ఒక వస్తువుపై వేరే వస్తువునుంచటం.

<హిం. లాద్.

**లాడీబేడీ** వి. మూటాముల్లె.

**లాడు¹** చూ. లాదు. విణ. పెద్ద. ప్రబంధ. 32.

**లాడు²** రూ.చూ. రాడు. వి. కొమిరె, సిడె (ఏతంమాను) కు ఆధారంగా నేలలో పాతిన నిలువు కొయ్య.

**లాడు³** వి. లడ్డు.

హిం. లాడూ లడ్డు.

<హిం. లాడూ.

**లాడువా(డు** విణ. సౌందర్యవంతుడు.

హిం. లాడ్. ప్రియం, ప్రేమ.

**లాడె¹** వి. లాటదేశం. కువ.చ. 2.88.

సం. లాట-. దేశవిశేషం; ప్రా. లాడ-.

<ప్రా. లాడ-.

**లాడె²** రూ.చూ. లాడియ. వి. ఎద్దువీపుమీద బరువెక్కించటం.

**లాడె³** రూ.చూ. నాడె¹ వి. నడుమ నూలుకండె నుంచి నేసే సాలెవాని సాధనం, తురి.

**లాడెకొమ్ము** రూ.చూ. నాడెకొమ్ము. వి. నేత నేసేటప్పుడు పడుగు పైపోగులకు కిందిపోగులకు మధ్య వేసే పేకదారం కండె అమర్చిన పనిముట్టు. **లాడెగాడి** రూ.చూ. నాడెగాడి. వి. నాడెలో పేకదారం కండె అమర్చేసందు. **లాడెముక్కు** రూ.చూ. నాడెముక్కు. వి. నాడెచివర కొన దేలిన భాగం.

**లాడ్‌ఖానా** రూ.చూ. లాల్‌ఖా నా.వి. రంగులో తడిపిన నూలు లడేలు పిండటానికి నేలలో పాతిన పొడుగురాట.

**లాత** వి. ఆత్మశ్లాఘ, గర్వం.

**లాతపు(గోల** చూ. లాతము.

**లాతము** రూ. లాతాము. వి. సన్యాసులు చేత పట్టే దండం. హర 2.37.

ప్రా. లత్తా, లత్తియా. దండం.

<ప్రా. లత్తా.

**లాతాపు(గోల** రూ.చూ. లాతాపుకోల. వి. సన్యాసులు చేతబట్టే దండం. సారంగ. 3.180.

**లాతాపుకోల** చూ. లాతాము.

**లాతాము** రూ.చూ. లాతము. వి. సన్యాసులు ధరించే కఱ్ఱ. మను. 1.59.

**లాతాపుకోల** రూ. లాతపుగోల. వి. సన్యాసి చేతి దండం. విక్ర. 8.116.

**లాతు** రూ. లాఁతు. విణ. అధికం. భార.ఉద్యో. 3.334. తాళ్ల.

నం. 13.95.

**లాదాంబల్ల** వి. పెంకు కింది చూరుకు బిగించే చెక్క.

**లాదు** రూ. నాదు, లాజు. వి. 1. కట్టడాల్లో పంపులు కట్టేటప్పుడు వాటికి ఆధారంగా కట్టే కట్టడం; 2. తారసరాతిని అతకటం.

హిం. లాద్. ఒకదానిపై ఇంకోదాన్ని పేర్చే క్రియ, లాద్‌నా. ఒకదానిపై ఇంకోదాన్ని పేర్చటం.

**లాదుబిళ్ళ** వి. చిన్న సైజు ఇటిక, పలచగా చదరంగా ఉండి ఇంటి కప్పు తయారీలో వాడబడే ఇటుక. **లాదురాయి** రూ. లాద్రాయ, లాద్రాయి. వి. పలుచగా చదరంగా ఉండి ఇంటికప్పు తయారీకి వాడే చిన్నసైజు ఇటిక. **లాదుసున్నం** వి. ఇంటికప్పు లాదుటానికి వాడే బాగా జిగురున్న మెత్తటి సున్నం. **లాద్రాయ** రూ.చూ. లాదురాయి. వి. పలుచగా చదరంగా ఉండి ఇంటి కప్పు తయారీలో వాడే చిన్నసైజు ఇటిక. **లాద్రాయి** రూ.చూ. లాదురాయి. వి. పలుచగా చదరంగా ఉండే ఇంటికప్పు తయారీలో వాడే చిన్నసైజు ఇటిక.

**లాద్రాయ** చూ. లాదు.

**లాద్రాయి** చూ. లాదు.

**లాంతరు** రూ. లాటీను, లాంతేరు, లాందరు. వి. అద్దాల మధ్య వెలిగే దీపం గూడు.

ఇం. *Lantern.* లాంతరు; ఫ్రెం. *Lanterne*; క. లాంతర్.

<ఫ్రెం. Lanterne.

**లాంతరు వెయ్యటం** వి. పేకాటలో పనికిరాని ముక్కలు వెయ్యటం.

**లాంతేరు** రూ.చూ. లాంతరు. వి. దీపం.

**లాందరు** రూ.చూ. లాంతరు. వి. దీపం.

**లాంద్ర** వి. కమలాల్లో ఒకరకం.

**లా(త** చూ. లాయు.

**లా(తసేయు** చూ. లాయు.

**లా(తి** చూ. అల(తి. వి. 1. అన్యం, అన్యుడు, పెర. తార. విరా. 2.93; 2. అన్యుడు, ఇతరుడు. ఉ. హరి. 4.93.

**లా(తివా(డు** విణ. అన్యుడు. వసు. 2.55.

**లా(తు** రూ.చూ. లాతు. విణ. మిక్కిలి, అధికం. క్రీడా. 256. వి. మిక్కిలి వెక్కసం.

**లాప** రూ.చూ. లప్ప. వి. 1. గానుగ చక్రం బెనగకుండా బిగించే కొయ్యముక్క; 2. పత్తిచెట్టు కర్ర; 3. మట్టి పెల్ల, మట్టిగడ్డ.

**లాపట్టు** స.క్రి. నెత్తికెత్తుకొను.

**లాపర** రూ.చూ లాపరా. వి. జలద్వారంలో కసవు చొర కుండా నిలిపిన నాగబంధం పలక.

**లాపరా** రూ. లాపర. వి. జలద్వారంలో కసవు చొరకుండా నిలిపిన నాగబంధం పలక, గండ్లరాయి. ఆము. 5.9.

**లాపు** చూ. లా(చు.

**లాబగా(డు** చూ. లాబము.

**లాబము** వి. లాభం.

నం. లాభ-. లబ్ధి; ప్రా. లాభ-, లాహ-; అ.యా. లంభ, లాభ, లాహ; పా. లాభ-; క. లాబ; త. ఇలాపమ్; కుఇ. లాబ; కువి. లబొమె; బ్రా. లబ్. లంచం, కన్యాశుల్కం.

<ప్రా. లాభ-.

**లాబగా(డు** రూ. లాబిగా(డు. వి. లాభం పొందేవాడు. వరాహ. 2.180. **లాబిగా(డు** రూ.చూ. లాబగా(డు. వి. లాభం పొందేవాడు.

**లాబిగా(డు** చూ. లాబము.

**లాభంలేకపోవు** అ.క్రి. ప్రయోజనం లేకపోవు.

నం. లాభ-లబ్ధి.

<నం. లాభ- + -ము + లేకపోవు.

**లాభంకలుగు** చూ. లాభము.

**లాభము** వి. 1. ఒడుప; 2. ధనప్రాప్తి.

నం. లాభ-. ప్రాప్తి.

<నం. లాభ-.

**లాభంకలుగు** వి. ఒకటి. వ్యాపారులు ఒకటి అనటంలో కలిసిరాదని కాబోలు దానికి బదులు లాభం కలుగు అని తమ కొలతను తూనికల్ని ప్రారంభిస్తారు. రైతులైతే పొలికలుగు అని ప్రారంభిస్తారు. నం. లాభ-. లబ్ధి. <నం. లాభ- + ము + కలుగు.

**లాము**[1] వి. కొండగుహ. కాడికొండగానసం. క్రీ.శ. 945.

**లాము**[2] వి. గుంపు, రాశి.

హిం. ఉ. లామ్-. సేన, ప్రజాసమూహం; పార. లార్క్.

<ఉ. లామ్.

**లాంపు** వి. అద్దాల్లోపల వెలిగే దీపం గూడు.

ఇం. *Lamp-*. దీపం.

<ఇం. Lamp.

**లా(పరా** చూ. నా(పరాయి. రూ. లా(పరాయి. వి. జలద్వార ముఖంలో తృణాదికం చొరకుండా అమర్చిన గండ్లరాయి; ఆము. 6.10.

**లా(పరాయి** యా.చూ. లా(పరా. వి. జలద్వారముఖంలో గడ్డి మొ. నవి వెళ్ళకుండాఅమర్చినగండ్లరాయి. ఆం.భా. 1 154.

**లా(పు** చూ. లా(చు[1].

**లాయక్** రూ.చూ. లాయకు. వి. 1. తగిన; 2. తర్ఫీదు పొందిన.

**లాయకు** రూ. లాయక్, లాయఖ్, లాయఖు. విణ 1. తగిన. 2. తర్ఫీదు పొందిన; 3. గౌరవనీయమైన.

హిం. లాయక్. తగిన, సమర్థవంతమైన, సరైన, శక్తిగల, సామర్థ్యంగల, గొప్ప, చక్కగా, పోషించబడిన, పోటీచేయగల; ఉ. అర. లా.ఇక్. తగిన, సమర్థమైన. క. లాయక్, లాయకు-. సంతోషప్రదమైన, అంగీకార యోగ్యమైన; త. లాయక్కు.

<ఉ.లా.ఇక్.

**లాయఖ్** రూ.చూ. లాయకు. విణ. 1. తగిన; 2. తర్ఫీదు

పొందిన.

**లాయఖీ** వి. సామర్థ్యం.

హిం. లాయకీ-. గొప్పతనం, సామర్థ్యం ; ఉ. అర. లా. ఇకీ-. యోగ్యత. సామర్థ్యం.

<ఉ. లాఇకీ.

**లాయఖు** రూ.చూ. లాయకు. విశ. 1. తగిన ; 2. తర్ఫీదు పొందిన.

**లాయఖుచేయు** అ.క్రి. బాగుచేయు, వ్యవసాయానికి అనువుగా చేసుకొను.

**లాయము** వి. అశ్వాల, వాహనాలుండేచోటు. జైమినిభా. 6.104.

సం. ఆలాయ-. నిలయం ;

క. లాయ-. అశ్వాల ; తు. లాయ ; త.మ. లాయమ్.

<సం. ఆలాయ-.

**లాయరు** వి. వకీలు.

ఇం. *Lawyer*. న్యాయవాది.

<ఇం. Lawyer-.

**లాయిడి** వి. రెంటపంజులు.

**లాయిరంచు** చూ. లాయిరి.

**లాయిరి** రూ.చూ. లాహిరీ². వి. ఒకవైపుకు మొనదేలిన గుర్తులు దగ్గరదగ్గరగా వరసగా వచ్చేట్టు నేసిన డిజైను. **లాయిరంచు** రూ.చూ. లాహిరీఅంచు. వి. బాకు మొన ఆకారంలో డిజైన్లు పడేటట్లు నేసిన అంచు. <లాయిరి + అంచు³.

**లాయిరీ** రూ.చూ. లాహిరీ². వి. ఒకవైపుకు మొనదేలిన గుర్తులు దగ్గరదగ్గరగా వరసగా వచ్చేట్టు నేసిన డిజైను.

**లాయిరీఅంచు** రూ.చూ. లాహిరీఅంచు. వి. బాకుమొన ఆకారంలో డిజైన్లు పడేటట్లు నేసిన అంచు. **లాయిరీపేటంచు** రూ.చూ. లాహిరీపేటంచు. వి. బాకు మొన ఆకారంలో డిజైన్లు పడేటట్లు నేసిన అంచు.

**లాయిలాసా** వి. శ్రమ.

**లాయు** అ.క్రి. ఉద్రేకించు, విజృంభించు. హరి. ఉ. 236.

క. అళ్-. సామీప్యం ; త. అళ్-. సాన్నిహిత్యం, అళ (అళ - న్-). విస్తరించు, నమీపించు.

<మూ. ద్రా. *అళ్-.

**లాఁత** వి. ఉద్రేకం. **లాఁతసేయు(-చేయు)** అ.క్రి. లాయు, ఉద్రేకించు. ఉ. హరి. 4.218.

**లాల** వి. నీళ్ళు.

సం. లాలా. చొంగ.

<సం. లాలా (అర్థవిపరి.).

**లాలపోసికొను** అ.క్రి. 1. మునుగు ; 2. స్నానమాడు.

**లాలం¹** వి. గొట్టం.

హిం. ఉ. పార. నాల్-. తుపాకీగొట్టం ; మరా. నాళ్-. లోహ నాది, ఫిరంగి.

<ఉ. నాల్.

**లాలం²** రూ.చూ. లాళము. వి. మరనాడెపొన్ను అరిగి పోకుండా బిగించిన ఇనపపొన్ను.

**లాలము** వి. ఉల్లారు కింది జాలరు.

**లాలసరి** వి. గుర్రం పల్లానికి రెండుపక్కలా వేలాడే పట్టుకాళ్ళు. ఆం. భా. 3.38.

**లాలంబరు** వి. ఎరుపు కలిసిన లేతపసుపుపచ్చ రంగు.

హిం. లాల్-. ఎరుపు ; ఇం *Amber*. పసుపుతో కూడిన బూడిదరంగు.

<హిం. లాల్ + ఇం. Amber.

**లాలసరి** చూ. లాలము.

**లాలాయజలము** వి. జొల్లు, చొంగ, తేప.

సం. లాలాజల-. నోటిలో ఊరే ద్రవం.

<సం. లాలాజల-.

**లాలారి** వి. దాస్యం చేసేవాడు. రా.వా. ప. 52.

ఉ. లాలా-. గులాం, సేవకుడు.

<ఉ. లాలా.

**లాలి** వి. 1. ఉయ్యాల్లో పిల్లల్ని నిద్రపుచ్చేటప్పుడు పాడేపదం. చారు. 3 ; 2. ఉయ్యాల. సారంగ. 1.46.

సం. లాలిన్-. లాలన చేసేవాడు.

<సం. లాలిన్ (అర్థవిపరి).

**లాలిపాట** వి. ఉయ్యాల ఊపుతూ పాడేపాట.

**లాలికి** రూ.చూ. లాలిగ. వి. నూనెపోసేగొట్టం, పన్నల్.

**లాలిగ** రూ. లాలికి, లాళికి, లాళిగ, లాళిని. వి. నూనె పోసే గొట్టం, గరాటి.

సం. నాలికా-. నాళం, గొట్టం,

<సం. నాలికా.

**లాలు** విశ. ఎరుపు రంగు కలది, రక్తం. ఆము. 4.35. వి. 1 ఎరుపు ; 2. జేగురు ; 3. కోప.

హిం. లాల్. ఎరుపు ; ఒ. లాల్ ; బెం. మరా. లాల్ పార. లాల్ ఎరుపు. లాలీ. ఎర్రదనం.

<హిం. లాల్.

**లాలుబండి** వి. కలుపుచెక్కలను మూస్తూ గోదల్లోని కంతల్లోకి దూర్చబడే రోకలివంటి పెద్దగడియ.

ఇం. *Roll*. తిరుగు.

**లాలూచి** రూ.చూ. లాలూచీ. వి. 1. అత్యాశ ; 2. నైచ్యం ; 3. లోపాయకారి.

**లాలూచీ** రూ. లాలూచి. వి. ప్రేరేపకహేతువు. ఎర.

హిం. ఉ. లాల్‌చీ. లోభి.

<ఉ. లాల్‌చీ.

**లాల్‌ఖానా** రూ. లాడ్‌ఖానా. వి. రంగులో తడిపిన నూలులడీలు పిండటానికి నేలలో పాతిన పొడుగురాట.

హిం. లాల్. ఎర్రని, ఖానా. స్థానం, నెలవు.

<హిం. లాల్ + హిం. ఖానా.

**లాల్చి** రూ.చూ. లాల్చీ. వి. చొక్కా.

**లాల్చీ** రూ. లాల్చి. వి. జుబ్బా.

బెం. లాల్చీ ఒకరకమైన చొక్కా.

<బెం. లాల్చీ.

**లాల్దువ్వు** అ.క్రి. గంజి పెట్టిన పడుగు దారాలు సాపుచేయు.

హిం. లాల్. ఎరుపు.

<హిం. లాల్+దువ్వ.

**లాల్‌రంగు** వి. ఎరుపురంగు.

హిం. లాల్. ఎరుపు.

<హిం. లాల్+రంగు.

**లాల్రి** వి. ఒకవిధమైన కెంపు.

హిం. ఉ. లాల్‌ఢీ, లాల్‌రీ. ఒకరకమైన కెంపు. కెంపును పోలిన ఒకరకమైన. నకిలీరాయి.

<ఉ. లాల్డీ.

**లాళము** చూ. నాడా. రూ. లాడము, లాలం[3]. వి. 1. గుర్రం మొ. వాటి గొరిజలకు కట్టే ఇనప తగటు బిళ్ళ. చంద్రరే. 2.16 ; 2. మరనాడె పొన్ను అరిగి పోకుండా బిగించిన ఇనపపొన్ను.

**లాళిక** రూ.చూ. లాలిగ. వి. గరాటి, ఫన్నల్.

**లాళిగ** రూ.చూ. లాలిగ. వి. నూనెపోసే గొట్టం, గరాటి.

**లాళిని** రూ.చూ. లాలిగ. వి. గరాటి, ఫన్నల్.

**లావణము** వి. ఉద్యోగిపేరు పట్టికలో చేర్చటం.

క. లావణ. సైనికుల లేదా ప్రజాసేవకుల పట్టి. త. ఇలావణ, లావణ.

**లావణముచేయు** స.క్రి. తిరిగి పట్టీలో దాఖలు చేసుకొను.

**లావణి**[1] వి. పుల్లరి, పశువులు మేసే బీటునేల కోసం ముందుగా ఇచ్చే పన్ను.

క. లావణి. పోగు, గుంపు ; సం. లావణిక –. ఉప్పు వ్యాపారంలో జీవించే వర్తకుడు, ఉప్పువేసి వండబడినది.

**లావణి**[2] వి. దండయాత్ర. తపతీ. 3.77.

**లావరి** చూ. లావు[1].

**లావఱు** చూ. లావు[1].

**లావాటోడు** చూ. లావు[1].

**లావాదేవి** రూ.చూ. లావాదేవీ. వి. రవాణా, (నావికా) వర్తక సంబంధమైన వ్యవహారం.

**లావాదేవీ** రూ. లావాదేవి. వి. ఇచ్చిపుచ్చుకొనే బంధం.

హిం. ఉ. లానాదేఈ. ఇచ్చిపుచ్చుకోవటం ;

త. లావాతివి.

<ఉ. లావాదేఈ.

**లావాదేవీలు** వి.బ.వ. 1. వ్యాపారం చిక్కులు ; 2. ఇచ్చి పుచ్చుకొనే సంబంధం ; 3. మరాముళ్ళు.

**లావాయి** రూ.చూ. లోవాయి. వి. పాత్రలకు అంచుకు, పింజకు మధ్యమందే లోపలిభాగం.

**లావిల** రూ.చూ. లావిలము. వి. ఒకపక్షి.

**లావిలము** రూ. లావిల. వి. పక్షివిశేషం. యయా. 2.24.

సం. లావ -.పూరేడు, పిట్ట.

**లావు**[1] రూ. లంప, లాగు[2]. వి. 1. బలం, శక్తి. భార. ఆది. 2.55 ; 2. పరాక్రమం. భార. ఆది. 7.179 ; 3. సామర్థ్యం. కు.సం. 7.53 ; 4. ఉపకారం. భాస్క. రా.యు. 60 ; 5. సాహసం. హరి. ఉ. 6.196 ; 6. ధైర్యం. వరాహ. 3.59 ; 7. బరువు, గురుత్వం. వరాహ. 3.139 ; విశే. 1. శక్యం, అలవి. భార. ఆది. 4.248 ; 2. బలిష్ఠం, బలంకలది. భాస్క.రా. అరణ్య. 1.263 ; 3. బలకరం. భాస్క. రా.యు. 530 ; 4. ఘనం, పెద్ద. ఉ. హరి. 4.165 ; 5. అధికం, హెచ్చు., సారంగ. 3.115 ; 6. స్థూలం.

క. ఆళవి, అళవు, అళువు. బలం, సామర్థ్యం, శక్తి, పరాక్రమం ; త. అల్. బలం, దృఢత్వం ; గోం. లావ్. గట్టి ; కుయి. లావెంజు. పెరిగిన బాలుడు, యువకుడు, లా. పెరిగిన బాలిక, యువతి ; కువి. రా. యువతి, లా. కన్య ; పర్జి. లావ్. బలం ; కొలా. ల.వ్. లావు.

**లావరి** వి. బలంకలవాడు. భాస్క.రా. కిష్కిం. 297 ; 2. బలం కలది. హరి. ఉ. 4.140. <లావు[1]+-. అరి. **లావఱు** అ.క్రి. బలం నశించు. నిర్వచ. 4.74. <లావు[1] +-. అఱు. **లావాటోడు** విశే. ఘటికుడు. <లావు[1]+పాటి +వాఁడు. **లావుకొను** అ.క్రి. అతిశయించు. చంద్రాంగ. 1.22 ; 2. బలియు, లావెక్కు. **లావుచూపు** అ.క్రి. 1. బింకం చూపు ; 2. బలం చూపు. **లావుచెడు** అ.క్రి. కృశించు, చిక్కిపోవు. **లావుచేయు** రూ.చూ. లావుసేయు. అ.క్రి. 1. బలియు ; 2. బలంచూపు ; 3. వెంపెక్కు. **లావునూలు** వి. పోగు మందంగా ఉండే నూలు. **లావురాయి** వి. పెద్దరాయి. **లావుసేయు** (-చేయు) రూ. లావుచేయు. అ.క్రి. 1. బలంచూపు. హరి.ఉ. 6.176 ; 2. బలియు. **లావెక్కించు** స.క్రి. పురికొల్పు. ఉ.హరి. 3.32. <లావు[1] +ఎక్కించు. **లావెక్కు** అ.క్రి. అధికమగు. భీమ. 4.60. <లావు[1]+ఎక్కు.

**లావు**[2] వి. 1. రెక్క, పక్షం. రాజవా. 3.46 ; 2. పక్షతి, రెక్క మొదలు. శుక. 1.145 ; 3. పక్షిపుచ్ఛం, పింఛం. ప్రబంధ. 788 ; 4. ఈక.

**లావు**[3] వి. బిచ్చం. విజయ. 2.125.

**లావుక** రూ. లావుకము. వి. పక్షివిశేషం.

సం. ప్రా. లావక-, లావ-, లావగ-, లావయ. పక్షివిశేషం ; అ.మా. లావగ, లావయ-;

క. లావగ, లావిగె, లావుగె-; తు. లావక్కి లావక్కిపకు.

<ప్రా. లావక-.

**లావుకపిట్ట** వి. ఒకరకం పక్షి.

**లావుకము** రూ.చూ. లావుక. వి. ఒకరకం పిట్ట.

**లావెక్కించు** చూ. లావు[1].

**లావెక్కు** చూ. లావు[1].

**లాసి** వి. సంబంధం, తగులం.

**లాసికతనము** వి. ఆటకత్తెతనం. భార. విరా. 1.89.

సం. లాసికా. నర్తకి.

<సం. లాసికా+తనము.

**లాసిగా** క్రి. విశే. పెద్దగా, గట్టిగా.

సం. లాస -.దుముకటం, నర్త్యాట.

**లాసు** వి. నష్టం.

ఇం. *Loss*. నష్టం.

<ఇం. Loss.

**లాహిరంచు** చూ. లాహిరి[2].

**లాహిరి[1]** రూ. లాహిరీ[1]. వి. 1. మైకం, మత్తు. పార్వ. 2.100, చంపూరా. 6.15 ; 2. మైకం కలిగించే ద్రవ్యం. కు.వ.చ. 2.112.

హిం. లహర్. పెద్దఅల, నురగ, మూర్ఛ ; ఉ. పార. లహర్, లహ్ర్. సారాయి మొ. నిషావస్తువులు అమ్మేకొట్టు, సానికొంప, లహ్. ద్రాక్షసారాయం.

త. ఇలాగిరి మైకం.

<ఉ. లహర్.

**లాహిరికాఁడు** వి. మత్తుడు. ఉ.రా. 1.66. **లాహిరిపట్టు** అ.క్రి. మైకం కమ్ము. కాశీ. 2.188.

**లాహిరి[2]** రూ.చూ. లాహిరీ[2]. వి. ఒకవైపుకు మొనదేలిన గుర్తులు దగ్గర దగ్గరగా వరసగా వచ్చేట్టు నేసిన డిజైను.

**లాహిరంచు** రూ.చూ. లాహిరీ అంచు. వి. బాకు మొన ఆకారంలో డిజైన్లు పడేటట్లు నేసిన అంచు. <లాహిరి[2] + అంచు[3]. **లాహిరి బుగిడి** రూ.చూ. లాహిరీ బుగిడి. వి. అంచులో లాహిరీ బుగిడి వరసగా నేసిన డిజైను.

**లాహిరీ[1]** రూ.చూ. లాహిరి[1]. వి. 1. మైకం, మత్తు. రాజ. వి. 3.26 ; 2. మైకం కలగచేసే ద్రవ్యం.

**లాహిరీ మోదము** వి. గంజాయి పీల్చే పాత్ర.

**లాహిరీ[2]** రూ. లాయిరి, లాయిరీ, లాహిరి. వి. ఒకవైపుకు మొనదేలిన గుర్తులు దగ్గర దగ్గరగా వరసగా వచ్చేట్టు నేసిన డిజైను.

**లాహిరీఅంచు** రూ. లాయిరంచు, లాయిరీ అంచు, లాహిరంచు. వి. బాకు మొన ఆకారంలో డిజైన్లు పడేటట్లు నేసిన అంచు. **లాహిరీకోల** వి. ఒకరకం డిజైను నేతకోసం మగ్గానికి అమర్చిన కఱ్ఱ. **లాహిరీపేటంచు** రూ. లాయిరీ పేటంచు. వి. బాకు మొన ఆకారంలో డిజైన్లు పడేటట్లు నేసిన అంచు. **లాహిరీ బుగిడి** రూ. లాహిరి బుగిడి. వి. అంచులో లాహిరీ బుగిడి వరసగా నేసిన డిజైను. **లాహిరీ వడి** వి. అంచునేతలో లాయిరీ డిజైను పడేటట్లు అమర్చుకొన్న పేటువడి.

**లిక్కి** రూ. లుక్కి. వి. గడ్డి మొ. వాటిని కోసే చిన్నకొడవలి అల్పలవిత్రం. అష్టమ. క. 1.49పు. 20పం.

సం. లిఖ్. గీరు, తవ్వు, చీల్చు, లావక-. ఖండించేది, ముక్కలు చేసేది, చీల్చేది.

<సం. లిఖ్.

**లిక్కికిలిక్కిపెట్టు** అ.క్రి. ఒకదాని కొకటి తేలకుండా లంకెలు పెట్టి ఉంచు. **లిక్కికొడవలి** వి. గడ్డి కోయటానికి పైరుతో కలుపు తీయటానికి పనికొచ్చే కొడవలి, గడ్డి కోతటానికి వీలుగా వైఅంచుకు కూడా పదును గల కొడవలి. **లిక్కిపిట్ట** వి. పక్షివిశేషం.

**లిగాడ** రూ.చూ. లిగాడు. వి. అపనింద, చెడ్డపేరు.

**లిగాడి** రూ.చూ. లిగాడు. వి. 1. ఇబ్బంది ; 2. వివాదం ; 3. ఆపద.

**లిగాడు** రూ. లిగాడ, లిగాడి. వి. 1. తక్కువ ; 2. కీడ ; 3. అగౌరవం.

క. లిగాడు. కలవరపడే సంఘటన, కష్టం, సందిగ్ధత, నష్ట పరిహారం ;

మరా. లిగాడ.

**లిగుపు** వి. 1. లేది ; 2. మనస్సు ; 3. మూర్ఖుడు, మొరకు.

**లింకు** వి. 1. అచ్చు గుదులు తగిలించే వంకర ఇనపఊచ ; 2. భూమి కొలత, సెంటులో నూరోవంతు.

ఇం. *Link*. గొలుసులోని కొక్కెం. పొలం కొలిచే గొలుసులో నూరో వంతు.

<ఇం. Link.

**లింగకట్టు మాత్ర** వి. లింగాకారంగా చేసిన రసవస్తువుల గుళిక, కుప్పెకట్టు.

సం. లింగ-. పానవట్టం మీది శివమూర్తి.

<సం. లింగ- + కట్టు + మాత్ర (మిశ్రస.).

**లింగకాయ** వి. లింగధారులు లింగం నుంచి కట్టుకునే వెండి బంగారాలతో చేసిన సజ్జకాయ. శ్రీ. కృం. 38.

సం. లింగ-. పానవట్టం మీది శివమూర్తి.

<సం. లింగ- + కాయ (మిశ్రస.).

**లింగకుమ్మరివాళ్లు** విశే.బ.వ. కుమ్మర్లలో ఒకతెగ, లింగాయతులు.

సం. లింగ-. పానవట్టం మీది లింగమూర్తి.

<సం. లింగ- + కుమ్మరి + వారు + లు. (మిశ్రస.).

**లింగంకాయ** వి. 1. నాగవానం ; 2. గొంగడి మగ్గానికి వేసిన జంత్రంలో పైకట్టె.

సం. లింగ-. పానవట్టం మీది లింగమూర్తి.

<సం. లింగ- + -ము + కాయ.

**లింగడుకమ్మి** వి. 1 చీరకొంగులో మామూలుగా నేసిన పట్టె ; 2. పైట కొంగులో రెండంగుళాల వెడల్పు పట్టెకు రెండు వైపులా సన్నటి గీరలు, ఎడమవైపున అరంగుళం వరకు విడిచి తరవాత మూడు గీరలు పడేట్లు నేసిన కమ్మి.

సం. లింగ-. పానవట్టం మీది శివమూర్తి.

<సం. లింగ- + డు + కమ్మి.

**లింగఁడు** వి. జంగమయ్య. రాజవా. 2.124.

సం. లింగ-. పానవట్టం మీది లింగమూర్తి, లింగదేహం.

<సం. లింగ- + -ఁడు (అర్థవిపరి.).

**లింగదొండ** వి. లింగాకారంగా ఉండే కాయలుండే ఒకరకం దొండ (Bryonia laciniosa).

సం. లింగ-. పానవట్టం మీది లింగమూర్తి.

<సం. లింగ- + దొండ (మిశ్రస.).

**లింగపట్టె** వి. సన్నటి చూరు చెక్క.

సం. లింగ-. పానవట్టం మీది లింగమూర్తి.

<సం. లింగ- + పట్టె (మిశ్రస.).

**లింగపొట్ల** వి. లింగాకారం ఎక్కున్న ఒకజాత పొట్ల, లింగబీజ.

సం. లింగ-. పానవట్టం మీది లింగమూర్తి.

<సం. లింగ-+పొట్ల (మిశ్రమ.).

**లింగబలిజలు** వి.బ.వ. బలిజల్లో లింగాన్ని ధరించే వాళ్ళు.

సం. *లింగ-*. పానవట్టం మీది శివమూర్తి.

<సం. లింగ-+బలిజ+-లు (మిశ్రమ.).

**లింగబలిజ వాళ్లు** విశ.బ.వ. నేతపని చేసే దేవాంగుల దగ్గర అడుక్కునే ఒకజాతివారు. మెడలో లింగం ధరించే బలిజ వాళ్ళు.

సం . *లింగ-*. పానవట్టం మీది శివమూర్తి.

<సం. లింగ-+బలిజ+వారు+-లు. (మిశ్రమ.).

**లింగబలిజె** వి. లింగధారి అయిన బలిజవాడు. వేణు. శ. 69.

సం. *లింగ-*. పానవట్టం మీది శివమూర్తి.

<సం. లింగ-+బలిజె. (మిశ్రమ.).

**లింగభోగము** వి. లింగపూజ, పండి. చ. 1.1200.

సం. *లింగ-*. శివమూర్తి. *భోగ-*. భోజనం, సుఖ దుఃఖాదులఫలం.

<సం. లింగభోగ-. (అర్థవివరి.).

**లింగమటికుమ్మరి వాళ్ళు** రూ.చూ. లింగమంతికుమ్మరి వాళ్ళు· విశ.బ.వ. కుమ్మర్లలో ఒకతెగ, లింగాయితులు.

**లింగమంతికుమ్మరి వాళ్ళు** రూ. నింగమటి కుమ్మరివాళ్ళు, లింగ మటికుమ్మరి వాళ్ళు. విశ.బ.వ. కుమ్మర్లలో ఒకతెగ, లింగా యితులు.

**లింగమయ్య** వి. ఒకగ్రామ దేవత.

సం. *లింగ-*. పానవట్టం మీది శివమూర్తి.

<సం. లింగ-+-ము+అయ్య.

**లింగము** వి. కల్లులొట్టి.

సం *లింగ-*. పానవట్టం మీది శివమూర్తి.

<సం. లింగ- (అర్థవివరి.).

**లింగంబావి** వి. దిగుడు బావి, నీళ్ళ కోసం దిగటానికి మెట్లు పెట్టిన బావి.

సం. *లింగ-*. పానవట్టం మీది. లింగమూర్తి.

<సం. లింగ-+-ము+బావి.

**లింగరాజు** వి. కూకటి మూగపిట్ట, భృంగం, భృంగరాజు పిట్ట. ఆం.శా. 2.97.

సం. *లింగ-*. పానవట్టం మీది శివమూర్తి.

<సం. లింగ-+రాజు. (మిశ్రమ.).

**లింగరాయి** వి. 1. గుబ్బగద్ద, భూమిలో పాతిన రాతిదిమ్మ సారెను సులువుగా తిప్పటానికి ఉపయోగపడే రాతిదిమ్మ ; 2. సుద్దరాయి.

సం. *లింగ-*. శివలింగం.

<సం. లింగ-+రాయి. (మిశ్రమ.).

**లింగార్చనముచెల్లించు** స.క్రి. భుజించు. హర. 5.41.

సం. *లింగార్చన-*. శివపూజ.

<సం. లింగార్చన-+-ము+చెల్లించు.

**లింగాలమండపం** వి. చిటికెనేతలో నేసిన ఒకరకం అంచు డిజైను.

సం. *లింగ-*. పానవట్టంమీది శివమూర్తి, *మండప-*. వేదిక.

<సం. లింగ-+-ము+లు+-అ[7]+సం. మండప-+-ము. (అర్థవివరి.).

**లింగాలు** వి.బ.వ. 1. జాతర్లలో ఉపయోగించే చిన్నమట్టి పిడతలు ; 2. బాలెంత నీళ్ళకు వెళ్ళిన రోజున చేదబావి గట్టుమీదపెట్టి పసుపు కుంకాలతో అలంకరించి నవ ధాన్యాలుపోసి ధూపంవేసే అయిదు లేక తొమ్మిదిరాళ్ళు ; 3. బాలెంత ఊరుదాటి వెళ్ళేటప్పుడు ఒకఊరి పొలిమేర దగ్గరపెట్టి పూజించేరాళ్ళు.

సం. *లింగ-*. పానవట్టంమీది శివమూర్తి.

<సం. లింగ-+-ము+-లు (అర్థవివరి.).

**లింగావసరము** వి. లింగపూజ, తద్ద్వారా తదనంతర క్రియయైన భోజనం. బసవ. 5.132.

సం. *లింగావసర-*. లింగపూజ.

<సం. లింగావసర-. (అర్థవివరి.).

**లింగావసరముచెల్లించు** అ.క్రి. లింగపూజచేయు.

**లింగాస్త్రం** రూ.చూ. లింగోస్త్రం· వి. చిన్న అంగవస్త్రం.

**లింగులింగడు** వి ఇద్దరాడవాళ్ళ భర్త.

సం. *లింగిన్*. చిహ్నంకలది, శివలింగధారి, *లింగ-*. శివమూర్తి.

<సం. లింగన్+లింగ-+-డు. (అర్థవివరి.).

**లింగులింగుమని** అవ్య. ఆర్భాటం లేకుండా. ధ్వన్యను.

**లింగులిటుకులు** వి.బ.వ. హెచ్చులు. వేంక. ఆం. 3.162.

**లింగైక్యముచెందు** అ.క్రి. మరణించు, శివసాన్నిధ్యం చెందు.

సం. *లింగైక్య-*. శివునిలో కలిసిపోవటం.

<సం. లింగైక్య-+-ము+చెందు (అర్థవివరి.).

**లింగోస్త్రం** రూ. లింగాస్త్రం. వి. లింగ బలిజలు కట్టుకొనే ఒక రకంబట్ట.

సం. *లింగవస్త్ర-*. శివలింగంపై ఉంచే వస్త్రం.

<సం. లింగవస్త్ర-(అర్థవివరి.).

**లిచ్చెవ** రూ.చూ. నిచ్చెన. వి. ఎత్తుగాఉన్న వస్తువులను, తావులను, అందుకోవటానికి పనికివచ్చే పరికరం.

**లిటాకు** వి. కసె. తలకొమ్మ గిల్లిన తరువాతపుట్టే చిగురు.

**లిటాకువేయు** అ.క్రి. చిగురువేయు.

**లిట్రిన్‌వొర** రూ. రిటన్‌వొర, లెటన్‌వొర. వి. లెట్రిన్ దొడ్లకు ఉపయోగించే ఒర, పాయకానోర.

ఇం. *Latrine*, పాయికానా.

<ఇం. Latrine+ఒర.

**లిదక** రూ. లిడికి. వి. తుడుము, వాయిద్యానికి వాడే చిన్న కుండ, ఉదక.

**లిడికి** రూ.చూ. లిదక. వి తుడుము, వాయిద్యానికివాడే చిన్న కుండ.

**లిత్తి** వి. 1. నష్టం ; 2. ఆపద, 3. చిక్కు.

**లిద్ది** వి. 1. దంచటంతో మిక్కిలి లోతుపడిన మ్రాని రోటిని కట్టే గూటం. ద్వి. భాగ. 10 ; 2. బండి చక్రంలో ఉల వాయి వదులైనప్పుడు కుండమధ్యన చచ్చౌకంగా కన్నం పెట్టి కొయ్యముక్క అందులోగట్టిగా బిగించి మళ్ళా ఇరుసుకు రంధ్రం చేసేది ; 3. గట్టిప్రతిక్రియ చేయటం ;

4. పడిసెంతో ఊపిరిరాక ముక్కు అడచుకోవటం.
ప్రా. లిద్ధో, లిద్దా. ముద్ద, రాశి.
< ప్రా. లిద్దా.

**లిఫాపా** వి. కవరు.
హిం. ఉ. మరా. లిఫాఫా. కవరు ; అర. లిఫాఫ. కవరు, ఉత్తరాలుపంపే సాధన.
< ఉ. లిఫాఫా.

**లిబ్బి** వి. 1. నిధి. ఘటికా. 1.19 ; 2. రాశి, కుప్ప. హంస. 3.21 ; 3. ధనం. బహుళా. 1 20, శశా. 4 71.
సం. లిబీ-. లిపి-, రాత.
**లిబ్బిగుబ్బెత** వి. లక్ష్మీదేవి. అచ్చ. రా. యు. 592. **లిబ్బిదొర** వి. కుబేరుడు. అచ్చ. రా. యు. 474. **లిబ్బిదొరచెలి** వి. శివుడు, కుబేరమిత్రుడు. **లిబ్బిదొరచెలికాఁడు** వి. శివుడు, కుబేరుని స్నేహితుడు. **లిబ్బినెలఁత** రూ. లిబ్బినెలఁతుక. వి. లక్ష్మి, ధనాధిదేవత. **లిబ్బినెలఁతుక** రూ.చూ. లిబ్బినెలఁత. వి. లక్ష్మి. **లిబ్బిపడఁతి** రూ. లిబ్బిపడఁతుక. వి. లక్ష్మి. **లిబ్బిపడఁతుక** రూ.చూ. లిబ్బిపడఁతి. వి. లక్ష్మీదేవి. **లిబ్బిరాయఁడు** వి. కుబేరుడు, ధనాధిపతి. **లిబ్బులచాయ** వి. లక్ష్మీదేవి. అచ్చ.రా. యు. 19. **లిబ్బులజవరాలు** వి. లక్ష్మి. లాజవా. 1.71. **లిబ్బులమేటి** వి. కుబేరుడు.

**లిబ్బులచాయ** చూ. లిబ్బి.
**లిబ్బులజవరాలు** చూ. లిబ్బి.
**లిబ్బులమేటి** చూ. లిబ్బి.

**లిమింటు** వి. ఆవుదల.
ఇం. *Limit* హద్దు, మేర.
< ఇం. Limit.

**లిమ్మ** రూ.చూ. రెమ్మ. వి. మాంసాదులమీద మునురుకొనే ఈగల్నితోలే రెమ్మ, మండ. చెన్నబసవ. 4.338.

**లిమ్మిటీవడ్లు** వి.బ.వ. ఎం.టి.యు. (మాట్రేరూ) నెంబరు వడ్లు.

**లియాలు** వి.బ.వ. పేలాలు, నెయ్యిలు.
ఒ. లియా. పేలాలు.
< ఒ. లియా + -లు.

**లియ్యము** రూ.చూ. నెయ్యము. వి. 1. ఒద్దిక. కు. సం. 11.54 ; 2. ఐక్యం, మిక్కిలికలియటం. శృం. నై. 1.75 ; విశే. మిక్కిలి కలిసినది, లీనం. శృం. నై. 6.75.

**లిల్లికవ్వ** వి. తూటిపువ్వురంగు, ఒకరకం లేత ఎరుపురంగు.
ఇం. *Lily.* ఒకరకం పువ్వు.

**లివ** వి. 1. అతిశయం. భీమ. 3.57 ; 2. లాఘవం. బహు. 2.29, కళా. 3.79 ; 3. మల్లబంధవిశేషం. మల్లువ. 3.69 ; 4. శక్తి.
**లివచూపు** స.క్రి. లంఘన. లంఘవం ప్రదర్శించు. కళా. 3.86.

**లివరు** వి. మరనాడె గాడిలో ముల్లుకు గుచ్చిన కొయ్యకండె ఊచ ఊడిపోకుండా బిగించిన ఇత్తడిరేకు.
ఇం. *Lever.* మీట. ఒరువుల్ని మీటించే కొయ.
< ఇం. Lever.

**లివలివ** వి. 1. అడుగువేయటంలో అయ్యేధ్వనికి అనుకరణం. సుద. 2.124 ; 2. కదలటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. ద్వి. పరమ. వి. 2.56.
**లివలివకదలు** అ.క్రి. కదలటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. కవిక. 5.110. **లివలివలాడు** అ.క్రి. దంతాలు కదులు.
< లివలివ + -లు + ఆడు.

**లిసురు** వి. కుప్పనూర్చే ఎడ్లబండిలో చివరి ఎద్దు.

**లిస్టు** రూ. లీస్టు. వి. జాబితా.
ఇం. *List*. జాబితా.
< ఇం. List.

**లీగు** వి. నడుం. ఆం. భా. 2.138.

**లీడలికోరికె** వి. తృణవిశేషం. హంస. 5.44.

**లీబలు** వి.బ.వ. ధాన్యంలో సన్నటి చచ్చుగింజలు, పొల్లువడ్లు.

**లీయము** రూ.చూ. నెయ్యము. విశే. కలిసినది, నక్తం. ద్వి. పరమ. వి. 1.11 ; వి. ఐక్యం. మిక్కిలి కలియటం.

**లీయె** వి. పూగఖండం, వక్క. ఆం. పవా. 6.68.

**లీల** వి. అస్ఫుటత.
సం. లీలా. ఆట, సౌలభ్యం, ఆకారం, పోలిక.
< సం. లీలా (అర్థవిపరి.).

**లీలజాలము** వి. సులభంగా చేసిన పని.
సం. లీలా. ఆట, సౌలభ్యం, ఆకారం, పోలిక. జాల-, ఇంద్రజాలం, వల, సమూహం.
< సం. లీలా + జాల - (అర్థవిపరి.).

**లీలావతి** వి. ఒకరకం వచ్చరంగుచిర, సరస్వతిపచ్చ.
సం. లీలావతీ. చక్కదనంగలస్త్రీ, కాముకురాలు, దుర్గ.
< సం. లీలావతీ (అర్థవిపరి.).
**లీలావతిచీర** వి. ఒకరకం పచ్చరంగుచీర, సరస్వతిపచ్చ మాదిరి చీర.

**లీస్టు** రూ.చూ. లిస్టు. వి. జాబితా, పట్టిక, పట్టీ.

**లీస్తు** వి. పట్టిక, జాబితా.
ఇం. లిస్ట్ ; పో. లీష్త ; ఫ్రె. లిస్ట్ ; స్పా. లిస్త. డ. లియస్ట్.
< పో. లీష్త.

**-లు** రూ. ల్, ళ్, ళు. ప్రత్య. ప్రథమాబహువచన ప్రత్యయం. ఎఱ్ఱగుడిపాడుశిలాశాసనం. క్రీ.శ. 575, భార. ఆది. 1.2. ఉ. గోవులు, వనములు మొ. వి.
తు. -ళు. బహువచన ప్రత్యయం : పర్జి. -ల్, -ఉల్, -ఇల్ ; కొలా. -ల్, -ఊల్ ; నా. -ల్ ; గ. -ఇల్, ఉల్.
< మూ.ద్రా. *-ళ్.

**లుక** రూ.చూ. లుక్కు. వి. అశ్వనీచగతి.
**లుకచెడు** అ.క్రి. పూర్తిగాచెడు.

**లుకలుక** వి. పురుగులు దొలచటం కదలటం మొ. వాటిలో అయ్యేధ్వనికి అనుకరణం.
**లుకలుకమను** అ.క్రి. తడబడు. < లుకలుక + అను.

బిగించే రాయి, అలరాయి.

హిం. లోఢా. పాత్రం.

**లోడి** రూ. లోడీ², లోడు2. వి. మల్లవిద్యాసాధనం. రాజవా 2.27.

నం. లగుడ-.క్ర ; ప్రా. లకుడ-.

**లోడీ¹** వి. వస్త్రవిశేషం. హంస. 5 356.

**లోడీ²** రూ.చూ. లోడి. వి. మల్లవిద్యాసాధనం.

**లోడు¹** వి. ఉపధానం, ఒరగుదిండు. తలగడ. రాధికా. 2.13.

మరా. లోడ-. పొడుగ్గా ఉండే ఉపధానం ;

క. లోడు-. ఒరగుదిండు.

<మరా. లోడ.

**లోడు²** రూ.చూ. లోడి. వి. మల్లవిద్యాసాధనం.

**లోడు³** వి. బరువు.

ఇం. *Load* బరువు.

<ఇం. Load.

**లోడుకొమ్మ** చూ. లోఁడు. వి. మొదలు నరికి వేలాడేకొమ్మ.

**లోడేయు** చూ. లోఁడు. స.క్రి. మట్టిని గుంటనుంచి పైకితోడు.

**లోఁడు** స.క్రి. ద్రవపదార్థాన్ని చేయి మొ. వాటితో కలియబెట్టు.

సం. లోడన-. క్షోభించటం, కలతపొందటం.

<సం. లోడన-.

**లోది** వి. మహమ్మదీయుడు. విశ్వ. శ. 53.

ఉ. పార. లోదీ. పఠానుల్లో ఒకజాతి.

<ఉ. లోదీ.

**లోద్దాక** రూ. లోఁతుదాక. వి. నిలువుగా లోతెక్కువగాఉండి పొట్టలేని మట్టిపాత్ర,

**లోన్** రూ.చూ. లోన. క్రి. విణ. ద్రు. 1. లోపల. ద.హిం. శా. సంపు. 4. శా.సం. 1008. క్రి.శ. 1047 ; 2. మనస్సులో. భార. ఆది. 1 26.

**లోవిది** విణ. పూర్వపుది, మునుపటిది.

**లోన** రూ. ఒళన. లో¹. లోన్, శోన. క్రి. విణ. ద్రు. లోపల ద. హిం. శా. సంపు. 10.శా.సం. 3. క్రి.శ. 850.

క. ఉళ్, ఒళ్. లోపల ; తు. ఉళ్ ; త. ఉళ్. ఉళ్ళమ్ ; మ. ఉళ్ళు, ఒళ్ ; గోం. లొన్, లోపా : కుయి. లై ; కొలా. లోపల్ : నా. లోప ; కురు. ఉళా ; మాల్తొ. ఉలె ; బ్రా. ఉరా.

మూ. ద్రా. *ఉళ్-/ *ఒళ్-.

<మూ.ద్రా. *ఉళ్.

లోనలొటారము వి. అంతస్సారంలేనిది. శుక. 3.161.

**లోనగు** చూ. లోను.

**లోనంగల్ల** వి. లోపలిభాగం.

**లోని** చూ. లోను.

**లోనిచూపు** చూ. లోను.

**లోనిచ్చు** చూ. లోను.

**లోనిల్లు** చూ. లోను.

**లోను** చూ. లోన. రూ. లో². వి. ఔ, అనౌ. 1. లోపల అంతర్భాగం. మధ్యం. భార. ఆది. 3.110 ; 2. మనసు అంతఃకరణం. ఉ. హరి. 1.59 ; 3. లోకువ, రాజవా. 4.124 ; విణ. 1. అధీనం. లొంగినది, నిర్వ. రా. 9.27 ; 2. ఆనమయంలో. భార. విరా. 3.169 ; 3. ఆది, మొదలు. భార. శాంతి. 4.219 ; 4. అంతలోపల. ఆము. 6.85.

**లోఁగద** వి. 1. అంతరాళం, దేశాల, కాలాల మధ్య భాగం. ఆము. 3.17 ; 2. గతకాలం. <లోను+కద. **లోఁగన్ను** వి. అంతర్దృష్టి. కాశీ. 2.44. <లోను+కన్ను. **లోఁగయి** వి. అరచేయి. <లోను+కయి. **లోఁగా** అవ్య. ద్రు. ఈలోపల, కిందట. **లోఁగొను(-కొను)** స.క్రి. 1. వశపరచుకొను. కు. సం. 1.4 ; 2. లోపలికి తీసుకొను. భాస్క. రా.యు. 529 ; 3. క్షమించు, సైరించు. భార. అరణ్య. 6.209 ; 4. ఆత్మీయునిగా తలచు. గౌ. హరి. పూ. 1300పం. **లోఁజెయి** రూ.చూ. లోఁజేయి. వి. అరచేయి. **లోఁజెయ్యి** రూ.చూ. లోఁజేయి. వి. అరచేయి. ఆం. నా. సం. మాన. 21. **లోఁజే** రూ. లోఁజేయి. వి. 1. న్యూనత్వం. తక్కువతనం. వాల్మీ. 3.44 ; 2. అరచేయి. **లోఁజేయి** రూ. లోఁజెయి, లోఁజెయ్యి, లోఁజే. వి. 1. అరచేయి. రుక్మా. చ. 2.14 ; 2. న్యూనత్వం, తక్కువభాగం. <లోను+చేయి. **లోఁజేయు** స.క్రి. 1. అంతరంగికునిగాచేయు. ఆము. 4.260 ; 2. వశపరచుకొను. విజయ. 1.16. <లోను+చేయు. **లోనగు** అ.క్రి. 1. మొదలగు. భార. ద్రోణ. 5.57 ; 2. లోబడు ; 3. గురి అగు. <లోను+అగు. **లోని** విణ. లోపలనున్న. ద. హిం.శా. సంపు. 10. శా. సం. 646. క్రి. శ. 1062. **లోనిచూపు** వి. అంతర్దృష్టి. పాండు. 4.76. <లోను+-ఇ³+చూపు. **లోనిచ్చు** అ.క్రి. గుట్టుచెప్పు. కళా. 8.200. <లోను+ఇచ్చు. **లోనిల్లు** వి. లోపలిఇల్లు. తాళ్ల. సం. 14.220. <లోను+ఇల్లు. **లోనుగఁజేయు(-చేయు)** స.క్రి. లోబర్చు, వశంచేయు. కళా. 7.226. **లోనుగా** క్రి.విణ. ద్రు. మొదలుగా. **లోనుచేయు** రూ.చూ. లోనుసేయు. స.క్రి. వశపరచు, లోబరుచు. **లోనుపడు** అ.క్రి. వశమగు. వాల్మీ. 1.100. **లోనుపఱచు** రూ.చూ. లోనుపఱుచు. స.క్రి. లోపడేటట్లు చేయు, వశపర్చు. వరాహ. 4.23. **లోనుపఱుచు** రూ. లోనుపఱచు. స.క్రి. లోపడేటట్లుచేయు, వశపర్చు. భార. విరా. 1.329. **లోనుసేయు(-చేయు)** రూ. లోనుచేయు. స.క్రి. వశవర్తినిచేయు. భార. సౌప్తి. 1.215. **లోఁదప్పు** వి. వ్యభిచారం. <లోను+తప్పు. **లోఁబట్టు** వి. లోపలిభాగం, అంతర్భాగం. భీమ. 4.64 <లోను+పట్టు¹. **లోఁబడు** అ.క్రి. 1. వశమగు, అధీనమగు. కు.సం. 4.9 ; 2. అడగు, కుంగు. శివరా. 1.64 ; 3. హీనస్థితి నొందు, దైన్యమొందు. వరాహ. 10.30 ; 4. లాలూచీ పడు ; 5. ఉన్నసరుకు చాలావరకూ అమ్ముడుపోవు. <లోను+పడు. **లోఁబఱచుకొను** అ.క్రి. స్వాధీనపరచుకొను. **లోఁబులుముతెగులు** వి. విసర్పకవ్యాధి. <లోను+పులుము+తెగులు. **లోఁబుల్ల** వి. చిరత, ఎద్దులు పూన్చిన బండి కాడిలోవైపునున్న బెజ్జంలో వేసిన కొయ్యముక్క.

<లోను+పల్ల. లోఁబొదుగు వి. పైభాగం చిన్నదిగా ఉండి చన్నులు పొడుగ్గా ఉండేవి. <లోను+పొదుగు.

**లోఁతటికి** చూ. లోఁతు.

**లోఁతిఁడి** చూ. లోఁతు.

**లోఁతు** చూ. లోన వి. **1.** గాంభీర్యం, గుట్టు. పండి. చ. 1.82 ; **2.** అగాధత్వం, నిమ్నత. వరాహ. 1.32. **3.** మేడమీద కప్పులేని భాగం : విశ. **1.** పల్లం, నిమ్నం. కాశీ. 6.41 ; **2.** గంభీరం, గూఢం. కకుత్స్థ. 5.185.

**లోఁతటికి** వి. నిలువుగా లోతెక్కువగా ఉండి పొట్టలేని మట్టిపాత్ర. **లోఁతిఁడి** విశ. లోతులేనిది. <లోఁతు+-ఇఁడి. **లోఁతుదాక** రూ. లోద్దాక. వి. నిలువుగా లోతెక్కువగా ఉండి పొట్టలేని మట్టిపాత్ర. **లోఁతుపాతు** వి. గుట్టు. **లోఁతుసున్ని** వి. గుబ్బిరాయిలో కొంతలోతుగా పెట్టిన రంధ్రం.

**లోఁదప్పు** చూ. లోను.

**లోపల** చూ. లోన. ప్రత్య. ద్రు. **1.** నిర్ధారణషష్ఠిలో బహువచన ప్రత్యయం. భార. శాంతి. 5.406 ; **2.** అధికరణార్థకం, అందు. జైమినిభా. 4.6 ; వి. **1.** అంతర్భాగం. కాశీ. 1.117 ; **2.** మనసు, అంతఃకరణం. ఆము. 3.15. **3.** అంతఃపురం, అవరోధం. దశా. 2.51.

**లోపలి** విశ. లోనున్న. దొంగలసాని కాననం. క్రీ.శ. 991. **లోపలికొంగు** వి. చీర కట్టుకొనేటప్పుడు లోపల నడుముకు చుట్టుకొనే చెరగు.

**లోపలి** చూ. లోపల.

**లోపలికొంగు** చూ. లోపల.

**లోపాయకారి** రూ. లోపాయకారీ, లోపాయికారి. విశ. రహస్యంగా ఒకపక్షంలో ఉన్న ; వి. **1.** లాలూచీ ; **2.** శత్రువుకు రహస్యంగా సహాయపడటం ; **3.** భూమిని కౌలుకు తీసుకునే వానిదగ్గరనుండి మారు కౌలుకు తీసుకునేవాడు.

**లోపాయకారీ** రూ.చూ. లోపాయకారి. వి **1** పైఊళ్ళో ఉన్న ఆసామి దగ్గర కౌలుకు తీసుకున్నభూమిని తనసొంత పూచీ మీద మరొకరిచేత సేద్యం చేయించే పద్ధతి ; **2.** లాలూచీ.

**లోపాయికారి** రూ.చూ. లోపాయకారి. వి. **1.** రహస్యంగా ఒకరిపక్షం ఉన్నవాడు ; **2.** లాలూచీ.

**లోపు** విశ. స్వీయం, తనది. కు.సం. 4.18 ; అ.క్రి. **1.** పొట్టలో తిప్పినట్లగు ; **2.** కుండలోని ద్రవపదార్థాన్ని కలియబెట్టు.

**లోపుసట్టి** వి సారాయి తయారీలో నిలువుగూనపై పెట్టి దానిమీద పెట్టే సట్టి. బొక్కదాక. **లోపుసేయు(-చేయు)** స.క్రి. లోబరచు. కు.సం. 5.35.

**లోఫ్యాలు** రూ చూ. లోభ్యాలు. వి.బ.వ. ఒకరకం వడ్లు.

**లోబంటరి** రూ.చూ. రోబంటరి. వి. అడవిపంది.

**లోబాయిపట్టు** రూ.చూ. లోవాయిపట్టు. వి. అంచుకు, పెంజకు మధ్యగాడి ఏర్పరచటానికి పట్టేపట్టు. ఎడమచేతివేళ్ళు అంచు లోపల మోపుచేసి కుడిచేతి బొటనవేలుతో పట్టేపట్టు.

**లోబియాలు** రూ.చూ. లోభ్యాలు. వి.బ.వ. ఒకరకం వడ్లు.

**లోభ్యాలు** రూ. లోఫ్యాలు, లోబియాలు. వి.బ.వ. వడ్లలో ఒకరకం.

**లోఁబట్టు** చూ. లోను.

**లోఁబడు** చూ. లోను.

**లోఁబఱచుకొను** చూ. లోను.

**లోఁబులుముతెగులు** చూ. లోను.

**లోఁబుల్ల** చూ. లోను

**లోఁబొదుగు** చూ. లోను.

**లోయ** రూ. లొయ్య. లోవ. వి. **1.** సొరియ, రెండుకొండల మధ్యభాగం. నిర్వ.రా. 4.76 , **2.** ప్రదేశం. ప్రబంధ. 45. క. లోవె. ఇంటికప్పు చట్రం.

**లోయికుండ** రూ.చూ. లోవికుండ. వి. అన్నం వండుకొనే మట్టిపాత్ర.

**లోయు** అ.క్రి. కొండ మొ. వి. చీలు.

**లోరల్** రూ.చూ. రోలరు. వి. **1.** మగ్గంమీద అచ్చుతాళ్ళు తగిలించిన రోకటివంటి గుండ్రటి కర్ర ; **2.** ఒకరకం దోనె, రోలరుమగ్గంలో నేత గుడ్డచుట్టే గుండ్రటి దూలం ; **3.** డాబీలో అడ్డంగా బిగించిన కొయ్య గుండు ; **4.** మగ్గం చివర పడుగునూలు చుట్టే కొయ్యదూలం.

**లోలక** రూ.చూ. లోలగ. వి. ఒకరకం కంచెమొక్క, సువాసనగల తెల్లటిపూలు లేత ఎరుపురంగు కర్రగల మొక్క.

**లోలకం** రూ. లోలాకు. వి. చెవికి ధరించే వేలాడే నగ.

ఉ. లోలక్. చెవికిధరించే నగ ;

త. లోలక్కు. చెవికి ధరించే వేలాడే నగ.

<ఉ. లోలక్.

**లోలకుపేటు** రూ. లోలకు ప్లేటు. వి. అంచులో చెవి లోలకుల మాదిరి నేసిన ఒకరకం డిజైను. **లోలకుప్లేటు** రూ.చూ. లోలకు పేటు. వి. అంచులో చెవి లోలకుల మాదిరి నేసిన ఒకరకం డిజైను. **లోలకులంచు** వి. చెవి లోలకు మాదిరి డిజైను పెట్టి నేసిన అంచు. **లోలకులబేటు** రూ. లోలోకుల బేటు. వి. చెవి లోలకు మాదిరి నేత డిజైను.

**లోలక్కులు** చూ. లోలకు. వి.బ.వ. వేలాడినట్లుండే చెవి ఆభరణాలు.

**లోలగ** రూ. లోలక. వి. ఒకరకం కంచెమొక్క, సువాసనగల తెల్లటిపూలు, లేత ఎరుపురంగు కర్రగల మొక్క (Pterospermum suberifolium).

**లోలర్** రూ.చూ. లోలరు. వి. **1.** మగ్గంమీద అచ్చుతాళ్ళు తగిలించిన రోకటివంటి గుండ్రటి కర్ర ; **2.** ఒకరకం దోనె, రోలరుమగ్గంలో నేతగుడ్డచుట్టే గుండ్రటి దూలం ; **3.** డాబీలో అడ్డంగా బిగించిన కొయ్యగుండు ; **4.** మగ్గం చివర పడుగు నూలుచుట్టే కొయ్యదూలం.

**లోలరు** రూ.చూ. రోలరు. వి. **1.** మగ్గమీద అచ్చుతాళ్ళు తగిలించిన రోకలిలాంటి గుండ్రటి పొడుగుకర్ర ; **2.** ఒకరకం దోనె, రోలరుమగ్గంలో నేతగుడ్డచుట్టే గుండ్రటి దూలం ; **3.** డాబీలో అడ్డంగా బిగించిన కొయ్యగుండు ; **4.** మగ్గం చివర పడుగు నూలుచుట్టే కొయ్యదూలం.

**లోలరుకమ్మి** రూ.చూ. రోలరుకమ్మి. వి. **1.** మరమగ్గంలో పన్నె బిగించిన కండికొయ్య ; **2.** మరమగ్గం

చట్రంలో కిందిపట్టె. లోలరుకాడు రూ.చూ. రూలరుకాడు. వి. పల్లిరుసుకు వేసిన అచ్చు సూత్రం.

**లోలా** వి. వేలాడే బిళ్ళ.

హిం. లోలా. పెండెంటు, చెవికమ్మ, లక్ష్మి, సంగీతంలో ఒకరాగం.

<హిం. లోలా.

**లోలాకు** రూ.చూ. లోలకు. వి. చెవికి ధరించే వేలాడే నగ.

**లోలాయపడు** చూ. లోలాయము.

**లోలాయము** వి. **1**. శ్రమ; **2**. బడలిక.

సం. లోలాయ (మాన)-. చలిస్తున్న.

<సం. లోలాయ (మాన)-(అర్థవిపరి.).

**లోలాయపడు** అ.క్రి. **1**. శ్రమపడు; **2**. పనీపాటు లేకుండా తిరుగు, సోమరిగా తిరుగు. **లొలాయు(డు** వి. శ్రమ పడేవాడు.

**లోలాయి** చూ. లోలాయు(డు. వి. తార్పుడుకాడు.

**లోలాయు(డు** చూ. లోలాయము.

**లోలుగు** వి. ముచుకుంద వృక్షం.

**లోలుపడు** అ.క్రి. కష్టపడు.

సం. లోలా. చలించేది, కదిలేది.

<సం. లోలా+పడు.

**లోలొంకి** వి. మల్లబంధ విశేషం.

**లోలోకులబేలు** రూ.చూ. లోలకులబేలు. వి. చెవిలోలకు మాదిరి నేత డిజైను.

**లోవ** రూ.చూ. లోయ. వి. **1**. లోయ, రెండుకొండల మధ్య భాగం. గౌ. హరి. పూ. 619 పం.; **2**. రథపీఠంమీది చట్టపుఅంచు. వసు. 1.144; **3**. చూరు. విజయ. 3.189.

**లోవంచు** వి. రెంకంచులుండి వెనకభాగంలో బొద్దుకు పెద చీరి లోనికి పెట్టిన అంచు. **లోవరి** వి. **1**. తొట్టికట్టు, కక్ష్య; **2**. ముంగిలి; **3**. అంతస్తు. <లోవ+-అరి.

**లోవకారం** రూ.చూ. రవకారము. వి. రాళ్ళసందుల్లో నీళ్ళు చల్లి సున్నం రుద్దటం.

**లోవి** వి. **1**. వంటకుండ, స్థాలి. బసవ. 3.427; **2**. నీళ్ళు తెచ్చుకొనే కుండ; **3**. బిందె.

సం. లౌహీ. లోహనిర్మితమైన భాజన విశేషం; ప్రా. లోహీ. లోహమయపాత్ర.

<ప్రా. లోహీ.

**లోవికుండ** రూ. లోయికుండ. వి. అన్నం వండుకొనే మట్టిపాత్ర.

**లోవిడి** చూ లోన్.

**లోవు** రూ.చూ. లోగు. అ.క్రి. వెనుదీయు. గౌ.హరి.పూ. 920 పం.

**లోహండి** వి. వంటచేసే పాత్ర, స్థాలి. కాశీ. 3.121.

సం. లోహభాండ-. లోహపాత్ర; ప్రా. లోహం భండ-.

<ప్రా. లోహభండ-.

**లోహితలు** వి.బ.వ. ఒకరకం ఎర్రవడ్లు.

సం. లోహిత-. ఎర్రని, ఎరుపురంగుగల.

<సం. లోహిత-+-లు (అర్థవిపరి.).

**లౌకికులు** వి.బ.వ. లోకంలోనివారు, సామాన్యులు.

సం. లౌకిక-. అందరికీ తెలిసినవాడు, లోకానికి మేలు చేసేవాడు.

<సం. లౌకిక-+-లు (అర్థవిపరి.).

**లౌక్యము** విణ. తెలివైన; వి. తెలివి.

సం. లౌక్య-. ప్రపంచ సంబంధమైన, సామాన్యమైన.

<సం. లౌక్య- (అర్థవిపరి.).

**లోడి** రూ.చూ. లౌడి. వి. పరిఘ, ఒకానొక ఆయుధం. ప్రబంధ. 78.

**లోడి** రూ. లవుడి, లవుడి, లౌడి. వి. పరిఘ. రం.రా.యు. 288పు. 12పం.

**లౌనసు** రూ.చూ. లవనసు. వి. జీవనార్థం ఇచ్చే సొమ్ము.

**ల్యాగ** వి. వదులు. ఖడ్గ. 48.

## ళ

**-ళ్** రూ.చూ.-. లు. ప్రత్య. బహువచన ద్యోతక ప్రత్యయం. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 599. క్రీ.శ. 625.650.

**ళ** వి. మూర్ధన్య పార్శ్విక నాదవర్ణం.

**-ళు** రూ.చూ-లు ప్రత్య. బహువచన ద్యోతక ప్రత్యయం. ఎర్రగుడి పాడుశిలాశాసనం. క్రీ.శ. 575-600.

**ళోన** రూ.చూ. లోన. అవ్య. లోపల. ద.హిం.శా. సంపు. 10. శా. సం. 623. క్రీ.శ. 9/10 శతాబ్ది.

# ఱ

ఱ వి. మూర్ధన్య పార్శ్విక నాదవర్ణం.

**ఱచ్చు** రూ. అడియు, అఱియు. స.క్రి. ధ్వంసంచేయు. మాలె పాడు శాసనం. క్రీ.శ. 600-625.

క. అఱ ; తు. అళ్యని ; త. అఱ ; మ. అఱియుక.

<మూ. ద్రా. *అఱ్.

**ఱయ్యు** చూ. డయ్యు. ఱచ్చు. అ.క్రి. అలసిపోవు, అఱియు. డయ్యుల సమ్మిశ్రిత శబ్దరూపం.

# వ

వ వి. ప్రాచీనాంధ్రంలో ఇది ఉభయోష్ఠ్యాంతస్థ నాదవర్ణం. నేటి తెలుగులో రాయలసీమలో ఈ ఉచ్చారణ ఇట్లే ఉండగా మిగిలిన ప్రాంతాల్లో దంత్యోష్ఠ్యాంతస్థ నాద వర్ణంగా ఉంది. ఉ, ఊ, ఒ, ఓలతో మొదలయ్యే పదాలకు ముందు 'వ' కారం అర్థభేదక సామర్థ్యం లేకుండా వస్తుంది.

**వకట్టి** రూ.చూ. ఒక్కటి. సర్వ. ఒకటి. శ్రీనాథుని పొన్ను. శా. 2.

**వకవ** వి. చిన్నముళ్ళు, తెల్లనిపూలు, పచ్చటిపళ్ళు కలిగి, దక్కను, కర్ణాటక అడవుల్లో పెరిగే ఒకరకం చెట్టు (Diospyroscordifo'ia).

**వకల్తు** రూ.చూ. వకాలతు. వి. వకీలుయొక్క పని.

**వకవకలగు** చూ. వకవకలు.

**వకవకలు** రూ.చూ. పికపికలు. వి.బ.వ. **1.** చెదరడాలు. భాగ. 3.285 ; **2.** బద్దలు, ముక్కలు. ధర్మ. 1ఆ.

**వకవకలగు** అ.క్రి. చెల్లాచెదరగు. పరమ. 4.829

<వకవకలు + అగు.

**వకారుఁడు** విణ. వగ్గు, చాలాముసలి. హంస. 3.208 "నామైకదేశగ్రహణే నామగ్రహణమ్" అనే పద్ధతి ప్రకారం 'వగ్గు'ను వకారుడనటం జరిగింది.

**వకాలతు** రూ. వకల్తు, వకాల్తీ. వి. న్యాయవాది, వకీలు వేణు. శ. 46, రంగా. చ. 2.88.

హిం. వకాలత్. వాదం, కోర్టులో వకీలుచేసే పని ; మరా. వకాలత్. అభిభాషణం ; ఉ. వకాలత్. అభిభాషణం, వకీలుపని ; పార. వకాలత్. ప్రతినిధి పత్యం. అర. వకాలత్. రాజప్రతినిధి, అధికారం వాదం ;

క. త. వకాలత్తు ; మ. వకాలత్.

<ఉ. వకాలత్.

**వకాలతునామా** రూ. వకాలత్తునామా, వకాలత్‌నామా, వకాల్తు నామా. వి. లిఖిత పూర్వకమైన అభిభాషణం.

ఉ. పార. అర. వకాలత్‌నామహ్ ;

త. వకాలత్తునామా.

<ఉ. వకాలత్‌నామహ్.

**వకాలత్తునామా** రూ.చూ. వకాలతునామా. వి. అభిభాషణ పత్రం.

**వకాలత్‌నామా** రూ.చూ. వకాలత్తునామా. వి. అభిభాషణ పత్రం.

**వకాల్తీ** రూ.చూ. వకాలతు. వి. అభిభాషణం.

**వకాల్తునామా** రూ.చూ. వకాలతునామా. వి. అభిభాషణ పత్రం.

**వకావకలు** రూ.చూ. పికపికలు. వి.బ.వ. **1.** చెదరడాలు. వరాహ. 1.95 ; **2.** బద్దలు. బహుళా. 3.43.

**వకావకలుసేయు (-చేయు)** స.క్రి. బద్దలుచేయు. వసు. 6.45.

**వకావగలగు** చూ. వకావకలు. అ.క్రి. వక్కలగు, ముక్క చెక్కలగు. సారంగ. 2.143.

**వకాసుకుట్టు** వి. ఒకరకం కుట్టుపని. వాల్మీ. 3.84.

హిం. ఉకాస్‌నా. పెరకటం, తెరపటం.

**వకీలు** రూ. వక్కీల్, వక్కీలు. వి. **1.** న్యాయవాది. వేణు. శ. 16 ; **2.** వాదం. అహల్యా. 3.30.

హిం. వకీల్. దూత, రాజప్రతినిధి, న్యాయవాది ; ఉ. వకీల్. అభిభాషకుడు, అభివ్యక్త, న్యాయవాది ; పార. వకీల్. రాజప్రతినిధి, న్యాయవాది, పరిపాలించేవాడు ; అర. వకీల్. ఏజంటు, దూత, చట్టసంబంధమైన సలహాదారుడు, రాయబారి ;

క. వకీల. ప్లీడరు, దూత, రాయబారి, గుమాస్తా ; త.మ. వక్కీల్.

<ఉ. వకీల్.

**వక్క**[1] రూ. వ్రక్క వి. **1.** పూగఖండం, పోకచెక్క. గౌ.హరి. ఉ. 1474పం. ; **2.** పోకచెట్టు. (Areca Catechu) ; **3.** గవ్వలాంటి చిన్ననాణెం.

సం. వల్క.- ముక్కు, తునియ ; ప్రా. వక్క -.

<ప్రా. వక్క-.

**వక్కచాయ** రూ. వక్కసాయి. వి. నల్లపోక చెక్కరంగు.

**వక్కచాయచీర** రూ. వక్కసాయిచీర. వి. కెంపుమీద

నలుపు వన్నెలో ఉండే రంగుచీర. **వక్కరంగు** రూ. పొక్క రంగు. వి. **1**. నల్ల పోకచెక్కరంగు ; **2**. చేకిలేటురంగు ; **3**. ఒకరకం నలుపువన్నె ; **4**. కాఫీపొడి మాదిరి రంగు. **వక్కలముక్కలు** వి.బ.వ. అరకొరలు. **వక్కలాకులు** వి. బ.వ. పోకచెక్కలు మొ. వాటితో కూడిన తాంబూలం. <వక్క[1]+-లు+ఆకు+-లు. **వక్కలు** వి.బ.వ. పోక చెక్కలు. **వక్కలొక్కలు** వి బ.వ. లొడుకుల్లొడుకులు. <వక్క[1]+-లు+వక్క[1]+-లు. **వక్కసాయి** రూ.చూ. వక్కచాయ. వి. నల్లపోక చెక్కరంగు. **వక్కసాయిచీర** రూ.చూ. వక్కచాయచీర. వి. కెంపుమీద నలుపువన్నెలో ఉండేరంగుచీర. **వక్కసేయని(-చేయని)** విశ. పోకసేయని. గవ్వచేయని (వక్క. గవ్వలాంటి చిన్న నాణెం). **వక్కాకలరు** వి. నల్లపోకచెక్క రంగు. ఇం. *Colour*. రంగు. <వక్క[1] + ఇం. Colour. **వక్కాకు** వి. తాంబూలం. హంస. 4.53 <వక్క[1] + ఆకు. **వక్కాకునకిచ్చు** స.క్రి. ఆదరాన్నో అభి మానాన్నో తెలుపుతూ సామాన్యులకు కొంచెం పైవారికి కానుక ఇచ్చు. శుక. 2.25. <వక్కాకు+-న+-కున్ + ఇచ్చు. **వక్కాకుశాస్త్రము** వి. వివాహనిశ్చయతాంబూలం. సం. శాస్త్ర – శాసించేది. <వక్కాకు+సం.శాస్త్ర-. +–ము.

**వక్క[2]** రూ. బొక్క[2]. వి. నూలులెక్క, లడీలో సగంనూలు.

**వక్కకట్టియ** రూ.చూ. వక్కికట్టే. విశ. బక్కటిల్లినవాడు, కృశుడు.

**వక్కణ** రూ.చూ. వక్కాణము. వి. **1**. వాఖ్యానం, వివరణ. రుక్మా.చ. 1.52, పార్వ. 3.57 ; **2**. జాబులోని వృత్తాంతం. రా.వా. పు. 107, ఇందు. 5.16 ; **3**. జాబులో మొదట రాసే పద్ధతి, మతలబు. భోజను. 1.41 ; **4**. పత్రాన్నిరాసేముసాయిదా.

**వక్కణించు** స.క్రి. వచించు, పల్కు. శివరా. 2.90. <వక్కణ+-ఇంచు[3].

**వక్కణము** రూ.చూ. వక్కాణము. వి.**1**. వ్యాఖ్యానం ; **2**. జాబులో మొదట రాసే పద్ధతి. మతలబు ; **3**. జాబులోని సమాచారం ; **4**. బిరుదావళి పేర్కొనటం ; **5**. పత్రాన్ని రాసే ముసాయిదా.

**వక్కణాలు** వి.బ.వ. పొంకమైన మాటలు. <వక్కణము +-లు.

**వక్కణాలు** చూ. వక్కణము.

**వక్కణించు** చూ. వక్కణ.

**వక్కందు** వి. పప్పుబియ్యాల్ని సన్నపోటుతో దంచటం.

**వక్కన** రూ.చూ. వక్కాణము. వి. వ్యాఖ్యానం.

**వక్కరము** రూ. వక్కళము. విశ వంకరైన ; వి. వంకర.

సం. వ్రక –. వంకర ; ఒ. బొ్రకొ. ;

క. ఒక్కర. వంకర, కుటిలమైన.

<సం. వక్ర-.

**వక్కరాలు(-ఆలు[2])** వి. కుటిలబుద్ధికలది. వంకరబుద్ధిఉన్న ఆడది. జైమినిభా. 2.111. **వక్కరించు** రూ. వక్కళించు. అ.క్రి. ప్రతిఘటించు, మారుమలయు. పండి.చ. 2.116పు ; స.క్రి. విడుచు. శివరా. 2.61. క. ఒక్కరిసు. వెనుదీయు. <వక్కరము+-ఇంచు[3].

**వక్కరాలు** చూ. వక్కరము.

**వక్కరించు** చూ. వక్కరము.

**వక్కలింత** రూ.చూ. ఓకిలింత. వి వేవిళ్ళు, డోకు.

**వక్కళము** రూ.చూ. వక్కరము. వి. ప్రతిఘటించటం, మారు మలయటం. ఉహరి. 3.64.

**వక్కళించు** రూ.చూ. వక్కరించు. స.క్రి. ప్రతిఘటించు. మారుమలయు. ఉ.హరి. 6 60, క్రీడా. 223. <వక్క. ళము+-ఇంచు[3].

**వక్కళించు** చూ. వక్కళము.

**వక్కాకలరు** చూ. వక్క[1].

**వక్కాకు** చూ. వక్క[1].

**వక్కాకునకిచ్చు** చూ. వక్క[1].

**వక్కాకుశాస్త్రము** చూ. వక్క[1].

**వక్కాణ** రూ.చూ. వక్కాణము. వి. **1**. వైఖరి, రీతి. విక్ర. 8.26 ; **2**. జాబులో రాసే సమాచారం ; **3**. అర్థవివరణం.

**వక్కాణించు** స.క్రి. **1**. ప్రకటించు. భార. ఆది. 1.66 ; **2**. వ్యాఖ్యానం చేయు. వివరించిచెప్పు. భీష్మ. 1.90 ; **3**. స్తుతించు; వర్ణించు. జైమినిభా. 1.6 ; **4**. వచించు. చెప్పు. ఉ.రా. 5.200. <వక్కాణము+-ఇంచు[3].

**వక్కాణము** రూ. ఒక్కణము, వక్కణ, వక్కణము. వక్కన, వక్కాణ. వి.**1**. ఉత్తరంలో రాయబడే సమాచారం. జైమిని భా. 8.89 ; **2**. వైఖరి, రీతి. విక్ర. 8.26 ; **3**. మాట ; **4**. వార్త ; **5**. అర్థవివరణం.

సం. వ్యాఖ్యాన-. వివరణం, కథనం ; ప్రా. వక్ఖాణ-. ; శౌ.అ.మా. వక్ఖాణ-. ; అప. వక్ఖాణ- ; వఖాణ- ;

క. ఒక్కణె. వక్కణె. రచనారీతి, ఉత్తరంలో రాసే విలాసం ; త, వక్కణమ్.

<ప్రా. వక్ఖాణ–.

**వక్కాణించు** చూ. వక్కాణ.

**వక్కి[1]** రూ.చూ. వక్కు[2]. వి. కొంగ.

**వక్కిపక్షి** వి. ఒకరకం కొంగ.

**వక్కి[2]** రూ.చూ. వగ్గు[1]. విశ. **1**. బక్కటిల్లిన ; **2**. కృశించిన.

**వక్కికట్టియ** రూ.చూ. వక్కికట్టె. విశ. ఒక్కటిల్లినవాడు, కృశుడు. **వక్కికట్టె** రూ. వక్కకట్టియ. వక్కికట్టియ. విశ. బక్కటిల్లినవాడు. కృశుడు.

**వక్కీల్** రూ.చూ. వకీలు. వి. న్యాయవాది.

**వక్కీలు** రూ.చూ. వకీలు. వి. న్యాయవాది.

**వక్కు[1]** రూ.చూ. వగ్గు[1]. అ.క్రి. **1**. లోబడు, అధీనుడగు. శివత. సా. 163 ; **2**. బక్కటిల్లు, కృశించు. వేమ. 2.413 ; **3**. అడుగంటు.

**వక్కు[2]** రూ. వక్కి[1], వగ్గు[2]. వి. ఒకజాతి కొంగ. ఆం.భా. 2.93.

సం. బక-. కొంగ ; హిం. బక్.

<సం. బక-.

**వక్కుకొంగ** వి. ఒకరకం కొంగ, వాలుకొంగ. **వక్కుపులుగు** వి. వక్కుకొంగ, బకం.

**వక్తు** రూ.చూ. వఖ్తు వి. సమయం.

**వక్రంబు** వి. అడ్డు, అప. ఉరుటూరు శాసనం. క్రీ. శ. 600.625.

సం. వక్ర-. వంకరఐనది, చుట్టుకొన్నది.

<సం. వక్ర- (అర్థవిపరి.).

**వక్రించు** అ.క్రి. 1. ప్రతిఘటించు, మార్కొను. హరి. ఉ. 6.89; 2. వెనకకు నడచు, మరలు. ద్వి. హరిశ్చ.ఉ. 859పం.

సం. వక్ర-. వంకరగల.

<సం. వక్ర-+-ఇంచు³ (అర్థవిపరి.).

**వఖ్తు** రూ. వక్తు. వి. సమయం.

హిం. ఉ. వక్త్. సమయం, అవకాశం, పరిస్థితి, ఋతువు, విరామం, ఖాళీసమయం;

త. వక్తు. కాలం, ఋతువు, అవకాశం.

<ఉ. వక్త్.

**వగ** చూ. వగచు. వి. 1. సంతాపం. భార. ఆది. 8.161; 2. ఆలోచన, తలపు. భార. సభా. 2.200; 3. విలాసం. కు.సం. 7.112; 4. అభిలాష. భార. ఉద్యో. 1.69; 5. దుఃఖం. భార.శాంతి. 1.108; 6. ఒద్ద. దగ్గర. హర. 1.9; 7. వర్ణం, గుంపు. కాశీ. 6.35; 8. విధానం. వరాహ. 7.36; 9. తీర్పు, పరిష్కారం. ద.హిం.శా.సంపు. 4. శా. సం. 698. క్రీ. శ. 1564; 10. శోకం. ఆము. 3.27; 11. వలవంత. ఆము. 5.42; 12. ఉపాయం. రామాభ్యు. 5.286; 13. శక్తి, సామర్థ్యం. కువ.చ. 2.45; 14. విధం. కువ.చ. 3.39; 15. రసం, రుచి. సారంగ. 2.206; 16. గతి, దిక్కు. శేషధ. 4; 17. యోగ్యత. ద్వి. సా. చ. 1.857పం.; 18. రకం. శుక. 1.421; విశ. విలక్షణమైన, ఒక రకమైన. అని. 1.57.

క. బగ్గె, బగ్యె. ఆలోచన, ఉద్దేశం.

**వగకత్తె** వి. విలాసిని. **వగకాఁడు** వి. 1. విలాసవంతుడు. అహల్యా. 3.52; 2. వల్లభుడు. సీలా. 3.45. **వగఁజేయు(-చేయు)** స.క్రి. 1. నవరించు; 2. చక్కజేయు. **వగతెగు** రూ.చూ. వగదెగు. అ. క్రి. పరిష్కారమగు. తీరు, ముగించు. **వగదెగు(-తెగు)** అ.క్రి. పరిష్కృతమగు, నిర్ణీతమగు. **వగదెంచు(-తెంచు)** స. క్రి. పరిష్కరించు, నిర్ణయించు. ఉ.రా. 6.211. **వగలమారి** వి. 1. వగలుకలవాడు; 2. వగలుకలది. **వగలమారి వంకాయ** వి. 1. వగలాడి; 2. కబుర్లు ఆరిందాగాచెప్పే బాలుడు లేదా బాలిక. **వగలాఁడి** వి. విలాసాలుగల స్త్రీ. శుక. 1.111. **వగలాఁడు** వి. విలాసంకల పురుషుడు; విశ. వగకాడు. **వగలించు** అ.క్రి. కులుకు. <వగ+-లు+-ఇంచు³. **వగలు** వి.బ.వ. మాయలు. **వగలేకుండు** అ.క్రి. అరుపులేకుండు. **వగలొలుకు** అ.క్రి. అందాలొలుకు. హంస. 1.60. <వగ+-లు+ఒలుకు. **వగవగ** వి. పలురకాలు, రకరకాలు. ఉ.రా. 6.121; విశ. రకరకాలైన, పెక్కురకాలు. దశా. 6.34. **వగసాటాలు** వి.బ.వ. వగలు వెయ్యటం. **వగాతెగాతెలియు** అ.క్రి. కార్యనిర్వహణ పద్ధతి తెలియు.

**వగచు** స.క్రి. 1. విమర్శించు, విచారించు, పరిశీలించు. భార. ఆది. 1.85; 2. భావించు. భార. ఆది. 3.152; 3. తలచు, తలపెట్టు. ద.హిం.శా. సంపు. 5. శా.సం. 50. భార. ఆది. 6.187; 4. ఆలోచించు. కు. సం. 7.21; అ.క్రి. 1. ఏడ్చు, విలపించు. భార. ఆది. 6.243; 2. సంశయించు, సందేహపడు. భార. ఆది. 7.250; 3. పశ్చాత్తాపపడు. భార. సభా. 2.146.

క. బగె. ఆలోచించు; తు. బగెయుని, బగెపుని. ఆలోచించు, ఊహించు; త. వకై(-వ్-.-న్త్-).

**వగపించు** స.క్రి. 1. ఏడ్పించు, విలపింపచేయు. హర. 4.26; 2. దుఃఖింపచేయు. వైజ. 3.72. <వగచు+-ఇంచు³. **వగపు** రూ. వెగపు. వి. 1. దుఃఖం, వగ. భార. సభా. 2.127; 2. శోకం. భార. శాంతి. 3.29, 3. విధం. మృత్యు. 2.84; 4. కీడు. దశా. 2.127. **వగపు సోకు** అ.క్రి. దిగులు కలుగు. భాగ. 1.405.

**వగపించు** చూ. వగచు.

**వగపు** చూ. వగచు.

**వగపుసోకు** చూ. వగచు.

**వగయిరా** రూ.చూ. వగైరా. అవ్య. మొదలైన, ఇత్యాది.

**వగరము** రూ.చూ. వగరు¹. వి. వగర్పు, శ్వాసరోగం. విక్ర. 2.155.

**వగరించు** చూ. వగరు¹.

**వగరు¹** రూ. వగరము. వి. శ్వాసరోగం, ఉబ్బసం, శ్వాసం. భార. ఆది. 3.191.

**వగరించు** అ.క్రి. వగర్చు, నిట్టూర్చు. పి.శకు. 1.123. <వగరు¹+-ఇంచు³.

**వగరు²** రూ.చూ. ఒగరు. వి. రుచిభేదం.

**వగరుతీయు** అ.క్రి. చింతగింజలు రోట్లోదంచి పైపొట్టు తీయు.

**వగరుచు** రూ.చూ. వగర్చు. అ.క్రి. నిట్టూర్చు.

**వగరుపు** రూ. వగర్పు. వి. 1. శ్వాసం. ఆం. భా. 2.127, 2. శ్వాసరోగం.

**వగరుపు** చూ. వగరుచు.

**వగర్చు** చూ. వగరు¹. రూ. వగరుచు. అ.క్రి. నిట్టూర్చు. కృ. శకు. 2.16, దశా. 7.146.

క. ఉగ, ఉగి, ఉగె, ఆవిరి; తు. ఉగె, ఉక్కు. ఆవిరి; గోం. ఉక్కడె, ఎగశ్వాస; పో.చూ. ప్రా. ఉక్కల. వేడి, ఉక్కపోత. ఉగరిను. ఎక్కువగా శ్వాసించు.

*ఉయ్-. అక్-. గ్. పో.చూ. వక్కు.

**వగర్పు** రూ.చూ. వగరుపు. వి. ఎగరొప్పు.

**వగర్పు** చూ. వగర్చు.

**వగాతెగాతెలియు** చూ. వగ.

**వగుడాకు** చూ. వగుడు.

**వగుడు** రూ.చూ. ఒగుడు. వి. ఆకు, జొన్న, సజ్జ మొ. మొక్కల ఆకు, ఎండి రాలిన ఆకు.

**వగుడాకు** వి. జాజాకు, ఎండిరాలిన జొన్న మొ. వాటి

ఆకు. <వగురు+ఆకు.

**వగురుతీయు** చూ. వగరు². అ.క్రి. రంగు అతికిన తరవాత నూలు ఉతికి పిండు.

**వగేరా** రూ.చూ. వగైరా. అవ్య. మొదలైన, ఇత్యాది.

**వగైరా** రూ. వగయిరా, వగేరా. వి. మొదలగు, మొదలైనవి. రంగా. చ. 2.39, నె.గా. 2సంపు. కందుకూరు 48. క్రి.శ. 1650.51.

హిం. *వగైరహ్* ; ఉ. *వగైరహ్*, *వ-గైరహ్*, పార. *వగైరహ్* ; అర. *వగైరహ్*, *వ-గైర* ; క. *వగైరా* ; త. *వకయరా*, *వగైరా*.

<అ. వ-గైరహ్.

**వగ్గటము** చూ. వక్కు². వి. కొంగ, వక్కుపులుగు.

**వగ్గము** వి. వేదభాగం. ఘటికా. 2.30.

సం. *వర్గ-*. ఋగ్వేదంలోని అధ్యాయంయొక్క ఒక భాగం ; ప్రా. *వగ్గ-*.

<ప్రా. వగ్గ-.

**వగ్గి** రూ.చూ. వగ్గె. వి. పలుపు ముడివేయటానికి పీలుగా కాడికి బిగించిన ఇనప కొక్కెం.

**వగ్గిపెనం** వి. రెండంగుళాల లోతుతో అడుగు వెడల్పుతో

**వగ్గియు** రూ. వగ్గేయు. అ.క్రి. గోలెం, జాడి మొ. వాటికి అంచు దగ్గర వొగ్గిలాగ గొలుసుకట్టు.

**వగ్గిలకమ్మి** వి. మరమగ్గం చట్రంలో నిలువ పట్టెలకుపైన బిగించిన అడ్డపట్టె.

**వగ్గు**¹ రూ. వక్కె², వక్కు¹. విశే. 1. బక్కచిల్లినవాడు, కృశుడు. భార. అశ్వ. 1.6 ; 2. కృశమైన. శృం.నై. 6.111 ; అ.క్రి. బక్కచిల్లు, కృశించు.

క. *బఱ*. చిక్కిపోవు. కృశించు, *బఱి*, *బఱు*, శూన్యమైన, నిష్ప్రయోజనమైన, ఎండినభూమి, *బఱడ*. నపుంసకుడు, *బఱడి*. గొడ్రాలు, *బఱప*. తడిలేమి, రసహీనత, *బత్తు*, *బచ్చు*. ఎండిపోవు ; కొడ. *బత్-*, (*బత్తి-*) ఎండిపోవు ; తు. *బరంటుని*. ఎండిపోవు, కృశించు, చిక్కు, *బరడు*. రసహీనమైన, పనికిరాని, *బరగట్టు*. చిక్కిన, బలహీనమైన, *బచ్చెలె*. నన్నటివ్యక్తి ; త. *వఱ* (-*ప్పు*-,-*న్త్*-). ఆర్చుకుపోవు, అరిపోవు, సన్నబడు, చిక్కు, కృశించు, *వఱమ్*, *వఱణ*. ఆరబెట్టు, పొడినేల, *వఱళ్*. ఎండిపోవు, కృశించు, చిక్కు, *వఱట్చి*. ఎండినది, *వఱట్టు*. ఎండబెట్టు, *వఱటుబ్*. ఒక్కచిక్కినవాడు, నపుంసకుడు, శక్తివిహీనుడు, *వఱటి*. నన్నటి స్త్రీ, గొడ్రాలు ; మ. *వఱు*. ఖాళీ, ఎండిన, *వఱటి*. గొడ్రాలు, *వఱడు*. ఎండిన, *వఱళుక*. ఎండవేయు, కాల్చు, వేయించు, *వఱ్ఱల్*. ఆవిరైపోవు, ఇగిరిపోవు ; కో. *వర్వ్*. జ్వరం మొ. వాటివల్ల ఎండిపోవు, *వర్డి*. గొడ్రాలు ; గోం. *వత్తానా*. ఎండిపోయిన ; కుయి. *వస్*. ఎండిపోవు ; కువి. *వ్వయలి*. ఎండిపోవు ; కురు. *బత్నా*. ఆవిరైపోవు ; మాల్తొ. *బతె*. కాల్చు ; బ్రా. *బ్రారింగ్*. ఎండిపోవు, *బారిఫింగ్*. కాల్చు, *బారున్*. ఎండిన, నిరుపయోగమైన.

**వగ్గుదనము (-తనము)** వి. కృశత్వం, బక్కచిల్లటం. సమీర. 2.21. **వగ్గువడు(-పడు)** అ.క్రి. 1. వగ్గగు, బక్కచిల్లు, కృశించు. కవిక. 5.110 ; 2. పరిపక్వమగు, మాగిపోవు. **వగ్గువేయు** వి. ఆకు, జొన్న మొ. పైర్లవేసే ఆకు.

**వగ్గు**² రూ.చూ. వక్కు². వి. ఒకజాతికొంగ. ఆం.భా. 2.93.

**వగ్గె** రూ. వగ్గి. వి. పలుపు ముడివేయటానికి పీలుగా కాడికి బిగించిన ఇనప కొక్కెం.

**వగ్గెర** వి. వల. వేంక. పంచ. 2.12.

**వగ్గేయు** రూ.చూ. వగ్గియు. అ.క్రి. గోలెం, జాడి మొ. వాటికి అంచుదగ్గర వొగ్గిలాగ గొలుసుకట్టు.

**వగ్రణ** వి. తిరగపోత.

సం. *అవగ్రహ-*. అడ్డంకి, ఆగ్రహం. *అవగ్రహణ-*, *వగ్రహ-*, *వగ్రహణ-*.

**వంక**¹ చూ. వంగు. రూ. వంకర. వి. 1. వక్రత. భార. ఆరణ్య. 3.239 ; 2. తప్పు, దోషం. భార. ఉద్యో. 3.235 ; 3. వంపు. హర. 2.115 ; 4. సెలయేరు. వసు. 2.58 ; 5. వంకరపని, కుత్సితంపని. ఇందు. 4.43 ; విశే. వంకరకలది, వక్రమైంది. కు.సం. 3.68.

క. *వంక* ; త. *వంగమ్* ;

సం. *వక్ర-*, *వంక-వంకర*, కుటిలం ; ప్రా. *వంకో* ; ఒ. *బక్ర*; బెం. *బక్ర*.

**వంకచిట్టి** రూ. వొంకచిట్టి. వి. పొగపీల్చే మట్టిగొట్టం. **వంకడోణి** వి. లావుగా వంపుగా చేసిన మట్టిగొట్టం. **వంకతాడి** రూ. ఆంకతాడు. ఒంకతాడి. వి. 1. దక్షిణాన వరసగా నిలువుగా కనపడే అయిదు చుక్కలు ; 2. (కొందరు) పది పన్నెండు మోచేయి వంపు మాదిరిగా ఉండే చుక్కలు. **వంకతిప్పినకోక** రూ. ఒంకతిప్పిన కోక. వి. ఒకరకం నేతచీర. **వంకత్తి** వి. కాటేకునుకొట్టి గోవ తీయటానికి వాడే వంపుకత్తి. <వంక¹+కత్తి. **వంకదారి** వి. కోటవాకిలికి ముందుండే వంకరదారి. బసవ. 3.501వం. **వంకదిద్దు** స.క్రి. తప్పు సరిచేయు. ఉ.క. 302. **వంకపెట్టు** స.క్రి. తప్పుపట్టు. **వంకపారకచాటు** వి. దొంగచాటు వ్యవహారం. చాటుమాటు వ్యవహారం. పాండు. 3.14. **వంకలుతీర్చు** స.క్రి. సరిదిద్దు. విజయ. 1.134. **వంకలుదిద్దు** అ.క్రి. 1. వంకలుదిద్దు. కళా. 4.143 ; 2. ఆక్షేపించు. **వంకలుదీర్చు (-తీర్చు)** స.క్రి. చక్కదిద్దు. విజయ. 2.16. **వంకలునొక్కు** అ.క్రి. వంకర్లు తీర్చు, చక్కగాచేయు. పాండు. 5.218. **వంకలుపెట్టు** స.క్రి. తప్పుపట్టు, ఆక్షేపించు ; అ.క్రి. తప్పులుపట్టు. **వంకలొత్తు** అ.క్రి. తప్పులు పట్టు. తాళ్ల సం. 8.18. <వంక+-లు+ఒత్తు. **వంకవంక** విశే. మిక్కిలి వంకరైంది. కావ్యా. చూ. 5.99. **వంకసన్నం** వి. 1. ఢిల్లీ భోగాలు, ఒకరకం ధాన్యం ; 2. కాళిపిచోడీలు, ఒకరకం ధాన్యం. **వంకసన్నములు** రూ.చూ. వంకరసన్నములు. వి.బ.వ. శాలిధాన్య విశేషం. **వంకసాంబ** వి. ఒకరకం వడ్లు. **వంకసిలుం** రూ. వొంకసిలుం. వి. పొగపీల్చే మట్టిగొట్టం. **వంకసీల** వి. గానుగ దూలానికి చివర బిగించే 'S' ఆకారపు ఇనప కొక్కెం ; దీన్నే వంపుసీల అనికూడా పిలుస్తారు. **వంకసొంగ** రూ.

వొంక సొంగ. వి. పొగపీల్చే మట్టిగొట్టం. **వంకార్చి** వి. పక్కభాగాలు వంపు లొంపులుగా ఉండే ఆర్చి.

**వంక²** వి. **1.** పక్క, వైపు, దిక్కు. భార. విరా. 3.84, ద. హం. శా. సంపు. 10. శా.సం. 501, క్రీ.శ. 1312 ; **2.** పక్షం, ఎత. భార. ద్రోణ 2.13 ; **3.** విధం. భాస్క.రా.యు. 427 ; **4.** స్థలం, చోటు. కాశీ. 6.63 ; **5.** ఒద్ద, సన్నిధి. శృం. నై. 6.43 ; **6.** విషయం, ఎత. విక్ర. 3.7 ; **7.** కారణం, నిమిత్తం. కాశ. 4.161 ; **8.** నెపం, వ్యాజం.

**వంక³** వి. కష్టం, ఇబ్బంది. నీలా. 3.21.

**వంక⁴** రూ.చూ. వాగు. వి. **1.** వాగు, వానకురిసిన పొలంలో పారే నీటిజాలు, చెరువుకు నీళ్ళుపచ్చే కాలవ ; **2.** ఏరులో ఉండే డొంక ; **3.** పల్లం ; **4.** ఏరువాక.

**వంకలుడొంకలు** వి.బ.వ. వాగులూ పొదలు. హంస. 5.65.

**వంకకాల్పు** చూ. వంగ. రూ. వొంకకాల్పు. వి. ఆములో కుండలు మొ. వి ఎక్కువగా కాలిన తీరు.

**వంకము¹** వి. అశ్వశిక్షాభేదం. వి.శకు. 1.112.

సం. *వంక-*. గుర్రానికి జీను కట్టే చోటు, సంచారశీలి, < సం. వంక-. (అర్థపరి.).

**వంకము²** రూ. వంగాము. వి. నూర్చేటప్పుడు కనువుకిందా మీదా తిప్పివేసే వంకరకొయ్య కొంకికర్ర.

సం. *వక్ర-*. వంకర.

**వంకర** రూ. అంకర, వంకి¹. వి. **1.** వక్రోక్తి, వంకర మాట. గంధ. 1.122 ; **2.** వక్రత, వంపు.

**వంకరకొంకర** విశ. మిక్కిలి వంకరైంది. వరాహ. 2.45. **వంకరకొంకరమాటలు** వి.బ.వ. వక్రభాషణాలు. హర. 4.33. **వంకరకొంకరపోవు(-పోపు)** అ.క్రి. మిక్కిలి వంకరగు. ద్వి. పరగు. వి. 2.66. **వంకరచేతులవాఁడు** విశ. ఈడ చేతులవాడు. **వంకరటింకర** రూ. వంకరటొంకర. విశ. పలురకాలుగా వంకరైంది. **వంకరటొంకర** రూ.చూ. వంకరటింకర. విశ. వంకరైన. **వంకరతీగ** వి. పర్ణం, వంగలుగాఉన్న ఒనికర్రలపై పొడుగ్గా వేసినకర్ర. **వంకర తొండంబువాఁడు** విశ. వినాయకుడు. **వంకరపెంకు** వి. వెన్నుగాడికివాడే పెద్దసైజు పెంకు. **వంకరపేటంచు** రూ. ఒంకరపేటఅంచు, వంకిపేటంచు. వి. భుజానికి పెట్టుకొనే వంకి మాదిరి డిజైను నేసినఅంచు. < వంకరపేటు + అంచు³. **వంకరపేటు** రూ.చూ. వంకిపేటు. వి. భుజానికి పెట్టుకొనే వంకి మాదిరిగా అంచులోనేసిన డిజైను. **వంకర పోపు** రూ.చూ. వంకరపోవు. అ.క్రి. **1.** కుండలు మొ. వి. ఎక్కువ కాల్పుతో సొట్టపోవు ; **2.** ఈడపోవు ; **3.** చెడు. **వంకరబోను** వి. మృగాలని పట్టే వల. యయా. 1.42. **వంకరపోవు** రూ. వంకరపోపు. అ.క్రి. **1.** వక్రమగు ; **2.** చెడు ; **3.** ఈడపోవు. **వంకరసన్నములు** రూ. వంక సన్నములు, వంకసన్నాలు. వి.బ.వ. శాలిధాన్యం. **వంకర సొంగ** రూ. అంకరసొంగ. వి. వంకసొంగ, పొగపీల్చే మట్టిగొట్టం, పైపులాగాఉండే మట్టిగొట్టం. **వంకర్లంచు** వి. వంకర్లు వంకర్లుగా కూజాలకు పెట్టే అంచు. < వంకర + -లు + అంచు³.

**వంకర్లంచు** చూ. వంకర

**వంకాము** రూ.చూ. వంకము². వి. నూర్చేటప్పుడు కనవును కిందామీదా తిప్పివేసే వంకరకొయ్య, కొంకికర్ర.

**వంకాయ** రూ.చూ. వంగకాయ. వి. వార్తాకం. ఆం. భా. 2.59.

**వంకాయముంగి** వి. వంకాయరంగుదారంతో నేసిన చిన్నగడి. **వంకాయరంగు** వి. నలుపులో ఊదారంగు కొన్నిచోట్ల మానుగాయ రంగులో నూటికి పదిపాళ్ళవరకూ ఎరుపు ఉండేరంగు.

**వంకాలబండి** వి. అడ్డానబండి, రెండునొగలబండి.

**వంకి¹** రూ.చూ. వంకిణి¹. వి. **1.** బాకు. యయా. 5.74 ; **2.** వక్రశస్త్రం, వంకకత్తి. అచ్చ. రా. యు. 127.

**వంపుటుంగరము** వి. ఒకరకంటుంగరం. హంస. 4.163.

**వంకి²** రూ. వంకిణి². వి. **1.** (జవాది) క్రో వి. యయా. 5.12 ; **2.** టెంకి. ఉనికిపట్టు. ద్వి. నల. 1.575.

**వంకి³** రూ. వంకియ², వంకీ, వంకె, వంకెం, వంకెర, వంకేం. వి. **1.** స్త్రీలు దండకు పెట్టుకొనే ఆభరణం. పార్వ. 5.137 ; **2.** భుజానికి పెట్టుకొనే వంకి మాదిరిగా అంచులోనేసిన డిజైను. రంపంపళ్ళ మాదిరిగా వంకర గీర పడేట్టు నేసిన డిజైను ; **3.** గోడలో బిగించిన కొయ్యముక్క ; **4.** బండిచక్రం తయారీలో వాడేవంపుకొయ్య.

క. *వంకి*, *ఒంకి*. దండకు పెట్టుకొనేనగ ; తు. *ఒగ్గి*, *ఊగ్గి*. పట్టుకొనేది ; త. *వంకి*, దండకుపెట్టుకొనేనగ ; సం. *వంక్య-* పొగమొ. వాటిని తగిలించే చిలక కొయ్య ; ప్రా. *వంకిఅ*. వక్రితమయినది.

< ప్రా. వంకిఅ.

**వంకిపేటంచు** రూ. ఒంకెపేటంచు, వంకరపేటంచు, వంకెపేటంచు. వి. భుజానికి పెట్టుకొనే వంకిమాదిరి డిజైను నేసిన అంచు. **వంకిపేటు** రూ. ఒంకరపేటి, ఒంకిపేటు, వంకపేటె, వంకరపేటు. వి. భుజానికి పెట్టుకొనే వంకి మాదిరిగా అంచులో నేసిన డిజైను. **వంకిబోర్డరు** వి. భుజానికి పెట్టుకొనే వంకి మాదిరి డిజైను నేసినఅంచు, ఇం. *Boarder*. అంచు. < వంకి + ఇం. Boarder. **వంకిసిలిమి** వి. వంకసిలుం, పొగపీల్చే మట్టిగొట్టం, పైప్‌లాగ ఉండే మట్టిగొట్టం. **వంకులార్చి** వి. పక్కభాగాలు ఒంపులొంపులుగా ఉండే ఆర్చి.

**వంకిడిమెట్టు** వి. కిందవిశాలంగా పైకిపోనుపోను సన్నగా సుడి తిరిగిఉండే మెట్టు.

**వంకిడీలుపెట్టు** రూ. వొంకిడీలుపెట్టు. అ.క్రి. గోలెంకు పక్కలో అలంకారం కోసం చుట్టూ సన్నరాలిక అంటించి వేలితోనొక్కి గొలుసులాగా ఏర్పరచు.

**వంకిణి¹** రూ. వంకి¹. వి. బాకు. రామాభ్యు. 6.149.

క. *వంకి*. ఒకరకంకత్తి, *వంకుడి*, *బంకుడి*. కత్తి ; మ. *వంకి*. బాకు, కత్తి.

**వంకిణి²** రూ.చూ. వంకి². వి. పరిమళద్రవ్యాలుంచుకునే పాత్ర. ద్వి.సా.ద. 1.11.

**వంకియ¹** వి. ఏనుగును శిక్షించే సాధనవిశేషం. అంకుశం.

అచ్చ. రా. 3.38.

**వంకియ**[2] రూ.చూ. వంకీ[3]. వి. 1. చిలకొయ్య ; 2. సస్య విశేషం ; 3. భూషణవిశేషం.

**వంకీ** రూ.చూ. వంకి[3] వి. 1. స్త్రీలు సందిట ధరించే ఒకనగ ; 2. అచ్చు గుదులు తగిలించే వంకర ఇనపఊచ ; 3. ఆర్చికి పక్కన వచ్చేసొట్టకు వెలుపలి భాగం ; 4. వంచిన వెదురుబద్ద ; 5. గానుగదూలానికి చివర బిగించే ఇనప కొక్కెం, కుయ్య.

**వంకుటుంగరము** చూ. వంకి[1].

**వంకులార్చి** చూ. వంకి[3].

**వంకె** రూ.చూ. వంకి[3]. వి. 1 చిలకొయ్య ; 2 సస్యవిశేషం; 3. భూషణ విశేషం ; 4. కమండలంకూజాకు వేళ్ళదూర్చి పట్టుకోవటానికి అమర్చిన భాగం ; 5. గోడలో బిగించిన కొయ్యముక్క ; 6. కిటికీ రెక్కలు గాలికి వాలకుండా పట్టే ఒకవైపు వంగిఉండే పరికరం ; 7. పూటీ, బండిచక్రం నిర్మాణంలో వంకరకొయ్య పలక, ఒక్కొక్క చక్రానికి ఇలాంటివి ఆరుంటాయి ; 8. పంగలుగాఉన్న ఒసికర్రలపై పొడుగ్గా వేసినకర్ర ; 9. రంగు నీళ్ళలో ఉడకబెట్టడానికి నూలు లడీలు తగిలించిన ఇనపఊచ ; 10. తాపీరేకును పిడినికలిపే వంగినఇనప చువ్వ.

**వంకెం** రూ. చూ. వంకి[3]. వి. 1. ఊడ్తెతాడు తగిలించి బిర్రుపెట్టే పంగలకొయ్య ; 2. అంకెన, గొర్రుభాగం, దండెగాడితాడుకు కట్టి గొర్తి చెక్కపై ఉన్న కొక్కేనికి తగిలించే ఇనపవంకీ.

**వంకెండ్లకొంకి** చూ. వంకెన.

**వంకెండ్లకొండె** చూ. వంకెన.

**వంకెన** రూ. అంకెన[2]. వి. 1. పడుగు బిగింపుకోసం పడుగేరే కర్రకు తగిలించే ఇనపకొక్కేలగొలుసు ; 2. వంచినవెదురు బద్ద ; 3. అంకెన, గొర్రుభాగం, దండెగాడి తాడుకు గట్టి గొర్తిచెక్కపై ఉన్నకొక్కేనికి తగిలించే ఇనపవంకీ.

**వంకెండ్లకొంకి** రూ. అంకెండ్లకొంకి. వి. ఊడ్తె అడ్డ పట్టెకుగాని సరిగుంజల అడ్డపట్టెకుగాని తగిలించే ఇనప కొక్కేలగొలుసు. **వంకెండ్లకొండె** రూ. అంకెండ్లకొండి. వి. పడుగు బిగింపుకోనం పడుగేరే కర్రకు తగిలించే ఇనప కొక్కేల గొలుసు. **వంకెనకడియం** రూ. వంకెనకడెం. వి. వంకెనకు వేసిన ఇనపచుట్టు. **వంకెనకడెం** రూ.చూ. వంకెనకడియం. వి. వంకెనకు వేసిన ఇనపచుట్టు.

**వంకెర** రూ.చూ. వంకి[3]. వి. 1. భుజానికి పెట్టుకొనే వంకీ మాదిరిగా అంచులో నేసిన డిజైను ; 2. అచ్చుగుదులు తగిలించే వంకర ఇనప ఊచ.

**వంకెలు** రూ. ఒంకెలు, వంకలు, వంకేలు. వి.బ.వ. ధాన్య విశేషం. హంస. 4.128

**వంకేం** రూ.చూ వంకి[3]. వి. ఒకకొనవంపుతిరిగి ఉండి కళ్ళంలో గడ్డి లాగేందుకుపయోగించే కర్ర, కొంకి.

**వంకేలు** రూ.చూ. వంకెలు. వి. బ.వ బియ్యం ఎర్రగా ముతగ్గా ఉండే పెద్ద గింజరకం.

**వంక్యపాలము** వి. రెల్లుమడి. ద. హిం. శా. సంపు. 5. శా. సం. 1284. క్రీ.శ. 1235.

త. వంకియమ్. వెదురు. రెల్లు.

**వంగ** వి. వంకాయ. పండి. ప. 2.104పు. (Solanum Melongena).

త. వంకమ్, వంకణమ్. వంగ ; కొలా. వంగె ; మాల్తొ. బటుంగొ ;

పో. చూ. సం. భంటాకీ, వార్తాక-, వృంత- వృంతాక-. వంగ-, వంగన-వంకాయ.

**వంగకాయ** రూ. అంకాయ, ఒంకాయ, వంకాయ, వెంకాయ, వి. వార్తాకం, వంగకాయ. పండి. ప. 1.104పు. (Solanum Melorgena). **వంగపండు** వి. 1. పక్షివి శేషం. యయా. 2.24 2. వార్తాకఫలం. **వంగపండురంగు**వి. ఒకరకం పసుపురంగు. **వంగపువ్వురంగు** రూ.చూ. వంగపూ, వురంగు. వి. 1. లేతమబ్బురంగు. 2. లేతబచ్చలిపండురంగు **వంగపూచీర** వి. లేత వయిలెట్‌రంగు నూలు పెట్టినేసినచీర. **వంగపూరంగు** రూ. వంగపువ్వురంగు. వి. లేతమబ్బురంగు. **వంగవరుగు** వి. ఎండిన వంగపండుముక్కలు. **వంగసరులు** వి.బ.వ. ధాన్యవిశేషం. ప్రబంధ. 112. **వంగాకుబుడమలు** వి.బ.వ. ధాన్య విశేషం. హంస. 4.128. < వంగ+ ఆకు+బుడమ+-లు.

**వంగట** చూ. వక్క2. వి. కొంగ.

**వంగడము** రూ. వంగసము. విశ. సంబంధి. హరి. ఉ. 6.124; వి. 1. (వ్యాక) వర్గం. కావ్యా. చూ. 7.36. 2. వంశం, వంగడం. పారి. 2.93.

సం. వంశ-. అన్వయం, కుటుంబం, వెదురు ; ప్రా. పా. వంశ- ;

త. వంకిచమ్. కుటుంబం, వంశం.

< ప్రా. వంశ-.

**వంగదీయు** చూ. వంగు.

**వంగప్రవిత్తులు** వి.బ.వ. స్థానవృత్తి. తె.శ.కా.గా. 40.

సం. వృత్తి-. బ్రతుకు, జీవనం.

**వంగసము** రూ.చూ. వంగడము. వి. వంశం, వంగడం. ద్వి. సా.చ. 1.319 పం.

**వంగాకుబుడమలు** చూ. వంగ.

**వంగాలు** చూ. వంగు.

**వంగించు** చూ. వంగు.

**వంగిని** వి. ఏనుగును కట్టే పగ్గం.

**వంగిపోవు** చూ. వంగు.

**వంగు** అ.క్రి. 1. నమ్రమగు. విక్ర. 2.155 ; 2. అణగు ; 3. మోకరించు ; 4. వానకురవటం ప్రారంభించు ; 5. వరికోతప్రారంభించు ; 6. పని ప్రారంభించు ; స.క్రి. వంచు ; వి. 1. నమస్కారం ; 2. బండిచక్రం తయారీలో వాడే వంపుకొయ్య.

క. బగ్గు, బంకు వంగు, వశమగు. బళుక్క, బళుకు, బళుంకు. వంగు ; కొడ. వగ్. కొద్దిగావంగు. విధేయంగా ఉండు ; త. వణంకు. వంగు ; వణక్కు, వంచు, వంగదీయు ; మ. వణంకుక. వంగు. గౌరవించు, వణక్కుక, వళెక్క. వంచు ; తొ. పళ్. వంగు ; పర్జి. నా. వంగ్ ; కుఇ. వల్గ. వంగు ; కువి. వంగ్. వంచబడు ; కొలా.

వంగ్ ; కురు. బెంక్. వంగు, వంకగా అగు. బెంకో, బంకా. వంగిన ; మాల్తో. ఉంగ్రగ్. వ్రమమగు ;

సం. వ్రక -. వంకర ; ప్రా. పా. వక్క -, వంక-; పో. చూ.సం. వంకు. వంకరఅగు.

మూ. ద్రా. *వణ్-క్-, *వాళ్-*వాణ్, *వళ్, -*వణ్*.

వంగ(దీయు స.క్రి. వంచు. వంగచేయు. <వంగు+ -అ[7]+తీయు. వంగాలు వి. కాలుమెడ, దొంగగొడ్డు కాలికి మెడకూ వేసే బంధం. <వంగు+కాలు[3]. వంగించు స.క్రి. 1. వంచు ; 2. గోడుగాపెట్టు. వంగిపోవు అ.క్రి. కుండలు మొ.వి ఎక్కువ కాల్చు వల్ల సొట్ట పోవు. < వంగు+-ఇ[13]+పోవు. వంగుడు వి. 1. బీట, పగులు, రోగం వల్ల కలిగే పగులు. ఆం.భా. 2.130 ; 2. సొక్కు. వంగుడుబావి రూ. ఒంగుడు బావి. వి. చుట్టుగోడ ఉన్న బావి. వంగుట్టు వి.బ.వ. 1. నల్లొట్టు, జలధార మొ.వి. నిరంతరంగా పడి ఆగిన తరవాత అక్కడ నిలిచి నిలిచి పడే బొట్టు. ఆము. 4.130 ; 2. వాన వెలసిన తరువాత బొట్టు బొట్టుగా పడేనీళ్ళు. ఆము. 4.169. వంచికొను రూ. వంచుకొను. స.క్రి. 1. వంగచేయు. శృం. నై. 2.66 ; 2. వశపరచుకొను. స్వాధీనం చేసికొను. వంచినతల యెత్తకుండా అవ్య. తదేకదృష్టితో. నిర్విరామంగా. వంచిన నడుంఎత్తకుండా అవ్య. నిర్విరామంగా. వంచు అ.క్రి. 1. వంగచేయు. భార. ఆది. 7.176 ; 2. వశపరచు, లొంగ చేయు. భాగ. 2.29 ; 3. నశింపచేయు, పోగొట్టు. భాగ. 8.640 ; 4. కుమ్మరించు. ఆము. 5.151 ; 5. వద్దించు. బహులా. 4.25. వంచుకొను రూ.చూ. వంచికొను. స.క్రి. 1. వశపరచుకొను, స్వాధీనం చేసికొను. వేణు.శ. 18 ; 2. వంగచేయు. వంచుడుమూకటి వి. సగభాగం వరకు రంధ్రాలుండి గంజి వార్చుకు వాడే రెండంచుల్తో ఉండే మట్టిమూకుడు. వంపు చూ. వంచు. వి. 1. వంగటం. కు. సం. 11.3 ; 2. పార్శ్వం, పక్క. రాజవా. 4.76 ; 3. వంకర. వక్రత. చంద్రూవా. 3.98 ; స.క్రి. వంగేటట్లు చేయు. ఆము. 5.67 ; విణ. వంగేది. చెన్న బసవ. 2.204.

వంగులు చూ. వంగు. వి.బ.వ. పడవలో అడ్డవాసాలు.

వచ్చ[1] వి. 1. చెట్టుకు పట్టి పొత్తిగా నాశనం చేసే ఒకరకం చీడ ; 2. ఇచ్ఛ, కోరిక ; 3. తీవ్రమయిన ఆద ; 4, అసూయ, ఈసు ; 7. కలరా.

సం. వాంఛా. కోరిక ; ప్రా. వంఛా ;

త. వచ్చై. దయ, కోరిక.

<ప్రా. వంచా.

పచ్చ[2] రూ. బచ్చ. వి. 1. భాగం ; 2. పక్షం.

సం. పక్ష-. రెక్క, వైపు, పక్క ; ప్రా. పా. పక్ష-.

<సం. పక్ష-.

వచ్చగాఉండు అ.క్రి. చప్పగాఉండు.

వచ్చండాలు రూ. వచ్చండాలు. వి.బ.వ. పోటీలు.

వచ్చండాలుపోవు రూ. వచ్చండాలు పోవు. అ.క్రి. వంతులు (పంతాలు) పెట్టుకొను.

వచ్చండాలు రూ.చూ. వచ్చండాలు. వి.బ.వ. పోటీలు.

వచ్చండాలుపోవు రూ.చూ. వచ్చండాలు పోవు. అ.క్రి. వంతులు (వంతాలు) పెట్టుకొను.

వచ్చినత్రోవపట్టు చూ. వచ్చు.

వచ్చిపోయినవారు చూ. వచ్చు.

వచ్చు అ.క్రి. 1. దరిజేరు, దగ్గరు, ఏతెంచు. భార. ఆది. 1.28 ; 2. పర్దిల్లు. భార. ఆది. 4.224 ; 3. సొటగు. కు.సం. 6.30 ; 4. ఇష్టమగు, అనుకూలమగు. భార. విరా. 1.76 ; 5. సంభవించు, తటస్థించు. భార. విరా. 1.238. 6. శక్యమగు. వలనుపడు. భార. విరా. 2.287 ; 7: (గ్రహాదులు) ఆవేశించు. పూను. భార. విరా. 5.40 ; 8. తగు, యుక్తం. భార. భీష్మ. 1.185 ; 9. కలుగు, ఉద్భవించు. భార. భీష్మ. 3.210 ; 10. పొడగు, ఉపక్రమించు. భార. అను. 3.321 ; 11. ప్రసన్నమగు. భాస్క.రా. బాల. 63 ; 12. నెరవేరు, సిద్ధించు. భాస్క.రా. బాల. 461 ; 13. చెందు, ముట్టు. భాస్క.రా.యు. 895 ; 14. అగు. ఉ.హరి. 4.258 ; 15. అలవడు, అభ్యస్తమగు. శృం.నై. 6.25 ; 16. బాధించు. హర. 4.23 ; 17. ఇదికొన్నిచోట్ల పోవు మొ. ధాతువులకు వాక్యాలంకారంగా అనుప్రయుక్త మౌతుంది. కాశీ. 2.136 ; 18. (పళ్ళు) మొలచు, అంకురించు. భాగ. 9.196 ; 19. పూను, ఉద్యమించు, యత్నించు. నిర్వ. 1.144 ; 20. కలుచు. పారి. 1.17 ; 21 ప్రవర్తించు, నడచుకొను. పారి. 1.80 ; 22. సిద్ధంగా ఉండు. ఆము. 3.37 ; 23. ప్రసక్తమగు. కళా. 4.40 ; 24. కారు, స్రవించు. కళా. 4.171 ; 25 సమర్థమగు. పాండు. 5.176 ; 26. పొంగు, నిండి ప్రవహించు. కృష్ణ. 3.48 ; విణ. విపులం. హర. 2.24.

క. బర్, బార్. వచ్చు, పొందు, బరవు, బరవు, బరవికె, బర్త. రావటం. బరత్ - (బరతి-). రప్పించు ; తు. బర్పిని. వచ్చు. తీసుకొని వచ్చు, సంభవించు, బర్పావుని. రానీయు, రప్పించు ; త. వరు (వార్-, నా.. వన్ -). వచ్చు, జరుగు, సంభవించు, తెలియు, స్పష్టమగు, వరవర. క్రమంగా, తర్వాత్తర్వాత వరత్తు. వచ్చు లోనికి వచ్చు, వరలారు. చరిత్రక్రమం, చారిత్రక పరిణామం, వరునర్, కొత్త వారు. అతిథులు, వరుమై. వచ్చేఋన్మ. వరుత్తు. వరువు. వచ్చేటట్లు చేయు. తీసుకొనివచ్చు. వారి. వచ్చుబడి (రాబడి) ; మ. వరుక, వరిక (వార్-, వా,వన్న్-). వచ్చు, జరుగు, సంభవించు, వరవర. క్రమంగా, వరవు. రావటం, రాబడి, వరుత్తు. రావటం. వరుత్తుక, వరువిక్క. రప్పించు జరిపించు పరిష్కరించు ; కో. వర్-. వచ్చు. వక్ప్. రప్పించు. తొ. పొ.ర్. వచ్చు ; గోం. (Waiāna) వైఆనా వాయా నా. వచ్చు ; కొం. రా - వా - వచ్చు ; కుయి వావ. వచ్చు, కలుసుకొను ; కువి. వైయలి. వచ్చు ; పర్జి. వెర్ - వచ్చు ; కొలా. వర్ - వచ్చు ; నా. వర్ - వచ్చు ; గ (ఒ). వర్. వచ్చు, కనిపించు ; కురు. బర్నా. వచ్చు. దగ్గరగు. చేరువగు ; బ్రా. బన్నింగ్. వచ్చు. దరిచేరు.

<మూ.ద్రా. *వర్.

**రప్పించు** స.క్రి. 1. రావించు. విక్ర. 2.87 ; 2. కల్గించు. గౌ.హరి. పూ. 1618 పం. **రా**[1] అవ్య.ద్రు. వచ్చిన తరవాత. భార. ఆది. 1.100 ; అవ్య. 1. ఆగమనార్థకం. భార. ఉద్యో. 3.97 ; 2. అధిక్షేపార్థకం. భార. ఉద్యో. 3.171 ; 3. వాత్సల్యార్థకం. భార. శాంతి. 1.38 ; 4. ఆశ్చర్యార్థకం. ఉ.హరి. 5.76 ; 5. నిందార్థకం. భాస్క. రా.యు. 4.4 ; 6. కోపార్థకం. హర. 1.4 ; 7. ప్రశంసార్థకం. వరాహ. 3.119 ; 8. ప్రార్థనార్థకం. మను. 3. 93 ; 9. సంతోషార్థకం. ఆము. 6.45 ; 10. అనాదరార్థకం. ఆము.6.82 ; 11. సంభావనార్థకం. కళా. 3.74. <వచ్చు+-అ[7]. **రాక**[1] చూ. వచ్చు రూ. రాకఁ. అవ్య. 1. ధాతువుయొక్క వ్యతిరేక క్త్వార్థకరూపం, వచ్చుటమాని. భార. ఆది. 3.115 ; 2. (రావటానికి) నేరక, చాలక, శక్యంకాక. హరి. ఉ. 5.82 ; వి. 1. జైత్రయాత్ర, దాడి. భార. ఆది. 6.213 ; 2. ఆగమనం, రావటం. భార. ఉద్యో. 3.171 ; 3. ప్రసారం, వీచటం. ఇందు. 3.112. **రాకచిక్కు** అ.క్రి. రాకుండా నిలిచిపోవు. శుక. 1.417. **రాకడ** రూ.చూ. రాక. వి. 1. ఆగమనం. కృ. శకు. 258 ; 2. మల్లవిద్యావిశేషం. మల్లు. 3.69. **రాకపోక** వి. రావటం, పోవటం. తాళ్ల. సం. 5.115. **రాకపోకలు** వి.బ.వ. రావటం పోవటం. **రాకయుండు(-ఉండు)** అ.క్రి. రాకుండాఉండు. **రాకొట్టు**[2] స.క్రి. 1. రారా పోరా అని ఏకవచనాంతంగా ఉచ్చరించు. సిం. ద్వా. 7.65 ; 2. తిరస్కరించు. విజయ. 1.65 ; వి. తిరస్కారం. తాళ్ల. సం. 13.202. **రాకొను** అ.క్రి. రాకుండు. **రాగాపోగా** అవ్య. చివరగా. <వచ్చు+-అ[7]+అగు+అ[7]+పోవు+-అ[7]+అగు+-అ[7]. **రాగుంజపోగుంజులాట** వి. ఇటువారు ఇటు వచ్చేటట్లు, అటువారు అటు పోయేటట్లు ఆడును గుంజుతూ ఆడేఆట. పంచ. చ. 1.2.460. <వచ్చు+-అ[7]+గుంజు+పోగుంజులాట. **రాఁగలతటి** వి. భవిష్యత్కాలం. <వచ్చు+-అ[7]+కల+తటి. **రాఁగలపంట** వి. రాగలపంట, రాగలపని, భవిష్యత్ఫలం. <వచ్చు+-అ[7]+కల+పంట. **రాఁగలపని** వి. భవిష్యత్ఫలం. <వచ్చు+-అ[7]+కలపని. **రాచినుకు పోచినుకు** వి. అప్పుడప్పుడుకురిసే వాన తుంపర్లు. <వచ్చు+-అ[7]+చినుకు+పోచినుకు. **రాదెంచు(-తెంచు)** స.క్రి. వచ్చేటట్లు చేయు, కలుగజేయు. ద.హిం.శా. సంపు. 10. శా. సం. 35. <వచ్చు+-అ[7]+తెంచు. **రాబడి** రూ.చూ. వచ్చుబడి. వి. వచ్చుబడి, ఆయం, ఆదాయం. <వచ్చు+-అ[7]+బడి. **రాఁబట్టు** స.క్రి. 1. సేకరించు, వచ్చేటట్లు చేయు. రామాభ్యు. 366 ; 2. ఇచ్చినదాన్ని మరల తీయు. <వచ్చు+-అ[7]+పట్టు[1]. **రాఁబట్టుకొను** స.క్రి. ఇచ్చినదాన్ని తిరిగి వచ్చేటట్లు చేసుకొను. <వచ్చు+అ[7]+పట్టు[1]+కొను. **రాఁబోవు** అ.క్రి. వచ్చేట్లుగా ఉండు. <వచ్చు+-అ[7]+పోవు. **రారానియెడ** వి. రాకూడని చోటు. హంస. 5.328. <వచ్చు+-అ[7]+వచ్చు+-అ[7]+-ని+ఎడ. **రావతి** వి. రాబడి, పరుమానం. సం. యత్-. మత్వర్థప్రత్యయం. **రావించు** స.క్రి. రప్పించు, వచ్చేటట్లుచేయు. భార. ఆది. 1.142. <వచ్చు+-ఇంచు[3]. **రావెడలు** అ.క్రి. పైకివచ్చు, పైకిపడు. దశా. 1.158. <వచ్చు+-అ[7]+వెడలు. **వచ్చిన్నతోవపట్టు** అ.క్రి. మరలిపోవు. ఉ.హరి. 1.40. **వచ్చిపోయినవారు** వి.బ.వ. అతిథి అభ్యాగతులు. **వచ్చుబడి** రూ. రాబడి. వి. ధనాగమం, ఆయతి, రాబడి. **వచ్చురాములు** వి.బ.వ. రావటం, రాకపోవటం. పాండు 4.66. <వచ్చు+రామి+లు. **వచ్చెడిపోయెడివారు** వి.బ.వ. అతిథి అభ్యాగతులు. బసవ. 1.22. **వచ్చేసారి** వి. 1. వచ్చేసంవత్సరం ; 2. వచ్చేదఫా.

**వచ్చెడి పోయెడివారు** చూ. వచ్చు.

**వచ్చేసారి** చూ. వచ్చు.

**వజ** రూ.చూ. వస[1]. వి. వస. ఓషధీ విశేషం. ఆం.భా. 2.55.

**వజను** రూ. వదను. వి. 1. పేటువడికి కింద వేలాడగట్టిన బరువు ; 2. బలం ; 3. ఆధారం.

హిం. వజన్. బరువు, తూకం, కొలత ;

క. వజను. బరువు.

<హిం. వజన్.

**వజనేత** రూ.చూ. వజానేత. వి. అంచులో పువ్వులు. చక్రాలు సమంగా నేసిన డిజైను నేత.

**వజరు** రూ.చూ. వజీరు. వి. మంత్రి.

**వజా** వి. 1. మినహాయింపు. ద.హిం.శా. సంపు. 16. శా. సం. 212. క్రీ.శ. 1556 ; 2. తీసివేత, తీసివేయటం ; 3. తోపుడు.

హిం. ఉ. వజా. తీసివేత, నిర్మాణం, ఉనికి, పద్ధతి ; మరా. వజా ;

క. వజా. తీసివేత, తొలగింపు ; త. వచా.

<హిం. వజా.

**వజాఉరి** వి. వజానేత నేసేమగ్గంలో అంచుపడుగు పోగులనుపైకి ఎత్తటానికి దొడ్డిదారుకు చివర తగిలించిన పడిదారం. **వజాకట్టు** రూ. వజేకట్టు. అ.క్రి. అంచులో ఒక రకం నేత నెయ్యటానికి డిజైను వేసుకొను. **వజాకమ్మి** వి. ఒకరకం డిజైను నేతలో నేసినకమ్మి. **వజాకర్రలు** రూ. వజేకర్లు. వి. బ. వ. అంచుల్లో నేసే ఒకరకం కుప్పడం డిజైన్లు పడటానికి అచ్చుదగ్గర పెట్టిన కర్రలు. **వజా కుప్పడం** వి. 1. ఒకరకం కుప్పడం నేత ; 2. చీర అంచులో పువ్వులు పడేట్లు వేరేరంగు పోగులు మలిపి నేసిన డిజైను. **వజాచీర** వి. అంచులో డిజైన్లు పడేటట్లు వజా నేతలో నేసిన చీర. **వజాచేయు** అ.క్రి. తీసివేయు. **వజా జందాని** రూ.చూ. వజాజముదాని. వి. 1. ఒకరకం జముదానినేత, అంచులకు డిజైన్లు పెట్టి మధ్యభాగంలో పువ్వులు పడేటట్లు పోగులు మలుపుతూ నేసేనేత ; 2. ఒకరకం డిజైను నేత, చిలక, ఏనుగు మొ. నమూనాల్లో డిజైన్లు నేసేనేత. **వజాజముదాని** రూ. వజాజందాని. వి. 1. ఒక రకం జముదాని నేత, అంచులకు డిజైన్లు పెట్టి మధ్య భాగంలో పువ్వులు పడేటట్లు పోగులు మలుపుతూ నేసేనేత ; 2. ఒకరకం డిజైను నేత, చిలక, ఏనుగు మొ. నమూ

నాల్లో డిజైన్లు నేసే నేత. వజానేత రూ. వజనేత, వజేనేత. వి. అంచులో పువ్వులు, చక్రాలు సమంగా నేసిన డిజైను నేత.

**వజారత** రూ.చూ. వజారతు. వి. మంత్రిపదవి, మంత్రి కార్యాలయం. ఆనంద. పీఠి. 119.

**వజారతు** రూ. వజారత, వజారంత, వజారు. వి. 1. ప్రధానమంత్రి కార్యాలయం. ద.హిం.శా. సంపు. 10. శా. సం. 759. క్రీ.శ. 1663; 2. మంత్రిత్వం.

హిం.ఉ. వజారత్. మంత్రిత్వం ; పార. వజారత్, విజారత్ ; మంత్రిత్వం ; అర. వజారత్. మంత్రిపదవి మంత్రిత్వం.

< ఉ. విజారత్.

**వజారంత** రూ.చూ. వజారతు. వి. మంత్రిపదవి, మంత్రి కార్యాలయం. నె.శా. 2సంపు. కందుకూరు. క్రీ. శ. 1683-84.

**వజారు** రూ.చూ. వజారతు. వి. మంత్రిత్వం.

**వజీర్** రూ.చూ. వజీరు. వి. 1. ప్రభువు. వేంక. అం. 34 ; 2. రౌతు. ఆం.నా.సం. దేవ. 16 ; 3. సామంతరాజు : 4. మంత్రి ; 5. యోధుడు.

**వజీర** రూ.చూ. వజీరు. వి. మంత్రి, సచివుడు.

**వజీరు** రూ. వజరు, వజీర్, వజీర, వజీరుఁడు, వజ్జీర్, వజ్జీరు, వజ్జీరుఁడు, వ్రజీఁడు. వి. 1. మంత్రి. సచివుడు. వసు. 1.44, ద. హిం. శా. సంపు. 10. శా. సం. 764. క్రీ.శ. 1677 ; 2. యోధుడు, శూరుడు. చంపూరా. 3.45 ; 3. సామంతరాజు. ఉ. హరిశ్చ. 1.66.

హిం. వజీర్. అమాత్యుడు ; మరా. వజీర్. ప్రధానామాత్యుడు ; ఉ. వజీర్. మంత్రి ; పార. అర. వజీర్. మంత్రి, సాయంచేసేవాడు.

< ఉ. వజీర్.

**వజీరుఁడు** రూ.చూ. వజీరు. వి. 1. సామంతరాజు. విజయ. 3.99 ; 2. యోధుడు, శూరుడు. శుక. 1.113 ; 3. మంత్రి, సచివుడు.

**వజు** విఅ. ఇంపైంది, మనోహరమైంది. అప్ప. 4.155.

**వజేకట్టు** రూ.చూ. వజాకట్టు. అ.క్రి. అంచులో ఒకరకం నేత నెయ్యటానికి డిజైను వేసుకొను.

**వజేకర్లు** రూ.చూ. వజాకర్రలు. వి. బ. వ. అంచుల్లో నేసే ఒకరకం కుప్పడం డిజైన్లు పడటానికి అచ్చుదగ్గర పెట్టిన కర్రలు.

**వజేనేత** రూ.చూ. వజానేత. వి. అంచులో పువ్వులు, చక్రాలు సమంగా నేసిన డిజైను నేత.

**వజ్జ** వి. 1. ఉపాయం, వెరవు ; 2. ఉపమ, పోలిక.

సం. వ్యాజ-. నెపం.

**వజ్జము** వి. విషఘడియలు ప్రాప్తించేకాలం, వర్జ్యం. ద్వి. పరమ. వి. 3.154పు. 19పం.

సం. వర్జ్య-. విడువతగినది ; ప్రా. వజ్జ-.

< ప్రా. వజ్జ-.

**వజ్జరపుతళ్కులు** చూ. వజ్జరము.

**వజ్జరము** వి. 1. ఒకరకం సముద్రపు చేప ; 2. చెక్కను అతకటానికి వేసే జిగట ; 3. రవ్వ.

సం. వ్రజ-. రవ్వ ; ప్రా. వజ్జ- ; పా. వజిర-.

< సం. వ్రజ-.

**వజ్జరపు తళ్కులు** వి.బ.వ. ఒకరకం వడ్లు.

**వజ్జానం** వి. ఒకరకం ముతక వడ్లు, నీటి ముంపుడుకు ఆగేరకం.

సం. వ్రజ-. నవరత్నాల్లో ఒకటి, రవ్వ, వజ్రాయుధం, అన్న-. ధాన్యం ; ప్రా. వజ్జ- ; పా. వజిర-.

< ప్రా. వజ్జ- + సం. అన్న- + -ము.

**వజ్జి** రూ.చూ. వజ్జ. వి. 1. ఉపాయం, వెరవు ; 2. ఉపమ, పోలిక.

**వజ్జీర్** రూ.చూ. వజీరు. విఅ. 1. యోధుడు, శూరుడు ; 2. మంత్రి, సచివుడు ; 3. సామంతరాజు.

**వజ్జీరు** రూ.చూ. వజీరు. వి. 1. యోధుడు, శూడుడు. యయా. 1.3 ; 2. మంత్రి, సచివుడు ; 3. సామంతరాజు.

**వజ్జీరుఁడు** రూ.చూ. వజీరు. వి. 1. యోధుడు, శూరుడు ; 2. మంత్రి, సచివుడు ; 3. సామంతరాజు.

**వజ్రకవచము** వి. రక్షకం. జైమిని భా. 7.86.

సం. వ్రజకవచ-. వజ్రాయుధ సంబంధి కవచం, వజ్రంచే చేయబడ్డ కవచం.

< సం. వజ్రకవచ-(అర్థవిపరి.).

**వజ్రగార** రూ. వజ్రగారె. వి. వజ్రంపొడికలిపి తయారు చేసిన గార. రం.రా. బాల. 73పు. 8పం.

సం. వ్రజ-. నవరత్నాల్లో ఒకరత్నం.

< సం. వజ్ర- + -గార. (మిశ్రస.).

**వజ్రగారె** రూ.చూ. వజ్రగార. వి. వజ్రంపొడికలిపి తయారు చేసిన గార. దశా. 4.49.

**వజ్రపంజరము** వి. విడిపించుకోవటానికి వీలులేంది. తాళ్ల. సం. 6.101.

సం. వ్రజ-. రవ్వ, వజ్రాయుధం, పంజర-. బోను.

< సం. వజ్రపంజర- (అర్థవిపరి.).

**వజ్రపట్టులు** వి.బ.వ. వస్త్రవిశేషం, ఒకరకం పట్టుబట్ట. సిం. ద్వా. 3.188.

సం. వ్రజ-. రవ్వ, వజ్రాయుధం.

< సం. వజ్ర- + పట్టు[1] + -లు (మిశ్రస.).

**వజ్రపునీలి** వి. నక్కసరం, రోడ్లపక్కనా బంజరు నేలల్లోను 3అడుగుల ఎత్తు గుబురుగా పెరిగే ఒకరకం కలుపుమొక్క. లేత ఎరుపురంగు పూలు పూసే మొక్క (Indigo feratrifa).

సం. వ్రజ-. రవ్వ.

**వజ్రపుఁదళుకులు** రూ. వజ్రంపుఁదళుకులు. వి. బ. వ. ధాన్యవిశేషం. హంస. 4.128.

సం. వ్రజ-. ఒకమణి.

< సం. వజ్ర- + -ము + తళుకు + -లు.

**వజ్రమాణిక్యాల కడియాల జోడు** వి. వజ్ర మాణిక్యాలతో పొదగబడిన వలయాకారంగా ఉండే హస్తభూషా విశేషం లేదా పాదభూషావిశేషం.

సం. వ్రజమాణిక్య-. రవ్వలు, మాణిక్యాలు.

**వ్రజమాణిక్యాల శిఖరము** వి. వజ్రమాణిక్యాల కిరీటం. ద. హిం. గా. సంపు. 4.గా.సం. 282. క్రి.శ. 1514.

సం. వ్రజమాణిక్య-. రవ్వలు, మాణిక్యాలు, శిఖర-. అగ్రభాగం, కొండకొన.

**వ్రజము** వి. ఒకరకం సముద్రం చేప.

సం. వ్రజ-. నవరత్నాల్లో ఒకమణి.

<సం. వజ్ర. - (అర్థవిపరి.).

**వ్రజంపు(దళుకులు** రూ.చూ. వజ్రపు(దళుకులు. వి.బ వ. ధాన్య విశేషం.

**వ్రజశుంఠ** వి. శుద్ధవెధవ. హేమా. పు. 83.

సం. వ్రజ-. రవ్వ. నవరత్నాల్లో ఒకటి, శుంఠ - మూఢుడు.

<సం. వజ్రశుంఠ- (అర్థవిపరి.).

**వ్రజాంగిజోడు** వి. వజ్రమయమైన కవచం. జైమినిభా. 2.52.

సం. వ్రజాంగిన్. వజ్రమయ కవచం.

<సం. వజ్రాంగిన్ + జోడు (మిశ్రస.).

**వ్రజీ(రు** రూ.చూ. వజీరు. వి. 1. వజీరుడు, యోధుడు. ద. హిం గా. సంపు. 10. గా.సం. 780; 2. ప్రభువు, రేడు. చంపూ.రా. 5 3.

**వంచ¹** రూ.చూ. వంచి. సర్వ. ఒకటి, ఏకం. ఉ. హరి. 3.121.

**వంచ²** రూ. వంచము. వి. ముఖ్యం.

**వంచ³** వి. కోణం.

**వంచదివియ** వి. తృణవిశేషం.

**వంచ⁴** వి. ఒకప్రదేశం.

**వంచ⁵** వి. చీట్లలోని ఆసు.

**వంచ⁶** వి. 1. దుప్పటిగుడ్డతో కట్టిన డోలి; 2. చెంగోవ. చెంగొరన.

**వంచ్చేన** వి. మోసం. ద.హిం.గా. సంపు. 10. గా. సం. 666. క్రి.శ. 1124.

సం. వంచనా. మోసం; ఒ. బంచన;
క. వంచన. మోసం; త. వంచమ్. మోసం, దగా.

<సం. వంచనా.

**వంచము** రూ.చూ. వంచ². వి. ముఖ్యం.

**వంచాడించు** రూ. వంచాళించు. అ.క్రి. 1. లక్ష్యపెట్టు. సారంగ. 3.206; 2. బెదరు.

**వంచాళించు** రూ.చూ. వంచాడించు. అ.క్రి. లక్ష్యపెట్టు.

**వంచి** రూ. వంచ¹. సర్వ. ఒకటి. పండి. చ. 2.125.

**వంచికొను** చూ. వంగు.

**వంచినతలయెత్తకుండా** చూ. వంగు.

**వంచినతడుం ఎత్తకుండా** చూ. వంగు.

**వంచియ** రూ.చూ. వంచె¹. వి. అట్టెడ, తూమెడు గింజలు పట్టే గోనెసంచి.

**వంచు** చూ. వంగు.

**వంచుకుంచె వేయు** చూ. వంచు. రూ. ఒంచుకుంచి వేయు. అ.క్రి. సరిచేసేటప్పుడు పడుగు ఆరుబదునులో ఉండగా సందు సందుకూ రెండు మూడు సార్లు కుంచె ఆపుతూ నిదానంగా దువ్వు.

**వంచుకొను** చూ. వంగు.

**వంచుడు మూకటి** చూ. వంగు.

**వంచె¹** రూ. వంచియ. వి. 1. అట్టెడ, తూమెడు గింజలు పట్టే గోనెసంచి. ఆం. భా. 2.266; 2. కనవు మొ. నవికోసే వారు వాటినుంచుకోవటంకోసం జారకట్టుకునే బడి.

**వంచె²** వి. 1. వర్ణం; 2. కాంతి, వెల్తురు; 3. వన్నె.

**వంచోడించు** స.క్రి. దయతో చూపించు.

**వంజ¹** వి. 1. గొడ్డావు, వశ. భార. విరా. 1.101; 2. గొడ్రాలు.

సం. వంధ్యా. గొడ్డు, సంతానంలేని; ప్రా. వంఝా; ఒ. బంధ్యా.

<ప్రా. వంఝా.

**వంజ²** వి. పెద్దపెద్ద చెట్లమీద అల్లుకొని పరాన్నభుక్కులుగా పెరిగే మొక్క; పంచలో వేలాడగట్టే గాలిబాధగాని, దయ్యాల పీడగాని రాదని నమ్మే మొక్క.

**వంజగడ్డి** వి. ఒకరకం కలుపుమొక్క.

**వంజ³** వి. గొడుగులోపల శలాక కూతగా ఏర్పరచిన కమ్మలు. హరి.పూ. 7.178.

**వంజర** వి. తెలంగాణా ప్రజ.

హిం. బంజారా.వ్యాపారి, ఎడ్లపై అన్నాన్ని తీసుకొని పోయి అమ్మే వ్యక్తి.

<హిం. బంజారా.

**వంజరము** రూ. వంజు. వి. ఒకరకంచేప.

సం. వ్రజ-. నవరత్నాల్లో ఒకటి, రవ్వ;
త. వంచిరమ్. సముద్రంచేప.

<సం. వజ్ర-.

**వంజు** రూ.చూ. వంజరము. వి. ఒకరకంచేప.

**వంజువాఱు(-పాఱు²)** చూ. వంజ¹. అ.క్రి. 1. బలహీనుడగు. ద్వి భార. విరా. 4.59వ; 2. గొడ్డుపోవు, గొడ్రాలగు.

**వంజెఱ(గు** వి. స్త్రీపార్శ్వచేలాంచలం, చీరచెరగు, కొంగు.

క. బళంకు, బళసు, బళుక్కు. వంగు, చుట్టివచ్చు; త. వళై. వంగు; మ. వళి.

<*వళ్(<*వళ్) + చెఱగు.

**వటగ** రూ.చూ. వటారి. వి. 1. నేర్పరి; 2. సమర్థుడు.

**వటగలు** వి.బ.వ. నేర్పుమాటలు.

**వటగారము** వి. 1. గుడారం; 2. నగడు.

**వటర** రూ.చూ. వటారి. వి. 1. వదరుబోతు, వాచాలుడు. పరమ. 4.322వ. 20పం; 2. సమర్థుడు, నేర్పరి. ఆం. భా. 3.3.

**వటవట¹** వి. క్షీణించటంలో అయ్యేఅనుకరణం. ధ్వన్యను.

**వటవటనగు (-అగు)** అ.క్రి. తగ్గు, క్షీణించు. పి.శకు.4. 54.

**వటవటపడు(-పడు)** అ.క్రి. 1. వగచు; 2. నొచ్చుకొను.

**వటవట²** వి. వాగటంలో అయ్యేధ్వనికి అనుకరణం.

**వటారము** రూ. వటారు. వి. 1. నగరు. వరాహ. 6.88, నవనాథ. 4.131వ. 16పం; 2. డేరా.

సం. వర్త్మగృహ-. దారిలోనిఇల్లు, పటాగార-. గుడ్డ ఇల్లు; ప్రా. వట్టహర- వట్టఘర-.

<ప్రా. వట్టఘర-.

**వటారి** రూ.చూ. పఠారి. వి. సమర్థుడు. ఉ. హరి. 6.129.

**వటారు** రూ.చూ. పటారము. వి. నగరు, రాజభవనం. హరిశ్చ. 5.112.

**వటారుబంటు** వి. నగరు సేవకుడు. తపతి. 3.52.

**వటి** వి. తాడు.

క. వటు, వటర, వటి. తాడు, తీగ ; త. వటమ్. పెద్దతాడు, వింటినారి, కంఠాభరణపుగొలుసు ; మ. వటమ్ తాడు, కన్నెతాడు.

**వటించు** అ.క్రి. పస్తుపడు, ఉపవసించు.

సం. వటు-. బాలుడు, బ్రహ్మచారి.

<సం. వటు- + -ఇంచు³.

**వటివేరు** రూ.చూ. వట్టివేరు. వి. వట్టివేరు, ఉశీరం. మను. 3.84.

**వట్ట¹** వి. చెరకుగానుగకు వేసేఅడ్డమాను.

**వట్ట²** వి. వృషణం, అండకోశం. శ్రీనాథునిచాటువు.

సం. వృత్త-. గుండ్రని ; ప్రా. పా.అ.మా. వట్ట- ; క. బట్టు, బట్టు. బట్టుగె, వట్టు గుండ్రని ; త. వట్టమ్ వట్టు. చిల్లర మార్చేటప్పుడు నష్టంగాతరుగు.

<ప్రా. వట్ట-.

**వట్టకాయ** వి. వృషణం. **వట్టకోడె** వి. పట్టకొట్టనికోడె, ఆబోతు. **వట్టనుము (-అనుము)** వి. కాయలు గుండ్రంగా ఉండేరకం, అనుము **వట్టవాఁపు** వి. వరిబీజం, బుడ్డ.

**వట్ట³** వి. పరినారు, వరిమొలకలు.

సం. వృత్. వర్తించు ; ప్రా.. వట్టు-. పిండరూపంలో బంధించు.

<ప్రా. వట్ట-.

**వట్టం** వి. గట్టిదనం.

సం. వృత్త-. పూర్ణమైనది ; ప్రా. వట్టు-, వత్త- విత్త-, వుత్త-.

<ప్రా. వట్ట-.

**వట్టఁగట్టు** చూ. వట్టు¹.

**వట్టపునోరు** చూ. వట్టము¹.

**వట్టము¹** వి. **1.** తక్కువతనం, న్యూనత. పండి. చ. 1.74 ; **2.** చిల్లర మార్చేటప్పుడు పెట్టేనష్టం, తరుగు. బహుళా. 5.14 ; **3.** నష్టం, దండగ ; **4.** తుట్టి ; **5.** అనవసరమైనఖర్చు : **6.** వక్రం, వంకర.

సం. వృద్ధ-. నరకబడింది ; ప్రా. వడ్డ-. నరించినది.

<ప్రా. వద్ధ-.

**వట్టపునోరు** వి. **1.** పదరుబోతు ; **2.** వక్రంమాటలాడేవాడు.

**వట్టము²** వి. పరిసర గ్రామకూటం. E.I. సంపు. 24.శా. నం. 43. (పల్లవరెండవసింహవర్మశాసనం).

**వట్టవారు(-పాటు²)** చూ. వట్ట². అ.క్రి. పండు మాసటానికి వచ్చు.

**వట్టి¹** రూ. వట్టె, వొట్టి. వి. ఉశీరం, చీపురుపుల్లలాంటి కాడలతో సువాసనగల వేళ్ళతోఉండిపశుగ్రాసంగాను, తంటికప్పులకు పనికివచ్చే ఒకరకంగడ్డి. (Andropogon muricatus).

**వట్టిచావ అగు** అ.క్రి. చిక్కిపోవు. **వట్టివేరు** రూ. వటివేరు. వి. ఉశీరం. శృం.నై 6.117 (Andropogon muricatus). త. వెట్టివేర్. దర్భగడ్డి. పో.చూ. సం. విరణ-, వీరణ-. ఒకరకంగడ్డి.

**వట్టి²** వి. బండిచక్రం తయారీలో వాడే వంపుకొయ్య.

**వట్టి³** చూ. వట్టు¹.

**వట్టికాలు** చూ. వట్టు¹.

**వట్టికిచిడీ** వి. ఒకరకంపద్దు.

ఇం. *White*. తెల్లని.

<ఇం. White + కిచిడీ.

**వట్టికొడిమెలుకట్టు** చూ. వట్టు¹.

**వట్టిగడ్డి** చూ. వట్టు¹.

**వట్టిగాంభీర్యము** చూ. వట్టు¹.

**వట్టిగొడ్డు** చూ. వట్టు¹.

**వట్టిగొడ్డుతాకట్టు** చూ. వట్టు¹.

**వట్టిగొఱ్ఱు** చూ. వట్టు¹.

**వట్టిచేతులు** చూ. వట్టు¹.

**వట్టిచేఁప** చూ. వట్టు¹.

**వట్టిజోలి** చూ. వట్టు¹.

**వట్టితానములు** చూ. వట్టు¹.

**వట్టితునకలు** చూ. వట్టు¹.

**వట్టిది** చూ. వట్టు¹.

**వట్టిదిపోవు** చూ. వట్టు¹.

**వట్టిపక్కినాగలి** చూ. వట్టు¹.

**వట్టినూతికివరగట్టు** చూ. వట్టు¹.

**వట్టిపగ్గెలుప్రేలు** చూ. వట్టు¹.

**వట్టిపువ్వాను** చూ. వట్టు¹.

**వట్టిపోవు** చూ. వట్టు¹.

**వట్టిప్రయాసము** చూ. వట్టు¹.

**వట్టిమన్ను** చూ. వట్టు¹.

**వట్టిమాట** చూ. వట్టు¹.

**వట్టిమొగమాట** చూ. వట్టు¹.

**వట్టియావు** చూ. వట్టు¹.

**వట్టిరాకపోకలు** చూ. వట్టు¹.

**వట్టివదియము** చూ. వట్టు¹.

**వట్టివరి** చూ. వట్టు¹.

**వట్టివాఁడు** చూ. వట్టు¹.

**వట్టివాపులుసేయు** చూ. వట్టు¹.

**వట్టిసరులు** చూ. వట్టు¹.

**వట్టు¹** అ.క్రి. **1.** ఇంకు. భార. అరణ్య. 4.67 ; **2.** శుష్కించు, ఎండు. భార. సౌప్తి. 1.198 ; **3.** కృశించు మార్క. 8.139 ; **4.** (పశువు) పాలులేనిదగు. వరాహ. 10.28; వి. **1.** పక్క. గౌ. హరి. పూ. 2062 పం. **2.** వరుగు, శుష్కశలాటువు, ఎండుకాయ. ఆం. భా. 2.39 ; **3.** దూలం. మొ. వాటికి బలంకోసం వేసేకట్టు ; **4.** శపథం.

క. బత్తు. ఇంకిపోవు, ఆవిరైపోవు. బత్తె. ఎండిపోవు, చిక్కిపోవు ; తు. బత్తు. ఎండిపోవు; చిక్కిపోవు, త.

వఱ్ఱు. ఎండిపోవు, నిరుపయోగమగు, మట్టిపోవు, వఱల్. ఎండిపోవు, చిక్కిపోవు ; మ. వఱ్ఱు. ఎండిపోవు (పుండు మొ. వి) మాను, వఱుళుక. ఎండిపోవు ; కో. వత్-. (ద్రవం మొ.వి) ఇంకిపోవు ; తొ. పెళ్-. (ఎద్దు మొ.వి) ఎండిపోవు ; గోం. వత్త్. ఎండిపోవు ; కుయి. వస. సన్నగాఉండు ; పర్జి. వెల్. ఎండిపోవు ; కొలా. వత్-. కాల్చు, వేయించు ; మాల్తొ. బత్-. ఎండిపోవు ; బ్రా. బాఝ్. ఎండిపోవు ;

పో. చూ. సం. వ్యర్థ-. పనికిమాలినది.

మూ. ద్రా. *పత్-, *వత్త్.

**వట్టగట్టు** అ.క్రి. ఇంకిపోవు. తాళ్ల. సం. 5.183. <వట్టు[1] +-అ[7]+కట్టు. **వట్టి**[3] విశ. 1. రిక్తం, శూన్యం, ఏమీలేని. కు.సం. 1.32 ; 2. ప్రయోజనం లేనిది, నిష్ఫలం. వ్యర్థం. బసవ. 2.219 ; 3. శుష్కం, ఎండిపోయినది. భార. ద్రోణ. 2.60 ; 4. కారణం మాలినది, నిష్కారణం. శుక. 2.137 ; 5. పాలుడిగినది. <వట్టు[1]—-ఇ[9]. **వట్టికాలు** వి. మోకాలికింద భాగం, పిక్క వెలుపలి భాగం. **వట్టికొడిమెలుకట్టు** అ.క్రి. అనవసరంగా బాధ్యుల్నిచేయు, లేని నిందమోపు. **వట్టిగడ్డి** వి. ఎండుగడ్డి. **వట్టిగాంభీర్యము** వి. మేకపోతు గాంభీర్యం. ఆము. 5.7. సం. గాంభీర్య-. లోతు. **వట్టిగొడ్డు** వి. పాలీయని (పాలిచ్చిమానివేసిన) పశువు. **వట్టిగొడ్డుతాకట్టు** వి. వ్యర్థం, నిష్ప్రయోజనం. కళా. 4.74. **వట్టిగొర్రు** రూ. అలగొర్రు. వి. మెట్టనేలలు దున్నే గొర్రు, నాగలితో దున్నిన తర్వాత పెళ్ళలు నలగటానికి దీనితోదున్నే గొర్రు. **వట్టిచేతులు** వి.బ.వ రిక్తహస్తాలు. **వట్టిచేప** వి. ఎండుచేప. **వట్టిజోలి** వి. ఖాళీసంచి. తాళ్ల.సం. 14.29. **వట్టితానములు** వి.బ.వ. శుష్కస్నానాలు. కళా. 7.29. **వట్టితునకలు** వి.బ.వ. ఎండిన మాంసం, పరుగులు ఉప్పుకుండలు, ఉప్పాంసులు. **వట్టిది** విశ. ఏమీలేనిది, కల్ల అయినది. **వట్టిదిపోవు** అ.క్రి. పొయ్యిమీద వంటకాలేవీ లేకుండా ఊరకే కట్టెలు కాలిపోవు. **వట్టిదుక్కినాగలి** వి. మెట్టనాగలి, మెట్టదుక్కికి ఉపయోగించే నాగలి. **వట్టినూతికివరగట్టు** అ.క్రి. నిష్ప్రయోజనమైన పనిచేయు. మదన. శత. 6. **వట్టిపగ్గెలుప్రేలు** అ.క్రి. ప్రగల్భాలాడు, డప్పులుకొట్టు. శుక. 3.23. **వట్టిపువ్వాకు** వి. ఎండిన పొగాకురంగు. **వట్టిపోవు** రూ. వట్టుపోవు. అ.క్రి. 1. ఎండిపోవు. భాస్క. రా.యు. 763 ; 2. పశువులు పాలివ్వటం మానివేయు, పాలుడిగిపోవు ; 3. వాడిపోవు. **వట్టిప్రయాసము** వి. వృథాప్రయాస. కళా. 8.164. సం. ప్రయాస-. శ్రమ. **వట్టిమన్ను** వి. విడివిడిగాఉన్న మన్ను. **వట్టిమాట** వి. లేని మాట, అపవాదం. **వట్టిమొగమోట** వి. వ్యర్థముఖ దాక్షిణ్యం, దాక్షిణ్యం చూపకూడని చోట చూపటం. కళా. 3.188. **వట్టియావు(-ఆవు)** వి. పాలులేనిఆవు. **వట్టిరాకపోకలు** వి.బ.వ. నిష్ప్రయోజనంగా రావటం, పోవటం. కళా. 4.64. **వట్టివడియము** వి.బ.వ. మినుము మొ. వాటితో చేసిన పిండివడియం. **వట్టివరి** వి. సస్యవిశేషం, అడవి గోధుమ. **వట్టివాడు** విశ. వ్యర్థుడు. **వట్టివాపులు సేయు(-చేయు)** స.క్రి. లేని బలాన్ని ఉన్నట్లుగా అనుకొను. తాళ్ల.సం. 11-3-7. **వట్టిసరులు** వి.బ.వ. ధాన్యవిశేషం. **వట్టుపోవు(పోవు)** రూ.చూ. వట్టిపోవు, అ.క్రి. ఎండిపోవు, ఇంకిపోవు. తాళ్ల.సం. 15.214. **వట్లు** వి.బ.వ. ముఖం మీద ఎండిన కన్నీటి గుర్తులు.

**వట్టు**[2] చూ. పట్టు[2]. వి. వరకు.

**వట్టె** రూ.చూ. వట్టి[1]. వి. చీపురుపుల్లలవంటి కాడలతో సువాసనగల వేళ్ళుండి పశుగ్రాసంగాను, ఇంటికప్పులకు పనికివచ్చే ఒకరకం గడ్డి.

**వట్నము** వి. ధాన్యాదులు నింపిన గోనె.

**వట్నాలకర్ర** వి. ధాన్యాదులుంచుకునే సంచిమోసే కర్ర.

**వట్నాలకర్ర** చూ. వట్నము.

**వ్రట** రూ.చూ. వ్రటువ. విశ. గుండ్రం.

**వ్రటన** వి. వర్తులత్వం, గుండ్రన. **వ్రటపడు** అ.క్రి. 1. తక్కువగు. భార. కర్ణ. 1.231 ; 2. తగ్గు. **వ్రటపెట్టు** స.క్రి. 1. తక్కువపరచు, తగ్గించు ; 2. నష్టపెట్టు. **వ్రటించు** అ.క్రి. తిరుగు, పరాఙ్ముఖమగు. హరి. ఉ. 1.105. <వ్రట+-ఇంచు[3]. **వ్రటిలు** రూ.చూ. వ్రటిల్లు. అ.క్రి. 1. ప్రవర్తిల్లు. హరి. ఉ. 6.50 ; 2. కలుగు, జనించు. భాగ. 10ఉ. 786 ; 3. తిరుగు. విజయ. 2 46. **వ్రటిల్లు** రూ. వ్రటిలు. అ.క్రి. 1. ప్రవర్తిల్లు. బసవ. 2.391 ; 2. కలుగు, జనించు. పండి. చ. 2-3-154 ; 3. తిరుగు. విజయ. 12.

**వ్రటము** రూ.చూ. వ్రటువ. వి. వక్కాకుతిత్తి. హంస. 1.233 ; విశ. హ్రస్వం, పొట్టిది.

**వ్రటించు** చూ. వ్రట.

**వ్రటింత** వి. ఒకరకం గడ్డిమొక్క.

**వ్రటిలు** చూ. వ్రట.

**వ్రటిల్లు** చూ. వ్రట.

**వ్రటువ** రూ. వ్రట, వ్రటము, వ్రటువు. విశ. గుండ్రం, వర్తులం. భార. ఆది. 4.44 ; క్రి. విశ. గుండ్రంగా, వర్తులంగా. గౌ. హరి. పూ. 782 ; వి. వ్యంజనంతో చేరిన ఉకార చిహ్నం. అప్ప. 3 293.

సం. వర్తుల-. వృత్తాకారం ; ప్రా. వట్టుఅ. వట్టుల- వృత్తాకారం ; పా. అస. వట్టుల-. వర్తులం ; క. వ్రటు.

<ప్రా. వట్టుఅ-.

**వ్రటువముస్తె** వి. తుంగముస్తె, గుండ్రంగా ఉండే గడ్డి, గుండ్రతుంగ. **వ్రటువవాలు** వి. విష్ణుచక్రం. **వ్రటువసుడి** రూ.చూ. వ్రటుసుడి. వి. వ్యంజనంతో చేరిన ఉకారానికి గుర్తు.

**వ్రటువు** రూ.చూ. వ్రటువ. క్రి. విశ. గుండ్రవి.

**వ్రటుసుడి** రూ. వ్రటువసుడి. వి. వ్యంజనంతో కూడిన ఉకారానికి గుర్తు. అప్ప. 4.49.

**వట్లు** చూ. వట్టు[1].

**వరము** వి. ప్రథలో జోడించే పంపురేకు.

సం. వటు-. ఉండ, ఇనపతాడు, పోలిక, పూర్ణబిందువు,

గారె, మ్రిచెట్టు.

<సం. వట-.

**వఠర** రూ.చూ. వఠారి. విణ. సమర్థుడు, నేర్పరి. ద్వి. భాగ. 8నక్కం.

**వఠరి** రూ.చూ. వఠారి. విణ. సమర్థుడు.

**వఠారి** రూ. వటగ, వఠర, వటారి, వఠర, వఠరి. విణ. సమర్థమైన. ఉ. హరి. 2.194.

సం. వఠర-. శఠుడు, మందబుద్ధి, మూర్ఖుడు.

<సం. వఠర-.

**వడ**[1] వి. **1**. వేడిగాలి. కు. సం. 6.136 ; **2**. వేడిమి, పరితాపం. హరి. ఉ. 9.225 ; **3**. తాపం. విక్ర. 3.77 ; **4**. హిమం, మంచు. ద్వి. పరమ. వి. 250పు. 16పం ; **5**. దప్పి, దాహం. ఆము. 2.59 ; **6**. శ్రమం, బడలిక. ఆము. 6.92 ; **7**. ఆకలిబాధ, క్షుద్బాధ. శుక. 3.417 ; విణ. ఉష్ణం, వేడైనది.

క. వడి, ఒడి. వేడి.

**వడగండ్లు** రూ. వడగళ్ళు. వి.బ.వ. రాళ్ళు, వాన మాదిరగా పడే చిన్నమంచుగడ్డలు. <వడ[1]+కల్లు[2]+-లు. **వడగర** వి. గట్టు, తీరం, దరి. ద. హిం. కా. సంపు. 5. కా. సం. 42. **వడగల్లు(-కల్లు**[2]**)** వి.ఔ.బ.వ. వడగళ్ళు. వర్షోపలం, వానకురిసేటప్పుడు పడేమంచు రాయి. కు.సం. 6.99. **వడగాడ్పు** రూ. వడగాల్పు[1]. వి. కత్తెరగాలి, మంటగాలి, ఎండాకాలం వీచే వేడిగాలి. **వడగాయ(-కాయ)** వి. ఎండి పగలటానికి సిద్ధంగా ఉన్న పత్తికాయ. **వడగాలి** వి. వేసవిలో పడమరనుంచి వీచేనిప్పుగాలి, వేడిగాడ్పు. కు.సం 7.68. **వడగాల్పు**[1] రూ.చూ. వడగాడ్పు. వి. వేసవిలో పడమర నుంచి వీచే నిప్పుగాలి. **వడఁగొట్టు (-కొట్టు**[1]**)** అ.క్రి. ఎండతో తపించు. **వడగొను (-కొను)** అ.క్రి. వేసవిలో వీచే నిప్పుగాలి వల్ల తాపం చెందు. భార.విరా. 1.151. **వడగొమ్మ (-కొమ్మ)** వి. కొనచుట్టూ తిరిగినకొమ్మ. **వడచక్కి** వి. ఉత్తరదిక్కు. **వడచక్కియెకిమీఁడు (-ఎకిమీఁడు)** వి. ఉత్తర దిక్కును పరిపాలించే రాజు, కుబేరుడు. **వడచక్కియేలిక (-ఏలిక)** రూ. వడ చక్కేలిక. వి. ఉత్తర దిక్కున పరిపాలించేవాడు, కుబేరుడు. **వడచక్కేలిక** రూ.చూ. వడచక్కియేలిక. వి. కుబేరుడు. **వడచల్లుచూపుకాఁడు** వి. చల్లని చూపులు కలవాడు. తాళ్ల.సం. 4.106. **వడచల్లుమేను** వి. చల్లటిశరీరం. తాళ్ల.సం. 4.164. **వడదాఁకు (-తాఁకు)** అ.క్రి. **1**. నిప్పుగాలి, సోకు. హరి. ఉ. 9.9 ; **2**. ఎండ దెబ్బతగులు. మను. 2 47. **వడదీరు (-తీరు)** అ.క్రి. దప్పితీరు. తాళ్ల.సం. 12.264. **వడదెస** వి. ఉత్తరదిక్కు. **వడదేర్చు (-తీర్చు)** అ.క్రి. దప్పితీర్చు. పరమ. 2.922. **వడఁదేఱు(-తేఱు)** అ.క్రి. **1**. శ్రమనొందు. పి.శకు. 3.69 ; **2**. వడగొను, వాడిపోవు. పాండు. 3.65 ; **3**. తాపంతొలగు. **వడపప్పు** వి. (శ్రమపరిహారార్థం) నానబెట్టిన పెసరపప్పు. ఆము. 2.73. **వడపిందె** వి **1**. తాపం తీరటానికి తినే ఊరబెట్టిన మామిడి పిందె. కాశీ. 4.114 ; **2**. వేడిచేత రాలిపోయే పిందె. కవిక. 6.42. **వడపోయు** అ.క్రి. సరిచేసి చుట్టిన ఉన్ని పడుగు అచ్చుకోలకు వేయు. **వడముడి** వి. (శత్రువులకు) తాపం కూడించే దోటు, భీముడు. భార. ఆది. 6.103. **వడముడిగాఁజొచ్చివాతవెళ్లు** అ.క్రి. అతినేర్పరులగు, మాయావులగు. గొ.హరి. 2.433,34. **వడంబలి** వి. ఒకరకం అంబలి, తాపాన్ని పోగొట్టే అంబలి. ప్రబంధ. 122. <వడ[1]+అంబలి. **వడసెందు (-చెందు)** అ.క్రి. సొమసిలు, మైమరచు.

**వడ**[2] వి. **1**. గారె. భీమ. 1.60 ; **2**. మిరపకాయలు మొ. సంబారాలు చేర్చి చేసిన గారె. ఉ.రా. 6.122.

సం. వట -, వటక -. గారె, భక్ష్యవిశేషం, గుండ్రని చిన్నముద్ద ; ప్రా. వడ-, వడయ-, వడీ. ఖాద్య విశేషం ; అ.మా. వడగ-. వడీ ;

క. వడె, వొడె ; తు. వడె ; త. వటకమ్, వడై ; మ. వట, వటకం.

<ప్రా. వడ-.

**వడలపళ్లెము** రూ. వడలిపల్లెం. వి. గారెలపళ్ళెం, వడల తళిగె. ద.హిం.కా. సంపు. 4. కా.సం. 981. క్రీ.శ. 1518. **వడలిపల్లెం** రూ.చూ. వడలపళ్లెము. వి. వడలు ఉంచిన పళ్లెం.

**వడ**[3] వి. కళ్ళంలో ఒకసారి తొక్కించిన తరువాత కూడ మెదగని కంకులు.

**వడకపెండ్లికొడుకు** వి. **1**. వడుగు చేసుకునేవాడు ; **2**. బ్రహ్మచారి.

**వడకవప్పు** వి. చిన్నముక్క.

**వడగట్టు** చూ. వడియు[1].

**వడగరులు** వి.బ.వ. నీలగిరిప్రాంతవాసుల్లో ఒకతెగ.

**వడగల** వి. ఒకతెగ వైష్ణవుడు.

**వడగవ్వ** వి. మత్స్యవిశేషం.

**వడగాల్పు**[2] రూ.చూ. వడిగాల్పు. వి. నల్లకాల్పులోపాత్రలు కొంత తెల్లగా కాలినకాల్పు.

**వడంకు** రూ.చూ. వడఁకు. అ.క్రి. కంపించు. భార. విరా. 2.47 ; వి. 1. కంపం. ఉ.రా. 5.274 ; **2**. మంచు.

**వడంగుండ** రూ. ఒడంగుండు. వి. తాపీ పనివాళ్ళ, గోడల మట్టం సరిచూడటానికి వాడే పరికరం.

<వడంబం+గుండు.

**వడఁకాఁడు** చూ. వడఁకు.

**వడఁకు** రూ. వడంకు, వణఁకు, వణుకు, వళకు. అ.క్రి. కంపించు. కు.సం. 2.70 ; వి. **1**. కంపం. హరి. పూ. 8.188 ; **2**. హిమం, మంచు.

క. బళకు, బలికు, బళుకు. వణుకు, చలించు, బళకిసు, బళుకిసు. కంపించు, చలించు, ఒణకు. వణుకు, చలించు : తు. బళకుని. కంపించు, వణుకు ; తుయి. వఙ్ప, వర్జు. వణుకు, చేత్తో కదిలించు ; కొలా. వడికె-. వణుకు ; నా. వఅక్. వణుకు.

మూ. ద.ద్రా. మూ.మ.ద్రా. *వట్-, *వళె- వణ్-.

**వడఁకాడు** రూ. వణఁకాడు. అ.క్రి. కంపించు, వడకు. భార. భీష్మ. 2.290. <వడఁకు+ఆడు. **వడఁకుగుబ్బలి** రూ. వణఁకు గుబ్బలి. వి. హిమాలయపర్వతం వరాహ.

9.58 వడఁకుగుబ్బలికన్నె వి. పార్వతీదేవి. ఉ.రా. 2.28. వడఁకుగుబ్బలికూఁతుకొడుకుఁగుజ్జు వి. వినాయకుడు. కాశీ 1.2. వడఁకుఁగొండ (-కొండ) రూ. వణఁకుఁ గొండ. వి. చలిమల, హిమవత్పర్వతం. రామాభ్యు. 1.26. వడఁకు త్రోవ వి. ఉత్తరాయణం. వడఁకుపుడమితాలుపు వి. మంచు కొండ, హిమాలయం. వడఁకుమల వి. చలిమల, హిమ వత్పర్వతం. యయా. 2.41. వడఁకుమెట్ట వి. హిమగిరి. పి.శకు. 1.236. వడఁకులగుబ్బలి వి. చలిమల, హిమ వత్పర్వతం. వడఁకులగుబ్బలికుమారి వి. పార్వతీదేవి. హర. 7.78.

**వడచు** చూ. వడియు[1].

**వడదోలు** చూ. ఒడి. వి. 1. గవుళ్ళవాడు, మొలకు కట్టుకునే నిడుపుతోలు. చా.మం. 1.132, చెన్నబసవ. 5.252 ; 2. వేటగాడు శరీరానికి కప్పుకునే నిడుపు తోలు. బల్లా. 3.

**వడప**[1] వి. 1. కొబ్బరిమొ. చెట్ల మొదళ్ళను చుట్టిఉండే వల లాంటి కప్పు ; 2. పేనినవార, తడప.

**వడప**[2] వి. ఫలశూన్యత. ? వడపప్పు

**వడపడు** రూ.చూ. ఒడంబడు. అ.క్రి. సంబంధపడు. తాళ్ల. సం. 9.53.

**వడపు** రూ.చూ. ఒడుపు. వి. 1. లాఘవం ; 2. అనర్థమైనలాభం : 3. పరిపొలంలో ఎక్కువ తేమ ఉన్న ప్రదేశం : 4. వట్టం ; 5. కొండ మీద పణుకు కింద ఉండే గుహలాంటి చోటు ; 6. లోయ.

**వడపోయు** చూ. వడియు[1].

**వడము**[1] వి. దండ. దశకు. 3 77.

సం. వట -.జనపతాడు ; ప్రా. వడ -. తాడు ; పా. వటక-. తాడు ; మరా. వటం. తాడు.

**వడము**[2] వి. 1. చేపలు పట్టే పరికరం. వల ; 2. మోకు.

**వడంబగుండు** చూ. వడంబము.

**వడంబము** రూ.చూ. ఒడంబము. వి. తాపీపనివాళ్ళు గోడల మట్టం చూడటానికి వాడే పరికరం.

**వడంబగుండు** రూ. ఒడంబగుండు. వి. తాపీపనివాళ్ళు గోడల మట్టం సరిచూడటానికి వాడే పరికరం. < వడంబము + గుండు.

**వడంబరం** రూ.చూ. ఒడంబము. వి. తాపీపనివాళ్ళు గోడల మట్టం చూడటానికి వాడే పరికరం.

**వడఁబడు** రూ.చూ. ఒడంబడు. అ.క్రి. వశమగు. తాళ్ల.సం. 5.230.

**వడఁబెట్టు** చూ. వడియు[1].

**వడఁబోయు** చూ. వడియు[1].

**వడయం** రూ.చూ. వలయం. వి. గుండ్రటి వస్తువుల చుట్టు కొలత.

**వడయార్లు** వి.బ.వ. శాలివాహన తెగకు చెందిన కుమ్మర్లు.

**వడరాని** వి. దండెకట్టు, తూర్పార పోసేటప్పుడు మేలురాని పక్కన పడే పొట్టు గింజలు కలిసిన భాగం.

**వడలిడు** చూ. వడలు.

**వడలు** రూ. వడులు. అ.క్రి. పువ్వులు మొ. వి వాడు.

**వడలిడు** అ.క్రి. చీలిపోవు, విచ్చిపోవు. HAS 19.37 క్రీ.శ. 1358. < వడలు + ఇడు.

**వడవడ** చూ. వడఁకు. వి. వణకటంలో అయ్యే అనుకరణం. భార. ఆది. 2.85.

**వడవడకలుడుగు** (-ఉడుగు) అ.క్రి. భయంతీరు, భయరహితులగు. కళా. 6.114.

**వడవడఁకు** చూ. వడఁకు. అ.క్రి. మిక్కిలి వణకు. ఆం. భా. 1.153.

**వడవడఁకులుగొను** రూ. వడవణఁకులుగొను. అ.క్రి. మిక్కిలి వణకు. శివరా. 4.38. వడవడ వడఁకులు కుడుచు అ.క్రి. మిక్కిలి వడకు. కళా. 6.225.

**వడవణఁకులుగొను** రూ.చూ. వడవడఁకులుగొను. అ.క్రి. మిక్కిలి వణకు.

**వడవు** వి. విధం, రీతి.

**వడవెట్టు** చూ. వడియు.[1]

**వడవేయు** స.క్రి. గట్టిగా మెలివేయు.

**వడస** రూ.చూ. వరుస. వి. 1. పంక్తి ; 2. మూరు, తడవ.

**వడసారము** రూ. వడారము. క్రి.విశ. బొత్తిగా.

**వడసాలె** వి. తంతువాయుభేదం, సాలీలలో ఒకతెగ. హంస. 3.28.

**వడారము** రూ.చూ. వడసారము. క్రి.విశ. బొత్తిగా మెదలంట.

**వడి**[1] రూ. అడ[3], అడి[4], ఒడి[3], వాడి[1]. వి. 1. కొన్ని చోట్ల ఇది వాక్యాలంకారంగా ప్రయోగించబడుతుంది. భార. ఆది. 1.80 2. వేగం. భార. ఆది. 2.15, ద. హిం. గా. సంపు. 6. శా. సం. 628. క్రీ.శ. 1224 ; 3. శక్తి, సామర్థ్యం. పండి. చ. 4.202 ; 4. కాలం. నిర్వ. రా. 10.78 ; 5. శౌర్యం. భార. కర్ణ. 3.377 ; 6. తైక్ష్ణ్యం. పరమ. 4.223 ; 7. దారం మొ. వాటిపిరి. కళా. 3.83 ; 8. పురిబిగువు ; 9. పురి బిగువున పడేచిక్కు ; 10. రాట్నం ఆకుల తాడును, కదురును కలిపే గట్టిదారం ; 11. దబ్బా చక్రాన్ని గంటాన్ని కలిపే గట్టిదారం ; 12. దారపుపోగు మెలిదిరగగా వచ్చిన గట్టితనం ; 13. నేత నేసేటప్పుడు పడుగులో పైపోగులను కిందికి కిందిపోగులనుపైకి జరపటానికి వీలుగా నాలుగు కర్రలను వడిదారాలతో లంకెలు వేసిన పనిముట్టు ; 14. అచ్చుకట్టేటప్పుడు రెండు అచ్చు కర్రలకు కట్టిన పురిదారాలకు లంకెపడేటట్టు వేసిన అల్లిక ; 15. పేటు దారానికి చివరకట్టిన పురిదారం ; 16. నవారు మగ్గం కట్టుబడిలో పైపట్టెకు కింద బిగించిన కర్రకు అల్లిన పురిదారం ; 17. పేటు దారానికి చివరకట్టిన పురిదారంలో అంచు పోగుదూర్చే నందు : 18. తాడు పేనటంలో తిప్పే మెలిక ; 19. మిట్టపల్లం : క్రి.విశ. వేగంగా. హంస. 1.254.

క. వడి. వేడి ; త. వటి-. ప్రవహింప చేయు, వాడి చేయు, వటి. వాడిమి. తాడు.

**వడిఅతుకు** రూ. అడిఅతుకు. స.క్రి. బద్దెపోగులకు పడుగు పోగులు కలిపి వడిపెట్టు. **వడికట్టె** వి. అము కాలేటప్పుడు అముపైన రంధ్రాలు పడకుండా మసిని దట్టించటానికి కాల్చు తరవాత పైకుండల్ని తీయడానికి వాడే వెదురు కట్టె. **వడికట్టు** రూ. అడికట్టు, ఒడికట్టు[1].

వి. **1.** కుండలమీద చేసే నగిషీపని. హంస. 5.13 ; **2.** అచ్చు కట్టేటప్పుడు రెండు అచ్చు కర్రలకు కట్టిన పురి దారాలకు లంకె పడేటట్లు వేసిన అల్లిక ; అ.క్రి. అచ్చు కట్టేటప్పుడు అచ్చుకర్రలకు పురిదారంకట్టు. **వడికట్టుజరుపు** రూ. అడికట్టు జరుపు. స.క్రి. అచ్చుతికిన పడుగులో అతుకు పోగులు అచ్చులో నుంచి పన్నె ఇవతలికి జరుపు. **వడికట్టుబద్ద** రూ. అడికట్టు బద్ద. వి. అచ్చు కట్టేటప్పుడు వడి దారాల లంకెల్లో దూర్చిన బద్ద. **వడికత్తెర** రూ. అడికత్తెర. వి. అచ్చు కట్టేటప్పుడు రెండు అచ్చు కర్రల వడి దారాలకు వేసిన లంకె. **వడికమ్ము** అ.క్రి. ఆములో బాగా వేడి ఎక్కు. **వడికర్ర** రూ.చూ. వడిగర్ర. వి. అచ్చులో వడిదారం కట్టిన కర్ర. **వడికాఁడు** వి. **1.** వేగ వంతుడు ; **2.** శౌర్యం కలవాడు **వడికాలము** వి. వేసవి. సిం.ద్వా. 9.13. **వడికొలికి** రూ. ఒడికొలికె. వి. అచ్చు కట్టేటప్పుడు రెండు అచ్చు కర్రల వడిదారాలకు వేసినలంకె. **వడికొలుపు** అ.క్రి. మెలిపెట్టు. **వడికోల** రూ. అడికోల. వి. అచ్చులో వడిదారం కట్టిన కర్ర. **వడిగర్ర (-కఱ్ఱ)** రూ. వడికర్ర. వి. అచ్చులో వడిదారం కట్టిన కర్ర. **వడిగల** క్రి. విశే. **1.** వేగంకల ; **2.** శూరత్వంకల. **వడిగలతనము** వి శౌర్యం, శూరత్వం. రామవ. పీఠి. 37. **వడిగలవాఁడు (-కలవాఁడు)** విశే. శూరుడు. రాజవా. 5.8. **వడిగాల్పు (-కాల్పు)** రూ. వడగాల్పు². వి. నల్లకాల్పులో పాత్రలు కొంత తెల్లగా కాలిన కాల్పు. **వడిగిరక** రూ. వడిగిర్క. వి. మిషను వడిదారం చుట్టిన కొయ్యగిలక. **వడిగిర్క** రూ.చూ. వడిగిరక. వి. మిషను వడిదారం చుట్టిన కొయ్య గిలక. **వడిగుది** రూ. అడిగుది. వి. అచ్చుకర్రకు పైన కట్టిన దారం. **వడిగుప్పి గంతులు (-గుప్పిగంతులు)** వి.బ.వ. బాలక్రీడా విశేషం. హంస. 3.146. **వడిగూడు** వి. అచ్చు కట్టేటప్పుడు రెండు అచ్చుకర్రల వడిదారాలకు వేసిన లంకె. **వడిగొను (-కొను)** అ.క్రి. **1.** వేగంకలుగు, త్వరపడు. భార. ఆరణ్య. 3.238 ; **2.** వడియు, కారు, స్రవించు. వను. 4.23; **3.** మెలిగొను. **వడిగొలుపు** రూ.చూ. వడి గొల్పు. స.క్రి. వడికొనచేయు, మెలిపెట్టి పడవేయు. **వడి గొల్పు(-కొల్పు)** రూ. వడిగొలుపు. స.క్రి. వడికొనచేయు, మెలిపెట్టు, వడివేయు. కాశీ. 1.47. **వడిచుట్టు** వి. **1.** చిక్కు, ఇక్కట్టు, గొప్పచిక్కు ; **2.** హఠాత్తుగా వచ్చే ఆపద ; **3.** వేగంగా చుట్టుకొను ; **4.** మెలిచుట్టు ; **5.** దారం పిరిఎక్కు. అ.క్రి. పురిఎక్కు. **వడితనము** వి. కొందరపాటు. **వడితాడు (త్రాడు)** రూ. ఒడితాడు. వడిదాడు. వి. **1.** రాట్నం ఆకుల తాడును, కదురును కలిపే గట్టిదారం : **2.** దబ్బారాట్నం చక్రాన్ని గంటాన్ని కలిపే గట్టిదారం ; **3.** అచ్చుకట్టేటప్పుడు అచ్చు కర్రలకు కట్టేపురిదారం ; **4.** అచ్చు కట్టేటప్పుడు వడిదారాల బిగింపుకు అచ్చుకర్రమీది మెలికల్లో దూర్చిన లావుదారం. **వడితిరుగు** అ.క్రి. మెలికతిరుగు, పెనవడు. **వడిదాడు** రూ.చూ. వడితాడు. వి. **1.** రాట్నం ఆకుల తాడును, కదురును కలిపేగట్టిదారం ; **2.** దబ్బారాట్నం చక్రాన్ని గంటాన్ని కలిపే గట్టిదారం; **3.** అచ్చుకట్టేటప్పుడు అచ్చుకర్రలకు కట్టే పురిదారం ; **4.** అచ్చు కట్టేటప్పుడు వడిదారాల బిగింపుకు అచ్చు కర్రమీది మెలికల్లో దూర్చిన లావుదారం **వడిదారం** రూ. ఒడిదారం. వి. **1.** రాట్నం ఆకుల తాడును కదురును కలిపే గట్టిదారం ; **2** దబ్బా రాట్నం చక్రాన్ని, గంటాన్ని కలిపే గట్టిదారం ; **3.** అచ్చు కట్టేటప్పుడు అచ్చుకర్రలకు కట్టే పురిదారం ; **4.** అచ్చు కట్టేటప్పుడు వడిదారాల బిగింపుకు అచ్చుకర్ర మీది మెలికల్లో దూర్చిన పురిదారం ; **5.** ఉన్ని పడుగు మీద అచ్చుకోలకు అనులు వేస్తూ అల్లిన లావుపాటి పోగు. **వడిదిప్పు (-త్రిప్పు)** అ.క్రి. **1.** అచ్చుకట్టేటప్పుడు అచ్చుబిళ్ళకు వడిదారం చుట్టి కట్టు ; **2.** తిరిగేటట్లుచేయు. **వడిదుడుకు** వి. **1.** గొప్పచిక్కు ; **2.** ఎచ్చు తక్కువ ; **3.** ప్రమాదం ; **4.** నడతలో ఒక క్రమరీతిలేని వ్యక్తి. **వడినూలు** చూ. వడుకు నూలు. వి. రాట్నం మీదగాని చేతికదురు మీదగాని వడికిన నూలు. **వడిపట్టు** స.క్రి. వానేటప్పుడు సారెను వేగంగా సారెకర్రతో తిప్పు. **వడిపుల్ల** వి. **1.** అచ్చుకట్టేటప్పుడు పన్నెగూళ్ళలోకి పోగులు దూర్చేపుల్ల ; **2.** అచ్చుకట్టేటప్పుడు వడిదారాల బిగింపుకు అచ్చుకర్రమీది మెలికల్లో కొండతాడుకు బదులు దూర్చిన సన్నపుల్ల. **వడిపెట్టు** రూ. వడివెట్టు. స.క్రి. **1.** మెలిపెట్టు. గౌ. హరి. పూ. 1428, విక్ర. 8.18 ; **2.** నులుము. హంస. 3.141. **వడిపోగులు** వి.బ.వ. అచ్చు కట్టేటప్పుడు అచ్చుకర్రలకు కట్టే పురిదారం. **వడిబండి** రూ. ఒడిబండి.వి. గంటానికి బిగించిన రీలుదారంబండి. **వడిబద్దె** రూ. అడిబద్దె. వి. అచ్చుకట్టేటప్పుడు అచ్చుకర్రలకు కట్టే పురి దారం. **వడిబుట్టు(-పుట్టు)** అ.క్రి. ఆములో బాగా వేడిఎక్కు. **వడిమెలికె** రూ. ఒడిమెలికె. వి. అచ్చుకట్టేటప్పుడు రెండు అచ్చుకర్రల వడిదారాలకు వేసిన లంకె. **వడియెక్కు(-ఎక్కు)** అ.క్రి. వడిగొను, మెలిపడు. ప్రబోధ. 5.27. **వడివంగు** అ.క్రి. గర్వం అడుగు, నిక్కుపోవు. **వడివడు(-పడు)** అ.క్రి. 1. వేగంచెడు. పాండు. 3.128 ; **2.** బాధపడు. **వడివాఁడు** విశే. 1. వడికలవాడు ; **2.** యోధుడు, జెట్టి. **వడివెట్టు(-పెట్టు)** రూ.చూ. వడిపెట్టు. అ.క్రి. **1.** వస్త్రకాళితం పట్టు. కు.సం. 5.139 ; **2.** చెప్పినపనిచేయు. సేవకవృత్తి చేయు. బసవ. 5.131 ; స.క్రి. 1. మెలిపెట్టు. కేయూ. 4.50 ; **2.** నులుము. **వడివేయు** అ.క్రి. మెలివేయు ; స.క్రి. మెలిపెట్టు. **వడిసరి** వి. అచ్చుకట్టేటప్పుడు అచ్చు కర్రలకు కట్టేపురిదారం. **వడిసూత్రం** రూ. ఒడిసూత్రం వడిసూత్రం వి. అచ్చునుపైనుంచి వేలాడదీసే పొడుగుతాడు. **వడిసూత్రం** రూ.చూ. వడిసూత్రం. వి. అచ్చునుపైనుంచి వేలాడదీసే పొడుగుతాడు. **వడిసెడు(-చెడు)** అ.క్రి. బలముడుగు. భాస్క. రా.యు. 533. **వడులురాల్చు** అ.క్రి. అచ్చులో అంచుబద్దె పోగులు వదులగుండా పన్నె ఇవతలకుతీయు. **వడేకు** వి. ఇనపబద్దీలను సాగగొట్టటానికి కింద ఆపుగా పెట్టిన రాతిదిమ్మ. **వడేయు** రూ. వొడేయు. స.క్రి. వానేటప్పుడు వేగం తగ్గిపోకుండా సారెను కర్రతో తిప్పు. < వడి¹ + వేయు. **వడేరుకుట్టు** వి. మూత్రంలో రక్త స్రావం. < వడి¹ + ఏరు + కుట్టు. **వళ్ళకట్టె**

రూ. ఒళ్ళకట్టె. వి. 1. డిజైన్లు నేసే మగ్గంలో పేటుదారాలను పైకి ఎత్తటానికి వాడే కొయ్యపనిముట్టు ; 2. నవారుమగ్గానికి వడిదారాలు అల్లేకర్ర. **వళ్ళగుంట** వి. పేటు తూకాలు నేలను తగలకుండా వేలాడటానికి మగ్గం గుంటకు పక్కగా తీసినగొయ్యి. **వళ్ళమొల** రూ. వల్లమొల. వి. అచ్చుకట్టేటప్పుడు పడిదారాల లంకెల్లో దూర్చిన సన్నబెత్తం.

**వడి**[2] వి. యతి. రుక్మా. చ. 1.27.

సం. వలి-. యతి, మడత, వడి. విభాజనే. అనే ధాతు నిష్పన్నమని కొందరు.

త. వరి వళి-. మార్గం, పరంపర.

<సం. వళి-.

**వడిసీసము** వి. ప్రాసలేనిసీసపద్యం.

**వడికెపీట** రూ. అడికెపీట. వి. ఉన్నివడికేటప్పుడు ఆడవాళ్ళు కూర్చోవటానికి వేసుకొనేపీట.

**వడిఁగట్టు** చూ. వడియు[1].

**వడిపించు** చూ. వడియు[2].

**వడిపిల్లు** రూ.చూ. వరిపిలి. వి. వరిమొక్కలాగాఉండి మాగాణి నేలల్లో పెరిగే గడ్డి.

**వడిపిళ్ళు** రూ.చూ. వరిపిలి. వి. చామకంకిలాంటి వెన్నువేసే వరి మొక్కలాగా ఉండిమాగాణి నేలల్లో పెరిగే గడ్డి.

**వడిపిళ్ళు** వి.బ.వ. ఒకరకం వడ్లు.

**వడిబాలకుండ** రూ. వడిబేల్లకుండ. వి. ఆడబిడ్డలకు పుట్టింటివాళ్ళు పెట్టినవడిబియ్యాన్ని అత్తవారింట్లో వండటానికివాడే కుండ.

**వడిబేల్లకుండ** రూ.చూ. వడిబాలకుండ. వి. ఆడబిడ్డలకు పుట్టింటి వాళ్ళుపెట్టిన వడిబియ్యాన్ని అత్త వారింట్లో వండటానికి వాడే కుండ.

**వడిఁబెట్టితీయు** చూ. వడియు[1].

**వడిఁబెట్టు** చూ. వడియు[1].

**వడియ** రూ.చూ. వడె. వి. 1. కొంకికర్ర ; 2. పంకె చిలుకకొయ్య.

**వడియఁగట్టు** చూ. వడియు[1].

**వడియము** రూ. వడెము[1]. వి. 1. వంటకం, భోజనంలో నంచుకొనే వ్యంజన విశేషం. కాశీ. 7.185 ; 2. బూడిద గుమ్మడికాయముక్కలు, నానబెట్టిన మినప్పప్పు, మిరప కాయలు కలిపి ఎండబెట్టితయారు చేసిన వంటకం.

సం. వటక-. భక్ష్యవిశేషం ; ప్రా. వడయ- ; అ.మా. వడగ-.

<ప్రా. వడయ-.

**వడియఁబోఁత** చూ. వడియు[1].

**వడియఁబోయు** చూ. వడియు[1].

**వడియు**[1] అ.క్రి. కారు, స్రవించు.కు. సం. 11.135.

క. ఒడి. పొంగిపొర్లు, ఆవిరి, కారు, స్రవించు, ఒడిగట్టు. వడపోయు, వి. వడపోత, వటిచల్. వడపోయటం, వటియల్. వడపోసినద్రవం, వటియల్. వడపోయగా మిగిలినద్రవం ; తు. ఒడ్డుని. కారిపోవు ; త. వటి (-వ్-,-స్త్-). ముంచు, కార్చు. నెమ్మదిగాపోయు, వడపోయు, వటిచల్. వడపోయటం, వటియల్. వడపోసినద్రవం ; మ. వటియుక. పొర్లిపోవు ; గోం. వరానా. కారిపోవు ; కొలా. వడ్ప్. పోయు ; పో.చూ. త.వడి ; పో.చూ. వడియు, ఓడు.

<మూ.ద్రా.*వట్-/*ఒట్-.

**వడగట్టు** రూ.చూ. వడియఁగట్టు. స.క్రి. పాత్రనోటికి గుడ్డకట్టి నీళ్ళు మొ. వాటిని వడకట్టు. **వడచు** రూ.చూ. వడుచు. స.క్రి. పోయు, కార్చు. **వడపోయు** స.క్రి. వడకట్టు. నీళ్ళు మొ. గుడ్డతోతీర్చు మృత్యు. 2.84. <వడియు.[1]+పోయు. **వడఁబెట్టు** స.క్రి. మురికి తొలగించు. <వడియు[1]+- అ[7]+పెట్టు. **వడఁబోయు** స.క్రి. 1. వడగట్టు, వడియగట్టు, మురికిని తొలగించు ; 2. చెత్తాచెదారం తీసేయటానికి మట్టిని గుంతల్లోపోయు. <వడియు[1]+-అ[7]+ పోయు. **వడవెట్టు(-పెట్టు)** స.క్రి. వడపోయు. పండి.చ. 1.2.453. **వడిఁగట్టు** రూ.చూ. వడియఁగట్టు. స.క్రి. వడకట్టు. ఒకపాత్రమీద గుడ్డకట్టి నీళ్ళుమొ. ద్రవపదార్థాల్ని వడపోయు. హంస. 2.25. **వడిఁబెట్టితీయు** స.క్రి. బలవంతంగా తీసుకొను. విక్ర. 4.16. **వడిఁబెట్టు(-పెట్టు)** స.క్రి. పాత్రమీద గుడ్డకట్టి నీళ్ళుమొ. వాటిని వడకట్టు. భోజ. 3.185. **వడియఁగట్టు** రూ. వడగట్టు, వడిఁగట్టు. స.క్రి. వడపోయు, వడకట్టు. విక్ర. 4.188. **వడియఁబోఁత** వి. వడపోయటం. <వడియు[1]+-అ[1]+పోఁత. **వడియఁబోయు** స.క్రి. బియ్యం మొ. వాటిని కడిగి నీళ్ళుపోయేట్లుంచు. <వడియు[1]+-అ[1]+పోయు. **వడుచు** రూ. వడచు. స.క్రి. 1. నూనెమొ. వాటినిదించు. ఏ.శకు. 1.98 ; 2. కార్చు. స్రవింపచేయు. అని. 2.86 ; 3. విడుచు ; 4. వడగట్టు. **వడుపు**[1] వి. వడియటం, కారటం వేంక. పంచ. 4.810

**వడియు**[2] అ.క్రి. 1. ఇంకు, శోషిల్లు. రాజ.చ. 2.12 ; 2. కృశించు, చిక్కు. దశా. 8 378.

మ. వటియుక. ఎండిపోవు.

**వడిపించు** స.క్రి. కాజేయు, దొంగిలించు. **వడుపు**[2] వి. 1. ఇంకటం ; 2. నిక్కచూడటం.

**వడిశాలి** రూ.చూ. వడిసెల. వి. రాయిపెట్టి పక్షుల్ని కొట్టటానికి ఉపయోగించే తాడులో అల్లిన పనిముట్టు.

**వడిస**[1] రూ.చూ. వరుస. వి. 1. పంక్తి ; 2 మారు, తడవ.

**వడిస**[2] వి. ఒకరకం చెట్టు (Cleistanthus collinus).

**వడిసంచి** వి. రైతులు విత్తనాలు పోసుకోవటానికి వాడేసంచి.

<ఒడి+సంచి.

**వడిసి** వి. సర్కారు జిల్లాలోని కొండప్రాంతాల్లో గుబురుగాపెరిగి ఉష్ణకాలంలో తెల్లనిపూలుపూసే ముళ్ళచెట్టు.

**వడిసీల** రూ.చూ. వడిసెల. వి. రాయిపెట్టి పక్షుల్ని కొట్టటానికి ఉపయోగించే తాడుతో అల్లిన పనిముట్టు.

**వడిసె** రూ.చూ. వడిసెల. వి. రాయిపెట్టి పక్షుల్ని కొట్టటానికి ఉపయోగించే తాడుతో అల్లిన పనిముట్టు.

**వడిసెగడ్డ** వి. 1. గజ్జల్లో లేచే మేహవ్రణం ; 2. సంకటం బిళ్ళ.

క. ఉడచు, ఉడుచు. సుఖవ్యాధికి సంబంధించిన పుండు, ఒడిసె, ఒడుచు. బిళ్ళసంకటం, ఉడి. ఒకరకం

వ్యాధి ; తు. ఒడి. బిళ్ళ సంకటం ; త. ఒటి. చీము పట్టేకురుపు, పుండు ; మ. ఒటి-క్కురు. ఒరపిడి, బిళ్ళసంకటం.

**వడిసెల** రూ. ఒడిసెల, వడిశాలి, వడిసీల, వడిసె, వడిసెలు, వడిసేల. వరిసిల్ల, వరిసీల. వి. 1. రాళ్ళు విసరివేయటం కోసం మధ్యలో ఏర్పరచిన చిన్న చిక్కం గలతాడు. క్రీడా. 30 పు ; 2. పక్షుల్ని కొట్టటానికి ఉపయోగించే పనిముట్టు.

**వడిసెలు** రూ.చూ. వడిసెల. వి.బ.వ. పనగజ్జెలు, ఎద్దుకొమ్ము లకు కట్టి నొసటి మీదికి పడేట్టు వేసిన దిసమువ్వల పట్టెడ.

**వడిసేల** రూ.చూ. వడిసెల. వి రాయిపెట్టి పక్షుల్ని కొట్ట టానికి ఉపయోగించే తాడుతో అల్లిన పనిముట్టు.

**వడుకము** వి. వడియం.

సం. వటుక -. భక్ష్యవిశేషం ; ప్రా. వడయ-.

<సం. వటక-.

**వడుకు** రూ. అడుకు[3], ఒడుకు[1]. స.క్రి. కదురు మొ. వాటిని తిప్పి దూదిని నూలుగా తీయు. చా.మం. 1.132, ఉ. హరిశ్చ. 4.70.

తు. నూల్-ఒడు. కండె ; త. ఒడుక్కు (ఒడుక్క -). సాగదీయు, (బంగారం మొ. వాటిని) తీగలా సాగగొట్టు ; కో. ఒడ్క్. బుటాలు వేయు, గుడ్డలమీద పూలు మొ. వికుట్టు ; కురు. ఓజ్నా. మెలివేయు, చుట్టు ; మాల్తో. ఒజె. మెలితిప్పు.

**వడుకుకట్టె** రూ ఒడుక్కట్టె. వి. వడకటానికి నారకట్టిన కర్ర. **వడుకుడు** వి. వడకటం. ఆం.భా. 2.294. **వడుకుడు కండె** రూ. ఒడుకుడుకండె. వి. రాట్నంమీద వడికి చుట్టిన నూలు. **వడుకుడుకొమ్ము** వి. దనలివారు వడికే కొయ్య పని ముట్టు. **వడుకుడుదారం** రూ. ఒడుకుడు దారం. వి. రాట్నం ఆకుల తాడును కదురును కలిపే గట్టిదారం. **వడుకుడునూలు** రూ. ఒడుకునూలు, వడుకునూలు. వి. రాట్నంమీదగాని చేతి కదురు మీదగాని వడికిన నూలు. **వడుకుడుపీట** వి. ఉన్ని వడికేటప్పుడు కూర్చోవ టానికి వేసుకొనే పీట. **వడుకుడు రాట్నం** రూ చూ. వడుకురాట్నం. వి. నూలు తీసేరాట్నం. **వడుకురాటం** రూ.చూ. వడుకురాట్నం. వి. నూలుతీసే రాట్నం **వడుకురాట్నం** రూ. ఒడుకురాట్నం, వడుకుడు రాట్నం, వడుకురాటం. వి. నూలు తీసేరాట్నం.

**వడుగండు** రూ.చూ. వడువు[2]. వి. బ్రహ్మచారి. భాగ. 9.688.

**వడుగు[1]**. రూ.చూ. వడువు[1]. వి. విధం, రీతి.

**వడుగు[2]** రూ.చూ. వడువు.[2] వి. 1. ఉపనయనం. బసవ. 1.428, ద.హిం.శా. సంపు. 4. శా.సం. 784 ; 2. వడుగైన బాలుడు, బ్రహ్మచారి. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 208, క్రీ శ. 1200.

**వడుచు** చూ. వడియు[1].

**వడుపట్వ** రూ.చూ. వడుపు పట్వ. వి. తాటి చెట్టెక్కి లొట్ట లోని కల్లును పంచుకోవటానికి వాడే మట్టిపాత్ర

**వడుపు[1]** చూ. వడియు[1].

**వడుపు[2]** చూ. వడియు[2].

**వడుపు[3]** చూ. ఒడుపు. వి. 1. ఎత్తుగా ఉన్నపైరు ; 2. చేతి లాఘవం.

**వడుపుపట్వ** రూ. ఒడిపిపటవ, ఒడుపుపటవ, వడు పట్వ, వడుపు బట్వ. వి. కీతకుండ, దొబ్బుడుపటవ, తాటి చెట్టెక్కి లొట్టెలోని కల్లును వంచు కోవటానికి వాడే మట్టి పాత్ర.

**వడులు** రూ.చూ. వడలు. అ.క్రి. పువ్వులు మొ. వి వాడు.

**వడులురాల్చు** చూ. వడి[1].

**వడువసివాళులు** వి.బ.వ. మిక్కిలివాడి పోవటాలు. కు.సం. 8.9.

**వడువు[1]** రూ. వడుగు[1]. వి. విదం. రీతి.కు.సం. 3.29.

**వడువు[2]** రూ. వడుగండు, వడుగు[2], వడ్గు. వి. 1. బ్రహ్మచారి. భార. ఆది. 1.156 ; 2. కుమారుడు. అష్టమ.క. 1.27పు. 1పం.

సం. వటుక -. బ్రహ్మచారి ; ప్రా. వడుగ -. బడు, బడుఅ. బాలుడు ; అ.మా. బడుఅ. బాలుడు ; మా. వడువ్వ-. తైర్థికుడు, సన్యాసి.

<ప్రా. వడుగ-.

**వడుసు** వి. మోటుతనంగా చలప చేయటంవల్ల బట్టల్లో పడుగు పేకల సందిచ్చి వంకరగా తొలగటం.

**వడుసుపోవు** రూ. వడుసుబోవు. అ.క్రి. వస్త్రం వడుసు కలదగు. **వడుసుబోవు (-పోవు)** రూ.చూ. వడుసుపోవు. అ.క్రి. 1. వంగిపోవు ; 2. గుడ్డనూలు తక్కువై ఉతుకులో దార్లు దార్లుగా ఏర్పడు.

**వడుసుడి** వి. (రాజులకిచ్చే) దండువు.

**వడె** రూ. వడియ ; వడెము[2]. వి. చిలక్కొయ్య, నాగదంతం. ఆం.భా. 2.20.

సం. వటక-. వటికా. గారె, ముద్ద, ఎనిమిది మాషాల బరువు, చదరంగపుబంటు ; ప్రా. వడయ-.

<ప్రా. వడయ-.

**వడెంది** వి. ఒకరకం కంచెమొక్క.

**వడెము[1]** రూ.చూ. వడియము. వి. వడుకం, భోజనంలో నంచుకొనే వ్యంజన విశేషం.

**వడెము[2]** రూ.చూ. వడె. వి. చిలక్కొయ్య, నాగదంతం.

**వడేకు** చూ. వడి[1].

**వడేయు** చూ. వడి[1].

**వడేరు[1]** చూ. వడి[1]. వి. పొదగా పెరిగే కంప, వంట చెరకు గా పనికివచ్చే మొక్క.

**వడేరు[2]** వి. బావిగోడకింద ఆధారంగా ఉండేటట్లు దించిన కొయ్య చక్రం, మెత్తటి నేలమీద గోడకట్టేటప్పుడు అడుగు న ఉంచే కొయ్యచక్రం.

**వడేరుకుట్టు** చూ. వడి[1].

**వడ్గు** రూ.చూ. వడువు[2]. వి. బ్రహ్మచారి. గౌ.హరి.ఉ. 1839పం.

**వడ్డ** వి. మదనం, తూర్పార పొయ్యక ముందు పొట్టుతో కలసి ఉన్నవాసి.

**వడ్డగి** రూ.చూ. వద్రంగి. వి. వద్రంగి.

**వడ్డగించు** అ.క్రి. కుండల అడుగుభాగంపైకి వచ్చేటట్లు ఒకటి

పేరు.

**వడ్డచి** చూ. వ్రద్రంగి. వి. వ్రద్రంగి. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 604.

**వడ్డన** రూ. వడ్డెన. వి. వడ్డించటం. బహుళా. 4.31.

సం. వర్ధన -. విభాగించటం, పంచటం, పోషించటం; ప్రా. వడ్ఢన -. వడ్డించటం ; మరా. వాఢణే. వడ్డించు ; క. బడిసు. వడ్డించు, బడిగ. వడ్డించేవాడు ; త. వట్టి -. వడ్డించు.

<ప్రా. వడ్డన-.

**వడ్డరావళము** వి. ఒకవిధమైన పన్ను. ద.హిం.శా.సంపు. 10. శా.సం. 199. క్రీ.శ. 1147.

**వడ్డలి** చూ. వ్రద్రంగి. వి. వడ్డంగి, వడ్లంగి. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 1384.

**వడ్డవారము** వి. శనివారం. మందవారం. చే.శా. 747. నా.శా. 1061, ద.హిం.శా. సంపు. 4.శా.సం. 666. క్రీ.శ. 1139.

సం. వృద్ధ -. పెరిగిన, గొప్ప, పోగయిన ; ప్రా. వడ్ఢ - శౌ.జై.శౌ. జై.మహా. అ.మా. వడ్ఢ-.

<ప్రా. వడ్ఢ- + సం. వార -.

**వడ్డవి** రూ.చూ. వ్రద్రంగి. వి. వ్రద్రంగి.

**వడ్డాణము** రూ.చూ. ఒడ్డాణము. వి. నడుముకు తగిలించుకొనే ఆభరణవిశేషం.

**వడ్డి**[1] చూ. వ్రద్రంగి. రూ. వడ్డె, వడ్డెర, వడ్డుర, వడ్డెరి, వడ్ర, వడ్రీ. వి. ఒకకులం.

**వడ్డి**[2] రూ. వడ్డీ. వి. అప్పిచ్చిన వానికి అప్పుపుచ్చుకున్న వాని వల్ల నెలకు నూటికి ఇంత అని ఎక్కువగా ఇచ్చేదబ్బు. భార. కర్ణ. 3.195, ద.హిం.శా. సంపు. 4.శా.సం. 748. క్రీ.శ. 1278.

సం. వృద్ధి-. పెరగటం, ఐశ్వర్యం, ధనం ; ప్రా. వడ్ఢి, విడ్ఢి ; శౌ.పా. వడ్ఢి ; అ.మా. అప. వడ్ఢి ;

క. బడ్డి ; తు. బడ్డి ; త. వట్టి ; కువి. వొడ్డి. అప్పు ; బ్రా. వడ్డి.

<ప్రా. వడ్ఢి-.

**వడ్డికాసులవా(డు** విణ. తిరుపతి వేంకటేశ్వరుడు. **వడ్డికాసులస్వామి** వి. వేంకటేశ్వరుడు. ప్రబంధ. 788 **వడ్డికి(బాఱు(-పాఱు[3])** రూ.చూ. వడ్డిపాఱు. అ.క్రి ఎక్కువగు. తాళ్ల. సం. 13.95. **వడ్డికివడ్డి**. వి. వృద్ధివృద్ధి, వడ్డికి కలిగినవడ్డి, చక్రవడ్డీ. **వడ్డికొన(గు** స.క్రి. వడ్డీకిచ్చు. మను. 3.88. <వడ్డి[2]+- కున్ + ఒన(గు. **వడ్డిధనము** వి. వడ్డీసొమ్ము. ద.హిం.శా. సంపు.4. శా.సం. 784. క్రీ.శ. 1278. సం. ధన-. సొమ్ము. **వడ్డిపాఱు** రూ. వడ్డికి( బాఱు ; వడ్డివారు. అ.క్రి. ఎక్కువగు. గౌ.హరి. 2.633. **వడ్డిబ్రతుకు** వి. వృద్ధిజీవిక, వడ్డీకిచ్చి బ్రతికే బ్రతుకు, సొమ్ముపడ్డీకిచ్చి ఆ వడ్డీవల్ల జీవించటం. **వడ్డిభోగ్యము** వి. అప్పుఇచ్చిన డబ్బుయొక్క వడ్డీకి చెల్లుగా అనుభవించటం. సం. భోగ్య-. అనుభవించతగినది. **వడ్డిమే(పరి** వి. వడ్డీవల్ల బ్రతికేవాడు. **వడ్డివారు(-పాఱు[3])** రూ.చూ. వడ్డిపాఱు. అ.క్రి. అధికమగు. తాళ్ల.సం. 11.369.

**వడ్డికుమ్మర్లు** రూ.చూ. వొడ్డికుమ్మర్లు. వి. కుమ్మర్లలో ఒకతెగ.

**వడ్డించినవిస్తరి** చూ. వడ్డించు.

**వడ్డించు** చూ. వడ్డన. స.క్రి. 1. భోజనపదార్థాలనువళ్ళేల్లోపెట్టు. పండి.చ. 4.189పు ; 2. క్రర మొ. వాటితోకొట్టు. విప్ర.4.60 ; 3. పెట్టు, అన్నంపెట్టు ; 4. తిట్టు ; 5. తన్ను ; 6. దండించు.

క. బడిసు. వడ్డించు.

**వడ్డించినవిస్తరి** వి. సిద్ధాన్నం, అన్నీఅమరింది. **వడ్డించుకొను** స.క్రి. భాజనంలో ఉంచుకొను. పండి.చ. 1.83పు. 11పం.

**వడ్డీ** రూ.చూ. వడ్డి[2]. వి ఋణధనవృద్ధి.

**వడ్డీ(డు** వి. చెరువులు, నూతులు తవ్వేవాడు.

**వడ్డు** రూ. అడ్డు,[2] వొడ్డు. వి. ప్రధానమైన ఆహారధాన్యం, ఇంటికప్పుకు వరిగడ్డి మంచి వాడుకలో ఉంది.

**వడ్డుర** రూ.చూ. వడ్డి[1]. వి. ఒక కులం.

**వడ్డె** రూ.చూ. వడ్డి[1]. వి. ఒక కులం.

**వడ్డెగంప** వి. మట్టితట్ట, మోయటానికి పనికివచ్చే వెదురు బద్దలతో అల్లిన పళ్ళిక. **వడ్డెతట్ట** వి. మట్టిమోతకు పనికివచ్చేతట్ట. **వడ్డెసిబ్బి** వి. వెదురుగంప.

**వడ్డెన** రూ.చూ. వడ్డన. వి. వడ్డించటం.

**వడ్డెనరేకు** రూ. వొడ్డనరేకు. వి. అన్నం వడ్డించటానికి కాడపెట్టి గుండ్రంగా చేసిన మట్టి మూకుడు.

**వడ్డెము** వి. ఒరియాభాష.

**వడ్డెర** రూ.చూ. వడ్డి[1]. వి. ఒక కులం.

**వడ్డెరి** రూ.చూ. వడ్డి[1]. వి. ఒక కులం.

**వడ్డోలగము** రూ.చూ. ఒడ్డోలగము. వి. నిండుకొలువు. పండి.చ. 1.3పు. 23పం.

**వడ్పిలి** రూ.చూ. వరిపిలి. వి. వరిమొక్కలాగాఉండి మాగాణి నేలల్లో పెరిగే గడ్డి.

**వడ్ర** రూ.చూ. వడ్డి[1]. వి. ఒక కులం.

**వడ్రంగము** రూ.చూ. వ్రద్రము. వి. వ్రద్రంగిపని.

**వ్రద్రంగంమాన్యం** వి. వ్రద్రంగి కిచ్చిన మాన్యం.

**వ్రద్రంగంమాన్యం** చూ. వ్రద్రంగము.

**వ్రద్రంగి** రూ. వడ్డగి, వడ్డవి. వడ్లంగి. వి. 1. క్రరపని చేసేవాడు. బసవ. 4 65 ; 2. ద్వారాఘటం, వ్రద్రంగిపిట్ట. అం.భా. 2.98.

సం. వర్ధకిన్. వ్రద్రంగి ; ప్రా. వడ్ఢకి, వడకి ;

క. బడగి, బడగియవ, బడిగ, బడిగి, బడిగె, బడిగ్యా, బడ్డగి ; కొడ.తు. బడిగె ; గోం. వాడె, కమ్మరి ; పర్జి. బడెయ్ ; కొలా. వడ్గి. వ్రద్రంగి.

<ప్రా. వడ్ఢకి.

**వ్రద్రంగిఇనాం** రూ. వడ్లఇనాం. వి. వ్రద్రంగి కిచ్చిన ఇనాం. **వ్రద్రంగిపిట్ట** రూ. వడ్లంగిపిట్ట. వి. పక్షివిశేషం, ద్వారాఘాటం, చెట్టుమానుని పొడిచే ఒక పక్షి.

**వ్రద్రబొగ్గు** చూ. వ్రద్రము.

**వ్రద్రము** చూ. వ్రద్రంగి. రూ. వ్రద్రంగము, వడ్ల. వి. క్రరపని, వ్రద్రంగిపని. అం.భా. 2.284.

**వ్రద్రబొగ్గు** వి. క్రరలు కాల్చి తయారు చేసిన బొగ్గు.

వ్రడవాఁడు రూ. వడ్లవాఁడు. విణ. కఱ్ఱపని చేసి జీవించే కులంవాడు, వర్ధకి. ఆం.భా. 2.284.

వ్రడవాఁడు చూ. వ్రడము.

వ్రడ్డీ రూ.చూ. వడ్డి[1]. వి. ఒక కులం.

వడ్ల రూ.చూ. వ్రడము. వి. కఱ్ఱపని.

వడ్లఇనాం రూ.చూ. వ్రడంగిఇనాం. వి. వ్రడంగికిచ్చే ఇనాం. వడ్లత వి. వర్ధకి. స్త్రీ. వడ్లది. వడ్లది వి. వర్ధకి. స్త్రీ. వడ్లబత్తుఁడు రూ. వడ్లాబత్తుఁడు. వి. వడ్లవాడు. వడ్లమాన్యం వి. వ్రడంగికిచ్చిన మాన్యం. వడ్లవాఁడు రూ.చూ. వ్రడవాఁడు. విణ. కఱ్ఱపనిచేసి జీవించే కులంవాడు. వర్ధకి. వడ్లవాళ్ళు రూ. ఒడ్లవాళ్లు. ఒడ్లవాళ్ళు. విణ.బ.వ. కొయ్యపని చేసే వాళ్ళు. వడ్లాబత్తుఁడు రూ.చూ. వడ్లబత్తుఁడు. వి. వడ్లవాడు.

వడ్లకంకణము చూ. వడ్లు.

వడ్లకడవ చూ. వడ్లు.

వడ్లకొట్టు చూ. వడ్లు.

వడ్లగింజలో బియ్యపుగింజ చూ. వడ్లు.

వడ్లంగి రూ.చూ. వ్రడంగి. వి. 1. పక్షివిశేషం. ప్రబంధ. 234 ; 2. వర్ధకి. ఆం.భా. 2.284.

వడ్లంగితనము వి. వడ్లవానివృత్తి, వ్రడంగిపని. వడ్లంగి పిట్ట రూ.చూ. వ్రడంగిపిట్ట. వి. పక్షివిశేషం, దార్వాఘాటం.

వడ్లచిలక చూ. వడ్లు.

వడ్లచుక్క చూ. వడ్లు.

వడ్లతోడతట్టయెండు చూ. వడ్లు.

వడ్లపట్టు చూ. వడ్లు.

వడ్లపూస చూ. వడ్లు.

వడ్లపూసలపేటి చూ. వడ్లు.

వడ్లపూసలపేటు చూ. వడ్లు.

వడ్లపొట్టు చూ. వడ్లు.

వడ్లయారాల చూ. వడ్లు. రూ. వడ్లయేరాల. వి. అందమైనపూలు పూసే ఒక తీగ (Hiptage Madablota).

వడ్లయేరాల రూ.చూ. వడ్లయారాల. వి. అందమైన పూలుపూసే ఒకరకం తీగ. (Hiptage Madablota).

వడ్లాబత్తుఁడు చూ. వడ్ల.

వడ్లు రూ.చూ. వడ్ళు. వి.బ.వ. ధాన్యం. బాదినేనిపల్లిశాసనం. క్రీ.శ. 8వశతాబ్ది (Oryza Sativa).

వడ్లకంకణము వి. ఒకజాతి కొంగ. వడ్లకడవ రూ. వొడ్లకడవ. వి. వడ్లు ఉడకబెట్టటానికి వాడే మట్టికడవ. వడ్ల కొట్టు వి. ధాన్యం ఉంచుకొనేగది. వడ్లగింజలో బియ్యపు గింజ వి. సర్వసామాన్యమైన విషయం. వడ్లచిలక వి. ఒకజాతి రెక్కపురుగు. వడ్లచుక్క వి. మూలచుక్క, బృహస్పతిపేరుతో ఉండే నక్షత్రం, ఈశాన్యమూల పొడిచే నక్షత్రం. వడ్లతోడతట్టయెండు అ.క్రి. ఆనుషంగికంగా బాధపడు. వడ్లపట్టు వి. వ్రీహివాపాక్షేత్రం. ద.హిం. గా. సంపు. 4. శా.సం. 1281. వడ్లపూస వి. సరిహూస గడ్డి. పాచిలో ఒకరకం, వరిచేలల్లో ఏటా లేచి అడుగు, అడుగున్నరఎత్తు పెరిగే గడ్డి మొక్క. (coix lachry najobi). వడ్లపూసలపేటి రూ.చూ. వడ్ల పూసలపేటు. వి. అంచులో వడ్లగింజల ఆకారంలో వరసగా నేసిన డిజైను. వడ్లపూసలపేటు రూ. వడ్లపూసలపేటి. వి. అంచులో వడ్లగింజల ఆకారంలో వరసగా నేసిన డిజైను. వడ్లపొట్టు రూ. వొడ్లపొట్టు. వి. వరిపొట్టు.

వడ్ళు రూ. వడ్లు. వి. వరిధాన్యం. E. I. సంపు. 22. క్రీ.శ. 674.

క. బత్త, భత్త. వరిధాన్యం ; త. వల్చి. ధాన్యం, వడ్లు, వరి, అన్నం, ఆహారం ; మ. వఞ్చు. అన్నం మెతుకు ; కో. వత్మ్. జొన్నలు ; తొ. పాత్క్. జొన్నలు ; కొలా. వల్. బియ్యంగింజ, వల్‌బిమ్. ధాన్యం ; నా. వల్. వరి.

< వరి + -ళు.

వడ్సిలి రూ. చూ. వరిపిలి. వి. వరిమొక్కలాగా ఉండి మాగాణి నేలల్లో పెరిగే గడ్డి మొక్క.

వణఁకాడు చూ. వణఁకు.

వణఁకు రూ.చూ. వడఁకు. అ.క్రి. 1. చలించు. కంపించు. కు సం. 5.133 ; 2. భయపడు. నిరంకు. 2 98 ; వి. 1. కంపం, వేపథువు. విప్ర. 2.53 ; 2. భయం ; 3. మంచు, హిమం.

వణఁకాడు రూ.చూ. వడఁకాడు. అ.క్రి. కంపించు. శివరా. 1.86. < వణఁకు + ఆడు. వణఁకుగుబ్బలి రూ.చూ. వడఁకు గుబ్బలి. వి. హిమవత్పర్వతం. ధనాభి. 1.6. వణఁకుగుబ్బలిపట్టి వి. పార్వతి. భీమ. 3.184. వణఁకుఁగొండ (-కొండ) రూ.చూ. వడఁకుఁగొండ. వి. హిమవత్పర్వతం.

వణమ్ రూ.చూ. వణితము వి. నివేశనం, ఇలుపట్టు.

వణికము విణ. ఒప్పిదమైంది, మనోహరమైంది. ఉ. హరిశ్చ. 2.149.

వణితము చూ. వంటెము. రూ. వణమ్. వి. 1. రాజ్యవిభాగం, తాలూకా. నె.శా. రాపూరు. 49. క్రీ.శ. 1637, చంద్రాంగ. 6.53 ; 2. సీమైకదేశం. ఆం. భా. 2.7.

క. వణితమ్. ప్రదేశం, నివేశనస్థలం.

వణుకు రూ.చూ. వడఁకు. అ.క్రి. 1. చలించు, కంపించు ; 2. భయపడు ; వి. 1. కంపం ; 2. భయం ; 3. మంచు.

వంట చూ. వండు[2].

వంటకట్టియ చూ. వండు[2].

వంటకట్టె చూ. వండు[2].

వంటకడవ చూ. వండు[2].

వంటకత్తియ చూ. వండు[2].

వంటకత్తె చూ. వండు[2].

వంటకము చూ. వండు.[2]

వంటకాఁడు చూ. వండు[2].

వంటకాల్పు చూ. వండు[2].

వంటకుండ చూ. వండు[2].

వంటకుండలు చూ. వండు[2].

వంటకూలి చూ. వండు[2].

వంటకొట్టడి చూ. వండు[2].

వంటకొట్టము చూ. వండు[2].

వంటగది చూ. వండు[2].

**వంటగూన** చూ. వండు².
**వంటచమురు** చూ. వండు².
**వంటచలిమిడి** చూ. వండు².
**వంటచెఱకు** చూ. వండు².
**వంటచెఱకులు** చూ. వండు².
**వంటదిశ** చూ. వండు².
**వంటపని** చూ. వండు².
**వంటపుట్ట** చూ. వండు².
**వంటపుట్టి** చూ. వండు².
**వంటపూటవాఁడు** చూ. వండు².
**వంటపూటియిల్లు** చూ. వండు².
**వంటపూటిల్లు** చూ. వండు².
**వంటపొయ్యి** చూ. వండు².
**వంటబాన** చూ. వండు².
**వంటయింటికుఁదేలు** చూ. వండు².
**వంటయిల్లు** చూ. వండు².
**వంటయుప్పు** చూ. వండు².
**వంటరాయి** చూ. వండు².
**వంటరి** చూ. వండు².
**వంటరులు** చూ. వండు².
**వంటలక్క** చూ. వండు².
**వంటలక్కతనము** చూ. వండు².
**వంటలవాఁడు** చూ. వండు².
**వంటలు** చూ. వండు².
**వంటవంచ** చూ. వండు².
**వంటవసారా** చూ. వండు².
**వంటవాఁడు** చూ. వండు².
**వంటవార్పు** చూ. వండు².
**వంటశాల** చూ. వండు².
**వంటసరకు** చూ. వండు².
**వంటసరుకు** చూ. వండు².
**వంటసాల** చూ. వండు².

**వంటి** చూ. ఒంటి. ఈపదం తరచుగా షష్ఠీవిభక్తి తోనుగాన్ని చోట్లద్వితీయావిభక్తి తోనుకలిసి ప్రయుక్తమౌతుంది. విశే. 1. సదృశం. కోటి. రం. రా. అయోధ్యా. 90పు. 27పం. ; 2. పోని. ఆం. భా. 8.72.

**వంటియము** రూ.చూ. వంటెము. వి. తాలూకా, పరగణా, ఒకని కింది రాజ్యంలో కొంతభాగం.

**వంటిల్లు** చూ. వండు².

**వంటు** వి. అనుకూల్యం, స్నేహం, అనువు. వేమ.

**వంటెము** రూ. వంటియము. వి. తాలూకా, పరగణా, ఒకని కింద రాజ్యంలో కొంతభాగం. సీమ. ఆం.భా. 2.7.

సం. ఖంటక.- భాగం, పాలు, పంపకం ; ప్రా. వంటుగ-, వంటయ-.

<ప్రా. వంటయ-.

**వంట్రము** వి. 1. మందులనంచి ; 2. మందులపెట్టె.

**వండ¹** రూ.చూ. వండు¹. వి. 1. చెరువు మొ. వాటి అడుగున ఉండే ఎండిన బురద ; 2. దండగ ; 3. ఆపద ; 4. కష్టం.

**వండ²** వి. మొండి, స్తబ్ధుడు.

సం. షండ-. వికలాంగుడు, పెళ్ళికానివాడు, నపుంసకునిగా చేయబడ్డవాడు.

<సం. పండ- (అర్థవిపరి.).

**వండఁదగినకూర** చూ. వండు².
**వండఁదగినరీతి** చూ. వండు².
**వండఁబాటు** చూ. వండు².
**వండఱు** చూ. వండు¹.

**వండలి** రూ.చూ. వండు¹. వి. చెరువు మొ. వాటి అడుగున ఉండే బురద, వండ.

**వండలిపిండుగాఁగలఁగు** అ.క్రి. మిక్కిలిగా కలగిపోవు. వీర. వి. 3.89.

**వండవండనట్లు** చూ. వండు².
**వండించు** చూ. వండు².
**వండినకుడుము** చూ. వండు².

**వండు¹** రూ. వండ¹, వండలి. వి. 1. బురద. భార. విరా. 3.156 ; 2. నున్నటి రాతికి చేసే జాజుపని.

క. పండు, ఒండు, ఒండలు. మడ్డి, బురద, నది మొ॰ వాటి ఆడుగున ఉండే మట్టి ; త. వణ్డల్, మడ్డి, గని, మస్తు, మట్టి, బురద ; మ. వణ్టఱు, మట్టి, బురద.

**వండఱు** అ.క్రి. బురద విరుగుతీరు, నిర్మలమగు. కాశీ. 3.23. <వండు + అఱు¹.

**వండు²** అ.క్రి. పాకంచేయు, వంటచేయు. భార.ఆది. 6.187.

పర్జి. వెండ్-, వంటచేయు, పండు ; గ. వండ్. వండు, వంటచేయు ; పో.చూ. త. వఱు. వేపుడు, వేయించు, వేడిచేయు.

**వంట** వి. పాకం, వండటం. భార.ఆది. 6.29. <వండు² + -ట. **వంటకట్టియ** రూ. వంటకట్టె. వి. వంట చేయటంకోసం, పొయ్యి మండటంకోసం వేసేకట్టె, వంట చెరకు. భార. విరా. 2.136. **వంటకట్టె** రూ.చూ. వంట కట్టియ. వి. వంటకోసం, పొయ్యి మండటంకోసం వేసే కట్టె, వంటచెరకు. యయా. 1.47. **వంటకడవ** వి. పెద్ద సైజు కడవ. **వంటకత్తియ** రూ. వంటకత్తె. వి. వంటచేసేది, పాచకురాలు. **వంటకత్తె** రూ.చూ. వంటకత్తియ వి. వంట చేసేది, పాచకురాలు. **వంటకము** వి. 1. ఆహారపదార్థం. భార. విరా. 1.219 ; 2. పాకం. భార. శాంతి. 5.393 ; 3. అన్నం, ఓగిరం. విక్ర. 5.219. **వంటకాఁడు** వి. బానసీడు, వంటచేసేవాడు. **వంటకాల్వు** వి. నల్లకాల్వులో పాత్రలుకొంత తెల్లగా కాలినకాల్వు. **వంటకుండ** వి. పనటి, పంటవండుకునేకుండ. **వంటకుండలు** వి.బ.వ. పెళ్ళికి ఒకరోజు ముందుగా మేళతాళాలతో వెళ్ళి తెచ్చుకొనే మట్టివంట పాత్రలు. **వంటకూలి** వి. వంటచేసి పెట్టినందు కిచ్చేమూల్యం. శుక. 4.4. **వంటకొట్టడి** వి. వంటచేసేగది **వంటకొట్టము** వి. వంటశాల, మహానసం. శుక. 3.477. **వంటగది** వి. పంటచేసేగది. **వంటగూన** వి. సారాయి బట్టీలోవాడే అడుగు మందంగా ఉండే పెద్దమట్టిపాత్ర. **వంటచమురు** వి. పిండివంటలు చేసిన తరవాత మిగిలిన

నూనె. **వంటచలిమిడి** వి. భక్ష్య విశేషం, పాకంచలిమిడి చెన్నబసవ. 4.33. **వంటచెఱకు** వి. 1. వంటచేసుకునే కట్టెలు. హర. 2.31; 2. బెల్లం వండటానికి పనికివచ్చే రసంతోనిలవ ఉండే చెరకు. ఆము. 4.125. **వంటచెఱకులు** వి.బ.వ. వంటకట్టియలు. నె.శా. ఆత్మకూరు 25. క్రీ.శ. 1285. **వంటదిశ** వి. ఆగ్నేయమూల. సం. దిక్,దిశా. దిక్కు. **వంటపని** వి. వంటవండటం. శుక. 4.7. **వంటపుట్ట** వి. వంటవాడు. **వంటపుట్టి** వి. వంటచేసి జీవించేది, వంటలక్క. **వంటపూటవాఁడు** విశ. అన్నవిక్రేత. ఆం.భా. 2.286. **వంటపూటియిల్లు** రూ.చూ. వంటపూటిల్లు వి. పూటకూళ్ళఇల్లు, అన్నం విక్రయించే గృహం. **వంటపూటిల్లు** రూ. వంటపూటియిల్లు. వి. అన్నం విక్రయించే గృహం. ఆము. 6.71. **వంటపొయ్యి** వి. కట్టెలు పెట్టి వంటచేయటానికి కుమ్మరి చేత్తో తయారుచేసే మట్టి పొయ్యి. **వంటబాన** వి. పెళ్ళిళ్ళు ఇత్యాది సందర్భాల్లో వంటకు వాడే పెద్ద మట్టిపాత్ర. **వంటయింటికుందేలు** వి. చేతికి చిక్కింది, తప్పించుకోలేనిది. రుక్మాం.చ. 5.20. <వంట+ఇల్లు+-ఇ[6]+కుందేలు. **వంటయిల్లు** రూ.చూ. వంటిల్లు. వి. బౌ. వంటచేసుకొనేఇల్లు. విజయ. 1.6. <వంట+ఇల్లు. **వంటయుప్పు** వి. వండినఉప్పు. ఎడంగం. <వంట+ఉప్పు. **వంటరాయి** వి. 1. మన్ను వండిచేసిన కృత్రిమ రత్నం. పచ్చ; 2. గాజుపూస. **వంటరి** వి. 1. ఒక కులం. భీమ. 1.32; 2. పాచకుడు, వంటచేసేవాడు. <వంట+-అరి. **వంటరులు** వి.బ.వ. నాల్గవజాతివారిలో ఉత్తములుగా పరిగణింపబడే ఒకానొక జాతివారు. **వంటలక్క** వి. 1. అన్నం వండే స్త్రీ. పాంచా. 4.46; 2. గృహస్థుల ఇళ్ళల్లో జీతంతీసుకొని వేళవేళకు అన్నం వండి పెట్టే స్త్రీ; 3. పూటకూళ్ళమ్మ. **వంటలక్కతనము** వి. వంటచేసే స్త్రీ ధర్మం. చంపూరా. 2.29. **వంటలవాఁడు** విశ. వంటచేసేవాడు, పాచకుడు. భార. విరా. 1.79. **వంటలు** వి.బ.వ. 1. పేడ, పొట్టు కలిపి పలుచని ముద్దలు చేసి ఎండిన తరవాత వంటచెరకుగా వాడే ఉండలు, 2. వంటకాలు. **వంటవంచ** (-వంచ) వి. వంటచేసే పంచ. **వంటవసారా** వి. వంటచేసేపంచ. **వంటవాఁడు** విశ. వంటలవాడు. **వంటవార్పు** వి. వండటానికి సంబంధించిన పనులు. హంస. 4.146. **వంటశాల** వి. వంటిల్లు. సం. శాలా. ఇల్లు, సావడి. <వంట+సం. శాలా. **వంటసరకు** రూ.చూ. వంటసరుకు. వి. వంటకట్టెలు, ఇంధనరాశి. **వంటసరుకు** రూ. వంటసరకు. వి. ఇంధనసమూహం, వంటకట్టెలు. **వంటసాల** రూ. అంటసాల. వి. మహానసం, వంటిల్లు. పరమ. 5.46. **వంటిల్లు** రూ. అంటిల్లు, వంటయిల్లు. వి.బౌ. వంటచేసుకొనేఇల్లు. భీమ. 3.51. <వంట+ఇల్లు. **వండఁదగినకూర** వి. ముక్కలుముక్కలుగా ఉండేవి. తాళ్ల.సం. 11.3.24. <వండు+-అ[7]+తగినకూర. **వండఁదఱిగినరీతి** వి. ముక్కలు ముక్కలు, వండటానికి తరిగిన విధం. మైరా.షు. 70. సం. రీతి – విధం. <వండు[2]+-అ[7]+తఱిగినరీతి. **వండఁబోటు** వి. వండటానికి వీలు. <వండు+-అ7+పోటు. **వండవండనట్లు** అవ్య. పకపకమని. తాళ్ల.సం. 3.557. <వండు[2]+-అ[7]+వండు+-అ[7]+అట్లు. **వండించు** స.క్రి. వంటచేయించు. <వండు[2]+-ఇంచు.[3] **వండినకుడుము** వి. సిద్ధాన్నం. శుక. 2.102. **వండుకొనివార్చుకొని** అవ్య. వండివార్చి, వంటచేసుకొని. కళా. 6.146. **వణ్డువైష్ణవులు** వి.బ.వ. వంటచేసేవైష్ణవులు. ద.హిం శా. సంపు. 5. శా.సం. 66. **వండుసన్నము** వి. మంచిసన్నం.

**వంద్ర** రూ.చూ. వందర. వి. అనుకూలమైనకౌలు.

**వణ్ణం** వి. అన్నం, భోజనం.

సం. అన్న – భోజనం.

<సం. అన్న –.

**వతను** వి. పాలు మొ.వి వాడుకగా ఇంటికి తెచ్చి ఇస్తుండటం.

సం. వర్తన –. జీవిస్తున్నది, నిలకడఉన్నది; ప్రా. వతణ –.

<ప్రా. వత్తణ –.

**వతి** రూ.చూ. వత్తి. వి. ఒకధూపద్రవ్యం. పండి.చ. 5.428.

**వత్త** వి. 1. వరుగు. మను. 2.57; 2. వాడిపోయిన పదార్థం, వాడినకాయ మొ.వి.

**వత్తడి** రూ.చూ. ఒత్తిడి. వి, రాపిడి.

**వత్తనంచెక్క** వి. కొయ్యతో చేసినతాపి, గరుకుగాఉన్న చోట్లను చదరం చేయటానికి వాడే తాపి.

**వత్తాసగు** చూ. వత్తాసు.

**వత్తాసి** రూ.చూ. వత్తువాసి. వి. 1. సహాయకుడు, ప్రోత్సాహకుడు; 2. మాటసాయం చేయటం.

**వత్తాసు** రూ.చూ. వత్తువాసి. 1. సహాయకుడు, ప్రోత్సాహకుడు; 2. మద్దత్తు, సపోర్టు.

**వత్తాసగు** అ.క్రి. అండఅగు, మద్దత్తుఅగు.

**వత్తి** రూ. బత్తి. వతి, వత్తియ, వత్తు[1], వత్తె. వి. దీపంవత్తి. దీపం వెలగటానికి దూది మొ. వాటిలో చేసి ఉపయోగించే వస్తువు. ద.హిం. శా. సంపు. 10. క్రీ.శ. 1165.

సం. వర్తి – వర్తీ. వత్తి, మైపూత, బట్టఅంచు; ప్రా. వట్టి, వత్తి; శౌ. వత్తిఆ; అ. మా. వట్టి, వత్తి; పా. ట్టి;

క. బత్తి; తు. బత్తి; మ.వట్టి; కుఇ. బొతి; కోలా. వర్తి; బ్రా. వట్.

<ప్రా. వత్తి.

**వత్తిఅగు** అ.క్రి. కృశించు. **వత్తికినూనెకుగొలదిగా** క్రి. విశ ప్రు. అతికష్టంమీద జరుగుబాటు సాగేటట్లుగా. తాళ్ల.సం. 5.118. **వత్తిచెక్క** రూ. వత్తిసెక్క. వి.ద్వారబంధపు నిలువు కమ్మీ పక్కన గోడకు అతికే చెక్క. **వత్తిలోపలినూనె** వి. అస్థిరం. తాళ్ల.సం. 11.3.116. **వత్తిసెక్క** (-చెక్క) రూ.చూ. వత్తిచెక్క. వి.ద్వారబంధపు నిలువు కమ్మీ పక్కన గోడకు అతికే చెక్క.

**వత్తిడి** రూ.చూ. ఒత్తిడి. వి.రాపిడి.

**వత్తియ** రూ.చూ. వత్తి. వి. దీపంవత్తి.

**వత్తు[1]** రూ.చూ. వత్తి. వి. మందును ముట్టించే తాడు.

**వత్తు[2]** రూ.చూ. ఒత్తు. అ.క్రి. కప్పువేయు.

**వత్తుడి** రూ.చూ. ఒత్తడి. వి. సమ్మర్దం.

**వత్తులు** వి.బ.వ. చంటిపిల్లల ముంజేతి ఆభరణాలు.

నం. వర్తుల -. గుండ్రనిది.

<నం. వర్తుల-.

**వత్తువాసి** రూ. వత్తాసి, వత్తాస, వత్యాసి. వి. **1.** వత్తాసి, సహాయకుడు, ప్రోత్సాహకుడు ; **2.** మద్దత్తు.

**వత్తె** రూ.చూ. వత్తి. వి. దీపం వత్తి.

**వత్యాసి** రూ.చూ. వత్తువాసి. వి. **1.** మాటసాయం చేయటం, **2.** సహాయకుడు.

**వద** రూ.చూ. ఒద్ద. వి. సమీపం. వేంక. పంచ. 1.8.

**వదగు** చూ. ఒదుగు. అ.క్రి. పనికివచ్చు.

**వదటిపాలగు** చూ. వదరు.

**వదరు** వి.బౌ. ధూళి. ఆం.నా. పద. 3.51.

**వదటిపాలగు** అ.క్రి. వ్యర్థమగు, నేలపాలగు. పండి.చ. 1.1.242. <వదరు+-ఇ[6]+పాలు[1]+అగు.

**వదనిక** రూ.చూ. బదనిక. వి. బదనిక, వేరొకచెట్టు మీద మొలచిన తీగ. ఆం.భా. 2.54.

**వదినికె** రూ.చూ. బదనిక. వి. **1.** లేతఎరుపురంగు పూలు పూసే ఒకరకం చెట్టు (Lornthus longiflorus) ; **2.** ఒకరకం చెట్టు (Vanada Roxburghii).

**వదను** రూ.చూ. వజను. వి. బలం, ఆధారం.

**వదర** చూ. వదరు[1].

**వదరు**[1] అ.క్రి. **1.** వ్యర్థవచనాలుపలుకు, ఉపయోగంలేని మాటలాడు, ప్రేలు. భార.శాంతి. 4.409 ; **2.** అదరు, అతిశయించు. ఉ.హరి 5 ; **3.** దంబాలుకొట్టు, దంభవాక్యాలు పలుకు. కళా. 6.22 ; **4.** అరచు, కూయు. రాఘవ. 2.6 ; **5.** చెప్పు, పలుకు. చంద్రాంగ. 4.86 ; వి. **1.** దంభవచనం, డంబం. రుక్మా.చ. 5.33 ; **2.** పక్షివిశేషం. హంస. 3.13 ; **3.** వ్యర్థవచనాలు, ఉపయోగంలేనిమాట, ప్రేలాపం, ప్రేలుడు.

క. ఒదఱు, గట్టిగాఏడ్చు, అరుచు ; త. వతఱు. వాగు, అర్థం లేకుండా మాట్లాడు, తిట్టు.

**వదర** విశ. **1.** వదరుబోతు, ప్రేలరి. నృసింహ. 4.37 ; **2.** నీచుడు, దుష్టుడు. శివరా. 4.16. <వదరు[1]+-అ[12].

**వదరుకొను** అ.క్రి. **1.** ప్రేలు. వసు. 3.151 ; **2.** చెప్పుకొను. షక. 2.420. వదరు(గప్ప(-కప్ప[1]) వి. ఒకానొక కప్ప. **వదరుకు** వి.వాగుడు, ప్రేలుడు. **వదరు(దనము (-తనము)** వి. ఎక్కువగా మాట్లాడటం.తు. బదరితన. అపనింద అపఖ్యాతి. **వదరుపల్కులు** వి.బ.వ. ప్రేలాపాలు, అర్థంలేని మాటలు. హంస. 1.210. **వదరుమాటలు** వి.బ.వ. ప్రలాపాలు, అర్థంలేనిమాటలు. వరాహ. 9.101. **వదరు(బోఁడి (-పోఁడి)** వి. వదరుబోతు. క్రీడా. పు.69. **వదరు(బోఁతు (-పోఁతు)** వి. ఊరకపేలేవాడు, ప్రేలరి. **వదావళి** వి. వదరుబోతుతనం. ఆం.భా. 1.116. నం. ఆవళి-. పంక్తి. <వదర+ఆవళి.

**వదరు**[2] వి.**1.** సొరకాయ, అలాబువు. భార. ఆరణ్య. 3.54 ; **2.** చేతిసొర. నం. అలాబూ. ఆనపకాయ, సొరకాయ ; ఒ. లావు, సావు ; బెం. లావు, సావు.

**వదరుకాయ** వి. సొరకాయ. సిం.ద్వా. 8.168. **వదరులాఁడు** విశ. సొరకాయలూదేవాడు. క్రీడా. 223. <వదరు[2]+-లు+ఆఁడు.

**వదలించు** చూ. వదలు.

**వదలించుకొను** చూ. వదలు.

**వదలివేయు** చూ. వదలు.

**వదలు** రూ. వదులు. అ.క్రి. **1.** శిథిలమగు, పట్టువీడు, సడలు. భార. ఆది. 8.191 ; **2.** క్షీణించు, తగ్గు, నశించు. కాశీ. 4.207 ; **3.** ఎడతెగు. విక్ర. 2.65 ; **4.** వీడిపోవు. విక్ర. 4.66 ; **5.** జారు. హంస. 2.53 ; స.క్రి. **1.** విడుచు, త్యజించు. కు.సం. 1.28 ; **2** శిథిలంకావించు, సడలించు. శృం.నై. 1.108 ; విశ. శిథిలం, ఓగుపుకానిది. భాస్క.రా. కిష్కిం. 63 ; వి. శైథిల్యం, విడుపు. భాస్క.రా.యు. 837. కురు. ఒద్ ళ్వా, ఓద్ ఖస్. వదులు చేయు.

**వదలించు** రూ. వదిలించు. స.క్రి. విడేటట్లు చేయు.గౌ. హరి.పూ. 1270. <వదలు+-ఇంచు.[3] **వదలించుకొను** స.క్రి. విడిపించుకొను. **వదలివేయు** రూ చూ. వదిలివేయు. అ.క్రి. మానుకొను, విడుచు. <వదలు+-ఇ[13]+వేయు.

**వదలుచు** రూ.చూ. వదల్చు. స.క్రి. వదిలేటట్లుచేయు.

**వదల్చు** రూ. వదలుచు. స.క్రి. వదిలేట్లుచేయు. వేంక. పంచ. 4.141.

**వదల్చు** చూ. వదలు.

**వదవద** వి. వణకటంలో అయ్యేదానికి అనుకరణం. కావ్యా చూ. 1.40.

నం. వద్. పలుకు, మాట్లాడు.

**వదవదలాడు** అ.క్రి. పళ్ళు మాగి మెత్తనగు.

**వదావళి** చూ. వదరు[1].

**వది** వి.**1.** పల్లం. హరి.పూ. 7.167 ; **2.** మరుగు, మాటు. శృం.నై. 8.191 ; **3.** ఏనుగు మొ. వాటిని పట్టటం కోసం తవ్వబడి ముళ్ళు మొ. వాటితో కప్పబడిన, పల్లం. రాజవా. 3.46 ; **4.** గాయం ; విశ. అధికం, మిక్కుటం. వేంక. పంచ. 4.244.

**వదిగొను(-కొను)** అ.క్రి. నెలకొను, కడగు. బసవ. 4.599.

**వదిన** రూ.చూ. వదినె. వి.**1.** భార్య అక్క. విక్ర. 8.93 ; **2.** అన్నభార్య. ఉ.రా. 2.301 ; **3.** తనకంటె పెద్దదైన మేనత్త మేనమామల కూతురు.

**వదినియ** రూ చూ. వదినె. వి. **1.** అన్నభార్య ; **2.** భార్య. అక్క ; **3.** తనకంటె పెద్దదైన మేనత్త, మేనమామల కూతురు.

**వదినె** రూ. వదిన, వదినియ. వి. **1.** అన్నభార్య, జేష్ఠుని భార్య. భార.శల్య. 1.11 ; **2.** భార్యకి అక్క ; **3.** తనకంటే పెద్దదైన మేనత్త, మేనమామల కూతురు.

నం. వధూనికా, వధూనీ. వదినె ; ప్రా. వహుణ్ణీ : అ.మా. వహుయా, వహూ ; పా. వధుకా ; అప. వహు ;

క. మదువె. పెళ్ళి ; కొత. మైమై. పెళ్ళికూతురు ; తు. మైతిని. కోడలు ; త. మతని. కోడలు, మతిని.

వదినె ; పర్జి. ఓదిర్. పెళ్ళి ఊరేగింపు ; గ. ఓదుర్ ; ఒల్లా. ఓదుర్. పెళ్ళి.

< సం. వధూనీ.

**వదియ** రూ.చూ. వంద. వి. ఒకరకం గడ్డిమోపు. అం.భ. 2.77.

**వదిలించు** చూ. వదులు.

**వదిలివేయు** చూ. వదులు.

**వదులు** రూ. చూ. వదలు. అ.క్రి. బిగువుతప్పు, సడలు. వేమ. 3.25. విణ. బిగువుతప్పినది, సడలినది. సీతారా. 3.171.

**వదిలించు** రూ.చూ. వదలించు. అ.క్రి. విడిపించు, సడలించు, పోగొట్టు. <వదులు + - ఇంచు[3]. **వదిలివేయు** రూ. వదలివేయు. అ.క్రి. మానుకొను, విడిచిపెట్టు. < వదులు + -ఇ[13] + వేయు. **వదులుకొను** అ.క్రి. విడిచిపెట్టు, మానుకొను. **వదులుడి** వి. బీటిక, స్ఫోటకం. **వదులుముడి** వి. కొలికిముడి.

**వది** రూ.చూ. వంద. వి. ఒకరకం గడ్డి.

**వద్ద** రూ.చూ. ఒద్ద. వి.బౌ. ఒద్ద, సమీపం. రం. రా. అరణ్య. 164పు. 10 పం.

**వద్ది** రూ.చూ. ఒద్ది. వి. వర్తిక, విశాఖపట్నం, గోదావరి ప్రాంతాల్లో పెరిగే తెల్లని పూలు పూసే ఒక రకం చెట్టు (Dolichandrone crispa).

**వద్దు**[1] రూ.చూ. వలదు. అ.క్రి. వలదు. హంస. 1.84.

**వద్దు**[2] చూ. వలము. విణ. మొద్దు, లావు, స్థూలం. పండి. చ. 1.40పు. 9 పం.

**వద్దెపేర్పు** వి. అయిరేని కుండల్లో చిన్నది.

**వనకసింద** వి. చిన్నపూలు పూసే ఒకరకం మొక్క (Toddalia aculeata).

సం. వన - .అడవి.

< సం. వన - + కసింద (మిశ్రస.).

**వనకు** రూ. వొనకు. అ.క్రి. పాటుదప్పు.

**వనగళ్ళు** రూ.చూ. వడగండ్లు. వి.బ.వ. వానమాదిరి పడే చిన్న మంచుగడ్డలు.

**వనగూడు** రూ.చూ. ఒనగూడు. అ.క్రి. కలసివచ్చు.

**వనజంబళము** వి. అన్నవస్త్రాల్ని కోరకుండా కేవలం నిర్జీవ ధనానికి పనిచేసే ఏడాది సరిజీతం, కడుపుకూటి పని.

**వనట** చూ. వనరు.

**వనటుగొను (-కొను)** చూ. వనట. అ.క్రి. 1. వగచు ; 2. దేవరించు.

**వనడియు (-తీయు)** స.క్రి. అధికంగా బాధించు.

**వనపు** చూ. వనరు.

**వనభోజనము** వి. 1 ఉత్సవమూర్తిని ఒకవనానికి ఊరేగింపుతో తీసుకొనిపోయి ఆటలతో చేసే విందుపూర్వకమైన సేవ. ద.హిం. శా. సంపు.5 శా సం. 874. క్రీ.శ. 1620 ; 2. వానకోసం ఊరివారు వనంలో చేసే పూజలు, భోజనాలు.

సం. వనభోజన-. (కార్తీకమాసంలో) తోటలో చేసే భోజనం.

< సం. వనభోజన - (అర్థవిపరి.).

**వనమువిడిచినకోతి** వి. కులం విడిచి పెట్టిన వ్యక్తి.

సం. వన -. అడవి. తోట

**వనంబునఁగూరదిను(-తిను)** అ.క్రి. ఆకూ అలమూ తిను. భార. ఆశ్రమ. 2.15.

సం. వన -. అడవి. తోట.

**వనరు** రూ. వనారు. అ.క్రి. 1. శోకించు, దుఃఖించు. భార. ఆది. 5.247 ; 2. దీనాలాపాలాడు. భార.ఆది. 7,207 ; 3. విలపించు. వాశి.రా. 4.39; 4. ఒప్పు. ప్రబంధ. 178 ; 5. ఉండు, వర్తిల్లు ; వి. 1. శోకం, దుఃఖం. మొల్ల. బాల. 22 ; 2. వీలు, అవకాశం. మొల్ల. బాల. 32.

పో.చూ. క. ఒనగు. ఎండిపోవు, కుమ్మించిపోవు, ఒళఉ, ఏడ్చు, శబ్దంచేయు ; తు. ఒనుగెలు. ఎండిపోవు, చిక్కిపోవు ; త. ఉఱంకు. ఎండిపోవు, కుమ్మించిపోవు ; కో. ఒంగ్. (వేడిక) మాడిపోవు, ఎండిపోవు ; పర్జి. ఒల్. ఎండిపోవు.

మూ.ము.ద్రా. *ఓళ్-/ ఓణ్-, ఒళ్-వ్. ఒకటి విడిచి ఒకటిగా.

మూ.ద.ద్రా. *ఒక్-/-*ఒణ్-, *ఒక్-వ్ *ఉక్-, *ఉక్-వ్-.

**వనట** వి. 1. దుఃఖం, శోకం. భార. ఉద్యో. 4.295 ; 2. బాధ, కష్టం. రం రా. సుం. 247పు. 6పం. ; 3. పరిదేవనం. **వనపు** వి. వనరటం, పరిదేవనం.

**వనారు** రూ.చూ. వనరు. వి. వీలు, సౌకర్యం, వనరు.

**వనానరము** వి. 1. వ్యర్థం ; 2. అనవసరం.

సం. అనవసర-. తీరికలేని, అవకాశంలేని, విశ్రాంతిలేమి, సమయానుకూలం కాకపోవటం.

< సం. అనవసర-.

**వనిక** వి. పత్రిక, చీటి, జాబు. చంద్రాంగ. 3 37.

సం. వనికా. చిన్న అడవి.

**వనిమాను** వి. జమ్మిచెట్టు, శమీవృక్షం. E.I. సంపు. 5. శా. సం. 10, క్రీ.శ. 1102.

సం. వనీ. అడవి, పొద ;

క. బన్ని ; త. వన్ని.

< సం. వనీ + మ్రాను.

**వంత**[1] రూ.చూ. ప్రంత[1]. వి. 1. ఏరు, నది. నవనాథ. 2.102 పు. 10 పం. ; 2. వాగు, వానకురిసిన పొలంలో పారే నీటి జాలు.

**వంతవెదురు** వి. బోలువెదురు, బొంగువెదురు.

**వంత**[2] రూ.చూ. వంత[2]. వి. 1. సంతాపం, చింత. భార. ఆది. 5.60 ; 2. ఏడ్పు. భార. ఆది. 6.42 ; 3. బాధ. నీలా. 2.71.

త. వరుత్తమ్, వరుత్తు. బాధ, నొప్పి ; మ. వరుత్తమ్. కష్టం, శ్రమ ;

పో.చూ. సం. వ్యథా. బాధ.

**వంతచేయు** అ.క్రి. దుఃఖపడు. కు. సం. 7.23. **వంతపొందు** అ.క్రి. బాధపడు.

**వంత**[3] వి. 1. వీథినాటకంలో వెనక పాడే పాట ; 2. బుర్రకథలో రాజకీయం చెప్పేవాడు. హాస్యగాడు, కథకుడు పాడిన తరువాత 'తందాన తాన' మొ. మాటలు అనటం.

**వంతకత్తియ** రూ. వంతకత్తె. వి. కుట్టని, తార్పుడుకత్తె ఆం. పదా. నర.66. **వంతకత్తె** రూ.చూ. వంతకత్తియ. వి. కుంటెనకత్తె, కుట్టని, తార్పుడుకత్తె. **వంతపాటపాడు** అ.క్రి. 1. తందానతానపాడు ; 2. ఒకరినిసమర్థించు ; 3. అన్నిటికి తల ఊపు. **వంతపాడు** అ.క్రి. 1. తందానతాన పాడు ; 2. ఒకరిని సమర్థించు. **వంతవేయు** అ.క్రి. కన్నువేయు, కోరు.

**వంతర** వి. 1. గోయి ; 2. అపాయం.

**వంతు** రూ. ఒంతు. వి. 1. భాగం. వేంక పంచ 1.345 ; 2. పోటీ, స్పర్థ. యయా. 4.25 ; 3. వరస, పారి. 2.48 ; 4. సామ్యం. ఉ.రా. 6.24 ; 5. పంతం.

క. ఒంతు, వంతి, వంతు. వాటా, సమయం, ఒంతు, భాగం ; తు. ఒంతి, ఒంతు, సమయం.

**వంతుకువచ్చు** అ.క్రి. పోటీకివచ్చు. పారి. 1.80. **వంతుగలియు (-కలియు)** అ.క్రి. పొత్తుకలియు. పారి. 2 49. **వంతుపెట్టు** అ.క్రి. వంతుతెచ్చు, పోటీపెట్టు. తాళ్ల. సం. 635. **వంతువడు (-పడు)** అ.క్రి. వంతులు వేసుకొను. కకుత్థ్స. 2.118. **వంతువా(డు** విశ. సాటివాడు. తాళ్ల. శం. 7.102. **వంతువోవు (-పోవు)** అ.క్రి. భాగం తెగు. రాజవా. 5.54. **వంతుసాగు** వి. ఆసామికి పొలంచేసే రైతు పండిన పంటలో కొంతభాగం ఇవ్వటానికి నిర్ణయించుకొని (సగం కాని అంత కన్న ఎక్కువగాని) చేసే సేద్యం.

**వంతె** రూ.చూ. వంతెన. వి. ఎక్కటానికి, దిగటానికి వీలుగా కట్టిన నిర్మాణం.

**వంతెన** చూ. వంత[1]. రూ.వంతె. వి. ఏరుమొ. వాటికినీళ్ళు పోవటానికి తూములు విడిచి మీద నడిచి పోవటానికను వుగా కట్టిన కట్ట.

**వంతెనకట్టు** అ.క్రి. ఊడ్పైకు మధ్య వంతెనమాదిరిగా పడుగులో లాకలు దూర్చి చాపు.

**వంత్రువాసులు** చూ. వంతు. వి. తమతమవంతులు ప్రకారం తృప్తిమంతులుగాని వర్తకసంస్థలుకాని ప్రభుత్వానికి చెల్లించే ద్రవ్యవిభాగం. ద. హిం. శా. సంపు.10. శా.సం. 770. క్రీ.శ. 1691.

సం. వాసిన్. నివాసి.

**వంద** రూ. వదియ, వదె, వందె. వి. 1. నూరు. శతం కు. సం. 6.182 ; 2. ఒకరకమయిన తృణసముదాయం. ఆం. భా. 2.77.

సం. బృంద-. సమూహం ; ప్రా. వంద-.

<ప్రా. వంద-.

**వందలకువందలు** వి.బ.వ. అధికసంఖ్యాకం.

**వందర**[6] రూ. వంద్ర, వందరు, వందురు[2]. వి. అనుకూలమైన కాలు.

**వందరభూమి** వి. బంజరుభూమి.

**వందరు** చూ. బంజరు. రూ.చూ. వందర. వి. ఏటిఒడ్డున ఉన్న గవర్నమెంటు భూమి, వాగుబంజరు.

**వందరునేల** వి. ఏటిఒడ్డునేల. **వందరుపొలం** వి. మాగాణి పొలం.

**వందర** రూ. వంద్ర. వి. ఖండం, ముక్క, తునక.

**వందఱలాడు** రూ. వందలాడు. స.క్రి. 1. చెల్లాచెదరుచేయు. భార. ఆది. 2.100 ; 2. ముక్కలుచేయు. <వందఱ+-. లు+ఆడు.

**వందలాడు** రూ.చూ. వందఱలాడు. స.క్రి. 1. నరకు ; 2. ముక్కలుచేయు.

**వందాకి** వి. బదనిక, చెట్లపై మొలిచేమొక్క.

**వందిలి** చూ. వందు.

**వందిలీకము** వి. వినయం, అణకువ.

**వందు** రూ.చూ. వందురు[1]. అ.క్రి. 1. సంతాపించు. భార. ఆది. 5.247 ; 2 దుఃఖపడు కు.సం. 8.90 ; 3. చచ్చు. భార. విరా. 2.68 ; 4. వాడు, మ్లానమగు. భార. శాంతి. 2.126 ; 5. వివర్ణమగు. వెలవెలబారు. హరి.పూ. 9.148.

**వందిలి** వి. ఆపద, విపత్తు.

**వందురు**[1] రూ. వందు. అ.క్రి. 1. దుఃఖపడు. భార. ఆది. 5.142 ; 2. సంతాపించు, పరితపించు. భార. స్త్రీ. 2.51 ; 3 క్లేశపడు. మార్క. 1.62 ; వి. వ్యథ, నొగులు. ఆం. భా. 1.150.

క. బర్దు. చచ్చు ; త. వరుంతు బాధపడు. విచారించు, కష్టపడు.

**వందురు**[2] రూ.చూ. వందర. వి. 1. చిన్నపంటకాలవ. నె.శా. తామ్ర. 13 ; 2. అనుకూలమైనకాలు.

**వందె** రూ.చూ. వంద. వి. ఒకరకం తృణసముదాయం. ఆం. భా. 2.77.

**వందొందు** వి. మత్స్యవిశేషం.

<మూ.ద్రా.*వెళ్+దొందు.

**వంద్ర** రూ.చూ. వందఱ. వి. ముక్క, తునక.

**వన్నారి** రూ.చూ. వన్నారు. వి. వాననీళ్ళు పోవటానికి ఇంటి ముందు తవ్విన కాలవ.

**వన్నారు** రూ. వన్నారి. వి. రెండిళ్ళమధ్యఖాళీస్థలం. మండువా.

**వన్నియ**[1] రూ.చూ. వన్నె[1]. వి. 1. చక్కదనం, ఒప్పిదం. దశకు. 6.64 ; 2 బంగారంయొక్కరాతిమీదిగీటు శృం. నై. 8 103 ; 3. శ్వేతాదివర్ణం, రంగు. కాశీ. 7.5 ; 4. ప్రసిద్ధి. పల్నా. ప. 97 ; 5. కాంతి. శోభ. పారి. 1.120 ; 6 ఇంపు. వసు. 3.33 ; 7. వర్ణన. వసు. 6.85 ; 8. రీతి, విధం. విప్ర. 4.27 ; 9. ప్రశస్తి. ఉత్కర్ష. ఉ.రా. 4.163 ; 10. వస్త్రవిశేషం, రంగుచీర, ధనా. 3.38 ; 11. రంగు పూత ; 12. ప్రత్యయం ; 13. అలంకారం ; 14. మొగలిపూవు.

**వన్నియపెట్టు** రూ. వన్నెపెట్టు. అ.క్రి. మెరుగుపెట్టు, పాండు. 4.204. **వన్నియలపిట్ట** వి. వెన్నెలపులుగు. చకోరం.

**వన్నియ**[2] రూ.చూ. వన్నె[2]. వి. అంకవన్నె, గుర్రాన్నిఎక్క టానికి రెండుపక్కల అమర్చిన మెట్టు.

**వన్నీస్‌నెంబరు** వి. పందొమ్మిదోనెంబరు కుసుమ.

హిం. ఉన్నీస్. పందొమ్మిది ; ఇం. *Number*. నంబ్య.

<హిం. ఉన్నీస్+ఇం. Number.

**వన్ను** రూ.చూ. వన్నె[1]. వి. రంగు.

వన్నులువెట్టు(-పెట్టు) అ.క్రి. వన్నెపెట్టు. రంగువేయు. కు.సం. 9.11. వన్నువూన్చు(-పూన్చు) అ.క్రి. వన్నెవేయు, రంగువేయు. కు.సం. 9.10.

**వన్నువ** రూ.చూ. వన్నె[1]. వి. **1.** రంగు. కు.సం. 5.118 ; **2** విధం, రీతి. బసవ. 7.167.

**వన్నువు** వి. వన్నె. రంగు. కు సం. 9.112.

వన్నువెక్కించు అ.క్రి. వన్నెపెట్టు, రంగుఎక్కువచేయు. కు.సం. 9.23 ; <వన్నువు+ఎక్కించు.

**వన్నువెక్కించు** చూ. వన్నువు.

**వన్నె**[1] రూ. ఒన్నె, వన్నియ[1], వన్ను, వన్నువ. వన్నువు. వి. **1.** బంగారం యొక్క మేలిమి, నిగ్గు. కు సం. 1.32 ; **2.** శ్వేతాదివర్ణం, తెలుపు మొ. రంగు. ద. హిం. శా. నంపు. **4.** శా.సం. 765, క్రీ.శ. **1264** ; **3.** కాంతి, శోభ. విక్ర. **1.44 ; 4.** చక్కదనం, ఒప్పిదం. విక్ర. 8.50 ; **5.** ప్రసిద్ధి. వరాహ. 3.92 ; **6.** విలాసం, శృంగారచేష్ట. ప్రబోధ. 1.75 : **7.** ప్రశస్తి, ఉత్కర్ష. ఆము. 6.105 ; **8.** వర్ణన, పొగడ్త. రాఘవ. 1.4 ; **9.** రంగుచీర. విజయ. 3.13 ; **10**. అలంకారం. దశా. 8.82 ; **11.** విధం, రీతి. హంస, 5 318 ; **12.** కాంతి కిరణాలవల్ల కంటిలోపలి తెర ఆధారంగా కలిగే వర్ణజ్ఞానం ; విశ. అందమైన. హర. 2.133 ; అవ్య. విధం, రీతి. నీలా. 1.106.

సం. వర్ణక -, వర్ణికా. రంగు ; ప్రా. వణ్ణయ- ; వణ్ణియ- వర్ణింప దగిన, వణ్ణ- వణ్ణిఅ, వన్నిఅ. నమూనా. ఎరుపురంగు ; అప. వణ్ణ- ; అ.మా. వణ్ణ. రంగు, దృశ్యం, కాంతి. వణ్ణియ- రంగు వేయటం ;

క. బణ్ణ. రంగు. రీతి, గుణం ; తు. బణ్ణ ; త. వణ్ణమ్ ; మ. వణ్ణం. ఆకృతి, రంగు. అందం.

<ప్రా. వణ్ణియ-.

వన్నెఅతుకు రూ. వన్నిఅతుకు. అ.క్రి. పడుగులో కలప వలసిన రంగుపోగులు అతుకు. వన్నెఅద్దు అ.క్రి నూలుకుగాని బట్టలకుగాని రంగులు పట్టించు. వన్నెకత్తియ రూ.చూ. వన్నెకత్తె. వి. విలాసవతి. సొగసుకత్తె. వన్నెకత్తె రూ. వన్నెకత్తియ. వి. విలాసవతి. పండిచ. 2.116పు. 20పం. వన్నెకలుగు అ.క్రి. ప్రసిద్ధికలుగు. రాధా. 1.31. వన్నెకాఁడు వి. **1**. అందుగాడు, సౌందర. వంతుడు. భాగ. 1.218 ; **2.** విలాసవంతుడు. ఉ.రా. 4.194 ; **3**. నేర్పరి. రంగా. చ. 1.69. వన్నెకారి వి. విలాసవంతుడు. శుక. 3.228. వన్నెకుఁదెచ్చు(-తెచ్చు). స.క్రి. ప్రసిద్ధికెక్కించు, ప్రఖ్యాతి కలిగించు. పాండు. 1.54. వన్నెకెక్కు అ.క్రి. ప్రఖ్యాతి పొందు. నరస. 1.8. <వన్నె[1]+-కున్+-ఎక్కు. వన్నెకోక వి. చిత్ర వర్ణాలున్నవస్త్రం, పలురంగులచీర. ప్రబంధ. 623. వన్నెగుడ్డ వి. రంగువేసినగుడ్డ. రాజవా. 2.55. వన్నెచిన్నెలు వి.బ.వ వయారాలు. వన్నెచీర వి. చిత్రవర్ణపు వస్త్రం. వన్నెచెట్టు వి. వర్ణపుష్పం, ఒకజాతిచెట్టు. వన్నెచెడు అ.క్రి. **1**. పేరుపోవు. శాళ్ల. సం. 5.187 ; **2**. రంగు మాయు. వన్నెతక్కువయగు( అగు) అ.క్రి. యోగ్యత తగ్గిపోవు. మను. 2.73. వన్నెతెచ్చు రూ. వన్నెదెచ్చు. అ.క్రి. **1**. ప్రతిష్ఠతెచ్చు. పల్నా. పు. 102 ; **2**. వెలుగు నిచ్చు. వన్నెతేఱు రూ.చూ. వన్నెదేఱు. అ.క్రి. రంగెక్కు-చాయతేరు. వన్నెదఱుఁగు (-తఱుఁగు) అ.క్రి. గౌరవం చెడు. హంస. 1.125. వన్నెదెచ్చు (-తెచ్చు) రూ.చూ. వన్నెతెచ్చు. అ.క్రి. రంగుమీరచేయు, వాసికెక్కుచేయు. విప్ర. 2.41. వన్నెదేఱు (-తేఱు) రూ. వన్నెతేఱు. అ.క్రి. రంగెక్కు, చాయతేరు. వన్నెపులుఁగు వి. జీవంజీవం. చకోరం. వన్నెపూన్చు అ.క్రి. రంగువేయు. వన్నెపెట్టు రూ.చూ. వన్నియపెట్టు. అ.క్రి. రంగువేయు. వన్నెపూలు వి.బ.వ. శాలిధాన్య విశేషం. వన్నెమణుంగులు వి. బ. వ. వస్త్ర విశేషం. ప్రబంధ. 635. వన్నెమీఱు అ.క్రి. **1**. ప్రకాశించు, ఒప్పు. నీలా. 1.33 ; **2**. ప్రసిద్ధికెక్కు. వన్నెయువాసియు అవ్య. ద్రు. కీర్తి ప్రతిష్ఠలును. పారి. 1 88. వన్నెలపులుగు వి. జీవంజీవం, ఒకరకం పక్షి, చకోరం. వన్నెలాఁడి వి. విలాసవతి, విలాసం కలది, రాజ.వి. 4 91. <వన్నె[1]+-లు+-ఆఁడి. వన్నెలాఁడు వి. అందగాడు. నీలా. 1.76. <వన్నె[1]+-లు+-ఆఁడు. వన్నెవిరేణి రూ. వొన్నయిరేణి. వి. సున్నంపూసి నల్ల గీతలుగీసి ఆగీతల మధ్య ఎరుపు ఆకుపచ్చ మొ. రంగులతో ఏనుగులు, గుఱ్ఱాలు, నెమళ్ళు మొ. బొమ్మలు వేసిన అరివేణి కుండలు. <వన్నె[1]+అవిరేణి. వన్నెవెదురు వి. వృత్తపత్రం, ఒకరకం వెదురు. ఆం. భా. 2.73. వన్నెవేయు అ.క్రి. నూలుకుగాని, బట్టలకుగాని రంగులు పట్టించు.

**వన్నె**[2] రూ. వన్నియ[2]. వి. అంకవన్నె. గుఱ్ఱాన్నెక్కటానికి రెండుపక్కల అమర్చిన మెట్టు. సారంగ. 1.82.

**వ్రనం** చూ. వనరు. వి. వసతి.

**వప్పాఱు** చూ. వప్పు.

**వప్పు** వి. **1**. గంటు, గాయం. నవనాథ. 2.91పు. 22పం. **2**. శకలం, తునక. చంద్రాంగ. 2.84.

వప్పారు వి. పాక, పసార. <వప్పు+-ఆరు[1].

**వంపు** చూ. వంగు. రూ. అంపు, ఒంపు[2], వొంపు. వి. **1**. తడవ, పర్యాయం ; **2**. బండి చక్రానికి వేసేది, పూటి ; **3**. వాగు, కొండ చరియల నుంచి పారేవాగు ; **4**. బాణం లాగా వంచిన బద్ద ; **5**. వంగలుగా ఉన్న ఒసికర్రలపై పొడుగ్గా వేసినకర్ర ; **6**. వంగి ఉన్నది ; **7**. వంకర.

వంపుకాల్వ వి. లోయలనుండి నీళ్ళు వచ్చే కాలవ. వంపుగొట్టం వి. మట్టితో వంపుగా చేసిన తూము. వంపుడు వి. వంగినది. కవిరాజ. 4.29. వంపుడు బడితె వి. సర్పం. వంగలగా ఉన్న ఒసికర్రలమీద పొడుగ్గా వేసినకర్ర. వంపుడు వాసం రూ వంపుడోసం. వి. వంగగా ఉన్న ఒసికర్రలమీద పొడుగ్గా పరిచిన కర్ర. వంపుడోసం రూ.చూ. వంపుడువాసం. వి. వంగగా ఉన్న ఒసికర్రలమీద పొడుగ్గా పరిచిన కర్ర. వంపుదోనె వి. లావుగా వంపుగా చేసిన మట్టిగొట్టం. వంపుపట్టె వి. **1**. చుట్టుగుడిసె చుట్టూ బొద్దులాగా పెట్టే వంపు కొయ్య ; **2**. బండిచక్రం

తయారీలో వాడే వంగిన కొయ్య. **వంపుపెంకు** వి. ఇంటి వెన్నుగాడి మీద పరిచే పెంకు. **వంపురేకు** వి. వంకులు వంకులుగా ఉండే రేకు. **వంపులార్చి** వి. పక్కభాగాలు వంకులు వంకులుగా ఉండే ఆర్చి. <వంపు+-లు+ఆర్చి. **వంపులుపోవు** రూ. వంపులోవు. అ.క్రి. కుందలు మొ. వి ఎక్కువ కాల్పు వల్ల సొట్టలు పోవు. **వంపులోవు** రూ.చూ. వంపులుపోవు. అ.క్రి. కుందలు మొ. వి ఎక్కువ కాల్పు వల్ల సొట్టలు పోవు. **వంపుల్వంతె** వి. వంపులు తిరిగిన మెట్టు. <వంపు+-లు+వంతె. **వంపుసిలిం** రూ. వొంపు సిలిం. వి. పొగపీల్చేమట్టిగొట్టం. **వంపుసీల** వి. గానుగ దూలానికి బిగించే 'S' ఆకారపు ఇనపకొక్కెం. **వంపు సొంగ** రూ. వొంపు సొంగ. వి. వంకసొంగ, పొగ పీల్చే మట్టిగొట్టం. **వంపెట్టు** స.క్రి. వంగేట్లు పెట్టు. శార్ఙ్గ. సం. 6.228. <వంపు+పెట్టు. **వంపొత్తుకొను** స.క్రి. వశపరచుకొను. <వంపు+ఒత్తుకొను.

**వంపెట్టు** చూ. వంపు.

**వంపొత్తుకొను** చూ. వంపు.

**వంబతాదు** వి. కపిలకు వేసే ఒకతాదు.

**వమ్మక** వి. గేలి, వేళాకోళం.

**వమ్మగు** చూ. వమ్ము.

**వమ్ము** విణ. 1. వ్యర్థం. కు.సం. 5.74; 2. నష్టం, చెడినది. భార. విరా. 3.7; వి. 1. నాశం. భార. భీష్మ. 3.175; 2. వ్యర్థత్వం. చిత్రభా. 3.67; 3. తాడి, కొబ్బరి మొ. చెట్లు గెలవేసే ముందు పుట్టేమోసు; 4. చిమ్మివేసిన గడ్డిగాదం మొ. వి.

తు. బంబె. కుటిలప్రశంస; త. వంపు. వ్యర్థత్వం, నింద, చెడుశీలం.

**వమ్మగు** అ.క్రి. వ్యర్థమగు. ఉ. హరి. 2.29. <వమ్ము+అగు. **వమ్ముచేఁత** రూ.చూ. వమ్ముసేఁత. వి. వ్యర్థపచ్చటం. **వమ్ముచేయు** రూ.చూ. వమ్ముసేయు. స.క్రి. వ్యర్థంచేయు. **వమ్మువఱుచు** స.క్రి. వ్యర్థంచేయు. మైరా. 2.48. **వమ్మువోవు (-పోవు)** అ.క్రి. 1. నష్టమగు, చెడు. ఉ.హరి. 5.72; 2. వ్యర్థమగు. **వమ్ముసేఁత (-చేఁత)** రూ. వమ్ముచేఁత. వి. వ్యర్థపచ్చటం. భార. ఉద్యో. 2.44. **వమ్ముసేయు (-చేయు)** రూ. వమ్ముచేయు. స.క్రి. వ్యర్థంచేయు.

**వయనము** రూ.చూ. వయినము. వి. 1. ఏర్పాటు; 2. అనువు; 3. అక్కర.

**వయంప** చూ. వేఁప. వి. వేపచెట్టు (Azadirachta Indica).

**వయసుకత్తియ** రూ. వయసుకత్తె. వి. యువతి, పడుచు.

సం. వయస్. ఈడు, యౌవనం, ఆరోగ్యం, దేహదార్ఢ్యం.

<సం. వయస్+-కత్తియ.

**వయసుకత్తె** రూ.చూ. వయసుకత్తియ. వి. యువతి, పడుచు.

**వయసుకాఁడు** వి. యువకుడు, వయస్కుడు.

సం. వయస్. ఈడు, యౌవనం, ఆరోగ్యం, దేహదార్ఢ్యం.

<సం. వయస్+-కాఁడు.

**వయసుచెల్లు** అ.క్రి. 1. ముదిమివచ్చు; 2. చనిపోవు.

సం. వయస్. ఈడు, యౌవనం, ఆరోగ్యం, దేహదార్ఢ్యం.

<సం. వయస్+చెల్లు.

**వయసుమీఱు** అ.క్రి. ముదిమివచ్చు, యౌవనం దాటు.

సం. వయస్. ఈడు, యౌవనం, ఆరోగ్యం, దేహదార్ఢ్యం.

<సం. వయస్+మీఱు.

**వయారము** రూ.చూ. ఒయ్యారము. వి. ఒయ్యారం. కృ.శత. 2.136.

**వయాళి** రూ. వయ్యాళి[1]. వి. విహారం, అసివారు. కృ. శత. 1.59; చంపూరా. 6.73.

సం. వాహ్యాలి. గుర్రాలు నడిచేమార్గం; ప్రా. వాహియాలి. గుర్రాలపై సవారీచేసే ప్రదేశం.

<ప్రా. వాహియాలీ.

**వయాళించు** రూ. వయ్యాళించు. అ.క్రి. విహరించు, స్వారిచేయు. <వయాళి+-ఇంచు[3].

**వయిఖరి** రూ.చూ. వైఖరి. వి. 1. వర్తన; 2. విదానం.

**వయిచు** రూ.చూ. వైచు. స.క్రి. 1. విసరివైచు. పండి. చ. 2.149వ. 12పం; 2. తోయు. హరి ఉ. 4.10; 3. పడవేయు.

క. బయ్, బయ్యు, బచ్చు. దాచుకొను, పక్కకు పెట్టు, దాచు; కొడ. బెయ్- (బిప్- బెచ్-). ఉంచు; తు. బిజిలుని, బిజెలుని. ధరించు; త. వై (-ప్-, -త్-). పెట్టు, ఉంచు, నిలవచేయు; మ. వెక్క. పెట్టు, కట్టు, ఏర్పరుచు, వెప్పు. ఉంచు, దాచుకొను; కో. వయ్. ఉంచు; కొలా. వాయ్. విత్తనాలుచల్లు; నా. వయ్-, విత్తనాలు చల్లు; బ్రా. బేసంగి. ధరించు వేసుకొను.

**వయిజాతి** రూ.చూ. వైజాతి. వి. ఒకానొక తెగ కోమటి జాతి.

**వయిజాతితొండ** రూ.చూ. వైజాతితొండ. వి. ఊసర వెల్లి.

**వయిడము** క్రి. విణ. వేగంగా, వడిగా.

సం. వేగ-. వేగటం.

**వయినము** రూ. వయనము, వైనము, వైయినము. వి. 1. క్రమం. విష్ణుపు. 3; 2. వివరణం. మల్హుపు. 2.67; 3. ఉపాయం; 4. కారణం, హేతువు.

**వయిపు** రూ.చూ. వైపు. వి. 1. గురుపు, లక్ష్యం; 2. ఉపాయం; 3. విధం; 4. వాసి, అతిశయం; 5. పార్శ్వం, పక్క, పక్షం.

**వయిపుకాఁడు** రూ.చూ. వైపుకాఁడు. వి. 1. నేర్పరి; 2. సమర్థుడు.

**వయిమూలము** రూ.చూ. వైమూలము. విణ. అధికం, ఎక్కువ, ముమ్మరం.

**వయిరము** వి. పగ, శత్రుత్వం.

సం. వైర-. పగ.

<సం. వైర-.

**వయిరవులు** రూ.చూ. వైరవులు. వి. కట్టెనిప్పు, అంగారం.

**వయిరాలు** రూ.చూ. వైరవులు. వి. కట్టెనిప్పు.

**వయిల** రూ. వైల, వైళ. వి. ఒకజాతిడేగ.

**వయిలెట్** రూ. ఒయిలేట్, ఒయిలేటు, వయిలెట్టు, వయిలేట్, వయిలేటు, వయొలెట్, వాయిలెట్, వైలెట్, వి. 1. నల్ల ద్రాక్ష పండురంగు ; 2. వంకాయ రంగులో నలుపు కత్తు కలిసిన వన్నె ; 3. నల్లవంకాయరంగు ; 4 నీలం ఎరుపు కలిసిన రంగు ; 5. నలుపులో ఎరుపురంగు ; 6. బులుగు ఊదా కలిసినరంగు ; 7. తెలుపులో నలుపు.

ఇం. Violet. ఊదారంగు.

< ఇం. Violet.

**వయిలెట్‌చీర** వి. బచ్చల పండురంగుచీర.

**వయిలెట్టు** రూ.చూ. వయిలెట్. వి. 1. నల్లద్రాక్షపండురంగు ; 2. వంకాయరంగులో నలుపు కత్తు కలిసిన వన్నె ; 3. నల్లవంకాయరంగు ; 4. నీలం ఎరుపు కలిసినరంగు ; 5. నలుపులో ఎరుపురంగు ; 6. బులుగు ఊదా కలిసిన రంగు ; 7. తెలుపులో నలుపు.

**వయిలేట్** రూ.చూ. వయిలెట్. వి. 1. నల్లద్రాక్షపండురంగు ; 2. వంకాయ రంగులో నలుపుకత్తు కలిసిన వన్నె ; 3. నల్లవంకాయ రంగు ; 4. నీలం ఎరుపు కలిసినరంగు ; 5. నలుపులో ఎరుపురంగు ; 6. బులుగు ఊదా కలిసిన రంగు ; 7. తెలుపులో నలుపు.

**వయిలేటు** రూ.చూ. వయిలెట్. వి 1. నల్లద్రాక్షపండు రంగు ; 2. వంకాయరంగులో నలుపుకత్తు కలిసిన వన్నె ; 3. నల్లవంకాయరంగు ; 4. నీలం, ఎరుపు కలిసినరంగు ; 5. నలుపులో ఎరుపురంగు ; 6. బులుగు ఊదా కలిసిన రంగు ; 7. తెలుపులో నలుపు.

**వయిళము** రూ.చూ. వైళము. వి. 1. విధం ; 2. సమయం ; విశే. శీఘ్రం, సత్వరం.

**వయిసిక** రూ.చూ. వైసిక. వి. కపటం.

**వయిహళి** రూ. వయిహాళి. వి. పెద్దసభ.

క. వైహాళి, వైహ్యాళి. గుర్రాల వరస.

**వయిహాళి** రూ.చూ. వయిహళి. వి. పెద్దసభ.

**వయొలెట్** రూ.చూ. వయిలెట్. వి. 1. నల్లద్రాక్ష పండురంగు ; 2. వంకాయరంగులో నలుపుకత్తు కలిసిన వన్నె ; 3. నల్లవంకాయ రంగు ; 4. నీలం, ఎరుపు కలిసినరంగు ; 5. నలుపులో ఎరుపురంగు ; 6. బులుగు ఊదా కలిసిన రంగు ; 7. తెలుపులో నలుపు.

**వయ్య** రూ.చూ. వ్రయ్య. వి. ఒకదానిలో భాగం.

**వయ్యంది** వి. అంగారధానిక, కుంపటి.

**వయ్యము** రూ.చూ. వాయము. విశే. వ్యర్థం. హర. 3.66. భోజ. 4.272.

**వయ్యారము** రూ.చూ. ఒయ్యారము. వి. ఒయ్యారం, విలాసం. ప్రబంధ. 282.

**వయ్యాళి**[1] రూ.చూ. వయాళి. వి. స్వారి. విహారం. ద్వి. పరమ. వి. 2.124పు. 9పం.

**వయ్యాళించు** రూ.చూ. వయాళించు. అ.క్రి. విహరించు, స్వారీచేయు.

**వయ్యాళి**[2] వి. ఒకరకం సస్యం.

**వయ్యాళిపొలము** వి. బాగాపండే పొలం. తాళ్ల.సం. 10.52.

**వర**[1] వి. సస్యవిశేషం. విష్ణు. 3.

సం. వరా. తాడి, ఉసిరికచెట్టు, పసుపు.

**వరగారు** (-కారు[6]) వి. తొలికారు, వానకారు.

**వర**[2] వి. నీటిదారువుకు పోయేబాట.

**వరగడ్డము** వి. 1. నిట్టరగాఉన్న రాతియొక్కగాని, గట్టుయొక్కగాని అంచు ; 2. ఒకపక్క ఎత్తు ఇంకొక పక్క తగ్గుగా ఉండే తోవ.

**వర**[3] రూ.చూ. ఒఱ. వి. 1. బావులు తయారుచేయటానికి ఉపయోగించే మట్టితోచేసి కాల్చిన వలయాలు ; 2. పరుపు దిండు, మొ. వాటి గలీబు, గొసిని, తొడుగు.

**వరపెంకులు** వి.బ.వ. ఆములో కుండలు పేర్చిన తర్వాత పైన కప్పుగా పేర్చే కుండలు. **వరలనుయ్యి** రూ.చూ ఒఱలనూయి. వి. వరలు వేసిన బావి **వరలబావి** రూ. వర్లబావి. వి. వరలు వేసిన బావి. **వర్లబావి** రూ.చూ. వరలబావి. వి. వరలు వేసినబావి.

**వరం** రూ. వారం. వి. 1. ప్రహరీగోడమీదఆకు, మట్టి, రాయి మొ. వాటితో రక్షణకోసం గోడకంటె వెడల్పుగా పెట్టిన కప్పు ; 2. గట్టు, గనెం, మాగాణిలో మడికీ మడికీ మధ్య వేసిన మట్టి కట్ట ; 3. రెండుపొలాల మధ్య హద్దుగా వేసిన గట్టు.

**వరక** వి. ఏటవాలు. ఏటివరక.

**వరకట్ట** రూ. వరాకట్ట, వరాహకట్ట. వి. అడవిపంది వెంట్రుకలతో చేసిన చిన్నకట్ట, బంగారం నగల మకిలి కడగటానికి ఉపయోగించే కట్ట.

సం. ప్రా. పా. వరాహ -. పంది.

< ప్రా. వరాహ- + కట్ట.

**వరకట్టు** స.క్రి. 1. బంగారాన్ని పరీక్షచేయు ; 2. దున్నటంకోసం భూమిని చదునుచేయు.

**వరకము**[1] వి. 1. కఠినంగా పనిచేయించేశిక్ష ; 2. కఠినశిక్ష.

**వరకము**[2] వి. 1. వరక అనేపక్షి ; 2. తాబేటిచిప్ప ; 3. నీటిలో అక్కడక్కడ పడే గోతులభాగం ; 4. బాటలమధ్య హఠాత్తుగా కలిగే గోతుల భాగం.

**వరకు**[1] రూ. వరను[2]. వి. బంగారు మొ. వాటి రేకు ; 2. మొలాం.

క. వరకు. కప్పే గుడ్డ, కప్పేది.

**వరకు**[2] రూ.చూ. వఱకు. వి, పర్యంతార్థం.

**వరగ** రూ.చూ. వరిగ. వి. పెద్ద ఆరుగు పైరు. విష్ణుపు. పూ.3.

**వరగలించు** రూ. వరఁగలించు. అ.క్రి. అలరారు, ఒప్పు.

**వరగలు** రూ. ఒరిగెలు, వరిగెలు. వి.బ.వ. ఒకరకం ధాన్యం, పెద్దారుగధాన్యం, జొన్నలు (Panicum miliaceum).

**వరగచేప** వి. ఒకరకం చేప.

**వరగున** వి. తోటల్లో పెరిగే ఒకరకం మొక్క. (Cycas circinalis).

**వరగొడ్డము** రూ.చూ. వఱగొడ్డము. వి. వంకర మాట.

**వరగోగు** వి. సర్కారు, కర్ణాటక ప్రాంతాల్లో పెరిగే ఒకరకం తీగ (Toddalia aculeata).

**వరగోఁగు** చూ. వర[1]. వి. వృక్షవిశేషం, ఒకజాతి గోగు. హంస. 4.11.

**వరగోజు** వి. పచ్చగా ఉండే ఒకచెట్టు. (దీనికొమ్మలు పళ్ళు తోముకునే పుల్లలుగా ఉపయోగిస్తారు) (Salvadola persica).

**వరంగోడ** రూ. వరెంగోడ. వి. మిద్దెపై అంచులదగ్గర, బట్టీ ముళల పక్కన కట్టే పల్చని పొట్టిగోడ.

**వరఁకు** రూ. వరను[1]. వి. ఔ. చిక్కు. బొన్క. రా. బాల. 63.

**వరఁగలించు** రూ.చూ. వరగలించు. స.క్రి. ప్రకాశించు, వరలు, హవణిల్లు.

**వరజు** వి. నాగటిచాలు.

**వరట** రూ. వరటి. వి. పేడ ఎండిన చెక్క, పిడక.

క. *బఱటి, బెఱటి, బెఱణి, బెణ్ణి*. పిడక; తు. *బెజంటు*; త. *వఱట్టి, వఱళి, వరఁట్టి*; మ. *వరటి. వఱళి*.

వరటపోవు అ.క్రి. 1. కృశించు; 2. ఎండిపోవు.

**వరటలు** వి.బ.వ. తికమకలు, చిక్కులు. పండి. చ. 2.116.

**వరటి** రూ.చూ. వరట. వి. పిడక.

**వరటు** అ.క్రి. శుష్కించు. కుచే. 1.38.

**వరండా** వి. 1. ఇంటిముందున్న కప్పువేసిన అరుగు; 2. పైకప్పు, సున్నపుబట్టీ పైభాగాన చదరంగా ఉండే భాగం.

ఇం. *Veranda, Verandah* వసారా, స్తంభాలతో కూడిన పైకప్పుకుగల పంచపాళి.

< ఇం. Veranda.

**వరతిపాలసు(-అగు)** చూ. వఱ్ఱు, వఱతి. అ.క్రి. నీళ్ళపాలగు. తాళ్ల. సం 9.75.

**వరద** రూ.చూ. వఱద. వి. 1. ప్రవాహం. పల్నా. పు. 49; 2. వాగు, వానకురిసి పొలంలో పారే సన్నటి నీటిజాలు.

వరదగుడి రూ.చూ. వరదగూడు. వి. సూర్యాది పరివేషణం. వరదగుడు రూ.చూ. వరదగూడు. వి. 1. వానగుడి, చంద్రుడి చుట్టూగాని, సూర్యుడుచుట్టూగాని కాస్త ఎడంగా వలయాకారంలో ఏర్పడే హద్దు; 2. ఇంద్రధనస్సు. వరదగూడు రూ. వరదగుడి, వరదగుడు, వర్దగుడు, వర్దగూడు. వి. 1. వానగుడి, చంద్రుడిచుట్టూ గాని, సూర్యుడిచుట్టూగాని కాస్తఎడంగా వలయాకారంలో ఏర్పడే హద్దు, పరివేషం. ఇదిదగ్గరగా వేస్తే వానలు దూరంలోను దూరంగా వేస్తే దగ్గరలోను పడతాయి అని నమ్మకం; 2. ఇంద్రధనస్సు. వరదపారు అ.క్రి. నీరు ఎక్కువగా ప్రవహించు. వరదపాసెం వి. వానకోసం పరమాన్నం, బెల్లపు పానకం, సంతర్పణ చేయటం. సం. పాయస- పాలతోచేసిన పదార్థం. < వరద + సం. పాయస-. వరదలుపారు అ.క్రి. నీరుఎక్కువగా ప్రవహించు. వరదలోఁగలుపు(-కలుపు[1]) స.క్రి. గంగలో కలుపు, పాడుచేయు. పల్నా. పు. 112. వరదవట్టుకొను (-పట్టుకొను) స.క్రి. రాబట్టుకొను.

**వరని** వి. కళింగదేశంలోని రాష్ట్రవిభాగానికి చేర్చే అంత్య పదం. E.I. సంపు. 28. 29.

**వరను[1]** రూ.చూ. వరఁకు. వి.ఔ. 1. చిక్కు; 2. వంచన.

**వరను[2]** రూ.చూ. వరకు[1]. వి. 1. రేకు, మొలాం; 2. తొడుగు; 3. మాసిక.

**వరఁత** రూ. వ్రంత. వి. 1. వ్రంత, ఏరు, నది; 2. పల్లం; 3. రంధ్రం.

వరఁతఁగొట్టు(-కొట్టు[1]) చూ. వఱ్ఱు. స.క్రి. నశింపచేయు. తాళ్ల. సం. 8.64. వరఁతఁబోవు(-పోవు) చూ. వఱ్ఱు. అ.క్రి. ప్రవాహంలో పడిపోవు. తాళ్ల. సం. 11.2.49. వరఁతవచ్చు చూ. వఱ్ఱు. అ.క్రి. విజృంభించు. తాళ్ల. సం. 14.121.

**వరపట** అవ్య. బయట.

**వరపడి** చూ. వరపు.

**వరపడు** రూ.చూ. వరముపడు. అ.క్రి. కోర్కెలకోసం ముఖ్యంగా స్త్రీలు సంతానం కోసం దేవీ ఆలయంలో నిష్ఠతో ప్రతిదినం కొంతసేపు దేవి ఎదుట సాగిలపడి ధ్యానంతో మొక్కు.

**వరపు** రూ.చూ. వఱపు. వి. అనావృష్టి.

వరపడి రూ.చూ. వరబడి. వి. కరవు, క్షామం. వరపుకూలీ వి. గాలికూలీ, వేసవికాలంలో పొలంపనిలోకి వచ్చే కూలీ. వరబడి రూ. వరపడి. వి. కరవు, క్షామం. < వరపు + -బడి.

**వరప్రయాణము** వి. చేయదలచుకొన్న ప్రయాణానికి తిథి, వార నక్షత్రాలు బాగా లేనప్పుడు ముందుగా ఒక మంచి రోజున వేరొక ఇంటికి ప్రయాణమై వెళ్ళి ఉండటం.

సం. *వర-*. శ్రేష్ఠమైన, *ప్రయాణ-*. పయనం.

< సం. వరప్రయాణ-(అర్థవిపరి.).

**వరబడి** చూ. వరపు.

**వరబీజము** రూ. వరిబీజము. వి. ఒకపక్క లేదా రెండుపక్కలా అండం లేదా అండాలు వాయటం, బుడ్డ.

సం. *వరబీజ-*. శ్రేష్ఠమైన విత్తనం.

< సం. వరబీజ- (అర్థవిపరి.).

**వరముపడు** రూ. వరపడు, వరపుపడు, వరవుంబడు. అ.క్రి. 1. ప్రాణాచారంపడు. ఆము. 6 98; 2. అనశన వ్రతమాచరించు, కోర్కెలకోసం ముఖ్యంగా స్త్రీలు సంతానం కోసం దేవి ఆలయంలో నిష్ఠతో ప్రతిదినం కొంతసేపు దేవిఎదుట సాగిలపడి ధ్యానంతో ఉండు.

సం. *వర-*. కోరిక, కానుక, వేడికోలు, ఈవి, బిచ్చం

< సం. వర- + -ము + పడు.

**వరంబడి** రూ. వరుంబడి. వి. ధనాదాయం.

**వరలు[1]** అ.క్రి. ప్రకాశించు, ప్రవర్తిల్లు. భాగ. 4.2063.

త. *వళర్-*. మెరుగు, తెల్లనిది; మ. *వళర్-* ఎక్కువ.

**వరలు[2]** రూ. వరులు, వర్లు. అ.క్రి. వాగు, వదరు.

**వరవ** వి. 1. నీళ్ళు రావటానికి ఏర్పరచిన కాలువ. బహుళా.

1.59. చంపూరా. 7.25 ; 2. పొలంలో వాననీళ్ళు పారటంవల్ల కోసుకొనిపోయి ఏర్పడ్డ పల్లం ; 3. చెరువుకు నీళ్ళు రావటానికి సహజంగా ఏర్పడిన వాగు ; 4 చేకూరే సదుపాయం ; 5. గడ్డ.

సం. ప్రవాహ-. ప్రవాహం.

**వరవచేప** వి ఒకరకం చేప. త. బర్వై-. ఒకరకంచేప.

**వరవడి¹** రూ.చూ. వరువడి. వి. మేలు బంతి.

**వరవడి²** రూ.చూ. ఉరవడి. వి. వేగం, ఉరవడి.

**వరవాడి** రూ.చూ. ఉరవడి. వి. వేగం.

**వరవాడులు** వి. బ. వ. ప్రవాహాలు. కు.సం. 5.109. <వరవాడి + -లు.

**వరవు** రూ చూ. వరవుడు. వి. సేవకుడు, దాసుడు, సేవకురాలు, దాసి. కు.సం. 3.102.

**వరవుది** విణ. సేవకురాలు, దాసి. వేంక. పంచ. 1.123. **వరవు(దనము(-తనము)** వి. సేవకత్వం, దాస్యం. మార్క. 1.219. **వరవుపడు** రూ.చూ. వరముపడు. అ.క్రి. ప్రాణాధారంపడు, అనశన వ్రతమాచరించు. **వరవుంబడు** రూ.చూ. వరముపడు. అ.క్రి. ప్రాణాధారంపడు, అనశన వ్రతం పూను. ఆము. 6.98.

**వరవుటము** చూ. వరవుడు.

**వరవుడము** చూ. వరవుడు.

**వరవుడు** రూ. వరవు, పఱవుడు. వి. 1. సేవకురాలు, దాసి. భార. సభా. 2.200 ; 2. దాస్యం. బసవ. 1.110 ; 3. సేవకుడు, దాసుడు.

సం. భరటు-. సేవకుడు, కుమ్మరి.

<సం. భరట-.

**వరవుటము** వి. చాకిరి, సేవ, దాస్యం. **వరవుడము** వి. దాస్యం. భార. ఉద్యో. 3.112. **వరవుడుపని** వి. దాసీకృత్యం, దాస్యం. హరిశ్చ. 5.55.

**వరస** రూ.చూ. వరుస¹. వి. 1. పంక్తి ; 2. వంతు : 3. క్రమం ; 4 పరంపర ; 5. విధం, రీతి ; 6. సామ్యం, సాటి ; 7. నియమం ; 8. బంధుత్వం ; 9. (రాగాల) వరస ; 10. నేతలో వచ్చే డిజైను ; 11. మారు, తడవ ; 12. పడుగు నూలు చుట్టిన దబ్బాలను జంత్రం ముందు వరసగా పెట్టటం.

**వరసకట్టు** అ.క్రి. 1 ఆము పడుగులో సాళ్ళు సాళ్ళుగా మొదట నిలువుకు మరల అడ్డలకు తరవాత బోర్లకు కుండల దొంతిని పేర్చు ; 2. డిజైను తయారు చేసుకొను. **వరస జ్వరము** వి. చలిజ్వరం. సం. జ్వర – శరీరంలోని ఉష్ణం పెరగటం. < వరస + సం. జ్వర-. **వరస దాపులు** వి.బ వ. ఆములో కాలేకుండలకు దెబ్బతగలకుండా అడ్డుగా పెట్టిన ఓటికుండలు. **వరసటిక** వి. పాత్రలు వాడేటప్పుడు సారెపక్కన పెట్టుకొనే పాత్ర. **వరసపుల్ల** వి. అనుపిటలకు దిగగొట్టిన నిలువుపుల్ల. **వరసపోగు** వి. పట్టు పడుగులో వరస తప్పకుండా చిక్కులు పడకుండా వచ్చే పోగు. **వరసబల్ల** వి. ఆరుపడును పాత్రలమీద నునుపు, గట్టి దనం రావటానికి నర్సే నలప. **వరసరాయి** రూ. వరిసరాయి. వొరిన రాయి. వి. 1. కట్టుబడికిగాని, నేలపై పరవటానికిగాని, స్తంభాలుగా నిలపటానికి వాడే మలిచినరాయి ; 2. గోడల కట్టుబడికి పనికి వచ్చేరాయి. **వరసరాయి కట్టుబడి** వి. రాతిని చెక్కి కట్టే పద్ధతి. **వరసవేయు** స.క్రి. 1. పట్టు నేతలో డిజైన్లు నేయటానికి పడిదారాలతో చిక్కు కట్టుకొను ; 2. జంత్రం మీద పడుగు అనులు పడటానికి పెట్టు ; 3. దరువులు వేయు, బాదు.

**వరసట్టి** రూ.చూ. వారసట్టి. వి. కుండలు వానేటప్పుడు సారె పక్కన పెట్టుకునే నీళ్ళపాత్ర.

**వరసట్టికుదురు** వి. వాటకుండ కింద ఎత్తుకోసం పెట్టుకొనేమట్టి కుదురు.

**వరసంది** వి. 1. ఒకరకం చేనుగట్టు. ఆం.భా. 2.8 ; 2. ఒడ్డు.

**వరసందు** వి. రెండు ఇళ్ళనూర్లు కలుసుకొనే చోటు, వాటి నుండి జారిన నీరు బయటికి పోవటానికి గోడలమధ్య ఏర్పరచిన చిన్న ఎడం, నూర్లసందు.

**వరసము** వి. అశ్వశిక్షాభేదం. పి.శకు. 1.112.

**వరహా** రూ. వరా. వి. వరహా ముద్ర ఉన్న బంగారునాణెం. యయా. 1,28, దహిం.శా. సంపు. 6. శా.సం. 694. క్రీ.శ 1516.

సం. వరాహ–. కూర్మం, పంది ; ప్రా. పా. వరాహ - ; మరా. వరఈ, వరాఈ, ఒకబంగారునాణెం.

<ప్రా. వరాహ-.

**వరా** రూ.చూ. వరహా. వి, వరహా ముద్రఉన్న ఒక బంగారు నాణెం. రాజ. వి. 2.72.

**వరాకట్ట** రూ.చూ. వరకట్ట. వి. పందిరోమాలకట్ట.

**వరాకు** చూ. వరి².

**వరాళి** వి. 1. రాగవిశేషం, ఒకానొకరాగం. చెన్నబసవ. 2.236 ; 2. శోకం, ఏడుపు. పార్వ. 3.74.

**వరాహకట్ట** రూ.చూ. వరకట్ట. వి. అడవి పంది వెంట్రుకలతో చేసిన చిన్నకట్ట.

**వరి¹** వి. పన్ను.

త. వరి. పన్ను, సుంకం, విరాళం ; మ. వరి, పన్ను, చందా ; కో. వరి. ప్రభుత్వానికి చెల్లించేపన్ను.

**వరి²** రూ. అరి³, ఒరి ఒరె,వరె, వ్రె², వొరి. వి. 1. శాలి ధాన్యం. శివరా. 4.29, ఆము. 1 60 ; 2. శాలిసస్యం. రసిక. 1.58.

త. వరి. శాలిధాన్యం ; మ. వరి. శాలిధాన్యం ; గోం. వంజి. బియ్యం ; వరి ; పర్జి. వెర్చి. వరి.

**వరాకు** వి. పైరు పొట్టపై నిటారుగా మొలిచిన ఆకు. <వరి² + ఆకు. **వరికూళం** వి. తొట్లు, ఓడలు మొ. వాటి తయారీకి మట్టిలో కలిపే పదార్థం. **వరిగంజి** రూ. ఒరిగెంజి. వి బియ్యంగంజి. **వరిగడ్డి** వి. శాలితృణం. **వరిగింజలు** వి.బ.వ. ధాన్యం గింజలు. **వరిచేను** వి. వరిపండేభూమి. భీమ. 2.54, నె.శా. ఆత్మకూరు. 45. **వరితాలు** రూ. వొరితాలు. వి. తొట్లు, ఓడలు మొ. వాటి తయారీకి మట్టిలో కలిపేపొట్టు. **వరిదూగరి** రూ. వొరిదూగ. వి. తొట్లు ఓడలు మొ. వాటి తయారీకి మట్టిలో కలపటానికి, పశువులకు ఆహారంగానూ పెట్టే వరిపొట్టు. **వరిపిడి** రూ.చూ.

వరిపిలి. వి. వరిమొక్క లాగా ఉండి మాగాణి నేలల్లో పెరిగే గడ్డి. **వరిపిలి** రూ. ఒడిపేలు, వడిపిల్లు, వడిపిళ్ళ, వడ్పిలి, వడ్సిలి, వరిపిడి, వరిసిల్ల, వరిసిల, వల్పిడ, **వడిపిళ్ళ**, వి. వరిమొక్కలాగాఉండి మాగాణి నేలల్లో పెరిగేగడ్డి **వరిపూన** రూ. ఒరిపూన. వి. వడ్లపూన, పొలంలో ఒకరకం, వరి చేలల్లో ఏటాలేచి **అడుగు** అడుగున్నర **ఎత్తు**పెరిగే గడ్డి **మొక్క** (Coix lachrymajobi). **వరిపూనగడ్డి** రూ.చూ. ఒరి పూనగడ్డి. వి. వరిచేలల్లో ఏటాలేచి అడుగు లేక అడుగున్నర ఎత్తుపెరిగే గడ్డిమొక్క. **వరిపూనలగడ్డి** రూ. ఒరి పూనలగడ్డి. వి. వరిచేలల్లో ఏటాలేచి అడుగు అడుగున్నర ఎత్తు పెరిగే మొక్క. **వరిపొట్ట** వి. వరిపెన్ను. **వరిపొట్టు** రూ. వొరిపొట్టు. వి తొట్లు, ఓడలు మొ. వాటి తయారీకి జిగురు మట్టితో కలిపే పొట్టు. **వరిపొలం** రూ. అరిపొలం. వి మాగాణి. వరిపండించే నేల. **వరిపొల్లు** రూ. వొరిపొల్లు. వి. తొట్లు, ఓడలు మొ. వాటితయారీకి మట్టిలో కలిపే పొట్టు. **వరిబియ్యము** వి. వడ్లను దంచిన బియ్యం. ద.హిం.శా. సంపు. 6. శా.సం. 235. క్రీ.శ. 1158. **వరి భూమి** వి. సస్యక్షేత్రం. ద.హిం.శా. సంపు. 4. శా. సం. 1203. క్రీ.శ. 1168. **వరిమడి** వి. కేదారం. వరిపండే భూ భాగం, వరి చేను. నె.శా. కనిగిరి. 14, చెన్న బసవ. 5.71. **వరిమడినాగేలి** వి. బురదనాగలి, మడినేలలు దున్నే నాగలి. **వరిమణుతు** వి. వరిభూమి. నె.శా. కందుకూరు. 16. క్రీ.శ. 1430. **వరిములిగెనని కొరవలి పారవేయు** అ.క్రి కావలసిన వస్తువును అక్కరలేనప్పుడు అజాగ్రత్తగా పారేసి తరవాత విచారపడు. **వరిముల్లు** వి. బొ. ధాన్యశూకం. **వరిముల్లువాసి** వి. కొంచెం. **వరిమొత్త** వి. మాగాణి, కలప, చెరువు మొ. వాటి నీటితోసాగు చేసే నేల, ముఖ్యంగా వరిపంటకు ఉపయోగించే నేల. **వరివంటకము** వి. శాల్యన్నం పద్మ. 10. 246. **వరివళ్ళు** వి.బ.వ. వరిపైరు ఈతకు వచ్చేటప్పుడు మంచు కురిస్తే అక్కడక్కడా నల్లబడే గింజలు. **వరిపూళ** రూ. వొరిపూళ. వి. తొట్లు, ఓడలు మొ. వాటి తయారీకి జిగురు మట్టిలో కలిపే వరిపొట్టు. **వరి వెన్నుసుడి** రూ. వ్రరెన్నుసుడి వి. వెన్నుమీది సుడి, లక్ష్మినుడి. **వరేకంచు** రూ. ఒరేకంచు. వి. 1. అంచులో చివర పదికొలకుల రంగు పోగులు పెట్టి పైన ఒకకొలికి తెలుపు, ఒక కొలికి రంగు చొప్పున మారుస్తూ నేసిన అంచు ; 2. జరీ పెట్టి నేసిన ఒకరకం అంచు. <వరి[2] + అకు + అంచు[3]. **వరేకంచుమొగ్గ** వి. వరేకంచులో మొగ్గ మాదిరిగా నేసిన డిజైను. **వ్రరాకంచుచావు** వి. జరీపెట్టి నేసిన ఒకరకం చావు. < వరి[2] + అకు + అంచు + చావు. **వ్రరెన్నుసుడి** రూ.చూ. వరివెన్నుసుడి. వి. వెన్ను మీది సుడి, లక్ష్మినుడి. <వరి[2]+వెన్ను+సు.

**వరిక** వి. పక్షివిశేషం.

**వరికాలు** రూ.చూ. అరికాలు. వి. మోకాలి కిందిభాగం.

**వరిగ** రూ.చూ. వరువ. వి సస్యవిశేషం. కాశీ. 3.23.

**వరిగుండము** వి. 1. నీటిగుండం ; 2. పిశాచి.

**వరిగె** రూ.చూ. వరువ. వి. ఒకరకం ఆహారధాన్యం, దంచిన గింజలు అన్నం వండుకోవటానికి, గడ్డిపశువులకు ఉప యోగిస్తాయి. రెండు మూడు నెలల్లో కోతకు వచ్చే పంట (Puniceem milliaccum).

**వరిగెలు** రూ. ఒరిగెలు. వి.బ.వ. ఒకరకం ధాన్యం.

**వరిడి** రూ.చూ. వరువది. వి. శ్రీమంతులు, రాజులదగ్గర ఎప్పుడూ ఇచ్చకం మాటలు చెప్పేది.

**వరిణె** వి. కళ్ళంలో ధాన్యం శుభ్రంచేసే జల్లెడ.

**వరిది** రూ.చూ. వరువది. వి. శ్రీమంతులు, రాజుల దగ్గర ఎప్పుడూ ఇచ్చకం మాటలు చెప్పేది.

**వరిబీజము** రూ.చూ. వరబీజము. వి. వృషణ వ్యాధివిశేషం, ఒకపక్క వాచిన వృషణం, బుడ్డ.

**వరియ** వి. ముల్లు కోల, బరిగోల.

సం. వారికా. వారించేది ; ప్రా. వారిఆ. నివారించ బడ్డది.

**వరిశ** వి. వారసత్వం. ద. హిం. శా. సంపు. 10. శా. సం. 772. క్రీ.శ. 1696.

హిం.ఉ. వరాసత్ ; పార. వరాసత్.

<ఉ. వరాసత్.

**వరిసరాయి** రూ.చూ. వరసరాయి. వి. 1. కట్టుబడికిగాని, నేలపై పరవటానికిగాని, స్తంభాలుగా నిలపటానికి వాడే మలిచినరాయి ; 2. గోడలకట్టు బడికి పనికివచ్చేరాయి.

**వరిసిల్ల** రూ. చూ. వరిపిలి. వి. వరిమొక్క లాగా ఉండి మాగాణి నేలల్లో పెరిగే మొక్క.

**వరిసిల** రూ.చూ. వరిపిలి. వి. వరిమొక్కలాగా ఉండి మాగాణి నేలల్లో పెరిగే గడ్డి.

**వరుగగు** చూ. వరుగు.

**వరుగు** వి. 1. తరిగి ఎండవేసిన కాయదినుసు, ఎండిన మాంసం ముక్క మొ.వి. ఉ.హరి. 4.54 ; 2. నూనెలో వేయించి పొగపెట్టిన ఎండిన కాయముక్క. కాశీ. 7.186 ; 3. గద్ద ; విణ. సారహీనమైంది, బలహీనమైంది. వరాహ. 7.52 ; అ.క్రి. బక్క చిక్కిపోవు.

**వరుగగు** అ.క్రి. ఎండు, శుష్కించు. <వరుగు + అగు. **వరుగుజేప (-చేప)** వి. ఎండుచేప. ఆం. భా. 1.160. **వరుగుతో దాగరయెండు (-ఎండు)** అ.క్రి. వరుగుతో బాటు వరుగు వేసిన పాత్రకూడా ఎండు. ఉ.హరి. 4.54. **వరుగైన** క్రి. విణ. ఎండిన, శుష్కించిన. <వరుగు + ఐన.

**వరుగుడు** వి. తోటల్లో పెంచే ఒకరకం మొక్క (Cycas circinalis).

**వరుగైన** చూ. వరుగు.

**వరుజు** వి. మడిమొక్కగనిమ, మడికి చుట్టూ ఏర్పరచిన చిన్న కట్ట. ఆము. 4.125.

క. బరె. గీతలుగీయటం, బరెత. గీత, గుర్తు ; తు. బరెత ; త. వరైవు. చిత్తరువు.

**వరుటు** అ.క్రి. కృశించు, చిక్కిపోవు. భీమ. 4.32.

క. బఱడు, బరడు, గొడ్డాలితనం ; తు. బరంటుని. ఎండిపోవు, కృశించు ; మ. వరళుక. ఎండిపోవు ; గో. వరెంజె.

**వరుణ** వి. ఒకరికోసం పూజో, పారాయణమో చేయటానికి

మరొకరిని నియమించి అవసరమైన ధనం ఇవ్వటం.

సం. వరుణ-, నీరు, సముద్రం, వరుణదేవుడు, సూర్యుడు.

<సం. వరుణ-. (అర్థవిపరి.).

**వరుపు** వి. గచ్చుపని, గారచేయటం.

**వరుమానము** వి. ఆదాయం, రాబడి, వచ్చుబడి.

క. వరుమాన. ఆదాయం ; త వరుంపటి, వరుమాణమ్. ఆదాయం, మూలం.

**వరుంబడి** రూ.చూ. వరంబడి వి. ధనాదాయం.

**వరులు** రూ.చూ. వరలు². అ.క్రి. వదరు, వాగు.

**వరువట్టు** వి. అధికంగా తడి ఆరటం. కు.సం. 5.155.

**వరువట్లుగొను** (-కొను) అ.క్రి. బొత్తిగా ఎండిపోవు. భార. ఉద్యో. 5.294. **వరువట్లుపట్టు** రూ.చూ. వరువట్లు పట్టు. అ.క్రి. బొత్తిగా ఎండిపోవు. **వరువట్లువట్టు** (-వట్టు¹) రూ. వరువట్లు పట్టు. అ.క్రి. బొత్తిగా ఎండిపోవు. కు. సం. 5.155.

**వరువట్లుగొను** చూ. వరువట్టు.

**వరువట్లు పట్టు** చూ. వరువట్టు.

**వరువట్లు వట్టు** చూ. వరువట్టు.

**వరువడి** రూ. ఒరువడి, వరవడి¹. వి. 1. విధం. ఆం. భా. 2.174 ; 2. వరస ; 3. వైనం.

**వరువర్లు** ని.బ.వ. సేవకులు. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 1248. క్రీ.శ. 1112.

**వరువది** రూ. వరిడి. వరిది, వర్ది, వర్దీ. వి. 1. శ్రీమంతులూ, రాజులదగ్గర ఎప్పుడూ ఇచ్చకం మాటలు చెప్పటం ; 2. వర్తమానం, ఆన.

హిం.ఉ. వర్దీ. ప్రభుత్వాధికారులు లేదా కార్యకర్తలు లేదా నౌకర్ల దుస్తులు.

<ఉ. వర్దీ.

**వరువరువులు** వి.బ.వ. మిక్కిలి వరువులు, అధికంగా ఎండినవి. వేంక. పంచ. 3.297.

**వరువాత** రూ.చూ. వఱువాత. వి. ప్రాతఃకాలం. ఘటికా. 2 20. రామాభ్యు, 8.82.

సం. ప్రభాత-. ఉదయం.

**వరువాయి** రూ.చూ. వఱువాయి. వి. ప్రాతఃకాలం.

**వరువు** రూ. ఒరిగె, వరిగ, వరిగె. వి. వరిగ, సస్యవిశేషం. ద.హిం.శా. సంపు. 10. శా. సం. 314. క్రీ శ. 1247. (Panicum miliaccum).

క. బరగ, బరగు. జొన్న ; త. వరకు. జొన్న ; మ. వరకు, పైరు.

సం. వరక-. సస్యవిశేషం ; పో. చూ. మరా. బర్గ్. జొన్న.

**వరువుబనులు(-పనులు)** వి.బ వ. సేవకుడు చేసే పనులు, పరిచర్యలు. కు. సం. 3.102.

**వరుస**¹ రూ. ఉరవ, ఉర్స, వరడన, వడిన¹, వరన, వర్సు, వర్స, వొరవ, వొర్స వి. 1. వరంపర. భార. ఆది. 4.221 ; 2. వంతు. భార. ఆది. 6.264 ; 3. పంక్తి. కు.సం. 6.137 ; 4. క్రమం. భార. విరా. 1.72 ; 5. విధం, రీతి. భార. శాంతి. 6 25 ; 6. సామ్యం, సాటి. తుల్యత. భార. అను. 5.191 ; 7. పర్యాయం, తడవ. హరి. ఉ. 10.309 ; 8. నియమం. కాశీ. 6.86 ; 9. బంధుత్వక్రమం. శృం. నై. 7.105 ; 10. (రాగాల) వరస, పాటలోని స్వరాలభేదం. దశా. 1.264 ; 11. ప్రాయం, వయస్సు ; విశే. మంచిది, యుక్తం. మను. 2.52.

క. వరసె, వరిసె. బంతి, జాతి, కుటుంబం ; త. వరిచై. క్రమం, బంతి, రాజచిహ్నం.

**వరుసఅగు** అ.క్రి. వివాహానికి అర్హమైన చుట్టరికం కలిగి ఉండు. **వరుసగొను** (-కొను) అ.క్రి. బారుతీరు, పంక్తిగా ఏర్పడు. లక్ష్మీ. వి. 5.74. **వరుసతో మాట్లాడు** అ.క్రి. ఏదో ఒక చుట్టరికం కలుపుతూ పలకరించు. శుక. 2.172. **వరుసబడు** (-పడు) అ.క్రి. మామా అల్లుళ్ళవరసతో పరిహాసాలు చేసుకొను. **వరుసమొగ్గరము** వి. దండవ్యూహం, వంక్తులుగా ఏర్పడ్డ సైన్యం. **వరుసలంజలు** వి.బ.వ. వంతుగా సేవ చేసే సానులు. ద.హిం.శా. సంపు. 6. శా.సం. 1000. క్రీ.శ. 1307. **వరుసలు పెట్టుకొను** అ.క్రి. వంతులు వేసుకొను. కాశీ. 2.19.

**వరుస**² రూ. బరస, బర్స. వి.బ వ. మల్లురు చేసే సాధన విశేషం.

**వరుసము** వి. సంవత్సరం. రం. రా. ఉ. 92 పు. 10పం.

సం. వర్ష-. సంవత్సరం ; ప్రా. వరస-, వరిస-.

<ప్రా. వరస-.

**వరె**¹ రూ.చూ. వ్రె¹. వి. అరకను పక్కకులాగే పెంకితనం కలిగినఎద్దు.

**వరె**² రూ. వరి². వి. కళ్ళందగ్గర వేసిన గడ్డికుప్ప.

**వరెంగోడ** రూ.చూ. వరంగోడ, వి. మిద్దె పైఅంచులదగ్గర బట్టీమశల పక్కన కట్టే పల్చని పొట్టిగోడ.

**వరెంచుచీర** వి. ఒకవైపు నల్లఅంచు, మరొకవైపు ఎర్రఅంచు పెట్టి నేసినచీర.

సం. చీర- వస్త్రం.

<వఱ + అంచు³ + సం. చీర.

**వరే** అవ్య. 'కదా' అనే అర్థాన్నిస్తుంది. ప్రశ్నార్థకం. కు.సం. 4.9.

**వరేకంచు** చూ. వరి².

**వరేకంచుమొగ్గ** చూ. వరి².

**వర్జిగ** వి. ఎక్కువబరువును లాగించటానికి ఒకకాడిఎద్దులకు, ముందు ఇంకొక కాడి ఎద్దుల్ని కట్టి పూన్చినది.

**వర్జు** రూ.చూ. వరుస¹. వి. 1.పంక్తి ; 2. క్రమం ; 3. క్రాను. మూర మొ. వాటిమానం.

**వర్జుకొను** స.క్రి. కొలతప్రకారం కావలసిన ఆకారాన్ని గీతలలో గుర్తించు.

**వర్ణనకెక్కు** అ.క్రి. ప్రసిద్ధిపొందు. కు.సం. 1.36.

సం. వర్ణనా. చిత్తరువు రాయటం, లాయటం, చెప్పటం, స్తోత్రం.

<సం. వర్ణనా + -కు¹ + ఎక్కు.

**వర్ణాలు** వి. అవాల్లో ఒకరకం.

సం. వర్ణ-. రంగు, రకం.

<సం. వర్ణ- + -ము + లు (అర్థవిపరి.).

**వర్తకము** వి. వాణిజ్యం, క్రయవిక్రయవ్యాపారం. కవిరాజ 1.72. విష్ణుపు. 7.229.

సం. వర్తక-, వర్తకా. జీవిస్తున్నది, అభినివేశం కలది.

<సం. వర్తక- (అర్థవిపరి.).

**వర్తకుడు** వి. క్రయవిక్రయ వ్యాపారాలుచేసేవాడు. HAS 13.1.

సం. వర్తక-. జీవిస్తున్నది, అభినివేశంగలది, గుర్రపు డెక్క.

<సం. వర్తక- (అర్థవిపరి.).

**వర్తతులసి** వి. తుప్పగా పెరిగే ఒకరకం కలుపుమొక్క (Ocinum genus)

**వర్తమానము** వి. వార్త, సమాచారం. కువ.చ. 4.189.

సం. వర్తమాన-. ప్రస్తుతం, వర్తమానకాలం, తిరగటం.

<సం. వర్తమాన- (అర్థవిపరి).

**వర్దగుడు** రూ.చూ. వరదగూడు. వి. 1. వానగుడి, చంద్రుడి చుట్టూ గాని, సూర్యుడిచుట్టూగాని కాస్తఎడంగా వలయాకారంలో ఏర్పడేహద్దు ; 2. ఇంద్రధనస్సు.

**వర్దగూడు** రూ.చూ. వరదగూడు. వి 1. వానగుడి. చంద్రుడి చుట్టూగాని, సూర్యుడి చుట్టూగాని కాస్త ఎడంగా వలయాకారంలో ఏర్పడే హద్దు ; 2. ఇంద్రధనుస్సు.

**వర్ది** రూ.చూ. వరువడి. వి. 1. శ్రీమంతులూ రాజులదగ్గరా ఎప్పుడూ ఇచ్చకం మాటలు చెప్పటం ; 2. వర్తమానం.

**వర్దీ** రూ.చూ. వరువడి. వి. ఏదైనా చెయ్యటానికి ఒకరు మరొకరికి ఇచ్చిన అధికారపత్రం.

**వర్నం** వి. వస్తువులకుండే ప్రధాన లక్షణాల్లో ఒకటి, తెలుపు మొ. వి.

సం. వర్ణ-. రంగు ; ప్రా. వణ్ణ-.

<సం. వర్ణ-.

**వ్రర** రూ.చూ. ఒట్టు. వి. కారం.

**వ్రరమీను** వి. మత్స్యభేదం, ఒకరకం చేప.

**వ్రరాకంచుచాపు** చూ. వరి2.

**వ్రరు** రూ.చూ. వఱవ వి. 1. వరద, ప్రవాహం ; 2. అతిశయం.

**వ్రరె1** రూ. వరె1 వి. అరకను పక్కకు లాగే పెంకెతనం గల ఎద్దు.

**వ్రరె2** రూ.చూ. వరి2. వి. కళ్ళం దగ్గరవేసిన గడ్డికుప్ప.

**వ్రరెకోత** వి కుప్పవేసిన తరవాత కోసే కంకికోత.

**వ్రరె3** చూ. వఱద. రూ. అర్రె, ఒర్రె. వి. వాగు. చిన్నవాగు. వాన కురిసి పారే కాలవ.

**వ్రరెమ్నుసుడి** చూ. వరి3.

**వర్లబావి** చూ. వరి3.

**వర్లమన్ను** రూ.చూ. ఒరలమన్ను. వి. ఒండ్రుమట్టి, వరిపొట్టు, మసి కలిపి తొక్కి మాగవేసి ఒరలకు ఉపయోగించే మట్టి.

**వర్లు** రూ.చూ. వరలు2. అ.క్రి. వదరు. వాగు.

**వర్వు(బని(-పని)** చూ. వరవుడు. వి. ధాన్యం. కు.సం. 7.51.

**వర్షాకాలపు చదువు** వి. సాగాసాగనిచదువు. వానాకాలం చదువు. వానలు కురిసినప్పుడు పాఠశాలలకు సెలవులిస్తారు. కాబట్టి ఈ పలుకుబడి.

సం. వర్షకాల-. వానకారు.

<సం. వర్షకాల- + -ము + చదువు.

**వర్స** రూ.చూ. వరుస1. వి. 1. పంక్తి. పండి. చ. 1.43 ; 2. క్రమం.

**వర్సరాతు** వి. గోడల కట్టుబడికి పనికివచ్చేరాయి. **వర్స వెంబడి** క్రి. విశే. క్రమ. వంతుల ప్రకారంగా, క్రమానుసారంగా. శుక. 3.450.

**వఱ** వి. మేర, హద్దు. ఘటికా. 2.99.

క. వరె. హద్దు, పరిమితి ; త. వరై ; మ. వరె. హద్దు.

**వఱగొడ్డము** రూ. వరగొడ్డెము. వి. వంకరమాట, వక్రోక్తి. **వఱగొడ్డెము** రూ. ఒఱగొడ్డియము, ఒఱగొడ్డెము, వరగొడ్డెము, వఱగొడ్డము. వి. మర్యాదమీరిన మాట, వంకరమాట. భల్లా. 4.

**వఱకు** చూ. వఱ. రూ వరకు. అవ్య. దనుక. దాక. పర్యంతార్థం. ఉ.రా. 3.226.

**వఱగొను(-కొను)** అ.క్రి. ప్రవాహమగు, ధారగొట్టు. పండి. చ. 1.1.146.

<వట్టు + కొను.

**వఱడు1** వి. 1. ముదినక్క. నక్క. భార. సభా. 2.251 ; 2. బక్క చిక్కినవాడు.

సం. వృద్ధ -. ముసలి.

**వఱడుగ్రక్కు** వి. నక్కఅరుపు.

**వఱడు2** స.క్రి. మలాంచేయు. ద. హిం. శా. సంపు. 11. కా. సం. 90.

**వఱత** రూ.చూ. వఱద. వి. ప్రవాహం. వెల్లువ.

**వఱతి** రూ.చూ. వఱద. వి. ప్రవాహం.

**వఱతిపాల్సేయు** స.క్రి. గంగలో కలుపు. పండి. చ. 1.1.115.

**వఱద** రూ. వరద, వ్రరు, వఱత. వఱతి, వఱవ, వట్టు1. వి. ప్రవాహం. భార. శాంతి. 1.217.

పర్జి. వెరెద్. వరద.

**వఱదగుడి** వి. సూర్యాదిపరివేషం, గాలిగుడి. **వఱదగూడు** వి. గాలిగుడి, సూర్యాదిపరివేషం. **వఱదగొను(-కొను)** అ.క్రి. ప్రవహించు, వరదవారు. భాస్క. రా. యు. 661. **వఱద(గలియు(-కలియు)** అ.క్రి. 1. వ్యర్థమగు. భార. అశ్వ. 1.12 ; 2 చెడు. కలు. శ.14. **వఱద(గలుపు (-కలుపు1)** స.క్రి. పాడుచేయు. **వఱద(గూర్చినచింతపండగు** స.క్రి. చెడు. నశించు. చంద్రరే. 2.168. **వఱదపాలగు (-అగు)** అ.క్రి. నశించు. ఉ. హరి. 4.300. **వఱదపాల్ చేయు** స.క్రి. పోగొట్టు, చెరుచు. పండి. చ. 1.39. **వఱద(బోవు(-పోవు)** అ.క్రి. 1. వ్యర్థమగు, పాడైపోవు. కాశ. 3.111 ; 2. పోవు. సారంగ. 2.145. **వఱదలుగట్టు (-కట్టు)** అ.క్రి. వరదలు వారు, ప్రవహించు. వరాహ.

2.136. **వఱదవాఱు(-పాఱు³)** అ.క్రి. ప్రవహించు. భాగ. 10పూ. 1363.

**వఱపు** రూ. వరపు. వి. 1. వానలేమి, అవగ్రహం. భార. సభా. 1.71; 2. కరవు, కాటకం.

క. ఒఱ, ఒఱపు. అనావృష్టి, వంధ్యాత్వం, ఎండు క్ర, బఱవ. అనావృష్టి; త. వఱమ్, వఱన్. అనావృష్టి, వేసవి.

**వఱల** వి. వృద్ధతపస్వి. సన్యాసి.

**వఱలు** అ.క్రి. 1. కొన్నిచోట్ల వాక్యాలంకారం. భార. ఆది. 8.270; 2. ప్రవర్తించు. కు.సం. 1.26; 3. ప్రకాశించు, ఒప్పు. కు.సం. 7.63; 4. వ్యాపించు. పరమ. 1.81.

త. వళర్. వృద్ధిఅగు, పెరుగు, తెల్లని; మ. వళర. ఎక్కువ, చాల;

పో. చూ. సం. భ్రాజ్. ప్రకాశించు.

**వఱవ** రూ.చూ. వఱద. వి. వెల్లువ, ప్రవాహం.

**వఱవాత** రూ.చూ. వఱువాత. వి. ప్రాతఃకాలం.

**వఱవుడు** రూ.చూ. వరపుడు. వి. 1. దాసి; 2. తొత్తు, బానిస.

**వఱితిపాలు** చూ. వఱతి. వి. ప్రవాహాధీనం, వ్యర్థం. భాస్క. రా.యు. 1619.

**వఱుగొను (-కొను)** చూ. వట్టు¹. అ.క్రి. 1. ప్రవహించు; 2. దారకట్టు.

**వఱుతఁగలియు** అ.క్రి. ప్రవాహంలో పడిపోవు, చెడు, నశించు. వరాహ. 6.123, విక్ర. 2.214.

<వట్టు¹ + -అ⁷ + కలియు.

**వఱువట్లు** వి.బ.వ. మిక్కిలి ఎండటాలు. భార. విరా. 2.88. **వఱువట్లుగొను (-కొను)** అ.క్రి. మిక్కిలి ఎండు. కళా. 6.255. **వఱవట్లువట్టు (-పట్టు¹)** అ.క్రి. ఎండపోవు. పండి. చ. 2.3.134.

**వఱువాత** రూ. వరుసాత, వఱవాత. వి. ప్రాతఃకాలం. హరి. పూ. 5.239.

సం. ప్రభాత-. ఉదయం.

**వఱువాయి** రూ. వరువాయి. వి. వేగుజాము, వేకువ.

**వట్ట** రూ.చూ. ఒట్ట. వి. 1. కారం; 2. గాలు.

**వట్టియ** రూ. వట్టు², వట్టె. వి. బీటిక.

సం. వర్ప్. పగులు.

**వట్టు¹** రూ.చూ. వఱద. వి. ఔ. అనౌ. ప్రవాహం. భార. విరా. 3.163; విణ. అధికం, మిక్కుటం. శివత.సా. 336.

**వట్టేఱు** వి. మంచి ప్రవాహం. బసవ. 201పు. 20పం.

<వట్టు¹ + ఏఱు.

**వట్టు²** రూ.చూ. వట్టియ. వి. బీట.

**వట్టె** రూ.చూ. వట్టియ. వి. బీటిక.

**వట్టేఱు** చూ. వట్టు.¹

**వట్టొడి** రూ.చూ. వట్టోడి. వి. ప్రవాహం. కు.సం. 11.102.

**వట్టొడ్డి** రూ.చూ. వట్టోడి. వి. ప్రవాహం. మార్క. 5.230.

**వట్టొడ్డు** రూ. చూ. వట్టోడు. అ.క్రి. ప్రవహించు. భార. విరా. 2.

**వట్టోడి** రూ. వట్టొడి, వట్టొడ్డి. వి. ప్రవాహం. కు.సం. 3.10

**వట్టోడు** రూ. వట్టొడ్డు. అ.క్రి. ప్రవహించు. కు.సం. 9.36.

<వట్టు¹ + ఓడు².

**వల¹** వి. 1. జాలం, చేపలుపట్టే సాధనవిశేషం. కు.సం. 8.130, భార. కర్ణ. 3.158; 2. మృగాలు, పక్షులు మొ. వాటిని పట్టేవాగుర, ఉచ్చు. ఉ.హరి. 4.22; 3. మాయ. దశా. 1.160; 4. గాలం. దశా. 1.280; 5. రాత్రివేళల గొర్రెలమంద చెదరకుండా ఉండటానికి పెట్టేది; 6. ఉన్ని శుభ్రం చేసేటప్పుడు ఎగిరిపోకుండా కప్పేది.

క. ఒలె. వల; త. వలై.

**వలత్రాడు** వి. వల్లెతాడు, పశువుల్ని కట్టేతాడు. నీలా. 2.65. **వలపన్ను** అ.క్రి. పన్నాగం పన్ను. **వలఁబెట్టు (-పెట్టు)** స.క్రి. మోసంచేయు. తాళ్ల. సం. 10.67. **వలరాయఁడు¹** వి. జాలరి, బెస్త. వసు. 3.51. **వలతేఁడు¹** వి. బెస్తవాడు, పల్లెవాడు. **వలలఁబడవైచు** స.క్రి. మోసం చేసి వశపరచుకొను. గంధ. 1.180. <వల¹ + -లు + -అ⁷ + పడు + -అ⁷ + వైచు. **వలలఁబెట్టు** స.క్రి. 1. మోసం చేయు. తాళ్ల. సం. 17.481; 2. వంచించి వశం చేసుకొను. నిరంకు. 2.33. < వల¹ + -లు + -అ⁷ + పెట్టు. **వలలోవేసికొను** అ.క్రి. బేలుపుచ్చిలోబరచుకొను. **వలవాఁడు** విణ. వాగురికుడు, ఉచ్చులొగ్గేవాడు. ఆం. భా. 2.286. **వలవేయు** అ.క్రి. ఉచ్చులుపన్ను. **వలవేసిచూచు.** అ.క్రి. ఆలోచించిచూచు **వలవైచు** స.క్రి. పట్టుకొను. భాస్క. రా.యు. 1486.

**వల²** చూ. వలచు¹. వి. కామం, వలపు. కు. సం. 9.51. శృం.నై. 7.120.

**వలకాఁక** వి. మన్మథాగ్ని, విరహతాపం. నీలా. 2.36. **వలకాఁడు** వి. కాముకుడు. **వలకారి** వి. కాముకుడు, వలపించేవాడు, వలపించేది. వసు. 4.23, పాండు. 3.43. **వలకారితనము** వి. కాముకత్వం. విష్ణుపు. 6.19. **వలకారి వగలు** వి.బ.వ. పన్నెలాడిటక్కులు. **వలదొర** వి. కాముడు, రతిపతి. అని. 2.29. **వలదొరవెట్టము** వి. మారవైరి, శివుడు. **వలపక్షము** వి. పక్షపాతం. **వలరసము** వి. మోహం, ప్రేమరసం. కు. సం. 5.127. **వలరాకటారి** వి. మన్మథునికత్తి. చంద్రాంగ. 4.183. **వలరాచపని** వి. 1. గ్రామ్యధర్మం. నీలా. 1.8; 2. సంయోగం. **వలరాచ రాచవాఁడు** విణ. మన్మథుడనే క్షత్రియుడు. శృం.నై. 3.130. **వలరాచరాచవారు** విణ. బ.వ. మన్మథుడు. శృం.నై. 1.97. **వలరాచలచ్చి** వి. మన్మథలక్ష్మి. యయా. 3.41. **వలరాచవాఁడు** విణ. మన్మథుడు. యయా. 1.81. **వలరాచ సూఁడు** వి. మారవైరి, శివుడు. **వలరాజు** వి. మన్మథుడు. కు.సం. 5.75, శృం.నై. 3.92. **వలరాజుదాగులు** వి.బ.వ. మన్మథాంకాలు. విక్ర. 8.7. **వలరాజుతల్లి** వి. లక్ష్మి. **వలరాజుసూఁడు** వి. శివుడు. **వలరాటెక్కెము** వి. మన్మథుని ధ్వజం. దశా. 1.156. **వలరాయఁడు²** వి. మన్మథుడు. యయా. 4.102, వసు. 4.38. **వలరాయలు** వి.బ.వ. మన్మథుడు. ఉ.హరిశ్చ. 3.64. **వలతేఁడు²** వి. మన్మథుడు. ఆము. 5.98. **వలతేనిఁగన్నవాఁడు (-కన్నవాఁడు)** విణ.

**మారజనకుడు.** విష్ణువు. **వలతేనిసూడు** వి. శివుడు. మారవైరి. **వలవంత** రూ. వల్వంత. వి. **1.** మన్మథవ్యథ. కు.సం. 5.135, భార. అను. 1.48 ; **2.** చింత, వ్యథ. భాగ. 6.232 ; **3.** మాయ, మోసం. దశా. 1.56. **వలవంతతనము** వి. **1.** మన్మథవ్యథ. కు.సం. 6.21 ; **2.** వయలుగొనటం, అతిమోహం. **వల్వంత** రూ.చూ. వలవంత. వి. **1.** మన్మథవ్యథ ; **2.** చింత ; **3.** మాయ, మోహం.

**వల**[3] రూ.చూ. వలను. విశ. **1.** వృత్తిలో వలను శబ్దానికి మీదివర్ణం లోపించగా సమాసపూర్వభాగంలో మిగిలిన రూప ; **2**. కుడి.

**వలకట్టు** స.క్రి అనుకూలపరచుకొను. కళా. 6.155. **వలకడ** వి. దక్షిణదిక్కు. **వలకన్ను** వి. కుడికన్ను. భాగ. 10పూ. 648. **వలకేలు** వి. కుడిచేయి. హర. 7.49. **వలగాక** అవ్య. వలను పడక, పీలుపడక. దశా. 4.76. **వలగొను** (-కొను) స.క్రి. **1.** ప్రదక్షిణంచేయు. చుట్టుతిరుగు. భార. విరా. 5.48 ; **2.** చుట్టుకొను, పరివేష్టించు. వసు. 1.68. **వలగొలుపు** రూ.చూ. వలగొల్పు. స.క్రి. వలగొను. వలయాకారంగా ఉంచు. **వలగొల్పు** రూ. వలగొలుపు. స.క్రి. వలగొను, వలయాకారంగా ఉంచు. ప్రభా. 5.42. **వలచుక్క** వి. కుందేటిచుక్క, పక్కుడనేనక్షత్రం. పొద్దు పొడవక ముందు తూర్పునకొన్ని నెలలు, పొద్దుగూకిన తరవాత పడమట కొన్ని నెలలు ఆకాశంలో ప్రకాశవంతంగా కనిపించేచుక్క. **వలచుట్టు** స.క్రి. పరివేష్టించు, చుట్టుకొను. సిం.ద్వా. 1.134 ; వి. వలగొనటం. **వలచూడ్కి** వి. కుడికన్ను. పారి. 5.30. **వలచే** రూ. వలచేయి. వి. కుడిచేయి. భాగ. 10ఉ. 916. **వలచేయి** రూ.చూ. వలచే. వి. కుడిచేయి. పరమ. 2.119. **వలతీరు** వి. కుడివైపుగా వెళ్ళటం. క్రీడా. 52. **వలదిక్కు** వి, దక్షిణదిక్కు. ద్వి. పరమ. వి. 1.27. సం. దిశ్. దిక్కు, దిశ. **వలదిరుగు** (-తిరుగు) అ.క్రి. ప్రదక్షిణం చేయు. **వలపటిపాయ** వి. అచ్చుగుది పాయల్లో కుడివైపుది. **వలపటెద్దు** రూ. వలపటెద్దు. వలపలెద్దు. వి. కడపటెద్దు, బంతిలో చివరి ఎద్దు. బంతిలో కుడివైపున ఉండి బంతితిప్పే ఎద్దు. **వలపల** వి. బొ. కుడిభాగం నిర్వ. రా. 5.97. **వలపలగిలక** రూ. వలపల గిలుక. వి. రేఫానికి చేరొక చిహ్నం. **వలపలగిలుక** రూ.చూ. వలపలగిలక. వి. రేఫకు చేరొక చిహ్నం. **వలపలదాపల** వి. కుడిభాగం, ఎడంభాగం. ద.హిం.శా. నంపు. 10.శా.సం. 114. క్రీ.శ. 1144. **వలపలదాపలలు** వి. బ. వ. కుడి ఎడమలు. **వలపలికన్ను** వి. కుడికన్ను. 3.72. **వలపలించు** స.క్రి. **1.** కుడివైపుగా తిరుగు. భార. శల్య. 2.267 ; **2.** వలగొను, ప్రదక్షిణంచేయు. భీమ. 3.39. < వలపల + -ఇంచు[3]. **వలపలెద్దు** రూ.చూ వలపటెద్దు, వి. కడపటెద్దు. బంతిలో చివరి ఎద్దు. బంతిలో కుడివైపునఉండి బంతితిప్పే ఎద్దు. **వలబద్ద** వి. మరమగ్గం కట్టుబడిలో కుడివైపు బద్ద. **వలమూపు** వి. కుడిమూపు. భార. విరా. 2.193. **వలరెక్క** వి. కుడిరెక్క. పి.శకు. 1.132. **వలవంక** వి కుడిదిక్కు, కుడివైపు. ఉ. హరి. 3.65. **వలవచ్చు** అ.క్రి. **1.** ప్రదక్షిణం చేయు. వర.రా.యు. 487పు. 15పం. ; **2.** చుట్టి వచ్చు.

**-వల**[4] క్రి. విశ. ద్రు. వృత్తిలో వలను శబ్దానికి మీది వర్ణం లోపించగా సమాసోత్తర భాగంలో మిగిలిన రూపం. ఉదా. ఆవల, ఈవల. నిర్వ. రా. 3.75,

**వల**[5] వి. పర్యాయం.

**వలం** రూ.చూ. వలయం. వి. గుండ్రటి వస్తువులచుట్టు కొలత.

**వలగం** వి. మట్టిసారె చక్రం తయారీలో సారె యెత్తు చేయటానికి చిప్పల్ని గుండ్రంగా పంచి పెండలు కట్టిన వలయం.

సం. ప్రా. వలయ-. గుండ్రంగా ఉండే వస్తువు, అందె, కడియం మొ. వి.

< ప్రా. వలయ-.

**వలగండ** వి. కూద్రుల్లో ఒకతెగ. హంస. 3.29.

**వలంగుండు** చూ. వలము.

**వలదు** రూ.చూ. వలను. వి. **1.** దిక్కు. భార. ఆరణ్య. 4.135 ; **2.** పార్శ్వం, వైపు. కు.సం. 8.53 ; **3.** ఒప్పిదం. అచ్చ. రా. బాల. 205.

**వలదువు** రూ.చూ. వలను. వి. దిక్కు.

**వలచు**[1] రూ. వల్చు[1]. స.క్రి. **1.** కామించు, మోహించు. భార. ఆది. 8.110 ; **2.** అపేక్షించు, కోరు. భార. సభా. 2.228 ; అ. క్రి. **1.** తగు, యుక్తమగు. కు.సం. 6.7 ; **2.** సమర్థుడగు. భార. ద్రోణ. 2.290 ; **3.** ప్రియపడు. శృం.నై. 2.26 ; **4.** అక్కరగు, అవశ్యమగు. ఆము. 2.93.

క. ఒల్లు, ఒల్దె. అణువు. ఒలి, ఒలె. సంతోషించు, వాంఛించు, కోరుకొను, ఒల్. ఇష్టం ; తు. ఒలవుని. ప్రేమించు, ఒలియుని. ఇష్టపడు, దయచూపు ; త. ఒల్, ఒల్లు. అంగీకరించు, సమర్థమగు, సాధ్యమగు, ఒల్లె. బలం, ఒల్లవై. సామర్థ్యం ; మ. ఒల్లుక. అంగీకరించు, సాధ్యపడు, ఒల్లా/ఒల్లా. చేయకూడని.

మూ.ద.ద్రా. *వల్-/*ఒల్.

**వలప** వి. దీవన, ఆశీస్సు. **వలపార** క్రి. విశ. ద్రు. మనః పూర్వకంగా. **వలపించు** స.క్రి. **1.** కామింపచేయు. భీమ. 1.94 ; **2.** ప్రీతినొందించు, సంతుష్టుని చేయు. విష్ణుపు. 2.295. < వలచు[1] + -ఇంచు[3]. **వలపు**[1] రూ. వల్పు[1]. వి. **1.** వాంఛితం, కోరిక. భార. విరా. 2.287 ; **2.** మోహం. హర. 6.103. క. ఒలవు. సంతోషం, కరుణ, ఇష్టం ; తు. ఒలమె, ఒలుమె. ఆప్యాయత, అభిమానం. **వలపుకత్తియ** రూ. వలపుకత్తె. వి. కామంకలది, కాముకి. రాజవా. 5.65. **వలపుకత్తె** రూ.చూ. వలపుకత్తియ. వి. కామంకలది, కాముకి. **వలపుకాడు** వి. కాముకుడు, కామంకలవాడు. **వలపుకీలు** వి. పోకముడి. నీవి. శృం.నై. 7.176. **వలపుగొను(-కొను)** అ.క్రి. **1.** మోహంపొందు ; **2.** దేవురించు. **వలపుగొల్పు(-కొల్పు)** స.క్రి. మోహింపచేయు ఘటికా. 1.128. **వలపుటిక్క** (-ఇక్క) వి. కళాస్థానం. ఉ. హరిశ్చ. 2.56. **వలపుదేవర** వి. వలరాజు, మన్మథుడు. యయా. 5.56. **వలపురాయడు**

బాగా ఉన్నుంది. వారుపుల్ల వి. మరమగ్గం ఉడుతకు పైన ఉడుత కోలు. వారుసాల వి. అంచులో నేసే ఒకరకం డిజైను.

వారు⁴ రూ. వాళ్లు². సర్వ. బ.వ. 1. మనుష్యవాచక బహువచనం. భార. ఆది. 2.110; 2. పదవిని సూచించే గౌరవ వాచకం. ద.హిం.శా. సంపు. 10. శా. సం. 424. క్రీ.శ. 1269; 3. తత్సమరుమంతాలకు కొన్నింటికి ద్వితీయా బహువచనం మీద పూజ్యతయందు వారు అవుతుంది. ఉదా. శ్రీరాములవారు; 4. అర్థవిశేషంలో ఏకవచనాలమీద కొన్నిచోట్ల కానబడుతుంది. అయ్యవారు అమ్మవారు.

క. అవర్. మనుష్యవాచక బహువచనం; కొడ. అవు, అవంగ; తు. ఆరు, ఆకుళు; త. అవర్, అవర్కళ్; మ. అవర్; కో. అవ్ర్; గోం. ఓడ్, అఫ్గూర్; కొం. వార్; పెం. అవర్; కుఇ. వరు, కువి. ఆఆరి; పర్జి. ఓర్; కొలా. అవ్ర్; నా. ఓర్; గ. ఓర్; కురు. ఆర్, అబ్ ఘర్; మాల్తొ. ఆర్.

< మూ. ద్రా. *అవర్.

వారలు వి.బ.వ. వారు. వారుపేరనక అవ్య. ప్రతివారు.

వారు⁵ అ.క్రి. సన్నంగా కోయు; వి. దేవుడికి నైవేద్యంగా పోసేది.

-వారు⁶ ప్రత్య. కలిగిన.

ఉ. పార. -వార్. కలిగిన, పోలిన, తగిన.

< ఉ. -వార్.

వారుగుదిపాయ చూ. వారు². వి. అచ్చుగుది పాయల్లో చివరిది.

వారువపుజన్నము చూ. వారువము.

వారువము రూ. (వార్వము.) వావురము. వి. 1. గుర్రం. కు. సం. 11.5; 2. వాహనం. రుక్మా. చ. 1.60.

సం. వాడబ-, వడవ-, వడలు- వడబానసంబంధి; ప్రా. వాడవా;

క. వారువ గుర్రం.

< ప్రా. వాడవా.

వారువపుజన్నము వి. అశ్వమేధం. అచ్చ. రా. బాల. 58.

వారె¹ వి. రెండుచేతులు పట్టినంత, సందెడు.

వారె² వి. 1. బరికోల; 2. అంకుశం.

వారెడచాలు వి. మాగాణిలో చివరిసారి దున్నటం.

వారెనతాడు రూ.చూ. వార్నెతాడు. వి. బండి పోలుతాడును జువ్వాయి మోకుకు అతికే తాడు.

వారెనపీట రూ. చూ. వారిణపీట. వి. నాగలికి పూజను అమర్చటానికి ఉపయోగించే కర్ర.

వార్చియుండు(-ఉండు) చూ. వార్చు. అ.క్రి. వేచిఉండు. పాండు. 5.241.

వార్చు చూ. వారు¹.

వార్డు వి. కొన్ని ఇళ్ళయొక్క, కొన్ని వీథులయొక్క కలిసిన భాగం.

ఇం. *Ward.* కొన్ని ఇళ్ళు లేక కొన్ని వీథులు కలిసిన భాగం.

< ఇం. Ward.

వార్ణము రూ.చూ. వారిణము. వి. ఒకజాతిడేగ. హంస. 3.13.

వార్త వి. 1. నీతి. భర్తృ. 2.71; 2. లోకోక్తి. విజయ. 2.43; 3. ప్రసిద్ధి.

సం. వార్తా. ఉనికి, వృత్తాంతం, సమాచారం; వృత్తి, వాణిజ్యం, కృషి, వర్ణనావైభవం, ఆన్వీక్షక్యాది విద్యల్లో ఒకటి. < సం. వార్తా (అర్థవిపరి.).

వార్తకాఁడు వి. 1. మాటకారి; 2. రాయబారి. సం. వార్తా + - కాఁడు. వార్తకెక్కు అ.క్రి. పేరుపడు, ప్రసిద్ధినొందు. పాండు. 1.148. < సం. వార్తా + కున్ + ఎక్కు. వార్తలాడు అ.క్రి. 1. మాటాడు; 2. ముచ్చటించు. < సం. వార్తా + - లు + ఆడు.

వార్ధకమెత్తు అ.క్రి. వృద్ధాప్యం వచ్చు. జైమినిభా. 2.64.

సం. వార్ధక-. ముదిమి, వృద్ధత.

< సం. వార్ధక - + - ము + ఎత్తు¹.

వార్ని రూ.చూ. వారిణ. వి. 1. మోటపగ్గం; 2. చేపల్ని పట్టే సాధన విశేషం.

వార్నిపీట రూ.చూ. వారిణపీట. వి. అరకపీట, ఎలుపు పీట, ఎలుపు నలుపులకు కాడి ఏడికోల కలిపేచోట వారిణ దూర్చిన చిన్న కొయ్యగొట్టం.

వార్నింగు వి. హెచ్చరిక.

ఇం. *Warning.* ముందుజాగ్రత్త చెప్పటం, హెచ్చరిక ప్రబోధనం.

< ఇం. Warning.

వార్నిషు వి. మెరుగునూనె.

ఇం. *Varnish.* మెరుగునూనె.

< ఇం. Varnish.

వార్నీషువడి వి. మైనం పూసిన వడి.

ఇం. *Varnish.* మెరుగునూనె.

< ఇం. Varnish + వడి.

వార్నె రూ.చూ. వారిణ. వి. 1. కపిలమోకును కాడికి బిగించటానికి పన్నిన ఉచ్చుతాడు, వారిణి; 2. కాడిమానుకు మధ్య కట్టి ఉంచే ముప్పేట తాడు.

వార్నెతాడు రూ. వారిణతాడు, వారిణెతాడు, వారింతాడు వారెనతాడు. వి. బండిపోలు తాడును జువ్వాయి మోకుకు అతికే తాడు. వార్నెపీట రూ.చూ. వారిణపీట. వి. వార్నెను దూర్చే అల్లకం.

వార్పు చూ. వారు¹.

వార్పుగంజి చూ. వారు¹.

వార్లపల్లయ్య రూ.చూ. వారాలపల్లయ్య. వి. పత్తిబలిజె కులానికి చెందినవారు.

వార్లుదువ్వు చూ. వార¹.

వార్వపుటగ్గి చూ. వార్వము.

వార్వపుటగ్గిపట్టులు చూ. వార్వము.

వార్వపుటగ్గిని చూ. వార్వము.

వార్వము రూ.చూ. వారువము. వి. వారువం, గుర్రం. కళా. 3.62.

వార్వపుటగ్గి(-అగ్గి) వి. బడబాగ్ని. అచ్చ. రా. బాల. 184. వార్వపుటగ్గిపట్టులు వి.బ.వ. సముద్రాలు. వార్వపుటగ్ని(-అగ్ని) వి. బడబాగ్ని. సం. అగ్ని -. నిప్పు.

వార్సట్టి చూ. వార[1].

వార్సాలకుదురు చూ. వార[1].

వార్సాలటిక చూ. వార[1].

వార్సు రూ.చూ. వారసు. వి. వారసుడు, ఉత్తరాధికారి.

వాఱంటువిల్లు చూ. వాఱు[1].

వాఱదెఱచు(-తెఱచు) స.క్రి. కొలదిగా తెరచు. పండి. చ. 1.4.380.

వాఱు[1] వి. సన్నగా కోసినతోలు. చిత్రభా. 3.111.

త. వార్. తోలు, తోలుపట్టా.

వాఱంటువిల్లు వి. రాళ్ళ పనివాళ్ళువారు కట్టిన పెద్ద వింటికోల. < వాఱు[1] + అంటు[1] + విల్లు. వాఱుకోల వి. కశ, కొరడా. కుచే. 2.10.

వాఱు[2] రూ.చూ. వారు[4]. వి.బ.వ. వాళ్ళు.

వాటెన రూ. ఆర్నె, ఓర్నె, వాన్రె, వారిణ, వారిణము[1], వారిణి, వారిణె, వారిన, వారినె, వార్ని, వార్నె. వి. 1. ఒకరకం పగ్గం, బలమైనలాడు. పండి. ఆ. 1.40; 2. వేటకుపయోగించే సాధన విశేషం. పి. శకు. 1.116

సం. వారణ -. నిరోధం, అడ్డగించటం.

< సం. వారణ -.

వాటెనపీ(ట రూ.చూ. వారిణపీట. వి. ఎడికోలకు, కాడికి మధ్య చేరికగా ఉండే కొయ్య.

వాలకతనము చూ. వాలకము.

వాలకము చూ. వాలు[1]. వి. 1. మోసం. రామాభ్యు. 7.162; 2. వేషం. ప్రభా. 1.107; 3. పేరుకు పని చేసినట్లు నటించటం; 4. విధానం, పద్ధతి; 5. రూపు.

వాలకతనము వి. మోసం. ఇందు. 4.59.

వాలగ రూ.చూ. వాలువు. వి. మేలైన సున్నటి మంచినీటి చేప, వలగ.

వాలగమీసాలు వి.బ.వ. కోపుగా తెగులు లేకుండా ఎదిగే పరిదంటు.

వాలతిప్పు రూ.చూ. వాలుతిప్పు. అ.క్రి. పదుగులో పదుగేరు క్రరకు వెనకఉన్న పోగులు పైకి తిప్పు.

వాలము రూ. వాలాము. వి. బెబ్బులి. సారంగ. 1.102.

సం, వ్యాల -. క్రూరజంతువు, పులి.

< సం. వ్యాల -.

వాలంపఱ చూ. వాలు[2].

వాలయించు రూ.చూ. వాలాయించు. స.క్రి. నిర్బంధించు. భోజ. 5.352.

వాలఱుగుడు చూ. వాలు[2].

వాలాజామామిడి వి. ఒకరకం మామిడి.

వాలాటం చూ. వాలు[1]. వి. అలుగు, చెరువులో ఎక్కువైన నీళ్ళు పొర్లిపోవటానికి కట్టకు పల్లంగా ఉన్న చివర ఏర్పరచిన రాతికట్టడం.

వాలాము రూ.చూ. వాలము. వి. బెబ్బులి.

వాలాయము రూ. వాలెము. వి. 1. నిర్బంధం, నిరోధం. కు. సం. 6.21; 2. ఎల్లప్పుడు. భాగ. 7.102; 3. బలాత్కారం; విణ. 1. యథావిధి, విధివిహితం, కాశీ. 4.13: 2. అవశ్యం, తప్పక. విక్ర. 2.178; 3. అనివార్యం. భాగ. 10పూ. 38; 4. నిరంతరం. పాండు. 5.67; 5. అనుకూలం. వేమ. 2భా. 209.

త. వాలాయమ్. సాధారణత్వం, ఆచారం, బాగా తెలిసినది.

వాలాయముగా క్రి. విణ. సిద్ధంగా, రూఢిగా. కళా. 5.100. < వాలాయము + అగు + -అ[7]. వాలాయించు. రూ. వాలయించు. అ.క్రి. అభినివేశంపూను, పట్టుపట్టు. పల్నా. 2.223; స.క్రి. నిర్బంధపరచు. భోజ. 7.94. సిం.ద్వా. 4.284. < వాలాయము + -ఇంచు[3].

వాలాయించు చూ. వాలాయము.

వాలారు చూ. వాలు[2].

వాలార్చు చూ. వాలు[2].

వాలి[1] చూ. బావలి. వి. ఒకవిధమైన తమ్మంటు, చెవిపోగు. ద. హిం. శా. సంపు. 6. శా. సం. 946. క్రి.శ. 1408.

క. బాలి-. కర్ణభూషావిశేషం, బావలి.

వాలి[2] చూ. వాలు[1]. వి. వాన కురిసి పొలంలో పారేనీటి జాలు.

వాలిక చూ. వాలు.[2]

వాలికతూపు చూ. వాలు[2].

వాలికనడ చూ. వాలు[2].

వాలించు చూ. వాలు[1].

లాలి(డి చూ. వాలు[5].

వాలినక్రర చూ. వాలు[1].

వాలినడక చూ. వాలు[2].

వాలు[1] అ.క్రి. 1. ప్రవేశించు. భాస్క. రా. కిష్కిం. 485; 2. పడు. గౌ.హరి. ఉ. 2.484; 3. వాలు. వేంక.పంచ. 4 220; 4. పక్షికాలూను, కిందికిదిగు. మను. 4.31; 5. ఆసక్తమగు. పాండు. 4.108; 6. ఒరుగు, కూలు. ఘటికా. 1.50; 7. ఏటవాలు.

వాలించు స.క్రి. 1. తర్జించు. వేంక. పంచ. 2.104; 2. వాలచేయు, నేలకూల్చు, ఖండించు. ప్రబంధ. 1.217; వి. నేలకూల్చటం. రాజవా. వి. 3.117. <వాలు[1]+ ఇంచు[3]. వాలినక్రర వి. కిందికొత్తులు, ఆసుపోసిన పదుగులో చివరి అనిపడ్డ భాగం. వాలుకరెప్పలు వి.బ.వ. వాలే కన్నులు. వాలుకుంచె వి. సరిచేసేటప్పుడుగాని పదుగేరే ఉప్పుడుగాని పదుగేరే క్రరపక్క పోగులు సాపుగాదువ్వే కుంచె. వాలుగదుపు(-కదుపు) రూ. వాల్గదుపు. వి. బొజ్జ. వాలుగొమ్ము[1] (-కొమ్ము) వి. 1. అలుగు, చెరువులో ఉన్నచివర ఎక్కువైన నీళ్ళు పొర్లి పోవటానికి కట్టకు పల్లంగా ఏర్పరచిన రాతి కట్టడం; 2. దువ్వెన. వాలుగొర్రు చూ. ఆటగొఱ్ఱు. వి. భూమిదున్నే గొర్రు, నాగలితో దున్నిన తరవాత పెళ్ళలు నలగటానికి దున్నే గొర్రు. వాలుచట్టిచిప్ప రూ. వాడిసట్టిచిప్ప. వి. కుమ్మరి కుండల్ని సర్దేటప్పుడు కుడిచేతిపైపు పెట్టుకొనే నీళ్ళ పాత్ర. వాలుచు రూ.చూ వాల్చు. స.క్రి. 1. వాలచేయు,

వంచు భీమ. 1.3 ; 2. అతిశయింపచేయు ; 3. ప్రవణం చేయు. వాలుచూపు రూ.చూ. వాల్చూపు. వి. ఓరచూపు. దశా. 2.239. వాలుతిప్ప రూ. వాలతిప్పు. అ.క్రి. పదునులో పదునుగేరేకర్రకు ఉన్న పోగొలుపైకితిప్పు. వాలుపట్టు వి. సారెమీద మందంగా తయారైన పాత్రను దానినిపలచగా చేయటానికి పట్టేపట్టు. వాలుపు రూ. వాల్పు. వి. వాల్చటం, మోడ్పు. బిల్హ. 2.160. వాలుప్రొద్దు వి. అపరాహ్ణం. వాలుమొగ్గ వి. పిల్లిమిరియం. వాలువగ్గము విణ. మిక్కిలి వశమైంది. ప్రభు. 2.46పు. 23పం. వాలెరువు వి. పశువుల మూత్రంతో కూడి ఆరి పొడిపొడిగా విరవడి పోయిన పేడఎరువు. < వాలు + ఎరువు. వాల్కలి వి. 1. కల్లు ; 2. సారా. < వాలు¹ + కలి. వాల్గడుపు రూ.చూ. వాలుగడుపు. వి. బొజ్జ. < వాలు¹ + కడుపు. వాల్చు రూ. వాలుచు. స.క్రి. 1. వాలచేయు, వంచు. శృం.నై. 4.88 ; 2. అతిశయింపచేయు. శివరా. 1.75 ; 3. ప్రవణంచేయు. శివరా. 2.18. వాల్చూపు రూ. వాలుచూపు. వి. ఓర చూపు. ఉ.రా. 2.266. < వాలు¹ + చూపు. వాల్పు రూ.చూ. వాలుపు. వి. వాల్చటం, మోడ్పు.

వాలు² విణ. 1. క్రూరం. భార. ఆది. 6.178 ; 2. మనోజ్ఞం. కు.సం. 9.147 ; 3. మృదువు. రం.రా. కిష్కిం. 214పు., 12పం ; 4. అధికం. రుక్మాం.చ. 5.20 ; 5. దీర్ఘం. రామాభ్యు. 1.122; వి. 1. తీక్ష్ణత. కు.సం. 11.142 ; 2. తడవ, తూరి, పర్యాయం. వేంక. పంచ. 3.18 ; 3. దైర్ఘ్యం, పొడుగు. లక్ష్మీవి. 2.81 ; 4. నిటమైన ప్రదేశం ; 5. పదునులో పదునుగేరే కర్రకు ఉన్నపోగులు ; 6. బావి తవ్వేటప్పుడు వేసేవరస ; అ.క్రి. 1. ప్రసిద్ధికెక్కు. కు.సం. 10.162 ; 2. విజృంభించు. భార. విరా. 1.119 ; 3. అతిశయించు. భార. శాంతి. 1.117 ; ద. హిం.శా. సంపు.6. శా.సం. 628. క్రీ.శ. 1224 ; 4. ప్రకాశించు. భాస్క. రా. బాల. 31 ; స.క్రి. వహించు. రం.రా. కిష్కిం. 203పు. 20పం.

త. వాళ్. ప్రకాశం, కాంతి, కీర్తి, వాళ్. ప్రసిద్ధికెక్కు, మనత వహించు, వా. వృద్ధిచెందు, అధికమగు.

మూ.ద. ద్రా. *వా-, వళ్.అయ్.

వాలంపఱ చూ. అమ్ము¹. వి. బాణపరంపర. హరి. ఉ. 3.123. < వాలు² + అంపఱ. వాలఱుగుడు వి. వాలిడికోతి, తోకలేనికోతి. < వాలు² + అఱుగుడు. వాలారు విణ. 1. మనోహరమైంది, ఇంపైంది. కు.సం. 8.86 ; 2. వాడైనది. భాస్క. రా. ఆరణ్య. 2.86 ; 3. దీర్ఘమైంది. విక్ర. 7.102 ; అ.క్రి. 1. ఉపశమిల్లు, క్షీణించు. శివరా. 3.27 ; 2. ఒప్పు. అప్ప. 4.221. < వాలు² + ఆరు¹. వాలార్చు స.క్రి. 1. పరీక్షించు. బసవ. 5.559 ; 2. కత్తులు జళిపించు. పల్నా. 1.126. < వాలు² + ఆర్చు². వాలిక విణ. 1. వాడి అయినది. భార. భీష్మ. 1.272 ; 2. దీర్ఘం, పొడవు. కాశీ. 6.70. < వాలు² + -ఇక². వాలికతూఁపు వి. వాడికబాణం. భార. భీష్మ. 3.211. వాలికవడ వి. అశ్వగమనభేదం. విక్ర. 8.74. వాలినడక వి. అశ్వగతివిశేషం. సిం.ద్వా. 8.71. వాలుకొంగ వి. పక్కుకొంగ, బకం. వాలుగన్ను వి. 1. ఆడచేప. దశా. 1.212 ; 2. ఆడవాలుగచేప. ఆం. భా. 3.60. వాలుఁగంటి రూ.చూ. వాల్గంటి. వి. 1. దీర్ఘమైన కన్నులున్న ఆడది. గౌ. హరి.ఉ. 2.484 ; 2. భార్య. వాలుఁగన్ను(-కన్ను) రూ.చూ. వాల్గన్ను. వి. సోగకన్ను. ఉ.రా. 1.254. వాలుచుక్క రూ.చూ. వాల్చుక్క. వి. శుక్రుడు. వాలుచేప వి. మత్స్య విశేషం (Chirocentius indus.) వాలుమగంటిమి వి. శూరత్వం, శౌర్యం. శాశ్ల. సం. 6.226. వాలుమగఁడు వి. శూరుడు. భార. సౌప్తి. 1.157 వాలుమీను వి. వాలుగ, ఒకజాతిచేప. హంస. 3.69. వాలుమృగము రూ. వాల్మృగము. వి. 1. పులి: భార.స్త్రీ. 2.93 ; 2. క్రూరజంతువు. వాలుమెకము రూ చూ. వాల్మెకము. వి. అడవిపంది. క్రూరజంతువు. మను. 4.16. వాలురమ్ము వి. వాడిగలబాణం. భార. కర్ణ. 2.383. < వాలు² + అమ్ము. వాలూరు అ.క్రి. ఆలస్యమగు. రం.రా.యు. 279.11, పం. < వాలు² + ఊరు.⁴ వాల్గంటి రూ. వాలుఁగంటి. వి. 1. భార్య. హర. 2.89 ; 2. దీర్ఘమైన కన్నులున్న ఆడది. నీలా. 2.28. వాల్గన్ను రూ. వాలుగన్ను వి. సోగకన్ను. ఆం భా. 360. < వాలు² + కన్ను. వాల్చుక్క రూ. వాలుచుక్క. వి. శుక్రుడు. ద్వి.సార.చ. 399పు. 2పం < వాలు² + చుక్క. వాల్మృగము రూ.చూ. వాలుమృగము. వి. 1. క్రూరజంతువు. కేయూ. 3.10. ; 2. పులి. సం. మృగ-.జంతువు. < వాలు² + సం. మృగ - + - ము. వాల్మెకము రూ. వాలుమెకము. వి. అడవిపంది, క్రూర జంతువు. ద్వి.హరిశ్చ పూ. 516పం. < వాలు² + మెకము.

వాలు³ వి. కత్తి. భార. ఆది 2.155.

క. బాళ్(ఉ). బాకు, కత్తి ; కొడ. బ.ళి.కత్తి, (కూర్గ సైనికులు ధరించే) పెద్దకత్తి ; తు. బాళు. గెడ్డంగీనుకోవడానికి ఉపయోగించే పనిముట్టు, (రేజర్) ; త. వాళ్. కత్తి, రంపం, కత్తెర, పదును, కట్టు, వాలమ్. కత్తి ; మ. వాల్. కత్తి, రంపం ; కొ. పా.ళ్. కత్తి పో.చూ. కరవాల. కత్తి.

వాలు⁴ చూ. ద్రాలు. వి. పాత్రకుతికలో ఉండేగీత.

వాలుపోయు అ.క్రి. పాత్రలకు అంచుదగ్గర గోరుతోగాని ఇనుముతోగాని గీరలు పెట్టు.

వాలు⁵ వి. తోక.

త. వాల్. తోక, పొడవుగా ఉండేది, వాల్మ్. తోక, (తలమీద) జుట్టు ; మ. వాల్. తోక, తోకలాగా ఉన్నది కో. వ.లమ్. తోక ; కొ. పొ.సమ్. తోక ;

పో. చూ.సం. వాల-, బాల-. తోక, జుట్టు, వార. తోక.

వాలిఁడి వి. తోక లేనికోతి ; విణ. తోకలేనిది.

వాలుగ రూ.చూ. వాలువు. వి. చేప. భార. విరా. 2.83.

వాలుగకంటి వి. మీనాక్షి. స్త్రీ. చంద్రాంగ. 1.84.

వాలుగబెంకి వి మత్స్యవిశేషం. వాలుగడాలు వి. మన్మథుడు.

వాలుగగదవడ వి. పత్తినించి గింజ వేరుచేసే పనిముట్టు.

వాలుగపాము వి. మత్స్యవిశేషం.

వాలుగు రూ.చూ. వాలువు. వి. చేప. రసిక. 3.55. కవిక. 2.42.

వాలుడు వి. వాకారి, వృక్షవిశేషం. వేంక. పంచ. 1.688.

వాలుమీకేశ(ఁడు వి. వాల్మీకిచే ప్రతిష్ఠితుడైన ఒకదేవుడు. బసవ. 4. 763 పం.

సం. వాల్మీకేశ-. వాల్మీకికి ప్రభువు.

<సం. వాల్మీకేశ-.

వాలువ రూ.చూ. వాలువు. వి. మత్స్యవిశేషం. వేంక. పంచ. 1.294.

వాలువు రూ. వాలగ, వాలుగ, వాలుగు, వాలుప. వి. మత్స్యవిశేషం, వాలుగ చేప కు. సం. 11.159.

క. బళె. మత్స్యవిశేషం (T. Leptunus) ; కొడ. బ.ళె.మీ.ని. ఆడుచేప ; తు. బాలడె. ఒకరకంచేప ; త. వాళై. ఒకరకంచేప (Trichirus Laumela) ; మ. వాళమీన్. ఒకరకంచేప.

వాలూరు చూ. వాలు2.

వాలెము రూ.చూ. వాలాయము. క్రి. విశే. 1. ఎల్లప్పుడు. అచ్చ రా.యు. 259 ; 2. అవశ్యంగా. అచ్చ.రా. కిష్కిం. 82; 3. అత్యంతం. ద్వి. సార. చ. 1.13పు. 8పం.

వాలెరువు చూ. వాలు1.

వాల్కలి చూ. వాలు1.

వాల్గడువు చూ వాలు1.

వాల్గంటి చూ. వాలు2.

వాల్గన్ను చూ. వాలు2.

వాల్చు చూ. వాలు1.

వాల్చుక్క చూ. వాలు.2

వాల్చూపు చూ. వాలు1.

వాల్పాటిరాయి వి పంచలు దించటానికి వీలుగా అడ్డవాసాలు వేయటానికి అనువుగా ఇంటిగోడల్లో ముందుకు పొడుచుకొని వచ్చేటట్లుగా బిగించినరాయి.

ఇం. *Woll-Plate*. మోపులమీద ఒత్తిడి తగ్గించటానికిగాను గోడమీద ఉంచే కొయ్య.

ఇం. Wallplate + రాయి.

వాల్పిటకమ్మి వి. వసారా గోడలమీద పరిచే కడ్డీ.

ఇం. *Wall*. గోడ.

వాల్పు. చూ. వాలు1.

వాల్పువేయు అ.క్రి. నరి చేసేటప్పుడు పడుగు ఆరుబదునులో ఉండగా సందు సందుకూ కుంచెతో రెండోసారి దువ్వు.

వాల్‌ఫ్లవర్‌వైజ్ వి. పూలు పెట్టి అందంగా గోడలకు తగిలించటానికి వీలుగా ఉండేటట్లు చేసిన చిన్న మట్టి పాత్ర.

ఇం. *Wall Flower Vase*. గోడమీద అందంకోసం పూలుపెట్టి పెట్టేపాత్ర.

<ఇం. Wall Flower Vase.

వాల్మృగము చూ. వాలు2.

వాల్మేకము చూ. వాలు2.

వాల్‌మేట్ వి. దూలాం మట్టం వరకు లేచినగోడ.

ఇం. *Wall*. గోడ, *mate*. సహచరి, సహచరుడు, స్నేహితుడు.

<ఇం. Wall+ఇం. mate.

వాల్రుసి వి. పచ్చటి అడవుల్లో పెరిగే ఒకరకం చెట్టు. (Walswra Piscidia).

వాళి రూ.చూ. వాళి. వి. 1. పశువులు పోయేదారి ; 2. వాడుక.

వాళిగ వి. గరాటా, కువ్వెన, గల్లా.

వాళించు రూ.చూ. వాడించు. స.క్రి. వాడచేయు, మ్లానతనొందించు. వాల్మీ. 3.26.

వాళి రూ. వాళి. వి. 1. పశువులు పోయేదారి ; 2. వాడుక ; 3. క్రమం, విధం ; 4. ఉనికి, స్థావరం.

సం. వాటి. ఇంటిస్థలం, ఇల్లు, దొడ్డి, దారి ; ప్రా. వాడీ. కంచె, ఉద్యానవనం.

వాళ్లపళుచులు చూ. వాడు1.

వాళ్ళ చూ. వార4.

వావి వి. శాస్త్రీయమైన సంబంధయోగ్యత, అనుకూలమైన సంబంధ యోగ్యత, వరస. భార. అరణ్య. 1.362.

క. వావి. బంధుత్వం, రక్తసంబంధం.

వావివరుస వి. వివాహాదులకు సరిపోయే బంధుత్వం. క్రీడా. 1.252. వావివర్తన వి. సరిఅయిన నడవడి. శాళ్ల. సం. 5.59.

వావిక వి. కుత్తుక మొదట కలగుంట, అంగిటిగుంట.

వావింట రూ.చూ. వాయింట. వి. బర్బర, ఒకదినుసు కూరాకు (Oleone pentaphylla).

వావింటాకు రూ. వావింటేకు. వి. వావిలి చెట్టు ఆకు. వావింటేకు రూ.చూ. వావింటాకు. వి. వావిలిచెట్టు ఆకు. <వావింట+ఆకు.

వావింటాకు చూ. వావింట.

వావింటేకు చూ. వావింట

వావిరి1 విశే. 1. ఉత్కృష్టం, గొప్పది. కు.సం. 9.104 ; 2. దూర్తుడు. భార. విరా. 2.260 ; 3. అత్యంతం. భార. శాంతి. 1.115 ; 4. వెన్నంటిన ; వి. 1. అనుగతి. భార. శాంతి. 1.150 ; 2. క్రమం. హరి. ఉ. 1.163 ; 3. ఆధిక్యం, పెంపు. భాస్క. రా. సుందర. 514.

వావిరి2 .రూ.చూ. వావిలి. వి. వావిలి, శేపాలి. ఇందు. 3.51.

వావిలి రూ. ఆయిల, వాయిల, వాయిలి, వాయిలు1, వావిరి2. వి. శేఫాలిక, నిర్గుండి. రసిక. 3.127. (Vitex negundo or Vitex trifolia).

క. వావిలి. వైద్యంలో ఎక్కువగా ఉపయోగపడే లతా విశేషం.

వావిలిపొరక వి. దూలాలపైన కప్పే దంతి, కొడిసె పొరక.

వావురము రూ.చూ. వారువము. వి. గుర్రం. వరాహ. 9.88.

వాస1 వి. ఆసామికి పొలంచేసే రైతు పండిన పంటలో ఇవ్వటానికి ఒప్పుకున్న భాగం. (సగంకాని అంతకన్న ఎక్కువ కాని) ఈ ఏర్పాటును బట్టిచేసే సేద్యం.

వాస2 రూ.చూ. వాసము. వి. ఇంటిమీద పరిచే మట్టి, దూలాలకు అడ్డంగా కప్పుకింద చాలుగా పరచిన పొడుగాటి కొయ్య.

వాసకట్టు వి. ఇంటికి వాసాలు ఎత్తటం. వాసకట్టు వీథి వి. ఒకదానికొకటి ఆనించి వీథిపొడుగునా కట్టిన వాసిళ్ళు గల వీథి. వాసకూర్పు వి. ఇంటికి వాసాలు ఎత్తటం.

వాసకొయ్య వి. కొయ్యవాసం వాసగొల్పు (-కొల్పు) అ.క్రి. ఇంటికి వాసాల్ని వేయు. వాసపరుపు రూ. ఆసపరుపు. వి. ఇంటికివాసాలు ఎత్తటం. వాసపాక వి. పొదుగాటిపాక. వాసపుచ్చు అనుపుచ్చు అనుబుచ్చు. వానుపుచ్చు. అ.క్రి. ఇంటికి వాసాల్ని వేయు. వాసపూజ వి. పునాదిరాయి పాతేటప్పుడు చేసేపూజ. వాసపూయు అ.క్రి. ఇంటికి వాసాలువేయు. వాసపోత రూ. ఆసపోత, వాసాప్పోత. వి. ఇంటికి వాసాలు ఎత్తటం వాసపోయు అ.క్రి. వాసాలుపర్చు. రాజ. వి. 3.40. వాసబట్టీ వి. పొడుగ్గా ఉండే ఇటికబట్టీ. వాసమేటు వి. పొడుగ్గా వేసిన గడ్డివామి. వాసరాసి వి. మదనం చాలుగా పోసిన కుప్ప. ముఖ్యంగా తూర్పార పొయ్యని ధాన్యాన్నే ఇలాపోస్తారు. వాససాల రూ.చూ. వారసాల. వి. పొడుగ్గా వేసిన పసులకొట్టం. వాసిలు వి. పొడుగాటి ఇల్లు. <వాస[2] + ఇల్లు.

వాసటిక (-అటిక) వి. సారెమీద కుండల్ని వానేటప్పుడు కుమ్మరి పక్కన పెట్టుకొనే నీళ్ళపాత్ర.

వాసన వి. కీర్తి. ద.హిం.శా. సంపు. 4. శాసం. 1380. కు. సం. 6.79.

సం. వాసనా. స్మృతికి హేతువయిన సంస్కారం, భావన, సుగంధీకరణం, పరిమళం కలిగించటం.

<సం. వాసనా (అర్థవిపరి.).

వాసనకెక్కు[1] అ.క్రి. కీర్తివహించు. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 1380. <వాసన + -కున్ + ఎక్కు.

వాసనకట్టు రూ.చూ. వాసెనకట్టు. అ.క్రి. 1. తలనొప్పికి ఉపశమనంగా బట్టను కట్టుకొను ; 2. ఏదైనా వస్తువుల వాసన పోకుండా బిందెలు మొ. వాటి మూతులకు బట్ట కట్టి పరిపెట్టు ; 3. నెయ్యిమొ. వాటివాసన తగ్గిపోకుండా ఉండేట్టు పాత్రమూతిని కట్టి మూతగా కట్టినది. వాసెనకట్టు.

వాసనకెక్కు[2] అ.క్రి. వాసనకలుగు. పరిమళించు. కు. సం. 4.443.

సం. వాసనా. పరిమళం.

<సం వాసనా + -కున్ + ఎక్కు.

వాసనకొడుపు వి. ఊదువత్తిపుడక, సాంబ్రాణివత్తి. ఆము. 4.35.

సం. వాసనా. పరిమళం.

<సం. వాసనా + కొడుపు.

వాసనమొలక వి. మరువం.

సం. వాసనా. పరిమళం.

<సం. వాసనా + మొలక.

వాసనరాజనాలు వి.వట. ధాన్యవిశేషం. హంస. 4.128.

సం. వాసనా. పరిమళం.

<సం. వాసనా + రాజనాలు.

వాసనవడ్లు వి.బ.వ. సువాసనగల కొన్ని ధాన్యభేదాలు.

సం వాసనా. పరిమళం.

<సం. వాసనా + వడ్లు (మిశ్రస.).

వాసంతడప చూ. వాసము.

వాసము రూ. అసం, ఒస, ఒసం, వాస[2], వాసాం. వి. 1. ఇంటిమీద పరచే పట్టె. ఆము. 4.127 ; 2. గుంటక మొ. వి. దిండుకు బిగించి కాడిమీద మోసే పొడుగుకొయ్య ; 3. నూలు చిలపలు ఆరవేసే వెదురుబొంగు ; 4. దూలాలకు అడ్డంగా కప్పుకింద చాలుగా పరచిన పొడుగాటి కొయ్య.

సం. వంశ.- వెదురు, వాంశ్య -. వెదురుకు సంబంధించిన ; ప్రా. వంస -. వెదురు ; మరా. వాసా, వాంసా ;

క. బంచ, వంచె, బాసె, వాస. వెదురుతోచేయబడ్డది, మురళి ; త. వాచమ్. కదురు; మ. వంచి; గోం. వాసాం. పర్జి. వాచొం ; కొలా వాచ.

<ప్రా. వంస-.

వాసంతడప వి. ఛాటినార. <వాసము + తడప. వాసంబద్ద వి. ఇంటికప్పు వేయటంలో వాడే పలచని చెక్క, దంతులమధ్య బిగించేది. <వాసము + బద్ద. వాసాలు నడుపు అ.క్రి. ఇంటికి వాసాలు చేయు. <వాసము + -లు + నడుపు.

వాసంబద్ద చూ. వాసము.

వాసరా వి. చెల్లుగా ఇచ్చేది. వసూలు ఇచ్చింది.

వాసాం రూ.చూ. వాసము. వి. దూలాలకు అడ్డంగా కప్పుకింద చాలుగా పరచిన పొడుగాటి కొయ్య.

వాసాప్పోత రూ.చూ. వాసపోత. వి. ఇంటికి వాసాలు ఎత్తటం. <వాసాం + పోత.

వాసోప్పోత చూ. వాసాం.

వాసాలునడుపు చూ. వాసము.

వాసి వి. 1. తారతమ్యం. భార. ఉద్యో. 2.308 ; 2. ఆధిక్యం. రం.రా.యు. 287పు. 15పం ; 3. లాభం. హర. 2.139 ; 4. భేదం. నవనాథ. 5.217పు. 14పం ; 5. గొప్పతనం. పారి. పీఠి 9 ; 6. పరాక్రమం. రాజవా. 5.5 ; 7. విధం, పోలిక. కుచే. 1.80 ; 8. అందం, చక్కదనం. విజయ. 2.45 , 9. ప్రసిద్ధి, కీర్తి. ఉ.రా. 1.18 ; 10. ఔన్నత్యం. ఆం.భా. 2.123 ; 11. పరిమితి ; 12. నెమ్మది, నయం. ; 13. కొలత, పరిమాణం ; 14. పేర్లలోని వరస ; విశ. 1. బాగు. కూర్మ. 4 ; 2. దీర్ఘమైన, నిడుద. ఆం.భా. 3.18 ; 3. ఉత్కృష్టమయిన ; 4. స్వచ్ఛమయిన.

సం. వాసిన్. ఉనికి ; ప్రా. వాసి, వాచి. పలుకు, వాగ్దానం, ధ్రువీకరణం ;

క. వాసి. నివసించటం, పలుకు వాగ్దానం, సద్గుణం ; తు. వాసి. కీర్తి, బాగుపడటం ; త. వాచి. గుణం, స్వభావం ; మ. వాసి. హెచ్చు.

<సం. వాసి.

వాసికత్తియ రూ.చూ. వాసికత్తె వి. పేరుపొందిన స్త్రీ. వాసికత్తె రూ. వాసికత్తియ. వి. పేరుగాంచిన స్త్రీ. తాళ్ల. సం. 17.448. వాసికాడు వి. ఉన్నతుడు. పి.శకు. 2.105. వాసికినెక్కు రూ.చూ. వాసికెక్కు. అ.క్రి. ఖ్యాతినొందు. ప్రసిద్ధిపడయు. శృం.నై. 6.92 వాసికెక్కినవాడు. విశ. వాసి అయినవాడు. వాసికెక్కు రూ. వాసికినెక్కు. అ.క్రి. ఖ్యాతినొందు, ప్రసిద్ధిపడయు. భార. కర్ణ. 1.215. వాసిగ క్రి. విశ.ద్రు. ప్రసిద్ధిగా. భార. ఆది. 1.25. < వాసి + అగు + - అ[7]. వాసిచెడు అ.క్రి. న్యూనతఏర్పడు, గౌరవం

చెందు. హంస. 1.125. వాసిఁజెలఁగు(-చెలగు) అ.క్రి. ఒప్పు, ప్రకాశించు. వాసితనము వి. గొప్పతనం, ఘనత పారి. 4.58. వాసిదప్పు (-తప్పు) అ.క్రి. పేరుపోవు. తాళ్ల. సం. 10.13. వాసిమీఱు అ.క్రి. ప్రసిద్ధిపొందు. అధ్యా. అరణ్య. 70. వాసిరేఁచు అ.క్రి. పేరుపొందించు. తాళ్ల. సం. 15. 234. వాసివట్టము వి. హెచ్చుతగ్గు. హర. 2.139. వాసీవంతు వి. వన్నెవాసి. తాళ్ల.సం. 8.91. వాసులకుంబెనఁగు అ.క్రి. తామే ఎక్కువని వాదించుకొను. శుక. 4.9. వాసైన వాఁడు విణ. వాసికెక్కినవాడు <వాసి + అయినవాఁడు.

వాసిగ్రోలు రూ.చూ. వాసెగ్రోలు. వి. మురళి.

వాసియ రూ.చూ.వాసె. వి. పిల్లనగ్రోవి, మురళి.

వాసిలు చూ. వాన².

వాసీవంతు చూ. వాసి.

వాసుకంచు వి. పాము ఆకారంలో చిక్కైను నేసిన అంచు.

సం. వాసుకి -.సర్పరాజు.

<సం. వాసుకి - + అంచు³.

వాసుపుచ్చు రూ.చూ. వాసపుచ్చు. అ.క్రి. ఇంటికి వాసాల్ని వేయు.

వాసులకుంబెనఁగు చూ. వాసి.

వాసూరకట్ట వి. ఆకుకప్పు జారకుండా గోడల వెంటనే నపారాన్ని బిగించి కట్టిన పెండెకట్టు.

వాసూరచుట్ట చూ. వసారా. వి. ఆకు కప్పు జారకుండా గోడల వెంటనే నపారాన్ని బిగించి కట్టిన పెండెకట్టు.

వాసూరపట్ట చూ. వసారా. వి. వాసాలకు చూరుదగ్గర తొల్ల వేసి బిగించిన చెక్క.

వాసూరిదబ్బ చూ. వసారా. రూ.చూ. వాసూరుదబ్బ. వి. పెంకుటింటి ముంజూరు కింది కాలిగుంజలమీద చూరు జారకుండా ఉంచేందుకు వేసే అడ్డుచెక్క.

వాసూరుచెక్క చూ. వసారా. వి. పెంకుటింటి ముంజూరుకింది కాలిగుంజలమీద చూరు జారకుండా ఉంచేందుకు వేసే అడ్డుచెక్క.

వాసూరుదబ్బ చూ. వసారా. రూ. వాసూరిదబ్బ, వాసూరుబద్ద, వాసూర్దబ్బ. వి. పెంకుటింటి ముంజూరు కింది కాలిగుంజల మీద చూరు జారకుండా ఉంచేందుకు వేసే అడ్డుచెక్క.

వాసూరుపట్టు చూ. వసారా. రూ. వాసూరుపట్టె. వి. పెంకుటింటి ముంజూరు కింది కాలిగుంజలమీద చూరు జారకుండా ఉంచేందుకు వేసే అడ్డుచెక్క.

వాసూరుపట్టె రూ.చూ. వాసూరుపట్టు. వి. వాసూరున బిగించిన చెక్క, పెంకుటింటి ముంజూరు కింది కాలిగుంజలమీద చూరు జారకుండా ఉంచేందుకు వేసే అడ్డుచెక్క.

వాసూరుబద్ద రూ.చూ. వాసూరుదబ్బ. వి. పెంకుటింటి ముంజూరు కింది కాలిగుంజలమీద చూరు జారకుండా ఉంచేందుకు వేసే అడ్డుచెక్క.

వాసూర్దబ్బ రూ.చూ. వాసూరుదబ్బ. వి. పెంకుటింటి ముంజూరు కింది కాలిగుంజలమీద చూరు జారకుండా ఉంచేందుకు వేసే అడ్డుచెక్క.

వాసె రూ. వాసియ. వి. పిల్లనగ్రోవి. యయా. 4.12.

సం. వంశ-. మురళి ; ప్రా. వంసిఅ-, వంస-., వంసీ. వాద్య విశేషం ; అ.మా. వంస-, వంసి ; పా. వంస-.

<ప్రా. వంసిఅ-.

వాసెకాఁడు వి. ఒకానొకవిధమైన వాద్యాన్ని వాయించే వాడు. E.P. Ind. సంపు. 5.శా.సం.17. వాసెగ్రోలు రూ. వాసిగ్రోలు. వి. పిల్లనగ్రోవి, మురళి. ఆము. 4.35.

వాసెత వి. కోమటిది.

వాసెన వి. కుండమూతి మూయటానికి కట్టినగుడ్డ. ద్వి. పరమ. వి. 3.225పు. 2పం.

సం. వాసన-.వస్త్రం ; ప్రా. వాసణ-, వాసన-.

<ప్రా. వాసణ-.

వాసెనకట్టు రూ. వాసనకట్టు. వి. వాసెనగుడ్డ కట్టులా తలకుకట్టే కట్టు. పారి. 1.99. వాసెనకుడుము వి. ఇడ్డెన, ఒక రకం పిండివంట. వాసెనపోలె వి. 1. భక్ష్యం, కుడుం; 2. పిట్టు ; 3. ఇడ్డెన. వాసెనలుచుట్టు(-చుట్టు) అ.క్రి. వాసన కట్టు కట్టు. వండి.చ. 1.2.443.

వాసైనవాఁడు చూ. వాసి.

వాస్తువ వి. ఇల్లుకట్టేచోటు.

సం. వాస్తు -. ఇల్లుకట్టేచోటు.

<సం. వాస్తు-.

వాహవా రూ.చూ. వహ్వా. అవ్య. ఆశ్చర్యసంతోషప్రశంసా సూచకశబ్దం.

వాహి వి. ప్రసిద్ధి. ఘటికా. 2.164.

సం. వాహిన్. మోసేది, వహించేది ; హిం.ఉ.పార్సీ వాహ్. ప్రశంసార్థకం, బళీ, వాహ్‌వాహ్. ప్రశంసించటం.

వాహువా రూ.చూ. వహ్వా. అవ్య. బళీ, ప్రశంసార్థకశబ్దం. సిం.హ.శ.

-వి¹ సర్వ. 'అవి'శబ్దంయొక్క అద్యక్షరం లోపించగా మిగిలినరూపం. సంబంధాదుల్ని తెలిపేటప్పుడు అను ప్రయుక్తమవుతుంది. భాగ. ఆది. 3.156 ; ప్రత్య. అనుహదర్థంలో వర్తమానకాలంలో ఉన్నాను బంధంమీద ప్రథమపురుష బహువచనంలో వచ్చేప్రత్యయం.

<అవి.

-వి² ప్రత్య. భూతార్థక మధ్యమ పురుషైక వచన ప్రత్యయం. విజయ. 1.41.

<ఈవు <నీవు.

-వి³ రూ.-వు. అప. ప్రథమాంతమైన యుష్మదర్థవిశేషణాలకు ఏకవచనంలో ప్రాయకంగా వచ్చే ఆగమం. మను. 2.75.

వికటించు అ.క్రి. ప్రతికూలించు. భాను. 3.56.

సం. వికట-.వికృతమైన, భయంకరమైన, మిట్టపల్లాలు గల.

<సం. వికట- + -ఇంచు³.

వికరిబిదూలములు వి.బ.వ. చిప్పపెంకల్లో వేసే దూలాలు.

సం. వికరణ-అవయవాలు లేకుండటం.

వికవిక రూ. వికావిక. వి. 1. నవ్వటంలోని ధ్వనికి అను కరణం. హర. 4.27 ; 2. తెగటంలో అయ్యే ధ్వనికి అను కరణం. అష్టమ. క. 2.124పు.11పం ; 3. చెల్లాచెదరు. ధ్వన్యను.

**వికవికనవ్వు** అ.క్రి. పకపకనవ్వు. ఇలా. 3.71. **వికవికలు** రూ.చూ. వికావికలు. వి.బ.వ. వికావికలుగా నవ్వటం.

**వికల్పముచేయు** స.క్రి. పనిచెరచు, విరుద్ధంగాచేయు. సిం.ద్వా. 1.262.

సం. వికల్ప-.సంశయం, ఊహ, కల్పనం, విధం, అజ్ఞానం, తారతమ్యం.

<సం. వికల్ప- + -ము + చేయు.

**వికావిక** రూ.చూ. వికవిక. వి. చెల్లాచెదరైనది. కాశీ. 7.87.

**వికావికనగవులు** వి.బ.వ. నవ్వటంలో అయ్యే ధ్వన్యను కరణం. హంస. 5.27. **వికావికలు** రూ. వికవికలు. విశ. బ.వ. చెల్లాచెదరు, పటాపంచలు, యథాయథలు, పకపకలు. దశకు. 2.64.

**వికిరించు** స.క్రి. గేలిచేయు.

సం. వికిర-.చెదరినభాగం, చెదరటం.

<సం. వికిర- + -ఇంచు[3].

**వికిరింత** వి. 1. గేలి, 2. రోత.

**వికిరింత** చూ. వికిరించు.

**విక్కను** చూ. విక్కు.

**విక్కవిరియు** చూ. విక్కు.

**విక్కు** చూ. విరియు, విచ్చు.

వి. 1. విరిగినప్పుడయిన ధ్వనికి అనుకరణం. బసవ. 158పు. 13పం.; 2. విరియటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. ప్రభు. 5.157పు. 16పం; 3. గర్వం. ద్వి.సా.ర.చ 1.7పు. 9పం; అ.క్రి. 1. విశ్లథమగు, వదులగు. శృం.నై. 7.194; 2. గర్వించు. రాజవా. 4.66; 3. నిందించు, అధిపించు. సేతు. 3.93పు. 4. విజృంభించు. అచ్చ.రా. కిష్కి. 89;

క. బిర్పు, బిచ్చు. వదులగు, విశ్లథమగు, బిగు. పెద్దగు, లావెక్కు, వాచు, గర్వించు; త. వికు (వీంకి-). పెద్దగు, ఉబ్బు, దగ్గరగు, ఇరుకగు, విక్కు. (విక్క-) నిండు, బంధించు. విక్కమ్. ఉబ్బటం, లావవటం, పొంగటం, వింకు (వింకి-). అధికమగు; మ. విణ్ణుక. ఉబ్బు, పెద్దగు, పెద్దది. విక్కమ్. వాపు. (గర్వంతో) పొంగిపోవు, (పుందు మొ. వి) వాచు. విరుక్కక. ఉబ్బు, వాచు, గర్వించు; కో. విచ్-(విచ్-). పై అధికారితో అమర్యాదగా మాట్లాడు; పో.చూ. త. వికు.

**విక్కను** అ.క్రి. విక్కుమని ధ్వని కలుగు. బసవ. 185పు. 20పం. <విక్కు + అను. **విక్కవిరియు** అ.క్రి. 1. మిక్కిలి విరియు, మిగుల సంతోషించు. భాగ. 10పూ. 2.76; 2. ఒడలు విరుచుకొను, గర్వించు. చంద్రరే. 2.4.

**విగడము** విశ. వికటం. పి. శకు. 1.86.

**విగడియ** వి. గడియలో అరవయ్యోభాగం. రామాభ్యు. 8.64.

సం. విఘటికా. ఒకానొక కాలపరిమాణం; ప్రా. విఘడిఆ.

<ప్రా. విఘడిఆ.

**విగినము** వి. విఘ్నం. Hy. Arc. 18.10.

సం. విఘ్న-. అంతరాయం, అడ్డంకి, శ్రమ, కష్టం.

<సం. విఘ్న-.

**విగిరి** వి. పగుళ్ళుకల నేల.

**విగుర్వన** వి. విస్మయం, ఆశ్చర్యం. ద.హిం.కా. సంపు. 4. కా.సం. 672.

క. విగుర్వణె. భయంకర వస్తువు, ఆశ్చర్యాన్ని కలిగించే వస్తువు.

**విగుర్వించు** అ.క్రి. 1. యత్నించు. భార. ఆది. 7.178; 2. విజృంభించు. కు.సం. 2.55; 3. గర్వించు.

క. విగుర్బిసు, విగుర్విసు. భయపెట్టు, ఏదేని వస్తువును గురించి ఆశ్చర్యపరచు.

**విగ్గోరు** వి. ఒకజాతిలత. కు.సం. 8.9.

**విగ్రహపుష్టినైవేద్యనష్టి** వి. ఒడ్డూ పొడుగూఉన్న ఆకారం కలిగి పనికిరాని వాడు.

సం. విగ్రహపుష్టి-. పుష్టి అయిన ఆకారం. నైవేద్యనష్టి. దేవతాదుల నివేదనకు సంబంధించిన నష్టం.

<సం. విగ్రహపుష్టి- + సం. నైవేద్యనష్టి- (అర్థ విపరి.).

**విఘర్నదూలం** చూ. వికరణి దూలములు. వి. దూలానికి సమాంతరంగా గుజ్జులమీద వేసే చిన్న దూలం.

**విఘ్నేశ్వరచవితి** వి. భాద్రపదశుద్ధచవితి, నేతపనివాళ్ళు మగ్గం సామానులన్నీ కడిగి బొట్లుపెట్టి పూజచేసే పండుగ.

సం. విఘ్నేశ్వర-. గణపతి.

<సం. విఘ్నేశ్వర- + చవితి. (మిశ్రస.).

**విఘ్నేశ్వరపండుగ** వి. భాద్రపదశుద్ధచవితి, నేతపనివాళ్ళు మగ్గం సామానులన్నీ కడిగి బొట్లుపెట్టి పూజచేసి పండుగ చేసుకొనే రోజు.

సం. విఘ్నేశ్వర-. గణపతి.

<సం. విఘ్నేశ్వర- + పండుగ. (మిశ్రస.).

**వింగడము**[1] రూ. వింగళము[1]. విశ. 1. సుందరం. ఆము. 4.50; 2. విశాలం, విస్తృతం. ఆము. 5.4.

త. విటంకు. అందం, సౌందర్యం, విటంకన్. శరీరసౌష్టవంగలవ్యక్తి, యువకుడు, ధైర్యం, వెటిప్పు. అందం; మ. వెటిప్పు. శుభ్రత, శీవి;

పో. చూ. సం. విటంక-. చక్కని, అందమైన, సుందరమైన, విశంకటు-. విశాలమైనది, బలమైనది.

**వింగడము**[2] రూ. వింగళము[2]. విశ. 1. విపరీతమైనది. విజయ. 2.8, భోజను. 3.84; 2. వేరైనది, భిన్నమైనది.

క. వింగడ భిన్నత్వం, వేర్పాటు;

సం. విఘటన-. వేర్పాటు.

**వింగడించు** రూ. వింగళించు. స.క్రి. వేరుపర్చు. హ.స. 2.113; అ.క్రి. దుముకు. ప్రబంధ. 1.84. క. వింగడిసు. వేర్పరచు. <వింగడము[2] + -ఇంచు[3].

**వింగడించు** చూ. వింగడము[2].

**వింగళము**[1] రూ.చూ. వింగడము[1]. విశ. 1. సుందరం; 2. విశాలం.

**వింగళము**[2] రూ.చూ. వింగడము[2]. విశ. 1. విపరీతమయిన; 2. వేరైనది, భిన్నమైనది.

**వింగళించు** రూ.చూ. వింగడించు. అ.క్రి. దుముకు. ప్రబంధ. 791 ; స.క్రి. వేరుపర్చు. **వింగళింపు** వి. మల్ల బంధ విశేషం. మల్లుపు. 3.69.

**వింగళించు** చూ. వింగళము$^{2}$.

**వింగళింపు** చూ. వింగళము$^{2}$.

**విచారణ** వి. వాకబు, బోగట్టా.

సం. విచారణ-. పరీక్ష, పరిశోధన, ఆలోచన, సంశయం.

<సం. విచారణ- (అర్థవిపరి.).

**విచారణకార్యాలయము** వి. సమాచారాన్ని తెలిపే ఆఫీసు. **విచారణచేయు** స.క్రి. చర్చించు.

**విచారపడు** చూ. విచారము.

**విచారము** వి. దుఃఖం.

సం. విచార-. ఆలోచన, తలపు.

<సం. విచార- (అర్థవిపరి.).

**విచారపడు** అ.క్రి. సంతాపించు, దుఃఖించు. <విచారము+పడు. **విచారించు** అ.క్రి. 1. దుఃఖించు ; 2. కుశలమడుగు. పం. విచర్. ఆలోచించు, పరీక్షించు. <సం. విచర్+-ఇంచు$^{3}$. **విచారింపు** వి. 1. ఒక ఇంట జరిగిన మరణానికి ఆ ఇంటివారి చుట్టాలు వెళ్ళి చేసే ఓదార్పు, పరామర్శ ; 2. మందలింపు.

**విచారించు** చూ. విచారము.

**విచారింపు** చూ. విచారము.

**విచ్చ** వి. నాలుగు వేళ్ళకు చుట్టి తీసిన నూలిచుట్ట.

**విచ్చనవిడి** రూ.చూ. విచ్చలవిడి. వి. విచ్చలవిడి. తాళ్ల. సం. 4.29.

**విచ్చనవీడి** రూ.చూ. విచ్చలవిడి. వి. విచ్చలవిడి. తాళ్ల. సం. 14.64.

**విచ్చఁబాఱు** చూ. విచ్చు.

**విచ్చలవిడి** చూ. విచ్చలు.

**విచ్చలవిడిగా** చూ. విచ్చలు.

**విచ్చలు** వి. విచ్చలవిడి. అహల్యా. 1.109.

**విచ్చలవిడి** రూ. విచ్చనవిడి, విచ్చనవీడి. వి. 1. స్వేచ్ఛ. భార. విరా. 1.140 ; 2. స్వాతంత్ర్యం, స్వేచ్ఛాప్రవృత్తి. భార. శాంతి. 4.36 ; క్రి.విశే. నిరాటంకంగా. ఉ.రా. 6.276. **విచ్చలవిడిగా** క్రి. విశే. ద్రు. యథేచ్ఛగా, స్వతంత్రంగా. భార. అరణ్య. 1.363.

**విచ్చవిచ్చలు** అవ్య. యథాయథలు.

**విచ్ఛాయ** వి. రత్నదోష విశేషం.

సం. విచ్ఛాయా. వివర్ణమైన, కాంతిలేని, ప్రశస్తమైన కాంతిగల రత్నం.

<సం. విచ్ఛాయా.

**విచ్చికము** విశే. దుష్టం. పాండు. 4.239.

**విచ్చిచెప్పు** చూ. విచ్చు.

**విచ్చిపాఱు** చూ. విచ్చు.

**విచ్చిపోవు** చూ. విచ్చు.

**విచ్చిలు** చూ. విచ్చు.

**విచ్చిల్లు** చూ. విచ్చు.

**విచ్చు** రూ. విజ్జు. స.క్రి. 1. తెరచు. కు.సం. 5.48 ; 2. విరియచేయు, వ్యాపింపచేయు. కు. సం. 7.67 3. విప్పు. విడదీయు. కు. సం. 7.77 ; ; 4. వికసింపచేయు. భార. ఉద్యో. 3.207 ; 5. విడగొట్టు, తొలగించు. కాశీ. 2.53 ; 6. చీల్చు, భేదించు. భాగ. 7.249 ; 7. విడిచిపెట్టు, త్యజించు. ఆము. 2.13 ; అ.క్రి. 1. చీలు, భేదిల్లు. భార. భీష్మ. 2.394 ; 2. వికలమగు. భార. కర్ణ. 2.104 ; 3. తెరచిఉండు. కాశీ. 7.234 ; 4. (పుష్పాదులు) వికసించు. హర. 6 10 ; 5. విరియు, విడిపోవు. భాగ. 7.172 ; 6. నశించు. కాశీ. 3.180 ; 7. బద్దలగు, చీలు. భర్తృ. 1.85 ; 8. పగిలి మెత్తటి పొడిగా మారు ; 9. కొత్తకుండలు మొ. వి. నీళ్ళుపోసిన వెంటనే కాల్పు దోషంవల్ల పగిలిపోవటం ; విశే. చీలినది, విడిపోయినది, విదారితం. ఆము. 1.13 ; వి. 1. వికాసం. ఘటికా. 1.140 ; 2. ప్రత్యేకంగా ఉండే నాణెం, విచ్చురూపాయి.

క. బిర్చు, బిచ్చు. వదులగు, చీలు, విరుగు ; తు. బిచ్చు౹ని. భేదిల్లు, వదులగు. బిచ్చావుని. చీలు, విరియు ; త. విరిచల్. చీలిక, పగులు, బీటు : మ. విరిచ్చల్. చీలిక, ఖాళీ ; కువి. రిచ్కానై. చీలు, బద్దలగు.

<*విర్-చ్-.

**విచ్చఁబాఱు** రూ. విచ్చిపాఱు. అ.క్రి. విచ్చు. కలు. శ. 14. <విచ్చు+-అ$^{7}$+పాఱు$^{3}$. **విచ్చిచెప్పు** స.క్రి. విపులీకరించిచెప్పు. తాళ్ల. సం. 14.79. <విచ్చు+-ఇ$^{13}$+చెప్పు. **విచ్చిపాఱు** రూ.చూ. విచ్చఁబాఱు. అ.క్రి. విరిగిపారు. <విచ్చు+-ఇ$^{13}$+పాఱు$^{3}$. **విచ్చిపోవు** అ.క్రి. 1. పగిలిమెత్తటి పొడిగామారు ; 2. కొత్త కుండలు మొ. వి. నీళ్ళు పోసిన వెంటనే కాల్పులోపంవల్ల పగిలిపోవు. <విచ్చు+-ఇ$^{13}$+పోవు. **విచ్చిలు** రూ.చూ. విచ్చిల్లు. అ.క్రి. విడివడిపారు. హర. 6.46. **విచ్చిల్లు** రూ. విచ్చిలు. అ.క్రి. విడివడిపారు, వికసించు, విచ్చుకొను. పండి. చ. 2.3.133. **విచ్చుకత్తి** వి. ఒరదూసినకత్తి. కృష్ణరా. 3.34 **విచ్చుకుపోవు** అ.క్రి. కొత్తకుండలు మొ. వి నీళ్ళు పోసిన. వెంటనే కాల్పులోపం వల్ల పగిలిపోవు. **విచ్చుకొను** స.క్రి. 1. (పాముచుట్ట మొ. వి) విప్పుకొను. అచ్చ. రా. యు 163 ; 2. పుష్పాదులు విరియు. **విచ్చుటాకు(-ఆకు)** వి. 1. విరిసినఆకు. క్రీడ. 101 ; 2. కర్ణపత్రం, చెవ్వాకు. ఆం. భా. 2.148. **విచ్చున్మొగ్గ** రూ.చూ. విచ్చుమొగ్గ. విశే. చెల్లాచెదరైనది. విశతపతీ. 4.69; 2. విరిసేమొగ్గ ; 2. చెల్లాచెదరవటం. **విచ్చుమొగము** విశే. పటాపంచ. **విచ్చుమొగ్గ** రూ. విచ్చున్మొగ్గ. వి. 1. విరిసేమొగ్గ. ఆము. 4.123 ; 2. చెల్లాచెదరవటం. ఆము. 4.123 ; విశే. చెల్లాచెదరైనది. ఆము. 4.131. **విచ్చుమొగ్గగు(-అగు)** అ.క్రి. చెల్లాచెదరగు.

**విచ్చెనకర్ర** వి. నిచ్చెనకు రెండువైపులా ఉండే పొడుగాటి కర్ర.

**విచ్చెలు** చూ. విచ్చు. వి.బ.వ. 1. దూదిపింజలు ; 2. ఏకులు.

**విచ్చేయు** అ.క్రి. 1. (పూజ్యులు) వచ్చు. భార. అశ్వ 3.141 ; 2. (పూజ్యులు) వెళ్ళు, పోవు. ఉ. హరి. 4.7 ; 3. ప్రవేశించు. శృం. నై. 8.66 ; 4. కూర్చుండు. భాగ 1.371.

<వేంచేయు <విజయంచేయు.

**విచ్ఛాయ** వి. రత్నదోషవిశేషం. రత్న. 63పం.

సం. విచ్ఛాయా. ప్రశస్తమైన కాంతిగల రత్నం. పాలిపోయిన, వివర్ణమైన.

<సం. విచ్ఛాయా (అర్థవిపరి.).

**విజయంచేయు** రూ. విజయముచేయు. అ.క్రి. 1. పోవు, అరుగు. కు. సం. 9.27. నిర్వ.రా. 7.135 ; 2. వచ్చు, విచ్చేయు. భార విరా. 1.11.

సం. విజయ -. జయం, గెలుపు.

<సం. విజయ-.+-ము+చేయు.

**విజయముచేయు** రూ.చూ. విజయంచేయు. అ.క్రి. 1. వచ్చు విచ్చేయు. ఆము. 7.55 ; 2. పోవు, అరుగు. ఆము. 7.71.

**విజయాదూది** వి. ఒకరకం పత్తి.

**విజ్జ** రూ.చూ. విచ్చు. అ.క్రి. వ్యాపించు, ఆలముకొను. ఉ. హరి. 5.50 ; వి. తన్నుకోవటంలో అయ్యే ధ్వనికి అనుకరణం జైమినిభా. 5.192.

**విజ్జవిజ్జ** విణ. చెదరినది. **విజ్జవిజ్జగ** క్రి. విణ. ద్రు. నలినలిగా. మను. 4.85. **విజ్జవిజగఁదన్ను** స.క్రి. చితకతన్ను (ధ్వన్యను). మను. 4.58. <విజ్జ+విజ్జ+అగు+-అ[7]+తన్ను.

**విజ్జోడు** చూ. విడు.

**విజ్జోడుపడు** చూ. విడు.

**విజ్జోడువడు** చూ. విడు.

**వించు** చూ. విను[1].

**వింజకోన** చూ. వింజము.

**వింజమాఁకిడినభంగి** చూ. వింజము.

**వింజము** వి. వింధ్యపర్వతం. భార. ఉద్యో. 3.255.

సం. వింధ్య-. ఒకపర్వతం ; ప్రా. వింఝ- ; జై. మహా. శౌ. అమా. అప. వింఝ ;

క. బింజ.

<ప్రా. వింఝ-.

**వింజకోన** వి. వింధ్య పర్వతం యొక్కలోయ. ఇందు. 2.50. **వింజమాఁకిడినభంగి** అవ్య. ద్రు. దిగ్భ్రాంతితో. శృం. నై. 4.16.

**వింజామర** చూ. వెల్ల. రూ. వింజామరము. వెంజామర, వెంజివారము, వి. తెల్లనిచామరం. భార. విరా. 5.60.

సం. చామర-. చమరీమృగపుచ్ఛంవల్ల కలిగినది, వింజామర ;

త. వెణ్సామరై. తెల్లగొడుగు.

**వింజామరక్రోవి** చూ. వింజామరము.

**వింజామరము** రూ.చూ. వింజామర. వి. తెల్లనిచామరం. కాశీ. 7.124.

**వింజామరక్రోవి** వి. ఒకరకం బాణాసంచు. రాజవా. 5.61, బహుళా. 4.76. **వింజామరుటావులు** వి.బ.వ. బాణవిద్యల్లోభేదం. బహుళా. 4.92.

**వింజామరుటావులు** చూ. వింజామర.

**వింజీలి** వి. మత్స్యవిశేషం.

**విటకత్తె** వి. వ్యభిచారిణి, వలపుకత్తె. వేంక. మా. 1.136.

సం. విట-. మిండడు, జారుడు.

<సం. విట-+-కత్తె. (మిశ్ర.).

**విటకాఁడు** వి. విటుడు. ఉ. హరిశ్చ. 4.18. సురా. 107.

సం. విట-. మిండడు, జారుడు.

<సం. విట-+-కాఁడు. (మిశ్ర.).

**విటతటమార్చు** చూ. విటతటము.

**విటతటము** రూ.చూ. విటతాటనము. విణ. తారుమారు.

**విటతటమార్చు** రూ.చూ. విటతాటమార్చు. స.క్రి. 1. తుత్తుమురు చేయు. బసవ. 6.101పం ; 2. తారుమారు చేయు. బసవ. 6.193పం.

**విటతనము** మి. వి. జారత్వం. తాళ్ల. సం. 15.167.

సం. విట- జారుడు, మిండడు.

<సం. విట-+-తనము. (మిశ్ర.).

**విటతాటనము** రూ. విటతటము, విటతాటము, విటతాతము, వీటతటము, వీటతాటనము, వీటతాటను. విణ. 1. తారుమారు. భార. విరా. 5.56 ; 2. ఛిన్నాభిన్నం. జైమినిభా. 2.78.

**విటతాటమాడు** చూ. విటతాటము.

**విటతాటమార్చు** చూ. విటతాటము.

**విటతాటము** రూ.చూ. విటతాటనము. విణ. తారుమారు. వ్యత్యస్తం. రం. రా.యు. 333పు. 29పం, భార. అరణ్య. 6.82 ; వి. తుత్తుమురు. విష్ణుపు. 8.59.

**విటతాటమాడు** రూ. విటతాతమాడు. స.క్రి. 1. చెదగొట్టు పాటుచేయు. బసవ. 6.151 ; 2. తుత్తుమురుచేయు. పండి. చ. 4.200 ; 3. తారుమారు చేయు. పండి. చ. 4.205పు. 10పం. <విటతాటము+ఆడు. **విటతాటమార్చు** రూ. విటతటమార్చు. స.క్రి. పరిమార్చు, చెల్లాచెదరు చేయు. బసవ. 6.168 పం. <విటతాటము+ఆర్చు. **విటతాటముగ** క్రి. విణ. ద్రు. తారుమారుగ. భాగ. 10. 4.202. <విటతాటము+అగు+-అ[7].

**విటతాతమాడు** చూ. విటతాతము.

**విటతాతము** రూ.చూ. విటతాటనము. విణ. తారుమారు, వ్యత్యస్తం ; వి. తుత్తుమురు.

**విటతాతమాడు** రూ.చూ. విటతాటమాడు. స.క్రి. 1. తుత్తుమురుచేయు ; 2. తారుమారుచేయు. <విటతాతము+ఆడు.

**విటరాయఁడు** వి. విటశ్రేష్ఠుడు. రుక్మాం. చ. 2.126.

సం. విట-. జారుడు.

<సం. విట-+రాయఁడు. (మిశ్రస.).

**విటియ** వి. విటకత్తె, విటురాలు. కు.సం. 8.119.

సం. విటీ. విటురాలు.

<సం. విటీ.

**విటుకు** వి. విలాసం.

సం. విటు-.జారుడు, విటుక-.

<సం. విటక-.

**విటుకులాడి** వి. విటురాలు, కులుకులాడి. శుక. 2.29 <విటుకు+-లు+-ఆడి.

**విట్టము** వి. ఏర్పాటు.

**విడ(గనాడు** చూ. విడు.

**విడ(గొట్టు** చూ. విడు.

**విడ(జిమ్ము** చూ. విడు.

**విడ(జేయు** చూ. విడు.

**విడత** రూ.చూ. విడుత. వి.బ.వ. మారు, తడవ.

**విడదీసుడు** చూ. విడు.

**విడదొక్కు** చూ. విడు.

**విడనాడు** చూ. విడు.

**విడ(దన్ను** చూ. విడు.

**విడ(ద్రొక్కు** చూ. విడు.

**విడ(ద్రోచు** చూ. విడు.

**విడపలి** చూ. విడు, పులు. వి. ఇళ్ళపై కప్పేగడ్డి.

**విడపొల్లె** రూ.చూ. విడెపువల్లె. వి. తాంబూలాలు పుచ్చుకొనే టప్పుడు మగపెళ్ళివారు పెళ్ళికూతురికి పెట్టేచీర.

**విడ(బడు** చూ. విడు.

**విడ(బల్కు** చూ. విడు.

**విడ(బాయు** చూ. విడు.

**విడ(బుచ్చు** చూ. విడు.

**విడల్వడు** చూ. విడు, పడు. అ.క్రి. విడిచిపోవు. కు.సం. 11.42.

**విడవలి** వి. 1. అవురు, పిరతరం ; 2. వట్టివేరు కసువు. (Andropogon muricatum) ; 3. దర్భగడ్డి.

క. బిడిల్. ఒకమొక్కపేరు ; త. విడల్. దర్భగడ్డి ; మ. విడాల్. గడ్డిమొక్క ;

పో.చూ సం. విరణ-. వట్టివేరు.

**విడాకు** చూ. విడి.

**విడాకులిచ్చు** చూ. విడి.

**విడాకులు** చూ. విడి.

**విడి** విశ. 1. ఎర్రనిది. అరుణం. కు.సం. 9.294 ; 2. విడిపోయిన. కాశీ. 6.46 ; 3. ప్రకాశమానం. మను. 4.56 ; 4. ప్రత్యేకమైంది. సత్య. సాం. 2.29 ; 5. స్వచ్ఛం, నిర్మలం. రాధికా. 1.9 ; 6. విడువ దగింది. ఆం. భా. 2.178 ; 7. పనినుండి విడిచినది ; వి. 1. తడవ. టీకు. 4.184 ; 2. స్వచ్ఛత, నైర్మల్యం. వేంక పంచ. 3.267 ; 3. పత్తికాయలోని జడ. కళా. 8.12 ; 4. రీతి, విధం (రకం). పార్వ. 2.116, సారంగ. 3.180 ; 5. విసర్జనం. విడవటం. ఆం. భా. 2.173 ; 6. కెంపు కాంతి. ఆం.భా. 2.278 ; క్రి. విశ. ఒంటరిగా, విడిగా. ఆధ్యా. రా. అరణ్య. 90వ.

క.త. విడి. విసర్జనం, విడవటం ; త. వెటి (-ప్-, -న్ఱ్-). విటి (-ప్-, -న్ఱ్-). ఉదయించు, ప్రారంభించు. వెటియల్ వెటివు, విటి, విటియల్. అరుణోదయం. నెట్టు. శుభ్రమైన, వెట్టుమ్. కాంతి, వెట్టివిటి. అరుణోదయం ; మ. వెటిక్క ; కో. వర్తవిజ్. ఉదయం ; తె. కొసఫెర్. ఉదయమగు ; మాల్తొ. బిదై. ప్రకాశించు.

**విడాకు** రూ.చూ. వీడాకు. వి. 1. వేరైన ఆకు ; 2. భార్యాభర్తలు ఎడబాటుకోసం రాసుకున్న పత్రం. <విడి+ఆకు. **విడాకులిచ్చు** అ.క్రి. భార్యాభర్తలు తెగతెంపులు చేసుకొను. <విడాకు+-లు+ఇచ్చు. **విడాకులు** రూ.చూ. విడియాకులు. వి.బ.వ. దంపతుల వీడ్కోలు పత్రం. **విడి కచ్చతో నుండు(-ఉండు)** అ.క్రి. గోచిపెట్టుకోకుండు. కాశీ. 6.46. **విడికాలు** వి. పట్టికాలు, పాదరక్ష లేనికాలు. చంద్రాంగ. 5.127. **విడికేలు** వి. వట్టిచేయి, ఆయుధం లేనిచేయి. **విడిగోలు (-కోలు)** వి. మార్పు ; విశ. పనిలేనిది. **విడిదేఱు (-తేఱు)** అ.క్రి ప్రకాశమానమగు. వేంక. పంచ. 4.364. **విడినీరు** వి.బొ. అనా. జలం, ఏకం మొ. వాటితో కోడి పోసేనీరు. కు. సం. 8.173, ద.హిం.గా. సంపు. 4. గా. సం. 1384. **విడిపొయ్యి** వి. జంటపొయ్యి కాని ఒంటి పొయ్యి. **విడిపోవు** రూ. విడివోవు. అ.క్రి. 1. వేరగు ; 2. వదులగు. **విడిముంత** వి. దొడ్డికి వెళ్ళేటప్పుడు నీళ్ళు పట్టుకొని వెళ్ళే ముంత. **విడిమేనులు** వి.బ.వ. దిగంబర దేహాలు. సత్య. సాం. 2.29. **విడియాకులు (-ఆకులు)** రూ. విడాకులు. వి.బ.వ. భార్యా భర్తలు విడిపోయినట్లు రాసుకున్న పత్రాలు. **విడియైదువలు** వి.బ.వ. లంజలు. సత్య. సాం. 4.35. <విడి+ఐదువ+-లు. **విడివాటు** వి. 1. విడిపడటం. వైజ. 2.41 ; 2. ఏకాకిత్వం, ఒంటితనం. చంద్రాంగ. 3.60. **విడివోవు (-పోవు)** రూ.చూ. విడిపోవు. అ.క్రి. 1. వేరగు ; 2. వదులగు.

**విడిచినది** చూ. విడుచు.

**విడిచిపుచ్చు** చూ. విడుచు.

**విడిచిపెట్టు** చూ. విడుచు.

**విడిచి వాటుగుడియ** చూ. విడుచు.

**విడిచివేయు** చూ. విడుచు.

**విడిదల** చూ. విడియు.

**విడిదలపట్టు** చూ. విడియు.

**విడిదలపఱపు** చూ. విడియు.

**విడిది** చూ. విడియు.

**విడిదిపట్టు** చూ. విడియు.

**విడిపట్టు** చూ. విడియు.

**విడిపించు** చూ. విడుచు.

**విడిపిల్లి** రూ.చూ. వరిపిలి. వి. వరిమొక్క లాగా ఉండి మాగాణి నేలల్లో పెరిగేగడ్డి.

**విడిపోవు** చూ. విడు.

**విడిమట్టు** చూ. విడియు.

**విడిమట్టుచేయు** చూ. విడియు.

**విడిముడి** వి. 1. పీడినముడి. రామాభ్యు. 1.194 ; 2. ధనం. రాఘవ. పీఠి. 87.

**విడిముడిగలవా(డు (-కలవా(డు)** విశ. సంపన్నుడు. **విడిముడిగలవేల్పు** వి. ధనాధిపతి, కుబేరుడు. **విడిముడిగల వేల్పుచెలి** వి. కుబేరమిత్రుడు, శివుడు. **విడిముడిగా(డు** వి.

కుబేరుడు, ధనాధిపతి. **విడిముడిగానిసంగాతి** వి. కుబేర మిత్రుడు, శివుడు. **విడిముడిపట్టు** వి. ధనగృహం. అచ్చ. రా. సుందర. 172. **విడిమేను** వి. దెనమొలు.

**విడియ** వి. ధనం నింపేసంచి, (రొక్కం) జాలె. బసవ. 5.275 పం.

**విడియత్రెము** వి. తేగ మొ. వి. కూర్చోవటం కోసం వేటకాని చేతికి కట్టుకొనే చర్మం తొడుగు. మను. 4.56.

**విడియనాడు** చూ. విడియు.

**విడియము** రూ.చూ. విడెము. వి. తాంబూలం. కు. సం. 7.130, ద. హిం. కా. సంపు. 4. శా. సం. 939. క్రీ.శ. 1290.

**విడియించు** చూ. విడియు.

**విడియు** అ.క్రి. 1. సేనలు బసచేయు, బసచేయు. యుద్ధమల్లుని బెజవాడశాసనం. క్రీ.శ. 898. భార. ఆది. 6.227 ; 2. దండెత్తు. భార. సభా. 1.228 ; 3. (నీతి) షడ్గుణాల్లో నాలుగోదైన నానవాన్ని ఆశ్రయించు, సమయం ప్రతీక్షించు. భార. ఆశ్రమ. 1.69 ; 4. వీడిపోవు. ఉ. హరి. 1.98 ; 5. జారు. భాగ. 9.202 ; 6. ప్రవహించు. పాండు. 2.227.

క. బిడు. (బిట్ట్-). ఆగు, నిలుచు, బిడు. బసచేసే స్థలం ; తు. బూడు. భవనం ; త. విటారమ్. శిబిరం, ఇల్లు, వీటు. ఇల్లు ; మ. వీటుతి. బస. వీటు. ఇల్లు.
మూ. ద.ద్రా. *వీట్- *విట్ - వ్ -.

**విడిదల** వి. 1. సేనానివేశనం, దండుదిగినచోటు. భార. భీష్మ. 366. ; 2. విడియుచోటు. హరి. ఉ. 5.124. < విడిది + -తల. **విడిదలపట్టు** వి. తగినచోటు. రం. రా. యు. 328పు. 7పం. **విడిదలపల్లు** వి. శిబిరం. భార. ఉద్యో. 3.133. **విడిది** వి. 1. సేన బసచేసిన చోటు, శిబిరం. కు. సం. 11.51 ; 2. నివాసస్థానం, బస. ప్రబోధ. 4.44 ; 3. నివాసం, ఉనికి. కువ. చ. 1 42, విష్ణు. 7.38 ; 4. మగపెళ్ళివారు వివాహానికి తరలి వచ్చినప్పుడు ఏర్పాటుచేసిన బస. **విడిదిపట్టు** రూ.చూ. విడిపట్టు. వి. బసచేసేస్థలం. ఆము. 6.123. **విడిపట్టు** రూ. విడిదిపట్టు. వి. 1. బసచేసేచోటు, నివసించటం. పారి. 3.40 ; 2. నివాసస్థానం, విడిది. చిత్రభా. 2.126 ; 3. పేట, పల్లె. అష్టమ. క. 1.22పు. 14పం. **విడిమట్టు** వి. 1. విడిది. వీర. వి. 3.160 ; 2. కాపురం. రుక్మా. చ. 2.7 ; 3. వాసస్థానం. యయా. 2.36. **విడిమట్టుచేయు** స.క్రి. దండుదిగు, బసచేయు. **విడియనాడు** స.క్రి. విడుచు. < విడియు + - అ[7] + ఆడు. **విడియించు** స.క్రి. విడియచేయు, బసచేయించు. కు. సం. 8.85, నిర్వ. రా. 6.62. < విడియు + - ఇంచు[3]. **విడిసియుండు** అ.క్రి. విడిదిచేసియుండు. పాండు. 2.227. < విడియు + - ఇ[13] + ఉండు.

**విడిలించు** రూ.చూ. విదిలించు. స.క్రి. విడుచు.

**విడివడు** చూ. విడు.

**విడివాటు** చూ. విడు.

**విడివాటుబడియ** చూ. విడు.

**విడివేట** చూ. విడు.

**విడిసియుండు** చూ. విడియు.

**విడు** చూ. విడుచు. అ.క్రి. 1. విప్పు. కు. సం. 5.162 ; 2. పోవు, అంతమగు. కేయూ. 4.105 ; 3. వీడు, విశ్లిష్టమగు. వరాహ. 1.5 ; 4. వికసించు. రాజవా. 3.76 ; స.క్రి. త్యజించు, విడిచిపెట్టు. నిర్వ. రా. 7.60.

**విజ్జోడు** రూ. వీడుజోడు. విణ. 1. జోడుకానిది. సరిరానిది. వైజ. 1.118 ; 2. ఎడబాటు చెందింది. < విడు + జోడు. **విజ్జోడుపడు** రూ. విజ్జోడువడు. అ.క్రి. 1. భేదిల్లు, భేదపడు. క్రీడా. 1.101 ; 2. జతలు మారు. కళా. 5.46. **విజ్జోడువడు(-పడు)** రూ.చూ. విజ్జోడుపడు. అ.క్రి. భేదిల్లు, భేదపడు. కళా. 5.86. **విడగనాడు** స.క్రి. తూలనాడు. రుక్మా. చ. 4.133. < విడు + - అ[7] + ఆడు. **విడగొట్టు** స.క్రి. విడిచిపెట్టు, పరిత్యజించు. పాండు. 1.182. < విడు + - అ[7] + కొట్టు[1]. **విడజిమ్ము** స.క్రి. విడుచు. చెన్నబసవ. 1.136. < విడు + - అ[7] + చిమ్ము. **విడజేయు** స.క్రి. 1. గెంటు ; 2. విడగొట్టు. < విడు + - అ[7] + చేయు. **విడదీసుడు** చూ. తీయు. వి. కత్తిరించిన ఉన్నికి ఏరంగుకారంగు. విడదీయటం. **విడదొక్కు** రూ.చూ. విడద్రొక్కు. స.క్రి. ఒకపెద్ద పొలాన్ని విభజించి భాగస్థుల కాయ భాగాల్ని ప్రత్యేకించు. **విడనాడు** స.క్రి. 1. విడుచు, త్యజించు. విప్ర. 2.77 ; 2. పోగొట్టు. విప్ర. 3.90. < విడు + - అ[7] + ఆడు. **విడదన్ను** స.క్రి. విడగొట్టు, పోగొట్టు. పాండు. 2.85. < విడు + - అ[7] + తన్ను. **విడద్రొక్కు** రూ. విడదొక్కు. స.క్రి. విడివడ చేయు, విడుచు. < విడు + - అ[7] + త్రొక్కు. **విడద్రోచు** స.క్రి. పరిత్యజించు, విడనాడు. పాండు. 8 38, < విడు + - అ[7] + త్రోచు. **విడబడు** అ.క్రి. 1. విడవబడు. ఆం. భా. 3.116 ; 2. బరితెగు ; 3. పగిలి మెత్తటి పొడిగా మారు ; 4. (కొత్తకుండలు మొ. వి) నీళ్ళు పోసిన వెంటనే కాల్పువల్ల పగిలిపోవు ; 5. నరిచేసిన పరుగు పోగులు అర విడివిడిగా అగు. < విడు + - అ[7] + పడు. **విడబల్కు** స.క్రి. స్పష్టంగా చెప్పు. పండి. చ. 2.114పు. < విడు + - అ[7] + పల్కు. **విడబాఱు** అ.క్రి. విడివడు, విడు. నవనాథ. 1.59పు. 18పం. < విడు + - అ[7] + పాఱు[3]. **విడబుచ్చు** స.క్రి. విడుచు. బసవ. 193పు. 2పం, < విడు + - అ[7] + -పుచ్చు. **విడిపోవు** అ.క్రి. వదులు, విడివడు. < విడు + - ఇ[13] + పోవు. **విడివడు** రూ. విడువడు, విడ్వడు. అ.క్రి. 1. నిరాటంకంగా ప్రవర్తిల్లు. భాస్క. రా. యు. 444 ; 2. (తెగనుంచి) విడిపోవు, వీడిపోవు. హర. 6.16 ; 3. (నిర్బంధంనుంచి) తొలగు. భాగ. 10.274 ; 4. జారు, చిత్రభా. 2.35 ; 5. ప్రసరించు. జాహ్న. 4.21 ; 6. తెరవబడు. వైజ. 2.84 ; 7. బయలుపడు. విజయ. 2.141. < విడు + - ఇ[13] + పడు. **విడివాటు** వి. 1. ఏకాకిత్వం, ఒంటరితనం. చంద్రాంగ. 3.60 ; 2. విడిపడటం. వైజ. 2.41.

**విడివాటుబడియ** వి. విడిచివాటు గుడియ. కవిక. 4.94. **విడివేఁట** వి. వేగవేట. యయా. 2.23, కళా. 3.76. **విడుగడ** వి. విడుదల, విముక్తి. నిర్వ. రా. 7.12, **విడుగర** వి. విడుదల, విమోచనం. భార. శాంతి. 3.206. **విడుజట్టుగొను** అ.క్రి. 1. ప్రత్యేకమైన అమ్మకం సరకుగా కొను. కు. సం. 7.74 ; 2. విడువడు. **విడుజోడువాఁడు** విశే. విడిచిపెట్టే స్నేహితుడు. తాళ్ల. సం. 7.258. **విడుదల** వి. విమోచనం. విడుపు. వరాహ. 9.10. **విడుదాకు(-తాఁకు)** వి. విడిపోవటం. **విడుమర** రూ. విఢ్మఱ. వి. 1. ఎడబాటు, వియోగం. కు. సం. 5.73 ; 2. విడుదల, విముక్తి. భార. విరా. 1.49. **విడువడు (-పడు)** రూ.చూ. విడివడు. అ.క్రి. విడివడు, బయల్పడు. భీమ. 4.61. **విఢ్మఱ** రూ.చూ. విడుమర. వి. విముక్తి. ద. హిం. శా. సంపు. 10. శా. సం. 177. క్రీ.శ. 1171. **విడ్వడు** రూ.చూ. విడివడు. అ.క్రి. 1. నిరాటంకంగా ప్రవర్తిలు ; 2. విడిపోవు ; 3. తొలగు ; 4. జారు ; 5. బయల్పడు. **విడ్వఱచు** స.క్రి. తారుమారుచేయు, మార్చు. సిం. ద్వా. 11.56. <విడు+పఱచు.

**విడుగు** అ.క్రి. వికసించు. శుక. 1.235.

కొడ. బొడి. వికసించు ; త. వెటి (-వ్వ్-,-త్త్-). విరియు, వికసించు, విటు (విట్ట్-), వికసించు, విడుగు.

<మూ. ద్రా. *విట్-.

**విడుచు** రూ. విడ్చు. స.క్రి. 1. దానంచేయు. తెరాలశాసనం. క్రీ.శ. 678 ; 2. త్యజించు, వదులు. భార. ఆది. 1.43 ; 3. (బాణాదుల్ని) ప్రయోగించు. కాశీ. 3.190 ; 4. విడువచేయు, విడిపించు, త్యజింపించు, హరి. 2.107 ; 5. పంపు. జైమినిభా 1.76 ; 6. ఇది కొన్నిచోట్ల విశేషార్థం లేకుండానే క్త్వాంతానికను ప్రయుక్తమవుతుంది. జాహ్న. 1.116 ; 7. పండిన పత్తిని కాయలనుంచి ఒలుచు ; అ.క్రి. 1. విడుచు. భార. ఆది. 6.90 ; 2. ఎడతెగు. ఆము. 5.58 ; 3. ఊడలు, కొమ్మలు మొ. వి పుట్టు. చంద్రాంగ. 3.24.

క. బిడు. విసరివేయు, విడుచు, విడిచిపెట్టు ; తు. బుడుపిని. విడుచు, వదలిపెట్టు, పంపించు, ప్రదర్శించు, దూరంగాపంపు ; త. విటు (విట్-, ట్-). వేరుచేయు, (విటు-ట్ట్-.). దూరంగాపంపు, వేరుచేయు ; మ. వితుక. వేరుచేయు, వదులగు, వితుక్క. వేరుచేయు ; వదులగు, వితుక్క. వేరుచేయు ; కో. విడ్-. (విత్-). విడుదల చేయు, విడుచు ; తొ. పిడ్. (పిత్-). విడుదలచేయు. పిడ్‌జ్-. (పిడ్‌జ్). విడుదలచేయు ; గోం. బిడ్స్. వదలిపెట్టు, మానుకొను, విసర్జించు ; కుఇ. విహా. ముగియు, నూర్పిడిలో పంటను వేరుచేయు ; కురు. బిడ్డ్. సంవత్సరంలో జమాఖర్చుచేయు, వెనుకకుఇచ్చు ; మాల్తొ. బిడర్. విడదీయబడు. బిడ్‌ర్‌త్. విడదీయు, బ్రా. బిత్. విసరివేయు.

<మూ.ద్రా. *విట్.

విడిచినది విశే. 1. భర్తచే విడువబడిన జారిణి ; 2. సిగ్గువిడిచిన స్త్రీ. విడిచిపుచ్చు స. క్రి. వదులు, త్యజించు. <విడుచు+-ఇ[13]+-పుచ్చు. విడిచిపెట్టు స.క్రి. వదులు, పీలు. శృం. నై. 2.8. విడిచివాటుగుదియ వి. సాగు, భిండివాలం, ముప్పైరెండాయుధాల్లో ఒకటి. విడిచివేయు స.క్రి. మగణ్ణి వదలిపెట్టు. <విడుచు+-ఇ[13]+వేయు. విడిపించు యా. విడ్పించు. స.క్రి. విడువచేయు, వదిలించు. భార. సభా. 1.214 <విడుచు+-ఇంచు[3]. విడుపరి వి. త్యాగశీలుడు. <విడువు+-అరి. విడుపరితనము వి. త్యాగం. ఈవి. యయా. 5.159. విడుపు రూ. విడ్పు. వి. 1. విడవటం, త్యజించటం. కు. సం. 7.69 ; 2. త్యాగం, దానం. భార. శాంతి. 4.37 ; 3. దిగుమతి. విజ్ఞా. ప్రా. 86 ; విశే. త్యక్తం, విడువబడింది. అష్టమ. క. 1.14. విడువముడువఁగలుగు అ.క్రి. సంపన్నుడగు. వేంక. పంచ. 2.92. <విడుచు+-అ[7]+ముడుచు+-అ[7]+కలుగు.

**విడుత** రూ. విడత. వి. విడత, పర్యాయం, తడవ. జాహ్న. 4.116.

**విడుపరి** చూ. విడుచు.

**విడుపరితనము** చూ. విడుచు.

**విడుపు** చూ. విడుచు.

**విడుంబడ్లు** రూ.చూ. విడుంబళ్లు. వి.బ.వ. ఉచిత వేతనాలు, బహుమానాలు.

**విడుంబళ్లు** రూ. విడుంబడ్లు. వి.బ.వ. ఒకానొక విధమైన పన్ను. ద. హిం. శా. సంపు. 10. శా.సం. 65. క్రీ.శ. 1568.

**విడువముడువఁగలుగు** చూ. విడుచు.

**విడువలవేలము** వి. తగనిది, అంతులేనిది. కళా. 7.19.

**విడెంకసుము** చూ. విడెము.

**విడెపువల్లె** చూ. విడెము.

**విడెమిచ్చు** చూ. విడెము.

**విడెము** రూ. విడియము, విడ్యము, వీడియము. వీడెము, వీడ్యము. వి. తాంబూలం. కు.సం. 4.96.

సం. విటక, విటికా, విటి-. తాంబూలం ; ప్రా. విడిఅ, బిడగం, బిడి. బీడీ ;

క. విళయ, విళిగె, విళె, విళియ, విళ్య ; తు. విళె, విళ్య ; త. విటికై, విడైయం ; మ. విటిక.

<ప్రా. వీడిఅ.

విడెంకసుము వి. సారెకు పెట్టే రవికలగుడ్డ. విడెపువల్లె రూ. విడపొల్లె, విడెమొల్లె. వి. తాంబూలాలు పుచ్చుకొనేటప్పుడు మగపెళ్ళివారు పెళ్ళికూతురికి పెట్టే చీర. <విడెము+ఒల్లె. విడెమిచ్చు అ.క్రి. తాంబూలమిచ్చు. హంస. 2.45. <విడెము+ఇచ్చు. విడెముపెట్టు అ.క్రి. మనువ నిశ్చయంచేయు, పెళ్ళి నిశ్చయంచేయు. విడెముసేయు(-చేయు) అ.క్రి. తాంబూలం వేసుకొను. హంస. 5.141. విడెమొల్లె యా. విడెపువల్లె. వి. తాంబూలాలు పుచ్చుకొనేటప్పుడు మగపెళ్ళివారు పెళ్ళికూతురికి పెట్టే చీర. <విడెము+ఒల్లె.

**విడెమొల్లె** చూ. విడెము.

**విడ్చు** రూ.చూ. విడుచు. స.క్రి. విడచేయు. భార. సభా. 2.231.

విడ్పించు రూ.చూ. విడిపించు. స.క్రి. విడుపచేయు. వదిలించు. రాఘవ. 3.117. విడ్పు రూ.చూ. విడుప. వి. విమోచనం. భార. అను. 1.210. విడ్వఁబడు(-పడు) అ.క్రి. విడువబడు. సీతారా. 1.53. <విడ్చు+-అ[7]+పడు.

**విద్ధూరము** వి. 1. ఉపద్రవం. పల్నా. 338పం; 2. మౌర్ఖ్యం; విశే. మూర్ఖం.

సం. విడ్వర-. ఉపద్రవం; ప్రా. విడ్డర-విడ్డిర-ఆటోపం, ఆడంబరం;

క. విడూర, విడ్డూర. ద్వేషం; తు. విడూర, విడ్డూర. ఆటంకం.

<ప్రా. విడ్డర-.

**విడ్పించు** చూ. విడ్చు.
**విడ్పు** చూ. విడ్చు.
**విడ్మఱ** చూ. విడు.
**విడ్యము** రూ.చూ. విడెము. వి. తాంబూలం. వరాహ. 1.14.
**విడ్వడు** చూ. విడు.
**విడ్వఁబడు** చూ. విడ్చు.
**విడ్వఱచు** చూ. విడు.
**విణాలు** వి.బ.వ. ఒకానొక పరిమాణం. ద. హిం. గా. సంపు. 7. గా. సం. 734. క్రీ.శ. 1228.
**వింట** చూ. విను[1].
**వింటాలము** రూ. వింటీళము. వి. మల్లబంధ విశేషం. ముప్పై రెండు విన్నాణాల్లో ఒకటి. హంస. 1.206, మల్లు. 3.69.
**వింటికొన** చూ. విల్లు.
**వింటికోల** చూ. విల్లు.
**వింటిగాలితెగులు** చూ. విల్లు.
**వింటిజోదు** చూ. విల్లు.
**వింటితెరువరి** చూ. విన్ను.
**వింటితెర్వరి** చూ. విన్ను.
**వింటిపడుము** చూ. విల్లు.
**వింటినారి** చూ. విల్లు.
**వింటిపట్టు** చూ. విల్లు.
**వింటిపసి** చూ. విన్ను.
**వింటిపెట్టు** చూ. విల్లు.
**వింటిప్రోల్సామి** చూ. విన్ను.
**వింటిబద్ద** చూ. విల్లు.
**వింటిబ్రద్ద** చూ. విల్లు.
**వింటిమాట** చూ. విన్ను.
**వింటిమానికము** చూ. విన్ను.
**వింటిరాసి** చూ. విల్లు.
**వింటిలిబ్బ** చూ. విల్లు.
**వింటివాఁడు** చూ. విల్లు.
**వింటిసికదేవర** చూ. విన్ను.
**వింటసికవేలుపు** చూ. విన్ను.
**వింటిసికవేల్పు** చూ. విన్ను.
**వింటీళము** రూ.చూ. వింటాలము. వి. మల్లబంధవిశేషం, ముప్పైరెండు విన్నాణాల్లో ఒకటి.

**విండు** రూ.చూ. విందు. వి. అతిథిసత్కారం.
**విండ్లమ్ములాట** చూ. విల్లు.
**విండ్లవారు** చూ. విల్లు.
**విండ్లు** చూ. విల్లు.
**విత** రూ. వితా. విశే. వ్యర్థం. అచ్చ.రా. బాల. 50, శరా. 3.73.

సం. వృథా. నిరర్థకమైన; ప్రా. విధా, విహా;

క. వితె. పనికిమాలిన.

<సం. వృథా.

**వితవితగ** క్రి. విశే. ద్రు. వృథాగా. శుక. 2.138.

**వితండము** వి. 1. మూర్ఖం; 2. పెడర్థం.

సం. వితండ-. శుష్కవాదం, కోపాన్ని పుట్టించే, వితర్క, స్వపక్ష స్థాపనలేని పరపక్ష నిరాకరణ రూప. వాదం.

<సం. వితండ- (అర్థవిపరి.).

**వితమరి** చూ. వితము.

**వితము** వి. 1. విధం. ఘటికా. 2.124; 2. ఉపాయం. ఉ.రా. 7.181.

సం. విధ- రీతి, ప్రకారం; ప్రా. విహ-.

<సం. విధ-.

**వితమరి** వి. 1. కార్యదక్షుడు. కార్యపద్ధతినెరిగినవాడు. పౌలమరి. అప్ప 4.327; 2. వ్యవహర్త. <వితము+-అరి.

**వితా** రూ.చూ. విత. విశే. వ్యర్థం చంపూరా. 2.84.

**వితావిత** విశే. మిక్కిలి వ్యర్థం. శరా. 2.20; క్రి. విశే. మిక్కిలి వ్యర్థంగా. హంస. 4.113.

**వితాకు** వి. 1. సంతాపం. ఘటికా. 1.14; 2. పరాకు. యయా. 5.22; 3. పారవశ్యం. శరా. 2.78; 4. నిశ్చేష్టత; 5. స్ఖాలిత్య; విశే. 1. పరవశుడు. విజయ. 1.138; నిశ్చేష్టితుడు, నిశ్చేష్టితురాలు. ఇలా. 3.

సం. వ్యథాక-. బాధ, భయం, నష్టం; ప్రా. విధక్క-, విత్థక్క-.

<ప్రా. విథక్క-.

**వితాకుఁడు** వి. నిశ్చేష్టితుడు. వేంక. పంచ. 4.103

**వితాకుపడు** అ.క్రి. నిశ్చేష్టితుడగు. సిం.ద్వా. 3.21.

**వితాకురాలు** వి. నిశ్చేష్టితురాలు. సారంగ. 3.153. <వితాకు+-ఆలు. **వితాకులవిత్తు** వి. సంతాపబీజం, పరితాపకారణం. విష్ణుపు. 2.229.

**విత్త[1]** వి. చిహ్నం. ద్వి. పరమ. వి. 3.642పు.

**విత్త[2]** వి. చాలా చిన్నగోనె, విష్ణుపు. 6.24.

సం. విస్త-, విస్తా. బంగారపుతూనిక; ప్రా. విత్థ-.

<ప్రా. విత్త-.

**విత్తరఁగు** చూ. విత్తు
**విత్తనంకుండ** చూ. విత్తనము.
**విత్తనము** వి. 1. విత్తు, బీజం. దశా. 5.100; 2. టెంక; 3. బొక్కబుర్ర; 4. పిచ్చు, పిచ్చె.

గోం. వితానా; కొలా వితనమ్. బీజం, గింజ, విత్తనం; నా. వితనమ్. గింజ, విత్తనం, బీజం.

విత్తనంకుండ వి. జొన్నలు, సజ్జలు మొ. విత్తనాలుగింజలు పోసిపెట్టటానికి వాడే మట్టిపాత్ర. విత్తనాలకట్ట వి. గడ్డి వెంటిలో ఇముడ్చిన విత్తనాలకట్ట, ముడికట్ట.

**విత్తనాలకట్ట** చూ. విత్తనము.

**విత్త్రించు** చూ. విత్తు.

**విత్తిరు** చూ. విత్తు.

**విత్తు** వి. విత్తనం. కు.సం. 1.49 ; స.క్రి. (విత్తనాలు) చల్లు. బసవ. 1.261పం.

క. బిత్తు. విత్తనాలుచల్లు ; తు. బిత్తుని, బుత్తుని విత్తనాలుచల్లు ; త. విత్తు. (విత్తి-), విచ్చు (విచ్చి-). విత్తనాలు చల్లు, వ్యాపింపచేయు, వెదజల్లు, వితై. విత్తనాలుచల్లు, విత్తనం ; మ. విత్తు. విత్తనం, బీజం, వెతిక్క. విత్తనాలునాటు, విత్తు. వితర్. బీజం ; కో. విత్- (విత్తె-). విత్తు ; తొ. పిత్ - (పిత్తె-) ; గో. వీత్ ; కొం. విత్. వెదజల్లు ; పర్జి. విత్-. - విత్తనాలుచల్లు ; కొలా. విత్ -. ; గ. విత్. విత్తనాలుచల్లు. మాల్తో. బిచి. విత్తనం.

మూ.ద్రా. *విత్-/*విచ్-.

**విత్తఱగు** అ.క్రి. సమూలనాశనమగు. భాస్క.రా.యు. 733. <విత్తు+అఱగు. **విత్తించు** స.క్రి. విత్తనంనాటించు. వేంక. పంచ. 5.13. <విత్తు+-ఇంచు[3]. **విత్తిరు** అ.క్రి. విత్తుచల్లు. విష్ణుపు. 5 130. <విత్తు+ఇరు. **విత్తుపట్టు** వి. వి. సస్యాలు ఫలించే పొలం, బీజావాపక్షేత్రం. ద.హిం.గా. సంపు. 4. గా.సం. 1255. **విత్తుపూజ్యము** వి. చల్లిన విత్తనాలుకూడ పండక పైరు ఎండిపోవటం. **విత్తుమాల్చు** స.క్రి. చంపు, కడతేర్చు. పి.శకు. 2.15. **విత్తుమీదటిపాల్లు** వి. అస్థిరం. శాఙ్గ.సం 11.3.116. **విత్తుమొదలు** వి. మూలకందం. ఆము. 3.66. **విత్తులల్కు** అ.క్రి. విత్తనాలుచల్లు. బసవ. 7.205. <విత్తు+-లు+అల్కు. **విత్తెరువాడు** విశ. విత్తనాలు వేసేవాడు.

**విత్తెరువాడు** చూ విత్తు.

**విదలించు** రూ.చూ. విదిలించు. అ.క్రి. విదుల్చు, రాల్చు.

**విది** వి. అదృష్టం.

సం. విధి-. కర్మ, కర్తవ్యం, ఆచారం ; ప్రా. అమా. విహి ;

క. బిది ; తు. బిది, బిదియ.

<సం. విధి-.

**విదిక్కుపడు** అ.క్రి. దిగ్భ్రమచెందు. సిం.ద్వా. 4.70.

సం. విదిక్. మూల, రెండుదిక్కులమధ్యభాగం.

<సం. విదిక్+పడు.

**విదితము** విశ. యుక్తం, తగినది. కుచే. 1.112.

సం. విదిత -. తెలుపబడిన, ప్రసిద్ధికెక్కిన.

<సం విదిత -. (అర్థవిపరి).

**విదియ** వి. నెలలోని పక్షంలో రెండో తిథి. భార. అను. 3.161.

సం. ద్వితీయా. రెండవ ; ప్రా. దుఇఅ-, దుఇజ్జ-, దుఈఅ, బీఅ ; జై.మహా. దుఇయ-, బిఇఅ-, బీయ-, విఇయ-, మాశా. దుదిఅ- ;

క. బిదిగె, బిదియె ; తు. బిదిగె ; త.తువితియై.

<సం. ద్వితీయా.

**విదిరించు** చూ. విదురు.

**విదిలించిపారవేయు** చూ. విదులు.

**విదిలించు** చూ. విదిలు.

**విదిలించుకొను** చూ. విదులు.

**విదిల్చు** చూ. విదులు.

**విదురు** రూ.చూ. విదులు. స.క్రి. 1. విడుచు, త్యజించు ; అ.క్రి. రాలు.

**విదిరించు** రూ.చూ. విదిలించు. స.క్రి. 1. జాడించు ; 2. దులుపు, 3. పోగొట్టు ; 4. వదల్చుకొను. <విదురు+-ఇంచు[3]. **విదురుచు** రూ.చూ. విదుచు స.క్రి. 1. విదిలించు, దులుపు. మయా. 4.28 ; 2. దులిపి పడవైచు. పరచు ; 3. రాల్చు 4. విరుచు ; 5. చిమ్ము, విసరు. **విదురుపు** రూ.చూ. విదుల్పు. వి. కదల్చటం ; స.క్రి. విదుల్చు, విదిలించు. **విదుర్చు** రూ.చూ. విదుచు. స.క్రి. 1. దులుపు. భార. ఆది. 7.43 ; 2. జాడించు. భార. అను. 4.107 ; 3. జల్లుకొను. భార. ఆశ్వ. 1.42 ; 4. చలింపచేయు. భాస్క.రా.యు. 940 ; 5. ఒసగు, ఇచ్చు, భీమ. 1.31 ; విదలించు. వసు. 1.123 ; 7. ప్రసరింపచేయు. బహుళా. 2.13 ; 8. తొలగించు, తోసి వేయు. దశా. 3.145. **విదుర్పు** రూ.చూ. విదుల్పు. వి. కదల్చటం. భార. ద్రోణ. 4.232 ; స.క్రి. రాల్చు, దులుపు.

**విదుర్చు** చూ. విదురు.

**విదుర్పు** చూ. విదురు.

**విదులు** చూ. విదుచు. రూ. విదురు. స.క్రి. విడుచు, త్యజించు. కృష్ణ.శ. 23 ; అ.క్రి 1 రాలు ; 2. చెదరు.

**విదిలించి పారవేయు** స.క్రి. జాడించి పారవేయు. <విదిలించు+-ఇ[13]+పారవేయు. **విదిలించు** రూ. విడిలించు, విదలించు, విదిరించు. స.క్రి. 1. జాడించు, కదుగు, శుభ్రంచేయు. బసవ. 4.970 ; 2. విదుల్చు, దులుపు. విక్ర. 2.18 ; 3. చలింపచేయు. వరాహ. 10.60 ; 4. విదుర్చు, పోగొట్టు. శుక. 3.187 ; 5. వదల్చుకొను. దశా. 5.24. <విదులు+-ఇంచు[3]. **విదిలించుకొను** స.క్రి. దులుపుకొను, కదలించుకొను. పాండు. 4.297. **విదిల్చు** రూ.చూ. విదుల్చు. స.క్రి. విదులచేయు, దులుపు. శుక. 1.234. **విదులుచు** రూ.చూ. విదుల్చు. స.క్రి. 1. దులుచు. హరి.ఉ. 10.255 ; 2. ప్రసరింపవేయు, 3. రాల్చు ; 4. దులుపు. **విదులుపు** రూ.చూ. విదుల్పు. వి. విదిలించటం, విక్షేపణం. **విదుల్చు** రూ. విదులుచు. స.క్రి. 1. రాల్చు. రం.రా.యు. 315పు. 23పం ; 2. దులుపు. గౌ.హరి.పూ. 420పం ; 3. ప్రసరింపచేయు. రసిక. 4.52 ; 4. దులుచు. **విదుల్చుకొను** స.క్రి. దులుపు. కు.సం 3.69. **విదుల్పు** రూ. విదురుపు, విదుర్పు, విదులుపు. వి. విదిలించటం. విక్షేపణం. భీమ. 4.60 ; స.క్రి. రాల్చు, దులుపు.

**విదుల్చు** చూ. విదులు.

**విదుల్చుకొను** చూ. విదులు.

**విదుల్పు** చూ. విదులు.

**విద్దియ** రూ.చూ. విద్దె వి. **1.** చదువు ; **2.** దంభవాక్యం, బడాయి ; **3.** మాయ.

**విద్దియము** రూ.చూ. విద్దెము. వి. పాపలు తొలిసారి లేచి నిలబడటం.

**విద్దె** రూ. విద్దియ. వి. **1.** దంభవాక్యం, బడాయి. బసవ. 5.105పం ; **2.** చదువు. రం.రా. బాల. 21పం. 4పం ; **3.** మాయ. చంద్రరే. 2.128.

నం. విద్యా. చదువు, శాస్త్రజ్ఞానం, కళ, మంత్రం ; ప్రా. విజ్జా ; అ.మా.పా. విజ్జా :

క. బిజ్జ, బిజ్జె, విద్దె : త. విచ్చై, వి__ ; మ. విచ్చ.

<నం. విద్యా.

**విద్దెలాడు** అ.క్రి. గారడీ విద్యలు చేయు, ప్రగల్భాలు పలుకు, స్వోత్కర్ష చెప్పుకొను, దంభోక్తులాడు. బసవ. 5.127. <విద్దె+-లు+ఆడు. **విద్దెలు** వి.బ.వ. **1.** కెరటాలు ; **2.** డాబులు.

**విద్దెము** రూ. విద్దియము. వి. పాపలు తొలిసారి నిలబడటం. ఇందు. 2.17, బాస్క. రా.యు. 63.

నం. విద్యా. చదువు, జ్ఞానం, ఇంద్రజాలనైపుణ్యం ; త. విచ్చై ; మ. విచ్చ.

<నం. విద్యా.

**విద్యమంత్రులు** వి.బ.వ. అంగరంగ భోగాల పని చేసేవారు. ద.హిం శా. సంపు.5. శా.నం. 1204. క్రీ.శ. 1297.

నం. విద్యావత్. చదువుకొన్నవారు.

<నం. విద్యావత్+-లు.

**విద్యాక్షత్రము** వి. బ్రాహ్మణ నత్రం. ద.హిం.శా.సంపు. 5. శా.నం. 1342.

నం. విద్యా. చదువు.

<నం. విద్యా+సత్రము. (కృతకప్రామాణిక, శబ్ద సంపుటి).

**విద్రుచు** రూ. విదురుచు విదుర్చు. స.క్రి. **1.** విదిలించు, దులుపు. భార ఆది. 6 185 ; **2.** దులిపి పడవైచు, పరచు. భార. ఆది. 7.223 ; **3.** చిమ్ము, వినరు. కేయూ. 2 2 ; **4.** రాల్చు. ఉ.హరి. 4.109 ; **5.** విరుచు. శృం. నై. 6.120.

క. బిదిర్. వెదజల్లు, విదుల్చు. వ్యాపింపచేయు ; త. వితిర్(ప్పు-, -త్-). వెదజల్లు, విసరివేయు ; మ. వితఱుక. వెదజల్లు ; కో. విద్- (విదై-). (దోసిళ్ళత) నీళ్ళుచల్లు ; కుఇ. వితి. వెదజల్లబడిన ; కురు. బిద్రానా. చెల్లాచెదరగు, అంతటా వ్యాపించు ; మాల్తొ. బిద్రె. చెల్లాచెదరగు ; పో.చూ.త. విత్తు.

**విధించు** రూ. విధియించు. స.క్రి. ఏర్పరచు, నియమించు, ఏర్పాటుచేయు. భార.శాంతి. 3.442.

నం. విధి -. చేయటం, రీతి, ; ప్రకారం, సృష్టి, బ్రహ్మ, నడవడి.

<నం. విధి-+-ఇంచు[3] (అర్థవిపరి.).

**విధియించు** రూ.చూ. విధించు. స.క్రి. ఏర్పరచు, నియమించు, ఏర్పాటుచేయు.

**విధివిరామములేక** అవ్య. నిర్విరామంగా.

నం. విధి –. రీతి, నడవడి, ప్రవర్తన. విరామ-. అవకాశం, సమాప్తి.

<నం. విధి-+నం. విరామ-+-ము+లేక.

**వినకపోవు** చూ. విను[1].

**వినకరి** చూ. విను[1].

**వినని** చూ. విను[1].

**వినవికనని** చూ. విను[1].

**వినవివాఁడు** చూ. విను[1].

**వినపము** రూ.చూ. విన్నపము. వి. మనవి. ప్రబంధ. 165.

**వినమి** చూ. విను[1].

**వినఁబడు** చూ. విను[1].

**వినఁబాటు** రూ.చూ. విన్నబాఁటు. వి. విన్నబాటు, దిగులు, విచారం. భీమ. 4.99.

**వినవచ్చు** చూ. విను[1].

**వినాకమయ్యపండుగ** రూ. వెనకయ పండుగ. వి. వినాయక చవితి పండుగ, భాద్రపదశుద్ధచవితినాడు నేతపనివారు మగ్గం సామానులన్నీ కడిగి బొట్టుపెట్టి పూజ చేసుకొనే పండుగ.

నం. వినాయక -. గణపతి.

<నం. వినాయక+అయ్య+పండుగ.

**వినాయకచవతి** రూ.చూ. వినాయకచవితి. వి. గణపతిచవితి నేతపనివాళ్ళు మగ్గం సామానులన్నీ కడిగి బొట్టుపెట్టి పూజ చేసుకొనే పండుగ.

**వినాయకచవితి** రూ. వినాయకచవతి, వినాయకచవుతి, వినాయకచౌతి, వినాయకసవితి, వినాయకసౌతి, వెనక చవితి. వి. గణపతిచవితి, నేతపనివాళ్ళు మగ్గం సామాను లన్నీ కడిగి బొట్టుపెట్టి పూజచేసుకొనే పండుగ.

నం. వినాయక - గణపతి.

<నం. వినాయక-+చవితి. (మిశ్రన.).

**వినాయకచవుతి** రూ.చూ. వినాయకచవితి. వి. గణపతిచవితి. నేతపనివాళ్ళు మగ్గం సామానులన్నీ కడిగి బొట్టుపెట్టి పూజ చేసుకొనే పండుగ.

**వినాయకచౌతి** రూ.చూ. వినాయకచవితి. వి. గణపతిచవితి, నేతపనివాళ్ళు మగ్గం సామానులన్నీ కడిగి బొట్టుపెట్టిపూజ చేసుకొనే పండుగ.

**వినాయకపీఠం** వి. ఇంట్లో మగ్గం అమర్చుకొన్న చోట గోడకు తగిలించిన విఘ్నేశ్వరుడి బొమ్మ.

నం. వినాయకపీఠ –. విఘ్నేశ్వరుడి పీట.

<నం. వినాయకపీఠ- (అర్థవిపరి.).

**వినాయకసవితి** రూ.చూ. వినాయకచవితి. వి. గణపతిచవితి, నేతపనివాళ్ళు మగ్గం సామానులన్నీ కడిగి బొట్టుపెట్టి పూజ చేసే పండుగ.

**వినాయకసౌతి** రూ.చూ. వినాయకచవితి. వి. గణపతిచవితి, నేతపని వాళ్ళు మగ్గంసామానులన్నీకడిగి బొట్టుపెట్టిపూజ చేసుకొనేపండుగ.

**వినాయింపు** రూ.చూ. మినహాయింపు. వి. తప్పించటం.

**వినికత్తు** విశ. బలమైన.

వినిక చూ. విను[1].
వినికిమిగులు చూ. విను[1].
వినికగలవాఁడు చూ. విను[1].
వినికిడి చూ. విను[1].
వినికిడిసేయు(-చేయు) చూ. విను[1].
వినికలి చూ. విను[1].
వినికిసేయు చూ. విను[1].
వినిచెవుడుమగనిగ్రుడ్డి చూ. విను[1].
వినినట్లుచెప్పు చూ. విను[1].
వినినంతవట్టు చూ. విను[1].
వినిపించు చూ. విను[1].
వినిపించుకొను చూ. విను[1].
వినియువినములుగాఁజేసికొను చూ, విను[1].
వినివినమి చూ. విను[1].
వినీవిననట్లుండు చూ. విను[1].
వినీవినమి చూ. విను[1].

**విను**[1] స.క్రి. ఆకర్ణించు. భార. ఆది. 1.418.

త. విణా, విణావు, అడుగు, విను, కనిపెట్టు, ఆలకించు. విణా. ప్రశ్న ; మ. విణవుక. అడుగు ; కో. వెంత్- అడుగు ; తో. పింత్- అడుగు ; గో. వంకానా. కుఇ. వెన్బ. విను, ప్రశ్న ; కొం. వెన్. విను ; కువి. మెజలి. విను, అడుగు ; నా. విన్-. విను ; గ. వెన్-. విను ; కురు. మెన్నా. విను, శిరసావహించు ; మాల్తొ. మెనె. విను ; బ్రా. బినింగ్. విను.

<మూ.ద్రా. *విన్.

వించు రూ. చూ. విన్చు. అ.క్రి. వినవచ్చు, వినబడు. భార. సభా. 2.31. వింట వినటం. సారంగ. 2.238. వినకపోవు స.క్రి. పెడచెవినిపెట్టు. వినకరి వి. వినికిడి. వినని విశే. వినబడని. విననికవని విశే. అరుదైన. హంస. 1.49. వినవివాఁడు విశే. చెవిటివాడు. వినమి వి. వినకుండటం. భార. శల్య. 1.69. వినఁబడు అ.క్రి. వినిపించు. భార. ఆది. 7.25. <విను[1]+-అ[7]+పడు. వినవచ్చు అ.క్రి. వినబడు. ఆము. 4.85. <విను[1]+-అ[7]+వచ్చు. వినికి రూ.చూ. విన్కి. వి. 1. శ్రవణం. భార. ఆశ్రమ. 2.133. 2. శ్రుతి. తాళ్ల. సం. 9.91. వినికిమిగులు అ.క్రి. శ్రవణేంద్రియాతీతమగు, అగోచరమగు, ఎప్పుడూ విననిదగు. బసవ. 6.161. వానికిగలవాఁడు (-కలవాఁడు) విశే. పెద్దల దగ్గర మంచి చెడ్డావిన్నవాడు. భాగ. 1.112. వినికిడి వి. 1. పుకారు ; 2. విన్నది ; 3. అనేకవిషయాల్ని విని తెలుసుకొని ఉండటం ; 4. ఇంపు. వినికిడిసేయు (-చేయు) స.క్రి. 1. వినిపించు ; 2. పుకారుపుట్టించు. వినికలి వి. వినికిడి. వినటం. వినికిసేయు(-చేయు) స.క్రి. 1. వినిపించు. దశా. 2.260 ; 2. పుకారుపుట్టించు. వినిచెవుడుమగనిగ్రుడ్డి వి. చెవులుండు వినవివాడు, కన్నులుండి చూడనివాడు, అధికారగర్వితుడు. కుచే. 2.28. వినినట్లుచెప్పు స.క్రి. యథారీతిగా చెప్పు. కళా. 2.178. వినినంతవట్టు(-పట్టు) వి. విన్నదంతా, పూర్తిగా. కళా. 4.176. వినిపించు స.క్రి. వినచేయు, చెప్పు, తెలియజేయు. భార. శాంతి. 4.340 ; అ.క్రి. వినవచ్చు, శ్రుతిగోచరమగు వినబడు, వినుచు. దశా. 2.400. <విను[1]+-ఇంచు[3]. వినిపించుకొను స.క్రి. 1. చెప్పిందివిను ; 2. చెప్పింది చేయు. వినియువినములుగాఁజేసికొను స.క్రి. వినీవిననట్లు పోవు. రాధా. 1.9. వినివినమి వి. అలక్ష్యం. శుక.చ. 4.51, సారంగ. 2.78. వినీవిననట్లుండు అ.క్రి. తనకు పట్టనట్లుండు. వినీవినమి అవ్య. వినీవినకముందే, విన్నత డవుగా. జైమినిభా. 4.116. వినుకలి రూ. విన్కలి. వి. 1. వినికి. హరి. ఉ. 3.8 ; 2. కీర్తి. అచ్చ. భా. 1.6 ; 3. శ్రోత్రేంద్రియం, చెవి ; 4. వలపు. వినుకలికంటి వి. చక్షుశ్శ్రవం. పాము. వినుకలిబేటము వి. వినగా కలిగిన ప్రేమ, వినుకలి. కు.సం. 5.74. వినుకొను స.క్రి. విను. పాండు. 2.4. వినుచు అ.క్రి. వినవచ్చు, వినబడు. భార. ఆది. 4.104 ; స.క్రి. వినజేయు, వినిపించు. అచ్చ.రా. ఆరణ్య. 15. వినుపించు రూ.,చూ. వినిపించు. స.క్రి. వినచేయు. భీమ. 1.13 ; అ.క్రి. వినవచ్చు, వినబడు. ఆం. భా. 3.110. విన్కలి రూ.చూ. వినుకలి. వి. 1. వినికి ; 2. కీర్తి ; 3. శ్రోత్రేంద్రియం. చెవి. విన్కి రూ. వినికి. వి. వినటం. భార. విరా. 5.363. విన్చు రూ. వినుచు. అ.క్రి. వినవచ్చు. భార. ఆది. 5.138. విన్నవినుకలు వి.బ.వ. చెప్పుడుమాటలు తాళ్ల. సం. 1.19 విన్పించు రూ.చూ. వినిపించు. స.క్రి. వినచేయు. భార. అను. 1.261.

**విను**[2] రూ.చూ. మిన్ను. వి. ఔ. ఆకాశం. వి.క. 2.12.

వినుకెంపు వి. సూర్యుడు, నభోమణి. ఉ.రా. 1.16. వినుచూలి రూ.చూ. విన్నుచూలి. వి.గాలి. ఆం.భా. 1.56. వినుజాలు వి. ఆకాశగంగ. చెన్నబసవ. 3.52. వినుజుట్టుదేవర వి. శివుడు సాంబ. దేవ. 3. వినుటెంకి వి. స్వర్గం. అచ్చ.రా. సుం. 3.52. వినుతిరివేల్పు వి. ముక్కంటి, శివుడు. వినుతెరువరి రూ. విను తెర్వరి. వి. గగనచరుడు, దేవుడు. <విను[2]+తెరువు+-అరి. వినుతెర్వరి రూ.చూ. వినుతెరువరి. వి. గగనచరుడు, దేవుడు. వినుత్రోవ వి. ఆకాశమార్గం. ఉ.రా. 2.170. వినుద్రిమ్మరి(-త్రిమ్మరి) రూ.చూ. విన్నుద్రిమ్మరి. వి. దేవత, ఖేచరుడు. అచ్చ.రా. అయోధ్యా. 13. వినుపలుకు రూ. వినుపల్కు. వి. వింటిమాట, ఆకాశవాణి. వినుపల్కు. రూ.చూ. వినువలుకు. వి. వింటిమాట, ఆకాశవాణి. వినుప్రోలు రూ. విన్నుప్రోలు, విన్ప్రోలు. వి.ఔ. స్వర్గం. ఉ.రా. 4.245. వినుప్రోల్దొర వి. ఇంద్రుడు, వేల్పు ప్రభువు. <విను[2]+ప్రోలు+దొర. వినుమనుమఁడు రూ. వినుమన్మఁడు, విన్నుమనుమఁడు. వి. 1. ఆకాశ క్షేత్రుడు, హనుమంతుడు. అచ్చ.రా. కిష్కిం. 62 ; 2. భీముడు. వినుమన్మఁడు రూ.చూ. వినుమనుమఁడు. వి. 1. హను మంతుడు ; 2. భీముడు. వినుమానికము వి. సూర్యుడు. నభోమణి వినుమిటారి వి. 1. దేవత. సాంబ. దేవ. 18 ; 2. అప్సర, దేవవేశ్య వినుమ్రాను వి. ఔ. కల్పవృక్షం. అచ్చ.రా. సుం. 34. వినురతనము వి. నభోమణి. సూర్యుడు. అచ్చ.రా.యు. 2.38. వినువలను రూ.చూ.

విన్వలను. వి. స్వర్గం. వినువా(క రూ.చూ. విన్నువాంక. వి. ఆకాశగంగ. రాజవా. 1.37. వినువా(కతాలుపు రూ. వినువాంకతాల్పు, విన్వాంకతాలుపు. విన్వాంకతాల్పు. వి. శివుడు, గంగాధరుడు. వినువా(కతాల్పు రూ.చూ. వినువాంక తాలుపు. వి. శివుడు, గంగాధరుడు. వినువా(కతోఁ బుట్టువు రూ. విన్వాంకతోఁబుట్టువు. వి. శూద్రుడు. వినువా(కబిడ్డడు రూ. విన్వాంకబిడ్డఁడు. వి. గాంగేయుడు. భీష్ముడు. వినువా(కమోపరి రూ. విన్వాంకమోపరి. వి. శివుడు, గాంగేయుడు. వినువా(డు విశ. శ్రోత. వినువారల మానికము వి. చింతామణి. ఆం. పదా. సుర. 27 వినువీడు రూ. విన్వీడు వి. స్వర్గం. చంపూరా. 4.83. వినువీది రూ. విన్వీది. వి. ఆకాశవీథి, ఉప్పరం. వినుసికతుపాసి రూ. వినుసిగతుపాసి, విన్సికతుపాసి, విన్సిగ తుపాసి. వి. వ్యోమకేశుడు, శివుడు. వినుసికదయ్యము రూ. వినుసిగదయ్యము, విన్సికదయ్యము, విన్సిగదయ్యము. వి. వ్యోమకేశుడు, శివుడు. వినుసికదునీఁడు రూ. మినుసిగ దునీఁడు, మిన్సికదునీఁడు, మిన్సిగదునీఁడు. వి. వ్యోమ కేశుడు, శివుడు. వినుసికదేవర రూ. వినుసిగదేవర, విన్సిక దేవర, విన్సిగదేవర. వి. వ్యోమకేశుడు, శివుడు. రామాభ్యు 1.7. వినుసిగతుపాసి రూ.చూ. వినుసికతుపాసి. వి. వ్యోమకేశుడు, శివుడు. వినుసిగదయ్యము రూ.చూ. వినుసికదయ్యము. వి. వ్యోమకేశుడు, శివుడు. వినుసిగ దునీఁడు. రూ.చూ. వినుసికదునీఁడు. వి. వ్యోమకేశుడు, శివుడు వినుసిగదేవర రూ.చూ. వినుసికదేవర. వి. వ్యోమ కేశుడు, శివుడు. విన్నది వి. ఆకాశనది. సారంగ. 2.177. సం. నదీ. ఏరు. <విను² + సం. నదీ. విన్ప్రోలు రూ.చూ. వినుప్రోలు. వి.ఔ. స్వర్గం. విన్వలను రూ. విను వలను, విన్నువలను. వి. స్వర్గం. భార. అను. 1.216. విన్వా(క రూ.చూ. విన్నువాంక. వి. ఆకాశగంగ, మందాకిని. విన్వా(కతాలుపు రూ.చూ. వినువాంకతాలుపు. వి. గంగాధరుడు, శివుడు. విన్వా(కతాల్పు రూ.చూ వినువాంక తాలుపు. వి. గంగాధరుడు, శివుడు. విన్వా(కతోఁబుట్టువు రూ.చూ. వినువాంకతోఁబుట్టువు. వి. శూద్రుడు. విన్వా(క బిడ్డడు రూ.చూ. వినువాంక బిడ్డఁడు. వి. గాంగేయుడు. భీష్ముడు. విన్వా(కమోపరి రూ.చూ. వినువాంకమోపరి. వి. గాంగేయుడు, భీష్ముడు. విన్వీడు రూ.చూ. వినువీడు. వి. స్వర్గం విన్వీది రూ.చూ. వినువీది. వి. ఆకాశవీథి విన్సికతుపాసి రూ.చూ. వినుసిక తుపాసి. వి. వ్యోమ కేశుడు, శివుడు. విన్సికదయ్యము రూ.చూ. వినుసిక దయ్యము. వి. వ్యోమకేశుడు, శివుడు. విన్సికదునీఁడు రూ.చూ. వినుసికదునీఁడు. వి. వ్యోమకేశుడు, శివుడు. విన్సికదేవర రూ.చూ. వినుసికదేవర. వి. వ్యోమకేశుడు, శివుడు. విన్సిగతుపాసి రూ.చూ. వినుసికతుపాసి. వి. వ్యోమకేశుడు, శివుడు. విన్సిగదయ్యము రూ.చూ. వినుసిక దయ్యము. వి. వ్యోమకేశుడు, శివుడు. విన్సిగదునీఁడు రూ.చూ. వినుసికదునీఁడు. వి. వ్యోమకేశుడు, శివుడు. విన్సిగదేవర రూ.చూ. వినుసికదేవర. వి. వ్యోమకేశుడు, శివుడు.

వినుతి వి. ప్రసిద్ధి.

సం. వినుతి-. స్తుతి. పొగడ్త.

<సం. వినుతి- (అర్థవిపరి.).

వినుతికినెక్కు రూ. వినుతికెక్కు. అ.క్రి. పేరుకెక్కు. భార. భీష్మ. 3.267. <వినుతి + -కున్ + ఎక్కు. వినుతికెక్కు రూ.చూ. వినుతికినెక్కు. అ.క్రి. ప్రసిద్ధిచెందు. హంస. 1.24 వినుతిసేయు(-చేయు) స. క్రి. పొగడు. నిరంకు. 4.131.

వినోదకా(డు మి. వి. వేడుక కలవాడు. శాక్ష. సం. 10.171.

సం. వినోద-. వేడుక, ఆట, ఆనందం.

<సం. వినోద- + కాఁడు. (మిశ్ర.).

వినోలా వి. లేతబూడిదరంగు.

ఇం. Vanilla. వృక్షవిశేషం. దీనినుంచి లభించే సుగంధం.

<ఇం. Vanilla.

విన్కలి చూ. విను¹.

విన్కి చూ. విను².

విన్చు చూ. విను.¹

వింత చూ. విందు. విశ. **1**. ఆశ్చర్యకరం. భార. ఆది. 1.130 ; **2**. అపూర్వం. కొత్తది. భార. విరా. 1.245 ; **3**. అన్యుడు. భాస్కరా. యు. 2.388 ; **4**. అరుదు. కళా. 6.217 ; వి. **1**. ఆశ్చర్యం. భార. ఆది. 7.59 ; **2**. సొగసు, అందం. పారి. 2.14 ; **3**. వినోదం. కవిరాజ. 5.237 ; **4**. అపూర్వవిషయం. ఉ. రా. 2.4 ; **5**. అద్భుతకార్యం. నీలా. 1.101 ; **6**. చమత్కారం. దశా. 1.11.

వింతకజ్జము వి. పరిహాసం. దశా. 7.278. వింతకా(డు వి. ఆశ్చర్యకరుడు, వైజ. 4.14. వింతతనము వి. భేదం, అన్యత్వం. హరి. పూ. 1.170. వింతపడు అ.క్రి. వెరగొందు. వింతరాలు విశ. అన్యురాలు. భాగ. 6.225. <వింత + ఆలు. వింతలుసేయు(-చేయు) స.క్రి. ఆశ్చర్యం కలిగించు. విచిత్రమగు. ఉ. హరి. 1.80. వింతలేని యావులింత వి. కారణంలేని కార్యం. పి. శకు. 2.87. వింతవా(డు విశ. **1**. అన్యుడు, పరుడు, భార. సభా. 1.176 ; **2**. కొత్తవాడు. కళా. 4.25. వింతవిందులు వి.బ.వ. విచిత్ర బంధువులు. ఉ.హరి. 1.151.

విందిచ్చు చూ. విందు.

విందు రూ. విండు. వి. **1**. ఆతిథ్యం. కు.సం. 9.128 ; **2**. విందుభోజనం. భార. ఉద్యో. 4.339 ; **3**. చుట్టం, బంధువు. భార. ద్రోణ. 3.275 ; **4**. అతిథి. మను. 2.46 ; విశ. సంతోషం, ప్రియం. హర. 5.47.

క. బిర్దు, బిద్దు. విందు, భోజనం, బిద్దిన, బిద్దున. అతిథి, పెళ్ళిబంధువు ; తు. బిన్నె. చుట్టం, బంధువు, అతిథి ; త. విరున్తు. విందు, అతిథి, కొత్తవ్యక్తి, కొత్తదనం, మ. విరున్ను. వినోద కార్యక్రమం, విందు. అతిథి ; కో. విద్-అ.ల్. (పండుగ సందర్భంగా) ఒక గ్రామంనుంచి ఇంకో గ్రామానికి వచ్చే వ్యక్తి ; గోం. వర్తోల్. అతిథి ; కుఇ. బ్రౌంజు. కొత్తవ్యక్తి.

**విందిచ్చు** అ.క్రి. విందుచేయు, పండుగభోజనం పెట్టు. కు. సం. 9.128. <విందు+ఇచ్చు. **విందుకుపిలుచు** స.క్రి. భోజనానికి పిలుచు. **విందువచ్చు** అ.క్రి. అతిథిగా వచ్చు. హర. 1 19. **విందుపురుగు** రూ.చూ. విందుపురువు. వి ఒకజాతి సాలెపురుగు. **విందుపురువు** రూ. విందుపురుగు. వి. ఒకజాతి సాలెపురుగు. ఆం.భా. 2.87. **విందుపెట్టు** స.క్రి. మర్యాదగాపిలిచి భోజనంపెట్టు, పండుగచేయు. పారి. 2.49. **విందులువిందులు** వి. బ.వ. చిన్నపిల్లల్ని ఎత్తుకోవటానికి రమ్మని పిలిచేటప్పుడు అనేమాట. కళా. 6.201. **విందుసేయు(-చేయు)** అ.క్రి. ఆహుతిచేయు, ఆహారంగా ఇచ్చు. ఉ.హరి 1.176.

**విన్న** రూ.చూ. విన్నన. విశ. వివర్ణమైనది, కాంతిహీనమైన. నిర్వ.రా. 8.40.

**విన్నఁదనము(-తనము)** వి. 1. వైవర్ణ్యం. కకుత్స. 2.45; 2. దైన్యం. యయా. 4.139, కళా. 7.236. **విన్నఁబడు(-వడు)** అ.క్రి. దైన్యపడు, ఖేదపడు, పారి. 4 61. **విన్నఁబాటు(-పాటు)** రూ. వినఁబాటు. వి. 1. విన్నబడటం, వైవర్ణ్యం. హరి. ఉ. 8.144; 1 విషాదం. దుఃఖం. భాస్క.రా. అయోధ్యా. 135. **విన్నఁబాఱు(పాఱు[3])** అ.క్రి. వెలవెలపోవు, వికాసంచెందు. కు.సం. 6.8. **విన్నఁబుచ్చు(-పుచ్చు)** స.క్రి. వివర్ణంగాచేయు, అవమానపరుచు, ఒన్నబుచ్చు. శృం.నై. 7.88 **విన్నఁబోవు(-పోవు)** రూ. విన్నవోవు. అ.క్రి. 1. క్షీణించు. కాశీ. 6.86; 2. దైన్యంపొందు. శివరా. 2.17; 3. న్యూనమగు. తక్కువగు. పి.శకు. 4.17; 4. వివర్ణమగు. మను. 3.86. **విన్నవోవు(-పోవు)** రూ.చూ. విన్నఁబోవు. అ.క్రి. ఒల్లబోవు. చిన్నబోవు.

**విన్నగరము** వి. విష్ణుదేవాలయం. ద.హిం.కా. సంపు. 5. కా. సం. 66

సం. విష్ణు-. వెన్నుడు, నగర-. పట్టణం.

**విన్నగరు** చూ. విన్నగరము. వి. విష్ణుదేవాలయం.

**విన్నది** చూ. విను[2].

**విన్నన** రూ. విన్న. వి. వైవర్ణ్యం, కాంతిహీనం. భార. సభా. 2.311.

సం. భిన్న-. భేదించబడ్డది. వికీర్ణ-. చెదరిన, విడిపోయిన, చల్లబడిన.

<సం. భిన్న-.

**విన్ననువు** రూ. విన్నాణము. వి. 1. నేర్పు. కు.సం. 11.95. భార. శాంతి. 4.176; 2. విధం, రీతి. ఉ. హరి. 6.108.

సం. విజ్ఞాన-. జ్ఞానం, తెలివి, నైపుణ్యం, లౌకిక జ్ఞానం; ప్రా. విణ్ణాణ-, విన్నాణ-. సద్భేద; అ.మా. విణ్ణాణ-, విన్నాణ-;

క. బిన్నణ, విన్నాణ, విన్నాణ. విజ్ఞానం,

<ప్రా. విన్నాణ-.

**విన్నందు** చూ. విన్ను.

**విన్నపత్రిక** చూ. విన్నపము.

**విన్నపము** రూ. వినపము. వి. 1. మనవి. భార. అరణ్య. 3.13; 2. విజ్ఞాపనం, పఠించటం, బోధించటం. ద. హిం. కా. సంపు.5. కా. సం. 674. క్రీ.శ. 1620.

సం. విజ్ఞాపన-. నివేదనం, విజ్ఞాపనం; ప్రా. విన్నప్ప-, విణ్ణవ-, విన్నవ-, విన్నవణ-, విజ్ఞాపన-; అ.మా. విణ్ణవణ-, విన్నవణా;

క. బిన్నహ, బిన్నప, బిన్నహ; తు. బిన్నయ, బిన్నహ; త. విణ్ణపమ్.

<ప్రా. విన్నప్ప-.

**విన్నపత్రిక** వి. విజ్ఞాపన పత్రిక. భల్లా. 4. సం. పత్త్రికా. పత్రం. <విన్నపము+పత్రిక. **విన్నవించు** అ.క్రి. మనవిచేయు, విజ్ఞాపించు. భార. విరా. 1.217.

**విన్నవించు** చూ. విన్నపము.

**విన్నవినుకలు** చూ. విను[1].

**విన్నాణము** రూ.చూ. విన్ననువు. వి. 1. మల్లబంధం. భార. విరా. 2.15; 2. ఒప్పిదం, రమ్యత. భార. ద్రోణ. 2.203; 3. నేర్పు. ఉ.హరి. 1.8; 4. సామర్థ్యం, శక్తి. హరిశ్చ. 4.76; విశ 1. సమర్థమైనది, శక్తం. భాగ. 10.17; 2. అందమైనది, సుందరం. శకు. 1.1.

**విన్నాణి** వి. సన్యాసి. విజ్ఞా. ప్రాబా. 87; విశ. 1. సమర్థుడు. భాగ. 2.16; 2. నేర్పరి. చిత్రభా. 8.124, పాండు. 4.77. సం. విజ్ఞానిన్. **విన్నాణించు** అ.క్రి. సుందరమగు, ఒప్పిదమగు. అష్టను. క. 4.187పు. 3పం.

**విన్నాణి** చూ. విన్నాణము.

**విన్నాణించు** చూ. విన్నాణము.

**విన్నావ** చూ. విన్ను.

**విన్ను** రూ.చూ. మిన్ను. వి.బొ. ఆకాశం. వరాహ. 9 88. భీమ. 2.48.

**వింటితెరువరి** రూ.చూ. వింటితెర్వరి. వి. గగనచరుడు, దేవత. **వింటితెర్వరి** రూ. వింటితెరువరి. వి. దేవత. గగనచరుడు, వేల్పు. ఉ.రా. 5.208. <విన్ను[1]+-ఇ[3]+ తెరువు+-అరి. **వింటిపసి** వి. కామధేనువు. <విన్ను[2] +-ఇ+పసి. **వింటిప్రోల్సామి** వి. ఇంద్రుడు. **వింటిమాట** వి. ఆకాశవాణి. వినుపలుకు. <విన్ను[2]+-ఇ[3]+మాట. **వింటిమానికము** వి. ద్యుమణి, సూర్యుడు. **వింటిసికదేవర** వి. వ్యోమకేశుడు, శివుడు. **వింటిసికవేలుపు** రూ.చూ. వింటిసికవేల్పు. వి. వ్యోమకేశుడు, శివుడు. **వింటిసికవేల్పు** రూ. వింటిసికవేలుపు. వి. వ్యోమకేశుడు, శివుడు. **విన్నందు** అ.క్రి. విజృంభించు. కకుత్స. 4.111. <విన్ను+అందు. **విన్నావ** వి. గంగానది. అచ్చ.భా.విరా. 3·37పు. <విన్ను+అవ. **విన్నుకేళాకులి** వి. ఆకాశగంగ, సురదీర్ఘిక. అచ్చ.రా.యు. 154. **విన్నుగిడి** వి. కామధేనువు, వేల్పుటావు. **విన్నుచూలి** రూ. వినుచూలి. వి. వాయువు. అచ్చ. రా. సుం. 169. **విన్నుద్రిమ్మరి (-త్రిమ్మరి)** రూ. వినుద్రిమ్మరి. వి. దేవత, ఆకాశంలో సంచరించేవాడు. అచ్చ. రా. బాల. 6. **విన్నుప్రోలు** రూ.చూ. వినుప్రోలు. వి. బొ. స్వర్గం. **విన్నుమనుమఁడు** రూ.చూ. వినుమనుమఁడు. వి. హనుమంతుడు. అచ్చ. రా. యు. 211. **విన్నుమూలదేవర** వి. మిను సికదయ్యం, శివుడు. అచ్చ.రా.బాల. 129. **విన్నువలను** రూ.చూ. విన్నువలను. వి. స్వర్గం. **విన్నువాఁక** రూ.

వినువాఁక, విన్వాఁక. వి. మిన్నేరు, ఆకాశనది. రామాభ్యు. 1-97. విన్నువెలుఁగు వి. సూర్యుడు. యయా. 4.61. విన్నేటికాలువ వి. ఆకాశగంగ ద్వి. పరమ. వి. 3.191 పు. <విన్ను+ఏఱు+-ఇ[3]+కాలువ. విన్నేటితాలుపు రూ.చూ. విన్నేటితాల్పు. వి. గంగాధరుడు, శివుడు. విన్నేటితాల్పు రూ. విన్నేటితాలుపు. వి. శివుడు, గంగాధరుడు. యయా. 2.63. విన్నేఱు వి. ఔ. ఆకాశగంగ. యయా. 1.91.

విన్నేటికాలువ చూ. విన్ను.

విన్నేటితాలుపు చూ. విన్ను.

విన్నేటితాల్పు చూ. విన్ను.

విన్నేఱు చూ. విన్ను.

విన్పించు చూ. విను[1].

వి[న్రో]వ్వలు చూ. విను[2].

విన్వలను చూ. విను[2].

విన్వాఁక చూ. విను[2].

విన్వాఁకతాలుపు చూ. విను[2].

విన్వాఁకతాల్పు చూ. విను[2].

విన్వాఁకతోఁబుట్టువు చూ. విను[2].

విన్వాఁకబిడ్డఁడు చూ. విను[2].

విన్వాఁకమోపరి చూ. విను[2].

విన్వీడు చూ. విను[2].

విన్వీది చూ. విను[2].

విన్సికతుపాసి చూ. విను[2].

విన్సికదయ్యము చూ. విను[2].

విన్సికదునీఁడు చూ విను[2].

విన్సికదేవర చూ. విను[2].

విన్సిగతుపాసి చూ. విను[2].

విన్సిగదయ్యము చూ. విను[2].

విన్సిగదునీఁడు చూ. విను[2].

విన్సిగదేవర చూ. విను[2].

విపణములు వి. బ. వ. [ద్రవ్యనూచి, ఒకవిధమైన నాణేలు. [క్రీ.శ. 1302. శ.గా. 1.151.

సం. విపణ-. అమ్మకం. చిన్నవ్యాపారం.

<సం. విపణ-+-ము+-లు (అర్థవిపరి.).

విపరి వి. మారకం, వినిమయం.

సం. విపరి. చుట్టూఉన్న.

<సం. విపరి. (అర్థవిపరి.).

విపరిదస్తావేజు వి. వినిమయ దస్తావేజు.

విప్ప రూ. ఇప్ప[2]. వి. పొట్టిగా నిటారుగా ఉండే బోదె, నున్నగా దళసరిగా బూడిదరంగులో ఉండే బెరడు కలచెట్టు. (Isonandra Candollena, Man).

విప్పగు చూ. విప్పు.

విప్పల్కము వి. కొంతవింత, విడ్డూరం.

విప్పారు చూ. విప్పు.

విప్పిచెవ్వు చూ. విప్పు.

విప్పు చూ. విచ్చు. వి. 1. వైశాల్యం. కు. నం. 2.77 ; 2. ఆధిక్యం. హరి.ఉ. 2.158 ; 3. విరియటం, విడిపోవటం. ఆము. 4.153 ; విణ. 1. [శ్రేష్ఠం, ఉత్తమం. కావ్యా చూ. 4.100 ; 2. గొప్పది, పెద్దది. భోగినీ ; 3. అధికం. [ప్రబోధ. 4.38 ; 4. విశాలం ఆము. 1.111 ; స.[క్రి. 1. విడదీయు, విరివిచెందించు. భోజ. 2.116 ; 2. [ప్రకటించు. భాగ. 7.218; 3. విడేటట్లుచేయు. ఆము. 1 62 ; 4. వికసింప చేయు, విరియించు.విజయ. 1.5 ; 5. విడగొట్టు. దశా. 5.46 ; 6. కమానుతో దూది పింజె పింజెలుగా విప్పుకొనేటట్లుచేయు ; అ.[క్రి. 1. వికసించు, విరియు. సిం.ద్వా. 1.3 . 2. విరియు, విరివిచెందు, ఆము, 4.12 ; 3. విరిసిపారు, చెదరిపారు. వసు. 6.45.

క. *బిరి* వికసించు, విరియు, విచ్చుకొను. *బిచ్చు*, *బిర్చు*. విడిపోవు, విచ్చుకొను, వికసించు, *బిరిను*, *బిరుకు*, *బిరవు*. *బిరువు*. చీలిక, చీలు, పగులు, కొడ *బిరి*-(బిరివ్-బిరిగ్-). (పనసపండు) విప్పు, విడిదీయు, (ఇల్లు మొ. వాటిని) పడగొట్టు, తు. *బిరియుని*. వ్యాపించు, విస్తృ. చెందు, *బిర్కని*, చెదరు, చెల్లాచెదరు, *బిచ్చుని*. విచుతికొను, వికసించు, విడు, *బిచ్చావ్రుని*, విడు, విరియు. చీలు, *బిచ్చాటు*, విడిపోవు, పగులు, *బిచ్చెలు*. విరుగు, పగుల్చు త. *విరి* (-వ్-,-ట్-). విరియు, వికసించు, వ్యాపించు, విచ్చుకొను, *విరిచల్*. విడు, చెదరు, *విరిప్పు*. విడు. వికసించు, *విరివ్రు*. విస్తరణం, విస్తృతి ; మ. *విరియుక*, విస్తృతిచెందు, విరియు, వికసించు, *విరి*. వికసించిన. విరిసిన, *విరిచ్చల్*. చీలిక, ఖాళీ, *విరివు*. విస్తృతి, విరివి; వైశాల్యం, *విరిక్క*. వికసించు, విరియు ; తో. *పిరై*. (జుట్టు) విడదీయు, (సంచి, గొడుగు మొ. వాటిని) విప్పు ; కుఇ. *[వింగ* ([వింగి-). ముక్కలగు, చెదరు, *[బింగి [బంగి* ఇన్బ. చెల్లాచెదరగు, ముక్కలగు, *[విప*. పడగొట్టు, పగలగొట్టు, చింపు, *[విప్క*. ముక్కలుచేయు, విడగొట్టు ; కువి. *రింగలి*. విప్పు, *రిఖలి*. చుట్టవిప్పు, *రికనై*. మడతవిప్పు ; పర్జి. *విరిజ్*, సడలు, బిగిసడలు, ; కురు. *బె[రనా*. (సాగదీయటంవల్ల) ఆకారంలో మార్పుఉంది.

< మూ.[ద్రా. *విర్ +- ప్పు.

విప్పగు విణ. విశాలమైన. <విప్పు+ఆగు. విప్పారు అ.[క్రి. 1. విరివిచెందు, విస్తరిల్లు, కావ్యా. చూ. 2,47 ; 2. వికసించు. వసు. 5.100. విప్పిచెవ్వు స.[క్రి. వివరించు. గా.హరి.పూ. 770. <విప్పు+-ఇ[13]+చెప్పు. విప్పగంటి వి. ఱెరగంటి, అనిమిషుడు. ఘటికా. 1.88. <విప్పు+కన్ను+-ఇ.[15] విప్పగండ్లవడవా వి. కుమారస్వామి, దేవసేనాపతి. విప్పగా విణ.[క్రి. విస్తారంగా. <విప్పు+అగు+అ[7]. విప్పచఱచు అ.[క్రి. విరివిచెందు. హరి.పూ. 6.177. విప్పఱెప్పలతేఁడు వి. ఇం[ద్రుడు. సాంబ. దేవ. 11. విప్పవాఱు(-పాఱు[3]) అ.[క్రి. వికసించు. కృ.శత. 1.71. విప్పసేయు(-చేయు) స.[క్రి. బహుళంగాచేయు, అధికంగాచేయు, శృం. నై. 7.187.

వి[ప్రవినోదివర్తన వి. పన్నుసూచి. ద.హిం.శా.సంపు. 16. శా.సం. 182. [క్రీ.శ. 1552.

వి[ప్రవినోదులు వి.జ.వ. ఉద్యోగసూచి. గారడీ విద్యగాళ్ళుగా ఉండే [బ్రాహ్మణులు. ద.హిం.శా. సంపు.16. శా.సం. 156.

క్రీ.శ. 1547.

సం. విప్రవినోదిన్. బ్రాహ్మణులకు కాలక్షేపం కలిగించేవాడు.

<సం. విప్రవినోదిన్ + -లు.

**విబూది** వి. భూతి, బూది. ఆం.భా. 1.48.

సం. విభూతి-. బూడిద ; ప్రా. విభూఇ ;

క. ఇబత్తి, ఈబూతి, ఊబత్తి.

<సం. విభూతి-.

**విబూదిపండు** వి. బూడిదపండు. **విబూదిపత్రి** వి. వృక్ష విశేషం (Ocinum basilicum).

**విబ్బెట్టు** వి. జుగుప్సితం.

**విభూతిగైకొను (-కైకొను)** అ.క్రి. భోజనానికి వచ్చిన ఆహ్వానాన్ని అంగీకరించు. బసవ. 7.203.

సం. విభూతి-.బూడిద.

**విభూతిపండు** వి. విబూదిపండు, బూడిదపండు.

సం. విభూతి-. బూడిద.

<సం. విభూతి + -పండు (మిశ్రస.).

**విభూతిపెట్టు** అ.క్రి. భూత పిశాచాదులు సోకకుండాను, వాటి బాధ తొలగి పోయేట్టుగాను మంత్రించిన విభూతిని నుదుట పెట్టు. హంస. 3.122.

సం. విభూతి-. బూడిద.

**విభూతియొసఁగు (-ఒసఁగు)** అ.క్రి. భోజనానికి చెప్పు, భోజనానికి పిలిచేటప్పుడు శైవులు విభూతిని ఇచ్చి పిలిచే పద్ధతిపై వచ్చిన పలుకుబడి. హర. పీఠి. 14.

సం. విభూతి-. బూడిద.

**విమానము** వి. గర్భగుడిపైన నిర్మింపబడ్డ శిఖరం. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 1351.

సం. విమాన-. దేవతలు ఆకాశంలో తిరగటానికు ఉపయోగించే రథవిశేషం, ఏడంతస్తులమేడ.

<సం. విమాన— + -ము. (అర్థవిపరి.).

**వియ్యంకుఁడు** చూ. వియ్యము.

**వియ్యంకురాలు** చూ. వియ్యము.

**వియ్యపురాలు** చూ. వియ్యము.

**వియ్యపువిందు** చూ. వియ్యము.

**వియ్యపుసాని** చూ. వియ్యము.

**వియ్యమందు** చూ. వియ్యము.

**వియ్యము** రూ. వీయము. 1. చుట్టం. నిర్వ.రా. 1.58 ; 2. వియ్యంకుడు. భార. విరా. 5.365 ; 3. వియ్యపురాలు. గశకు. 12.25; 4. చుట్టరికం, భాగ.9.401. 5. వినయం, కృశకు. 1.14 ; 6. వైవాహిక సంబంధం, సీమం. 3.49.

సం. వివాహ-.పరిణయం, పెళ్ళి, వైవాహిక- ; పెళ్ళి సంబంధించిన ; ప్రా. విఆహ-పెళ్ళి, వేవాహిఅ. సంబంధి. వివాహ సంబంధి ; అ.మా. వీఇ. సంబంధం, చుట్టరికం. బిఅం. జోడు, యుగ్మం ; పా. వివాహ ; నే. బిహా, పరిణయం ; అ. బియా. వివాహం ; బెం. వేహాఈ, బేహాఇ వేయాఇ. వైవాహికం, బేఇ. వియ్యంకుడు : వం. బియాహ్ ; విఆహ ; గు. వేవజ ; మరా. ఇవాయీ వ్యాహీ. వియ్యంకుడు ;

క. బీగ, బియ్యగ. వైవాహిక బంధువ (వివాహబంధం వల్ల ఏర్పడిన చుట్టం), బీగతన. వైవాహికబంధుత్వం ; తు. బీగె. వైవాహిక బంధువ, బీగతన. వైవాహిక చుట్టరికం.

<ప్రా. విఆహ.

**వియ్యంకుఁడు** రూ. వియ్యముకాఁడు. వి. వియ్యం పొందినవాడు, పెళ్ళికుమార్తె తండ్రి, పెళ్ళికుమారుడి తండ్రి ఒకరికొకరు వియ్యంకులు. క్రీడా. 248, ఆం.భా. 2.114. **వియ్యంకురాలు** వి. వియ్యపురాలు, పెళ్ళికుమార్తె తల్లి పెళ్ళికుమారుడి తల్లి పరస్పరం వియ్యంకురాళ్ళు అవుతారు. **వియ్యపురాలు(-ఆలు)** రూ.చూ. వియ్యంపురాలు. వి. వియ్యంకురాలు. **వియ్యపువిందు** వి. చుట్టాలకి సంబంధించిన విందు. తాళ్ళ. సం. 15.213. **వియ్యపుసాని** రూ.చూ. వియ్యంపుసాని. వి. వియ్యంకురాలు. **వియ్యమందు** అ.క్రి. 1. వైవాహిక సంబంధం చేయు. భార.అరణ్య. 7.194 ; 2. సామ్యంపొందు. భాస్క. రా. యు. 1995 ; 3. సంబంధం కలిగిఉండు. కాశీ. 1.91. <వియ్యము + అందు. **వియ్యముకాఁడు** రూ.చూ. వియ్యంకుడు. వి. 1. వియ్యంకుడు ; 2. బంధువు. **వియ్యములవారు** విశ.బ.వ. బంధువులు, శుక. 3.294. **వియ్యంపుముంజేయి** వి. వియ్యం అందుకొనే ముందుచేయి. శృం.నై 6.87. **వియ్యంపుమేలంబులు** వి.బ.వ. వియ్యం అందుకునేటప్పటి పరిహాసాలు, బంధువుల పరిహాసాలు. శృం.నై. 6.109. **వియ్యంపురాలు** రూ. వియ్యపురాలు, వీపరాలు. వి. వియ్యంకురాలు, వియ్యమందిన స్త్రీ. ఆం.భా. 2.114. **వియ్యంపుసాని** రూ. వియ్యపుసాని. వి. వియ్యపురాలు. ఆం.భా. 2.114 **వియ్యంపొత్తు** వి. పెళ్ళికి పిల్లల్ని ఇచ్చి పుచ్చుకొనే అనుకూల్యం. <వియ్యం + పొత్తు. **వియ్యాలందు** అ.క్రి. 1. సామ్యంపొందు. ఉ.హరి. 3.82 ; 2. వైవాహిక సంబంధం చేయు ; 3. సంబంధం కలిగిఉండు.

<వియ్యము + -లు + అందు.

**వియ్యంపుముంజేయి** చూ. వియ్యము.

**వియ్యంపుమేలంబులు** చూ. వియ్యము.

**వియ్యంపురాలు** చూ. వియ్యము.

**వియ్యంపుసాని** చూ. వియ్యము.

**వియ్యంపొత్తు** చూ. వియ్యము.

**వియ్యాపరి** వి. ఉద్యోగిసూచి. ద.హిం.శా. సంపు. 6. శా. సం. 760. క్రీ.శ. 1398.

**వియ్యాలందు** చూ. వియ్యము.

**విరగగోయు** స.క్రి. తగ్గించు. తనకు రావలసిన డబ్బు విరగగోసుకొని మిగతాది ఇచ్చు.

<విఱుగు + -అ[7] + కోయు.

**విరగడ** రూ. విరగడ. వి. విడుదల.

**విరగడచేయు** స.క్రి. తొలగించు. **విరగడయగు(-అగు)** అ.క్రి. తొలగు.

**విరగపాటు** రూ.చూ. విరుగపాటు. వి. 1. గర్వం ; 2. దొర్లపడటం.

**విరగఁబడు** రూ.చూ. విరుగఁబడు. అ.క్రి. 1. గర్వపడు ; 2.

బోర్లపడు.

**విరగఁబాటు** చూ. విరుగు. వి. గర్వం.

**విరగఁబూయు** రూ.చూ. విరుగఁబూయు. అ.క్రి. ఎక్కువగా పూయు.

**విరగుంచె** రూ. ఇరగుంచె, ఈరగుంచె, ఈరిగుంచె. వి. నరి చేసేటప్పుడు పడుగు ఆరుబయనులో ఉండగా అంటు కొన్న పోగులు విడబడేటట్లు కుంచెతో దువ్వటం.

**విరగుద్దు** స.క్రి. పడుగుపోగులు విడబడేటట్లు తట్టు.

**విరగుప్పాడు** రూ. ఇరగుప్పాడు, ఇరుగుబ్బాడు. స.క్రి. ఆరిన నూలును విడిపించు.

**విరగుబ్బు** రూ. ఇరగుబ్బు. స.క్రి. రంగు అద్దిన నూలు లడీలు పిడుపుకర్రలో దులుపు.

**విరజాజి** చూ. విరియు. రూ. విరజాడి. వి. నవమాలిక, ఒక జాతిజాజి. వి.క. 1.95.

**విరజాది** రూ.చూ. విరజాజి. వి. నవమాలిక.

**విరటుఁడు** వి. విరాటరాజు. భార. విరా. 4.7.
సం. విరాట -. విరాటరాజు.
<సం. విరాట -.

**విరదాళ్లు** వి.బ.వ. పీరులతాళ్ళు, కొలుపుల్లో గొల్లలు తొడల చుట్టూ వినరికొట్టి 'టప్' అనే శబ్దం వేసేవి. ఇవి ఎలుక తోకవాటం కురచమోకులు. ఇవి ఉంచే పెట్టెను 'గంగపెట్టె' అనిపూజిస్తారు.
సం. వీర -. శూరుడు.
<సం. వీర-+త్రాడు+-లు.

**విరదీయు(-తీయు)** చూ. విరియు. స.క్రి. నరిచేసేటప్పుడు పడుగు పోగులు విప్పు.

**విరపనగొయ్య(-కొయ్య)** వి. మొండివాడు.

**విరబడు** రూ.చూ. విరఁబడు. అ.క్రి. 1. పగిలి మెత్తటి పొడిగా మారు; 2. కొత్తకుండలు మొ. వి నీళ్ళు పోసిన వెంటనే కాల్చుదోషం వల్ల పగిలిపోవు, విచ్చిపోవు.

**విరమోదకము** వి. ఉత్సాహం. కు.సం. 11.41.
సం. వీర-. శూరుడు.

**విరఁబడు** రూ. విరబడు. అ.క్రి. 1. విరియబడు, విరియు. వికసించు. (స్వార్థంలో). వరాహ. 4.21; 2. విజృంభించు, వరాహ. 4.21.
<విరియు+-అ[7]+పడు.

**విరలి** రూ. విరాళము[1], విరాళి. వి. మోహం, వలపు. కు.సం. 4.113.
సం. విరహ -. వలపు, విరల -. పదునైనది. క్వాచిత్కం, విరాల -. వలపు పుట్టించేది, ఎడబాటు;
త. విరాళి. ఎడబాటు.
<సం. విరాల-.
**విరలిగొను(-కొను)** రూ. విరాళిగొను. అ.క్రి. మోహ పడు, వలచు. కు.సం. 4.36.

**విరళము** వి. ఒకవిధమైనపన్ను.
సం. విరల -. అరుదైనది.
**విరళముగా** విణ. స్పష్టంగా. <విరళము+అగు+-అ[7].

**విరళి** విణ. విరాలమైంది: వి. 1. విరివి; 2. ఎడం; 3. ఇంపు.

**విరవాజి** రూ.చూ. విరవాది. వి. నవమాలిక.

**విరవాది** చూ. విరియు. రూ. విరవాజి. వి. నవమాలిక, వృక్ష విశేషం. మను. 3.84.
**విరవాదులదండ** వి. విరజాజి పూలతో కట్టిన దండ. శృం.నై. 8.115.

**విరవాదులదండ** చూ. విరవాది.

**విరవాయు** అ.క్రి. రెండుగా చీలు, పాయలగు. వసు. 2.73.
క. పిర -. రెండు.

**విరవారు** రూ.చూ. విరవాఱు. అ.క్రి. చెదరిపారిపోవు.

**విరవాఱు** రూ. విరవారు. అ.క్రి. చెదరిపారిపోవు.
<విరియు+-పాఱు[3].

**విరవిర[1]** రూ. విలవిల. వి. 1. తెళ్ళటంలో అయ్యేధ్వనికి అనుకరణం. నిర్వ. రా. 4.93; 2. ఎండకాయటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. ద్వి.భాగ. 2.32పు; 3. కరగటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. వేంక. పంచ. 4.345; 4. విరియటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. పారి. 3.197.
క. విలి. వణకటంలోని ధ్వన్యనుకరణం; త. విలవిల (-ప్పు-,-త్తు-). (ఎక్కువగా) వణుకు, కంపించు; మ. విలక్కమ్. తిమురు, తిట్టు, వెలవెల (-ప్పు-,-త్తు-). వణుకు; కుఇ. విర. కాళ్ళు కొట్టుకొను, కంపించు.
**విరవిరవారు** రూ.చూ. విరవిరవాఱు. అ.క్రి. 1. చెదరి పారు; 2. భయాదులచే అవయవాలు స్వాధీనం తప్పు.
**విరవిరవాఱు(-పాఱు[3])** రూ. విరవిరవారు. అ.క్రి. 1. విరవిరపోవు. భయాదులచే అవయవాలు స్వాధీనం తప్పు. భాస్క. రా. యు. 850; 2. చెదరిపారు. **విరవిరవీఁగు** అ.క్రి. విర్రవీగు, మిక్కిలిపీగు, నిక్కు. తాళ్ల. సం. 11.3.18. విరవిరవోవు(-పోవు) అ.క్రి. 1. విహ్వలతను పొందు. భార. కర్ణ. 1.158; 2. విరిసిపారు. భాగ. 10పూ. 1142.

**విరవిర[2]** రూ.చూ. బిరబిర. క్రి. విణ. మిక్కిలి త్వరితంగా. ద్వి.సార.చ. 2.57పు. 9పం.

**విరసము** వి. విసుగు. కు. సం. 3.3.
సం. విరస -. రుచిలేనిది. ఇష్టంలేనిది, బాధ, నొప్పి, ద్వేషం.
<సం. విరస -. (అర్థవిపరి.).

**విరాకులవిత్తు** చూ. విరియు.

**విరాడము** రూ. విరాలము, విరాళం, విరాళము. వి. ఒకవిధ మైన పన్ను. నజరానా. ద్వి. పరమ. వి. 3.197పు. 14పం.
సం. విరల -. క్వాచిత్కం, విరాళం అని వ్యవహారం; ప్రా. విరల -. అల్పం, అరుదైనది.
<ప్రా. విరల-.

**విరాలము** రూ.చూ. విరాడము. వి. ఒకవిధమైన పన్ను.

**విరాళం** రూ.చూ. విరాడము. వి. పన్నుసూచి. ద.హిం.శా. సంపు. 16. శా. సం. 282. క్రీ.శ. 1572.
**విరాళంపన్ను** వి. కరవిశేషం. ద.హిం.శా. సంపు. 4.

గా. సం. 677. ప్రౌ.శ. 1444.

**విరాళము¹** రూ.చూ. విరలి వి. **1.** వలపు, మోహం. నీలా. 1.16 ; **2.** విరహం. నీలా. 1.103.

**విరాళము²** రూ.చూ. విరాడము. వి. ఒకవిధమైనపన్ను.

**విరాళి** రూ.చూ. విరలి. వి. **1.** మోహం, వలపు. శృం.నై. **4.32** ; **2.** భక్తి. విష్ణువు. 2.286 విణ. ; **1.** మోహం. కలది. ధనాభి. **2.60** ; **2.** వియోగంకలది. రాజవా. 3.8.

**విరాళికొలుపు** రూ.చూ. విరాళిగొలుపు. అ.క్రి. మరలు కొలుపు. విరాళిగొను(-కొను) రూ.చూ. విరలుగొను. అ.క్రి. మోహపడు. కాశీ. 2.138. విక్ర. 8.48. విరాళిగొలుపు (-కొలుపు) రూ. విరాళి కొలుపు, విరాళిగొల్పు స.క్రి. మోహం పుట్టించు. హర. 1.13. విరాళిగొల్పు రూ.చూ. విరాళిగొలుపు. స.క్రి మోహింపచేయు, వలపుగొలుపు. హర. **5.53.** విరాళిమొగ్గ వి. చెదరిపోయింది. ప్రబంధ. **788.**

**విరి** రూ. విరియు. వి. పువ్వు. కు.సం. 1.21, శృం.నై. 2.38. వ్యు. విరిసేది ; విణ. **1.** వికసించిన. కు.సం. **2.46** ; **2.** పీడిన. భాస్క.రా.బాల. 482 ; **3.** విడిచిన. వదలిన. ఆము. 4.160.

విరికటారపుజోదు వి. మన్మథుడు. కృ శకు. 2.133. విరికాఁడు వి. మన్మథుడు. తాళ్ల. సం. 9.111. విరికిలించు స.క్రి. విరియచేయు, చాచు. పండి.చ. 5.371పు. విరికొంతవేల్పు వి. పుష్పాయుదుడు, మన్మథుడు. యయా. 5.45. విరిగొమ్మ (-కొమ్మ) వి. పూగొమ్మ దశా. **3.8.** విరిచెండు వి. పూలబంతి. ఉ.రా. 2.266. విరితీవఁబోఁడి వి. లతాంగి, పూవుతీగలాగా మనోజ్ఞురాలైన స్త్రీ. వేంక. పంచ. **4.300.** విరితేనియ రూ.చూ. విరితేనె. వి. పూతేనె. ఉ.రా. 6.18. విరితేనియత్రాగుడు రూ.చూ. విరితేనెత్రాగుడు. వి. తుమ్మెద. విరితేనియత్రావుడు రూ.చూ. విరితేనెత్రాగుడు. వి. తుమ్మెద. విరితేనియమేపరి రూ.చూ. విరితేనెమేపరి. వి. తుమ్మెద. విరితేనె రూ. విరితేనియ వి. పూతేనె. ఉ.రా. 1.171. విరితేనెతాగుడు రూ. విరితేనియత్రాగుడు, విరితేనియత్రావుడు, విరితేనెత్రాగుడు. వి. తుమ్మెద. వ్యు. పూలతేనెను తాగేది. విరితేనెత్రావుడు రూ.చూ. విరితేనెత్రాగుడు. వి. షట్పదం, తుమ్మెద. విరితేనెమేపరి రూ. విరితేనియమేపరి వి. తుమ్మెద, చంపూరా. 3.74. విరిదండ వి. పూలమాల. శృం.నై. 8.107. విరిదమ్మితూఁపులరా వి. మన్మథుడు. విరినీరు¹ వి. పన్నీరు. విరిపోటు వి. **1.** భేదం. ప్రబోధ. **3.8** ; **2.** పైకమ్మ్రదుపుగాఉండి ఘాటైంది. కవిక. 2.44. విరిపోటుసేయు (-చేయు) అ.క్రి. **1.** మనసు విరుచు. గౌ. హరి. 1.2347 ; **2.** పాడుచేయు, చెరచు. నరస. 5.160 ; 3. భేదం కలిగించు. గౌ.హరి. పూ. **2447** పం ; **4.** వేరుబడు. విరిఁబోఁడి వి. పుష్పంలా ఒప్పైన స్త్రీ. విరియాట (-ఆట) వి. స్వేచ్ఛావిహారం. వసు. **3.138.** విరివింటిదంట వి. మన్మథుడు, పుష్పధన్వి. చంద్రికా. **4.15.** విరివింటిదొర వి. పుష్పధన్వుడు, మన్మథుడు. యయా **4.113.** విరివింటివాఁడు విణ. పూలవిల్లు కలవాడు. మన్మథుడు. విజయ. **3.48.** విరివిలుకాఁడు రూ. విరివిల్కాఁడు. వి. పుష్పధన్వి. మన్మథుడు. యయా. **5.54.** విరివిలుతుఁడు రూ.చూ. విరివిల్తుఁడు. వి. మన్మథుడు, పుష్పధన్వి. విరివిల్కాఁడు రూ.చూ. విరివిలుకాఁడు. వి. పుష్పధన్వి, మన్మథుడు. విరివిల్తుఁడు రూ. విరివిలుతుఁడు. వి మన్మథుడు. యయా. **4.28.** విరిపొడి (-పొడి) వి. పుప్పొడి, పరాగం. ద్వి. పరమ. వి. **4.277.** విరిసజ్జ వి. పూలతో చేసిన శయ్య. హర. **2.38.** విరిసరి వి. పుష్ప మాలిక. చంపూరా. 3.8. సం. సర - దండ. విరులకే సరంబులవాసనలు వి.బ.వ. పూలలోని కేసరాల యొక్క వాసనలు. శృం.నై. **8.14.** విరులతావి వి. పువ్వులవాసన. విరులుగిల్లు అ.క్రి. పూవులుకోయు. పారి. **4.16.** < విరి + -లు + గిల్లు. విరులునవరించు స.క్రి. పూవులు ముడుచు. పారి. **5.56.** < విరి + -లు + నవరించు. **విరులెత్తు** అ.క్రి. పుష్పించు. ఆము. **5.126.** < విరి + -లు + ఎత్తు¹.

**విరిగి¹** రూ. విరిగె. వి. తెల్లనిపూలుపూసే ఒకరకం చెట్టు పి.శకు. 2.14.

త. విరచు, విరిచు, విరుమ. ఒకరకం పెద్దచెట్టు. విరియన్. సాధారణమైన చెట్టు ; మ. విరిను. ఒక రకంచెట్టు.

**విరిగి²** రూ.చూ. విఱిగి వి. స్ఫోటభూమి, పగుళ్ళువాసిన నేల.

**విరిగిపోవు** చూ. విరుగు.

**విరిగె** రూ.చూ. విరిగి¹. వి. స్ఫోటభూమి, బహువారకం.

**విరిదట్టు** చూ. విరియు.

**విరిదలవాఁడు** చూ. విరియు.

**విరిపిడియము** చూ. విరివి.

**విరియకాచు** చూ. విరియు.

**విరియపూచు** చూ. విరియు.

**విరియఁబాఱు** చూ. విరియు.

**విరియఁబోయు** చూ. విరియు.

**విరియించు** చూ. విరియు.

**విరియు** రూ. విఱియు. అ.క్రి. **1.** విచ్చిపోవు, విశ్లథమగు, కు.సం. 5.70 ; **2.** పుష్పించు, పూచు. కు.సం. 6.130, **3.** వికసించు. నిర్వ.రా. 7.78 ; **4.** అదృశ్యమగు; అడగు. భార.ఉద్యో. 2.108 ; **5.** వ్యాపించు. భార ఉద్యో. 2.113 ; **6.** చెదరు. భార. భీష్మ. 2.178 ; **7.** తొలగు. భార. శాంతి. **3.364** ; **8.** విడపోవు. హరి. పూ. 5.187 ; 9. వివశమగు. హరి.పూ. **5.246** ; **10.** భగ్నమగు. విరుగు. కాశీ. 1.77 ; **11.** రాలిపోవు. ఆము. 5.130 ; **12.** పొంగు. పాండు. 5.188 ; స.క్రి. విడుచు. భార. ఉద్యో. 4.210.

క. *బిరి.* వికసించు, విరియు, *బిరికు.* చీలిక ; తు. *బిరియుని.* వ్యాపించు, విస్తృతిచెందు ; త. *విరి.* విరియు, వ్యాపించు, విచ్చుకొను ; మ. *విరియుక.* వికసించు. *విరిక్క.* విరియు ; తొ. *పిరై.* విచ్చుకొను ; కువి. *బ్రి.* దొర్లిపోవు, పొర్లిపోవు ; పర్జి. *వ్రింగ్.* వదులగు ; కుఱు. *బిర్ద్-.* విడిపోవు ; బ్రా. *బిర్-.*

విడిపోవు.

<మూ.ద్రా.*విర్-.

**విరాకులవిత్తు** వి. తామరతంపర. ప్రబోధ. 2.45. <విరియు+ఆకు+లు+-అ+విత్తు. **విరిదట్టు** విశే. ఎడ బాటు పొందిన, వియుక్తం. విష్ణుపు. 6.106. <విరియు+ తట్టు. **విరిదలవాఁడు** విశే. చెడిపోయిన జుట్టు కలవాడు. భార. కర్ణ. 3.351. <విరియు+తల+వాఁడు. **విరియ కాచు** అ.క్రి. సమృద్ధిగా కాచు. <విరియు+-అ[7]+ కాచు. **విరియపూచు** అ.క్రి. సమృద్ధిగాపూచు. <విరియు+ -అ[7]+పూచు. **విరియఁబడు** అ.క్రి. 1. (స్వార్థంలో) విరియు. విడిపోవు. మార్క. 1ఆ, పారి. 4.21 ; 2. వ్యాపించు, కమ్ము. పరాహ. 4.133. <విరియు+-అ[7]+పడు. **విరియఁబాఱు** అ.క్రి. 1. విచ్చు, విడిపోవు. భాస్క.రా. యు. 1431 ; 2. (స్వార్థంలో) వికసించు. ఆము. 5.121 ; 3. వ్యాపించు, కమ్ము. కళా. 7.166 ; 4. పగులు, భేదిల్లు. చంద్రాంగ. 2.32. <విరియు+-అ[7]+పాఱు[3]. **విరియఁబోయు** స.క్రి. (తలవెండ్రుకలు ముడివిప్పి) వేలాడ దీయు. దశా. 3.52. <విరియు+-అ[7]+పోయు. **విరి యించు** స.క్రి. 1. వికసింపచేయు కు.సం. 4.104 ; 2. చెదరగొట్టు, తొలగవేయు. భార. ద్రోణ. 2.136 ; 3. నశింపచేయు. రం.రా. ఉ. 103పు.10పం. ; 4. విప్పు, తెరచు. శృం.నై. 4.64. <విరియు+-ఇంచు[3]. **విరి వాయు** అ.క్రి. 1. చీలు, పాయలగు. వసు. 2.73 ; 2. సాయపడు. <విరియు+పాయు. **విరివాఱు** అ.క్రి. 1. చీలు ; 2. సాయపడు.

**విరివాయు** చూ. విరియు.

**విరివాఱు** చూ. విరియు.

**విరివి** రూ.చూ. విఱివి. విశే. 1. అధికమైన. హర. 1.27 ; 2. విస్తృతమైన, విశాలమైన. దశా. 1.141 ; వి. 1. అధిక్యం. విక్ర. 1.166 ; 2. విస్తృతి ; 3. వెడల్పు.

**విరివీరు**[2] వి.బొ. సమృద్ధమైన జలం. భీమ. 2.54. **విరివిడియము** వి. పెద్దబాకు. రాజవా. 3.16. <విరివి+ పిడి+అమ్ము. **విరివిగా** క్రి. విశే. ద్రు. విశాలంగా. **విరివి గొను (-కొను)** అ.క్రి. అతిశయించు. తాళ్ల. సం. 10.165. **విరివిడి** రూ.చూ. విఱివిడి. వి. విస్తృతి, విశే. విస్తృతమయినది. **విరివోటు** వి. ఆధిక్యం. <విరివి+ ఓటు[2].

**విరివోటు** చూ. విరివి.

**విరుగడ** రూ.చూ. విరగడ. వి. విడుదల.

**విరుగడయైపోవు** అ.క్రి. విడిపోవు.

**విరుగనిగొయ్య** చూ. విరుగు.

**విరుగపాటు** చూ. విరుగు.

**విరుగంబొడుచు** చూ. విరుగు.

**విరుగఁబడు** చూ. విరుగు.

**విరుగఁబూయు** చూ. విరుగు.

**విరుగు** రూ.చూ. విఱుగు. అ.క్రి. 1. తునియు, భగ్నమగు ; 2. ఓడు, ఓడిపోవు ; 3. పాకంచెడు.

**విరిగిపోవు** అ.క్రి. బద్దలైపోవు. పల్నా. 111. <విరుగు +-ఇ[13]+పోవు. **విరుగనిగొయ్య** వి. మొండివాడు. **విరుగ పాటు** రూ. విరగపాటు. వి. 1. గర్వం ; 2. బోర్లపడటం. **విరుగంబొడుచు** అ.క్రి. ఓడించి పారదోలు, చెల్లాచెదరు గావించు. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 282. క్రీ.శ. 1514. <విరుగు+-అ[7]+పొడుచు. **విరుగఁబడు** రూ. విరగఁబడు. అ.క్రి. 1. గర్వపడు ; 2. బోర్లపడు. <విరుగు+-అ[7]+పడు. **విరుగఁబూయు** రూ. విరగఁ బూయు. అ.క్రి. ఎక్కువగా పూయు. <విరుగు+-అ[7]+ పూయు. **విరుగుడు** రూ.చూ. విఱుగుడు. వి. 1. విరుపు, నివారణం ; 2. ఉపశమనం. **విరుచు** రూ.చూ. విఱుచు. స.క్రి. 1. విరుగచేయు ; 2. భగ్నంచేయు ; 3. మాటువేసి విషంగాని రసంగాని విరిగిపోయేటట్లు చేయు ; 4. పడుగును రెండేసి గజాలకు ఒక్కొక్క మడతగా విడదీయు ; 5. విరబడేట్టుచేయు. **విరుచుకొను** అ.క్రి. విరుగు. **విర్చు** రూ.చూ. విఱుచు. స.క్రి. విరుగచేయు, ముక్కలుచేయు. కేయూ. 3.180.

**విరుచు** చూ. విరుగు.

**విరుచుకొను** చూ. విరుగు.

**విరుపు** రూ.చూ. విఱుపు. వి. 1. పడుగులో కొలతను బట్టి వేసిన మడత ; 2. కొలతను బట్టి పడుగు మడిచిన చోట ఎక్కించిన కఱ్ఱ ; 3. అసూయ ; 4. విరగటం ; 5. అడ్డం ; 6. ఆక్షేపణ.

**విరుపుకోల** వి. పడుగు మడతలో దూర్చిన కఱ్ఱ. **విరుపుగుది** రూ. ఇరుపుగుది. వి. పెడకోలకు తగిలించే మలగఱ్ఱ, కొన్నిచోట్ల మలబద్ద-దారం. **విరుపుచివ్వ** వి. కొలతను బట్టి పడుగు మడిచిన చోట ఎక్కించిన కఱ్ఱ. **విరుపుమల** వి. చుట్టచుట్టిన పడుగు నూలు. **విరుపులాక** వి. కొలతను బట్టి మడిచినచోట ఎక్కించే వెదురు బద్ద.

**విరులకేసరంబుల వాసనలు** చూ. విరి.

**విరులతావి** చూ. విరి.

**విరులుగిల్లు** చూ. విరి.

**విరులుసవరించు** చూ. విరి.

**విరులెత్తు** చూ. విరి.

**విరూపాచ్చ** వి. విరూపాక్షుడు, శివుడు. బసవ. 3ఆ.

సం. విరూపాక్ష-.శివుడు, త్రినేత్రుడు.

<సం. విరూపాక్ష-.

**విర్కిటి** వి. పెద్ద ఇటికరాయి.

**విర్గు** రూ.చూ. విఱుగు. స.క్రి. విరుగచేయు, ముక్కలుచేయు. రం.రా. బాల. 78పు.

**విర్చు** చూ. విరుగు.

**వి్రపీగు** రూ.చూ. విఱ్ఱవీఁగు. అ.క్రి. 1. గర్వించు ; 2. ఉబ్బు ; 3. మిక్కిలి నిక్కు.

**విర్లబడు** చూ. విరియు. అ.క్రి. ఏకేటప్పుడు దూది విచ్చుకొను.

**విర్లుకుంచె** వి. సరిచేసేటప్పుడు పడుగు ఆరుబడునులో ఉండగా అంటుకొన్న పోగులు విడబడేటట్లు కుంచెతో దువ్వటం.

**విఱపనకొయ్య** వి. మొరకు, మొండికట్టె.

**విఱవిఱకపోవు** అ.క్రి. తాపాన్ని పొందు. వేంక. పంచ. 3.65.

**విఱవీఁగు** రూ.చూ. విఱ్ఱవీఁగు. అ.క్రి. గర్వపడు. తాళ్ల. సం. 10.241.

**విఱిగి** చూ. విఱుగు. రూ. విరిగి2. వి. స్ఫోటభూమి, పగుళ్ళు వాసిన నేల. ఆం.శా. 2.4.

**విఱిఁగిన వేలికి సున్నము పెట్టనివాఁడు** చూ. విఱుగు.

**విఱిగిపఱచు** చూ. విఱుగు.

**విఱిగిపాఱు** చూ. విఱుగు.

**విఱిగిపోవు** చూ. విఱుగు.

**విఱిచికట్టు** చూ. విఱుగు.

**విఱియు** రూ.చూ. విరియు. అ.క్రి. 1. పగులు, చీలు; 2. విచ్చిపోవు, విశ్లథమగు; 3. చెదరు; 4. విడిపోవు; 5. భగ్నమగు; 6. పూచు; 7. తొలగు; 8. వికసించు; 9. వ్యాపించు; 10. అదృశ్యమగు; 11. వివశమగు; 12. రాలిపోవు; 13. పొంగు.

**విఱివి** చూ. విరియు. రూ. విరివి. వి. విస్తృతి. రం. రా. ఆరణ్య. 157 పు. 28పం; విణ. విస్తృతమైన.

**విఱివిడి** రూ. విరివిడి. వి. విస్తృతి, వ్యాపించినది; విణ. విస్తృతమయినది.

**విఱివోటు (-పోటు)** వి. విద్వేషం, పగ.

**విఱుగడ** చూ. విఱుగు.

**విఱుగనిబియ్యము** చూ. విఱుగు.

**విఱుగఁద్రోచు** చూ. విఱుగు.

**విఱుగఁబడు** చూ. విఱుగు.

**విఱుగు** రూ. విరుగు, విర్గు. అ.క్రి. 1. తునియు, ముక్కలగు. చినతిప్ప సముద్రంశాసనం. క్రీ.శ. 9.10శ, భార. ఆది. 1.53; 2. భయపడు. భార. విరా. 5.66; 3. పలాయితుడగు, పారు. భార. విరా. 5.338; 4. ఓడు, పరాజితుడగు. భార. భీష్మ. 2.380; 5. విరక్తమగు, ఆసక్తి లేకుండు. వరాహ. 3.82; 6. అడగు, నశించు. కువ.చ. 3.10; 7. పడు. వేమ. 2.101; 8. (ఋణం) తీరు. కపద. 3.231; 9. పాకంచెడు; వి. 1. ముక్కలవటం, భగ్నమవటం. వేంక. పంచ. 4.238; 2. ఓటమి, పరాజయం. కకుత్స్థ. 1.182.

క. బిర్స, బిఱసు, బిఱుసు, బిఱు. కాఠిన్యం, పట్టుదల, దురుసుతనం,

తు. బిర్-. గాలి, తుఫాను; త. విఱ (ప్ప్-,-న్ద్-). నిబిడమైన, దట్టమైన, విఱప్పు. సాంద్రత, దగ్గరపడు, గడ్డకట్టు, పేరుకొను, బలం, విజయం, విఱల్. విజయం, బలం, విఱై (వ్-,-న్ద్-). చలితో వణకు, (-ప్ప్-,-త్త్-). బిగుసుకొను, విఱైప్పు. బిగుసుకు పోవు, గడ్డకట్టు, వెఱి (-ప్ప్-,-త్త్-). కర్రలా నిల్చొను; మ. విఱక్క. (చలితో) బిగుసుకు పోవు, విరన్న, కఠినమైన, విఱక్క. వణుకు, కంపించు.

**విఱిఁగిన వేలికి సున్నము పెట్టనివాఁడు** వి. పిసినిగొట్టు. **విఱిగిపఱచు** అ.క్రి. విరుచుకొని పోవు. కాశ. 2.45. <విఱుగు+-ఇ13+పఱచు. **విఱిగిపాఱు** అ.క్రి. విచ్చుకొని పారిపోవు. జైమినిభా. 4.20. <విఱుగు+-ఇ13+పాఱు. **విఱిగిపోవు** అ.క్రి. చెదరిపోవు. భాస్క. రా. అయోధ్యా. 374; 2. ఓడిపోవు. <విఱుగు+-ఇ13+పోవు. **విఱిచికట్టు** స.క్రి. రెక్కలు వెనక్కితిప్పి కట్టు. శుక. 2.115. <విఱుచు+-ఇ13+కట్టు. **విఱుగడ** వి. 1. విరామం. భాస్క. రా. యు. 2385; 2. విమోచనం. మైరా. 4.131; 3. తొలగటం; 4. నాశనం. **విఱుగని బియ్యము** వి. దీవెనప్రాలు. **విఱుగఁద్రోచు** స.క్రి. పడగొట్టు. రుక్మా. చ. 3.10. <విఱుగు+-అ7+త్రోచు. **విఱుగఁబడు** అ.క్రి. 1. పారిపోవు, పలాయనమగు. ఆము. 6.76; 2. గర్వించు. <విఱుగు+-అ7+పడు. **విఱుగుడు** రూ. విరుగుడు. వి. పాకంచెడిన వస్తువు; విణ. విరుపైన, విరిచేది. **విఱుగుఁబాటు(-పాటు)** వి. 1. గర్వించటం. కవిక. 1; 2. ఓడటం. **విఱుచు** రూ. విరుచు, విర్చు. స.క్రి. 1. విరుగచేయు, తుంచు, భగ్నంచేయు. భార. ఆది. 6.215; 2. ఓడించు. భార. విరా. 1.81; 3. (గాత్ర) వినాయంచేయు. భార. విరా. 2.250; 4. (నిరసించేటప్పుడు) పెదవి ముఱుచు. శృం.నై. 6.137; 5. చంపు. జైమినిభా. 5.130; 6. (చేతులువెనక్కి) తిప్పు. విక్ర. 3.64; 7. వివరించు, స్పష్టపరచు. ప్రభు. 2.34పు. 15పం; 8. ఒకవస్తువునుండి వేరొకవస్తువును విభాగించు. ఆము. 4.178; 9. పదచ్ఛేదంచేయు. సారంగ. 2.31. **విఱుచుకొనిపడు** అ.క్రి. మీదపడు.

**విఱుచు** చూ. విఱుగు.

**విఱుచుకొనిపడు** చూ. విఱుగు.

**విఱుపు** చూ. విఱుగు. రూ. విరుపు. వి. విరపటం, భంగం. శుక. 2.433; విణ. విరుగుడు.

**విఱ్ఱనవీఁగు** రూ.చూ. విఱ్ఱవీఁగు. అ.క్రి. మిక్కిలి అతిశయించు. చిత్రభా. 2.52.

**విఱ్ఱవీఁగిపండు** చూ. విఱ్ఱవీఁగు.

**విఱ్ఱవీఁగు** రూ. విర్రవీగు, విఱవీఁగు, విఱ్ఱనవీఁగు. అ.క్రి. 1. మిక్కిలినిక్కు, మిక్కిలిగర్వించు. పండి.చ. 1.2.328; 2. మిక్కిలిఒప్పు, మిక్కిలి అతిశయించు. భార. ఉద్యో. 2.285; 3. సమృద్ధమగు. వరాహ. 10.120.

**విఱ్ఱవీఁగిపండు** అ.క్రి. విపరీతంగా పండు. మను. 6.121.

**విల్** రూ.చూ. విల్లు. వి. ధనస్సు. కు. సం. 9.46.

**విల్కాఁడు** రూ.చూ. విలుకాఁడు. విణ. విల్లుపూనినవాడు. కాశీ. 3.41. **విల్తుఁడు** రూ.చూ. విలుతుఁడు. వి. ధనువును ధరించినవాడు, ధన్వి. **విల్దాలుపు** రూ.చూ. విలుదాలుపు. వి. ధనుర్ధారి. **విల్దాల్పు** రూ.చూ. విలుదాలుపు. వి. ధనుర్ధారి. **విల్వంకలు** వి. బ.వ. ధనస్సుయొక్క వంపులు. కాశీ. 6.41. **విల్విద్య** రూ.చూ. విలువిద్య. వి. ధనుర్విద్య.

**విలము** వి. రంధ్రం, కన్నం.

సం. బిల-. రంధ్రం, గర్తం, గుహ.

<సం. బిల-.

**విలయాతి** రూ.చూ. విలాతి. విణ. విదేశీయమైన; వి. సీమ, విదేశం.

**విలవిల** రూ.చూ. విరవిర1. వి. 1. ప్రాణం విడవటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. అష్టమ. క. 3.148పు. 8పం;

2. తన్నుకోవటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. ద్వి. నల. 4 ; 3. విహ్వలత ; 4. తన్నుకోవటంలో అయ్యే ధ్వనికి అనుకరణం.

**విలవిలకొట్టుకొను** అ.క్రి. గిజగిజ తన్నుకొను. **విలవిలపోవు** రూ. విలవిలవోవు. అ.క్రి. 1. విహ్వలతచెందు ; 2. అవశమగు. **విలవిల(బడు(-పడు)** అ.క్రి. ప్లానమగు, వాడిపోవు. సారంగ. 3.197. **విలవిలలాడు** అ.క్రి. 1. గిజగిజ తన్నుకొను ; 2. ఆయాసంతో తపించు. <విల విల + -లు + ఆడ. **విలవిలవోవు** రూ.చూ. విలవిలపోవు. అ.క్రి. 1. విహ్వలతచెందు ; 2. అవశమగు.

**విలాతి** రూ. విలయాతి, విలాతు, విలాయతి, విలాయితు విలాయాతి. వి. 1. దేశం. ద. హిం. శా. సంపు. 10.శా. సం.758. క్రి.శ. 1658, వేంక. పంచ. 1.479 ; 2. విదేశం.

హిం. విలాయత్. దేశం, విదేశం ; మరా. విలాయతు. విదేశం, యూరపు ; ఉ. విలాయత్. దేశం, విదేశం ; పార. విలాయత్. దేశం, దేశభాగం, మండలం ; అర. విలాయత్. సీమ, రాష్ట్రం ;

క. విలాయతి, విలాయతు. విదేశానికి సంబంధించిన, విదేశం, సీమ. ప్రధానంగా ఇంగ్లండు లేదా యూరపు ; మ. బిలాహి. యూరపు.

<ఉ. విలాయత్.

**విలాతు** రూ.చూ. విలాతి. విణ. విదేశీయమైన ; వి. సీమ, విదేశం.

**విలాయతి** రూ.చూ. విలాతి. వి. 1. విదేశం, సీమ. యయా. 4.122 ; 2. దేశం. హంస. 5.350.

**విలాయతు** రూ.చూ. విలాతి. వి. 1. దేశం ; 2. విదేశం.

**విలాయాతి** రూ.చూ. విలాతి. వి. 1. దేశం. ఖడ్గ. 65 ; 2. సీమ, విదేశం.

**విలాసం** వి. పదును, వాదర.

**విలాసము** వి. 1. జాబుమీదరాసే చిరునామా ; 2. వెలల పట్టి.

సం. విలాస-. ఆట, వినోదం, స్త్రీల శృంగారచేష్టా విశేషం, అందం, తళుక్కుమని మెరయటం ;

క. విలాస. చిరునామా, అడ్రస్ ; త. విలాచమ్.

**విలియ** రూ. విలియా. వి. 1. క్రమం ; 2. పంపకం ; 3. వర్గీకరణ ; 4. ఏర్పాటు.

క. విలె. క్రమం, వరస, ఏర్పాటు.

**విలియవేయు** స.క్రి. 1. సరిచూచు ; 2. పూటకాపుగా ఏర్పరచు.

**విలియా** రూ.చూ. విలియ. వి. 1. క్రమం ; 2. పంపకం ; 3. వర్గీకరణ ; 4. ఏర్పాటు.

**విలియావారి** రూ. విలేవారి. వి. బాపతువారిగా ఏర్పరచటం. క. విలెవారి. చేర్పరచి క్రమంలో ఉంచటం. **విలియావేయు** స.క్రి. సరిచూచు, ఏర్పరచు.

**విలు** రూ.చూ. విల్లు. వి. ఔ. ధనస్సు. భార. అర. 5.181.

**విలుకా(డు** రూ. విల్కా(డు. విణ. విల్లుపూనినవాడు. కు.సం. 11.40, భార. ఉద్యో. 4.229. **విలుకాలువు** రూ.చూ. విలుదాలుపు. వి. ధనుర్ధారి. **విలుకాల్పు** రూ చూ. విలుదాలుపు. వి. ధనుర్ధారి. **విలుతు(డు** రూ. విల్తు(డు. వి. ధనువు ధరించినవాడు, ధన్వి. **విలుదాలుపు(-కాలుపు)** రూ. విలుకాలువు, విలుకాల్పు, విలుదాలుపు, విల్దాలుపు, విల్దాల్పు. వి. ధనుర్ధరుడు. రామాభ్యు. 5.23. **విలుదాల్పు** రూ.చూ. విలుదాలుపు. వి. ధనుర్ధరుడు. అచ్చ. రా. అరణ్య. 12. **విలుమంది** వి. విల్లులు ధరించిన జన సమూహం, విలుకాం(డ్రు. ఆము. 3.27. **విలువా(డు** వి. ధనువుకల వాడు, ధనుర్ధారి. **విలువిద్దె** రూ. విల్విద్య. వి. ధనుర్విద్య. చంపూరా. 2.53. సం. విద్యా. చదువు.

**విలుచు** రూ. విల్చు. స.క్రి. 1. కొను. భార. శాంతి. 5.228 ; 2. అమ్ము, విక్రయించు. వసు. 1.109 ; 3. పిలుచు, ఆహ్వానించు. ఆం. భా. 3.134.

క. బిల్, బిలి. అమ్ము, కొను, బిలి, బెలె. వెల, ఖరీదు ; కొడ. బెలె. వెల ; తు. బిలె, బెలె. వెల, విలువ, ఖరీదు ; త. విల్ (విఱ్ప్-, విఱ్ఱ్-). అమ్ము, అమ్మకానికి పెట్టు, విఱ్ఱల్, విర్పనై. అమ్మకం ; కో. విల్. వెల.

మూ. ద. ద్రా. *విల్, విలయ్.

**విలువ** చూ. వెల. రూ. విల్వ. వి. 1. వెల, క్రయం, ఖరీదు, మూల్యం. భార. అను. 5.35 ; 2. ప్రాముఖ్యం. హరి. 3.83.

**విలువకత్తియ** రూ.చూ. విలువకత్తె. వి. 1. వెలయాలు, వేశ్య ; 2. వెలఇచ్చి వస్తువుకొనే స్త్రీ. **విలువకత్తె** రూ. విలువకత్తియ, విల్వకత్తియ, విల్వకత్తె. వి. 1. వెలయాలు, వెలవెలది. పణ్యస్త్రీ. ప్రబంధ. 17 ; 2. వెలఇచ్చి వస్తువు కొనేస్త్రీ. **విలువకా(డు** రూ.చూ. విల్వకా(డు. విణ. వెల ఇచ్చి వస్తువును కొనేవాడు, క్రేత. **విలువజవరాలు** రూ. విల్వజవరాలు. వి. ఔ. వెలయాలు, వేశ్య. ప్రబంధ. 720. **విలువరమ్ముడు** రూ. విల్వరమ్ముడు. వి. దానిస, పనికత్తె. **విలువసేయు(-చేయు)** రూ.చూ. విల్వసేయు. స.క్రి. కొను.

**విలేవారి** రూ.చూ. విలియావారి. వి. 1. బాపతువారిగా ఏర్పరచటం ; 2. పరిష్కారం.

**విల్చుకోలు** చూ. విల్చు.

**విల్చు** రూ.చూ. విలుచు. స.క్రి. 1. అమ్ము, విక్రయించు. చంద్రికా. 1.105 ; 2. పిలుచు, ఆహ్వానించు. ఆం భా. 3.134 ; 3. కొను.

**విల్చికోలు** వి. వెల ఇచ్చికొనటం. భార. సభా. 2.181.

**విల్లంబు** చూ. విల్లు.

**విల్లు** రూ. విల్, విలు వి. ఔ. 1. ధనుస్సు. భార. ఆది. 5.5 ; 2. దారు కట్టిన వింటిబద్ద, దీనికి దారుతో కమాను వేలాడగట్టి దూది ఏకుతారు.

త. విల్. విల్లు, ధనుస్సు, విల్లవణ్, విలోణ్. విల్లి. విలుకాడు, విల్లార్, విల్లోర్. విలుకాడు, విల్లియర్. విలుకాడు ; మ. విల్, విల్లు, విల్లు, ధనస్సు ; గోం. విల్. విల్లు ; కు.వి. వెల్లూ. విల్లు, వెల్లు. బాణం ; పర్జి. విల్. విల్లు, ధనస్సు ; గ. వండె, వెండు. విల్లు ; బ్రా. విల్. బాణం.

**వింటికొన** వి. కొప్పు, వింటికొప్పు, ధనురగ్రం.

<విల్లు+-ఇ³+కొన. **వింటికోల** వి. రాళ్ళపనివాని ధనురాకారమైన సాధన విశేషం. <విల్లు+-ఇ³+కోల. **వింటిగాలితెగులు** వి. ధనుర్వాతం. <విల్లు+-ఇ³+గాలి+తెగులు. **వింటిజోదు** వి. ధానుష్కుడు, విలుకాడు. శృం.నై. 1.94. <విల్లు+-ఇ³+జోదు. **వింటినడుము** వి. పిడికట్టు, లస్తకం. <విల్లు+-ఇ³+నడుము. **వింటినారి** వి. అల్లెతాడు, మౌర్వి. <విల్లు+-ఇ³+నారి. **వింటిపట్టు** రూ.చూ. వింటిపెట్టు. వి. ధన్వంతరం. నాలుగు మూరల కొలదిగలనేల. <విల్లు+-ఇ³+పట్టు. **వింటిపెట్టు** రూ. వింటిపట్టు. వి. అమ్ము వేటునేల. రం.రా.ఉ. 17పు. 7పం. <విల్లు+-ఇ³+పెట్టు. **వింటిబద్ద** రూ. వింటిబ్రద్ద. వి. 1. ధనుస్సు. వైజ. 2.35; 2. విల్లు రూపంలో వెదురుచీలిక. <విల్లు+-ఇ³+బద్ద. **వింటిబ్రద్ద** రూ.చూ. వింటిబద్ద. వి. 1. విల్లు రూపంలో వెదురు చీలిక. దశా. 1.54; 2. ధనస్సు. **వింటిరాసి** వి. ధనూరాశి. <విల్లు+-ఇ³+రాసి. **వింటిలిదబ్బ** వి. వల్లినం. బాణానికి బదులుగా అల్లెతాడు మధ్య ఉండే చిన్న అల్లకంలో చిన్నరాయిపెట్టి అల్లెతాడులాగి కొట్టేది. ఉంటిలిదబ్బ, ఉండేలిదబ్బ. **వింటివాఁడు** విశ. ధానుష్కుడు. విల్కాడు. భార. విరా. 5.136. <విల్లు+-ఇ³+వాఁడు. **విండ్లమ్ములాట** వి. బాలక్రీడావిశేషం. హంస. 3.146. <విల్లు+-లు+అమ్ము+లు+ఆట. **విండ్లవారు** వి.బ.వ. ధనుర్ధారులు. భార. భీష్మ. 1.103. **విండ్లు** విశ.బ.వ. విల్లులు. కు. సం. 12.5. <విల్లు+-లు. **విల్లంబు** వి. తాడు కట్టిన వింటిబద్ద, దీనికి తాడుతో కమాను వేలాడగట్టి దూది ఏకుతారు. <విల్లు+అంబు. **విల్లుదాలుపు(-తాలుపు)** రూ.చూ. విలుదాలుపు. వి. ధనుర్ధారి. **విల్లునువెలగకాయయుఁబూను(-పూను)** అ.క్రి. అతకని రెండింటిని ఒకేసారి పూనటం సాధ్యం కాదనే పట్ల ఉపయోగించే పలుకుబడి. రుక్మా. చ. 4.53. **విల్లునేర్పు** వి. విలువిద్యలోని నైపుణ్యం కు. సం. 12.149. **విల్లుపట్టువారు** విశ.బ.వ. విలుకాడు. భార. ద్రోణ. 1.84.

**విల్వ** రూ.చూ, వి.బ.వ. వి. వెల, క్రయం, ఖరీదు, మూల్యం. హరిశ్చ. 4.136.

**విల్వకత్తియ** రూ.చూ. విలువకత్తె. వి. 1. వెలయాలు, వేశ్య; 2. వెలఇచ్చివస్తువు కొనేస్త్రీ. **విల్వకత్తె** రూ.చూ. విలువకత్తె. వి. 1. వెలయాలు, వేశ్య; 2. వెలఇచ్చి వస్తువు కొనేస్త్రీ. **విల్వకాఁడు** రూ. విలువకాఁడు. విశ. వెలఇచ్చి వస్తువును కొనేవాడు, క్రేత. వి.క. 1.88. **విల్వజవరాలు** రూ.చూ. విలువ జవరాలు. వి.ఔ. వెలయాలు, వేశ్య. **విల్వరమ్ముఁడు** రూ.చూ. విలువరమ్ముఁడు. వి. దానిన, పనికత్తె. **విల్వసేయు(-చేయు)** రూ. విలువ సేయు. స.క్రి. కొను. వా. రా. 4.18.

**విళంగీలు** వి.బ.వ. 1. తిట్లు; 2. హేళనతో కూడిన మాటలు.

**విళంబరము** వి. ప్రకటన, ప్రచురణ.

తు. బుళ్ళుని. గట్టిగా అరచు, కేకలుపెట్టు, బుళు, బుళ్ళు, కేక. పక్షికూత: త. విళి (విళ్ళి-,-వింట్-). చెప్పు. వినిపించు, తెలియజేయు, విళమ్బు (విళంబి). మాట్లాడు, ప్రచురించు, అందరిలో చెప్పు: విలప్పు. మూక్తి, విళిప్పు. ధ్వని, కేక, విళిఫ్పు. సైనికులకేక, విళరి. పిలుచు; మ. విళమ్బుక, విళంపరమ్. ప్రకటన, విళిక్క. పిలుచు, ఆహ్వానించు; తొ. విళై. గట్టిగా అరుచు.

**వివక్ష** వి. పక్షపాతదృష్టి.

సం. వివక్షా. చెప్పాలనేకోరిక, కోరిక, అర్థం, ఉద్దేశం.

<సం. వివక్షా (అర్థవిపరి.).

**వివచ్చము** రూ.చూ. వివ్వచ్చము. వి. 1. బీభత్సరసం; 2. రోత; 3. భయం.

**వివరపడు** చూ వివరము.

**వివరపుట్టు** చూ. వివరము.

**వివరము** వి. విస్పష్టత. ద్వి. పరమ. వి. 3.335.

సం. వివరణ -. ప్రకటించటం, స్పష్టంగా తెలపటం, వర్ణించటం వ్యాఖ్యానానికి వ్యాఖ్య అయినగ్రంథం, వివర -. ఆచ్ఛాదనను తొలగించటం, వ్యాపింపచేయటం; క. వివర. వివరు, వ్యాపింపచేయటం, వివరణ; త. వివరమ్. వివరణలు.

<సం. వివర - (అర్థవిపరి.).

**వివరకట్టు** అ.క్రి. స్పష్టపడు. మల్లు. 4.61. <వివరము+కట్టు. **వివరపడు** అ.క్రి. తెలియు. నిరంకు. 1.43. <వివరము+పడు. **వివరపుట్టు** అ.క్రి. 1. వివరించు, స్పష్టపరచు. మార్క. 1.111; 2. విశదమగు. వేంక. పంచ. 3.291; 3. విచారణచేయు. కళా. 2.31; 4. చెప్పు. ద్వి. పరమ. వి. 335. <వివరము+పుట్టు. **వివరముతెలిసినవాఁడు** విశ. విజ్ఞుడు. సిం. ద్వా. 1.19. **వివరి** వి. విచారణశక్తి కలవాడు, వివేకి. సిం. ద్వా. 1.18. <వివరము+-ఇ¹. **వివరించు** స.క్రి. 1. వక్కాణించు, స్పష్టపరచు. భార. విరా. 5.285; 2. చెప్పు, వక్కాణించు. భార. భీష్మ. 1.3; 3. విచారణచేయు, ఆలోచించు. కళ. 2.31. <వివరము+-ఇంచు³.

**వివరి** చూ. వివరము.

**వివరించు** చూ. వివరము.

**వివాదము** వి. కలహం, జగడం.

సం. వివాద -. జగడం, వాదం, యుక్తియుక్తంగా ఒక అంశాన్ని గురించి చర్చించటం, అప్పు. వైరుధ్యం, అజ్ఞ. అరవటం.

<సం. వివాద -. (అర్థవిపరి.).

**వివ్వచ్చము** చూ. వివచ్చము. వి. బీభత్సరసం, నవరసాల్లో ఒకటి; 2. రోత; 3. భయం.

సం. బీభత్స -. నవరసాల్లో ఒకటి; ప్రా. బీభచ్ఛ -. బీభత్థ - భయంకరమైనది. ఘృణాజనకమైనది, నవరసాల్లో ఒకటి.

<ప్రా. బీభచ్ఛ-.

**వివ్వచ్చుఁడు** వి. అర్జునుడు. భార. ఆది. 8.185.

సం. బీభత్స - అర్జునుడు, యుద్ధంలో బీభత్సాన్ని కలిగించేవాడు; ప్రా. బీభచ్ఛ -, బీహచ్ఛ -, బీభత్థ, బీభచ్ఛ. భయంకరం; జై.మహా.శౌ. ఆ.మా. బీభచ్ఛ -.

శౌ. బిహచ్ఛ -; మా. బిహళ్ళ.

<ప్రా. బీభచ్ఛ.

**విశాక** రూ. విశాకు. వి. కార్తీకమాసం, నవంబరు మొదటి వారంలో వచ్చేకార్తె.

నం. విశాఖా. ఒకనక్షత్రం.

<నం. విశాఖా.

**విశాకు** రూ.చూ. విశాక. వి. కార్తీకమాసం, నవంబరు మొదటి వారంలో వచ్చేకార్తె.

**విశాఖ** వి. కార్తీకమాసం, నవంబరు మొదటి వారంలో వచ్చే కార్తె.

నం. విశాఖా. ఒకనక్షత్రం.

<నం. విశాఖా (అర్థవిపరి.).

విశాఖలు వి.బ.వ. విశాఖకార్తెలో పండినపంటధాన్యం. ద.హిం.శా. సంపు. 10. శా.నం. 557. క్రీశ. 1374.

**విశేషము** వి. జరిగిన సంగతి. ప్రబా. 1.115.

నం. విశేష -. అసాధారణమైనది, విరివి అయినది, భేదం, వ్యత్యాసం, విధం, విశేషగుణం.

<నం. విశేష -.(అర్థవిపరి.).

**విశ్వ్య** రూ.చూ. పీస[1] వి. పీసె, నలభైపలాల తూకం. ద.హిం.శా. సంపు. 10. శా.నం. 471. క్రీ.శ. 1291.

**విశ్వామిత్రసృష్టి** వి. విదేశీయాలైన వాటిని అన్నిటినీ మనవారు విశ్వామిత్రసృష్టిగా అనటం అలవాటు, విదేశీయవస్తువు.

నం. విశ్వామిత్రసృష్టి -. కృత్రిమసృష్టి, బ్రహ్మసృష్టికి మారుగా విశ్వామిత్రుడు ప్రతిసృష్టి కావించటం పురాణ ప్రసిద్ధం.

<నం. విశ్వామిత్రసృష్టి - (అర్థవిపరి.).

**విషజ్వరము** వి. తీవ్రమైనజ్వరం, ప్రమాదకరమైనజ్వరం, మహిషానికిజ్వరం విషంలాప్రాణాంతకమైంది.

నం. విషజ్వర -. మహిషం, దున్నపోతు.

<నం. విషజ్వర - (అర్థవిపరి.).

**విషమదారి** వి. వృక్షవిశేషం. హంస. 4.10.

నం. విషమ -. సమంకానిది, హెచ్చుతగ్గులుకలది, బేసియైనది, కఠినమైనది, భయంకరమైనది, దుష్టమైనది.

<నం. విషమ- + దారి.

**విషమించు** అ.క్రి. (పరిస్థితి) చెయ్యిదాటిపోవు.

నం. విషమ -. అపాయకరమైన.

<నం. విషమ- + -ఇంచు[3].

**విషువసంక్రాంతి** వి. మేషలేక తులాసంక్రాంతి పుణ్యకాలం. ద.హిం.శా. సంపు 10.శా.నం. 57. క్రీ.శ. 1078.

నం. విషువసంక్రాంతి -. తులామేషరాసుల్లో ఒక దానిలో సూర్యుడు ప్రవేశించటం.

<నం. విషువసంక్రాంతి-.

**విష్ణుకాంత** వి. బంజరుబయళ్ళలో పెరిగే చిన్నపాటుదు కలుపు మొక్క, లేతనీలిరంగు పూలుపూస్తూ పట్టుకుచ్చులాంటి తెల్లటి నూగుతో నిండిఉండేది.

నం. విష్ణుకాంత -. నల్లదింటెన.

<నం. విష్ణుకాంత -.

విష్ణుకాంతరంగు వి. ఒకరకం లేతనీలంరంగు.

**విష్ణుచక్రము** వి. 1. మల్లబంధవిశేషం. మల్లుప. 3.68; 2. బాణసంచావిశేషం.

నం. విష్ణుచక్ర -. సుదర్శనం.

<నం. విష్ణుచక్ర- (అర్థవిపరి.).

**విసక** రూ.చూ. ఇసుక. వి. 1. ఇసక; 2. జలప్రవాహగతిలో ఏర్పడ్డ రాళ్ళపొడి.

**విసంచుచేయు** స.క్రి. చెరచు, ధ్వంసంచేయు. వైజ. 1.131.

క. విసంచిసు. ముక్కలగు, బలహీనమగు.

**విసదారి** వి. సర్పం. అచ్చ.రా.బాల. 31.

నం. విషధారిన్. పాము; ప్రా. విసధారి విసహర. పాము.

<ప్రా. విసదారీ.

విసదారితాలుపు రూ. విసదారితాల్పు. వి. శ్రీకంఠుడు, శివుడు. విసదారితాల్పు రూ.చూ. విసదారితాలుపు. వి. శ్రీకంఠుడు, శివుడు.

**విసన** చూ. వీచు. వి. విసనకఱ్ఱ.

విసనకఱ్ఱమెట్టు వి. అర్ధచంద్రాకారంగా ఉండే మెట్టు

విసనకఱ్ఱ రూ. విసినెకఱ్ఱ. వి. వీవన, తాళవృంతం. ప్రబంధ. 1.57. విసనకఱ్ఱగాలి వి. వీసనగాలి. విసనకఱ్ఱ వన్నె వి. అస్థిరం.

**విసపరి** చూ. విసము.

**విసపాల** చూ. విసము.

**విసపాలవిత్తు** చూ. విసము.

**విసపుమేఁతరి** చూ. విసము.

**విసపుమేఁతరిటెంకి** చూ. విసము.

**విసపుమ్రాఁకు** చూ. విసము.

**విసపుమ్రాను** చూ. విసము.

**విసబొద్ది** చూ. విసము.

**విసమగు** చూ. విసము.

**విసమాలుచు** చూ. విసము.

**విసమాల్చు** చూ. విసము.

**విసము** వి. 1. గరళం, విషం. పండి.చ. 3.606; 2. నీరు. యయా. 1.28.

నం. విష -. గరళం, జలం; ప్రా విస -; శౌ. జై. మహా. అ.మా. పా. అవ. విసం; మా. విశం;

క. బిసబిస; తు. విశ, విస; త. విటమ్; కుఇ బిస; కువి. విపామి; ఒరాయన్. బిర్ ఖ, బిస్, బిసి.

<ప్రా. విస-.

విసపరి వి. దుష్టుడు, దుష్టురాలు. పండి.చ. 5.116వ. <విసము + -అరి. విసపాల వి. ఓషధీవిశేషం, ఒకానొక మందుచెట్టు. <విసము + పాల. విసపాలవిత్తు రూ.చూ. ఇనుపాలవిత్తు. వి. దుష్టుడు. విసపుమేఁతరి వి. శివుడు. మృత్యు. 1.22. <విసము + మేఁత + -అరి. విసపుమేఁతరిటెంకి వి. శివాద్రి, కైలాసం. విసపుమ్రాఁకు వి. విషవృక్షం. <విసము + మ్రాఁకు. విసపుమ్రాను వి. విషవృక్షం. నీలా. 1.80. <విసము + మ్రాను. విసబొద్ది వి. పార, ఒకానొక చెట్టు. హంస. 4.10. <విసము + బొద్ది. విసమగు అ.క్రి. అయిష్టమగు, కష్టమగు. ద్వి. కల్యా. 182. <విసము +

అగు. **విసమాలుచు** రూ.చూ. విసమాల్చు. స.క్రి. రూపుమాపు. **విసమాల్చు** రూ. విసమాలుచు. స.క్రి. రూపుమాపు. బసవ. 6.574. <విసము + మాల్చు. **విసముతాల్పు** రూ.చూ. విసముదాల్పు. వి. పాము, సర్పం. **విసముదాల్పు(-తాల్పు)** రూ. విసముతాల్పు. వి. సర్పం, పాము, విషాన్ని ధరించేది.

**విసరాకడ** చూ. విసరు.

**విసరి** చూ. విసరు.

**విసరికొట్టు** చూ. విసరు.

**విసరియాడు** చూ. విసరు

**విసరివేయు** చూ. విసరు.

**విసరు** రూ. విసురు. స.క్రి. **1.** రువ్వు. భార. ఆది. 6.218 ; **2.** ఆడించు. భార. అను. 2.70 ; **3.** తిప్పు. ఉ.హరి. 1.166 ; **4.** విసనకర్రను ఆడించి గాలి ప్రసరించేటట్లు చేయు. వరాహ. 9.189 ; **5.** భుజించు, నోటిలో వేయు. సిం.నార. 38 ; **6.** చూర్ణంచేయు ; వి. **1.** ఆడించటం. హరి.ఉ. 5.161 ; **2.** వీచటం. మను. 3.8 ; **3.** రువ్వటం. మను. 4.115 ; **4.** మల్లవిద్యావిశేషం. ప్రబంధ. 78 ; **5.** దెబ్బ, పోటు. కవిరాజ. 5.265 ; అ.క్రి. **1.** వీచు. వరాహ. 7.56 ; **2.** కురియు. నిరంకు. 4.81.

క. బిసుడు (బిసుట్ట్-), బిసుర్. విసురువేయు, బిసు, బీసు. విసరు. వీచు, (గాలి) వీచు, (పిండి మొ.వి) విసురు, చూర్ణంచేయు ; త. విచిఱు. విసురు, వీచు ; మ. విసరుక. (గాలి) వీచు, రెక్కలతోకొట్టు ;

సం. విసర –. ప్రసరించటం, వ్యాపించటం, విసృ. ప్రసరించు ; ప్రా. విసర. తొలగు, జరుగు.

మూ.ద.ద్రా. విచ్–.

**విసరాకడ** వి. మల్లయుద్ధంలోని మెలకువ. <విసరు + ఆ$^{3}$ + కడ. **విసరి** వి. వేనవి. <విసరు+-ఇ$^{9}$. **విసరికొట్టు** రూ. విసిరి కొట్టు. స.క్రి. **1.** రువ్వు ; **2.** కసురు **3.** పగలగొట్టు. < విసరు +-. ఇ$^{13}$ + కొట్టు.$^{1}$ **విసరియాడు** స.క్రి. ఆడించు. రం.రా.యు, <విసరు+-.ఇ$^{13}$ + ఆడు. **విసరివేయు** రూ. విసిరివేయు. స.క్రి. రువ్వు. గిరాటువేయు. <విసరు+-.ఇ$^{13}$+వేయు. **విసరుమొన** వి. మల్లవిద్యావిశేషం. **విసరురాయి** రూ.చూ. విసరుబాయి. వి. తిరగలి, పిండి తయారు చెయ్యటానికి వాడే సాధనం. **విసరుబాయి** రూ. విసరురాయి, విసురురాయి. వి. తిరగలి. **విసరులు** వి.బ.వ. మల్లబంధాలు.

**విసవిస** వి. గాలివీచటం, కత్తి మొ. వాటిని తిప్పటం, నవ్వటం, నడవటం, ఊదటం, కోయటం మొ. వాటిలో అయ్యే ధ్వనికి అనుకరణం. **1.** నవ్వటంలో, భాగ. 8.386 ; **2.** ఊదటంలో. నవనాథ. 5.211పు. 21పం ; **3.** నడవటంలో. రాజ.చ. 8.107 ; **4.** కత్తి మొ. వి తిప్పటంలో. అని. 4.76 ; **5.** గాలివీచటంలో. రసిక. 4.47 ;**6.** కోయటంలో. ధర్మ. 3.164 ; విశ. ప్రసరించేది. సాగేది. శృం. నై. 3.72.

**విసవిసయుండిపోవు** అ.క్రి. దేనికదే ఉండిపోవు. <విసవిస+ ఉండు+-.ఇ$^{13}$+పోవు. **విసవిసయుండు (-ఉండు)** అ.క్రి. ఒకదానికొకటి అంటక ఉండు.

**విసవు** రూ.చూ. విసువు. వి. **1.** విసువు ; **2.** అసహ్యం.

**విసికించు** చూ. విసుకు.

**విసిగికొను** చూ. విసుగు.

**విసిగించు** చూ. విసుగు.

**విసినెకర్ర** వి. వీవన, తాళవృంతం.

**విసినెకర్రచీరె** వి. అంచులమధ్య పడుగులో విసినెకర్ర మాదిరి డిజైన్లు నేసినచీర.

**విసిపలక** వి. **1.** పడుకునే పెద్దబల్ల. ఆం.భా. 2.166 ; **2.** కూర్చుండే బల్ల.

**విసిమాలు** చూ. విసుకు.

**విసిరికొట్టు** చూ. విసురు.

**విసిరిచేట** చూ. విసురు.

**విసిరినపడుగు** చూ. విసురు.

**విసిరివేయు** చూ. విసురు.

**విసుకు** రూ.చూ. విసువు. వి. విసుగు. విసువు. అచ్చ. రా.యు. 5.52.

**విసికించు** రూ.చూ. విసిగించు. స.క్రి. విసిగించు. విజ్ఞా. 2.37. <విసుకు+-. ఇంచు$^{3}$. **విసిమాలు** అ.క్రి. మిక్కిలి విసుగు, విసుగెత్తిపోవు. భీమ. 2.101. **విసుక్కొను** రూ.చూ. విసువుకొను. అ.క్రి. **1.** విసుగుపొందు ; **2.** ఇతరులపై చిరాకుపడు.

**విసుక్కొను** చూ. విసుకు.

**విసుగు** రూ.చూ. విసువు. వి. విసువు, నిర్వేదం, వేసరటం. హర. 7.81 ; అ.క్రి. వేసరు. విసుగునుపొందు. విప్ర. 4.58.

**విసిగికొను** రూ.చూ. విసువుకొను. అ.క్రి. **1.** విసుగు పొందు, రోయు ; **2.** ఇతరులపై చిరాకుపడు. **విసిగించు** రూ.చూ. విసికించు. స.క్రి. విసుగు పుట్టించు. **విసుగుకొను** రూ. చూ. విసువుకొను. అ.క్రి. **1.** రోయు, పొందు ; **2.** ఇతరులపై చిరాకుపడు.

**విసుఁగు** రూ.చూ. విసువు. అ.క్రి. వేసరు. విసుగును పొందు, నిర్వేదాన్ని పొందు. విప్ర. 4.58.

**విసుపాలవిత్తు** చూ. విసము. రూ. విసపాలవిత్తు. విశ. నాశకుడు, ఒకతిట్టు. గౌ.హరి. 2.2036.

**విసుపు** రూ.చూ. విసువు. వి. **1.** విసుగు ; **2.** రోత.

**విసుమానము** విశ. **1.** ఆశ్చర్యకరం, వింతైనది. భార.విరా. 3.5 ; **2.** ఎగుడు దిగుడైనది. మను. 4.73. వి. ఆశ్చర్యం. కాశీ. 2.105.

సం. విస్మయ –. ఆశ్చర్యం, విస్మాపన – ఆశ్చర్యం కలిగించటం ; ప్రా. వింహావణ–, వింహావణా. విస్మయాన్ని కలిగించేది, ప్రా.శా. జైమహా. అ.మా. అవ. సంహాయం ; విసుమఅ :

క. విసుమయ ; తు. విస్మయం ;

**విసురు** రూ.చూ. విసరు. స.క్రి. **1.** ఆముగొట్టంలోకి పోగు తీసుకొని ఆసుకొయ్యలకు చుట్టి వచ్చేట్లు చేయు ; **2.** రువ్వు ; **3.** తిప్పు ; అ.క్రి. వీచు.

**విసిరికొట్టు** రూ.చూ. విసరికొట్టు. స.క్రి. **1.** దూరంగా

విసరివేయు ; **2.** ఆముకు నిప్పు రగిలించి చేట మొ. వాటితో విసురు. <విసురు + -. ఇ[13] + కొట్టు[1]. **విసిరిచేట** రూ.చూ. విసురుచేట. వి. ఆము రాజేయటానికి విసిరే చేట. **విసిరిన పడుగు** వి. మరానుకు చుట్టిన పడుగు నూలు. **విసిరివేయు** రూ.చూ. విసరివేయు. స.క్రి. గిరాటువేయు, రువ్వు. **విసురుచేట** రూ. విసిరిచేట. వి. ఆము రాజేయటానికి విసిరే చేట. వి. **సురుతడిక** వి. వెదురు బద్దల్తో అల్లిన తడక, ఆము రాజేయటానికి ఉపయోగించేది. **విసురురాయి** రూ.చూ. విసరుఱాయి. వి. తిరగలి, పిండి తయారు చేయటానికి వాడే సాధనం.

**విసువానము** వి. నమ్మకం.

సం. విశ్వాస -. నమ్మకం ; శౌ. విస్సాస - ; శౌ. అ.మా.పా. విస్సాస -; ప్రా. విస్సస - విశ్వసించు, విస్సాస-, విసాస-. శ్రద్ధ. ప్రతీతి

క. ఇసవాస ; త. విసువావమ్.

<సం. విశ్వాస-.

**విసువాసి** వి. నమ్మకం కలవాడు. ఆం.భా. 3.10.

సం. విశ్వాసిన్, విశ్వాసం కలవాడు.

<సం. విశ్వాసిన్.

**విసువు** రూ. విసవు. విసుకు, విసుగు, విసుఁగు. విసుపు. అ.క్రి. **1.** నిర్వేదాన్ని పొందు, వేసరి. భార. ఆది. 7.207 ; **2.** నిర్వేదం. శృం.నై. 8.52.

తు. బెసరు. అలసట. అలసత్వం. బేంకు. మాలిన్యం ; త. విచుకు్క. విదారం ; మ. విచక్క. కోపంగా ఉండు ; పో.చూ. కురు. బిర్ర్ - అలసిపోవు, ఉబ్బుపడు.

మూ.ద.ద్రా. *విచ్-వ్-.

**విసువుకొను** రూ. విసిగికొను, విసుక్కొను, విసుగుకొను. అ.క్రి. నిర్వేదాన్ని పొందు. కవిరాజ. 3.160.

**విస్క** రూ.చూ. ఇసుక, వి. **1.** ఇసక ; **2.** జలప్రవాహగతిలో ఏర్పడ్డ రాళ్ళపొడి.

**విస్తర** రూ.చూ విస్తరి. వి. భోజనం చేసే ఆకు. శుక. 4.108.

**విస్తరంట** వి. విస్తరి. కుట్టుడాకు. **విస్తరాకు** వి. భోజనం చేసే ఆకు. <విస్తర + ఆకు. **విస్తరాకులవెట్టి** వి. పన్నునూచి. ద.హిం.శా. సంపు. 16 శా.సం. 89. క్రీ.శ. 1524.

**విస్తరాకు** చూ. విస్తర.

**విస్తరాకులవెట్టి** చూ. విస్తర.

**విస్తరి** రూ. విస్తర. వి. భోజనం చేసేఆకు. క్రీడా.పి. 60.

సం. విస్తర -, విస్తార -. వ్యాపించటం, వ్యాప్తి, వైశాల్యం.

<సం. విస్తర-.

**విస్తళ్లవేయు** స.క్రి. భోజనానికి సిద్ధంచేయు, పీటలు వేయు.

**విస్తళ్లవేయు** చూ. విస్తరి.

**విస్తు** వి. **1.** ఆశ్చర్యం. నవనాథ. 3.208వ. 14పం ; **2.** దుర్గంధం.

సం. విస్రంసా. పడిపోపటం, అశక్తి.

**విస్తుపోవు** అ.క్రి. ఆశ్చర్యపడు.

**విస్పందు** వి. పుల్లబంధవిశేషం ప్రబంధ. 1.78. పుల్లు. 3.68.

సం. విష్యంద-, విస్యంద-. ప్రవహించటం, స్రవించటం, విష్యంద్. స్రవించు, పైకిపొరలు ; ప్రా. విస్సంద. జారు, బొట్టు బొట్టుగాపడు.

<ప్రా. విస్సంద-.

**విస్సన్నచెప్పినవేదం** వి. ఆయనమాటే వేదవాక్యం అనేనందర్భంలో వాడేపలుకుబడి. 'విస్సన్న' వ్యక్తినామం లేదా బసవన్న (గంగిరెద్దు) కావచ్చు.

**విహా** వి. ప్రతిబంధకం. విఘాతం. ద. హిం.శా. సంపు. 10. శా.సం. 711. క్రీ.శ. 1183.

సం. విహా. విడివిపెట్టటం.

<సం. విహా (అర్థవిపరి.).

**విహారవాడ** వి. దేవాలయాన్ని అంటిఉన్న ఉద్యాన విహారస్థలం, స్నానంరేవు. ద. హిం. శా. సంపు. 4. శా. సం. 1190. క్రీ.శ. 1143.

సం. విహార-. తీసివేయటం, ఆట, ఉద్యానవనం, బౌద్ధమఠం, మఠం.

<సం. విహార- + వాడ (మిశ్రస.).

**విహితకట్నాలు** వి.బ.వ. పన్నునూచి. నె.శా. ఒంగోలు. 29. క్రీ.శ. 1566.

సం. విహిత-. ఏర్పరుపబడిన, విధించబడ్డ.

<సం. విహిత- + కట్నము + -లు.

**విహితుఁడు** వి. స్నేహితుడు. కుచే. 1.107.

సం. విహిత-. ఉంచబడ్డవాడు, ఏర్పాటు చేయబడ్డవారు.

<సం. విహిత- (అర్థవిపరి.).

**వీకు** చూ. వీఁక. వి. 1. పరాక్రమం. భార. ఆది. 7.228 ; **2.** ఉత్సాహం, పూనిక. భార. అరణ్య. 3.200 ; **3.** గర్వం, ఔద్ధత్యం. కు.సం. 12.15.

**వీకొను** చూ. వీఁగు[2].

**వీంగు** రూ.చూ. వీఁగు[1]. అ.క్రి. **1.** విజృంభించు. కు.సం. 1.4 ; **2.** ఉత్సహించు. పండి.చ. 4.2.95.

**వీఁక** చూ. వీఁగు[1].

**వీఁకఁదనము** చూ. వీఁగు.[1]

**వీఁకవిల్లు** చూ. వీఁగు.[1]

**వీఁగని** చూ. వీఁగు.[2]

**వీఁగఁబాఱు** చూ. వీఁగు.[2]

**వీఁగారు** చూ. వీఁగు.[1]

**వీఁగిపోవు** చూ. వీఁగు.[2]

**వీఁగియాడు** చూ. వీఁగు.[2]

**వీఁగు[1]** రూ. వీంగు. అ.క్రి. **1.** ఉత్సహించు. భార. ఆది. 3.5 ; **2.** చలించు. కు సం. 4.115 ; **3.** ప్రసిద్ధికెక్కు. పండి. చ. 2.162 ; **4.** నిక్కు. వరాహ. 3.103.

క. బీగు. ఉబ్బు, పెద్దదగు, గర్వించు, గర్వంతో ప్రవర్తించు ; త. వీంగు. పెద్దదగు, ఉబ్బు, వికక్కమ్. గర్వం, విరియల్. గొప్పతనం ; మ. విణ్ణుక. వాచు, ఉబ్బు, వికుక్కమ్. గర్వం ; కో. విచ్. (పైఅధికారులతో) అహంభావంతో మాట్లాడు ; కుయి. పిగ. బరువుగా

ఉండు : కువి. విఖ్. బరువుగా ఉండు ; కురు. బిండె వ్యాపించు.

<మూ. ద్రా. *విఁయ్- (*విచ్-) *వీ.

**వీఁక** వి. 1. బలం. భార. ఆది. 5.166 ; 2. విజృంభణం. భార. ఆది. 6.172 ; 3. పరాక్రమం. భార. సభా. 2.41 ; 4. గర్వం. కు.సం. 9.59 ; 5. ఉత్సాహం. హరిశ. భార. ద్రోణ. 1.162 ; 6. సామ్యం. భార. శాంతి. 3.227 ; 7. దైన్యం. భార. అరణ్య. 5.56 ; 8. సాహసం. మను. 4.62 ; 9. ఔన్నత్యం. పాండు. 5.31 ; 10. విధం. ఘటికా. 2.145 ; 11. విహారం. వీను. 3 149 ; 12. యుద్ధం నుంచి పారిపోవటం. యయా. 1.128 ; 13. ఔదార్యం. విజయ. 3.150 ; 14. వంగటం. విష్ణుపు. 7.147 ; పిఱ. పొదుగెంది. బసవ. 3.1117. క. బీ. నాశనం, చావు, నిలబడిపోవటం, విరమించటం, బికలే. ముగింపు, బీగు. వెనుకంజవేయు, వెనుకకు తీసుకొను, బిసర. ముగింపు, నాశనం, విధ్వంసం. సంహారం ; త. వి. (-వ్-,-న్త్-). నాశనం, అదృశ్యం, చావు, విధ్వంసనం, వేర్పాటు, క్షీణం, తొలగింపు, వికుక్క (వీక్క-). నాశం, విఫు. నాశం, విధ్వంసం, సంహారం, తొలగింపు. సమూలనాశం, విరామం, అపరాధం, వితల్. చావు, వీక్కమ్. వాచటం, ఉబ్బటం. గుంపు. గర్వం ; మ. వీక్కమ్. వాపు, కోపం. **వీఁకదనము** వి. ఉత్సాహం. దశకు. 7.106. **వీఁకవిల్లు** వి. ఒకరకమైన విల్లు. ధనుర్విశేషం. ప్రబంధ. 35. **వీఁగారు** అ.క్రి. నిక్కు. కు.సం. 8.9. <వీఁగు+ఆరు[1].

**వీఁగు**[2] స.క్రి. విఱుచు. హరి. పూ. 5.165 ; అ.క్రి. 1. ఒదిగిఉండు. ఆము. 4.93 ; 2. శిథిలమగు. రాజవా. 2.69 ; 3. విసరు, వీచు. కువ.చ. 4.144 ; 4. తొలగు. అపసరిల్లు. ఉ.రా. 2.196 ; 5. వెనుదీయు. మల్లభూ. నీతి. 72 ; 6. యుద్ధంనుంచి పారిపోవు. అచ్చ.రా. బాల. 45.

క. బిగు. వెనక్కుపోవు, బి. ముగింపు, తప్పు. బిసర, ముగింపు, నాశనం ; త. వి. (-వ్-,-న్త్-). నశించు, మాయమగు, పారిపోవు, వికుక్క. చంపు, నశింపచేయు. విఫు. నాశనం, చావు వితల్. చావు.

మూ. ద. ద్రా. మూ.మ.ద్రా. *వీ-.

**వీఁగొను** స.క్రి. విఱుచు ; అ.క్రి వెడలిపోవు. **వీఁగని** రూ.చూ. వీఁపని. విశే. క్షీణించని, పూర్ణమైన. **వీఁగఁబాఱు** (-పాఱు) అ.క్రి. (స్వార్థంలో[2]) యుద్ధంనుంచి పారిపోవు. విక్ర. 4.100. <వీఁగు[2]+-అ[7]+పాఱు[2] **వీఁగిపోవు** అ.క్రి. ఓడిపోవు. <వీఁగు+ -ఇ[13]+పోవు. **వీఁగియాడు** అ.క్రి. సంచలించు. <వీఁగు+-ఇ[13]+ ఆడు.

**వీచు** అ.క్రి. 1. (గాలి) విసరు, ప్రసరించు. భార. ఆది. 5.170 ; 2. విసరు. గాలిని ప్రసరింపచేయు, గాలివచ్చేటట్లు చేయు. శృం. నై. 2.51 ; స.క్రి. 1. గిరగిరతిప్పు. భార. సభా. 1.208. కు.సం. 12.158 ; 2. (పరికొల్పటంకోసం చేయు) విసరు, ఆడించు. భార. భీష్మ. 2.28 ; 3. చలింపచేయు, ఆడించు. ద్వి. పరమ. వి. 3.193పు ; 4. తరుము.

క. బీసు, బిసు. ఊగు, గుండ్రంగా తిరుగు, విసురు ; కొడ. బి.స్. ఒరగలితో విసరు ; తు. బీజుని. ఊగు. (గాలిలా) వీచు ; త. విచు. (వీచి-). విసురు. (రెక్కలు) కొట్టుకొను, (చేయి, మొ. వాటిని) ఊపు, వీచు, వ్యాపించు. పారవేయు, విడుచు. విచ్చు). విసరు, విచిఱు (విసిఱి), విసురు, వీచు, ఇటూఅటూకదులు, తిరుగు. తొలగించు. ఊగు ; మ. వ్యామక. వీచు ; కో. వి.చ్. పారవేయు, తోయు, విసురు ; తొ. పి.స్. విసురు ; గో. విహీతానా. ఒందకతోయు ; కుఇ. వింజ. విసురు, క. మురళి మొ. వాటిని ఊదు ; కురు. బిఖర్నా ; మాల్తొ. బెగ్గారె. గుద్దేందుకుచెయ్యి ఎత్తు ;

పో.చూ. సం. విజ్-, వ్యజ్. విసురు. వీచు.

<మూ.ద్రా.*వీ-/*వీ-చ్.

**వీచోపు** వి. వింజామరం. శృం. నై. 6.80. క. బీసు, బిసు. కెరటం. గిరగిర తిరగటం, విసనకర్ర, మర, తాటి ఉయ్యెల. బీసిసు. మర. బిసణిగె, బిసణికె. విసనకర్ర, బీసాడు. రువ్వటం, విసరటం, బీసాడువికె. దూరంగా విసరటం ; తు. బీజాటు. విసరటం, బీజాడుని బీజావుని. విసనకర్ర, కెరటం, ఊపటం, రువ్వటం, విసరటం. బిసణిగె, బిసనిగె. విసనకర్ర ; త. విచు. (వీచి-,) విసనకర్ర, కెరటం, తెక్క, దళం, వ్యాపించటం. విస్తరించటం, వైశాల్యం, చిందటం, ఒలకబోయటం, విచ్చమ్. వాసన, విచ్చు). పొడవు, వేగం, ఒకపిడి, విసిఱి. విసనకర్ర. అవనతం, అస్త్రం, వేగం, ఒత్తిడి, ఒకపిడి, విల్లులాంటిగుణం ; మ. విచ్చి. విసనకర్ర, విసుక్. విసరటం, విసేఱి. విసనకర్ర, విసారి. విసనకర్ర ; కుఇ. వింజి (వీంజి-). విసనకర్ర, విస్క. వేగం ; సం. విజన-, వ్యాజన- విసనకర్ర. **వీచోపులిడు** అ.క్రి. వింజామరలతో విసరు. కాశీ. 4.296. <వీచోపు+-లు+ఇడు. **వీతెంచు** అ.క్రి. 1. శ్రవణగోచరమగు, వినవచ్చు. భార. ఆది. 4.106 ; 2. విసురుచు వచ్చు, రామాభ్యు. 7.46. <వీచు+తెంచు. **వీవన** రూ. వీవెన. వి. విసనకర్ర. భాస్క. రా. కిష్కిం. 59. **వీవలి** వి. గాలి, వాయువు. వేంక. పంచ. 2.174. **వీవలిచెలి** వి. అగ్ని, వాయుసఖుడు. చంద్రికా. 6.41. **వీవెన** రూ.చూ. వీవన. వి. విసనకర్ర.

**వీచోపు** చూ. వీచు.

**వీచోపులిడు** చూ. వీచు.

**వీటతటము** రూ.చూ. విటతాటనము. విశే. భిన్నం, భగ్నం.

**వీటతాటనము** రూ.చూ. విటతాటనము. విశే. తారుమారు, వ్యత్యాసం.

**వీటతాటము** రూ.చూ. విటతాటనము. విశే. భిన్నం, భగ్నం. భార. ద్రోణ. 1 275.

**వీటి** వి. కొల్ల, దోపుడు.

క. బిడ్-ఆగు. చచ్చు, మాయమగు, చెడు ; త. విటు. చచ్చు, విట్టు (వీట్టి-). చంపు, తొలగించు. విడల్.

**పీటి(గలుపు** (-కలుపు[1]) అ.క్రి. నష్టం కావించు. విడచివైచు. ఆము. 4.43. **పీటి(బుచ్చు** (-పుచ్చు) స.క్రి. 1. చెరచు, నశింపచేయు. భార. భీష్మ. 2.269 ; 2. నష్టపరచు, త్యజించు. భాస్క. రా. అరణ్య. 2.247 ; 3. వ్యర్థంచేయు. వి.క. 2.188. **పీటి(బోవు** (-పోవు) అ.క్రి. 1. చెడు[1] నశించు. భార. ద్రోణ. 1.363 ; 2. దూషితమగు. హరి. ఉ. 7.91 ; 3. వ్యర్థమగు. భోజ. 5.229.

**పీటిక** వి. శరీరం పగిలే వ్యాధి.

సం. స్ఫుటికా, స్ఫోటికా. పగిలినముక్క, పగులు చీలు.

**పీటిది** చూ. పీడు[2].

**పీటిపట్టు** చూ. పీడు2.

**పీటి(ప్రోగు** చూ. పీడు[1].

**పీటి(బాఱు** చూ. పీడు[1].

**పీటివా(డు** చూ. పీడు2.

**పీడ(జేయు** చూ. పీడు[1].

**పీడనాడు** చూ. పీడు[1].

**పీడ(బడు** చూ. పీడు[1].

**పీడ(బారు** చూ. పీడు[1].

**పీడలి** వి. తృణవిశేషం. ప్రబంధ. 200.

**పీడాకు** చూ. పీడు[1].

**పీడికోలు** చూ. పీడు[1].

**పీడియము** రూ.చూ. విడియము. వి. విడెం, తాంబూలం, తమలం. పాండు. 1.29, కాశి. 1.35.

**పీడియాపు** వి. సన్నగా మొనదేలి అరంగుళం పొడవుండే ఉక్కు ముక్క.

**పీడు[1]** అ.క్రి. 1. పిడిపోవు. కు. సం. 8.65 ; 2. విశదమగు, స్పష్టమగు. భార. విరా. 2.51 ; 3. పొడలు. వర్ధిల్లు. కాశి. 3.210 ; 4. శిథిలమగు తగ్గు, నశించు. వసు. 6.35 ; 5. జారిపోవు. కువ.చ. 2.35 ; 6. విచ్చిపోవు, పీడు. ఉ.రా. 3.22 ; 7. సరిచేసి పడుగు పోగులు ఆరి విడివిడిగా అగు ; స.క్రి. 1. విడిచిపెట్టు. హర. 2.70 ; 2. విడిచిపోవు. నీలా. 1.103.

క. బిడు. (బిట్ట్-). వదులగు, విసురు, వదులు, విడుచు, వేరుచేయు, బిడువికె. విడిచిపుచ్చు ; కొడ. బిడ్. విడుదలచేయు, వదులు ; తు. బుడుపు-వదులు. విసర్జించు, విడిచిపెట్టు ; త. విడు (విటుప్-విట్ట్-). విడుచు, వదులు. తప్పించుకొను, పంపించు, విడిచిపుచ్చు, విడుదలచేయు, విటుతలై. విశ్రాంతి. విడుదల, స్వతంత్రం, విటుతి. విడిది, విశ్రాంతిస్థలం, విటై. (-ప్-,-న్ట్-). విడదీయు ; మ. విటుక (విట్ట్-). వదులగు, విడిపోవు. మరచిపోవు, విటుతల్. విడుదల, విటుతి. విడిది. స్వతంత్రత, సెలవు, విటుక్క, విటుత్తుక. విడదీయు, విటువిక్క. విడుదల చేయు, విడదీయు, వేరుచేయు ; తొ. పిర్-(పిట్-). విడుదలచేయు, విడాకులిచ్చు ; బ్రా. బిటింగ్. విసరివేయు. కిందకి తోయు, పో.చూ. మరా. బిడార్. ఇల్లు. నివాసం.

**పీటి(ప్రోగు** విణ. మిక్కిలిదుర్వ్యయం చేసేవాడు, వ్యర్థుడు. పాండు. 3.13. <పీడు[1] +-ఇ[3] + ప్రోగు **పీటి(బాఱు** అ.క్రి వ్యర్థంగా పరిగెత్తు. శృం. నై. 5.133. <పీడు[1]+-ఇ[3]+-ను+పాఱు[2]. **పీడ(జేయు** స.క్రి. తొలగించు. <పీడు[1]+-అ[7]+ చేయు. **పీడనాడు** స.క్రి. విడనాడు, విడుచు. రాజవా. 3.142. <పీడు[1]+-అ[7]+ ఆడు. **పీడ(బడు** అ.క్రి. విడువబడు, వేరుగా ఉండు. సీతారా. 1.102. <పీడు[1]+-అ[7]+పడు. **పీడ(బారు** అ.క్రి. పిడిపోవు. శుక. 3.61. <పీడు[1]+-అ[7]+పారు[1] **పీడాకు** రూ. విడాకు. వి. విడిఆకు, వేర్పాటు సూచించే పత్రం. వరాహ. 2.28వ. <పీడు[1]+ ఆకు. **పీడికోలు** రూ.చూ. పీడ్కోలు. వి. 1. నిడుపు ; 2. ఓటమి. **పీడుకొను** రూ.చూ. పీడ్కొను. స. క. 1. పోయి వస్తానని విన్నవించి విడుచు. కు.సం. 4.31 ; 2. విడుచు, త్యజించు. ఉ. హరి. 2.146. **పీడుకొలుపు** రూ. పీడుకొల్పు, పీడ్కొలుపు. పీడ్కొల్పు. స.క్రి. 1. పోయిరమ్మని సెలవిచ్చి పంపు. కు. సం. 6.31, భార. ఉద్యో. 2.16 ; 2. వదులు, విడుచు, త్యజించు. హర. 3.19 ; 3. మీదికినెట్టు, పైకితోయు. హర. 5.48 ; 4. విడిచి పెట్టించు. భీమ. 2.62. **పీడుకొల్పు** రూ.చూ. పీడుకొలుపు. స.క్రి. 1. పోయి రమ్మని సెలవిచ్చి పంపు ; 2. వదులు, విడుచు. త్యజించు ; 3. మీదికినెట్టు, పైకితోయు ; 4. విడిచిపెట్టించు. **పీడుకోలు** రూ.చూ. పీడ్కోలు. వి. 1. విడుపు, విసర్జనం. భాస్క.రా. యు. 1390 ; 2. పీడ్కోవటం పోవటానికి అనుమతించటం హరి. ఉ. 3.172 ; 3. చావు. మరణం. భోజ. 4.54. పీడుకోలుచేయు స.క్రి. విడిచిపెట్టు, విసర్జించు. ప్రబోధ. 3.50. పీడుగడ వి. 1. చావు ; 2. వెళ్ళటానికి అనుజ్ఞ ఇవ్వటం. పీడుచు రూ. పీడ్చు. స.క్రి. పీడచేయు విప్పు. శృం. నై. 7.194. పీడుజోడు రూ.చూ. విజ్జోడు. విణ. 1. జోడుకానిది, సరిరానిది ; 2. ఎడబాటు పొందినది. పీడుదోడు (తోడు[1]) వి. పంపించే తోడు, సాగనంపే సహాయకుడు. విష్ణుపు. 1.43. **పీడుపట్టు** వి. విడిది, ఆటపట్టు. పీడుపడు రూ.చూ. పీడ్వడు. అ.క్రి. 1. భేదపడు, వేర్పడు. సిం. ద్వా. 8.168 ; 2. తడబడు. వి.క. 4.111 ; 3. తారుమారగు, మారుపడు. విష్ణుపు. 6.131. **పీడుపాటు**, రూ. పీడ్పాటు. వి. 1. మారుపాటు, వ్యత్యయం. నిర్వ. రా. 8.80 ; 2. వెనలుబాటు. భాగ. 9.30 ; 3. విడుపు, విడుదల, విమోచనం. భాగ. 10పూ. 38 ; 4. తత్తర. **పీడువడు** (-పడు) రూ.చూ. పీడ్వడు. అ.క్రి. 1. తడబడు. భార. విరా. 2.70 ; 2. తారుమారగు, మారుపడు. మార్క. 4.92 ; 3. భేదపడు, వేర్పడు. **పీడువెట్టు** (-పెట్టు) స.క్రి. విడిచిపెట్టు, వదిలివేయు. తాళ్ల. సం. 9.172. **పీడ్కొను** రూ. పీడుకొను. స. క్రి. 1. విడుచు. త్యజించు, విడిచిపెట్టు. భార. ఆది. 1.118 ; 2. పోయి వస్తానని విన్నవించి విడుచు. కు. సం. 1.114 ; 3. తప్పించుకొను. వసు. 1.139. పీడ్కొలుపు రూ.చూ. పీడుకొలుపు. స.క్రి. 1. తోయు. కాశి. 6.175 ; 2. పోయి రమ్మని సెలవిచ్చిపంపు. భీమ. 1.95 ; 3. విడుచు. త్యజించు. హర. 4.36. పీడ్కొల్పు రూ.చూ. పీడు

కొలుపు. స.క్రి. 1. పోయిరమ్మని సెలవిచ్చి పంపు, పంపు. రామాభ్యు. 7.208; 2. విడుచు, త్యజించు; 3. తోయు. **వీడ్కోలు** రూ. వీడికోలు, వీడుకోలు. వి. 1. వీడ్కొనటం, పోవ అనుమతి. భార. ఉద్యో. 4.162; 2. విసర్జనం, విడుపు. ప్రబంధ. 570; విణ. విడిపించే వాడు. వరాహ. 5.59. **వీడ్చు** రూ.చూ. విడుచు. స.క్రి. 1. దొంగిలించు, పడుల మూటల్ని విప్పి అందులో వస్తువుల్ని హరించు. విజ్ఞా. ప్రాచా. 95. **వీడ్పాటు** రూ.చూ. వీడుపాటు. వి. 1. మారుపాటు, వ్యత్యయం; 2. వెసలుబాటు; 3. విడుపు, విడుదల, విమోచనం. **వీడ్వడు** రూ వీడుపడు, వీడువడు. అ.క్రి. 1. మారుపడు. భార. ఆది. 4.228; 2. తడబడు. భార. భీష్మ. 3.351; 3. బంధం నుంచి తొలగు, తప్పుకొను. భాస్క. రా. యు. 1058; 4 భేదపడు. భాగ. 6.333; 5. విడిపోవు. శిథిలమగు. జైమినిభా. 8.17.

**వీడు²** వి. బొ. 1. పట్టణం. ద.హిం.శా. సంపు 10. శా.సం. 645. క్రీ.శ. 1060; 2. పాళెం, స్కంధావారం, దండు విడిసేచోటు. కు.సం. 4.23; 3. సేన, దండు. భార. ఉద్యో. 2.304; 4. పథిక జనసమూహం, గుంపు. భార. మౌసల. 180; 5. ఇల్లు, గృహం. ఆము. 3.60; 6 దొమ్మర్లగుంపు. చెన్నబసవ. 2.304.

**వీటిది** విణ. వెదురుగెడమీద ఆడేది, దొమ్మరిది. వేమ. 354. **వీటిపట్టు** వి. 1. నగరం, పట్టణస్థానం. హరి. పూ. 6.5; 2. వాసస్థానం. సురా. 22. <వీడు² + -ఇ³ + పట్టు². **వీటివాఁడు** విణ. దొమ్మరి వాళ్ళలో ఒక తెగవాడు. <వీడు² + -ఇ³ + వాఁడు. **వీడుకూడు** వి. ఇంటిభోజనం. తాళ్ల. సం. 17.147. **వీడుకోళ్లగుడుచు(-కుడుచు)** అ.క్రి. విందుభోజనాలుచేయు. కళా. 7.85. **వీడుజోడాడు¹** రూ. వీడుదోడాడు. అ.క్రి. 1. పెనగొను. రం. రా. అయోధ్యా. 96ప. 17పం; 2. మారుమలయు, ప్రతిఘటించు. వరాహ. 4.162. **వీడుదోడాడు** రూ.చూ. వీడుజోడాడు¹. స.క్రి. పెనగు. తాళ్ల. సం. 4.98. **వీడుపట్టు** రూ. వీడుఁబట్టు. వి. 1. వాసస్థానం, ఉనికిపట్టు. కు. సం. 3.18; 2. బస, విడిది. నిర్వ. రా. 9.4; 3. శిబిరం, స్కంధావారం, దండువిడిసే చోటు. **వీడుఁబట్టు(-పట్టు²)** రూ.చూ. వీడుపట్టు. వి. 1. వాసస్థానం, ఉనికిపట్టు. భార. శాంతి. 2.364; 2. బస, విడిది. భార. అశ్వ. 4.186; 3. శిబిరం, స్కంధావారం, దండువిడిసేచోటు. పల్నా. 45. **వీడుపిడియ** అ.క్రి. దండుదిగు, శిబిరం ఏర్పరచుకొను. భార. ఉద్యో. 1.50. **వీడెత్తిచను** అ.క్రి. దండెత్తు. **వీడెత్తు** అ.క్రి. దండువెడలు. పారి. 2.65.

**వీడు³** రూ. ఈడు³. వి. 1. బహుమానం. ద. హిం. శా. సంపు. 10. శా. సం. 35. క్రీ. శ. 10వ శతాబ్ది; 2. కట్నం. వసు. 6.35.

మూ.ద్రా. *విట్-/ *వీట్-.

**వీడుచదువు** అ.క్రి. కట్నాలు చదువు. దశా. 5.77.

**వీడులుచదువు** అ.క్రి. కట్నాలుచదువు.

**వీడు⁴** వి. సామ్యం. ముకుంద. 2.99.

**వీడుకువీడు** వి. సరిసరి, దెబ్బకుదెబ్బ. రాధికా. 2.113. **వీడుజోడాడు²** అ.క్రి. సరిపోలు, సామ్యంపొందు. ఉ.హరి. 4.213.

**వీడు⁵** విణ. విశదమైంది. నవనాథ. 2.108ప. 2పం.

**వీడెత్తిచను** చూ. వీడు².

**వీడెత్తు** చూ. వీడు².

**వీడెపుటాలు** చూ. వీడెము.

**వీడెము** రూ.చూ. విడెము. వి. తాంబూలం. ఉ. హరి. 3.147, శృం. నై. 6.141.

**వీడెపుటాలు(-అలు²)** వి. తాంబూలమిచ్చే స్త్రీ. తాళ్ల. సం. 16 2.20.

**వీడ్కొను** చూ. వీడు¹.

**వీడ్కొలుపు** చూ. వీడు¹.

**వీడ్కొల్పు** చూ. వీడు¹.

**వీడ్కోలు** చూ. వీడు¹.

**వీడ్చు** చూ. వీడు¹.

**వీడ్పాటు** చూ. వీడు¹.

**వీడ్యము** రూ.చూ. విడెము. వి. తాంబూలం. పండి. చ. 2.168.

**వీడ్వడు** చూ. వీడు¹.

**వీణము** రూ.చూ. వీణాము. వి. సన్నని వస్త్రం, వలిపం, అంశుకం.

**వీణాధరులు** వి.బ.వ. ఉద్యోగసూచి. రా.వా. 5.

సం. వీణాధర-. వీణను ధరించేవాడు.

<సం. వీణాధర- + -లు (అర్థవిపరి.).

**వీణాము** రూ. వీణము. వి. వస్త్రం, అంశుకం. జైమినిభా. 3.11

సం. వయన-. నేయటం, వయతి. నేస్తున్నాడు, నేస్తున్నది; పా. వాయతి.

**వీణియ¹** రూ.చూ. వీణె.¹ వి. కస్తూరిమృగంయొక్క కస్తూరి ఉండే బొడ్డుకాయ. బల్లా. 3.

**వీణియ²** రూ. వీణె², వీనియ, వీనె. వి. వీణ, విపంచి. క్రీడా. పు. 95, కళా. 6.217.

సం. వీణా, వీణికా; ప్రా. వీణిఆ, వీణా; అ.మా. వీణ; పా. వీణా;

క. బీణె, వీణె; తు. ఈణె, బీణె, వీణె.

<ప్రా. వీణిఆ.

**వీణె¹** రూ. వీణియ¹. వి. కస్తూరిమృగంయొక్క కస్తూరిఉండే బొడ్డుకాయ. విజయ. 2.90.

సం. వినతా. ఒకరకం బుట్ట; ప్రా. విణయా.

<ప్రా. విణయా.

**వీణెపెల్లి** వి. కస్తూరిమృగం.

**వీణె²** రూ.చూ. వీణియ². వి. వాద్యవిశేషం, విపంచి.

**వీణెకాఁడు** వి. వీణవాయించేవాడు. **వీణెకాయ** వి. వీణకు కట్టే తుంబిఫలం. ముకుంద. 2.102. **వీణెమేళగించు** స.క్రి. ఏదోనిర్దుష్టమైన రాగానికి అనుకూలంగా శ్రుతిపరుచు. కళా. 2.89.

**వీణెసవరించు** స.క్రి. శ్రుతిచేయు. కళా. 2.63.

**వీఁడు** సర్వ. ఈ పురుషుడు. ద.హిం.శా. సంపు. 4. శా. సం. 1014. క్రీ.శ. 1038. భార. ఆది. 4.565.

క. ఇవం, ఇవను. ఈపురుషుడు; కొడ. ఇవె(న్); తు. ఇంబె; త. ఇవన్; మ. ఇవన్; కో. ఇవ్న్; గోం. ఏల్/వేర్; కొం. వేన్లు/ఇకన్; పెం. ఇవన్; కుఇ. ఇఅంజు; కువి. ఈవసి; కొలా. ఇమ్, ఇమ్ద్, ఇవ్ంట్; నా. ఈన్; కురు. ఈస్; మాల్తో. ఈనొ.

<మూ. ద్రా. *ఇవన్ త్.

**వీఁడుగో** అవ్య. **1.** ఎదుటఉన్న పురుషుని నిర్దేశించ టంలో ఉపయోగపడుతుంది. జైమినిభా. 3.114; **2.** నిశ్చయంగా ఇతడేఅని అర్థం ఇస్తుంది. పి.శకు. 2.92. **వీఁడువాడనక** అవ్య. ప్రతి వ్యక్తిని. హంస. 4 200.

**వీతెంచు** చూ. వీచు.

**వీది** రూ. వీథి. వి. **1.** మార్గం. వీథి, తోవ. దశకు. 9.51; **2.** ఇళ్ళవరసల రెండింటికి మధ్యతోవ; **3.** విశాలమయిన బాట.

సం. వీథి-, వీథికా, వీథీ. బాట, తోవ, పంక్తి, అంగడి; ప్రా. వీహి, వీహియా, వీహీ: అ.మా. వీహీ, పా. వీథి-.

క. బీది, వీది. తోవ, బాట; తు. బీది; మ. వీతి.

<సం. వీథి-.

**వీదిపోటి** వి. వీధికడ్డంగా ఇల్లుండటమనేతప్పు. **వీదిరేవు** రూ.చూ. వీధిరేవు. వి. ఆముకు మధ్యభాగంలో పొయ్యికి ఎదురుగా చక్కగా ఉండేపెద్దరేవు. **వీదివీదిమెఱయు** అ.క్రి. ప్రకాశించు. తాళ్ల. సం. 9.246. **వీదిసూల** వి. వీధి కడ్డంగా ఇల్లుండటమనేతప్పు. **వీదులు** రూ.చూ. వీధులు. వి.బ.వ. ఆములోకుండలు కట్టేటప్పుడు ఏవరసకావరస కన్పించేటట్లు గాలిపోవటానికి ఉంచే కొంచెం విశాలమైన సందులు. <వీది+-లు.

**వీదులు** చూ. వీది.

**వీధి** రూ.చూ. వీది. వి. **1.** బాట, దారి; **2.** మొదటి ఆను పీట కొయ్యలకు చివరి ఆనుపీట కొయ్యలకు ఉన్న మధ్య భాగం.

**వీధికెక్కు** అ.క్రి. రచ్చకెక్కు. <వీధి+-కున్+ ఎక్కు. **వీధిరేవు** రూ. వీదిరేవు. వి. ఆముకు మధ్య భాగంలో పొయ్యికి ఎదురుగా చక్కగాఉండే పెద్దరేవు. **వీధివీధి** వి. ప్రతివీధి. **వీధులు** రూ. వీదులు. వి.బ.వ. ఆములో కుండలు కట్టేటప్పుడు ఏవరస కావరస కన్పిం చేటట్లు గాలి పోవటానికి ఉంచే కొంచెం విశాలమైన సందులు. <వీధి+-లు. **వీధులేగించు** స.క్రి. ఊరేగించు. తాళ్ల. సం. 15.55. <వీధులు+ఏఁగించు. **వీధులేగు** అ.క్రి. మెరవణిపోవు, ఊరేగు. తాళ్ల. సం. 11.70. <వీధులు+ఏఁగు.

**వీధులు** చూ. వీది.

**వీధులేగించు** చూ. వీధి.

**వీధులేగు** చూ. వీధి.

**వీనిచ్చు** చూ. వీను.

**వీనియ** రూ.చూ. వీణియ[1]. వి. వీణ. యయా. 4.13.

**వీను** చూ. విను[1]. వి. **1.** కర్ణం, చెవి. భార. ఆది. **4.20. 2.** ప్రసిద్ధి.

**వీనిచ్చు** స.క్రి. ఆలకించు, విను; అ.క్రి. చెవియిచ్చు. <వీను+ఇచ్చు. **వీనుమిగులు** అ.క్రి. ప్రసిద్ధికెక్కు. కాశీ. 2.49. **వీనులకంటి** వి. సర్పం, చక్షుశ్శ్రవం. అచ్చ.బా. బాల. 144. నీలా. 2.37. **వీనులకంటిచెలువ** రూ. వీనులకంటి చెల్వ. వి. నాగకన్య. **వీనులకంటిచెల్వ** రూ.చూ. వీనులకంటి చెలువ. వి. నాగకన్య. **వీనులకువిందు** వి. కర్ణోత్సవం, శ్రోత్రానందం. ఉ.రా. 1.88. **వీనులచూపు** వి. చక్షుశ్శ్రవం, సర్పం. ఉ.హరి. 2.172. **వీనులజేర్చివిను** స.క్రి. సావధానంగావిను. తాళ్ల. సం. 6.204. **వీనుల తేనియ** రూ.చూ. వీనులతేనె. వి. శ్రోత్రానందం, చెవుల కింపు. **వీనులతేనె** రూ. వీనులతేనియ. వి. చెవులకింపు. శ్రోత్రానందం విక్ర. 1 93. **వీనులపండుగ** రూ.చూ. వీనుల పండువు. వి. చెవులకింపుగా ఉండేది, కర్ణపర్వం. **వీనుల పండువు** రూ. వీనులపండుగ. వి. చెవులకింపుగా ఉండేది, కర్ణపర్వం. పల్నా. 3పు. **వీనులఁబెట్టు** స.క్రి. శ్రద్ధతో విను. సిం.ద్వా. 32. <వీను+-లు+-అ[ఁ]+ పెట్టు. **వీనులలరు** అవ్య. ద్రు. చెవికింపగు. కాశ. 4.2. <వీను+ -లు+ అలరు. **వీనులవిందు** వి. శ్రోత్రానందం, చెవుల కింపు. మొల్ల. పీఠి. 18. ద్వి. పరమ. వి. 3. 2195. **వీనులు చల్లగావిను** అ.క్రి. సంతోషకరమైనవార్తను విను. తాళ్ల. సం. 10.118. **వీనులుచల్లనగు (-అగు)** అ.క్రి. మంచిమాట వినటం వల్ల సంతోషించు. శుక. 1.474. **వీనులుచిల్లులువోవు (-పోవు)** అ.క్రి. ప్రతికటువుగా పలకటం వల్ల చెవులు తూట్లుపడు, శ్రుతికటువుగాఉండు.

**వీనె** రూ.చూ. వీణియ[2]. వి. వీణ.

**వీనెగాజులు** వి.బ.వ. బాలక్రీడావిశేషం. హంస. 3.146.

**వీపడఁచు** చూ. వీపు.

**వీపరాలు** రూ.చూ. వియ్యంపురాలు. వి. వియ్యంకురాలు, వియ్యం పొందిన స్త్రీ.

**వీపు** వి. పృష్ఠభాగం, వెన్ను. భార.ఆది. 2.44

తు. బీయ్పు. తోక; కో. వి.వ్. వెన్నుకిరుపక్కలా ఉన్న డొల్లభాగం, కొలా. వి-ప్, వెన్ను.

**వీపడఁచు** స.క్రి. బుజ్జగించు. <వీపు+అడఁచు. **వీపుగానరాదాఁగు** అ.క్రి. వెన్ను కనబడేటట్లు దాగొను, రహస్యంగాదాచుకో ప్రయత్నించినప్పటికీ దానిని బయల్ప రచు. ప్రభా. 5.17. **వీపుగోడ** వి. సింహద్వారానికి వెనుకఉన్నగోడ. **వీపుగోల** వి. వెన్నుమీద మోదే బెత్తం. పండి.చ. 3.173పు. **వీపుచర్మమొలిపించు** స.క్రి. చితక గొట్టు. సం. చర్మన్. తోలు. **వీపుచఱచు** రూ.చూ. వీపుఁజ ఱచు. అ.క్రి. **1.** ధైర్యంచెప్పు; **2.** వెన్నుతట్టు. **వీపుచిట్ల గొట్టు (-కొట్టు[1])** స.క్రి. చితకగొట్టు. **వీపుచూడు** అ.క్రి. పారిపోవు. **వీపుఁజఱచు** రూ. వీపుచఱచు. అ.క్రి. **1.** ధైర్యంచెప్పు. వీపుతట్టు. హంస. 3.91; **2.** వెన్నుతట్టు. **వీపుతాటయొలిపించు (-ఒలిపించు)** స.క్రి. చితగ్గొట్టించు. **వీపుతాటయొలుచు (-ఒలుచు)** స.క్రి. వీపు చిట్లగొట్టు, గొ.హరి. 2.1067. **వీపుదట్టు(-తట్టు[1])** అ.క్రి. ధైర్యం

చెప్పు. హంస. 2.122. వీపుపట్టగట్టు-(కట్టు) రూ.చూ. వీపు(బట్టగట్టు. స.క్రి. మిక్కిలి శ్రమించు, అట్టగట్టు. తాళ్ల. సం. 10.2.29. వీపుమన్నుదుల్పు అ.క్రి. సేవచేయు. వీపు(బట్టగట్టు(-పట్టగట్టు) రూ. వీపుపట్ట గట్టు. స.క్రి. మిక్కిలి శ్రమించు, వీపు అట్టగట్టు. తాళ్ల.సం. 5.55. వీపులుపగల( గొట్టు స.క్రి. చావగొట్టు, చితకగొట్టు. <వీపు+-లు+పగులు+-అ[7]+ కొట్టు[1]. వీపుల్‌చిట్టిపో(గొట్టు స.క్రి. చితుక గొట్టు. శుక. 3.274. <వీపు+-లు+చిట్లు+-ఇ[13]+పోవు+-అ[7]+ కొట్టు[1]. వీపువిమానంమోతమోగు అ.క్రి. దెబ్బలుతగులు, దెబ్బలుతిను. సం. విమాన-. వ్యోమయానం. వీపువిటిగిపడు అ.క్రి. కూలబడు. జైమినిభా. 6.199. <వీపు+విఱుగు+-ఇ[13]+పడు. వీపువెనుక మానిసి లేకుండు అ.క్రి. సహాయం లేకఉండు, వెనుక బలం లేక ఉండు. కళా. 8.65. వీపు(వ్రీల(గ(గొట్టు అ.క్రి. వీపు చితక తన్ను. గౌ.హరి. 2.884 <వీపు+వ్రీలు+-అ[7]+అగు+-అ[1]+కొట్టు[1]. వీపు(వ్రేయు స.క్రి. వెన్నుమీద చరచు. పండి.చ. 3.173పు.

**వీయను(-అను)** అ.క్రి. అంగీకరించు, ఒప్పుకొను. కువ.చ. 4.212.

**వీయపుచుట్టాలు** చూ. వీయము.

**వీయపురాలు** చూ. వీయము.

**వీయమందు** చూ. వీయము.

**వీయము** రూ.చూ. వియ్యము. వి. వైవాహిక సంబంధం. దశకు. 7.69.

**వీయపుచుట్టాలు** వి.బ.వ. వైవాహిక సంబంధి బంధువులు. తాళ్ల.సం. 9.172. <వీయము+చుట్టము+-లు. వీయపురాలు వి. 1. అల్లునితల్లి, కూతురుఅత్త. విజయ. 8.126; 2. కోడలు తల్లి, కొడుకుఅత్త. <వీయము+ఆలు. వీయమందు అ.క్రి. సంబంధంచేయు. చంపూరా. 3.108 <వీయము+అందు.

**వీయె** వి. పోకచెక్క, వక్క.

సం. బీజ-. విత్తనం; ప్రా. బీఅ-; పా. బీజ-; హిం. బీఅ, బీయా.

<ప్రా. బీఅ-.

**వీరకత్తి** చూ. వీరము.

**వీరకత్తియ** చూ. వీరము.

**వీరకత్తె** చూ. వీరము.

**వీరకా(డు** చూ. వీరము.

**వీరంగంతొక్కు** చూ. వీరంగము.

**వీరంగము** వి. 1. పెద్దగోల; 2. (వీరభద్రోత్సవంలో) కదం తొక్కటం.

సం. వీర-. శూరుడు, వీరభద్రుడు, రంగ-. అడుగు, రంగస్థలం.

<సం. వీర-+ సం. రంగ-.

వీరంగంతొక్కు అ.క్రి. (వీరభద్రోత్సవంలో) కదం తొక్కు. <వీరంగము+తొక్కు.

**వీరజయంతిక** వి. యుద్ధంలో వీరులనృత్యం.

సం. వీర-. శూరుడు, జయంతికా, జయంతీ. పతాక, దుర్గాశక్తిభేదం.

<సం. వీర-+సం. జయంతికా (అర్థవిపరి.).

**వీరజాటి** వి. వీరులతాడు. గంగమ్మభక్తుడు దీనితో మోదు కుంటూనృత్యంచేస్తారు. విరదాళ్ళు.

సం. వీర-. శూరుడు, ధైర్యశాలి.

<సం. వీర-+జాటి (మిశ్రస.).

**వీరజెట్టికందువా** రూ. వీరజెట్టికంద్వా. వి. ఒకరకం కందువా, వీరులసంబరంచేసేటప్పుడు వేసుకోవటానికి నేసిన కందువా.

సం. వీర-. వీరుడు.

<సం. వీర-+జెట్టి+కందువా. (మిశ్రస.).

**వీరజెట్టికంద్వా** రూ.చూ. వీరజెట్టి కందువా. వి. ఒకరకం కందువా, వీరులసంబరంచేసేటప్పుడు వేసుకోవటానికి నేసిన కందువా.

**వీరడి** రూ.చూ. వెఱ(డి. వి. 1. వెర్రి; 2. తిక్క; 3. వెంగలి.

**వీరణతింద్లవారు** చూ. వీరణము.

**వీరణము** రూ. వీరాణము. వి. డంగురం, చర్మవాద్యవిశేషం. యయా. 4.158. రాజవా. 2.49.

క. వీరణ-. పెళ్ళి మొ. వాటిలో ఉపయోగించే పెద్ద వాద్యవిశేషం; త. వీరణమ్.

**వీరణతింద్లవారు** వి.బ.వ. వీరణంవాయించేవారు. ఉద్యోగినూచి. ద.హిం.శా. సంపు. 10.శా.సం. 422. క్రీ.శ. 1269. వీరణయురుము(-ఉరుము) వి. చర్మవాద్య విశేషం. హంస. 3.29.

**వీరణయురుము** చూ. వీరణము.

**వీరతాయెతు** వి. వీరులు బిరుదుగా కట్టుకునే తాయెత్తు.

సం. వీర-. శూరుడు.

<సం. వీర-+తాయెతు. (మిశ్రస.).

**వీరభద్రపళ్లెరము** వి. వీరభద్రునికి నైవేద్యంపెట్టే పెద్ద పళ్ళెం. ఆము. 4.43.

సం. వీరభద్ర-. శివుని గణాధిపతి.

<సం. వీరభద్ర-+పళ్ళెరము (మిశ్రస.).

**వీరమద్దియ** రూ. వీరమద్దె, వీరముద్దియ, వీరముద్దె. వి స్త్రీలు కాలి పెద్దవేలికి ధరించే భూషణవిశేషం. ఉ.హరి. 5.64.

సం. వీరముద్రికా. కాలినడిమి వేలికి ధరించే భూషణ విశేషం; ప్రా వీరముద్దిఅ.

<ప్రా. వీరముద్దిఅ.

**వీరమద్దె** రూ.చూ. వీరమద్దియ. వి. స్త్రీలు కాలి పెద్ద వేలికి పెట్టుకునే భూషణ విశేషం.

**వీరమద్దెల** వి. వాద్యవిశేషం. కు.సం. 11.51.

సం. వీరమర్దల-. వాద్యవిశేషం; ప్రా. వీరమద్దల-.

<ప్రా. వీరమద్దల-.

**వీరమలహరి** వి. వాద్యవిశేషం. యయా. 4.158.

సం. వీర-. శూరుడు.

<సం. వీర-+మలహరి (మిశ్రస.).

**వీరము** వి. బీరం, శౌర్యం. భార. విరా. 4.84.

సం. వీర-. శృంగారాది నవరసాల్లో ఒకటి, శూరుడు.

<సం. వీర- (అర్థవిపరి.).

వీరకత్తి రూ.చూ. వీరకత్తియ. వి. వియ్యపురాలు. <వీరము+కత్తి. **వీరకత్తియ** రూ. వీరకత్తి, వీరకత్తె. వి. వియ్యపురాలు, జాయాపతుల తల్లుల్లో ఒకతెకొకతె వీర కత్తియ అవుతుంది. అల్లునితల్లి, కోడలితల్లి. నీలా. 3.87. <వీరము+కత్తియ. **వీరకత్తె** రూ.చూ. వీరకత్తియ. వి. వియ్యపురాలు. **వీరకాఁడు** వి. వియ్యంకుడు, భార్యాభర్తల తండ్రులు ఒకనికొకడు వీరకాడవుతాడు, అల్లునితండ్రి, కోడలితండ్రి. అచ్చ. రా. బాల. 1.198. <వీరము+-కా+-ఁడు.

**వీరముట్టులు** రూ. వీరముట్లు. వి.బ.వ. శివమతస్థులగు కుమ్మర్లను సంవత్సరానికొకసారి యాచించే ఒకజాతివారు.

సం. వీరముష్టి-. శూరుని పిడికిలి.

సం. వీరముష్టి-+-లు.

**వీరముట్లు** రూ.చూ. వీరముట్టులు. వి.బ.వ. నేతపనిచేసే దేవాంగులను అడుక్కొనే ఒకతెగవారు.

**వీరముద్దియ** రూ.చూ. వీరమద్దియ. వి. స్త్రీలు కాలిపెద్ద వేలికి ధరించే భూషణ విశేషం. శృం.నై. 6.44.

**వీరముద్దె** రూ.చూ. వీరమద్దియ. వి. స్త్రీలు కాలిపెద్దవేలికి ధరించే భూషణ విశేషం. కళా. 7.66.

**వీరముష్టి** వి. గ్రామంలో కంసాలి, వడ్రంగి, కుమ్మరి, మంగలి మొ. వారి వృత్తుల్ని అవలంబించి జీవించే శివభక్తులైన జాతివారు ద.హిం.శా. సంపు. 10 శా.సం. 395. క్రీ.శ. 1261.

సం. వీర-. శూరుని సంబంధమైన, ముష్టి-. పిడికిలి.

<సం. వీరముష్టి- (అర్థవిపరి.),

**వీరముష్టిపంను** వి. పన్నుసూచి, వీరముష్టివారు చెల్లించే పన్ను. క్రీ.శ. 1549. క.శా. 2.205. (కడపజిల్లాశాసనాలు). **వీరముష్టులు** వి.బ.వ. నేతపనిచేసే దేవాంగుల్ని అడుక్కొనే ఒకతెగవారు <వీరముష్టి+-లు

**వీరముష్టులు** చూ. వీరముష్టి.

**వీరలు** చూ. వీరు.

**వీరవట్టము** వి. వీరులు ధరించే బిరుదు చిహ్నం. పండి.చ. 5.362పు.

సం. వీరపట్ట-. వీరులు ధరించే ఒకవిధమైన వేషం; ప్రా. వీరవట్టు-.

<ప్రా. వీరవట్ట-.

**వీరాణము** రూ.చూ. వీరణము. వి. చర్మవాద్యవిశేషం.

**వీరిఁడి** రూ.చూ. వీఱిఁడి. వి. అవివేకి, మూర్ఖుడు. శాళ్ల. సం. 13.2 ; విణ. వివేకరహితం, మూర్ఖం. రాజ.చ. 3.52.

**వీరు** సర్వ.బ.వ. వీళ్ళు. ద.హిం.శా. సంపు 10.శా.సం. 645. క్రీ.శ. 1060, భార.ఆది. 4.119.

క. ఇవర్, వీరు ; కొడ. ఇవు. ఇఎంగ ; తు. మేరు, ఇంబెరు ; త. ఇవర్, ఇవర్కళ్ ; మ. ఇవర్ ; కో. ఇవ్ర్ ; గోం. ; ఏఢ్/వీర్ ; కొం. వేర్ ; పెం. ఇవర్ ; కుఇ. ఇఅరు ; కువి. ఈవరి ; కొలా. ఇవ్ర్ ; నా. ఈర్ ; కుఱు. ఈర్, ఇబ్ధర్ ; మాల్తొ. ఈర్.

<మూ.ద్రా. *ఇవర్.

**వీరలు** రూ. వీళ్ళు. సర్వ.బ.వ. వీళ్ళు. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 605. క్రీ.శ. 8వ శతాబ్ది. **వీరువారు** సర్వ.బ.వ. సామాన్యులు. కళా. 3.41. **వీళ్ళు** రూ.చూ. వీరలు. సర్వ.బ.వ. వీరు.

**వీర్లకుండలు** వి.బ.వ. ఊరుబయట వీరులకు (ఊర్లదేవతకు) జాతర చేసేటప్పుడు ఒకే గుడ్డను అలూమగలు చుట్టగా పెట్టుకొని నీళ్ళు తీసుకొచ్చే కుండలు.

సం. వీర-. శూరుడు.

<సం. వీర-+-లు+-అ[11]-+కుండ+-లు.

**వీఱిఁడి** రూ. వీరడి, వీరిఁడి, వేఱిఁడి. విణ. 1. అవివేకి, బుద్ధిలేనివాడు, లేనిది. కు.సం. 2.84 ; 2. వెర్రిది. భార. కర్ణ. 2.84.

<వీరము+-ఇఁడి.

**వీఱిఁడితనము** వి. అవివేకత ఉ. హరి. 4.149.

**వీలు**[1] అ.క్రి. ఉపయోగపడు, పనికివచ్చు. జైమినిభా. 6.197 ; వి. అనుకూల్యం. ద్వి. సార.చ. 1.3పు. 8పం. ; విణ. అనుకూలం.

**వీలుకొను** అ.క్రి. అనుకూల్యంపొందు, అతిశయించు. కువ. చ. 1.31. **వీలుగా** క్రి. విణ. ద్రు. అనుకూలంగా. <వీలు[1] + అగు+-అ[7]. **వీలుచాలు** వి. సమయం. **వీలుచేయు** స.క్రి. సానుకూల పడేటట్లుచేయు. **వీలుపడు** రూ. వీల్పడు. అ.క్రి. అనుకూలమగు, నరిపడు. **వీలుపరచు** రూ. వీల్పరచు. స.క్రి. అనుకూలపరుచు **వీలుపొయ్యి** వి. ఎక్కడంటే అక్కడికి తీసుకొనిపోవటానికి వీలుగా ఉండే మట్టిపొయ్యి. **వీల్పడు** రూ.చూ. వీలపడు. అ.క్రి. నరిపడు, వీలగు. **వీల్పరచు** రూ.చూ. వీలుపరచు. స.క్రి. అనుకూలపరచు.

**వీలు**[2] అ.క్రి. 1. చీలు. పగులు, రామాభ్యు. 8.61 ; 2. తూలిఆడు. విష్ణుపు. 2.16 ; 3. వేరుచేయు, వదులు.

త. విలకు (విలకి-). వెనక్కితీసుకొను, తొలగు, చలించు, తోయు, విప్పు, విడదీయు, విలంకు, మారు, వేరుపడు, తగ్గు, విళ్, విళ్ళు (విళ్-త్-). పగులు, విశదపరచు, విప్పు, బద్దలగు, విడిపోవు ; మ. విలక్కమ్. నిషేధం, విలక్కుక. వేరుచేయు, నిషేధించు, విళ్ళు. బయటికి వెడలల్లబడు.

మూ.ద.ద్రా. *విళ్-.

**వీల్పడు** చూ వీలు[1].

**వీల్పరచు** చూ. వీలు[1].

**వీళ్ళు** చూ. వీరు.

**వీవన** చూ. వీచు.

**వీవని** రూ. వీఁగని. వి. క్షీణింపని, పూర్ణమైన.

**వీవలి** చూ. వీచు.

**వీవలిచెలి** చూ. వీచు.

**వీవెన** చూ. వీచు.

**వీశగుద్దులు** వి.బ.వ. బలమైనగుద్దులు.

<వీసె[1]+గుద్దు+-లు.

**వీస**[1] రూ. విశ్శ, వీసియ[1], వీసె[1]. వి. నలభై పలాలఎత్తు ద. హిం. శా. సంపు. 4. శా. సం. 1062. క్రీ.శ.

11వశతాబ్ది.

సం. వింశక-, వింశికా. ఇరవై, వీశ-. ఒకానొక తూకం ; ప్రా. వీసియా. ఇరవైవస్తువులమొత్తం ;

క. విసె. బరువును తెలిపేది, ఐదుసేర్లు.

< ప్రా. వీసియా.

**పీస[2]** రూ.చూ. పీసము. వి. తక్కువతనం.

**పీసబడి** రూ. వీసుబడి. వి. గ్రామంలో భాగప్రకారం కలిగిన భూస్వాతంత్ర్యం.

పీసబడివన్ను వి. పన్నుసూచి. క్రీ.శ. 1433. క.శా. 2.3.

**పీసమంత** చూ. పీసము.

**పీసము** వి. 1. ఒకదానిలో పదహారవభాగం, చాలా తక్కువభాగం ద.హిం.శా. సంపు. 10. శా. సం. 226. క్రీ.శ. 1269 ; 2. రూపాయలో పదహారోభాగం. మను. 3.129 ; 3. వడ్లగింజ ఎత్తుబంగారం ; 4. గ్రామంలో భాగం ప్రకారం కలిగిన భూస్వాతంత్ర్యం.

సం. వింశ- ; ప్రా. విస-, వీసా. ఇరవై ; అశో. ప్రా. విస-. నాసిక ; జై. మహా. విస-, విసం ; అ.మా. విస-, వీసఇ. ఇరవై ; పా. విసతి ; అప. విస-, విసఇ ;

క. విస, ఈస. 1/16వంతు, అణాలో 1/16వంతు ; తు. విసు, విస. 1/16వంతు, వడ్లగింజ ఎత్తు బంగారం : త. విచమ్. పదహారో భాగం ; మ. విసమ్. 1/16 వంతు బంగారం, వడ్లగింజఎత్తు బంగారం ; కుఇ. విస. మూడు పైసలు.

< ప్రా. వీస-.

**పీసమంత** విశే. మిక్కిలికొంచెం. ప్రబోధ. 1.30. < పీసము + అంత. పీసముతప్పలేకుండు అ.క్రి. ఏమాత్రం తప్పలేకపోవు. కవిక. 3.28. పీసంబుడ్డి వి. సుమారు 15 సేర్లు పట్టే కల్లుకుండ.

**పీసంబుడ్డి** చూ. పీసము.

**పీసర** రూ. పీసరము. అ.క్రి. వెడలిపడు, తగ్గు ; వి. కొరత.

సం. విస్మృ- విస్మర-, విస్మృత-. విస్మృతం; ప్రా విసర-, విసరిఅ, వీసరిఅ, విస్సర- ; జై. మహా. విస్సరియ ; జై.శౌ. వీసరిద ; మా. విసుమవేది. విస్మరించటం ;

క. బీ. ముగియు, నాశనం, ఎడతెగని, విరామంలేని. రూపరు, చనిపోవు, బీకల్. ముగింపు, బిగు. వెనుకకు పోవు, వెనుకంజవేయు, బిసర. అంతం, విధ్వంసం, సంహారం ; త. వీ (-వ్-,న్త్-). నాశనం, అదృశం, చచ్చు, వదులు, (-ప్ప-,-త్త్-). పాడుచేయు, నశింపచేయు, నాశం, చావు, వేర్పాటు, తొలగింపు, వికుక. చంపు, నాశనం, సంహారకర్త, ధ్వంసం చేసేవాడు, వీవు. నాశనం, చావు, తొలగింపు, అభ్యంతరం, విరామం.

< ప్రా. పీసర-.

పీసరపడు అ.క్రి. వెలితిపడు, కొరతపడు, పీసరపోవు.

**పీసరపుచ్చు** స.క్రి. వెలితిపడచేయు. జైమినిభా. 1.56.

**పీసరపోవు** రూ. పీసరవోవు. అ.క్రి. వెడలిపడు, తగ్గు. భార. శాంతి. 2.335. పీసరవోవు(-పోవు) రూ.చూ. పీసరపోవు. అ.క్రి. వెడలిపడు, తగ్గు. శృం. నై. 1.70.

**పీసరము** రూ.చూ. పీసర. అ.క్రి. వెడలిపడు, తగ్గు ; వి. కొరత.

**పీసియ[1]** రూ.చూ. పీసె[2]. వి. ఉన్మాదవిశేషం.

**పీసియ[2]** రూ.చూ. వీస[1]. వి. 1. నలభైపలాలు ; 2. 1/8 మణుగు ; 3. 120 తులాలు.

**పీసుబడి** రూ.చూ. పీసబడి. వి. గ్రామంలో భాగం ప్రకారం కలిగిన భూస్వాతంత్ర్యం.

**పీసె[1]** రూ.చూ. వీస[1]. వి. 1. 1/8 మణుగు. ద. హిం. శా. సంపు. 5. శా.సం 137. క్రీ.శ. 1298 ; 2. 120 తులాలు. ఆం. భా. 2.269 ; 3. నలభైపలాలు.

**పీసె[2]** చూ. పీసియ[1]. వి. ఉన్మాదవిశేషం.

**పీసెలు** వి.బ.వ. భక్ష్యవిశేషం. హంస. 1.105.

**వు[1]** వి. తెలుగులో ఉకారాది పదాలకు పదాదిని వకారం చేరటం సర్వసాధారణం. కొన్ని అన్యదేశ్య పదాల్లో పదాది హకారం లోపించగా ఏర్పడ్డ ఉకారానికి ముందు వకారం వస్తుంది. ఈరకమైన వకారానికి అర్థభేదక సామర్థ్యంలేదు. కాగా ఇది ప్రత్యేకవర్ణం కాదు. దీనిఉచ్చారణ కూడా స్థిరంకాదు. పదాది ఉకారానికి ముందు వకారం రావటానికి ఉకారం ఉభయోష్ఠ్యం కాగా వకారం దంతోష్ఠ్యం కావటమే కారణం. దీన్ని నిషిద్ధాక్షరంగా భావించనక్కరలేదు. కొన్ని అన్యదేశ్యపదాలుకొన్ని శాసనప్రయోగాలు కోశోదాహృతులు మాత్రం గ్రహించబడ్డాయి.

**-వు[2]** ప్రత్య. 1. ఉదంతాలైన నామపదాల మీద గోశబ్దం మీద ప్రథమైక వచనంలోవచ్చేప్రత్యయం. E.I. సంపు 27. క్రీ.శ. 600-700 ; 2. ఉదంతనామపదాలమీద ప్రథమా బహువచనాది ప్రత్యయాలకు వికల్పంగాను గోశబ్దానికి నిత్యంగానువచ్చే ఆగమం. ప్రత్యయ విహీన శబ్దాలు మొదట ఉన్నప్పటికి అనుచిత విభాగాద్యనేక కారణాలవల్ల- వుప్రత్యయం ఏర్పడింది.

**-వు[3]** ప్రత్య. అమహత్తులకు ప్రథమైక వచనంలో వచ్చే ప్రత్యయం. ఉ. సాసనవు.

< -బు.

**-వు[4]** ప్రత్య. కృత్ప్రత్యయం. ఉదా. చావు, నోవు, పూవు, మనువు. పదాంత చకారానికి-ఉ చేరగా ఈ ప్రత్యయం ఏర్పడిఉండవచ్చు.

**-వు[5]** ప్రత్య. ధాతువులమీద వచ్చే మధ్యమ పురుషైక వచన ప్రత్యయం. ఇ, ఈ లమీద ఉన్నప్పుడు దీని ఉత్వం, ఇత్వంగా మారుతుంది. ఇది మధ్యమ పురుషైక వచన సర్వనామ పరిశిష్ట రూపం. భార. ఉద్యో. 1.378.

< ఈవు.

**వుకుమద్దారు** రూ.చూ. హుకుందార్. వి. ఆజ్ఞ ఇచ్చినవాడు.

**వుకుము** రూ.చూ. హుకుము. వి. 1. ఆజ్ఞ ; 2. ఒకపేటపేరు.

**వుక్క** రూ.చూ. హుక్కా. వి. పొగపీల్చే సాధనం.

**వుక్కా** రూ.చూ. హుక్కా. వి. పొగపీల్చేసాధనం.

**వుగాల్‌దాన్** వి. ఎంగిలి ఊసేపాత్ర లేదా తమ్మపడిగ.

ఉ. ఉగాల్-దాన్. ఎంగిలి ఊసే పాత్ర లేదా

తమ్మపడిగ.

<అ. ఉగాల్-దాన్.

**వుచ్చు** రూ.చూ. వుచ్చు. అ.క్రి. వుప్పిపట్టు.

**వుంబలి** వి. ఉంబళి, ఉంబళిక, పన్ను లేకుండా అనుభవించ టానికి ఇచ్చిన గ్రామం, మొఖాసా మొ.ది. నె.గా. పొదిలి. 24. క్రీ.శ. 1561.

**వుడాయించు** రూ.చూ. ఉడాయించు. అ.క్రి. 1. దొంగిలించు; 2. పారిపోవు.

**వుడాసుపావడం** వి. పట్టువస్త్రం. E. I. సంపు. 12. పవుగడ. 18. 1866 A. D.

**వుడుధార** వి. ఆభరణ విశేషం. T.T.D. ES III. 60. క్రీ.శ. 1513.

<సం. ఉడుధారా.

సం. ఉడు-. నక్షత్రం, ధారా. నీటిధార.

**వుడైయవరు** వి. శ్రీరామానుజుడు. TTD ES IV. 144. క్రీ.శ. 1541.

త. ఉడైయవర్. ప్రభువు, రామానుజుడు.

<త. ఉడైయవర్.

**వుద్ది** రూ.చూ. ఉద్ది. వి. నమంగా. కలశగానం. క్రీ.శ. 972.

**వుప్పలు** చూ. ఉప్పరి[1]. వి.బ.వ. ఉప్పరులు. నె.గా. కందు కూరు. 44. క్రీ.శ. 1651.

**వుభయము** వి. వంతుల ప్రకారం చేసి ధర్మకార్యానికి ఇచ్చే ధనం. ద.హిం.గా. సంపు. 4. గా. సం. 699. క్రీ.శ. 1546.

సం. ఉభయ-. రెండు, రెండువిధాలు; ప్రా. అ.మా. పా. ఉభయ-;

త. ఉపయమ్. దేవాలయానికిగాని ఆశ్రమానికిగాని ఇచ్చే కానుక.

<సం. ఉభయ-.

**వుమేదువార్** రూ.చూ. ఉమేదువారు. వి. 1. ఉద్యోగం కోసం జీతం లేకుండా పని చేస్తుండేవాడు లేదా వాలంటీరు; 2. అభ్యర్థి.

**వుమేదువారు** రూ.చూ. ఉమేదువారు. వి. 1. ఉద్యోగం కోసం జీతం లేకుండా పనిచేస్తుండే వాడు లేదా వాలంటీరు; 2. అభ్యర్థి.

**వుమైద్‌వార్** రూ.చూ. ఉమేదు వారు. వి. 1. ఉద్యోగం కోసం జీతంలేకుండా పని చేస్తుండేవాడు లేదా వాలంటీరు; 2. అభ్యర్థి.

**వుమ్మేదువార్** రూ.చూ. ఉమేదువారు. వి. 1. ఉద్యోగం కోసం జీతం లేకుండా పని చేస్తుండేవాడు లేదా వాలంటీరు; 2. అభ్యర్థి.

**వుంబళిశాసనము** వి. పన్నుఇవ్వకుండానే అనుభవించే గ్రామం లేక భూమి, ఉంబళిక, మొఖాసా. ECX. బాగేపల్లి. 40. క్రీ.శ. 1617.

సం. శాసన-. ఆజ్ఞ.

**వుంబళ్ల వూళ్లనిచ్చు** అ.క్రి. మాన్యం ఇచ్చు, కాపాడు. శాశ్ల. సం. 10.238.

**వురప్** రూ.చూ. ఉరఫు. అవ్య. అనే, అలియాస్.

**వురపు** రూ.చూ. ఉరఫు. అవ్య. అనే, అలియాస్.

**వురఫ్** రూ.చూ. ఉరఫు. అవ్య. అనే అలియాస్.

**వురస్** రూ.చూ. ఉరుసు. వి. మహమ్మదీయ సాధువు వర్ధంతి.

**వురుద** వి. ఒకరకంచెట్టు (Bruguera cylindrica).

**వురుప్** రూ.చూ. ఉరఫు. వి. అనే, అలియాస్.

**వురుఫ్** రూ.చూ. ఉరఫు. వి. అనే, అలియాస్

**వురుస్** రూ.చూ. ఉరుసు. వి. మహమ్మదీయ సాధువ వర్ధంతి.

**వురుసు** రూ.చూ. ఉరుసు. వి. మహమ్మదీయ సాధువ వర్ధంతి.

**వుర్సు** రూ.చూ. ఉరుసు. వి. మహమ్మదీయ సాధువు వర్ధంతి.

**వులి** రూ.చూ. ఉలి[1]. వి. వజ్రంగికఱ్ఱ తెగగొట్టటానికి ఉపయో గించే ఒకరకం పనిముట్టు.

**వులింద** వి. వంటచెరకుగా ఉపయోగపడే కలపనిచ్చే ఒకరకం చెట్టు. (Diospyros Chloroxylon).

**వుల్‌టాసీదా** అవ్య. పైపైపు, లోపైపు, కిందుమీదలు.

అ. ఉల్‌టాసీదా. తలకిందు, తిన్నని.

<అ. ఉల్‌టాసీదా.

**వుషారి** రూ.చూ. హుష్యారి. వి. 1. చురుకుదనం; 2. సూక్ష్మబుద్ధి.

**వుషారు** రూ.చూ. హుషారు. విణ. 1. తెలివిగల; 2. హెచ్చ రించేటటువంటి; 3 చురుకైన.

**వూ** వి. తెలుగులో ఊకారాది పదాలకు పదాదిని వకారం చేరటం సర్వసాధారణం. కొన్ని అన్యదేశ్య పదాల్లో కూడా ఈవిధానం కన్పిస్తోంది. ఈ విధమైన వకారానికి అర్థభేదక సామర్థ్యం లేదు. కాగా ఇట్టిది ప్రత్యేకవర్ణం కాదు. దీని ఉచ్చారణ కూడా స్థిరం కాదు. పదాది ఊకారానికి ముందు వకారం చేరటానికి ఊకారం ఉభయోష్ఠ్యం కాగా వకారం దంతోష్ఠ్యం కావటమే కారణం. కొన్ని శాసన ప్రయోగాలు కొన్ని కోశోదాహరణలు గ్రహించబడ్డాయి.

**వూడిగము** రూ.చూ. ఊడిగము. వి. ఊడిగం చేసేవాడు, సామంతుడు. ద.హిం.శా. సంపు. 7. గా. సం. 569. క్రీ.శ. 1580.

**వూదా** రూ.చూ. ఊదా[1]. వి. ఒకవిధమైన రంగు.

**వూదువత్తులు** చూ. ఊదువత్తి. వి.బ.వ. సాంబ్రాణికడ్డీలు, అగరు వత్తులు.

హిం. ఉ. అర. ఊద్. అగరు, పరిమళద్రవ్యం, ఊద్ బత్తి. అగరువత్తి;

క. తు. ఊదుబత్తి; త. ఊతుపత్తి.

<ఉ. ఊద్ బత్తీ+-లు.

**వూరకరణము** వి. గ్రామకరణం. ద.హిం. గా. సంపు. 10.గా. సం. 740.

<ఊరు[1]+-ఇ[3]-+కరణము.

**వూరిమాన్యం** వి. గ్రామమాన్యం. నె.గా. ఒంగోలు. 109. క్రీ.శ. 1337.

<ఊరు[1]+-ఇ[3]-+మాన్యము.

**వూర్జితము** వి. ప్రఖ్యాతం, సుకృతం. నె.గా. ఆత్మకూరు.

35. క్రీ.శ. 1612.

సం. ఊర్జిత-. బలంగల, వృద్ధిచేయబడిన, గొప్పది, గంభీరమైన.

<సం. ఊర్జిత-(అర్థవిపరి.).

**వృషభాయం** వి. పశువుల కొట్టాలకు పనికివచ్చే కొలత.

**వెకరి** చూ. వెంగలి. వి. ఒకజాతి కిరాతుడు.

**వెకలి** రూ.చూ. వెంగలి. విణ. 1. మూఢుడు. రం. రా. సుం. 251. ప. 14పం; 2. ఆసక్తురాలు, ఆసక్తం. మను. 3.28 ; 3. ఆసక్తుడు తాళ్ల. సం. 17.5 ; 4. అర్థంలేనిది వాల్మీ. 1.33 ; 5. ఉన్మత్తుడు. ప్రబంధ. 1.755 ; వి. 1. వెర్రివ్యక్తి. విక్ర. 8.3 ; 2. అర్థంలేని వ్యక్తి

**వెకలితనము** రూ.చూ. వెకలితనము. వి. అవివేకం, మూఢత్వం. చంద్రాంగ. 2 145. **వెకలినవ్వు** రూ.చూ. వెకలినవ్వు. వి. 1. వెర్రిబాగులనవ్వు ; 2. ఏవగింపును కలిగించే నవ్వు. **వెకలిపడు** రూ. వెకలిపడు. అ.క్రి. అవివేకంపొందు. సానంద. 5.148 **వెకలి సంసారము** రూ. వెకలిసంసారము. వి. నిస్సారమైన సంసారం. తాళ్ల.సం. 7.27.

**వెకలు** అ.క్రి 1. విచ్చు, విరియు ; 2. చెదరు.

**వెకవెకలు** చూ. వికవిక. వి.బ.వ. వెర్రినవ్వు మొ. వాటిలో అయ్యేధ్వనికి అనుకరణం.

**వెకిరింత** రూ. వెక్కిరింత. వి. 1. వెక్కిరించటం. వైజ. 3.26 ; 2. కోతి. వ్యు. వెక్కిరించేది.

**వెకిలి** రూ.చూ. వెంగలి. విణ. 1. మూఢుడు ; 2. ఆసక్తుడు ; 3. ఆసక్తురాలు ; 4. అర్థంలేనిది ; 5. ఉన్మత్తుడు ; 6. ఉన్మత్తురాలు ; వి. 1. వెర్రివ్యక్తి ; 2. అర్థంలేని వ్యక్తి.

**వెకిలితనము** రూ. వెకలి తనము. వి. అవివేకం, మూఢత్వం. **వెకిలినవ్వు** రూ. వెకలినవ్వు. వి. 1. వెర్రి బాగులనవ్వు ; 2. ఏవగింపును కలిగించే నవ్వు. **వెకిలిపడు** రూ.చూ. వెకలిపడు. అ.క్రి. అవివేకం పొందు. **వెకిలి సంసారము** రూ.చూ. వెకలిసంసారము. వి. నిస్సారమైన సంసారం.

**వెకెళ్లు** వి.బ.వ. కొలబానలతో ధాన్యం కొలవగా ఎక్కువగా వచ్చిన ధాన్యం.

**వెక్క**[1] వి. 1. వేడిమి. శృం.నై. 2.119 ; 2. జ్వరం.

క. బెంకి, బెంకె, బెంగె. వేడి, నిప్పు ; తు. చెంకె. వేడి ; త. వెక్కై. వండు, వేడి, వెక్కుక. వేడిచేయు ; మ. వెక్క. వండు ; కొలా. వెస్స జ్వరం ; నా. వి. కాలు, వెచ్చ. జ్వరం.

**వెక్క**[2] చూ. వెక్కు.

**వెక్కఁబెట్టు** చూ. వెక్కు.

**వెక్కలి**[1] రూ.చూ. వెంగలి. విణ. 1. మూఢుడు. నవనాథ. 3ఆ ; 2. వెర్రి ; 3. మూర్ఖుడు ; 4. మూర్ఖురాలు ; 5. అమాయకుడు ; 6. అమాయకురాలు ; 7. వ్యర్థమయినది ; వి. 1. వెర్రివ్యక్తి ; 2. పనికిమాలినవ్యక్తి.

**వెక్కలి**[2] చూ. వెక్కు.

**వెక్కసపడు** చూ. వెక్కసము.

**వెక్కసపాటు** చూ. వెక్కసము.

**వెక్కసమందు** చూ. వెక్కసము.

**వెక్కసము** విశే. 1. ఆశ్చర్యం. కు.సం. 9.9 ; 2. మిక్కుటం. అధికం. కాశీ. 5.167 ; 3. దుస్సహం. కళా. 7.68 ; 4. దుర్లభం. విష్ణుపు. 7.194 ; 5. దుస్సహ వచనాలు. ద్వి.సార.చ. 1.32పు. 17పం ; వి. 1. అధికం. గౌ.హరి. ఉ. 478పం ; 2. సహించరానిస్థితి, దుస్సహత్వం. ఉ రా. 3.36 ; 3. అధికత.

క. వెక్కస. కాఠిన్యం, దుస్సహం, కరకుదనం ; తు. వెక్కసు. దుర్లభం, దుస్సహం, కడుపులో తిప్పు.

**వెక్కసపడు** అ.క్రి. 1. సహింపలేని స్థితిపొందు. భార. విరా. 5.2 ; 2. వింతపడు. ఆశ్చర్యపడు. బసవ. 184పు. 11పం. <వెక్కసము+పడు **వెక్కసపాటు** వి. సహింపలేని స్థితి పొందటం. భార. విరా. 5.112. <వెక్కసము+పాటు. **వెక్కసమందు** అ.క్రి. 1. ఆశ్చర్యపడు. భార. విరా. 1.303 ; 2. సహించలేని స్థితిపొందు. భార. అశ్వ. 3.157. <వెక్కసము+అందు. **వెక్కసాలాడు** స.క్రి. ఎకసక్కెములాడు. తాళ్ల.సం. 12.185. <వెక్కసము+-లు+ఆడు. **వెక్కసి** విణ. 1. దుస్సహురాలు. తాళ్ల. సం. 14.97 ; 2. హింసకురాలు, హింసకుడు. విష్ణుపు. 7.120 ; 3. సహించరానివాడు. <వెక్కసము+-ఇ[9]. **వెక్కసించు** అ.క్రి. అధికంగా కనపడు. కవిక. 5.9 ; 2. అతిశయించు. అప్ప 4.171, 211పు. <వెక్కసము+-. ఇంచు[3]. **వెక్కసీఁడు(-ఈఁడు)** వి. సహించశక్యం కానివాడు. తాళ్ల.సం. 10.162.

**వెక్కసాలాడు** చూ. వెక్కసము.

**వెక్కసి** చూ. వెక్కసము.

**వెక్కసించు** చూ. వెక్కసము.

**వెక్కసీఁడు** చూ. వెక్కసము.

**వెక్కించు** చూ. వెక్కు.

**వెక్కిరించు** స.క్రి. అపహాస్యంచేయు. కు సం. 10.145 ; అ.క్రి. 1. వికారమైన చేష్టలు చేయు. భాగ. 10.ఉ. 544 ; 2. ఇతరుల వేషభాషా చేష్టలననుకరిస్తూ హాస్యం చేయు. అని. 1.12.

**వెక్కిరింత** రూ.చూ. ఎక్కిరింత. వి. పరిహసించటం. **వెక్కిరింతలాడు** స.క్రి. ఎగతాళిచేయు, పరిహసించు. కవిరాజ 2.83. <వెక్కిరింత+-లు+ఆడు.

**వెక్కిరింత** చూ. వెక్కిరించు.

**వెక్కిరింతలాడు** చూ. వెక్కిరించు.

**వెక్కిలి** చూ. వెక్కు.

**వెక్కిళి** చూ. వెక్కు.

**వెక్కివెక్కియేడ్చు** చూ. వెక్కు.

**వెక్కు** అ.క్రి. 1. ఎక్కిళ్ళు విడుచు. భార. ఆది. 7.178. కు.సం. 5.162 ; 2. ఏడ్చేటప్పుడు వెక్కిలి ధ్వనిలా ధ్వనించు. నిర్వ.రా. 2.24, భార. ఆశ్ర. 1 163 ; 3. వెగచు, దుఃఖించు, రోదన ధ్వని చేయు. మను. 4.69 ; వి. వెక్కిలి, ఎక్కిలి. మార్క. 2.34 ; అ.క్రి. ఏడ్చేటప్పుడు ఎక్కిళ్ళలా ధ్వనిచేయు. శృం.నై. 4.87.

క. బిక్కు. గట్టిగా ఊపిరిపీల్చు, రోజు, బిక్కళిగె. వెక్కు ; తు. బిక్కుని. ఊపిరి బిగపెట్టు ; వెక్కు ;

త. విక్కు (విక్క-). వెక్కు ; మ. విక్కుక. నత్తిగా మాట్లాడు, మిక్కుక, వెక్కిళ్ళు. విక్కమ్.నత్తి ; తొ. పిక్. దగ్గు ; కుఇ. వెక. దగ్గు ; కువి. బెఖ్నా. హెల మారు, వెక్కు, ఉక్కిరి బిక్కిరగు ; బెక్ — (బిక్‌క్య్). ఊపిరి ఆడకపోవు, దగ్గు, ఏడ్చు ; మాల్తొ. బెక. ఉక్కిరి బిక్కిరగు ; బ్రా. హిక్క్. వెక్కిలి, వెక్కు.

< మూ.ద్రా. *విక్.

**వెక్క²** వి. మిక్కిలి. పో.చూ.నం. హిక్కా. ఎక్కిలి. **వెక్కబెట్టు** న.క్రి. పైకి నిగుడించు. శుక. 3.32. < వెక్కు + -అ⁷ + పెట్టు. **వెక్కలి³** రూ. చూ. వెక్కిలి. వి. ఎక్కిలి. **వెక్కించు** న.క్రి. ఉబ్బించు, స్థూలం కావించు. పండి. చ. 2.88. < వెక్కు + -ఇంచు³. **వెక్కిలి** రూ. వెక్కు. ఎక్కిలి, వెక్కలి², వెక్కిళి. వి. ఎక్కిళ్ళు. ఆం.భా. 1.140. త. విక్కమ్. వెక్కలి. **వెక్కిళి** రూ.చూ. వెక్కిలి. వి. ఎక్కిళ్ళు **వెక్కివెక్కియేడ్చు** అ.క్రి. ఎక్కిళ్ళు వచ్చేటట్లుగా ఏడ్చు, అధికంగా ఏడ్చు. హంస. 3.142 (ధ్వన్యను.). < వెక్కు + -ఇ¹³ + వెక్కు + -ఇ¹³ + ఏడ్చు. **వెక్కుమీఱు** అ.క్రి. వెక్కిలి విడుచు, వెక్కు. హర.ఉ. 8.110.

**వెక్కుడు** చూ. ఎక్కు. వి. కుందల ద్రుమం, వృక్షవిశేషం.
**వెక్కుడుతీగ** వి. ఒకరకంతీగ ; జ్యోతిష్మతి (Heart Pea).

**వెక్కురు** విశ. 1. వికృతమయిన. భాగ. 7.254, గొ.హరి. పూ. 1484 ; 2. వికారం కలవ్యక్తి. కుచే. 1.62.
నం. వికారిన్. వికారంగలవాడు.

**వెగచు** చూ. వెక్కు. అ.క్రి. 1. ఏడ్చేటప్పుడు వెక్కిలిలా ధ్వనించు. కు.నం. 5.108 ; 2. వెక్కు, ఏడ్చు. భాగ. 10.872.

**వెగటగు** చూ. వెగటు.

**వెగటించు** చూ. వెగటు.

**వెగటు** వి. రోత, వైరస్యం. హ.న. 2.18 ; విశ. 1. అనిష్టం. పల్నా. పు. 116 ; 2. వెక్కసం. చంద్రికా. 4.34 ; 3. విరసం. చెన్నబసవ. 2.32.
**వెగటగు** అ.క్రి. అసహ్యమగు, రోతకలుగు < వెగటు + అగు. **వెగటించు** అ.క్రి. అసహ్యపడు. < వెగటు + -ఇంచు³ **వెగటుతోచు** అ.క్రి. వినుగెత్తించు. నిరంకు. 2.34. **వెగటులాడు** రూ.చూ. వెగట్లాడు. న.క్రి. 1. రోతమాటలు పలుకు ; 2. అసహ్యించుకొను. **వెగటెక్కు** అ.క్రి. 1. ఎక్కసమగు ; 2. రోతపుట్టు. **వెగట్లాడు** న.క్రి. 1. అసహ్యించుకొను. తాళ్ల.నం. 13.19 ; 2. రోత మాటలు పలుకు. < వెగటు + -లు + ఆడు.

**వెగటెక్కు** చూ. వెగటు.

**వెగట్లాడు** చూ. వెగటు.

**వెగడందు** చూ. వెగడు.

**వెగడు** వి 1. దుఃఖం. నిర్వ. రా. 8.109 ; 2. తడబాటు. భార. విరా. 1.276 ; 3. భయం. భార. విరా. 2.70 ; 4. చలనం, తల్లడం. భార. విరా. 5.336 ; 5. ఆశ్చర్యం ; 6. వింత.
క. బెక్కస. ఆశ్చర్యం, బెగడు, బెగర్, బెగఱ్, బిగుర్. ఆశ్చర్యపడు, భయం ; తు. బెక్కను. ఆశ్చర్యం, భయం, భయపడు, బెక్కసుని. ఆశ్చర్య పడు, బెగడుని. దిగ్భ్రమపడు, భయపెట్టబడు ;
పో.చూ.నం. వికటు -. వికృతమైనది, అంగవికారమైనది, భయంకరమయినది, ముఖం చిట్లించుకొనేది.
**వెగడందు** అ.క్రి. వైరస్యం పొందు. ఉ. హరి. 3.134. < వెగడు + అందు. **వెగడుకొను** అ.క్రి. భయపడు. కు. నం. 12.108. **వెగడుపడు** రూ. వెగడువడు. అ.క్రి. 1. తల్లడపడు. భార. ఆది. 2.130; 2. భయపడు. కాశీ. 4.124; 3. తొట్రుపడు, తడబడు. భాగ. 10ఉ. 423. **వెగడుపఱచు** రూ.చూ. వెగడువఱుచు న.క్రి. 1. వెగడు పడచేయు, తల్లడపఱచు. భార. ద్రోణ. 2.93 ; 2. తడబడచేయు, విభ్రాంతి నొందించు. వసు. 4.73. **వెగడుపఱుచు** రూ. వెగడుపఱచు, వెగడువఱచు, వెగడువఱుచు. న.క్రి. 1. భయపెట్టు. భార. భీష్మ. 1.272 ; 2. తడబడుచేయు. విభ్రాంతినొందించు. **వెగడువడు** రూ.చూ. వెగడుపడు. అ.క్రి. 1. తల్లడపడు ; 2. తొట్రుపడు ; 3. భయపడు. **వెగడువఱచు** రూ.చూ. వెగడుపఱుచు. న.క్రి. 1. భయపెట్టు ; 2. తడబడచేయు. **వెగడువఱుచు** రూ.చూ. వెగడుపఱుచు. న.క్రి. 1. భయపెట్టు ; 2. తడబడచేయు. **వెగడొందు** అ.క్రి. 1. తడబడు. భార. విరా. 2.308 ; 2. భయం. భార. విరా. 4.66 ; 3. తల్లడపడు, చలించు. నృసింహ. 2.107. < వెగడు + ఒందు.

**వెగడొందు** చూ. వెగడు.

**వెగపు** రూ.చూ. వగపు. వి. వెక్కివెక్కి ఏడ్వటం.

**వెగవెగ** వి. త్వరగా నడవటంలో అయ్యేధ్వనికి అనుకరణం. కృష్ణరా. 3.46.

**వెగ్గము** వి. పంతం. ద్వి. పరమ. వి. 4.336పు.

**వెగ్గలమాడు** చూ. వెగ్గలము,

**వెగ్గలము** విశ. అధికం. కాశీ. 4.148.
క. వెగ్గల, వెగ్గళె, ఎగ్గళ, హెగ్గళ. అధికం, గొప్పతనం, మిక్కిలి.
**వెగ్గలమాడు** అ.క్రి. అధికంగా సంచరించు. ఆము. 5.122. < వెగ్గలము + ఆడు **వెగ్గలమైన** విశ. మిక్కుటమైన, అధికమైన. కాశీ. 5.158. < వెగ్గలము + ఐన. **వెగ్గలి** వి. గొప్పవ్యక్తి. < వెగ్గలము + -ఇ. **వెగ్గలించు** రూ.చూ. వెగ్గళించు, న.క్రి. తోసిపుచ్చు. సారంగ. 2.6. < వెగ్గలము + -ఇంచు³. **వెగ్గలీ(డు(-ఈ(డు)** వి. అధికుడు, గొప్పవాడు. కాశీ. 5.116.

**వెగ్గలమైన** చూ. వెగ్గలము.

**వెగ్గలి** చూ. వెగ్గలము.

**వెగ్గలించు** చూ. వెగ్గలము.

**వెగ్గలీ(డు** చూ. వెగ్గలము.

**వెగ్గళించు** రూ. వెగ్గలించు, న.క్రి, త్రోసిపుచ్చు. తాళ్ల. సం. 17.145.
క. వెక్కలిసు, వెగ్గలిసు. అధికంగా వచ్చు, అధిక

మగు.

**వెగ్గురు** రూ.చూ. బెగ్గురు. వి. సారసం, ఒకరకం పిట్ట.

**వెంకన్న** వి. వెంకటేశ్వరస్వామి.

సం. వేంకట - వెంకటేశ్వరుడు.

<సం. వేంకట-+అన్న.

**వెంకప్పరంగు** వి. ముదురు మామిడి చిగురు రంగు.

**వెంకాయ** రూ.చూ. వంగకాయ. వి. వంగకాయ. EI. VI - 235.239. క్రీ.శ. 1520.

**వెంకిలేటరు** రూ.చూ. వెంటిలేటరు. వి. వెలుతురు కోసం గోడల్లో ఎత్తున పెట్టే చిన్న కిటికీ.

**వెంక్లేటరు** రూ.చూ. వెంటిలేటరు. వి. వెలుతురు కోసం గోడల్లో ఎత్తున పెట్టే చిన్న కిటికీ.

**వెంగడము** విణ. వ్యత్యస్తం, తారుమారైనది. విజయ. 2.8.

సం. వికృత-. వికారమయినది.

**వెంగము** వి. 1. మూర్ఖుడు. తాళ్ల. సం. 14.108 ; 2. వెకిలితనం.

**వెంగ్రమాను** వి. వేంగినచెట్టు. E. I. V. 10. క్రీ.శ. 1102.

**వెంగలి** రూ. వెకలి, వెకిలి, వెక్కలి[1], వెంగళి. విణ. 1, వ్యర్థం, యుక్తిలేనిది. భార. విరా. 2.250 ; 2. వెర్రివాడు, అమాయకుడు. భార. ఉద్యో. 3.384 ; 3. మూర్ఖుడు, అవివేకి. భార. ద్రోణ. 2.45 ; 4. మూఢుడు, జడుడు. శివ. సా. 2.54 ; 5. వెర్రిది ; 6. మూర్ఖురాలు ; 7. అమాయకురాలు ; వి. 1. వెర్రివ్యక్తి ; 2. పనికిమాలిన వ్యక్తి.

క. వెంగళి, వెంగ, అంగళి. పిచ్చివాడు, మూర్ఖుడు, చూ. త. వెంకళ్. విపరీతంగా మత్తును కలిగించే పానీయం ;

పో.చూ.సం. వికల -. కలతపొందినది.

**వెంగలించు** అ.క్రి. విహ్వలించు. కు.సం. 4.55. <వెంగలి+-ఇంచు[3]. **వెంగలితనము** రూ. వెంగళితనము. వి. 1. వెర్రితనం. భార. సౌప్తి. 1.45 ; 2. అవివేకం, మూర్ఖత. **వెంగలివిత్తు** వి. మూర్ఖాగ్రేసరుడు. వెర్రి. భార. ఉద్యో. 3.235. **వెంగలివిత్తులు** వి.బ.వ. వెర్రికాయలు. **వెంగలీ(డు** వి. వెంగలి. అమాయకుడు. కాశీ. 5.116.

**వెంగలీ(డు** చూ. వెంగలి.

**వెంగళప్ప** చూ. వెంగళి.

**వెంగళి** రూ.చూ. వెంగలి. విణ. 1. వ్యర్థం, యుక్తిలేనిది ; 2. మూర్ఖుడు, అవివేకి ; 3. మూఢుడు, జడుడు ; 4. వెర్రివాడు, అమాయకుడు; 5. వెర్రిది ; వి. 1. వెర్రి వ్యక్తి ; 2. పనికిమాలిన వ్యక్తి.

**వెంగళప్ప** వి. వెర్రిబాగులవాడు. <వెంగళి+అప్ప. **వెంగళితనము** రూ.చూ. వెంగలితనము. వి. వెర్రితనం.

**వెంగినాడు** రూ.చూ. వేఁగినాడు. వి. వేగినాడు.

**వెంగినాడుబ్రాహ్మణులు** వి.బ.వ. తూర్పు కనుమలకు దిగువ కృష్ణాగోదావరీ నదులకు మధ్య ప్రదేశంలో ఉండే వేంగిపురంలోనివారు. వీరిలో కొందరు ఋగ్వేదులు, కొందరు కృష్ణయజుర్వేదులు, శుక్లయజుర్వేదులు, ఆప స్తంబ, ఆశ్వలాయన కాత్యాయన సూత్రాలవారు.

**వెంగెమాడు** చూ. వెంగెము.

**వెంగెము** వి. ధ్వన్యర్థం, వ్యంజన చేత తెలియదగిన అర్థం. నీతి. 76.

సం. వ్యంగ్య-. వ్యంజనాది వృత్తిచే తెల్పబడిన ; ప్రా. విఅంగియ, నిందితం.

<ప్రా. విఅంగియ-.

**వెంగెమాడు** స.క్రి. వ్యంగ్యార్థంవచ్చేట్లు మాట్లాడు, పరిహాసంచేయు. తాళ్ల. సం. 17.89. <వెంగెము+ఆడు. **వెంగెములాడు** స.క్రి. వ్యంగ్యార్థం వచ్చేట్లు మాట్లాడు, ఎగతాళిచేయు. ద్వి. పరమ. వి. 4.315పు. <వెంగెము+ -లు+ఆడు.

**వెచ్చ** చూ. వెచ్చు. క్రి. విణ. వేడిగా. భార. సభా. 2.310 ; విణ. 1. ఉష్ణం, వేడైనది. భార. అను. 1.299 ; 2. తీక్ష్ణం, అసహ్యం. కువ.చ. 4.181 ; వి. 1. వేడిమి, తాపం. మను. 2.99 ; 2. కాక, తాపం. ఆము. 2.51 ; 3. జ్వరం. ఆం భా. 2.128 ; 4. నిప్పుకణం.

**వెచ్చచేయు** స.క్రి. వెచ్చబెట్టు. కొద్దిగా వేడిచేయు. **వెచ్చదుక్క** రూ. ఎచ్చదుక్క. వి. ఆముకాల్పులో వాడే కర్రముక్క. **వెచ్చన** విణ. ఉష్ణంకలది, వేడైనది. ఆము. 1.36 ; క్రి. విణ. ద్రు. వేడిగా, వెచ్చగా. ఆము. 5.39 ; వి. వేడిమి, ఉష్ణం. ఆం. భా. 1.47. **వెచ్చనగు** అ.క్రి. వేడెక్కు. <వెచ్చన+అగు. **వెచ్చని** విణ. వేడిఅయిన. తాళ్ల. సం. 11.30. **వెచ్చనూర్చు** అ.క్రి. వేడిగా ఊపిరి విడుచు, వేడినిట్టూర్పువుచ్చు. **వెచ్చ(దనము(-తనము)** వి. వేడిమి. **వెచ్చ(బడు(-పడు)** అ.క్రి. వేడికలదగు. **వెచ్చ(బెట్టు (-పెట్టు)** స.క్రి. వేడిమికలిగించు. **వెచ్చలు** వి.బ.వ. 1. నిప్పుకణాలు ; 2. వేసవిరోజులు.

**వెచ్చకాఁడు** చూ. వెచ్చము.

**వెచ్చజెప్ప** చూ. వెచ్చము.

**వెచ్చపడు** చూ. వెచ్చము.

**వెచ్చపఱచు** చూ. వెచ్చము.

**వెచ్చపఱుచు** చూ. వెచ్చము.

**వెచ్చపువలపు** చూ. వెచ్చము.

**వెచ్చపెట్టు** చూ. వెచ్చము.

**వెచ్చపోవు** చూ. వెచ్చము.

**వెచ్చమగు** చూ. వెచ్చము.

**వెచ్చము** వి. 1. వ్యయం. పల్నా. పు. 70, విక్ర. 2.167 ; 2. ఇంటి వాడకానికి కావలసిన చిల్లర సరుకులు. తాళ్ల. సం. 5.110 ; 3. ఇంటి వాడకానికి కావలసిన చిల్లర సరుకుల అప్పు. పి.శకు. 1.78, ద.హిం.కా. సంపు. 10. కా.సం. 770. క్రీ.శ. 1691 ; 4. మందులు వండటానికి కావలసివచ్చే శొంఠి, పిప్పళ్ళు మొ. దినుసులు.

సం. వ్యయ-. ఖర్చు ; ప్రా. విచ్చ-, వెచ్చ-. వెచ్చఇ-. వ్యయించు ;

క. వెచ్చ. ఖర్చు ; తు. వెచ్చ.

<ప్రా. విచ్చ-.

**వెచ్చకాఁడు** వి. విటుడు. జాహ్నవీ. 4.41 ; విణ. మిక్కిలివ్యయం చేసేవాడు. <వెచ్చము+-కాఁడు. వెచ్చ

వెచ్చ న.క్రి. అమ్ము, విక్రయించు. తాళ్ల. సం. 3.477. <వెచ్చము+చెప్పు[1]. **వెచ్చపడు** అ.క్రి. వ్యయమగు. నవనాథ. 5.211వ. 19పం. <వెచ్చము+పడు. **వెచ్చపఱచు** రూ.చూ. వెచ్చపఱుచు. స.క్రి. ఖర్చుపెట్టు, వ్యయంచేయు. **వెచ్చపఱుచు** రూ. వెచ్చపఱచు. స.క్రి. వ్యయంచేయు. హరిశ్చ. 4.199. **వెచ్చపువలపు** వి. క్రయవిక్రయాదులకు లోబడే ప్రేమ. తాళ్ల. సం. 12.277. <వెచ్చము+వలపు. **వెచ్చపెట్టు** స.క్రి. 1. వెచ్చించు, వ్యయంచేయు. రం.రా. అయోధ్యా. 88వ. 28పం; 2. చెరచు, పాడుచేయు. భాగ. 6.517; 3. ఉపయోగించు, అనుభవించు. వరాహ. 10.18; 4. కట్టబెట్టు, అంటగట్టు. తాళ్ల. సం. 6.18; 5. విడుచు. హరిశ్చ. 5.92; 6. వేడిచేయు, కొద్దిగాచేయు. <వెచ్చము+పెట్టు. **వెచ్చపోవు** అ.క్రి. 1. నశించు, చచ్చు. కాశ. 3.153; 2. వ్యయమగు, తరుగు. రామాభ్యు. 4.64; <వెచ్చము+పోవు. **వెచ్చమగు** అ.క్రి. వ్యయమగు. <వెచ్చము+అగు. **వెచ్చనచ్చములు** వి. బ. వ. ఖర్చువెచ్చాలు. ద్వి. పరమ. వి. 4.73. <వెచ్చము+నచ్చము+-లు. **వెచ్చించు** స.క్రి. వ్యయపర్చు. భీమ. 4.32. <వెచ్చము+-ఇంచు[3].

**వెచ్చనచ్చములు** చూ. వెచ్చము.

**వెచ్చి** చూ. పెచ్చు, హెచ్చు. విశ. పరిపక్వమయిన.

**వెచ్చిచేఁతలు** వి. బ. వ. పరిపక్వమైన చేష్టలు. తాళ్ల. సం. 17.183. **వెచ్చివేవు** అ.క్రి. పరిపక్వమగు. తాళ్ల. సం. 18.801.

**వెచ్చించు** చూ. వెచ్చము.

**వెచ్చు** అ.క్రి. 1. సంతాపంపొందు, పరితపించు. కేయూ. 3.274; 2. కాలు, దగ్ధమగు. హర. 3.91; 3. కాగు, వేడిఅగు. భోజ. 3.70; 4. ప్రజ్వలించు. గౌ. హరి. పూ. 1157; వి. వేడిమి. ఆము. 3.28.

క. బెచ్చనె. వెచ్చని, బిసిల్. సూర్యకాంతి; తు. బెచ్చ, వేడిమి; త. వెచ్చణల్. వేడిమి, వెచ్చు. వేడిమి.

<మూ. ద్రా. *వెచ్-/వెయ్.

**వెజ్జతికము** చూ. వెజ్జు.

**వెజ్జు** వి. వైద్యుడు, భిషక్కు. భార. ఆరణ్య. 3.191.

నం. వైద్య-. వైద్యుడు; ప్రా. విజ్జ-, వెజ్జ-, వెజ్జగ-, వెజ్జయ-. చికిత్సకుడు; జై. మహా. వెజ్జ-; అ.మా. విజ్జ-, వెజ్జ;

క. బెజ్జ, బెజ్జు.

<ప్రా. వెజ్జ-.

**వెజ్జతికము** వి. వైద్యం. విజ్ఞా. 2.67. <వెజ్జు+తికము. **వెజ్జురాలు** వి. వైద్యంచేసేస్త్రీ. పార్వ. 4.167. <వెజ్జు+ఆలు.

**వెంచ** రూ. వెంచము. వి. గుంట, కొలను, మడుగు. కు. సం. 6.50.

పో.చూ. క. బెంబె. చిన్నగుంట, వెంచ, నరస్సు.

**వెంచము** రూ.చూ. వెంచ. వి. మడుగు.

**వెంచు** న.క్రి. కోరు; అ.క్రి. వేచిఉండు.

**వెంజాపు** రూ. ఇంజాపు, ఎంజాపు, ఎన్నుజాపు, ఎన్నుసోపు. వి. ఇంటినడికొప్పును మోసే కర్ర.

**వెంజామర** రూ.చూ. వింజామర. వి. తెల్లని చామరం, వింజామరం, వీవన. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 975.

త. వెణ్సామర.

**వెంజామరకొలువు** వి. వింజామరసేవ. ద. హిం. శా. సంపు. 6. శా.సం. 707. క్రీ.శ. 1416.

**వెంజివారము** రూ.చూ. వింజామర. వి. వీవన, వింజామరం. ద. హిం. శా. సంపు. 6. శా.సం. 705. క్రీ.శ. 1391.

**వెటకరించు** చూ. వెటకారము.

**వెటకారము** రూ.చూ. వెట్కారము. వి. 1. తామేనమర్థులమని ఇతరుల్ని వికటంగాచేసే వెక్కిరింత; 2. ఎత్తిపొడుపు.

**వెటకరించు** న.క్రి. వెక్కిరించు, గేలిచేయు. <వెటకారము+-ఇంచు[3].

**వెటిఁడు** రూ.చూ. వెట్టివాఁడు. విశ. కూలి లేకుండా పని చేసే వాడు.

**వెట్కారము** రూ. వెటకారము. వి. ఎత్తిపొడుపు. రంగా. చ. 2.45.

నం. వికృతకార-. వికృతం చేయటం.

<ప్రా. వికట్ట-+నం.-కార-.

**వెట్ట** రూ. బెట్ట. వి. 1. వేడిమి. వరాహ. 5.89; 2. తాపం. తాళ్ల. సం. 14.57; 3. వేసవికాలం, వెట్టకాడు. ఆము. 2.47; విశ. వేడి. ఉష్ణం. మను. 4.17.

క. వెట్టె. వేడి; త. వెట్టై. వేడి, భూమివేడి, ఉద్రేకం, తృష్ణ, కామం; కుఱు. బిఙ్ా. (బిడ్డ్). సూర్యునివేడిమి; మాల్తో. బిడ్యె. ప్రకాశించు.

<మూ.ద్రా. *వెట్.

**వెట్టకారు** వి. వేనవి. **వెట్టకాలము** వి. వేసవికాలం. గ్రీష్మర్తువు. మృత్యు. 2.45. నం. కాల-. కాలం, ఋతువు. <వెట్ట+నం. కాల-. **వెట్టచెవులతపసి** వి. ఉగ్రశ్రవసుడు, ఒకమునిపేరు. నీలా. 2.2. **వెట్టదినములు** వి.బ.వ. వేసవికాలం. మను. 4.17. నం. దిన- రోజు. <వెట్ట+నం. దిన-+-ము+-లు **వెట్టసంసారము** వి. కటకటగా నడిచే సంసారం. తాళ్ల. సం. 5.119.

**వెట్టము** చూ. వెట్ట. వి. శత్రువు. సిం. ద్వా. 2.138.

**వెట్టి** వి. 1. ప్రతిఫలం లేకుండా చేసేపని, కూలి తీసుకోకుండా చేసేపని. ఉ. హరి. 5.89, మార్క. పీఠి. 35; 2. కూలిలేకుండా పని చేసే కూలీ.

నం. విష్టి-, వైష్టిక-; కూలి లేకుండా పని చేసేవాడు; ప్రా. వెట్టి, విట్టి;

క. బిట్టి, విట్టి, కఠినమైన, పరుషమైన; తు. బిట్టి, బిడ్డి; త. వెట్టి. నిరర్థకత; మ. వేట్టువన్: కుఇ. బెటి.

<ప్రా. వెట్టి-.

**వెట్టికిఁజేయు** న.క్రి. ప్రతిఫలానికి చేయు. తాళ్ల. సం. 6.120. <వెట్టి+-కున్+చేయు. **వెట్టికిపట్టు** రూ.

వెట్టికిఁబట్టు. అ.క్రి. వెట్టిపని చేయించు. మార్క. పీఠి. 35. వెట్టికిఁబ్రతుకు అ.క్రి. నిరాదరణ చూపినా బాగా బ్రతుకు. వెట్టికిఁబట్టు(-పట్టు[1]) రూ.చూ. వెట్టికిపట్టు అ.క్రి. నౌకరుగా పెట్టుకొను, పని చేయించుకొను. ఉ. హరి. 5.89. వెట్టికొలుచు స.క్రి. ప్రతిఫలం లేకుండా సేవించు. తాళ్ల. సం. 9.269. వెట్టిగాడు విణ. ప్రతిఫలం ఇవ్వకుండా అనుభవించేవాడు. తాళ్ల. సం. 4.92 వెట్టిగొను(-కొను.) స.క్రి. ప్రతిఫలం ఇవ్వకుండా పనిచేయించు. భాస్క. రా. అరణ్య. 2.105. వెట్టిచాకిరి వి. 1. వెట్టివాడు చేసేసేవ లేదాపని ; 2. ప్రతిఫలం లేకుండా వెట్టివాడు కానివాడు కూడా చేసేపని. వెట్టిచేయించు అ.క్రి. చాకిరిచేయించు తాళ్ల. సం. 9.25. < వెట్టిచేయు + -ఇంచు.[3] వెట్టిచేయు. రూ.చూ. వెట్టిసేయు. అ.క్రి. చాకిరిచేయు. తాళ్ల. సం. 10 207.వెట్టిజవరాలు వి ప్రతిఫలంకోరకుండా పని చేసేస్త్రీ చంద్రాంగ. 3.101. వెట్టితనము వి. కూలిలేకుండా పని చేయటం. వెట్టిపంపు స.క్రి. చెప్పిపంపు. సారంగ. 2.263. వెట్టింపులు వి.బ.వ. అన్నపానాదులకయ్యే. ప్రయత్నం. ద. హిం. శా. సంపు. 4, శా సం. 1098 క్రీ.శ 1153. వెట్టివాఁడు రూ. వెటిఁడు, వెట్టీఁడు. విణ. చాకిరె, అమిజికాడు, కూలిలేకుండా పనిచేసేవాడు. వెట్టివానికి వేదము వి. నిరర్థకం. వెట్టివానిచేతిరాయి వి. నిష్ప్రయోజనం. తాళ్ల. సం. 6.157. వెట్టివేములు వి.బ.వ. కూలి ఇవ్వకుండా చేయించుకొనేపని, వెట్టివేతనం, వెట్టి బదులుగా విధించబడ్డపన్ను. నె.శా. పొదిలి, 35. క్రీ.శ. 1507. వెట్టిసంసార బంధాలు వి.బ.వ. ప్రయోజనంలేని ప్రపంచ సంబంధి బంధాలు. తాళ్ల. సం. 9.209. వెట్టిసపరివారము వి. వెట్టిపనులు చేసేవారు. ద.హిం. శా. సంపు. 10. శా. సం 533, క్రీ.శ. 1323. వెట్టిసేయు(-చేయు) రూ. వెట్టిచేయు. అ.క్రి. చాకిరిచేయు. తాళ్ల. సం. 5.237. వెట్టీఁడు రూ.చూ. వెట్టివాఁడు. వి. ప్రతిఫలం లేకుండా చేసేవాడు, వెట్టిచేసే వాడు.

వెట్టీఁడు చూ. వెట్టి.

వెట్టుక్రోవులు వి.బ.వ. చిమ్మనగ్రోవులు. రాధా. 4.181.

వెఱ వి. 1. ఇంచుకకాలం. కు.సం. 6.110 ; 2. చెరకు (మన్మథ ధనుస్సందర్భంలోనే). మన్మథుని విల్లు చెరకుగద అనికవులభావన. విజయ. 1.62 ; క్రి. విణ. 1. అల్పంగా, కొంచెంగా. నిర్వ. రా. 8.86 ; 2. వదులుగా. ఆము. 7.14 ; విణ. 1. తుచ్ఛం. నిర్వ. రా. 8.119 ; 2. కృత్రిమం, తెచ్చిపెట్టుకొన్నది. నిర్వ. రా. 8.131 ; 3. అల్పం, కొంచెం. భార. విరా. 1.276 ; 4. వ్యర్థం వట్టిది. భార. విరా. 2.78 ; 5. పిచ్చి. భార. కర్ణ. 3.273 ; 6. వికృతం. భార. శాంతి. 3.508 ; 7. నిర్హేతుకం, నిష్కారణం. భార. అను. 5.109 ; 8. అసత్యం, కల్ల. ప్రబోధ. 1.75 ; 9. వింత, ఆశ్చర్యం, కవిక. 6.49.

సం. వ్యథ్. దూరంగాజరుగు ; ప్రా. వహిఅ. బాధపడ్డ. పా. వ్యథతి, వణుకుతోంది, వణుకుతున్నాడు.

వెఱగఱ వి. జడత, మొద్దుతనం. వెఱగఱపడు రూ.చూ. వెఱగఱపడు. అ.క్రి. జడత్వం పొందు. వెఱగఱపడు (-పడు) రూ. వెఱగఱపడు. అ.క్రి. జడత్వం పొందు. హరి. పూ. 8.155. వెఱచఱుచు అ.క్రి. భయపడు. భాస్క. రా. యు. 203. వెఱజాణతనము వి. అనుమానం, సందేహం, అరమరిక, మెరమెర. వెఱదప్పు(-తప్పు) వి. స్వల్పదోషం. భార. ఆశ్వ. 3.99. వెఱదారి వి. అపమార్గం. బహుళా. 4.82. వెఱనగవు వి. మందహాసం. మను. 6.30. వెఱపాఱు అ.క్రి. బొత్తిగాపారగు. అప్ప. 4.524. వెఱపేరు వి. తుచ్ఛపుపేరు. విప్ర. 3.74. వెఱపోక వి. తుచ్ఛమైన నడవడి. చంద్రాంగ. 6.65. వెఱమబ్బు వి. అల్పమేఘం. నరస. 5.135. వెఱమాయ ములుచేయు అ.క్రి. మాయమంత్రమొనర్చు, మాయచేయు. మంత్రమొనర్చు. పండి.చ. 1.2.380. వెఱయాటలు(-ఆటలు( వి.బ.వ. వెకిలిఆటలు, ఆనందంతో ఎటుబడితే అటు ఆడే ఆటలు. పండి. చ. 2-5-434. వెఱయేడుపు (-ఏడుపు) రూ.చూ. వెఱయేడ్పు. వి. కృత్రిమరోదనం. వెఱయేడ్పు (-ఏడ్పు) రూ. వెఱఏడుపు. వి. కృత్రిమరోదనం. దశకు. 592. వెఱవాకాట్లు వి.బ.వ. అనవసరవాగ్వాదాలు. శివరా. 4.70. వెఱవాదము వి. వ్యర్థవాదం. మల్లభూ. 2.35. సం. వాద-. పరస్పర వ్యతిరేకభావాల్ని తెలపటం, సమాధానం, సిద్ధాంతం. < వెఱ + సం. వాద-. వెఱవింటి వి. మన్మథుడు, ఇక్షుధన్వుడు. < వెఱవిల్లు + -ఇ[9] వెఱవింటిజోదు వి. మన్మథుడు. పాంచాలీ. 4.14. వెఱవింటిదొర వి. మన్మథుడు. చంద్రాంగ. 4.141. వెఱవింటిబలుదంట వి. మన్మథుడు. నీలా. 1.42. వెఱవింటిఱేఁడు వి. మన్మథుడు. ప్రభు. 1.737. వెఱవింటివాఁడు విణ. మన్మథుడు. మను. 3.90. వెఱవిలుకాఁడు రూ. వెఱవిల్కాఁడు. వి. ఇక్షుధన్వుడు. మన్మథుడు. రామాభ్యు. 6.146. వెఱవిలుకానిబాబా రూ.చూ. వెఱవిల్కానిబాబా. వి. చిలుక, మన్మథుని వాహనం. వెఱవిలుతుఁడు రూ. వెఱవిల్తుఁడు. వి. మన్మథుడు. ఇక్షుధన్వుడు. భాస్క. రా.యు. 33. వెఱవిలుతునయ్య రూ. వెఱవిల్తునయ్య. వి. మన్మథునితండ్రి, విష్ణువు. వెఱవిల్కాఁడు రూ.చూ. వెఱవిలుకాఁడు. వి. ఇక్షుధన్వుడు, మన్మథుడు. వెఱవిల్కానిబాబా రూ. వెఱవిలుకానిబాబా. వి. చిలుక, మన్మథుని వాహనం. వెఱవిల్తుఁడు రూ.చూ. వెఱవిలుతుఁడు. వి. మన్మథుడు, ఇక్షుధన్వుడు. యయా. 5.111. వెఱవిల్తునయ్య రూ.చూ. వెఱవిలుతునయ్య. వి. మన్మథుని తండ్రి, విష్ణువు. వెఱవెఱ విణ. అతిసూక్ష్మం. అత్యల్పం, మిక్కిలి చిన్నది. భార. విరా. 1.245 ; క్రి. విణ. 1. మిక్కిలి అల్పంగా, కొంచెంకొంచెంగా. భార. విరా. 2.238 ; 2. అశ్రద్ధగా. భార. శాంతి. 1.56 ; 3. మిక్కిలి వికారంగా. భాగ. 10ఉ. 544 ; 4. దృఢంగా, గట్టిగా. భాగ. 10ఉ. 556 ; 5. బిగ్గరగా. వరాహ. 5.112 ; 6. అధికంగా. మను. 3.97 ; 7. మృదువుగా. ఆము. 589 ;8. మెల్లమెల్లగా. యయా. 5.113 ; 9. శీఘ్రంగా. శ్రీరాధా. 2.52; 10. తరచుగా. చంద్రాంగ. 2.146. వెఱప్రవంతలు వి.బ.వ. పెద్దప్రవాహాలు. పండి.చ.

2.5.241.

**వెడగొడ్డు పులినాకవిడుచు** చూ. వెడఁగు.

**వెడఁగు** రూ. వెడఁగురు, వెణఁగు. విణ **1.** వివేకంలేనివాడు, వివేకంలేనిది. భార. ఆది. 6.280; **2.** వికృతం.అష్టమ. క. 1.23వం. 26పం; వి. **1.** అవివేకం. భార. ఉద్యో. 1.318; **2.** వికారం. భార. శాంతి. 1.114.

పో.చూ. నం. వికట-వికారం.

వెడఁగొడ్డు పులినాకవిడుచు అ.క్రి. ప్రతికబయటపడు. గౌ.హరి. 2.973. < వెడఁగు + గొడ్డు + పులి + నాకు + -ఇ[13] + విడుచు. **వెడతపసి** వి. అవివేకి అయిన తపస్వి. చంపూరా. 2.63. < వెడఁగు + తపసి. **వెడఁగుఁదనము (-తనము)** రూ. వెణఁగుఁదనము. వి. అవివేకం. భార. సభా. 2.9. **వెడఁగుపడు** అ.క్రి. **1.** జడత్వంపొందు, మ్రాన్పడు. నిర్వ.రా. 10.78; **2.** కలతపొందు. భార. విరా. 2.292; **3.** అవివేకంపొందు. భార. అశ్వ 1.195. **వెడఁగుపఱుచు** రూ. వెడగువఱ్చు, వెడఁగుపఱుచు, స.క్రి. వెడగుపడచేయు, వికారం పొందించు. భార. ద్రోణ. 5.286. **వెడఁగుపాటు** వి. వెడగుపడటం, నిశ్చేష్టత పొందటం. ప్రభా. 1.82. **వెడఁగువఱ్చు (-పఱ్చు)** రూ.చూ. వెడఁగుపఱుచు. స.క్రి. తిరస్కరించు. పండి. చ. 2.4.214. **వెడఁగువఱుచు (-పఱుచు)** రూ.చూ. వెడఁగుపఱుచు. స.క్రి. నిర్విణ్ణునిచేయు. పండి.చ. 1.1.191.

**వెడఁగురు** రూ.చూ. వెడఁగు. వి. **1.** వెర్రితనం; **2.** వికారం.

వెడఁగురుపడు అ.క్రి. మ్రాన్పడు, జడత్వంపొందు. భార. సౌప్తి. 1.60.

**వెడతపసి** చూ. వెడఁగు.

**వెడతుఱు** రూ. వెణుతుఱు, వెలుతురు[2], వెల్తురు[2]. వి. ఒకానొక చెట్టు. E.1.5. క్రీ.శ. 1102. (Dichrostachys cinera).

క. ఎడతఱి, వదప్ప. వృక్షవిశేషం; త. విడుత్తర్, విడుత్తల్, విడుత్తలై, విడుత్తేర్, విడుత్తెరై, విడుత్తాళి;

పో. చూ. నం. వేల్లాంతర-, వీరతరు-వృక్షవిశేషం.

**వెడంద** రూ.చూ. వెడఁద. విణ. **1.** విశాలం. భార. కర్ణ. 4.257; **2.** స్థూలం.

**వెడఁద** రూ. వెడంద, వెణఁద. విణ. **1.** విశాలం. భార. ఆది. 7.224; **2.** స్థూలం. హంస. 3.133.

నం. విస్తృత-.విశాలమయిన.

వెడఁదనోటిమెకము వి. పంచాస్యం, సింహం. < వెడఁద + నోరు + -ఇ[6] + మెకము. **వెడఁదమోముమెకము** వి. పంచాస్యం, సింహం. నీలా. 1.42. **వెడఁదమోరమెకము** వి. పంచాస్యం, సింహం. **వెడఁదవాతియమ్ము** వి. బాణ విశేషం, విశాలమైన వాయిఉన్న బాణం. భార. విరా. 5.146. < వెడఁద + వాయి + -ఇ[6]- + అమ్ము.

**వెడబము** వి. అనృతం, కల్ల, బొంకు.

సం. విడంబ-.అనుకరణం, బాధించటం, వంచన.

< నం. విడంబ-.

**వెడము** రూ.చూ. ఎడము. వి. ఎడం. శ్రీరం.మా. 10.58.

**వెడఁబడు** చూ. వెడలు.

**వెడలఁగొట్టు** చూ. వెడలు.

**వెడలఁగక్కు** చూ. వెడలు.

**వెడలనడచు** చూ. వెడలు.

**వెడలనాడు** చూ. వెడలు.

**వెడలనొత్తు** చూ. వెడలు.

**వెడలఁద్రోయు** చూ. వెడలు.

**వెడలఁబడు** చూ. వెడలు.

**వెడలఁబాటు** చూ. వెడలు.

**వెడలఁబాఱు** చూ. వెడలు.

**వెడలఁబెట్టు** చూ. వెడలు.

**వెడలఁబోసికొను** చూ. వెడలు.

**వెడలిచను** చూ. వెడలు.

**వెడలించు** చూ. వెడలు.

**వెడలు** రూ.చూ. వెలదు. వి. బయలు. పండి.చ. 2.96పు. అ.క్రి. **1.** తొలగు. భార. ఉద్యో. 2.62; **2.** బయలుదేరు. భార. భీష్మ. 2.167; **3.** బైటకువచ్చు. భార. ద్రోణ. 2.5; **4.** వ్యాపించు. కాశీ. 6.297; **5.** పోవు. నశించు. శివరా. 1.105; **6.** వెళ్ళు, కదలు. వరాహ. 6.16; **7.** సంచరించు. ప్రయాణంచేయు. ఆము. 4.85; స.క్రి. దాటు. లంఘించు, అతిక్రమించు. భార. సౌప్తి. 2.17.

వెడఁబడు రూ.చూ. వెడలఁబడు. అ.క్రి. బయటపడు. నవనాథ. 1.40పు. 10పం. **వెడలఁగొట్టు** స.క్రి. వెడలించు. పోనడచు. ఉ.రా. 2.309. < వెడలు + -అ[7] + కొట్టు[1]. **వెడలఁగక్కు** అ.క్రి. **1.** వాంతి చేసుకొను; **2.** అభిప్రాయాన్ని వెల్లడించు. < వెడలు + -అ[7] + క్రక్కు. **వెడలనడచు** స.క్రి. బయటకి గెంటు. పాండు. 5.206. < వెడలు + -అ[7] + నడచు. **వెడలనాడు** స.క్రి. **1.** తూలపలుకు, ప్రేలు. బసవ. 4.50పం; **2.** వెల్లడిచేయు, వెలిపుచ్చు. కేయూ. 3.231.; **3.** ఇతరులకు చెప్పు. గౌ.హరి. 2.1034. < వెడలు + -అ[7] + ఆడు[2]. **వెడలనొత్తు** స.క్రి. వదలివేయు. శు. 1.460. < వెడలు + -అ[7] + ఒత్తు. **వెడలఁద్రోయు** స.క్రి. వెళ్ళగొట్టు, పోగొట్టు. కాశీ. 3.124. < వెడలు + -అ[7] + త్రోయు. **వెడలఁబడు** రూ. వెడఁబడు. అ.క్రి. **1.** వెలుపలపడు. జైమినిభా. 1.106; **2.** వెడలు, బయలుదేరు. రామాభ్యు. 7.63. < వెడలు + -అ[7] + పడు. **వెడలఁబాటు** వి. వెడలబడటం. భార. శాంతి. 1.4. < వెడలు + -అ[7] + పాటు. **వెడలఁబాఱు** అ.క్రి. వెడలు. చంద్రాంగ. 5.27. < వెడలు + -అ[7] + పాఱు[3]. **వెడలఁబెట్టు** స.క్రి. వెడలచేయు, వెలిపుచ్చు. భాగ. 10ఉ. 544. < వెడలు + -అ[7] + పెట్టు. **వెడలఁబోసికొను** స.క్రి. చెప్పుకొను, ప్రకటించుకొను. రామాభ్య. 6.132. < వెడలు + -అ[7] + పోయు + -ఇ[13] + కొను. **వెడలిచను** అ.క్రి. వెడలిపోవు. దశా. 4.40. < వెడలు + -ఇ[13] + చను. **వెడలించు** స.క్రి. **1.** పీడచేయు, విడుచునట్లుచేయు. భార. మౌసల. 174; **2.** వెడలచేయు, పైకిరావించు. హరి.ఉ. 9.109; **3.** పాయుచేయు, తొలగించు. హర. 3.37; **4.** వెడలగొట్టు. విక్ర. 7.130; **5.** ప్రవహింపచేయు. మను. 6.29. < వెడలు + -ఇంచు[3]. **వెడలుచు** రూ. వెడల్చు, వెలలుచు.

స.క్రి. వెదలచేయు. యయా. 3.451. **వెదల్చు** రూ.చూ. వెదలుచు. స.క్రి. వెదలచేయు. పరమ. 2.31.

**వెదలుపు** రూ.చూ. వెదల్పు. వి. **1**. వైశాల్యం. హరి.ఉ. 8.72 ; **2**. చతురస్రంకాని చతుర్భుజిలోని పొట్టికొలత, చతురస్రంలోని భుజంకొలత.

**వెదల్చు** చూ. వెదలు.

**వెదల్పు** రూ. ఎదలుపు, ఎదల్పు, ఎడెల్పు, వెదలుపు, వెలద్పు, వెలుపు, వెళుపు. వి. వైశాల్యం. భార. సభా. 1.62.

**వెదల్పోద** వి. గింజలనిల్వకు మూతివెదల్పుగా ఉండే పెద్ద మట్టిపాత్ర

**వెదల్పోద** చూ. వెదల్పు.

**వెదసీర(-చీర)** వి. తెరచీర. కు.సం. 9.61.

సం. చీర —. వస్త్రం.

**వెదుతులు** చూ. వెదతులు. వి. వృక్షవిశేషం, వెణుతురు, కరీరం, క్రకచం, E.1. సంపు. 5.10. క్రీ.శ. 1102.

**వెడ్డంగము** వి. నాట్యవిశేషం. పండి చ. 2.5.435.

సం. వేష్టక —. చుట్టిఉండేది, శిరోవేష్టనం, ఉత్తరీయం; ప్రా వేడ్ఢగ-.

< ప్రా వేడ్ఢగ-.

**వెడ్డది** చూ. వెడ్డు.

**వెడ్డరి** చూ. వెడ్డు.

**వెడ్డు** విణ. కపటంతో కూడిన. భార. అను. 5.105 ; వి. వంచన. దశకు. 5.88.

సం. వేష్ట —. కప్పిఉండేది ; ప్రా వేడ్ఢ-, వేఢ-. వర్ణన గ్రంథం.

< ప్రా. వేడ్ఢ-.

**వెడ్డది** విణ. వంచకురాలు. పండి.చ. 2.116. < వెడ్డు + అది. **వెడ్డరి** వి. **1**. వంచకురాలు. పండి.చ. 2 116 ; **2**. వంచకుడు. < వెడ్డు + -అరి. **వెడ్డుకొలుపు** స.క్రి. పీడించు. క్రీడా. 287. **వెడ్డుపెట్టు** రూ.చూ. వెడ్డువెట్టు.స.క్రి. 292. **వెడ్డువెట్టు(-పెట్టు)** రూ. వెడ్డుపెట్టు. స.క్రి. వంచించు. క్రీడా. వంచించు, మోసగించు. భార.శాంతి. 6.301. **వెడ్లుబుడ్లుపెట్టు** అ క్రి. లాలనతో బుజ్జగించు.

**వెడ్లుబుడ్లుపెట్టు** చూ. వెడ్డు.

**వెణఁగు** రూ.చూ. వెదఁగు. వి. వెంగలి.

**వెణఁగుఁదనము(-తనము)** రూ.చూ. వెదఁగుఁదనము. వి. వెర్రితనం.

**వెణతురుమిల్లి** రూ.చూ. వెణతుఉపల్లి. వి. ఒకానొకచెట్టు.

**వెణతుఉపల్లి** చూ. వెదతులు. రూ. వెణతురుమిల్లి. వి. ఒకానొక చెట్టు.

**వెణఁద** రూ.చూ. వెదఁద. విణ. విశాలం. భీమ. 2.110.

**వెణుతురు** రూ.చూ. వెదతులు. వి. శరీరం, క్రకరం, బంజరు నేలల్లో ఆరు లేక ఏడడుగుల ఎత్తుపెరిగే ముళ్ళచెట్టు. (Dichrostachys Cinerca).

**వెంట**[1] అవ్య.ద్రు. **1**. వెంబడి. భార.ఆది. 2.166. ద.హిం.శా. సంపు. 4. శా. సం. 702. క్రీ.శ. 1518 ; **2**. అవిలంబంగా. హర. 6.125 ; వి. **1** విధం, రీతి. భార. ఉద్యో. 1.114 ; **2**. విషయం. భార. ఉద్యో. 2.77 ; **3**. దారి, మార్గం. భార.ఉద్యో. 2,280 ; **4**. కారణం. హేతువు. భార.అను. 1.215 ; **5**. కార్యం, పని. భార.అను. 4.359 ; **6**. ఉపాయం. మార్క. 1.119 ; **7**. స్థలం, చోటు. కేయూ. 3.283, సిం.ద్వా. 8.001 ; **8**. వెనకభాగం. మను. 1.54 ; **9**. ద్వారం.కుచ. చ. 1.76.

క. బెన్, బెన్ను, బెమ్, వెనుకభాగం, బెన్ననె, వెనుక, తర్వాత, పిదప ; కొడ. బెంబర. వెనకది ; తు. బెరంగడె. చనిపోయిన, పిదప, తర్వాత ; త. వెరిన్. వెన్. వెణ్. వెనుక ; కో. వెన్. వెనుక ; కొం. వెంక. తరవాత ; కొలా. వెన్. వెనుక, వెజ్క. వెనుకది ; నా. వెంక. వెనుకది.

**వెంటనంటు(-అంటు**[1]**)** స.క్రి. తరుముకొనిపోవు. గౌ.హరి ఉ. 1853. **వెంటనే** అవ్య. తత్క్షణమే, అప్పుడే. **వెంటఁబట్టు(-పట్టు**[1]**)** అ.క్రి. వెనక్కిపోవు. శకుత్స. 5.156. **వెంటఁబడు(-పడు)** స.క్రి. **1**. వెంబడించు. యయా. 5.133 ; **2**. తరుము, తొందరపెట్టు. శుక. 3.487 ; **3**. తనపని తీర్చుమని ప్రాధేయపడు. శుక. 4.7. **వెంటఁబెట్టుకొను(-పెట్టుకొను)** స.క్రి. కూడ ఉంచుకొను. ఉ.రా. 7.156. **వెంటవెంటనెయిడు** అ.క్రి. అవిలంబంగాఇచ్చు, శీఘ్రంగా ఇచ్చు. శుక. 1.391. **వెంటాడించు** స.క్రి. **1**. త్వరపెట్టు, తరుము. భాగ. 1.454 ; **2**. వెన్నాడు, వెంబడించు. వరాహ. 11.111. < వెంట[1] + ఆడించు. **వెంటాడు** స.క్రి. వెంబడించు. చంద్రాంగ. 4.99. < వెంట[1] + ఆడు.

**వెంట**[2] రూ.చూ. వేఁట. వి. వేట. ఉ.హరి. 2.140.

**వెంటము** వి. వేడుక, కుతూహలం.

**వెంటాడించు** చూ. వెంట[1].

**వెంటాడు** చూ. వెంట[1].

**వెంటి** రూ. ఎంటి. వి. **1**. మెలిపెట్టినగడ్డి, కసవుపిరి. రుక్మా. చ. 2.9 ; **2**. అల్లుచేసిన తరువాత ఒకకర్రకు చుట్టిననూలు ; **3**. అచ్చుతీకిన తర్వాత చుట్ట బెట్టిన పడుగునూలు ; **4**. మగ్గం మీద కొంత చాపగా మిగిలిన నూలు, పడుగుచుట్ట.

**వెంటికట్టు** వి. గడ్డితో కప్పే తీరు ; అ.క్రి. గడ్డితాడు పేను. **వెంటిగొనగానులుచు** అ.క్రి. పురిపెట్టు. భాస్క.రా.యు. 1426. **వెంటిగొను(-కొను)** అ.క్రి. **1**. పిరికొను. భాస్క. రా.యు. 1480 ; **2**. ముడిపడు ; **3**. మెలిగొను. **వెంటిదుపు** రూ. ఎంటిదుపు. వి. వెంటిలో బిగించిన పెద్ద గడ్డికుప్ప. **వెంటినలుఁగు** వి. మండెవెంటినలుగు.

**వెంటిక** రూ.చూ. వెంద్రుక. వి. వెంట్రుక.

**వెంటికపట్టుకపోయి వెసకొండనెక్కు** అ.క్రి. తాడు సాయంతో కొండఎక్కు.

**వెంటిలేటరు** రూ. వెంకిలేటరు, వెంక్లేటరు, వెంటేటరు, వెంట్రేటు, వెంట్లేటరు. వి. వెలుతురు కోసం గోడల్లో ఎత్తున పెట్టేచిన్న కిటికీ.

ఇం. *Ventilator*. గదిలోకి వాయు ప్రసారానికి ఉపయోగపడే ఉపకరణం.

< ఇం. Ventiiator.

**వెంటెవిల్లిరాయి** వి. వేంటెవిల్లి గ్రామం నుంచి వచ్చే చలవరాయి.

**వెంటేకు** రూ. ఎంటేకు వి. టేకుజాతికి చెందినచెట్టు.

ఇం. *Venteak.* ఒకజాతివృక్షం.

<ఇం. Venteak.

వెంటేప వి. దర్వాజాలు, తలుపులు తయారు చేయాటానికి పనికివచ్చే కలపనిచ్చే ఒకరకం చెట్టు.

వెంట్ట వి. సరిహద్దు. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 702. క్రీ.శ. 1518.

వెంట్రుక రూ చూ. వెంట్రుక. వి. 1. కేశం. కాశీ. 5 110 ; 2. రోమం.

వెంట్రుకయంత(-అంత) విశే. అత్యల్పం. ఉ.హరి. 2.100. వెంట్రుకవాసి వి. చాల తక్కువభేదం, వెంట్రుకంత తేడా.

వెంట్రువ వి. ఒకజాతిముంగిస, బభ్రువు. ఆం.భా. 2.86.

వెంట్లేటు రూ.చూ. వెంటిలేటరు వి. వెలుతురుకోసం గోడల్లో ఎత్తున పెట్టే చిన్న కిటికీ.

వెంట్లేటరు రూ.చూ. వెంటిలేటరు. వి. వెలుతురుకోసం గోడల్లో పెట్టే చిన్న కిటికీ.

వెంట్లేటరుదర్వాజా వి. మూలజోడుచౌకోటు, పైనగాలి కిటికీ ఉన్న ద్వారబంధం.

వెండయిరేణి చూ. వెండి[1].

వెండయిరేని చూ. వెండి[1].

వెండరివేణి చూ. వెండి[1].

వెణ్డాయము చూ. వెణ్డి[1]

వెణ్డి[1] రూ.చూ. వెండి[1]. వి. వెండి (లోహం).

వెణ్డాయము వి. కరవిశేషం. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 1048. సం. ఆయ-.ఆదాయవిశేషం. <వెణ్డి[1]+ సం. ఆయ-. వెణ్డిగట్టినలోహదివియ వి. వెండిపూతగల దీపస్తంభం. ద.హిం.శా. సంపు.4.శా. సం. 1302. క్రీ.శ. 1107. వెణ్డిమణ్డ వి. వెండి ప్రమిద. ద.హిం.శా. సంపు. 4.శా.సం. 1007. క్రీ.శ. 1065.

వెణ్డి[2] రూ.చూ. వెండి[2]. అవ్య. 1. పునరర్థకం ; 2. అనంతర్యార్థకం ; 3. కింత్వర్థకం.

వెండి[1] రూ. వెణ్డి[1]. వి. రజితం, పంచలోహాల్లో ఒకటి. శృం. నై. 6.108.

క. బెళ్ళి. వెండి ; కొడ. బొళ్ళి. వెండి. తు. బొళ్ళి. వెండి ; త. వెళ్ళి. వెండి, వెండినాణెం ; మ. వెళ్ళి. వెండి ; కో. వెమ్‌ళ్. వెండి, అణా ; తొ. పిళ్లై. వెండి, అణా.

వెండయిరేణి రూ. యెండయిరేణి, యెండి అవిరేని. వెండయిరేని, వెండరివేణి. వెండిఅవిరేని వి. రంగులు లేకుండా సున్నం మాత్రమే పూసిన అరివేణికుండలు. <వెండి1+ అయిరేణి వెండయిరేని రూ.చూ. వెండయిరేణి .వి. రంగులు లేకుండా సున్నం మాత్రమే పూసిన అరివేణికుండలు. వెండరివేణి రూ.చూ. వెండయిరేణి వి. రంగులులేకుండా సున్నం మాత్రమే పూసిన అరివేణి కుండలు. వెండిఅవిరేని రూ.చూ. వెండయిరేణి వి. రంగులు లేకుండా సున్నం మాత్రమే పూసిన అరివేణికుండలు. వెండిఆరతులు వి.బ.వ. వెండిఆరతి పళ్ళేలు. TTDES III 32. క్రీ.శ. 1512. వెండికిచ్చరోగం వి. పొగాకుమీద తెల్లటి చుక్కలేర్పడే ఒకరకం బూజు తెగులు. వెండికొండ వి. కైలాసపర్వతం. రజతశైలం. పల్నా. 3.83. వెండికొండదమనీఁడు వి. శివుడు. రజతాచలవాసి. సాంబ. 1.3. వెండికొండమనీఁడు వి. రజతాచలపతి, శివుడు. వెండికోర వి. వెండిగిన్నె. ద.హిం. శా. సంపు. 4. శా.సం. 933, క్రీ.శ. 1349. వెండికోలచామర వి. రూప్యదండం గల చామరం. ద.హిం.శా. సంపు. 6.శా. సం. 740. క్రీ.శ. 1369. వెండిగుండు వి. గుండులా ఉండటం వల్ల కుక్కకు పెట్టినపేరు. మను. 4.32. ; వి.బ.వ. 1. ధాన్యవిశేషం. ప్రబంధ. 112 ; 2. కైలాసపర్వతం. వెండిగుబ్బలి వి. రజతాచలం, కైలాసం. భీమ. 6.11. వెండిగోరు వి. మెరిసే తెలుపురంగు. వెండిజందెము వి. పెళ్ళి జందెం. వెండిజరీ రూ. వండిజరీ. వి. వెండినుంచి తీసిన సన్నదారం. వెండిటంకాలు వి.బ.వ వెండినాణెం. పదహారుడబ్బుల బంగారునాణేలు. ద హిం.శా. సంపు. 6. శా. సం. 946. క్రీ.శ. 1408. వెండితుల వి. వెండి తులాభారం తూగటం, వెండితో తులాభారం తూగి వెండిని బ్రాహ్మణులకు దక్షిణ ఇవ్వటం. ద.హిం.శా. సంపు. 6. శా.సం. 1171. క్రీ.శ. 1657. వెండిదివ్వకోల వి. వెండిగట్టిన కాష్ఠదీపిక. ద.హిం.శా. సంపు. 4. శా. సం. 975. క్రీ.శ. 1353. సం. దివ్య-.ప్రకాశించేది. <వెండి[1] +సం. దివ్య-+కోల. (మిశ్రన.). వెండిలిడెనలు వి.బ.వ. ఉపకరణవిశేషాలు. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 975. క్రీ.శ. 1353. వెండి పట్టెము వి. వెండి పట్టెడాడు, వెండి కంఠాభరణవిశేషం. లలాటపట్టం. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 322. క్రీ.శ. 1248. వెండిపువులు రూ.వెండిపువ్వులు. వెండిపూలు. వెండిపూవులు. వి.బ.వ. 1. వెండితోచేయబడ్డ పువ్వులు. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 1019. క్రీ.శ. 1289 ; 2. అయిదు నెలల వరిపంట. వెండిపువ్వులు రూ.చూ. వెండిపువులు. వి.బ.వ. 1. రూ.చూ. వెండిపూవులు. వెండితోచేయబడ్డ పుష్పాలు ; 2. ఐదునెలల వరిపంట. వెండిపూలు రూ.చూ. వెండిపువులు. వి.బ.వ అయిదు నెల్ల పంట, గింజ సన్నంగాఉండే ఒకరకం ధాన్యం ; 2.వెండితోచేయబడ్డ పుష్పాలు. వెండిపూవులు రూ.చూ. వెండిపూవులు వి.బ.వ. 1. వెండితోచేయబడ్డ పువ్వులు ; 2. ఐదునెలలవరిపంట. వెండిమల వి. రజతాద్రి, కైలాసం. వెండిమించుకొండ వి. వెండికొండ, కైలాసపర్వతం. వెండిరేకులు వి.బ.వ. వెండి తగళ్ళు. ద.హిం.శా. సంపు. 6. శా. సం. 839. క్రీ.శ. 1356. వెండివడ్లు వి.బ.వ. ఎం.టి.యు. నెంబరువడ్లు. వెండిసహస్రధార వి. వెండితోచేయబడిన సహస్రధార. ద.హిం. శా. సంపు. 5.శా.సం. 1247. క్రీ.శ. 1470.

వెండి[2]. రూ. వెణ్డి[2], అవ్య.1. పునర్థకం, మరి. భార. ఆది 3.137 ; 2. అనంతర్యార్థకం, పిమ్మట. హరి. పూ. 2.25 ; 3. కింత్వర్థం. ఇకనేమన్న. ఆము. 6.61.

వెండియు అవ్య. 1. పిమ్మట. భార. ఆది. 2.116 ; 2. అప్పటి, ఇక, క్రమ్మర. పదంపడి, తడవ. ఉ.హరి. 1.84.

వెండికవెండిక చూ. వెండి.[2] అవ్య మాటిమాటికి. కు. సం. 11.132.

వెండేఁడు వి. సూత్రదారుడు, బొమ్మలాడించేవాడు. బసవ. 4.70.

**వెండ్రుక** రూ. వెంటిక, వెండ్రుక. వి. 1. కేశం శిరోరుహం. భార. సభా. 1.201 ; 2. రోమం. ఉ.హరి. 2.101. పర్జి. వెంఁడ. జుట్టు.

**వెండ్రుకఁగట్టఁబడు** అ.క్రి. నిరసించు. < వెండ్రుక + -ను + కట్టు + -అ$^{7}$ + పడు. **వెండ్రుకపట్టు** అ.క్రి. అతిని శితమగు. సారంగ. 2.169. **వెండ్రుకముక్కతోసమానము** వి. లెక్కలేకపోవటం. **వెండ్రుకయంత(-అంత)** విశ. అత్యల్పం ఉ. హరి. 2.100. **వెండ్రుకవిల్లు** వి.జౌ. గుఱ్ఱంతోక వెండ్రుకలతో కట్టిన ధనురాకారమైన వాద్యవిశేషం. (దీనిని దాసర్లు వాయిస్తారు. దీన్ని కామాచి అంటారు). ఆము. 4.177. **వెండ్రుకిడను సందులేకుండ (-ఇడనుసందులేకుండ)** అవ్య. ఏమాత్రం వ్యవధానం లేకుండ. హంస. 3.133.

**వెండ్రుకిడను సందులేకుండ** చూ. వెండ్రుక.

**వెణ్ణీరు** రూ.చూ. వేన్నీరు. వి. వేడినీరు.

**వెత** వి. 1. శోకం. శృం.నై. 4.124 ; 2. బాధ.
సం. వ్యథా. బాధ ; పా. వహ,వహా ;
క. బెతె, వెతె, వెథె, ;తు. వెథె.
<సం. వ్యథా.

**వెతఁబడు (-పడు)** అ.క్రి. బాధపడు.తాళ్ల. సం. 8.220.

**వెతకు** రూ.చూ. వెదకు. స.క్రి. 1. వెదకు. ఉ.రా. 4.6 ; 2. చర్చించు ; 3. విచారించు.

**వెతారము** వి. వ్యథ, బాధ.

**వెతికిలఁబడు** రూ.చూ. వెదికిలఁబడు. అ.క్రి. వీపుకిందగాపడు.

**వెతుకు** రూ.చూ. వెదకు. స.క్రి. వెదకు.

**వెత్తెసము** వి. భేదం. రావిపాటి గురుమూర్తి వ్యాకరణం 174సూ.
సం. వ్యత్యాస.-భేదం ; ప్రా. వచ్చాస- ; అ.మా. వచ్చాస- ; క. వెత్యాస- ; తు. విత్యాస, వెత్యాస ; మ. విత్యాసం.
<సం. వ్యత్యాస-.

**వెద** చూ. విత్తు. రూ. విద$^{2}$, వి. 1. విత్తడం, నాటు. భార. విరా. 5.60 ; 2. గోమహిష్యాదులు చూలైనట్టికాలం. భాగ. 8.39 ; 3. కొప్పు. తాళ్ల. సం. 15.34 ; 4. పక్షి గర్భాదానం. నీలా. 3.10 ; 5. గోమహిష్యాది ప్రథమ గర్భం, చూలు.
క. బెదె, బెద. వేడి, మదం, బెదె, జంతువుల,(పశువులు తప్ప) కామపరమైన కలయిక ; తు. వితప్పు. కోరిక, వితుప్పు. కోరిక ; మ. వితమ్పుక, కోరుకొను.

**వెదగొఱ్ఱు** వి. విత్తులు వెదవేసే గొర్రు. **వెదచల్లు** రూ.చూ. వెదజల్లు. స.క్రి. 1. వ్యాపింపచేయు. ప్రభా. 4.54 ; 2. కులుకు, చల్లు. **వెదచిందు** అ.క్రి. వ్యాపించు అలముకొను. **వెదజల్లు** స.క్రి. చెల్లాచెదరుచేయు. క్రీడా. 280. **వెదపెట్టు** రూ. వెదబెట్టు. స.క్రి. 1. ఎరువులు మొవాటితో సారవంతంచేయు. బసవ. 7.207 ; 2. విత్తులు చల్లు. మార్క. 4.41 ; 3. గర్భాదానంచేయు. **వెదమొదవు** వి. చూలుతోఉన్న ఆవు. **వెదవడు(-పడు)** అ.క్రి. నాటబడు తాళ్ళ.సం. 5.307. **వెదవెట్టు (-పెట్టు)** రూ.చూ. వెదపెట్టు. స.క్రి. నాటు. తాళ్ళ. సం. 8.183. **వెదావు** వి. చూలుతో ఉన్న ఆవు. < వెద + ఆవు.

**వెదకిచూచినలేకపోవు** చూ. వెదకు.

**వెదకిపట్టు** చూ. వెదకు.

**వెదకిలఁబడుతొడుకు** చూ. వెదకు.

**వెదకిలఁబడుఁదొడుకు** చూ. వెదకు.

**వెదకు** రూ. వెతకు, వెతుకు; వెనకు, వెనుకు. స.క్రి. వెతకు. భార. ఆది. 4. 262.
క. బెదకు. వెతుకు ; గోం. మెహ్కానా. వెతుకు, వహూక్కానా. చేపలుపట్టు ; కుఱు. బెద్దనా. వెతుకు. కనుగొను, అన్వేషించు ; మాల్తొ. బెదె. వెదుకు, పెళ్ళాడు ; పో.చూ.త. నిత. ప్రత్యేకించి సూచించు.
<మూ.ద్రా. *వెత్.

**వెదకిచూచినలేకపోవు** అ.క్రి. అపురూపం. హంస. 4.145. < వెదకు + -.ఇ$^{13}$ + చూచు + -ఇ + -నన్ + లేకపోవు. **వెదకిపట్టు** స.క్రి. కనిపెట్టు. < వెదకు + -.ఇ$^{13}$ + పట్టు. **వెదకిలఁబడుతొడుకు** రూ. వెదకిలఁబడుఁదొడుకు. వి. కామధేనువు. వ్యు. వెదకబడే ఆవు. **వెదకిలఁబడుఁదొడుకు** రూ.చూ. వెదకిలఁబడు తొడుకు. వి. కామధేనువు **వెదకుడు** వి. వెదకటం, అన్వేషణం. **వెదకులాడు** స.క్రి. 1. దేవులాడు ; 2. వెదకికొను. ఈ క్రియనుబట్టి 'వెదకు, కు నామవాచకార్థం ఊహ్యం. < వెదకు + -లు + ఆడు. **వెదకెడువాఁడు** విశ. వెదికేవాడు, అన్వేషి.

**వెదకెడువాఁడు** చూ. వెదకు.

**వెదటిబద్ద** రూ.చూ. వెదురుబద్ద. వి. 1. రాటికి పైనాకిందా కట్టిన వెదురుబద్దలు ; 2. కుంచెకట్టుబడిలో పురి బిగింపుకు రెండుపక్కలా వేసి కట్టిన వెదురుబద్ద.

**వెదటిలాక** చూ. వెదురు. రూ.చూ. వెదురులాక. వి. 1. పడుగులో అక వెంబడి దూర్చిన వెదురుబద్ద ; 2. కుంచెకట్టుబడిలో పురిబిగింపుకు రెండు పక్కలావేసి కట్టిన వెదురుబద్ద.

**వెదుడుదబ్బ** రూ. ఎదడుదబ్బ. వి. కుంచె కట్టుబడిలో పురి బిగింపుకు రెండుపక్కలా వేసికట్టిన వెదురుబద్ద.

**వెదావు** చూ. వెద.

**వెదికిలఁబడు** రూ. వెతికిలఁబడు. అ.క్రి. వీపుకిందగాపడు.

**వెదురాకులగడ్డి** చూ. వెదురు.

**వెదురు** రూ. ఎదరు, యెదురు. వి. 1. వేణువు, మేదరి నిర్మాణ ద్రవ్యంగా వాడుకలో ఉన్న తృణవిశేషం (Bambasa Arundinacea) ; 2. వాసం.
క. బిదిర్, బిద్రు, బిదరు, బిదను ; తు. బెదురు ; త. వెతిర్, వెతిరి, వెతిరమ్, వెదురు ; కో. వెదెర్ ; గోం. వద్దుర్, వెదూర్ ; కొం. దేర్ ; కువి. దేరు. పర్జి. వెది ; కొలా. వెదుర్ ; గ. వెబె, వెదిర్.

**వెదురాకులగడ్డి** వి. ఒకరకం కలుపుమొక్క. < వెదురు + ఆకు + -లు + -అ$^{11}$ + గడ్డి. **వెదురు కంపజిట్ట** వి. ఒకపిట్ట. **వెదురు కంపలజిట్ట** వి. ఒకపిట్ట. **వెదురుకఱ్ఱ** రూ. ఎదురుకఱ్ఱ. వి. నూలు చిలపలు ఆరేసే బొంగు. **వెదురు కోల** వి. బ్రహ్మచారి ధరించే వెదురుకోల. **వెదురుగడ్డి** వి. ఒకరకంగడ్డి. **వెదురుగుండు** రూ. ఎదురుగుండు. వి.

పట్టు పడుగు సరిచెయ్యటానికి నిలబెట్టే ఊడ్తెకు పైన బిగించిన అడ్డకట్టె **వెదురుగొడియ** వి. వెదురుతో చేసిన సంకెల. (శ్రీనాథుని చాటువు). **వెదురుతీగ** వి. పెండెకట్టులో వాడటానికి చీల్చిన వెదురు దబ్బలు. **వెదురునాడె** రూ. ఎదురునాడె వి. వెదురుగొట్టంతో చేసిన నాడె. **వెదురుపాలు** వి.బ,వ. **1**. త్వక్క్షీరం, వృక్షవిశేషం ; **2**. వెదురుప్పు. **వెదురుపిచ్చిక** వి. ఒకరకం పిట్ట. **వెదురుపెండె** వి. పెండెకట్టులో వాడటానికి చీల్చిన వెదురు బద్దలు. **వెదురుపేడు** రూ. ఎదురుపేటు. వి. వాట తయారీలో సమదళ సరిని మన్ను లేపటానికి చీల్చిన వెదురుబద్ధలు. **వెదురుప్పు** వి. వెదురుపాలు. <వెదురు+ఉప్పు. **వెదురుబద్ద** రూ. ఎదురుబద్ద, వెదటిబద్ద. వి. కుంచెకట్టుబడిలో పురిబిగింపుకు రెండు పక్కలా వేసి కట్టిన వెదురుబద్ద. **వెదురుబ్రద్దె** వి. రాటికి పైన కిందా కట్టిన వెదురుబద్ద. **వెదురుబియ్యము** వి. వెదురులో వచ్చే బియ్యం. **వెదురుబొంగు** వి. బోలువెదురు. **వెదురుబోడు** వి. బోలువెదురు. **వెదురుమిడుత** వి. ఒకరకం మిడత. **వెదురుమొలక** వి. చోలకి, ఒకరకం మొక్క, కరీరం. **వెదురురివ్వలు** రూ. ఎదురు రివ్వలు. వి.బ.వ. సారె తయారీలో లోపల పెట్టే వెదురు చువ్వలు. **వెదురులాక** రూ. వెదటిలాక. వి. కుంచెకట్టుబడిలో పురిబిగింపుకు రెండు పక్కలా వేసి కట్టిన వెదురుబద్ద, **వెదురువిల్లు** వి. **1**. వెదురు బద్దలతో చేసినవిల్లు ; **2**. గిలకబద్ద. **వెదురేయు** రూ. ఎదురేయు. అ.క్రి. వెదురు బద్దలో సారెమీది వాటను నునుపుచేయు. <వెదురు+వేయు. **వెదుర్లు** రూ. ఎదుర్లు. వి.బ.వ. పెంటెకట్టుబడిలో వాడటానికి చీల్చిన వెదురు బద్దలు. <వెదురు+-లు.

**వెదురేయు** చూ. వెదురు.

**వెదుర్లు** చూ. వెదురు.

**వెద్దిచేయు** చూ. వెద్దిసేయు. స.క్రి. పనికిమాలినదాన్నిగా చేయు. కు. సం. 6.18.

**వెద్దిసేయు** రూ.చూ. వెద్దిచేయు. స.క్రి. గేలిచేయు, పరిహసించు.

**వెధవ** వి. **1**. నిష్ప్రయోజకుడు ; **2**. దుష్టుడు ; **3**. విధవ. వితంతువు.

సం. విధవా. భర్త జీవించిలేనిస్త్రీ. ముండమోపి ; ప్రా.పా. విధవా. వితంతువు ; ప్రా. విహవా ; పం. బేవా.

క. వెధవ. వితంతువు.

<సం. విధవా.

**వెధవముండ** వి. **1**. వితంతువు, ముండమోపి ; **2**. నిష్ప్రయోజకుడు. **వెధవవేషాలు** వి.బ.వ. తుంటరిపనులు, **వెధవవేషాలువేయు** అ.క్రి. తుంటరి పనులుచేయు.

**వెన్** రూ.చూ. వెన్ను[1]. వి. వెన్ను, వీపు.

**వెనక** రూ.చూ. వెనుక. విశే. **1**. వెనుక, **2**. ఆవల; **3**. వీపు ; **4**. తరవాత.

**వెనకచివర** రూ. ఎనికిసివర. వి. దండెదగ్గర నేత పడుగులో దూర్చినచువ్వ. **వెనకచుక్క** వి. ధ్రువుడు, ధ్రువనక్షత్రం. **వెనకచూపులమెకము** రూ. వెనుకచూపుల మెకము. వి. ఎలుగుబంటి. **వెనకటికి** అవ్య. ద్రు. పూర్వం. **వెనకటికొయ్య** రూ. ఎంగటికొయ్య, ఎనక్కొయ, ఎనిక్కొయ్య. వి. ఆసువెనకపీటకు బిగించిన పుల్ల. **వెనకటిపీట** రూ.చూ. వెనకపీట. వి. ఆసుపీటల్లో చివరిపీట. **వెనకతొల్లిపట్టె** వి. బండి వెనక భాగంలో పెడదబ్బపైన గుజ్జులు వెయ్యటానికి అమర్చినపట్టె. **వెనకనిచ్చెన** వి. తివాసీ నేసేటప్పుడు నేతపనివాడు కూర్చొనే బల్లను ఎత్తు చెయ్యటానికి వెనకాలవైపు అమర్చిన నిచ్చెన. **వెనకపట్టె** రూ. ఎనికిపట్టె. వి. ఆసుపీటల్లో చివరిపట్టె. **వెనకపీట** రూ. ఎంగటిపీట, ఎనకటిపీట. ఎనికపీట, వెనకటిపీట. వి. ఆసుపీటల్లో చివరిపీట. **వెనకపాల్లు** వి. పెడదబ్బ, రెండునొగల బండి నొగలను వెనకవైపున బంధించిన కర్ర. **వెనకబల్ల** రూ. ఎనికిబల్ల. వి. ఆసుపీటల్లో చివరిబల్ల. **వెనకబారి** వి. ఒకసారి మోట లాగిన తరువాత ఎద్దులు మోట బావి వైపు ఎక్కి వెళ్ళేదారి. **వెనకమాత్రేవులు** రూ. ఎనకమాత్రేవులు. వి.బ.వ. ఆములో వెనుకభాగానికి మంట వచ్చిందీ లేనిదీ తెలుసుకోవటానికి ఆము వెనక పెట్టిన కన్నాలు. **వెనకముందెఱుఁగు** స.క్రి. బాగా తెలుసుకొను. తాళ్ల.సం. 5.151. <వెనక+ముందు+ఎఱుఁగు. **వెనకమోట** వి. వెనక్కపిల. ఎద్దులు మోటలాగుతూ దిగి బావివైపు తిరిగి పోవటానికి వేరేతోవ ఏర్పాటు చేసిన మోట. **వెనకరేవులు** రూ. ఎనకరేవులు. వి.బ.వ. ఆములో వెనకభాగానికి మంట వచ్చిందీ లేనిదీ తెలుసుకోవటానికి ఆము వెనక పెట్టిన రంధ్రాలు. **వెనకవేసుకొను** స.క్రి. కూడబెట్టు. తాళ్ల. సం. 8.59. **వెనకాముందుచూచు** అ.క్రి. **1**. లాభనష్టాలు పరిగణించు ; 2. మంచిచెడులు ఆలోచించు. <వెనక+ఉన్+ముందు+చూచు. **వెనక్కపిల** రూ. వెనుక కపిలె. వి. వెనకమోట, ఎద్దులుమోట లాగుతూ దిగి బావివైపు తిరిగి పోవటానికి వేరేతోవ ఏర్పాటు చేసిన మోట, దిగుబారి, ఎగుబారి వేరు వేరుగా ఉన్న మోట. <వెనక+కపిల. **వెనక్కొయ్య** రూ. ఎనక్కొయ్య. వి. మగ్గం గుంటలో పాపుచెక్కల బిగింపుకు పాతినకొయ్య. <వెనక+కొయ్య. **వెనవెనక** క్రి.విశే.ద్రు. మిక్కిలి వెనకగా. తాళ్ల. సం. 8.57. **వెనిగోరకొమ్ము** వి. వెనక నుంచి ముందుకు వంగినకొమ్ము. <వెనక+కోరకొమ్ము.

**వెనకచవితి** రూ.చూ. వెనకయచవితి. వి. గణపతిచవితి, నేతపనివాళ్ళు మగ్గం సామానులన్ని కడిగి బొట్టుపెట్టి పూజ చేసుకునే పండగ.

**వెనకయచవితి** చూ. వెనకయ్య. రూ. వెనకచవితి, వెనకయ్యచవితి. వి. భాద్రపదశుద్ధచవితి, నేతపనివాళ్ళు మగ్గం సామానులన్నీ కడిగి బొట్లుపెట్టి పూజ చేసుకునే పండుగ.

సం. వినాయక -. గణేశుడు.

<సం. వినాయక-+అయ్య+చవితి.

**వెనకయ్య** వి. వినాయకుడు. భీమ. 8.88.

సం. వినాయక -. విఘ్నేశ్వరుడు ; ప్రా. విణాయగ. విఘ్నేశ్వరుడు ;

క. బెనక ; తు. బెనకె. విఘ్నేశ్వరుడు.

<సం. వినాయక.

వెనకయ్యచవితి రూ.చూ. వెనకయచవితి. వి. భాద్రపద శుద్ధచవితి. నేతపనివాళ్ళు మగ్గం సామానులన్నీ కడిగి బొట్లుపెట్టి పూజచేనుకునే పండుగ. సం. వినాయక -. గణేశుడు. <సం. వినాయక-+అయ్య+చవితి. వెనకయ్యతల్లి వి. పార్వతి. గణేశజనని. వెనకయ్యపీట వి. 1. రాట్నం పీటకు ఎడమవైపున కదురు బిగించే నిలువు కొయ్య ; 2. రాట్నం అడ్డపట్టె. వెనకయ్యవెనకయ్య వి. స్కందుడు, కుమారస్వామి. <వెనకయ్య+వెనక+అయ్య.

**వెనకాముందుచూచు** చూ. వెనక.

**వెనకు** చూ.చూ. వెదకు. స.క్రి. వెతకు. యయా. 2.76.

**వెనకుడు** రూ.చూ. వెనుకుడు. వి. వెదకటం.

**వెనక్కపిల** చూ. వెనక.

**వెనక్కొయ్య** చూ. వెనక.

**వెనవెనక** చూ. వెనక.

**వెనిగోరకొమ్ము** చూ. వెనక.

**వెను** రూ.చూ. వెన్ను[1]. వి. 1. ఔ. అనౌ. వీపు, పృష్ఠభాగం ; పృష్ఠభాగం ; 2. ఇంటినడికొప్పు.

**వెనుకొనిచను** స.క్రి. వెంబడించిపోవు. శృం. నై. 2.46. **వెనుకొను** స.క్రి. వెంబడించు, వెన్నంటు. భార. విరా. 2.128. **వెనుగఱ్ఱకొమెర** రూ. ఎన్గఱ్ఱకొమెర. వి. వెన్నుగాడిని మోసేకొమెర. <వెను+కఱ్ఱ+కొమెర. **వెనుగఱ్ఱపీట(-కఱ్ఱపీట)** రూ. ఎనుగఱ్ఱపీట. వి. కొమరమీదిపీట. **వెనుగఱ్ఱసాలు** రూ. ఎనుగఱ్ఱసాలు. వి. కూనలకు వెన్నుగాడి వెంటనే కప్పేతీరు. <వెను+కఱ్ఱ+చాలు[2]. **వెనుగాటెదురు** రూ. ఎనుగాటెదురు. వి. ఒక ఇంటివాకిలికి ఎదురుగా మరొక ఇంటి వెన్నుగాడి ఉండటం అనేతప్పు. **వెనుగాడిగుజ్జు** రూ. ఎనుగాడిగుజ్జు. వి. వెనుగాడిని మోసే పెద్దగుజ్జు. **వెనుగాడిదోషం** రూ. ఎనుగాడిదోషం, ఎన్నుగాడిదోషం. వి. ఒక ఇంటి వాకిలి ఎదురుగా మరొక ఇంటి వెన్నుగాడి ఉండటం అనే తప్పు. **వెనుగాడిపోటీ** రూ. ఎనుగాడిపోటీ. వి. ఒక ఇంటి వాకిలి ఎదురుగా మరొక ఇంటి వెన్నుగాడి ఉండటం అనేతప్పు. **వెనుగాడిల్లు** రూ. ఎనుగాడిల్లు. వి. వెన్నుగాడిగల ఇల్లు. **వెనుగాడు** వి. పూరిళ్ళకు పైభాగంలో వాసాలకు ఆధారంగా ఉంచే కొయ్య. **వెనుగానిల్లు** రూ. ఎనుగానిల్లు. వి. వెన్నుగాడిగల ఇల్లు. **వెనుచను** అ.క్రి. వెంబడించువెళ్ళు. **వెనుచఱచు** రూ.చూ. వెన్నుసఱచు. స.క్రి. వెంబడించు. ఉ.రా. 3.401. **వెనుచూపు** రూ.చూ. వెన్నుసూపు. అ.క్రి. వెన్నిచ్చి వెనక్కి మరలు. **వెనుచూపుమెకము** వి. ఎలుగుబంటి. **వెనుదన్ను(-తన్ను)** రూ.చూ. వెన్నుదన్ను. అ.క్రి. వెనకనిలుచు. భార. విరా. 5.279 ; స.క్రి. 1. వెంబడించు ; 2. తిరస్కరించు. **వెనుదవులు(-తవులు)** రూ. వెన్తవులు, వెండగులు, వెండవులు. స.క్రి. వెంబడించు. భార. ఆది. 4.262. **వెనుదీయు(-తీయు)** అ.క్రి. వెనక్కిమరలు. పల్నా.పు. 84. **వెనుదీయువాఁడు** విశ. కాందిశీకుడు. **వెనుదెంచు(-తెంచు)** అ.క్రి. వెనుకకువచ్చు. కు. సం. 10.75. **వెనుపెంక** రూ.చూ. వెన్నుపెంక. వి. ఇంటి వెన్నుగాడిమీద పరిచేపెంకు. **వెనుపోటు** రూ.చూ. వెన్నుపోటు. వి. వెన్నుపోటు, హితవంచన. **వెనుబడలమగు** అ.క్రి. సహాయమగు, తాళ్ల. సం. 8.288. **వెనుబద్ద** రూ. ఎనబద్ద, ఎనుబద్ధ, వెన్నుబద్ద. వి. ఇంటి నడికొప్పును మోసే కఱ్ఱ. **వెనుబద్దగుజ్జు** రూ. ఎనుబద్దగుజ్జు, వెన్నుబద్దగుజ్జు. వి. వెనుగాడిని మోసే పెద్దగుజ్జు. **వెనువెంట** రూ. వెన్వెంట. క్రి.విశ.క్రదు. వెనుకభాగంలో. భార. అరణ్య. 1.107. **వెనువెనక** రూ.చూ. వెన్వెన్క. వి. మిక్కిలి వెనుకభాగం; **వెనువెనుకకు** అవ్య.క్రదు. బాగా వెనక్కి. కళా. 6.160. **వెనుమూపు** రూ.చూ. వెన్నుసూపు. అ.క్రి. వెన్నిచ్చి వెనక్కి మరలు. **వెన్కొను** స.క్రి. వెంబడించు. భార. కర్ణ. 1.159. <వెను+కొను. **వెజ్జాపుపోటీ** రూ. ఎంజాప్పోటి. వి. ఒక ఇంటివాకిలికెదురుగా మరొక ఇంటి వెన్నుగాడి ఉండటం అనే తప్పు. <వెను+చాపు+పోటి. **వెన్తవులు** రూ.చూ. వెనుదవులు. స.క్రి. వెంబడించు. **వెందగులు** రూ.చూ. వెనుదవులు. స.క్రి. అనుగమించు, వెంటనంటు. రం.రా.బాల. 12పు. 2పం. **వెందవులు** రూ.చూ. వెనుదవులు. స.క్రి. అనుగమించు, వెంటనంటు. రం.రా.ఉ. 16పు. 7పం. **వెన్వెన్క** రూ. వెనువెనక. వి. మిక్కిలి వెనకభాగం. దశా. 4.232. <వెను+వెనక. **వెన్వెంట** రూ.చూ. వెనువెంట. వి. వెనకనే. భార. శాంతి. 3.151.

**వెనుక** రూ. వెనక, వెన్క. క్రి.విశ. 1. పశ్చాద్భాగంలో ఉండేది. భార. శాంతి. 3.6 ; 2. ముందటిది. జైమినిభా. 4.103 ; 3. అవతల ; 4. తరవాత ; క్రి.విశ.క్రదు. 1. పూర్వకాలంలో. శృం.నై. 1.109 ; 2. పూర్వభాగంలో. శివరా. 3.67 ; 3. వెనకభాగం. క్రీడా. 104 ; వి. 1. ఉపేక్ష. భోజ. 6.370 ; 2. ముందటిది. జైమినిభా. 4.103 ; 3. పడమటిదిక్కు. యయా. 5.30 ; అవ్య. వెంబడి.

**వెనుకకపిలె** రూ.చూ. వెనక్కపిల. వి. తిరుగుడు కపిలె. **వెనుకగు** అ.క్రి. సహాయం వచ్చు. భాస్క.రా.యు. 10.69. <వెనుక+అగు. **వెనుకగొయ్యిముందఱనూయి** వి. ఎటైనా ఇబ్బంది కలగటం, ముందుగొయ్యి వెనకనుయ్యి. పండి.చ. 2. 5.486. **వెనుకచిక్కు** అ.క్రి. వెనుకపడు. **వెనుకచూపులమెకము** రూ.చూ. వెనకచూపులమెకము. వి. ఎలుగుబంటి. **వెనుకంజవేయు** అ.క్రి. వెనుదీయు. **వెనుక(జాచు(-చూచు)** అ.క్రి. వెనకతీయు, ఏదోనష్టం వస్తుందని వెనుదీయు. **వెనుకటిది** విశ. పశ్చిమం. **వెనుకటిపని** వి. అపరకర్మం. అచ్చ.రా.యు. 560. **వెనుకటివాఁడు** విశ. 1. తమ్ముడు ; 2. వెనకఉన్నవాడు. **వెనుకడుగులిడు** అ.క్రి. వెనుకంజవేయు. హంస. 4.116. <వెనుక+అడుగు[1]+-లు+ఇడు. **వెనుకడ్గువేయు** అ.క్రి. వెనుకంజవేయు, భయపడు, పల్నా. పు. 118. <వెనుక+అడ్గు[1]+వేయు. **వెనుకదన్ను (-తన్ను)** వి. వెనుకఉన్న సహాయం. **వెనుకదీయు(-తీయు)** అ.క్రి. 1. వెనుదీయు ; 2. సంకోచించు. **వెనుకద్రొక్కు (-త్రొక్కు)** అ.క్రి. వెనుదీయు. **వెనుకపడు** అ.క్రి. 1.

వెనకచిక్కు ; **2.** ధనం ఖర్చుకాకుండా కూడబడు. **వెనుకపాట** వి. వంతపాట. **వెనుకపాటు** వి. వెనకపడటం. మను. 3.28. **వెనుకపోటుపొడుచు** స.క్రి. మోసగించు. దెబ్బతీయు. **వెనుకమర్లు** వి. వెనకటిస్నేహం. సారంగ. 2.155. < వెనుక + మరులు. **వెనుకముందగు** అ.క్రి. సంకోచించు. ప.శకు. 2.111. < వెనుక + ముందు + అగు. **వెనుకముందఱచేయు** అ.క్రి. పాచికలు తాళించు. ఉ.హరి. 3.122 ; స.క్రి. వెనకఉన్నదాన్ని ముందుంచు. **వెనుకముందఱలేకపోవు** అ.క్రి. దగ్గర చుట్టాలెవ్వరు లేకుండు. శృం.నై. 1.108. **వెనుకముందునుదలచు (-తలచు)** అ.క్రి. ముందువెనుకలు ఆలోచించు, బాగోగులు ఆలోచించు. శుక. 1.184. **వెనుకముందులుగానకుండు (-కానకుండు)** అ.క్రి. 1. ఏంచేయాలో తోచకుండు. కళా. 6.55 ; **2.** భవిష్యత్తునుగురించి ఆలోచించకుండు. **వెనుకముందెంచు** స.క్రి. వెనకాముందూ ఆలోచించు. తాళ్ల. సం. 3.218. **వెనుకమేను** వి. వీపు, చరమాంగం. **వెనుక(బోవువా(డు(-పోవువా(డు)** విణ. సహాయకుడు. **వెనుకమ్రాను** వి. ఏతంబావికి నీళ్ళెత్తేవాడు కూర్చోవటానికి నిలువు కాళ్ళమీద అడ్డంగాఉంచిన మాను. **వెనుకల** వి. వెనక, పశ్చాద్భాగం. **వెనుకవేయు** స.క్రి. ధనం ఖర్చుపెట్టకుండా కూడబెట్టు. **వెనుకవేసికొనివచ్చు** స.క్రి. వత్తాసివచ్చు, సమర్థించు. **వెనుకవేసుకొను** రూ. వెన్కవేసికొను. స.క్రి. **1.** వత్తాసివచ్చు, సమర్థించు. తాళ్ల. సం. 8.89 ; **2.** డబ్బునిలవ వేసుకొను, దాచుకొను.

**వెనుకు** రూ.చూ. వెదకు. స.క్రి. వెదకు

**వెనుకుడు** రూ. వెనకుడు. వి. వెదకటం.

**వెనుగు** రూ.చూ. వెలుగు. వి. మధ్యమధ్య పల్లలు మెదిగిన కంచె.

**వెను(బడు** చూ. వెను. రూ.చూ. వెన్బడు. అ.క్రి. **1.** దుఃఖించు. నిర్వ.రా. 7.157 ; **2.** విషాదించు. భార. విరా. 2.60.

**వెను(బాటు** రూ.చూ. వెన్బాటు. వి. **1.** విషాదం. భార. విరా. 1.103 ; **2.** దుఃఖం. భార. ఉద్యో. 2.295.

**వెనెలైటు** రూ. వెన్నెలైటు. వి. వెలుతురుకోసం గోడల్లో ఎత్తునపెట్టే చిన్న కిటికీ.

**వెన్క** రూ.చూ. వెనక. విణ. వెనుక. భార. అశ్వ. 4.119.

**వెన్కవేసుకొను** రూ.చూ. వెనుకవేసుకొను. అ.క్రి. సహాయంగావచ్చు, వత్తాసివచ్చు. సారంగ. 2.160.

**వెన్కొను** చూ. వెను.

**వెన్గాపుపోటే** చూ. వెను.

**వెంతకు** వి గృహనిర్మాణానికి ఉపయోగపడే కలపనిచ్చే, తెల్లని పూలు పూసే ఒకరకంచెట్టు. (Lageroca Lauiuceolata).

**వెన్దవులు** చూ. వెను.

**వెందగులు** చూ. వెను.

**వెందవులు** చూ. వెను.

**వెందిరి** రూ.చూ. వెన్నెదురు. వి. నీటివారల పెరిగే ఒకరకం కలుపు మొక్క.

**వెందు** వి. తమకు వశపడటంకోసం తుమ్మెదల మధ్యనుంచి పాశేపురుగు. కు.సం. 6.19.

**వెన్న** వి. పెరుగు చిలకగా వచ్చింది, మిసిమి, నవనీతం. కు. సం. 9.135.

క. బెణ్ణె, బెణ్ణి. వెన్న ; కొడ. బెణ్ణె. వెన్న ; తు. బెణ్ణె, బొణ్ణాయి ; త. వెణెయ్, వెణ్ణె ; మ. వెణ్ణ ; కో. వెణ్ ; తొ. వెణ్.

**వెన్నకుండ** వి. వెడల్పుమూతితో అడుగున ఎర్రమన్ను వేసి గట్టిగా చేసిన మట్టిపాత్ర. **వెన్నకుపండ్లువచ్చు** అ.క్రి. **1.** అసంభవమగు. తాళ్ల. సం. 11.3.6 ; **2.** అల్పుడు బలవంతుడగు. రాధికా. 3. **వెన్నగరికట్టు** అ.క్రి. వెన్న గడ్డకట్టు. అష్టమ. క. 267. **వెన్నగలుగనెయ్యివెదకు** అ.క్రి. సాధనం చేతిలో ఉండగా మరొకచోట వెంపర్లాడు. రుక్మా. చ. 5.70. < వెన్న + కలుగు + -అ + నెయ్యి + వెదకు. **వెన్నచెలకు** వి. వెన్నదేవికూర. **వెన్నడాయి** వి. పక్షివిశేషం. **వెన్నతోడ(బెట్టు(-పెట్టు)** అ.క్రి. పుట్టుకతో వచ్చు. మను. 2.43. **వెన్నతోనిడు(-ఇడు)** అ.క్రి. పుట్టుకతోవచ్చు. గౌ. హరి. 1.259, 260. **వెన్నతో(బెట్టిన విద్య (-పెట్టినవిద్య)** వి. పుట్టుకతో వచ్చింది. **వెన్నతో(బెట్టు(-పెట్టు)** అ.క్రి. చిన్నతనంనుంచి అలవడు, సహజసిద్ధమగు. కాశీ. 7.50. **వెన్నదొంగ** వి. నవనీతచోరుడు, వెన్నముచ్చు, కృష్ణుడు. **వెన్నదొంగయన్న** వి. బలరాముడు, కృష్ణునిఅన్న. **వెన్నవడిదము** వి. భక్ష్యం. శృం. నై. 6.120. **వెన్నపము** రూ. వెన్నప్పము. వి. భక్ష్యం. కళా. 7.81. < వెన్న + అప్పము. **వెన్నపాలకాయ** వి. భక్ష్యవిశేషం. **వెన్నపూస** వి. వెన్నముద్ద. **వెన్నపూసకుండ** రూ. ఎన్నపూసకుండ. వి. వెన్న కరగబెట్టటానికి వాడే మట్టి పాత్ర. **వెన్నపూసమనసు** వి. మెత్తనిమనసు. **వెన్నపూసలం** వి. ఒకరకం కలుపుమొక్క. < వెన్నపూస + అలం. **వెన్నప్పము** రూ.చూ. వెన్నపము. వి. భక్ష్యం, వెన్నపూసి చేసే అప్పం. **వెన్నబువ్వలు** వి.బ.వ. పాలబువ్వలు. తాళ్ల. సం. 7.153. **వెన్నమడు(గు** వి. ఒకరకం బట్ట. హంస. 5.406. **వెన్నముచ్చిమి** వి. వెన్నదొంగతనం. తాళ్ల. సం. 7.195. **వెన్నముచ్చు** వి. వెన్నదొంగ, కృష్ణుడు. **వెన్నముద్ద** వి. **1.** ధాన్యవిశేషం. హంస. 4.176 ; **2.** చంద్రుడు ; **3.** వెన్నపూస ; **4.** ఒకరకంగాదం, వెన్నాది. **వెన్నముద్దకోడి** వి. ఒకపిట్ట. (Poryana marretta). **వెన్నముద్దరాకు(-ఆకు)** వి. ఒక ఒకరకం మొక్క. (Omelina bengalensis). **వెన్నముద్దలాకు** వి. నీటివారల పెరిగే ఒకరకం పాకుడు కలుపుమొక్క, వెన్నదేవికూర. < వెన్నముద్ద + -లు + ఆకు. **వెన్నముద్దలు** వి.బ.వ. **1.** కాలిధాన్య విశేషం. హంస. 4.176 ; **2.** వెన్నముద్దలు ; **3.** చిచ్చుబుడ్లలో ఒకరకం. **వెన్నముద్దాకు** వి. నీటివారల పెరిగే ఒకరకం పాకుడు కలుపుమొక్క, వెన్నదేవికూర. (Commelyna Communis). < వెన్నముద్ద + ఆకు. **వెన్నముంతలు** వి.బ.వ. చిచ్చుబుడ్లలో ఒకరకం. **వెన్నమెఱు(గు** వి. భక్ష్యవిశేషం.

వెన్నయుండ(ఉండ) వి. భక్ష్యం. వెన్నవెదురు రూ.చూ. వెన్నెదురు. వి. 1. తరిగొర్ర ; 2. విశల్య. దంతి. వృక్షవిశేషం. వెన్నాద్రి రూ.చూ. వెన్నెదురు. వి. నీటి వారగా పెరిగే ఒకరకం పాకుడు కలుపుమొక్క. వెన్నిద్దల కాడ రూ.చూ. వెన్నిద్రకాడ. వి. నీటివారల పెరిగే ఒకరకం పాకుడు కలుపుమొక్క. వెన్నిద్రకాడ రూ. వెన్ని ద్దలకాడ. వి. వెన్నుదురు. నీటివారల పెరిగే ఒకరకం పాకుడు కలుపుమొక్క. వెన్నదేవికూర. (Commolyna Communis). వెన్నెదురు రూ. వెందిరి, వెన్నవెదురు, వెన్నాద్రి, వేనాద్రి. వి. వెన్నముద్దాకు, వెన్నిద్దలకాడ, వెన్నిద్రాకు. వి. నీటివారల పెరిగే ఒకరకం పాకుడు కలుపు మొక్క, వెన్నదేవికూర. (Commolyna Communis). < వెన్న + ఎదురు².

**వెన్నకూతవాడు** విశే. వేణువు ఊదేవాడు. ద.హిం.శా. సంపు. 10. శా. సం. 422. క్రీ. శ. 1269.

సం. వేణు-.పిల్లంగోవి.

**వెన్నడి** చూ. వెన్ను¹. వి. వెంబడి.

వెన్నడికొను స.క్రి. వెంబడించు. వెన్నడించు స.క్రి. వెంబడించు. < వెన్నడి + - ఇంచు.³

**వెన్నంటు** చూ. వెన్ను.¹

**వెన్నలి** రూ.చూ. వేనలి. వి. జడ. వేణి. సిం. ద్వా. 3.165.

**వెన్నాగు** చూ. వెన్ను.¹

**వెన్నాడు** చూ. వెన్ను.¹

**వెన్నాద్రి** చూ. వెన్న.

**వెన్నాస** చూ. వెన్ను.¹

**వెన్నిచ్చు** చూ. వెన్ను.¹

**వెన్నిద్దలకాడ** చూ. వెన్న.

**వెన్నిద్రకాడ** చూ. వెన్న.

**వెన్నిలైటు** రూ.చూ. వెనెలైటు. వి. వెలుతురు కోసం గోడల్లో ఎత్తున పెట్టే చిన్నకిటికీ.

**వెన్ను¹** రూ. వెన్, వెను, వెమ్. వి. ౙా. అనా. 1. వీపు, పృష్ఠ భాగం. కు. సం. 5.86, భార. భీష్మ. 2.96 ; 2. పృష్ఠభాగం. మను. 2.7 ; 3. ఇంటినడికొప్పు. కవిక. 4.113 ; 4. పిఱ, పణతకుఆకుకు వెలుపలివైపు ; 5. ఇంటినడికొప్పున మోసేకఱ్ఱ ; 6. పిడికి కిందగా ఉండే కుంచెపైభాగం.

క. బెన్, బెన్ను, బెమ్. వెనుకభాగం ; కొడ. బెన్ని ; తు. బెరి ; త. వేరిన్, వెన్, వెన్-.

వెన్నంటు స.క్రి. వెంబడించు. < వెన్ను¹ + అంటు.¹ వెన్నాగు స.క్రి. కాపాడు, సాకు. < వెన్ను¹ + ఆఁగు. వెన్నాడు అ.క్రి. వెంబడించు, వెంటనంటు. భార. కర్ణ. 2.382. < వెన్ను¹ + ఆడు. వెన్నాస వి. 1. ఆధారం. శుక. 1.349 ; 2. సహాయం. ఉషా. 4.48. < వెన్ను¹ + ఆస. వెన్నిచ్చు అ.క్రి. 1. (యుద్ధరంగంనుంచి) పారిపోవు. కు.సం. 11.35 ; 2. లొంగిపోవు. బసవ. 2.28 ; 3. వెనుతీయు, వెనుకకుమరలు. భార. కర్ణ. 3.313 ; 4. వెనుతిరిగిపారిపోవు. దశా. 4.95. < వెన్ను¹ + ఇచ్చు. వెన్నుకట్టు వి. 1. పృష్ఠబంధం ; 2. పిడికి కిందగా ఉండే కుంచెభాగం. వెన్నుకట్టె వి. పృష్ఠబంధం, వెన్నెముక. వెన్నుకూరిన రూ. ఎన్నూకన. వి. వెన్నుమీద పరిచేకూన. వెన్నుగంట వి. కేశబంధ విశేషం. వెన్నుగుజ్జు వి. వెనుగాడిని మోసే పెద్దగుజ్జు. వెన్నుగుదియ వి. వీపుమీద కొట్టటానికి ఉపయోగించేకఱ్ఱ. చెన్నబసవ. 2.24. వెన్నుగూట వి. ఇంటి నడికొప్పును మోసేకఱ్ఱ. వెన్నుగూటం రూ. ఎన్నుగూటం, ఎన్నుగోటం. వి. ఉన్నిమగ్గం దోనుగను మోసే ఎడమవైపు కొయ్య గూటం. వెన్నుగూన వి. వెన్నుగాడుకు పరచే పెద్దసైజు పెంకు. వెన్నుగాడి(-కాఁడి¹) వి. వెన్నెల, ఇంటినడికొప్పు మ్రాను. వెన్నుచఱచు రూ.చూ. వెన్నునఱచు. స.క్రి. వెంబడించి తరుము. వెన్నుచూచు రూ. వెన్నునూచు. స.క్రి. పారదోలు. హరి. 3.9. వెన్నుచూపు రూ.చూ. వెన్నునూపు. అ.క్రి. 1. వెన్నిచ్చువెనక్కిమరలు. పాండు. 1.63, కకుత్స్థ. 2.126 ; 2. ఓడిపోవు. వెన్నుచెక్క రూ. ఎన్నుచెక్క. వి. ఇంటి నడికొప్పును మోసేకఱ్ఱ. వెన్నుటిల్లు వి. వెన్నుగాడిగల ఇల్లు. < వెన్ను¹ + ఇల్లు. వెన్నుదగులు (-తగులు) స.క్రి. వెంటాడు, వెంబడిచు. వెన్నుదన్ను (-తన్ను) రూ. వెనుదన్ను. స.క్రి. 1. వెంబడించు, అనుసరించు. నిర్వ. రా. 3.13 ; 2. వెనువెంటనే. మను. 2.43 ; 3. తిరస్కరించు. మను. 5.101 ; అ.క్రి. వెనుక నిల్చు. ఉ. హరి. 3.36. వెన్నుదూలం రూ. ఎన్నుదూలం. వి. ముఖ్యమైనదూలం. వెన్నుపగులు అ.క్రి. నడుంవిరుగు. వెన్నుపట్టి రూ.చూ. వెన్నుపట్టె. వి. పెంకు కప్పు నడికొప్పున వేసేసున్నపుపట్టి. వెన్నుపట్టె రూ. వెన్నుపట్టి. వి. 1. వెన్నుముక ; 2. ఇంటివెన్నుగాడి, ఇంటి నడికొప్పును మోసేకఱ్ఱ. వెన్నుపాము వి. మజ్జా రజ్జువు, వెన్నెముక. వెన్నుపూస వి. వెన్నుముక. వెన్నుపెంక రూ. ఎనుపెంక, ఎన్నుపెంక, వెనుపెంక. వి. ఇంటి వెన్నుగాడిమీద పరిచేపెంకు. వెన్నుపోటు రూ. ఎన్నుపోటు, వెనుపోటు వి. 1. ఒక ఇంటివెన్నుగాడిఇంకో ఇంటి వెన్నుగాడికి అడ్డంగా ఉండటం ; 2. హితవంచన. వెన్నుబద్ద రూ.చూ. వెనుబద్ద. వి. 1. ఇంటినడికొప్పు మాను ; 2. వెన్నుపట్టె. వెన్నుబద్దగుజ్జు రూ.చూ. వెను బద్దగుజ్జు. వి. వెనుగాడిని మోసే పెద్దగుజ్జు. వెన్నుబాజు రూ. ఎన్నుబాజు. వి. ఇంటి నడికొప్పును మోసేకఱ్ఱ. వెన్నుమచ్చదునీఁడు వి. అర్జునుడు. వెన్నుమాను రూ. ఎన్నుమాను, వెన్నుమ్రాను. వి. ఇంటినడి కొప్పును మోసేకఱ్ఱ. వెన్నుమ్రాఁబామునకు కబురందు అ.క్రి. చురుకుతగులు. వెన్నుమ్రాను రూ.చూ. వెన్నుమాను. వి. వెన్నుబద్ద. వెన్నురవ్వ రూ. ఎన్నురవ్వ. వి. ఇంటి నడికొప్పును మోసేకఱ్ఱ. వెన్నులోపొడుచు స.క్రి. వెన్ను పోటు పొడుచు, మోసగించు. వెన్నువాసం రూ. ఎన్నువాసం, ఎన్నోసం. వి. ఇంటినడికొప్పును మోసేకఱ్ఱ. వెన్నువిఱుగు అ.క్రి.ధైర్యం కోల్పోవు. కు.సం. 12.22. వెన్నుసమ్మెట వి. వెన్నుమీద కొట్టటానికి ఉపయోగించే సమ్మెట. భోజ. 4.20. వెన్నుసరం రూ. ఎన్నుసరం. వి. ఇంటి నడికొప్పును మోసేకఱ్ఱ. వెన్నుసఱచు(-చఱచు)

రూ. వెనుచఱచు, వెన్నుచఱచు. స.క్రి. వెంబడించి తరుము. కాశీ. 3.234. వెన్నుసాలు రూ. ఎన్నుసాలు. వి. ఇంటినడికొప్పును మోసేకఱ్ఱ. వెన్నుసూచు రూ.చూ. వెన్నుచూచు. స.క్రి. ఓడించు. హర. 3.9. వెన్నుసూపు రూ. వెనుచూపు, వెనుసూపు, వెన్నుచూపు. అ.క్రి. వెన్నిచ్చి వెనక్కిమరలు. హరి. ఉ. 2.3. వెన్నుసూల రూ. ఎన్నుసూల. వి. ఒకఇంటి వాకిలికెదురుగా మరోఇంటి వెన్నుగాడి ఉండటం అనేతప్పు. (ఒకేవరసలో రెండిళ్ళ వెన్నుగాళ్ళు ఉంటే ఈతప్పు పోతుంది). వెన్నొచ్చు (-చొచ్చు) స.క్రి. వెనుకకుచేరు, శరణొందు. సిం. ద్వా. 7. వెన్నెక్కు అ.క్రి. గర్వించు. పండి. చ. 2.95. < వెన్ను[1] + ఎక్కు. వెన్నెముక వి. వెన్నుపూస. < వెన్ను[1] + ఎముక. వెన్నెముకపోట్లు వి.బ.వ. నడుంనొప్పి. వెన్నెముకబలంలేకపోవు అ.క్రి. నైతికశక్తి లేకపోవు. వెన్నెముకలోపాములుచెఱలాడు అ.క్రి. కామోద్రేకం కలుగు. భావవివశతకలుగు. వెన్నెముకవిఱుగు అ.క్రి. స్థైర్యం సడలిపోవు. బలంపోవు. వెన్నొగ్గు అ.క్రి. వెన్నుచూపు, వీపిచ్చు. < వెన్ను[1] + ఒగ్గు.

వెన్ను[2] రూ.చూ. ఎన్ను[2]. వి. వరి మొ. వాటిఎన్ను, కణిశం. ద. హిం. శా. సంపు. 10. శా. సం. 317. క్రీ.శ. 1248.

వెన్నుదంతి వి. చోడి, జొన్న మొ. వాటిని నూర్చినప్పుడు వచ్చే బూగరపోవటం కోసం నేయటానికి సాధనమైనగొడ్డలి లాంటి నాలుగైదు పళ్ళున్న మాను.

వెన్నుకేళాకూళి చూ. వెన్నుఁడు.

వెన్నుఁడు వి. 1. విష్ణువు. బసవ. 4.84 ; 2. కృష్ణుడు. భార. ఉద్యో. 3.348.

సం. విష్ణు- విష్ణుమూర్తి ; ప్రా. విన్హూ, వేణ్హు ; జై. మహా. విణ్హూ ; శాసనప్రా. విణ్హూ. నాసిక ; వేణ్హు. కణ్హేరి ; అవంతిప్రా. విష్ణ ; మా. విశ్ణు ; అ.మా. విణ్హు. వి. పా. వెణ్హూ ; అప. బిట్ఠు, విట్ఠు- ;

క. విట్టు ; త. విట్టు, విట్టుణు, వింటు ; ఝ. విట్టు, విణ్ణు.

< ప్రా. వేణ్హు-.

వెన్నుకేళాకూళి వి. పాలసముద్రం. రామరా. 197. వెన్నుటెంకి రూ.చూ. వెన్నునిటెంకి. వి. 1. విష్ణువాసస్థానం, వైకుంఠం ; 2. సముద్రం. వెన్నునడుగు (-అడుగు[1]) వి. విష్ణుపదం, ఆకాశం. అచ్చ.రా. అయోధ్యా. 15. వెన్నునడుగుపాప వి. గంగ. వెన్నునంటు (-అంటు[1]). వి. అర్జునుడు. వెన్నునన్న (-అన్న) వి. 1. ఇంద్రుడు : 2. బలరాముడు. వెన్నునరదము (-అరదము) వి. గరుడుడు. వెన్నునికొడుకు వి. బ్రహ్మ. వెన్నునికొడుకురాణి వి. సరస్వతి. వెన్నునికోడలు వి. 1. సరస్వతి ; 2. రతిదేవి ; 3. ప్రభావతి. వెన్నునిగమికాఁడు వి. బ్రహ్మ. వెన్నునిటెంకి రూ. వెన్నుటెంకి. వి. 1. సముద్రం ; 2. వైకుంఠం. వెన్నునిమడుంగు పాన్పు వి. శేషఫణి. వెన్నునిరాణి వి. లక్ష్మి. విష్ణుపత్ని. వెన్నునివలకన్ను వి. సూర్యుడు. వెన్నునెడమకన్ను (-ఎడమకన్ను) వి. చంద్రుడు. వెన్నునెదకొమ్మ (-ఎదకొమ్మ) వి. లక్ష్మి. వెన్నుపడగ వి. గరుడుడు విష్ణుధ్వజం. వెన్నుపానుపు రూ.చూ. వెన్నుపాన్పు. వి. శేషుడు. వెన్నుపాన్పు రూ. వెన్నుపానుపు. వి. శేషఫణి. వెన్నువలచూపు వి. సూర్యుడు.

వెన్నుటెంకి చూ. వెన్నుఁడు.

వెన్నునడుగు చూ. వెన్నుఁడు.

వెన్నునడుగుపాప చూ. వెన్నుఁడు.

వెన్నునంటు చూ. వెన్నుఁడు.

వెన్నునన్న చూ. వెన్నుఁడు.

వెన్నునరదము చూ. వెన్నుఁడు.

వెన్నునికొడుకు చూ వెన్నుఁడు.

వెన్నునికొడుకురాణి చూ. వెన్నుఁడు.

వెన్నునికోడలు చూ. వెన్నుఁడు.

వెన్నునిగమికాఁడు చూ. వెన్నుఁడు.

వెన్నునిటెంకి చూ. వెన్నుఁడు.

వెన్నునిమడుంగుపాన్పు చూ. వెన్నుఁడు.

వెన్నునిరాణి చూ వెన్నుఁడు.

వెన్నునివలకన్ను చూ. వెన్నుఁడు.

వెన్నునెడమకన్ను చూ. వెన్నుఁడు.

వెన్నునెదకొమ్మ చూ. వెన్నుఁడు.

వెన్నుపడగ చూ. వెన్నుఁడు.

వెన్నుపానుపు చూ. వెన్నుఁడు.

వెన్నుపాన్పు చూ. వెన్నుఁడు.

వెన్నువలచూపు చూ. వెన్నుఁడు.

వెన్నెక్కు చూ. వెన్ను[1].

వెన్నెచీరలు చూ. పన్నె. వి. బ.వ. రంగువస్త్రాలు, నీలపీతాది వర్ణాలుగల వస్త్రాలు. ద.హిం.శా.సంపు. 4.శా.సం. 975. క్రీ.శ. 1353.

వెన్నెదురు చూ. వెన్న.

వెన్నెముక చూ. వెన్ను[1].

వెన్నెముకపోట్లు చూ. వెన్ను[1].

వెన్నెముకబలంలేకపోవు చూ. వెన్ను[1].

వెన్నెముకలోపాములు చెఱలాడు చూ. వెన్ను[1].

వెన్నెముకవిఱుగు చూ. వెన్ను[1].

వెన్నెమ్మ రూ. ఎన్నెమ్మ. వి. పురిటిలో శిశువులకు హానిచేసే పిశాచి.

వెన్నెల[1] వి. 1. తెల్లనికాంతి, చంద్రిక. నిర్వ. రా. 6.52 ; 2. వెన్నెలలాంటికాంతి. ఉ.హరి. 1.62 ; 3. ఒకరకం ఆట. ముకుంద. 3.53.

కొడ. నెలచి. చంద్రుడు, నెలచిబొళి. వెన్నెల ; త. నిలవు. నిలా. వెన్నెల, చంద్రుడు ; మ. నిల. నిలవు. వెన్నెల, చంద్రుడు ; తొ. నెసొఫ్. వెన్నెల ; కొం. లెంజు, చంద్రుడు ; కుఇ. డాంజు. చంద్రుడు, నెల, ఋతువు, ఋతుసమయం ; కువి. లెంజు, చంద్రుడు, నెల ; పర్జి. నెలిన్, చంద్రుడు, నెల ; కొలా. నెల. చంద్రుడు ; నా. నెల. చంద్రుడు : గ. నెలిజ్. చంద్రుడు, నెల.

వెన్నెలకండు వి. లేతచంద్రుడు మను. 2.43. వెన్నెలకారు వి. శరదృతువు. వెన్నెలకుప్పలు వి.బ.వ. దా.

క్రీడా విశేషం. పి.శకు. 2.183. వెన్నెలకూన వి. బాల క్రీడా విశేషం. పార్వ. 2.21. వెన్నెలగాయు (-కాయు) అ.క్రి. వ్యాపించు, ఫలించు, విరియు. కాళ. 2.10. వెన్నెలగీము వి. చంద్రుడు. ఉ.రా. 5.180. వెన్నెలసత్తి వి. చంద్రుడు. ప్రబంధ. 216. వెన్నెలనారి వి. 1. మొగలి; 2. జిరిసెనం. వ్యు. మన్మథుని ఐదవదైన 'వింటి నారి. వెన్నెలనువ్వులు వి.బ.వ. ఒకరకం నువ్వులు. వెన్నెల పదములు వి.బ.వ. జానపదగేయాల్లో ఒకరకం పాటలు. వెన్నెలపంతులు రూ.చూ. వెన్నెలపంతెలు. వి.బ.వ. వెన్నెల పంతెలు. దీపంప్రమిదలా గుంతగా ఉండేది. వెన్నెలపంతెలు రూ. ఎన్నెలపంతులు. ఎన్నెలబంతెలు, మెన్నెలపంతెలు, వెన్నెలపంతులు. వి.బ.వ. దీపంప్రమిదెలాగా గుంతగా ఉండేది. వెన్నెలపలకఁబాఱు అ.క్రి. తెల్లవడిపోవు, తెల్ల పోవు. కు.సం. 5.70. వెన్నెలపాపఁడు వి. చంద్రుడు. వీర. వి. 3.157. వెన్నెలపాఱు రూ.చూ. వెన్నెలవాఱు అ.క్రి. స్వచ్ఛమైన కాంతికలదగు. వెన్నెలపిట్ట వి. వెన్నెలపురుగు, చకోరం. వెన్నెలపులుగము వి. క్రీడావి శేషం. వరాహ. 4.155; వెన్నెలపులుఁగు రూ.చూ. వెన్నెలపుల్గు. వి. వెన్నెలకు సంతోషించే పక్షివిశేషం, చకోరం. అచ్చ.రా. అయోధ్యా. 18. వెన్నెలపుల్గు రూ. వెన్నెలపులుఁగు వి. వెన్నెలకు సంతోషించే పక్షివిశేషం, చకోరం. కృశకు. 2.194; వెన్నెలప్రోగు రూ.చూ. వెన్నెలప్రోవు. వి. ఒకానొక బాలక్రీడావిశేషం. వెన్నెల ప్రోవు రూ. వెన్నెలప్రోగు. వి. వెన్నెల్లో బాలురు కుప్ప లుగా ఇసకపోసి ఆడేఆట. నీలా. 1.85. వెన్నెలప్రోవుగాఁ జేయఁగల్గు. అ.క్రి. అసాధ్యకార్యాల్ని సాధించు. పండి. చ. 1.5.359. వెన్నెలబచ్చు వి. చంద్రుడు. వసు. 4.23. వెన్నెలబొమ్మ వి. వెన్నెలతో చేసినబొమ్మ. ధనా. 2.23పం. వెన్నెలమడుగు రూ. ఎన్నెలమడుగు, యెన్నెలమడుగు, వి. చిచ్చుబుడ్లలో ఒకరకం. వెన్నెలమిటమటకాయు అ.క్రి. వెన్నెలఎక్కువగాకాయు. ధ్వన్య. 6.268. వెన్నెలరా వి. చంద్రకాంతమణి. ముకుంద. 3.53. వెన్నెలరాచటా రూ. వెన్నెలరాచటాయి. వి. చంద్రకాంతశిల. అచ్చ. రా.బాల. 120. వెన్నెలరాచటాయి రూ.చూ. వెన్నెల రాచటా. వి. చంద్రకాంతశిల. వెన్నెలరాయఁడు వి. చంద్రుడు. అచ్చ. రా.యు. 2.33. వెన్నెలఱేఁడు వి. చంద్రుడు. భీమ. 5.58. వెన్నెలవంక వి. వెన్నెలవాక, తెల్లనికాంతిగలది, ఆకాశగంగ. నరస. 4.68. వెన్నెలవడ వి. విరహం. ఉ.హరి. 3.115. వెన్నెలవాఱు(-పాఱు[4]) రూ. వెన్నెలపాఱు. అ.క్రి. స్వచ్ఛకాంతికలదగు. రాజ.చ. 2.176. వెన్నెలవిరిదాలుపు రూ.చూ. వెన్నెలవిరిదాల్పు. వి. శివుడు. వెన్నెలవిరిదాల్పు రూ. వెన్నెలవిరిదాలుపు. వి. ఈశ్వరుడు. శివుడు. దశా. 4.15. వెన్నెలసోగ వి. స్వచ్ఛమైన కాంతిఉన్న దీర్ఘవస్తువు. ద్వి. పరమ. వి. 1.35.

వెన్నెల[2] వి. నతివిశేషం, వందనభేదం. ప్రబంధ. 1.880.

వెన్నెలకోలు వి.నమస్కారం. హంస. 4.213. వెన్నెల చిన్నిపువ్వులు రూ. వెన్నెలచిన్నిపూవులు. వి.బ.వ. నతివిశేషం.

వెన్నెలచిన్నిపూవులు రూ.చూ. వెన్నెలచిన్నిపువ్వులు. వి.బ.వ. నతివిశేషం.

వెన్నొగ్గు చూ. వెన్ను[1].

వెన్నొదు రూ. వెనుఁబడు. అ.క్రి. దుఃఖపడు. భార. ఆది. 2.9.

వెన్నాటు రూ. వెనుఁబాటు. వి. దుఃఖం. భార. విరా. 2.106.

వెన్వెన్క చూ. వెను.

వెన్వెంట చూ. వెను.

వెప్పము వి. వేడిమి.

త. వెప్పమ్. వెప్పు. వేడి; మ. వెప్పు.

<త. వెప్పమ్.

వెప్పు వి. వేడిమి. మను. 4.60.

క. బెచ్చనె. వేడి, బిసిల్ (<వెచిల్). సూర్యకాంతి, బిసి. వేడిమి; తు. బెచ్చ. వేడి, వేడిమి, బెసియుని. వేడితెచ్చు; త. వెప్పు, వెప్పమ్. వేడిమి, జ్వరం, వెచ్చెనల్. వేడి, వెచ్చు. వేడి; మ. వెప్పు. వంట.

మూ.ద్రా. *వెచ్-/ *వెయ్-.

వెప్పుకుండ రూ. (ఉప్పెకుండ). ఎప్పుకుండ, వి. దనలి కాయలను ఆవిరిమీద ఉడకబెట్టే కుండ. వెప్పుపెట్టు అ.క్రి. దనలికాయలను కుండలో పోసి ఆవిరిమీద ఉడకబెట్టు.

వెప్పువేయు రూ. ఎప్పువేయు. అ.క్రి. నీళ్ళువెచ్చబెట్టు.

వెమ్ రూ.చూ. వెన్ను[1]. వి. వెన్ను, వీపు. ద. హిం. గా. సంపు. 10. గా.సం. 28. క్రి.శ. 719-720.

వెంపమ్రాను వి. వేపచెట్టు. E.I.V. 10. క్రి.శ. 1102.

వెంపర రూ. వెంపఱ. వి. 1. బారిసమరటం. జైమినిభా. 3.101; 2. హింస; 3. భేదనం; 4. పీడనం; 5. వేరుపాటు.

వెంపరచేయు స.క్రి. హింసించు. దశకు. 2.71.

వెంపరలాడు రూ. వెంపఱలాడు, వెంపలాడు. స.క్రి. 1. హింసించు. జైమినిభా. 6.17; 2. బాధించు, పీడించు. వరాహ. 3.34; 3. భేదించు. మను. 4.17. <వెంపర+-లు+ఆడు. వెంపరలుపెట్టు రూ.చూ. వెంపరలు వెట్టు. స.క్రి. 1. భేదించు; 2. బాధించు; 3. హింసించు. వెంపరలువెట్టు(-పెట్టు) స.క్రి. 1. భేదించు. పి. శకు. 3.126; 2. బాధించు; 3. హింసించు. వెంపలాడు రూ.చూ. వెంపరలాడు. స.క్రి. తరిమివెంటాడు.

వెంపరాకు రూ.చూ. వెంపలాకు. వి. వెంపలిఆకు, రోడ్ల పక్కనా, బంజరునేలల్లోను మొలిచే చింతాకు లాంటి ఆకు లుండి రెండు మూడు అడుగుల ఎత్తు తుప్పగా పెరిగే కలుపు మొక్క.

వెంపఱ రూ.చూ. వెంపర. వి. 1. హింస; 2. భేదనం; 3. పీడనం; 4. వేర్పాటు.

వెంపఱలాడు రూ.చూ. వెంపరలాడు. స. క్రి. 1. పీడించు; 2. బాధించు; 3. భేదించు.

వెంపలాకు చూ. వెంపలి.

వెంపలి వి. బాణపుంఖి. చంపలి, ఒకజాతిచెట్టు. 2, 3 అడు

గుల ఎత్తుగా తుప్పగా పెరిగే కలుపుమొక్క. ఉ. హరి. 4.124. (Tephrosia Purpurea).

క. ఎంపలి. ఒకచెట్టు.

**వెంపలాకు** రూ. వెంపరాకు. వి. రోడ్లప్రక్కనా బంజరు నేలల్లోను మొలిచే చింతాకులాంటి ఆకులుండి రెండుమూడు అడుగుల ఎత్తు తుప్పగా పెరిగే కలుపుమొక్క.

**వెంపిలేటరు** రూ.చూ. వెంటిలేటరు. వి. వెలుతురుకోసం గోడల్లో ఎత్తున పెట్టే చిన్న కిటికీ.

**వెంపు** రూ.చూ. వైపు. వి. పక్క, వంక, వెంట.

**వెంబ** విశ. 1. విశాలం; 2. విరివి.

**వెంబట్టు** వి. తెల్లనిపట్టు. కు. సం. 10.21.

త. వెళ్, తెల్లని, స్వచ్ఛమైన, వెణ్‌పట్టు, తెల్లని.

<త. వెణ్‌పట్టు.

**వెంబడి** రూ. బెంబడి. వి. 1. ప్రకారం, రీతి, పద్ధతి ప్రకారం. మను. 4.60, నె.శా. ఒంగోలు. క్రీ.శ. 1559; 2. వరస, క్రమం. ఆము. 4.86; అవ్య. అనుసారంగా, వెంట. ఆము. 1.62.

క. బెన్ననె. వెనుక, వెంబడి, తరవాత; కొ. బెంబర. వెనకస్థలం; తు. బెరంగడె. తరవాత, వెనుక; కొం. వెంక. తర్వాత, వెనుక; నా. వెంక. వెనుక, వెట్ట. పాటుగా, దాంతోనే.

**వెంబడించు** రూ. వెంబళించు. స.క్రి. 1. అనుగమించు, వెనుకొను. ఉ.రా. 2.828; 2. పీడించు. **వెంబడించువాఁడు** విశ. తోడైనవాడు, సైదోడు.

**వెంబడు** అ.క్రి. 1. కామించు, వలచు. శివరా. 3.62; 2. వెంబడించు. కువ.చ. 2.58.

**వెంబర** విశ. 1. అవివేకి, మూఢుడు. ప్రబు. 3ఆ. 92పు. 10పం; 2. దుష్టుడు, దుష్టం. పాండు. 2.71; 3. దుష్టురాలు. రసిక. 5.111.

**వెంబరవిత్తు** రూ. వెంబలివిత్తు. విశ. మూఢాగ్రేసరుడు. నమిర. 3.237.

**వెంబలివిత్తు** రూ.చూ. వెంబరవిత్తు. వి. మూఢాగ్రేసరుడు.

**వెంబళించు** రూ.చూ. వెంబడించు. స.క్రి. 1. అనుగమించు, వెనుకొను; 2. పీడించు.

**వెమ్మ** అ.క్రి. తప్తమగు. కు. సం. 5.155.

క. బెమ్. వేడి; త. వెమ్ము. బాగా వేడిగాఉన్న, మండుతున్న; మ. వెమ్మక. బాగావేడిగాఉన్న, మండుతున్న, వెమ్మ. వేడి.

మూ.ద.ద్రా. *వెమ్.ప్./*వెమ్మ్-. *వెప్.

**వెయము** వి. ఖర్చు, వెచ్చం.

సం. వ్యయ-. ఖర్చు, నష్టం; ప్రా. వఇఅ, వయ-; అ.మా. విఅం; పా. వయ-, వయయ: ఒ. బయా; క. బివ్యా, బియ. వ్యయం; మ. వేయం. ఖర్చు, వెయి.

<ప్రా. వయ-.

**వెయి** రూ. వెయు, వెయ్యి, వేయి, వేయు². సర్వ. సహస్రం, పదినూర్లు, అనేకం, వెయ్యి. రం. రా. యు. 331పు. 4పం; నె.శా. సంపు. 3. క్రీ.శ. 7వ శతాబ్ది.

సం. సహస్ర-. వెయ్యి; ప్రా. సహస్స-, సాహస్స. పదివందలు; అశో. ప్రా. సహస-; ధౌలీ. జైమహా. జై. శౌ. సహస్స; శౌ. సహస్స-; మా. శహశ్శ-; పా. సహస్స-; అ.మా. సహస్స-, సాహస్స-; అవ. సహస-;

క. సాయిర, సావర, సావిర, సాసిర్, సారిక; కొ. అయిర; తు. సాయిర; త. మ. ఆయిరమ్.

**వెయికాళ్లజెఱ్ఱి** రూ.చూ. వెయ్యి కాళ్లజెట్టి. వి. 1. ఊరకేతిరిగేవ్యక్తి; 2. ఒకరకం పెద్దజెఱ్ఱి. **వెయిగండ్లకడవ** రూ. వెయ్‌గండ్లకడవ. యేగండ్లకడవ. వి. చిన్న చిన్న చిల్లులు పెట్టినట్టి కాల్చని మట్టిపాత్ర. **వెయిగండ్లదుత్త** రూ. యెయిగండ్లదుత్త, వెయ్‌గాన్లదుత్త. వి. చిన్నచిన్న చిల్లులు పెట్టినట్టి కాల్చని మట్టిపాత్ర. **వెయినోళ్లఁబొగడు** రూ. వెయ్యినోళ్లఁబొగడు, వేనోళ్లఁబొగడు. స.క్రి. నోరారా పొగడు. విక్ర. 5.124. <వెయి+నోరు+-లు+-అ⁷+పొగడు. **వెయిపాళ్లపాట** వి. వెయ్యోవంతు, సహస్రాంశం. పండి. చ. 1.1.61. **వెయిపోంకమ్రాంకులపట్టు** వి. వేయిపోకచెట్టులుగల భూమి. ద.హిం.శా. సంపు. 4. శా. సం. 1115. <వెయి+పోంకమ్రాంకు+లు+-అ¹¹+పట్టు¹. **వెయ్‌గండ్లసట్టి** వి. చిన్నచిన్న చిల్లులు పెట్టిన కాల్చని మట్టిపాత్ర. **వెయ్‌గాన్లదుత్త** రూ.చూ. వెయిగండ్ల దుత్త. వి. వెయ్యికళ్ళ కుండ, చిన్నచిన్న చిల్లులు పెట్టిన కాల్చని మట్టిపాత్ర, గ్రామదేవతకు మొక్కుబడి ఉన్న వాళ్ళు నైవేద్యం పెట్టటానికి ఉపయోగిస్తారు.

**వెయు** రూ.చూ. వెయి. సర్వ. వెయ్యి, పదివందలు. నె. శా. సంపు. 3. క్రీ.శ. 7వ శతాబ్ది.

**వెయ్‌గండ్లసట్టి** చూ. వెయి.

**వెయ్‌గాన్లదుత్త** చూ. వెయి.

**వెయ్యగండ్లకోక** రూ. ఎయ్యిగండ్లకోక. వి. ఒకరకం గళ్ళచీర, ఊళ్ళో జాతరలకు కట్టుకునే చీర.

<వెయ్యి+కండ్లు+-అ¹¹+కోక.

**వెయ్యార్లు** చూ. వెయ్యి.

**వెయ్యాలులు** చూ. వెయ్యి.

**వెయ్యి** రూ.చూ. వెయి. సర్వ. వేయి. ఇందు. 1.73.

**వెయ్యార్లు** రూ. వెయ్యాలులు. సర్వ. బ.వ. 1. ఎక్కువ ధనం. శుక. 3.274. 2. అసంఖ్యాకం. శుక. 3.277. <వెయ్యి+ఆలు+-లు. **వెయ్యాలులు** రూ.చూ. వెయ్యార్లు. సర్వ వి.బ.వ. అసంఖ్యాకాలు. విజయ. 1.103. **వెయ్యికండ్లకుండ** వెయ్యికండకుండ రూ.చూ. వెయ్యికండ్ల కుండ. వి. చిన్నచిన్న చిల్లులు పెట్టినకాల్చనిమట్టిపాత్ర. రూ. వెయ్యికండ్లకుండ, వేగండ్లకుండ, వేయికండ్లకుండ. వి. చిన్నచిన్న చిల్లులుపెట్టిన కాల్చనిమట్టిపాత్ర. **వెయ్యికాళ్లజెట్టి** రూ. వెయికాళ్లజెఱ్ఱి. వి. 1. ఊరకే తిరిగేవ్యక్తి; 2. ఒకరకం పెద్దజెఱ్ఱి. <వెయ్యి+కాలు²+-లు+-అ¹¹+జెట్టి. **వెయ్యిగండ్లచీర** రూ. వెయ్యిగన్నులచీర. వి. ఒకరకం గళ్ళచీర, ఊళ్ళోజాతరలకు కట్టుకునే చీర. <వెయ్యి+కన్ను+-లు+అ¹¹+చీర. **వెయ్యిగన్నులచీర** రూ.చూ. వెయ్యిగండ్లచీర. వి. ఒకరకం గళ్ళచీర, ఊళ్ళోజాతరలకు

కట్టుకొనేచీర. వెయ్యిండ్లపూజారి వి. ఇల్లిల్లూ తిరిగేవాడు. <వెయ్యి+ఇల్లు+-లు+అ[11]+పూజారి. వెయ్యిదంతాల చేవ వి. బొరమీను సం. *దంత* -. వన్ను. <వెయ్యి+ సం. దంత-+-ము+-లు+-అ[11]+చేవ. వెయ్యినోళ్లఁ బొగడు రూ.చూ. వెయినోళ్లఁబొగడు. స.క్రి. నోరార పొగడు. వెయ్యివరహాలు వి.బ.వ. తెల్లని పెద్దపూలు పూసే ఒకరకం చెట్టు (Plumeria alba). వెయ్యేళ్లవర్ధిల్లు వి. ఆశీర్వచనం. శుక. 2.227 ; అ.క్రి. నూరేళ్ళుజీవించు. సం. *వర్ధ్*. వృద్ధిపొందు. పెరుగు. <వెయ్యి+ఏఁడు+-లు+ సం. వృధ్.

**వెయ్యేళ్లవర్ధిల్లు** చూ. వెయ్యి.

**వెర** రూ.చూ. వెఱగు. వి. 1. భయం. చెన్నబసవ. 2.20. చంద్రికా. 2 26 ; 2. ఆశ్చర్యం. శుక.చ. 5.37 ; 3. వింత.

**వెరంగిజొన్న** వి. ఒకరకం జొన్న.

**వెరఁగు** రూ.చూ. వెఱఁగు. వి. 1. నిశ్చేష్టత. రాఘవ. 4.186 ; 2. ఆశ్చర్యం. ప్రభా. 4.47 ; 3. వింత.

వెరఁగుపడు రూ.చూ. వెఱఁగుపడు. అ.క్రి. నిశ్చేష్టత నొందు. ప్రభా. 5.180. వెరఁగుపఱచు రూ.చూ. వెఱఁగుపఱచు. స.క్రి. ఆశ్చర్యం పొందేటట్టు చేయు. వెరఁగుపాటు రూ.చూ. వెఱఁగుపాటు. వి. నిశ్చేష్టత. వెరఁగువడు రూ.చూ. వెఱఁగువడు. అ.క్రి. నిశ్చేష్టతపొందు. వెరఁగు వఱచు రూ.చూ. వెఱఁగువఱచు. స.క్రి. ఆశ్చర్యం పొందే టట్లు చేయు. వెరఁగొందు రూ.చూ. వెఱఁగొందు. అ.క్రి. ఆశ్చర్యపడు.

**వెరఁగొందు** చూ. వెరఁగు.

**వెరఁజాడు** చూ. వెరఁజు.

**వెరంజివెంపఱలాడు** చూ. వెరఁజు.

**వెరఁజివెంపఱలువెట్టు** చూ. వెరఁజు.

**వెరఁజు** రూ. వెఱఁజు. స.క్రి. 1. కొల్లగొట్టు. జైమినిభా. 3.53 ; 2. కొట్టు. పి.శకు. 2.12 ; 3. పోగుచేసిఎత్తు. మను. 3.84 ; 4. గట్టిగా పట్టుకొను. మను. 4.52 ; 5. కనిపెట్టు, కాచిఉండు. ప్రబంధ. 183 ; 6. జారుకొను.
క. *బెరంజు*. పోగుచేయు, కుప్పగాచేయు, ఒకచోట చేర్చు.

వెరఁజాడు స.క్రి. 1. పోగుచేసిఎత్తు. దాన్క.రా.యు. 2.65 ; 2. కొల్లగొట్టు. విష్ణుపు. 3.128 ; 3. జారుకొను. <వెరఁజు+ఆడు. వెరంజివెంపఱలాడు స.క్రి. తరిమి కొట్టు. కృం.రా. 2.22. <వెరఁజు+ఇ[13]+వెంపఱ+-లు +ఆడు. వెరఁజివెంపఱలువెట్టు(-పెట్టు) స.క్రి. మట్టిమల్లాడు. <వెరఁజు+-ఇ[13]+వెంపఱ+-లు+పెట్టు.

**వెరబుది** వి. గంజాంజిల్లాలోను గోదావరి పరీవాహక ప్రాంతాల్లోను పెరిగే ఒకరకం చెట్టు (Ficus cumia).

**వెరళించు** స.క్రి. వెలగించు, విజృంభింపచేయు. శుక.చ. 5.38.

**వెరవరి** చూ. వెరవు.

**వెరవిఁడి** చూ. వెరవు.

**వెరవు** రూ. వెరువు. వి. 1. ఉపాయం. నిర్వ.రా. 1.55 ; 2. నేర్పు. చాతుర్యం. భార. విరా. 1.67 ; 3. ధర్మం. భార. శాంతి. 5.624 ; 4. అనుకూల్యం. హర. 5.40 ; 5. ద్వారం. కాశీ. 4.120 ; విశ. 1. అధీనం. నిర్వ.రా. 3.5 ; 2. యుక్తం. హరి.ఉ. 4.117 , 3. శక్తం, సమర్థం. రం.రా.ఉ. 103పు. 10పం.
త. *విరకు, విరవు*. తెలివి, నేర్పు. చాతుర్యం. ఉపాయం, యుక్తసాధనం.

వెరవరి విశ. 1. ఉపాయశాలి. భార. విరా. 4.8 ; 2. జీవనోపాయజ్ఞుడు. రాజవా. 1.35. <వెరవు[1]+-అరి. వెరవిఁడి విశ. 1. తెలివిలేనివాడు. మూఢుడు. భార. శల్య. 2.76 ; 2. ఉపాయహీనుడు. వేంక. పంచ. 4,544. <వెరవు[1]+-ఇఁడి. వెరవుచేయు స.క్రి. ఏర్పాటు చేయు. హర. 5.41. వెరవుపడు రూ. వెరవువడు. అ.క్రి. 1. పీలగు. హర. 5.57 ; 2. అనుకూలమగు. కళా. 6.154 ; 3. అధీనమగు. వెరవువడు రూ.చూ. వెరవు పడు. అ.క్రి. 1. పీలగు ; 2. అనుకూలమగు ; 3. అధీనమగు.

**వెరవేఁకి** రూ.చూ. వెఱవేఁకి. వి. 1. విరహతాపం ; 2. భయజ్వరం.

**వెరసి** రూ.చూ. వెరసు. వి. అంకెల్ని కలపగా తేలిన మొత్తం లెక్క. బసవ. 6.783పు ; విశ. కడపటిది. కళా. 5.78.

వెరసిమాట రూ.చూ. వెరసుమాట. వి. పర్యవసానం, చివరకు తేలిన సంగతి. కళా. 5.78.

**వెరసు** రూ. వెరసి, పెరుసు, వెర్సి, వెఱ[1]. వి. అంకెలు మొ. వాటిపంక్తి. పండి.చ. 5.313.

వెరసుబడి వి. అంకెలపంక్తి, అంకమాలిక. దాన్క. రా.యు. 364. వెరసుమాట రూ. వెరసిమాట. వి. 1. పర్యవసానం, చివరికి తేలిన సంగతి. ప్రబోధ. 147 ; 2. పిండితార్థం.

**వెరి** రూ.చూ. వెఱ్ఱి. వి. తిక్కరోగం.

వెరికుసుమ వి. బలురచ్చిక, ములివచ్చుచెట్టు, బీటి నేలల్లోను రోడ్లపక్కనా ఏటాలేచి పచ్చని పూలు పూసే కలుపుమొక్క (Argemone mexicana). వెరివెరన వి. ఒకరకం కలుపుమొక్క. వెరిబారి వి. ఒకసారి మోటలాగిన తర్వాత ఎద్దులు మోటబావివైపు ఎక్కి వెళ్ళే దారి. వెరిమరక వి. వెఱ్రిలో ఒకరకం, గొడ్డు నేలమీదపడి నాలిక పీక్కునేరోగం. వెరివద్ద వి. సజ్జలాగా ఉండే కలుపుమొక్క.

**వెరువు** రూ.చూ. వెరవు. వి. 1. ఉపాయం ; 2. నేర్పు. చాతుర్యం ; 3. ద్వారం ; 4. అనుకూల్యం ; 5. రీతి. విధం ; 6. ధర్మం ; 7. బ్రతుకుతెరవు ; విశ. 1. శక్తం, సమర్థం ; 2. అధీనం ; 3. యుక్తం.

**వెరుసు** రూ.చూ. వెరసు. వి. అంకెలు మొ. వాటి పంక్తి.

**వెర్తుఁడు** వి. పిరికివాడు. శాల్ల.సం. 5.19.
సం. *వ్యర్థ*-. పనికిమాలినది.
<సం. వ్యర్థ-.

**వెఱ్రి** రూ.చూ. వెఱ్ఱి. వి. ఉన్మాదం, పిచ్చి.

వెఱ్రికరక వి. కలపనిచ్చే ఒకరకం చెట్టు. (Bridelia

spreng). వ్రేరిబాద వి. ఉత్తరసర్కారు, మైనూరు ప్రాంతాల్లో పెరిగే ఒకరకం చెట్టు (Dioscorea Wallchii). వ్రేరిచెఱకు వి. రెల్లుగడ్డి. (Saccharam spontaneum.) వ్రేరితల వి. నజ్జ, జొన్నమొ. పైర్ల తెగులు. గింజలులేని కంకివేసే తెగులు (goeenear disease). వ్రేరితలఎత్తు అ.క్రి. నజ్జ, జొన్నమొ. పైర్లకు గింజలులేని కంకివేసే తెగులుపట్టు. వ్రేరితలవేయు అ.క్రి. నజ్జ, జొన్నమొ. పైర్లకు గింజలులేని కంకి వేసే తెగులుపట్టు వ్రేరిదొర్ద వి. ఒకరకం కలుపుమొక్క. వ్రేరినువ్వు రూ. వ్రేరినూవు. వి. అడవినువ్వు. (Gaizofia abyssinica.) వ్రేరినూవు రూ. వ్రేరినువ్వు. వి. అడవినువ్వు. ఏటాలేచిపెరిగేనూనె విత్తులమొక్క, అబిసీనియాదేశపుమొక్క. (Gaozfia abyssinica). వ్రేరివప్పు వి. పనికిమాలినవాడు వ్రేరిపీరు వి. 1. ఎటుతిరుగుతాడో తెలియనివాడు; 2. అమాయకుడు. వ్రేరిపుచ్చ వి. బంజరునేలల్లో సాగుచేయకుండా పెరిగేమొక్క, గుజ్జుచేదుగా ఉండి వైద్యంలో ఉపయోగించేమొక్క. (Cifrullius coioyn this). వ్రేరిబిల్లుడు వి. లేత ఎరుపురంగు. పెద్దపూలు పూసే అందమైనచెట్టు. (Mundulea Scuberosa). వ్రేరిబొద్దిటీగె వి. గోదావరి ప్రాంతాల్లో పెరిగే, లేతఎరుపురంగు పూలుపూసే ఒకరకం పెద్దతీగెక (Lettsonia setosa) వ్రేరిమిరప వి. పిచ్చిమిరప, మెట్టనేలల్లో ఎక్కువగా పెరిగే కలుపుమొక్క. (Croton Sparsiflorus). వ్రేరివాము వి. ఒకరకం కలావుమొక్క. వ్రేరూదర వి. ఊదర్లలాగా పెరిగే ఒకరకం కలుపుమొక్క. < వ్రేరి + ఊదర. వ్రేరొరి వి. అడవి వరిమొక్క. < వ్రేరి + వరి.

వ్రేరూదర చూ. వ్రేరి.

వ్రేరొరి చూ. వ్రేరి.

వెర్పి రూ.చూ. వెరను. వి. వెరసి. మొత్తం. వె.శా.దర్పి. 46 క్రీ.శ. 1415.

వెఱ వి. 1. భయం. నిర్వ.రా. 1.88; 2. ఆశ్చర్యం. హరి.ఉ. 5.67; 3. నిశ్చేష్టత. మల్ల. నీతి. 72.

త. వెరు. భయం, ఆశ్చర్యం.

వెఱగాయలాటలు (-కాయలాటలు) వి.బ.వ. బాలక్రీడా విశేషం. బ్రహ్మో. 3.27. వెఱచఱచు అ.క్రి. భయపడు. భార. సభా. 2.305. వెఱపాటు వి. భయం. రం.రా.ఉ. 122వ. 3పం. వెఱబొమ్మ వి. 1. పశువులు మొ. వాటికి భయం కలగటానికి భీకరాకారంగా కట్టే బొమ్మ. విక్ర. 2.179. గౌ.హరి.ఉ. 982పం; 2. దిష్టిబొమ్మ. కాశ. 3.7. వెఱవెఱపాటు వి. నిశ్చేష్టత. రం రా. అయోధ్యా. 96వ. 17పం. వెఱవేఁకి రూ. వెరవేఁకి. వి. 1. విరహానం తాపం. హరి.ఉ. 7.170; 2. భయజ్వరం. సిం.ద్వా. 4.70, గౌ.హరి.ఉ. 1194పం. సం. విరహ-.ఎడబాటు. < సం. విరహ- + వేఁకి. వెఱసొచ్చు(-చొచ్చు) అ.క్రి. భయపడు. భార. కర్ణ. 3.33.

వెఱక వి. వెంట్రుక.

వెఱఁగందు చూ. వెఱఁగు.

వెఱఁగు రూ. వెర. వెరఁగు. వి. 1. ఆశ్చర్యం. వింత. భార. ఆది. 6.295; 2. అద్భుతకృత్యం, వింతపని. ద్వి. పరమ. వి. 5.407వ.

క. బెఱు. ఆశ్చర్యపడు, బెఱగు. ఆశ్చర్యపడు, కంగారుపడు, విత్తిప్పు. కంగారు, కలవరం, విఱుమె. (ప్-,త్-). గాబరాపడు, విఱుమె. కంగారు, గాబరా; తు. బెరగు. ఆశ్చర్యం, అద్భుతం; త. విత్తె. (-ప్పు-,-త్-). ఆశ్చర్యపడు, కంగారుపడు, విత్తిప్పు. కంగారు, కలవరం, విఱుమి, (ప్పు-త్--) గాబరాపడు, విఱుమై. కంగారు, గాబరా; కో. వెర్క. మతిచెడు; కుయి. బెరగు. ఆశ్చర్యం, అద్భుతం, వింత; పో. చూ. క. బెక్కస.

వెఱఁగందు అ.క్రి. ఆశ్చర్యపడు. నిర్వ. రా. 2.98. < వెఱఁగు + అందు. వెఱఁగువడు రూ. వెరఁగుపడు, వెరఁగుపడు, వెఱఁగుపడు. అ.క్రి. 1. ఆశ్చర్యపడు. భార. ఆది. 4.195; 2. నిశ్చేష్టతపొందు. వెఱఁగువఱుచు రూ. వెరఁగుపఱుచు, వెరఁగువఱుచు, వెఱఁగువఱుచు. అ.క్రి. ఆశ్చర్యం పొందేటట్లుచేయు. మను. 4.115. వెఱఁగుపాటు రూ. వెరఁగుపాటు. వి. 1. నిశ్చేష్టత. భార. విరా. 2.106; 2. అబ్బురపాటు, ఆశ్చర్యం. భార. విరా. 5.126. వెఱఁగువడు రూ.చూ. వెఱఁగుపడు. అ.క్రి. 1. ఆశ్చర్యపడు; 2. నిశ్చేష్టతపొందు. వెఱఁగువఱుచు రూ.చూ. వెఱఁగుపఱుచు. స.క్రి. ఆశ్చర్యం పొందేటట్లుచేయు. వెఱఁగువారు విఐ. క్రయవిక్రయాలు గావించేవారు, వర్తకులు. ద.హిం.గా. సంపు. 10. శా.సం. 556. క్రీ.శ. 1334. వెఱఁగొందు రూ. వెరఁగొందు. అ.క్రి. ఆశ్చర్యపడు. విక్ర. 1.87. < వెఱఁగు + ఒందు.

వెఱఁగొందు చూ. వెఱఁగు.

వెఱచు అ.క్రి. 1. భయపడు. భార. ఆది. 1.130; 2. నమ్రతగాఉండు. భార. శాంతి. 2 261; 3. జంకు, సంకోచించు. జైమినిభా. 1.73.

క. బెర్చు. భయపడు, బెచ్చిసు, బెర్చిసు. వెరచు; కొడ. బొరడె. భయంవల్ల కంగారుపడు, బొరట్. (బొరటి-). (పశువులను) భయపెట్టి (అన్నివైపులకి) పారదోలు; త. వెరువు. (వెరువి-). భయపడు, ఆశ్చర్యపడు, వెరుత్తు. భయపడు, కంగారుపడు, పారిపోవు, వెఱి. (-ప్పు-,-న్-.) వెరచు; మ. వెరుళుక. కంగారుపడు, భయపడు, విరళుక. వణుకు; కో. వెర్డ్. తీవ్రంగా భయపడు; తొ. పెళ్. (గేదెలుమొ. వి.) భయపడి పారిపోవు, (గేదెలు మొ. వాటిని) భయపెట్టిపారదోలు; గోం. వరితానా. భయపడు, వర్హుత్తానా, వరిస్తానా. భయపడు; కుఇ. బెస్న, బెహ్పా. భయపడు.

వెఱచుకొను అ.క్రి. భయపడు. కృష్ణరా. 3.48. వెఱపరి వి. భయంకలవాడు, భయంకలది. ఆం.భా. 3.9. < వెఱపు + -అరి. వెఱపించు అ.క్రి. భయపెట్టు. భార.ఆది. 2.130. < వెఱచు + -ఇంచు$^{3}$. వెఱపిఁడి వి. నిర్భయపడు, భయం లేనివాడు, భయంలేనిది. విక్ర. 4.98. < వెఱపు + -ఇఁడి. వెఱపు వి. భయం. భార. శాంతి. 4.72. వెఱపెక్కు అ.క్రి. భయపడు. భార. కర్ణ. 2.38.

**వెఱఁజు** రూ.చూ. వెరఁజు. స.క్రి. 1. కొల్లగొట్టు. తాళ్ల.సం. 5.57 ; 2. కొట్టు ; 3. పోగుచేసిఎత్తు; 4. గట్టిగాపట్టుకొను ; 5. కనిపెట్టు, కాచిఉండు ; 6. జారుకొను.

**వెఱపరి** చూ. వెఱచు.

**వెఱపించు** చూ. వెఱచు.

**వెఱపిఁడి** చూ. వెఱచు.

**వెఱపు** చూ. వెఱచు.

**వెఱపెట్కు** చూ. వెఱచు.

**వెఱి** రూ.చూ. వెఱ్ఱి. వి. 1. పిచ్చి, ఉన్మాదం. తాళ్ల.సం. 11.94 ; 2. అవివేకం.

**వెఱ్ఱి** రూ. వెరి, వెర్రి. వెఱి. విణ. 1. వివేకం లేనివాడు, వివేకంలేనిది. భార. నలా. 2.39. 2. పిచ్చివాడు, ఉన్మత్తుడు, పిచ్చిది. భార. అను. 5.105 ; 3.వికృతం. ఆము. 4.181 ; వి. 1. పిచ్చి. ఉన్మాదం. భార.శాంతి. 1.101 ; 2. అవివేకం. రామాభ్యు. 6.152.

క. వెఱి. పిచ్చి, ఉన్మాదం, మత్తు, కంగారు, భయం, రౌద్రం ; త. వెఱి (-ప్పి-,-త్తి-). మత్తిలు, పిచ్చెక్కు ; మ. వెఱి. మత్తు, క్రోధావేశం, రౌద్రం, వెఱియన్. రౌద్రమైన, మత్తైన.

**వెఱ్ఱికుక్క** వి. పిచ్చికుక్క. **వెఱ్ఱికుట్టె** వి. ఏమీ తెలియని వ్యక్తి. త. కుట్టి. బాలిక, బాలుడు. **వెఱ్ఱికుందెన** వృ. విశేషం. హంస. 4.10. **వెఱ్ఱిగొను** (**కొను**) అ.క్రి. అవవేకం పొందు. హరి.పూ. 8.181. **వెఱ్ఱిగొలుపు** (-కొలుపు) స.క్రి. అవివేకం పొందించు, మోహపెట్టు. భార. శాంతి. 6.51. **వెఱ్ఱిచిక్కి** వి. వృక్షవిశేషం, ఒకజాతిఅడవిచెట్టు, హంస. 4.11. **వెఱ్ఱిచిత్రమూలము** వి. పసుపువచ్చనిపూలు పూసే ఒకరకంచెట్టు. (Tiliacora recemasa). **వెఱ్ఱిచెఱకు** వి. చెరకులాంటి ఒకానొకగడ్డి. **వెఱ్ఱిజనులు** వి.బ.వ. మూఢులు. శివ. 2.96. **వెఱ్ఱిజిల్లేఁడు** వి. రాజార్కం, ఒకజాతి జిల్లేడు. **వెఱ్ఱితనము** వి. అవివేకం, తెలివితక్కువ. భార. ఉద్యో. 1.376. **వెఱ్ఱిదవ్వించు**(-త్రవ్వించు) స.క్రి. మోహం కలిగించు. తాళ్ల. సం. 8.175. **వెఱ్ఱినవ్వు**. వి. వెకిలినవ్వు. ఎక్కువనవ్వు. పాండు. 3.62. **వెఱ్ఱినారువ** వి. అరణ్యవృక్షవిశేషం, ఒకజాతి అడవిచెట్టు. హంస. 4.11. **వెఱ్ఱినిమ్మ** వి. అడవినిమ్మ. హంస. 4.9. **వెఱ్ఱినీరు** వి. వెర్రెత్తించేనీరు. మద్యం. కల్లు. అచ్చ.రా. యు. 231. **వెఱ్ఱినీళ్లమేలువాఁడు** వి బలరాముడు. **వెఱ్ఱినీళ్లు** వి.బ.వ. కల్లు. మద్యం. **వెఱ్ఱిపట్టు** వి. పిచ్చిపట్టు. హేమా. 13 ; అ.క్రి. పిచ్చెత్తు, మతిభ్రమించు. **వెఱ్ఱిపదుచు** వి. పిచ్చిపిల్ల. (లాలనగాఅనే మాట). కళా. 4.101. **వెఱిపాల** వి. అడవిపాల. **వెఱ్ఱిపుచ్చ** వి. చేదుపుచ్చ. **వెఱ్ఱిబచ్చలి** వి. ఒకరకంబచ్చలి. **వెఱ్ఱిబాగులది** విణ. తెలివిలేనిది. **వెఱ్ఱిబాగులవాఁడు** విణ. తెలివిలేనివాడు. **వెఱ్ఱిబాగులు** వి.బ.వ. 1. తెలివిలేనిస్త్రీ ; 2. తెలివిలేనివాడు. **వెఱ్ఱిబిల్ల** వి. అరణ్య వృక్షవిశేషం, ఒకజాతి అడవిచెట్టు. హంస. 4.11. **వెఱ్ఱిబీఱ** వి. చేదుబీర. **వెఱ్ఱిమాలోకము** వి. 1. అమాయకుడు ; 2. అమాయకురాలు **వెఱ్ఱిమేడి** వి. ఒకరకం మొక్క (Ficus Hispide). **వెఱ్ఱిమొగము** వి. 1. తెలివిలేనివాడు ; 2. తెలివిలేనిది. **వెఱ్ఱిమొల్ల** వి. అడవిమల్లె. **వెరియావలు**(-**ఆవలు**) వి.బ.వ. తెల్లావాలు. **వెఱ్ఱివాఁడు** విణ. 1. వివేకం లేనివాడు, అమాయకుడు. కాశీ. 4.93 2. పిచ్చివాడు, ఉన్మత్తుడు. **వెఱ్ఱివానిచేతిరాయి** వి. గురిలేనివిషయం, వెర్రివాడు తన చేతిలోనిరాయి విసిరినప్పుడు తగిలితే తగులుతుంది. లేకపోతే లేదు అనేదాన్నిబట్టి కలిగిన పలుకుబడి. **వెఱ్ఱివెంగళప్ప** వి. వెర్రిబాగులవాడు. **వెఱ్ఱివేషాలువేయు** అ.క్రి. అడ్డదిడ్డంగా ప్రవర్తించు. **వెఱ్ఱిసెనగ** వి. ఒకజాతి చిన్నచెట్టు, చిన్నమొక్క. హంస. 4.10. **వెఱ్ఱిసొఱ** వి. చేతిసొర, రుచిభేదం. వేంక. పంచ. 1.467. **వెఱ్ఱెత్తు** అ.క్రి. పిచ్చెత్తు. < వెఱ్ఱి+ఎత్తు[1].

**వెఱ్ఱెత్తు** చూ. వెఱ్ఱి.

**వెల** వి 1. కొనేవస్తువుకిచ్చే విలువ, మూల్యం, క్రయధనం. భార. అరణ్య. 5.33 ; 2. పందెం. ఉ. హరి. 3.112.

క. బిల్, బిలి. అమ్ము ; కొడ. బెలె. వెల ; తు. బిలె, బెలె. వెల ; త. విల్ (విఱ్ప-, విఱ్ఱ-) అమ్ము, అమ్మకానికిపెట్టు, విలై. అమ్మకం, ఖరీదు, వెల ; మ. విల; అమ్మకం, వెల, విలువ, విల్పన. అమ్మకం విల్పిక్క. అమ్మించు, అమ్మేటట్లుచేయు ; కో. వెల్. వెల, ఖరీదు ; తొ. పిల్. వెల, ఖరీదు.

**వెలకఱపుసేయు** (-చేయు) అ.క్రి. అమూల్యమగు. సారంగ. 2.198. **వెలకిప్పించు** స.క్రి. అమ్మించు. హంస. 5.359. < వెల+-కున్+ఇప్పించు. **వెలకుఁజూపు** స.క్రి. అమ్మచూపు, విక్రయింపనెంచు. కవిరాజ. 1.81. < వెల+-కున్+చూపు. **వెలకుఁదీయు** స.క్రి. కొను. హంస. 5.352. < వెల+కున్+తీయు. **వెలకుమార్చు** స.క్రి. అమ్ము. హంస. 3.233. **వెలకెక్కించు** స.క్రి. ప్రసిద్ధినొందించు. సుదంతా. 5.76. < వెల+-కున్+ఎక్కించు. **వెలకెక్కు** అ.క్రి. ప్రసిద్ధిచెందు. < వెల+-కున్+ఎక్కు. **వెలఁగొను** స.క్రి. వెలఇచ్చి కొను, విలిచికొను. వసు. 4.111. < వెల +-ను+కొను. **వెలచాన** వి. రోవెలది, వేశ్య. శుక. 3.10. **వెలచెలువ** వి. రోవెలది, వేశ్య. ఉ.రా. 5.248. **వెలతలిరుఁబోణి** రూ.చూ. వెలతలిరుఁబోఁడి. వి. రోవెలది, వేశ్య. **వెలతలిరుఁబోఁడి** చూ. వెలతలిరుఁబోణి. వి. వేశ్య. రోవెలది. రాజవా. 1.77. **వెలనెలఁత** రూ. వెలనెలతుఁక వి. రోవెది, వేశ్య. **వెలనెలఁతుక** రూ.చూ. వెలనెలఁత. వి. రోవెలది, వేశ్య. **వెలనేస్తకాఁడు** రూ. వెలనేస్తగాఁడు. వి. విటుడు, బొజుగు. ప్రబంధ. 726. **వెలనేస్తగాఁడు** రూ.చూ. వెలనేస్తకాఁడు. వి. విటుడు. **వెలపడంతి** రూ. వెలపడఁతుక. వి. భోగంచాన. క్రీడా. 1.186. **వెలపడఁతుక** రూ.చూ. వెలపడంతి. వి. రోవెలది. వేశ్య. **వెలపరచు** రూ. వెలపరుచు, వెలపఱచు, వెలపఱుచు. స.క్రి. వెలకట్టు. తాళ్ల. సం. 14.296. **వెలపరుచు** రూ.చూ. వెలపరచు. స.క్రి. వెలకట్టు. **వెలపఱచు** రూ.చూ. వెలపరచు. స.క్రి. వెలకట్టు. **వెలపఱుచు** రూ.చూ.

వెలపరచు స.క్రి. వెలకట్టు. వెలపెట్టు రూ.చూ. వెలపెట్టు. అ.క్రి. వెలకుపెట్టు. శాళ్ల. సం. 14.212. వెలపాలఁతి రూ. వెలపొలఁతుక. వి. రోవెలది. వేశ్య. వైజ. 2.78. వెలపొలఁతుక రూ.చూ. వెలపొలఁతి. వి. రోవెలది. వేశ్య. వెలపోయు రూ. వెలవోయు. స.క్రి. వెలగాఇచ్చు. జైమినిభా. 5.58. వెలపోవు రూ. వెలవోవు. అ.క్రి. అమ్ముడుపోవు. వెలమఁతి రూ. వెలమఁతుక. వి. రోవెలది. వేశ్య. వెలమఁతుక రూ.చూ. వెలమఁతి వి. రోవెలది, వేశ్య. వెలమిటారి వి. వేశ్య. పణ్యస్త్రీ. దశా. 2.228. వెలముద్దియ వి. వేశ్య. వెలఁబెట్టు స.క్రి వెలఇచ్చికొను. ప్రబోధ. 3.58. <వెల+-ను+పెట్టు. వెలయబ్బురము (-అబ్బురము) విశే. మిక్కిలివెలగలది. అమూల్యం. ఇందు. 5.37. వెలయాట(-ఆట) వి. 1. ద్యూతక్రీడ, జూదం. దశకు. 5.36. 2. సురతక్రీడ, రతి. కవిక. 1.22. వెలయాలికూరిమి వి. నమ్మరానిది (వేశ్యాను రాగం దబ్బిచ్చినన్నాళ్ళే ఉంటుంది). రాధికా. 4.79. <వెలయాలు+-ఇ³కూరిమి. వెలయాలు(-ఆలు) వి.బొ. రోవెలది, వేశ్య. కు.సం. 8.165. వెలయింతి(-ఇంతి) వి. వారకాంత, పణ్యస్త్రీ. వైజ. 4.5. వెలయెక్కు(-ఎక్కు) అ.క్రి. విలువకెక్కు, అధికమూల్యమగు. ప్రబోధ. 1.27. వెలయెలనాగ(-ఎలనాగ) వి. వెలయాలు. వెలయెసఁగు (-ఎసఁగు) అ.క్రి. విలువకెక్కు, అధికమూల్యమగు. ఇందు. 5.27. వెలలేని విశే. అమూల్యమైన. శాళ్ల. సం. 3.168. వెలలేనిసొమ్ము వి. అమూల్యం. వెలవెట్టు(-పెట్టు) రూ. వెలపెట్టు. స.క్రి. మూల్యమిచ్చు, విలువనొనగు. శేయూ. 4.67 ; అ.క్రి. మూల్యవంతమగు, విలువకలదగు. వెలవెలఁది వి. పణ్యస్త్రీ. వేశ్య. నిరంకు. 1.50. వెలవోయు(-పోయు) రూ.చూ. వెలపోయు. స.క్రి వెలగాఇచ్చు వెలవోవు(-పోవు) రూ.చూ. వెలపోవు. అ.క్రి. అమ్ముడు. పోవు. వెలసేయు(-చేయు) స.క్రి. కొను. శాళ్ల. సం. 14.30. వెలహెచ్చు విశే. అధికమూల్యం, మిక్కిలి విలువ కలది. ఇందు. 5.103.

వెలం రూ.చూ. వెల్గ. వి. ఒకరకం పళ్ళచెట్టు.

వెలగఁబెట్టు స.క్రి. (నిరసనార్థంలో) ఉద్ధరించు. <వెలుఁగు +-అ⁷+పెట్టు.

వెలంగ రూ.చూ. వెల్గ. వి. ఒకరకంపళ్ళచెట్టు. (Fesronia elephantum).

వెలంగ్రమాను వి. వెలగచెట్టు. (Feronia elephantum).

వెలఁగ రూ.చూ. వెల్గ. వి. కపిత్థం. భాగ. 10పూ. 435.

వెలఁగబదనిక వి. లేతఎరుపుపూలు, తీతఎరుపుకాయలు గల ఒకరకం చెట్టు. (Loranthus Longiflorus).

వెలఁగఁబెట్టు చూ. వెలుఁగు.

వెలచు చూ. వెలుఁగు. స.క్రి. శుభ్రపరచు, తోము. శృం. నై. 6.108.

క. బెళగు. మెరిసేటట్లుతోము, శుభ్రపరచు ; త. విళక్కు. శుభ్రపరచు, మెరిసేటట్లుచేయు ; మ. విళకుక. తోము. మెరిసేటట్లుచేయు ; కో. వెళ్క్- నీటితో శుభ్రపరచు.

మూ.ద.ద్రా. వెళ్-అంక్-/ వెళ్-అక్క్-.

వెలంచు చూ. వెలి[1].

వెలదు చూ. విడుచు. రూ. వెడలు, వెలదు[2], వెళలు, వెళ్లు. అ.క్రి. 1. వెడలు, బయలుదేరు. కు.సం. 3.66 ; 2. అతిక్రమించు, కడచు ; 3. చొచ్చు, ప్రవేశించు.

క.గ. వెట్ల్-.బయటకెళ్ళు ; త. వెళిక్కిఱు. బయలు దేరు, విళకు, వదులు, వెనక్కి తీసుకొను ; కుఇ. వెండ. ముందుకిపోవు, సాగిపోవు ; పర్జి. వలిప్-(వలిత్-). పారదోలు.

<మూ ద్రా. *వెల్-, వెళ్-.

వెలద్పు రూ.చూ. వెడల్పు. వి. పొట్టిగా ఉండే దానివైపు, దానికొలత.

వెలతెలాపోవు చూ. వెల్ల[1]. అ.క్రి. వెలవెల పోవు, తెల్లబోవు.

వెలన రూ. వెల్లన. వి. తెల్లన.

వెలనగు అ.క్రి. వివర్ణమగు, కాంతిరహితమగు. వాల్మీ. 4.133. <వెలన+అగు.

వెలనాఁడు రూ. వెల్నాఁడు. వి. దేశవిశేషం. హంస. 1.53.

వెలఁది రూ. వెలఁదుక. వి. 1. చక్కని ఆడది, ఆడది, భార్య. శార. ఉద్యో. 2.44 ; 2. దాశరథ్యం, తళతళ కాంతి. విజయ. 1.130 ; విశే. 1. నిర్మలం. భోజ. 2.96 ; 2. విశదం, స్పష్టం. నవనాథ. 2.65పు. 6పం ; 3. ప్రసన్నం, సంతోషభరితం. హ.స. 2.102 ; 4.మేలైనది. వసు. 6.72 (నారీరత్నాల సముదాయం అని అర్థాంతరం) ; 5. తెల్లనిది, ధవళం. ద్వి. పరమ. వి. 3.244పు. 12పం.

వెలఁదిగా క్రి. విశే. ద్రు. వివరంగా. వెలఁదిమిన్న వి. స్త్రీరత్నం, శ్రేష్ఠురాలైన ఆడది. ఉ. రా. 4.168. వెలఁది వెన్నెల వి. తెల్లనివెన్నెల. పాండు. 4.16.

వెలఁదుక రూ.చూ. వెలఁది. వి. స్త్రీ, ఆడది. మార్క. 1.24.

వెలపట రూ.చూ. వెలుపల. వి. 1. వెలపల ; 2. ఎడమ.

వెలపటుండు రూ.చూ. వెలపలుండు. అ.క్రి. 1. వాకిటుండు, బహిష్ఠగు ; 2. బయటఉండు.

వెలపర వి. గరుగ్గా ఉండే పెద్దపళ్ళు కాసే ఒకరకం చెట్టు.

వెలపరి వి. బహిఃప్రదేశం.

వెలపల రూ.చూ. వెలుపల. వి. 1. బహిఃప్రదేశం : 2. ఎడమ.

వెలపలుండు రూ. వెలపటుండు. అ.క్రి. 1. రుతుమతిఅగు ; 2. బయట ఉండు. <వెలపల+ఉండు.

వెలపలుండు చూ. వెలపల.

వెలమ[1] రూ. వెల్మ. వి. శూద్రజాతిలో ఒక అవాంతరశాఖ, ఆశాఖకు చెందినవ్యక్తి. భీమ. 1.31. మహాపద్మనందుని సంతతివారైన పద్మనాయకులు ఉత్తరదేశం నుంచి వచ్చిన వారవటంచేత వెలిమల అని దక్షిణదేశస్థులు పిలిచేవారు. వెలి-అవతల, మల-పర్వతం అని అర్థం. పర్వతాలకు అవతలివారవటంచేత వెలిమల, వెలమల అని పిలువబడి క్రమంగా జనపదులనోట వెలమజాతిగా స్థిరపడింది. <వెలిమల.

వెలమఁడు వి. వెలమతెగకు సంబంధించిన పురుషుడు. బసవ. 4.877 పం.

వెలమ[2] వి. ధనియాలమొక్క, నేలవేము. పి. శకు. 2.14.

వెలమసంది వి. కాకజంఘ, నేలవేములోని భేదం. ఆం. భా. 2.66. (Leca hirta).

వెలమ[3] వి. ఒకరకం ఆకెరువు మొక్క, నిర్మాణద్రవ్యంగా పనికివచ్చే ఉత్తమజాతికి చెందిన కలప ఈచెట్టు నుండి దొరుకుతుంది, కాకజంఘ, నేలవేము.

వెలమకరక వి. కడప, కర్నూలు ప్రాంతాల్లో పెరిగే ఒకరకం చెట్టు. (Terminalia pallida).

వెలమమాళ్ల రూ. వెలమనూళ్ల. వి.బ.వ. తెలగజాతిలో ఒక భేదం, ఈజాతిలోని భేదాంతరాలు. వేశాసనం. క్రీ.శ. 1086. E. I. 6.

వెలయించు చూ. వెలయు[1].

వెలయు[1] అ.క్రి. 1. కలుగు, పుట్టు. భార. అరణ్య. 2.10; 2. ప్రసిద్ధికెక్కు. భార. ఉద్యో. 4.65; 3. పవిత్రమగు. పావనమగు. భార. శాంతి. 1.166; 4. ప్రకాశించు. భార. శాంతి. 5.13; 5. బయలుపడు. భాస్క. రా.సుం. 164; 6. ఆవిర్భవించు. అవతరించు. భీమ. 1.101; 7. ఉండు. పి.శకు. 1.186; 8. అతిశయించు. కళా. 1.28; 9. వ్యాపించు. కళా. 1.99; 10. సఫలమగు. ఇందు. 5.164; 11. ఒప్పు. నీలా. 1.26; విణ. 1. ప్రసన్నమగు, నిర్మలమగు. హరి.పూ. 6.93; 2. అతిశయించు. దశా. 2 19.

క. బెళె వృద్ధిపొందు, పెరుగు; తు. బెళగుని. ప్రకాశించు; త. విళై. ఉత్పత్తిచేయు, కలుగు; మ. విళయుక; కో. వెళ్ వ్-(వెళ్-). పెరగనిచ్చు; తొ. పెళ్ఫ్-(పెళ్-).

<మూ. ద్రా. *వెళ్-.

వెలయించు రూ. వెలుఁగు. స.క్రి. 1. బయల్పర్చు, ప్రకటించు. భార. ఉద్యో. 4.387; 2. పావనంచేయు, పవిత్రీకరించు. భార. శాంతి. 1.334; 3. ప్రసిద్ధికెక్క చేయు. హరి. పూ. 1.22; 4. కప్పు, ఆచ్ఛాదించు. హర. 4.87; 5. కాపించు. విక్ర. 2.64; 6. వ్యాపింప చేయు. విక్ర. 4.10; 7. ప్రకాశింపచేయు. వసు. 1.10; 8. ఉల్లాసం కలిగించు, సంతోషపర్చు. వసు. 1.7. <వెలయు+-ఇంచు[3].

వెలయు[2] అ.క్రి. తగ్గు.

వెలరారు చూ. వెలరు[1].

వెలరు[1] చూ. వెల్ల[1]. వి. 1. తెల్లన, పాండిమం. వరస. 2.141; 2. స్వచ్ఛత.

వెలరారు రూ.చూ. వెలరువాఱు. అ.క్రి. తెల్లనగు. పద్మ. 9.226. <వెలరు[1]+ఆరు[1]. వెలరుపాఱు రూ.చూ. వెలరువాఱు. అ.క్రి. 1. తెల్లనగు; 2. తెలతెలపోవు, వెలవెలపోవు. 3. చెడు. వెలరుపోవు రూ.చూ. వెలరుపోవు. అ.క్రి. 1. వెలవెలపోవు; 2. పాడగు, చెడిపోవు. వెలరువాఱు (-పాఱు) రూ. వెలరారు, వెలరు పాఱు. అ.క్రి. 1. వెలవెలపోవు, వివర్ణమగు. కు.సం. 8.186; 2. తెల్లనగు. నృసింహ. 3.181; 3. చెడు. వెలరుపోవు (-పోవు) రూ. వెలరుపోవు. అ.క్రి. 1. వెలవెలపోవు, వివర్ణమగు. కాశీ. 5.267; 2. పాడగు. చెడిపోవు. వెలరొందు అ.క్రి. 1. తెల్లనగు; 2. వెలవెల పోవు; 3. చెడిపోవు. <వెలరు[1]+ఒందు.

వెలరు[2] రూ.చూ. వెలడు. అ.క్రి. వెడలు, బయలుదేరు. కు. సం. 9.48.

వెలరొందు చూ. వెలరు[1].

వెలలఁబన్ను చూ. వెలలు.

వెలలు రూ.చూ. వెలడు. అ.క్రి. 1. అతిక్రమించు, కడచు. వేంక. పంచ. 4.56; 2. చొచ్చు, ప్రవేశించు. కకుత్థ. 3.70; 3. వెడలు, బయలుదేరు.

వెలలఁబన్ను స.క్రి. వెళ్ళగొట్టు. <వెలలు+-అ[7]+పన్ను[1]. వెలలుచు రూ.చూ. వెడలుచు. స.క్రి. వెడలచేయు.

వెలవ వి. కావురుగంజి. భార. అను. 3.48.

సం. విలేపీ. బియ్యపుగంజి; ప్రా. విలేవ-, విలేవియా. పాన విశేషం.

<ప్రా. విలేవ-.

వెలవడము రూ.చూ. వెలువడము. వి. 1. ధాన్యవిశేషం. ప్రబంధ. 112; 2. సస్యవిశేషం.

వెలవెల విణ. వివర్ణం. వేంక. పంచ. 1.221; వి. సవ్వడంలో అయ్యే అనుకరణం. వాశి.రా. 2.228.

త. వెళు (-ప్పు-,-త్తు-). వివర్ణమగు, తెల్లబోవు, వెలవెల-. గ్లానితో మూర్ఛిల్లు. పఱకు, దిగ్భ్రాంతి పొందు; సం. వలక్ష-.తెల్లనిది, తెలుపు.

వెలవెలన రూ. వెలవెల్లన. వి. వెలవెలపాటు, వైవర్ణ్యం. వేంక. పంచ. 1.221. వెలవెలనగు రూ.చూ. వెలవెల్లనగు. అ.క్రి. వెలవెలపోవు, వివర్ణమగు. వరాహ. 9.107. <వెలవెలన+అగు. వెలవెలపాటు వి. వైవర్ణ్యం, వెలవెలపోవటం. మను. 3.28. వెలవెలపోవు రూ. చూ. వెలవెలఁబోవు. అ. క్రి. కళతగ్గిపోవు. వెలవెలఁబాఱు(-పాఱు[3]) అ. క్రి. 1. తెల్లబోవు, వివర్ణమగు. భార. భీష్మ. 3.266; 2. తెల్లపడు, వెలుతురువచ్చు. రుక్మా.చ. 3.187. వెలవెల్లఁబోవు(-పోవు)రూ. వెలవెలపోవు. అ.క్రి. వైవర్ణ్యంపొందు, తెల్లబోవు. పల్నా. 49వ. వసు. 1.97. వెలవెల్లన రూ.చూ. వెలవెలన, వి. వెలవెలపాటు, వైవర్ణ్యం. వెలవెల్లనగు రూ. వెలవెలనగు. స.క్రి. వివర్ణమగు, తెల్లపోవు. భార.ద్రోణ. 2.238. <వెలవెల్లన+అగు.

వెలాయం చూ. వెలి[1].

వెలాయించు చూ. వెలి[1].

వెలాడుచు చూ. వెలి[1]

వెలార్చు చూ. వెలి[1].

వెలి[1] రూ.వెలు-. విణ. 1. వర్జితం, లేనిది. భార. ఆది. 3.176; 2. బాహ్యం, వెలుపలిది. భార.ఆది. 4.264; 3. పరిహారం, మన్నన H.A.S. 13.6.క్రీ.శ. 1079; 4. పరకీయం, ఇతరులది. కు.సం. 4.18; వి. 1. బయలు, వెలుపల. భార. విరా. 1.130; 2. శరీరబహిర్భాగం. బహిర్భాగం. వెలుపలిప్రదేశం. భార.అను. 5.185; 3. బహిష్కా

రం. వీర.వి . 1.103 ; 4. బాహ్యప్రదేశం. బయలుపాటు; 5. (కులంనుంచి) వేరుచేయటం.

క. బెళవార. అంటరానిజాతి ; త. వెళి(-ప్ప్-,-త్త్-). వెలుపలిది, ఖాళీది, వెళిప్పు. బయలుప్రదేశం, మైదానం ; మ.వెళి. ఖాళీస్థలం, వెళిచ్చమ్. ప్రచారం; కుఇ. వెండ. ముందుకుపోవు ; కువి. వెళ్ళికినై. వెలివేయు, బహిష్కరించు ; పర్జి. వలిప్- (వలిత్-). పారద్రోలు ; గ. వెటి-.పరిగెత్తు. పారిపోవు.

**వెలంచు** వి. బయటవైపున ఉండే అరుగుఅంచు. < వెలి¹ + అంచు.³ వెలాయం రూ. ఎలాయం. వి. బయటి కొలత. < వెలి¹ + ఆయం. **వెలరించు** స.క్రి. 1. బయలు పర్చు. భార. ద్రోణ. 4.290 ; 2. వెడలించు, పోజేయు. భార. శల్య. 2.242 ; అ.క్రి. సంచరించు. తిరుగు. కృ. శకు. 1.56. **వెలారుచు** రూ. వెలార్చు, వెలియార్చు. స.క్రి. 1. వెడలించు. భార. భీష్మ. 3.405. 2. బయలుపర్చు. ఉ. హరి. 1.15. **వెలార్చు** రూ. చూ. వెలారుచు. వి. 1. వెడలించు ; 2. బయలుపరుచు. **వెలికత్తియ** రూ. చూ. వెలికత్తె. వి. వెలివేయబడ్డ స్త్రీ. **వెలికత్తె** రూ. వెలకత్తియ. వి. వెలివేయబడ్డ స్త్రీ. **వెలిక(దార్చు-(కార్చు)** స.క్రి. బయటికిలాగు. పారి. 1.112. **వెలికొత్తు** స.క్రి. బయటికితోయు. < వెలి¹ + కున్ + ఒత్తు. **వెలిగడ** వి. 1. నీరుపెట్టకుండా దున్నినదుక్కి ; 2. వర్షాధారం ఉన్న భూమి ; 3. మెట్టనేల. **వెలిగనులుబడు** అ.క్రి. నిద్రతేలి పోయినకళ్ళు నిలిచిపోవు. < వెలి¹ + కను + -లు + పడు. **వెలిగాకి-(కాకి)** వి. ఎవరితో కలవకుండా తిరిగేవ్యక్తి, ఒంటరిగా తిరిగే వ్యక్తి. **వెలిగాడి** వి. ఎద్దుబండికాడి చివరికిపోవటం. **వెలిగొండ¹(-కొండ)** వి. దూరంగా ఉన్న పర్వతం. **వెలిగొలికి(-కొలికి)** వి. బొట్టె, కాడికి తగిలించే పట్టెండ్లకొనకాడు. **వెలిగోడ** రూ. ఎలిగోడ. వి. బయటి గోడ. **వెలిగ్రాయు** స.క్రి. కక్కు, వమనంచేయు. పాండు. 4.23. **వెలిగ్రుక్క** వి మణితం, రతికూజితం. **వెలిచవి** వి. జారత్వం. రంకుతనం రామలిం.శ. 27 ; 2. చిరుతిండి. **వెలిచవుల కరుసు** అ.క్రి. వ్యభిచరించు. శుక. 2 505. < వెలి¹ + చవి + -లు + -అ¹³ + -కున్ + అరుసు. **వెలిచవుల్గొన్నకొయ్యలి** వి. జారిణి, బయటి రుచులు మరిగిన స్త్రీ. వేంక.ఆం. 34. **వెలిచూడ్కి** వి. బాహ్యదృష్టి, వెలుపలిచూపు. **వెలిచేను** వి. పులిపొలం, దుక్కిచేయటానికి అనువైననేల. ద.హిం.శా. సంపు.4. శా. సం. 933. క్రీ.శ. 1241. **వెలిచొరవరి** వి. జారిణి, రంకులాడు. < వెలి¹ + చొరవ + -అరి. **వెలిదుక్కి** వి. నీళ్ళు కట్టక వానతడికో దున్నటం. **వెలిద్రొబ్బు** స.క్రి. వెలికిద్రోయు, బయటికిద్రోయు ఉ.రా. 1.260. **వెలిధాన్యము** వి. వరినేలల్లో పండిన ధాన్యం. నె.శా. రాఘూర్. 28. క్రీ.శ. 1638. సం. ధాన్య -. వరి, పెసలు, గోధుమ మొ. వాటిపంట. < వెలి¹. + సం. ధాన్య-. **వెలినాయకము** వి. బహిఃపర్యవేక్షణ. ద.హిం.శా. సంపు. 5. శా. సం. 1059 క్రీ.శ. 1154 **వెలిపోటిమెకము** వి. ఎలుగుబంటి. **వెలిపట్టు** రూ. రూ.చూ. వెల్పట్టు. వి. బయలు, మైళాగం. **వెలిపఱచు**. రూ. పఱుచు, వెలివఱచు, వెలివఱుచు. స.క్రి. వెల్లడించు. బయల్పరచు. **వెలిపఱుచు** రూ.చూ. వెలిపఱచు. స.క్రి. వెల్లడించు, బహిర్గతంచేయు. **వెలిపారము** వి. అయోధ్యాపుర ప్రాకారాదికం. శ్రీరం. మూ. 2.117. సం. ప్రాకార-. ప్రహరి. **వెలిపాఱు** రూ.చూ. వెలివాఱు. అ.క్రి. పైకిపోవు.ద్వి. సార. చ. 1.15వ. 26పం **వెలిపించు** స.క్రి వెలివచ్చు, బయటకు రప్పించు. భార. అశ్వ. 4.21. **వెలిపుచ్చు** రూ. వెలివుచ్చు, వెల్పుచ్చు. స.క్రి. బయటపెట్టు, వెలార్చు, భార. విరా. 1.134. **వెలిపెట్టు** రూ.చూ. వెలివెట్టు. స.క్రి. బహిష్కరించు, సంఘంనుంచి దూరం చేయు. మను. 2.73. **వెలిపెళ్ల** రూ. ఎలిబెళ్ల. వి. గోకట్టేటప్పుడే మునుముందు పెంచుకోవటానికి ఆనవాలుగా ముందుకు పొడుచుకొని వచ్చేటట్లు పేర్చిన పెద్దరాయి. **వెలిపొలము** వి. 1. వ్రీహిక్షేత్రం, సస్యక్షేత్రం.ద.హిం.శా. సంపు. 10. శా.సం.73 క్రీ.శ. 1.115 ; 2. మెట్టచేను. ద.హిం.శా. సంపు. 4.శా. సం. 801. **వెలిపోవు** రూ.చూ. వెలిపోవు. అ.క్రి. పైకిపోవు.**వెలిబిత్తరి** వి. కాంమానభేదం. మల్లబంధవిశేషం. మల్లుపు. 368. **వెలిమడక** వి. మెట్ట నాగలి, వెలిదుక్కి (మెట్టదుక్కి)కి ఉపయోగించే నాగలి. **వెలిమంద** వి. పునాసమంద, వేసవికాలంలో తోలించే మంద. **వెలిమాడు** వి విదేశాలకు పంపబడే ధాన్యాదికం. **వెలిమొన** వి. మల్లవిద్యావిశేషం, పన్నెండు మొనల్లో ఒంటి. హం. స. 1.206. **వెలి(బడు(-పడు)** అ.క్రి. 1. విషయాసక్తమగు. తాళ్ల. సం. 8.217 ; 2. సంఘంనుంచి బహిష్కృతమగు. ఆం.భా. 3.12. **వెలిబర్వు(-పర్వు)** అ.క్రి. బయటకు ప్రసరించు. వసు. 5.88. **వెలియగు(-అగు)** అ.క్రి. బహిష్కృతమగు. భార. ద్రోణ. 5. 352 ; 2. లోబడకఉండు. విష్ణుపు. 2. 105. **వెలియార్చు** రూ.చూ. వెలారుచు. స.క్రి. బయలుపరచు. చంద్రాంగ. 2.68. **వెలియునికి(-ఉనికి)** వి. ప్రవాసం. పరదేశంలో ఉండటం. **వెలియొవర్చు(-ఒవర్చు)** స.క్రి. బహిష్కరించు, వెలివేయు. నీలా. 1.42. **వెలిరతి** వి. రతిభేదం. **వెలిలోవులేకుండు** అ.క్రి. వెలుపల లోపల అనేదిలేకఉండు. పాపపుణ్య విచక్షణ, యుక్తాయుక్తవిచక్షణ లేకుండు. కు.సం. 4.18. **వెలివడు(-పడు)** అ.క్రి. సాయపడు, బయలుదేరు. వర. రా.యు. 833వ. 14పం **వెలివఱచు** రూ.చూ. వెలిపఱచు. స.క్రి. వెల్లడించు, బయల్పరచు. **వెలివఱుచు** రూ.చూ. వెలిపఱచు. స.క్రి. వెల్లడించు, బయల్పరచు. **వెలివాడ** వి. చండాలవాటిక, మాలపల్లె. శివరా. 3.36. **వెలివాడబేడియ** వి. చండాల స్త్రీ. గౌ.హరి. 2.108. **వెలివాడపని** వి. మాదిగపని ఆము. 5.94. **వెలివాడవా(డు** విశ. వెలివాడు, చండాలుడు, మాలవాడు. కాశీ. 7.241. ఉ. హరి. 4.22. **వెలివా(డు** వి. 1. చండాలుడు. భార. శాంతి. 3.284. 2. భ్రష్టుడు. **వెలివాఱు (-పాఱు²)** రూ. వెలిపాఱు. వి. వేటాడే ప్రదేశం చుట్టూ కట్టిన వెలుగు, దడిలాంటిది, వేటాడే చోట చుట్టూ పారించేపోగు. ఉ. హరి. 4.22 ; అ.క్రి. పైకిపోవు. **వెలివిడుచు** స.క్రి. వ్యయపెట్టు, వెచ్చించు. సిం.ద్వా. 2. 156. **వెలివిసరు** అ.క్రి. 1. బయల్పడు. వేంక. పంచ. 4.14 ; 2. పైకిప్రసరించు. సారంగ. 2.82. **వెలివుచ్చు(-పుచ్చు)** రూ.చూ. వెలిపుచ్చు. స.క్రి. బయటపెట్టు. **వెలివెట్టు(-పెట్టు)** రూ.

వెలిపెట్టు. స.క్రి. బహిష్కరించు, సంఘమునుంచి దూరం చేయు. కాశీ. 7.66. వెలివెలి విశే. పైపై, బాహ్యం. భార. శాంతి. 1.85. వెలివేదోర్లు విశే.బ.వ. కుమ్మర్లను యాచించే ఒక కులానికి చెందినవారు. వెలివేయఁబడు అ.క్రి. బహిష్కరింపబడు. <వెలి[1]+వేయు+-అ[7]+పడు. వెలివేయు స.క్రి. బహిష్కరించు, సంఘమునుంచిదూరంచేయు. భల్లా. 2. బా. వెలివోవు(-పోవు) రూ. వెలిపోవు. అ.క్రి. పైకిపోవు. ప్రభా. 2.5. వెలివ్యవహారము వి. పరదేశవర్తకులు. ద. హిం.గా. సంపు. 5. గా. సం. 212. సం. వ్యవహార -, ప్రవర్తన, పని, వ్యాపారం. <వెలి[1]+సం. వ్యవహార - వెలిసలుపు రూ.చూ. వెలిసల్పు. స.క్రి. బయలుపరచు వెలిసల్పు రూ. వెలిసలుపు. స.క్రి. బయలుపరచు. దశకు. 8.85.

వెలి[2] విశే. తెల్లనిది, ధవళం. భార. ఉద్యో. 4.125 ; వి. తెలుపు.

క. బెళ్, బెళ, బెళు, బెళుపు, బెళ్పు, బెళతిగె, బెళంతిగె, బెళ్పగె, బిళ, బిళు, బిళి, బిళె, బిళపు, బిళుపు, బిళ్పు. తెల్లదనం. కొడ. బొళిపి. తెల్లదనం, బొళితె. తెల్లని ; తు. బొళు, బొలు, బొళుంగరె, బొళ్ళి, బొళ్పరె. తెల్లని, కాంతిమంతుడైన ; త. వెళ్, వెళ్. తెల్లని, ప్రకాశంగల, వెళితు. తెల్లని, వెళుప్పు. తెల్లదనం, వెళ్లై. తెల్లదనం. విళర్పు. తెల్లదనం, వెళ్ప. తెలుపు ; కో. వెల్. తెల్లని ; పర్జి. విల్. తెల్లని.

పో.చూ.సం. వలక్ష -. తెల్లని. తెలుపు.

వెలికడలి వి. క్షీరసముద్రం. రాజవా. 1.63. వెలిగట్టు వి. 1. రజతాద్రి, వెండికొండ. చిత్రభా. 5.10 ; 2. శ్వేతాద్రి, తెల్లకొండ. వెలిగంకి వి. వెలెన్ను, ఎన్ను తెల్లబడిపోయే వరితెగులు, చచ్చుగింజలు పుడతాయి. వెలిగారము వి. టంకణం, బంగారానికి కాంతిని కలగజేసే ఒక దినుసు ఉప్పు, గవ్వ చౌకం. వెలిగిడ్డి వి. 1. కామధేనువు. ఆం.భా. 1 57 ; 2. తెల్లావు. వెలిగొడుగు రూ.చూ. వెల్గొడుగు. వి. తెల్లగొడుగు. ఉ.రా. 4.163. వెలిగొండ[2](-కొండ) వి. 1. వెండికొండ. రజతాద్రి ; 2. తెల్లనికొండ, శ్వేతాద్రి. వెలిగొండలు(-కొండలు) వి.బ.వ. నెల్లూరు జిల్లాలో తూర్పు కనుమలు, తెల్లటికొండలు. వెలిగొరు వి. 1. ఐరావతం. ఇంద్రుని ఏనుగు, తెల్లఏనుగు. ఉ.హరి. 4.268 ; 2. తెల్లావు. వెలిచంద్ర వి. తెల్ల చంద్ర, కదరం. వృక్షవిశేషం. వెలిచామలు వి.బ.వ. ధాన్యవిశేషం. హంస. 4 127. వెలిచాదులు వి.బ.వ. ధాన్యవిశేషం. హంస. 4.127. వెలిచెట్టు వి. 1. కల్పవృక్షం. పాంచాలీ. 2.28 ; 2. తెల్లనిచెట్టు. వెలిజక్కి వి. 1. ఉచ్చైశ్శ్రవం ; 2. తెల్లనిగుర్రం. వెలిజడదారి వి. నారదుడు. వెలిజడదారిఁగన్నచెలి వి. సరస్వతి, నారదుణ్ణి కన్నస్త్రీ. వెలితిప్ప రూ.చూ. వెలిదిప్ప. వి. రజతగిరి, కైలాసం. వెలితుమ్మ వి. తెల్లతుమ్మ, విట్ఖదిరం. వెలిదమ్మి (-తమ్మి) రూ. వెల్లదమ్మి. వి. తెల్లతామర, పుండరీకం. ఆము. 5.4. వెలిదామర(-తామర) వి. తెల్లతామర. వెలిదిప్ప(-తిప్ప) రూ. వెలితిప్ప. వి. రజతగిరి, కైలాసం. ఆం.నా.సం. స్థా. 1. వెలిదీవి వి. విష్ణుని నివాసం, శ్వేతద్వీపం. వెలిదీవిపాలెగాఁడు వి. 1. శ్వేతద్వీపనివాసి ; 2. విష్ణువు. వెలిదీవిఱేఁడు వి. 1. శ్వేతద్వీప ప్రభువు : 2. విష్ణువు. వెలిపట్టు వి. తెల్లని పట్టు వస్త్రం. సిం.ద్వా. 3.206. వెలిపట్టుజేబులు వి.బ.వ. వస్త్ర విశేషం. ప్రబంధ. 2.72. వెలిపుచ్చ వి. తెల్లపుచ్చ. వరాహ. 10.30. వెలిపులుఁగు వి. 1. హంస ; 2. తెల్లపిట్ట. వెలిబూదిద రూ. వెలిబూడిదె. వి. పిడకనిప్పుల బూడిద. వెలిబూడిదె రూ.చూ. వెలిబూడిద. వి. పిడకల బూడిద. వెలిబూది వి. తెల్లని విభూతి. కాశీ. 4.103. వెలిమబ్బు వి. తెల్లమబ్బు, శరత్కాలమేఘం ; 2. వాన కురిసిన తరువాత తెల్లగా అయినమేఘం. వెలిమల వి. 1. కైలాసపర్వతం, వెండికొండ. అచ్చ.రా.బాల. 2.16 ; 2. తెల్లనికొండ. వెలిమావు వి. 1. ఇంద్రుని తెల్లని గుర్రం, ఉచ్చైశ్శ్రవం. భార. భీష్మ. 2.42 ; 2. తెల్లని గుర్రం. వెలిమావుజోదు వి. ఇంద్రుడు. అచ్చ.రా. 2.31ప. వెలిమిడి రూ. వెల్మిడి. వి. 1. విభూతి, భస్మం. కు.సం. 8.66 ; 2. బూడిద.ఉ.హరి. 6.86. వెలిమువ్వ వి. మొక్క తెల్లబడి పొట్ట పెట్టనీయని జొన్న తెగులు. వెలిమొట్ట వి. మత్స్య విశేషం. సిం.ద్వా 1.240. వెలిమొదవు వి. 1. కామధేనువు ; 2. తెల్లావు. వెలిమ్రాను వి. 1. కల్పవృక్షం, దేవతరువు ; 2. తెల్లనిచెట్టు. వెలియాకు (-ఆకు) వి. తెల్లనాకు, తమలపాకు, నాగవల్లీదళం. నీలా. 3.86. వెలియాఁబోతు వి. నందీశ్వరుడు. వెలియాలపోతు వి. నందీశ్వరుడు. వెలియాలపోతురౌతు వి. శివుడు. వెలియావు(-ఆవు) వి. 1. కామధేనువు. అచ్చ.రా.యు. 48 ; 2. తెల్లావు. వెలివెలుఁగు రూ. వెలివెల్గు. వి. 1. చంద్రుడు ; 2. తెల్లటివెలుగు. వెలివెల్గు రూ.చూ. వెలివెలుఁగు. వి. 1. హిమాంశువు ; 2. తెల్లటివెలుగు. వెలుక వి. తెల్లన, ధవళవర్ణం. వెలుకన విశే. తెల్లనిది, ధవళం సిం.ద్వా. 11.112. వెలుకఁబాఱు(-పాఱు[3]) రూ. వెల్కఁబాఱు. అ.క్రి. 1. తెల్లబడు. భార. ద్రోణ. 5.232 ; 2. వెలవెలబోవు. వేంక. పంచ. 4.278 వెలువెలుక వి. మిక్కిలితెల్లన, అధికధావళ్యం. వెలువెలుకఁబాఱు(-పాఱు[3]) రూ.చూ. వెల్వెలుకబాఱు. అ.క్రి. మిక్కిలి తెల్లనగు. రుక్మా. చ. 1.141. వెలువెల్ల వి. తెలుపు. వెలెన్ను వి. తెల్లకంకి, వరితెగులు, దంటుకొరిచే పురుగులువల్ల ఎన్ను (కంకి) తెల్లబడి చచ్చుగింజ లేర్పడే తెగులు. <వెలి[2]+ఎన్ను[2]. వెల్కఁబాఱు రూ.చూ. వెలుకఁబాఱు. అ.క్రి. 1. తెల్లబడు. భార. శల్య. 2.255 ; 2. వెలవెలబోవు. వెల్గొడుగు రూ. వెలిగొడుగు. వి. తెల్లనిగొడుగు. భార. ద్రోణ. 5.130. వెల్వెల అ.క్రి. వెలవెలబోవు. వివర్ణమగు. వెల్వెలఁజేయు(-చేయు) స.క్రి. వెలవెలపోయేట్లు చేయు. తెల్లపోయేట్లు చేయు. కకుత్స్థ. 5.130. వెల్వెలన వి. మిక్కిలితెలుపు. అధిపధావళ్యం. వెల్వెలనగు అ.క్రి. వెలవెల బోవు, తెల్లబోవు. చింద్రాంగ 6.55. <వెల్వెలన+అగు. వెల్వెలనఁబాఱు(-పాఱు[3]) అ.క్రి. వెలవెలపోవు. రాధికా. పీఠి. 36. వెల్వెలఁబాఱు(-పాఱు[3]) అ.క్రి. 1. తెల్లపడు,

వెల్లనగు. ఉ.హరి 4.9; 2. వెలవెలపోవు, వివర్ణమగు. కాశీ. 1.122. వెల్వెల(బోవు(-పోవు) అ.క్రి. 1. వివర్ణమగు. ఉ. రా. 1.190 ; 2. తగ్గు, క్షీణించు. సీతారా. 1 147. వెల్వెలుక(బారు రూ. వెలువెలుక(బారు. అ.క్రి. మిక్కిలి వెల్లబారు, మిక్కిలి తెల్లబడు. భాగ. 10పూ.. 71. వెల్వెల్ల విశే. మిక్కిలి వివర్ణమయినది. భార. శల్య. 1.302. వెల్వెల్ల(బాటు(-పాటు³) వి. మిక్కిలి వైవర్ణ్యం. నిర్వ. రా. 9.78. వెలికత్తెరనేల వి. కంకరమన్ను కలిసిన భూమి.

వెలికి¹ వి. ఒకానొక చిన్నమొక్క. గాడిదగడపర. ఆం.శా. 2,65.

వెలికి² వి. చిన్నముళ్ళచెట్టు, (Vanguesia Spinosa).

వెలికిల చూ. వెలికిలు.

వెలికిల(బడు చూ. వెలికిలు.

వెలికిలు రూ. వెలికిల్లు. వెల్లకిలు. అ.క్రి. 1 వీపుకిందగా పరుండు. హరి.పూ. 8.134 ; 2. వెలికిలపడు. కాశీ. 7,83.

వెలికిల రూ. వెల్లకిల. క్రి.విశే.క్రు. ఉత్తానంగా. <విలికిలు+-అ⁷. వెలికిల(బడు రూ. వెల్లకిల(బడు. అ.క్రి. ఉత్తానమగు. వీపుకింద అయేటట్లు పడు. ఐందు. 3.58. <వెలికిలు+-అ⁷+పడు.

వెలికిల్లు రూ.చూ. వెలికిలు. అ.క్రి. 1. వీపుకింద అయేటట్లు పడు. శివరా. 2.71 ; 2. ఉత్తానమగు, మీదిముఖమగు. సీతారా. 1.115.

వెలి(గించు చూ. వెలుంగు.

వెలిచ రూ.చూ. వెలిచె¹. వి. పిండీతకం, వృక్షవిశేషం.

వెలిచియ రూ.చూ. వెలిచె². వి. ఒకజాతిపిట్ట.

వెలిచె¹ రూ. వెలిచ, వెల్చె¹. వి. వృక్షవిశేషం.

వెలిచె² రూ. వెలిచియ, వెలిసె², వెల్చె. వి. ఒకజాతిపిట్ట. పర్వతపక్షి. గౌ.హరి.పూ. 631.

వెలిటబద్ద వి. వాటకయారీలో సమదకనరిని మన్నులేపటానికి ఉపయోగించే వెదురుబద్ద.

వెలితి రూ. ఎల్తి, యెల్తు, వెల్తి, వెల్ది, వెల్తు. వి. 1. న్యూనత, కొరత. పండి. చ. 1.43 ; 2. రాశ్యవరనలో మధ్యనున్న స్థలం ; విశే. 1. తక్కువైనది, నిండనిది. హరి. పూ. 7.182 ; 3. తిరచుదనం లేనిది.

త. వెలిత్తి. లోటు.

వెలితికట్టు రూ. ఎలితికట్టు. అ.క్రి. పన్నెకట్టుబడిలో దండెలమధ్య వల్లలు దూర దూరంగా పెట్టి పల్లల మధ్య నందులు వెడల్పుగా ఉంచేటట్లుకట్టు. వెలితిపడు రూ. వెలితివడు. అ.క్రి. తక్కువగు, తగ్గు. భీమ. 1.87. వెలితి పుంజంపన్నె వి. ఈనెలు దూరంగా వచ్చేట్టు కట్టినపన్నె. వెలితిమానిసి వి. అల్పుడు, హీనుడు. వెలితి(బెట్టు(-పెట్టు) అ.క్రి. కొరుకు కల్పించు. నిరంకు. 2.33. వెలితివడు (-పడు) రూ.చూ. వెలితిపడు. అ క్రి. లోపభాజనమగు.

వెలిదబ్బ చూ. వెలి¹. వి. దక్కను, కొచ్చిన్, ట్రావన్‌కూర్ ప్రాంతాల్లో పెరిగే ఒకరకం మొక్క (Gelonium Lancedatum).

వెలినాడుబ్రాహ్మణులు వి.బ.వ. బ్రాహ్మణుల్లో ఒకతెగ.

వెలిపము రూ.చూ. వలిపము. వి. సన్నని తెల్లనివస్త్రం. యయా. 2.88.

వెలిపిరి రూ.చూ. వల్పిరి. వి. 1. జల్లు, వానకురిసే టప్పుడు చింది పడే నీటితుంపర ; 2. శైత్యం, చల్లదనం, చలి ; 3. వణకు, కంపం ; విశే. శీతం, చల్లనిది.

వెలియు రూ.చూ. వెలుచు¹. అ.క్రి. 1. వానకురిసి నిల్చు. సిం. ద్వా. 3.84 ; 2. రంగువెడు, ఛాయతగ్గు.

తు. బొల్కిరు. (వానకురిసి) వెలియు, మబ్బులు విడిపోవు ; త. వెలి. అరుణోదయమగు. (వానవెలిసిన తరువాత) ఆకాశం తెల్లగా అగు.

<మూ.ద్రా. *వెళ్-.

వెలివెరియు రూ.చూ. వెల్లివిరియు. అ.క్రి. 1. పొంగు. భార. భీష్మ. 3.244 ; 2. ఉబుకు. భార. భీష్మ. 3.275 ; 3. వ్యాపించు. దశకు. 11.111 ; 4. బయల్పడు. ఆము. 5.55.

వెలిసె¹ రూ.చూ ఎలిసె. వి. ఇంటిచూరు యొక్క లోపలి భాగం.

వెలిసె² రూ.చూ. వెలిచె². వి. ఒకరకం పిట్ట.

వెలు- రూ.చూ. వెలి¹. వి. వృత్తిలో 'వెలి' శబ్దానికి వచ్చే ఆదేశం.

వెలువల రూ. వెలపట, వెలపల. వి. బహిఃప్రదేశం. బయలు. ఉ.హరి. 6.28 ; విశే. వెలిఐనది, బాహ్యం. శకు. 8.154. వెలువలనుండు(-ఉండు) అ.క్రి. 1. బహిష్టగు, రుతుమతిఅగు ; 2. బయటఉండు. వెలువలయుండు (-ఉండు) రూ చూ. వెలువలుండు. అ.క్రి. 1. ముట్టగు, బహిష్టగు ; 2. బయటఉండు. వెలువలించు రూ. వెల్వలించు. స.క్రి. 1. వెల్లడించు ; 2. వెలివేయు. వెలువలి పలివి వి. ఆలయభాగం. వెలువలుండు రూ. వెలువలయుండు. అ.క్రి. 1. ముట్టగు, బహిష్టగు ; 2. బయట ఉండు <వెలువల+ఉండు. వెలువించు¹ స.క్రి. వెడలించు. వెలువడు రూ.చూ. వెల్వడు. అ.క్రి. 1. వెళ్ళు' బయలుదేరు. భార. అరణ్య. 2.64 ; 2. బయల్పడు, బయటికివచ్చు. భార. అరణ్య. 2.178 ; 3. తొలగు, అపవరిల్లు. వసు. 1.88. వెలువరచు రూ.చూ. వెల్వరచు. స.క్రి. బయల్పరచు. వెలువరించు రూ.చూ. వెల్వరించు. స.క్రి. 1. వెడలగొట్టు. వెలువడచేయు. భార. అరణ్య. 1.208 ; 2. బయలుపర్చు, వెలువడచేయు. భార. శల్య. 2.10 ; 3. పోగొట్టు, తొలగించు. భార. శాంతి. 1.120 ; 4. బయలుదేరతీయు. భార. మౌసల. 200. వెలువరుచు రూ.చూ. వెల్వరుచు. స.క్రి. వెలువరించు. వెలువరుచు (-వరుచు) రూ.చూ. వెల్వరుచు. స.క్రి. వెలువరించు. వెల్పట్టు రూ. వెలిపట్టు. వి. పైభాగం, బయలు. భీమ. 4.68. వెల్పల రూ.చూ. వెలువల. వి. 1. బహిఃప్రదేశం, బయలు. పరమ. 4.186 ; 2. వెలైనది, బాహ్యం. వెల్పలించు రూ.చూ. వెలువలించు. స.క్రి. వెలిపర్చు. వెల్పెట్టు స.క్రి. అవమానించు. కేయూ. 4.165. <వెలు- +పెట్టు. వెల్వడు రూ. వెలువడు. అ.క్రి. 1. నిర్గమించు. బయలుపడు, బయటపడు. భార. ఆది. 1,114 ; 2.

బయటకువచ్చు. భార. అరణ్య. 3.8 ; **3.** గాంభీర్యం విడుచు. కేయూ. 3.7 ; **4.** బయలువెడలు. హరి. ఉ. 4.117. **వెల్వరించు** రూ.చూ. వెల్వఱించు. స.క్రి. **1.** వెలువడచేయు. బయల్పడచేయు. భార. ఆది. 3.160 ; **2.** బయలుదేరు. మార్క. 8.181. **వెల్వఱచు** రూ. వెలువరచు, వెలువఱచు, వెలుపఱుచు, వెల్వఱుచు. స.క్రి. వెడలచేయు, బయల్పరచు. పరమ. 5.23. **వెల్వఱించు** రూ. వెలువరించు, వెల్వరించు. స.క్రి. వెడలగొట్టు. యుద్ధమల్లుని బెజవాడ శాసనం. క్రీ.శ. 898-934. **వెల్వఱుచు** రూ.చూ. వెల్వఱచు. స.క్రి. వెడలచేయు. బయల్పరచు. **వెల్వుచ్చు** రూ.చూ. వెలిపుచ్చు. స.క్రి. బయలుచేయు. కేయూ. 3 223. <వెలు-+-పుచ్చు.

**వెలుక** చూ. వెలి[2].

**వెలుకన** చూ. వెలి[2].

**వెలుకఁబాఱు** చూ. వెలి[2].

**వెలుగడి** వి. కార్చిచ్చు, ఎరగలి.

**వెలుగడు** చూ. వెలు. వి. మెట్టనేల. ద. హిం. శా. సంపు. 10. శా. సం. 472. క్రీ.శ. 1292.

**వెలుగద్దం** చూ. వెలుఁగు.

**వెలుగు** రూ. వెనుగు, వెలుము, వెలువు[1], వెల్గు[2]. వి. **1.** కంచె, పశువులు మొ.వి చొరకుండా చేనిచుట్టూ కంపతో ఏర్పరచిన ఆవరణం. హరి. పూ. 5.142 ; **2.** మరుగు గోడ ; **3.** మోపు. అట్టం ; **4.** మధ్యమధ్య వల్లులు మెదిగిన కంచె.

కొడ. బెలి. కంచె ; తు. బేలి. కంచె, ప్రహరీగోడ ; త. వేలీ. కంచె, గోడ ; మ. వెలి. కంచె, ఇంటిప్రహరీ గోడ ; కో. వె-జ్-. కంచె ; గోం. వెలుమ్. కంచె ; కొలా. వెగ్లె.

వెలుగువేయు అ.క్రి. (తోట మొ. వాటికి) కంచెవేయు.

**వెలుఁగారు** చూ. వెలుఁగు.

**వెలుఁగు** రూ. వెలువు[2], వెల్గు[1]. అ.క్రి. **1.** ప్రకాశించు. భార. ఆది. 2.28 ; **2.** ప్రసిద్ధికెక్కు. భార. ఆది. 5.15 ; **3.** జ్వలించు, మండు. మార్క. 7.57 ; **4.** ఒప్పు, శోభిల్లు. కేయూ. 4.138 ; **5.** ప్రతిఫలించు. వసు. 4.28 ; **6.** ఉద్రేకించు, విజృంభించు. కుచే. 3.107 ; వి. **1.** కిరణం. మను. 8.35 ; **2.** ప్రకాశం. ఆము. 4.200 ; **3.** ఎండ. అచ్చ. రా. అయోధ్యా. 42 ; **4.** మెరుపు, తళుకు.

క. బెళ్, బెళ, బెళ్పు, బెళతిగె, బెళంతిగె, బెళ్పగె, బిళ, బిళు, బిళి, బిళె, బిళపు, బిళ్పు. తెలుపు, ప్రకాశం, కాంతి, బెళర్పు. ప్రకాశవంతమైన తెలుపు ; తు. బొళు, బొళుంగరె, బొల్పి, బొళ్పరె, బొళ్పంతి. తెలుపు, ప్రకాశం, బొళ్కర. తెల్లని, బొళమె. తెల్లనివ్యక్తి, బొళ్ళు. తెలుపు, ప్రకాశం, మెరుపు, కాంతి, బొళ్పు. కాంతి, బెళగాపుని. మెరిపించు, మెరిసేటట్లు చేయు, బెళగు. ప్రకాశం, కాంతి ; త. వెళ్, వెణ్. తెల్లని, స్వచ్ఛమైన, ప్రకాశవంతమైన, వెళితు. తెల్లని, వెళుప్పు, వెళువెళుప్పు. తెలుపు, వెళువెళుప్-ఎణల్. మిక్కిలి తెలుపు, వెళ్పర్, వెళ్ళి. యార్. తెల్లని మనుష్యులు, నిజాయితీపరులు, విళక్కు. స్పష్టంచేయు, తేటతెల్లంచేయు ; మ. వెళి, వెళివు. కాంతి, స్వచ్ఛత, వెళుప్పు. తెల్లదనం, కాంతి, మెరుపు, ప్రకాశం, వెళ్ళ. తెల్లరంగు, తెల్లటి, శుభ్రమైన వస్త్రం, సత్యం ; కో. వెళ్. తెలుపు, సత్యం, వెళ్న్. నిజాయితీ, పరుడు ; తొ. పొళ్. తెలుపు, పొళ్ఫ. తెల్లగా ఉండు, పొళ్చ్. తెలుపు, కాంతి ; గోం. వేర్చ్. కాంతి, వెలుగు ; కువి. వెల్ల. తెలుపు ; పర్జి. విల్. తెలుపు. విలిద్. కాంతి ; కొలా. వెలెజ్, వెలుజ, వెలంగ్. కాంతి ; కురు. బిల్చనా. ప్రకాశించు, మెరయు, బిల్బివ్రా. మెరయు, బిళ్ళి. కాంతి ; మాల్తొ. బిల్బ్రె. ప్రకాశించు, మెరయు, బిల్పు. చంద్రుడు ; బ్రా. తూబె. చంద్రుడు.

<మూ.ద్రా. *వెళ్-/విళ్-.

వెలఁగఁబెట్టు స.క్రి. నిర్వాహకంచేయు, ఉద్ధరించు. < వెలుఁగు +-. అ[7] + పెట్టు. **వెలిఁగించు** స.క్రి. **1.** వెల్లించు, వెల్లజేయు. భార. ఆది. 1.7 ; **2.** వ్యాపింపచేయు. భార. ఆది. 3.47 ; **3.** ప్రసిద్ధికెక్కచేయు. భార. ఆది. 7.137 ; **4.** ప్రకాశింపచేయు, వెలగచేయు. ఆము. 4.83. <వెలుఁగు+-ఇంచు[3]. వెలుగద్దం వి. వెంకుటింటి కప్పులో వెలుతురుకై బిగించిన అద్దం. <వెలుఁగు+ అద్దము. వెలుఁగారు అ.క్రి. ప్రజ్వలించు. భార. భీష్మ. 2.176. <వెలుఁగు+ఆరు[1]. **వెలుఁగుకిటికీ** వి. గాలికిటికీ, వెలుతురుకోసం గోడల్లో ఎత్తున పెట్టే చిన్నకిటికీ. వెలుఁగుగూన రూ. యెలుగుగూన. వి. ఇంట్లోకి వెలుతురు రావటానికి లేక ఇంటిలోని పొగ బయటకి పోవటానికి ఇంటికప్పులో అమర్చిన మట్టివలయం. వెలుఁగుచు స.క్రి. వెలగచేయు, ప్రకాశింపచేయు. చెన్నబసవ. 3.383. వెలుఁగుదిడ్డము వి. గవాక్షం. వెలుతురుకోసం మిద్దెకప్పులో పెట్టినరంధ్రం. వెలుఁగుదొర వి. సూర్యుడు. రాజవా. 3.30. వెలుఁగురా వి. సూర్యుడు. అన్న రా.బాల. 47. వెలుగుతేఁడు వి. సూర్యుడు. వెలుఁగులదొర రూ. వెలుఁగుదొర. వి. సూర్యుడు. అచ్చ.బా. 4.61. వెలుఁగులయిక్క(-ఇక్క) వి. సూర్యుడు. కవిజనా. 3.78. వెలుఁగులయెకిమీఁడు(-ఎకిమీడు) వి. ద్విషాంపతి, సూర్యుడు. వెలుఁగులతేఁడు వి. సూర్యుడు, ద్విషాంపతి. కకుత్స్థ. 1.114. వెలుఁగొందు రూ. వెల్గొందు. అ.క్రి. **1.** ప్రజ్వరిల్లు, మండు. భార. విరా. 2.356 ; **2.** ప్రకాశించు. హరి.ఉ. 2.21. < వెలుఁగు + ఒందు. వెలుతురు[1] రూ. వెల్తురు[1]. వి. ఎండ. ఆము. 4.182 ; **2.** ప్రకాశం, వెలుగు. యయా. 4.4 ; **3.** ఒప్పు, చెన్ను, చెలువం.

**వెలుఁగుబంటి** చూ. వెలుఁగు. రూ.చూ. ఎలుగుబంటి. వి. భల్లూకం. ఎలుగుబంటి 'ఎలుగుబంటి'. శబ్దానికి కల్పించబడ్డ కృతక ప్రామాణిక రూపం.

**వెలుఁగుమంటి** చూ. వెలుఁగు. రూ.చూ. ఎలుగుబంటి. వి. వెలుగు బంటి, భల్లూకం. 'ఎలుగుబంటి' శబ్దానికి కల్పించబడ్డ కృతకప్రామాణిక రూపం.

**వెలు(గొందు** చూ. వెలు(గు.

**వెలుచ** రూ.చూ. వెల్చ. వి. పాము, సర్పం.

**వెలుచు¹** రూ. వెలియు. అ.క్రి. వానకురిసి నిలుచు. హర. 2.25.

**వెలుపు²** వి. వానకురిసి నిలవటం, వెలియటం హర. 2.23.

**వెలుచు²** స.క్రి. చిన్నపాత్రల్ని తోము.

**వెలుచు³** స.క్రి. 1. కదుళ్ళమీద ఉన్ననూలు వంటి కెక్కించు. లేదా రాట్నాలకు దబ్బాలు తగిలించి ఆ దబ్బాలకు నూలు చుట్టు ; 2. పోగులు విడదీయు.

వెలుపుడు వి. నూలు తోడటం. ఆం.భా. 2.286.

**వెలుచు⁴** రూ.చూ. వెల్చ. వి. సర్పం, పాము.

**వెలుచు⁵** చూ. వెలి¹ రూ.చూ. వెల్చు. స.క్రి. 1. తోలు. భార. ద్రోణ. 1.332 ; 2. రుజువుచేయు. స్థిరీకరించు. విజ్ఞా. 3.44 ; 3. వెదలచేయు, ద్రవింపచేయు. ఉ.హరి. 5.112 ; 4. (నూలు) తోడు.

**వెలుదు** అ.క్రి. వెలువడు, బయల్వెడలు. భార. అను. 5.185.

**వెలుతురు¹** చూ. వెలు(గు¹.

**వెలుతురు²** రూ.చూ. వెడతుఱు. వి. వేల్లంతరం, వృక్షవిశేషం.

వెలుతురుకట్టె వి. ఒకఅడవి చెట్టుకొమ్మ, దీన్ని పచ్చిగా ఉండగా వెలిగిస్తే చమురుపోసిన దివిటీలా వెలిగేకొమ్మ. **వెలుతురుచెట్టు** వి. గులాబిరంగు పూలుండే ఒకరకం చెట్టు.

**వెలుపించు²** చూ. వెలుపు¹.

**వెలుపు¹** రూ.చూ. వెదల్పు. వి. వెదల్పు. విస్తారం. కు.సం. 5.109 ; విశ. వెదల్పైనది. విస్తృతం. ద్వి.భాగ. 2.32.

**వెలుపించు²** స.క్రి. వెలుపుచేయు, వెల్పరుచు. విరివి చేయు. సారంగ. 1.126. < వెలుపు¹ + -ఇంచు³. **వెలుపు చేయు** స.క్రి. వెదల్పుచేయు.

**వెలుపు¹** చూ. వెలుచు¹.

**వెలుపుడు** చూ. వెలుచు³.

**వెలుమ** వి. ఒకరకంచెట్టు.

వెలుమసంధి వి. కాకజంఘ, పారావతి (Leea hirta).

**వెలుమనూర్లు** రూ. చూ. వెలమనూర్లు. వి.బ.వ. తెలికజాతిలో ఒక భేదం.

**వెలుము** రూ.చూ. వెలుగు. వి. మధ్యమధ్యపుల్లలు మెదిగిన కంచె.

**వెలుములు** వి.బ.వ. భూషణాలు. వేంక. పంచ. 1.603.

**వెలువరము** రూ. వెలవరము, వెల్వరము. వి. సస్యవిశేషం. విష్ణు పు. 3ఆ ; వి.బ.వ. ధాన్యవిశేషం. హంస. 4.128.

**వెలువు¹** రూ.చూ. వెలుగు. వి. ఆవరణం. ద.హిం.శా.సంపు. 5. శా.సం. 124. క్రి.శ. 1172.

**వెలువు²** రూ.చూ. వెలు(గు. వి. 1. ప్రకాశం ; 2. కిరణం ; 3. ఎండ.

**వెలువెలుక** చూ. వెలి².

**వెలువెలుక(బాఱు** చూ. వెలి².

**వెలువెల్ల** చూ. వెలి³.

**వెలెన్ను** చూ. వెలి².

**వెల్క(బాఱు** చూ. వెలి³.

**వెల్కులు** రూ.చూ. వెలికలు. అ.క్రి. వీపుకిందగు. నవనాథ. 3.217.2పం.

**వెల్గ** రూ. వెలం, వెలంగ, వెల(గ. వి. కపిత్థం, వృక్షవిశేషం, వెలగ చెట్టు. కేయూ. 4.62 (Feronica elephantum).

క. బెళల, బెళవల్, బెళవల, బేల, బలవల, బలోల. వెలగ ; త. వెళ్ళిల్, వెళ్ళియమ్, విళా, విళమ్, విళరి, విళవు, విళాత్తి. వెలగ ; మ. విళా. వెలగ ; పర్జి. పుల్లవిడ్‌జిమ్, వెలగ ;

పో. చూ. సం. బిల్వ-.

**వెల్గడు** వి. మెట్టనేల, వర్షంపడగానే భూమిని దుక్కి చేసి ఆవిధంగానే అదపాదదపా భూమిని అయిదు లేక ఆరు సార్లు దుక్కి చేయబడిన భూమి. తె.శా.కా శా. 50. క్రి.శ. 1311.

**వెల్గు¹** రూ.చూ. వెలు(గు. అ.క్రి. ప్రకాశించు. ఆము. 3.82.

వెల్గొందు రూ.చూ. వెలుగొందు. అ క్రి. ప్రకాశించు. భాగ. 4.181. < వెల్గు¹ + ఒందు.

**వెల్గు²** రూ.చూ. వెలుగు. వి. కంచె, పశువులు మొ. వి. దూరకుండా చేసి చుట్టూ కంపతో ఏర్పరచిన ఆవరణం.

కొ. బెలి. కంచె ; తు. బేలి కంచె, ప్రహరీగోడ ; త. వేలి. కంచె, గోడ ; మ. వేలి. కంచె, ఇంటిప్రహరి.

**వెల్గొఱుగు** చూ. వెలి².

**వెల్గొందు** చూ. వెల్గు¹.

**వెల్చ** రూ. వెలుచ, వెలుచు⁴. వి. సర్పం, పాము. ముమ. 3.62.

**వెల్చు** రూ. వెలుచు⁵. స.క్రి. 1. (నూలు) తోడు. కు.సం. 8.135 ; 2. వెదలించు. భార. విరా. 5.33 ; 3. తోలు. భార.కర్ణ. 2.82.

పర్జి. వలిప్ - (వలిత్-). పారదోలు. తోలు.

**వెల్చె¹** రూ.చూ. వెలిచె¹ వి. వృక్షవిశేషం.

**వెల్చె²** రూ.చూ. వెలిచె². వి. ఒకజాతిపిట్ట, వర్తకపక్షి. భల్లా. 3.

**వెల్తి** రూ.చూ. వెలితి. వి. న్యూనత, కొరత. హరి. ఉ. 5.251 ; విశ. న్యూనత, తక్కువైన. భీమ. 3.46.

**వెల్తినేత** రూ. ఎల్తినేత. వి. పేకపోగులు కలవకుండా విడివిడిగా కనిపించేటట్లు నేసిననేత. **వెల్తియగు(-అగు)** అ.క్రి. తక్కువఅగు. పారి. 1.9. **వెల్తిసేయు(-చేయు)** స.క్రి. తక్కువపరచు. చెన్నబసవ. పీఠి. 85.

**వెల్తురు¹** రూ.చూ. వెలుతురు¹. వి. 1. ప్రకాశం. రాజవా. 4.118 ; 2. ఎండ ; 3. చెలువం.

**వెల్తురుకిటికీ** వి. గాలికిటికీ, వెలుతురుకోసం గోడల్లో ఎత్తునపెట్టే చిన్నకిటికీ. **వెల్తురుగూడు** వి. గవాక్షం, వెలుతురు కోసం మిద్దెకప్పులో పెట్టిన రంధ్రం. **వెల్తురుగూన** వి. వెలుతురుకోసం గోడలో 'ం' రూపంలో బిగించిన గూన పెంకులు. **వెల్తురుపొక్క** వి. గవాచి, గోడలో పెట్టిన రంధ్రం, చువ్వలు లేని కిటికీ.

**వెల్తురు²** రూ.చూ. వెడతుఱు. వి. వంటచెరకుగా ఉపయోగపడే ఒకరకం కలపనిచ్చే చెట్టు (Dichrostachys cinerea).

**వెల్ది** రూ.చూ. వెలితి. వి. 1. అములోని కందిపొయ్యి.

పైపొయ్యికి మధ్యఉన్న కాళీ ; 2. రాళ్ళవరసల మధ్య ఉన్నస్థలం.

**వెల్దు** రూ.చూ. వెలితి. వి. రాళ్ళవరసల మధ్యఉన్నస్థలం.

**వెల్నా(డు** రూ.చూ. వెలనా(డు. వి. దేశవిశేషం.

**వెల్నె(ద్రాకు** వి. వెన్నెదురు, నీటివారలపెరిగే ఒకరకం పాకుడు కలుపుమొక్క, వెన్నదేలికూర (Commelyna communis).

**వెల్పట్టు** చూ. వెలు-.

**వెల్పల** చూ. వెలు-.

**వెల్పలించు** చూ. వెలు-.

**వెల్పు** చూ. వెల్ల[1]. వి. తెల్లదనం. కు. సం. 8.105.

**వెల్పెట్టు** చూ. వెలు-.

**వెల్మ** రూ.చూ. వెలమ[1]. వి. శూ(ద్రజాతిలో ఒకఅవాంతరశాఖ ఆశాఖకు చెందినవారు.

**వెల్మిడి** రూ.చూ. వెలిమిడి. వి. బూడిద, భస్మం. మను. 2.10 ; 2. విభూతి. పాండు. 5.186.

**వెల్ల[1]** వి. 1. సున్నం. బసవ. 6.279 ; 2. తెలుపు ; 3. తెల్లపూత, సున్నం పాలపూత, సున్నపు నీటితోగోడలమీద పూసినపూత ; విశ. తెల్లనిది, ధవళం. భార. విరా. 4.243, హరి. పూ. 6.85.

క. బెళ్, బెళు, బెళ, బెళుపు, బెళ్పు, బెళతి, బెళతిగె, బెళంతిగె, బెళ్పగె, బిళ, బిళు, బిళి, బిళె, బిళపు, బిళుపు, బిళ్పు. తెల్లదనం, బెళ్ల్. (ప్రకాశవంతమైన తెలుపురంగు ; తు. బొళు బొళుంగరె, బొళ్పు, బొళ్పరె, బొళ్పంతి. తెల్లని, కాంతిమంతమైన, త. వెణ్, వెళ్. తెల్లని, స్వచ్ఛమైన, (ప్రకాశంగల, వెళ్పు, వెళ్ప. తెల్లదనం ; మ. వెళి, వెళివు. కాంతి. స్వచ్ఛత, వెళ్ప. తెల్లరంగు ;
పో. చూ. వలక్ష-. తెల్లనిది, తెలుపు.
<మూ.(ద్రా. *వెళ్. /విళ్.

**వెల్లగజము** వి. ఐరావతం. సమీర. 1.67. **వెల్లగడ్డ** రూ.చూ. వెల్లిగడ్డ. వి. తెల్లఉల్లి. **వెల్లగిసె** వి. ఒకరకం పైరు. హంస. 4.127. <వెల్ల[1]+అగిసె. **వెల్లగుడుము** వి. ఒకరకమైనబేకు. **వెల్లగుఱ్ఱము** వి. ఉచ్చైః(శ్రవం. **వెల్లగొమ్ములమెకము (-కొమ్ముల మెకము)** వి. ఏనుగు, **వెల్లగొరు** వి. ఐరావతం, వెల్లనిఏనుగు. ఉ.రా. 5.208. **వెల్లగొరుమావటీ(డు** వి. దేవేం(ద్రుడు. **వెల్లచలుచు** అ.(క్రి. సున్నం పూయు. **వెల్లచలుపు** వి. సున్నంపూత. **వెల్లజక్కి** వి. 1. ఉచ్చైః(శ్రవం ; 2. తెల్లగుఱ్ఱం .**వెల్లజక్కిసామి** వి. దేవేం(ద్రుడు, ఉచ్చైః(శవోధిపతి. **వెల్లజక్కిసామిబెం.** వి. స్వర్గం. **వెల్లజాలు** వి. ఆకాశగంగ. **వెల్లజాల్లలవీడు** వి. స్వర్గం. వ్యు. ఆకాశగంగ కల స్థానం. **వెల్లజాల్వీడు** వి. స్వర్గం. **వెల్లజిగిపులు(గు** రూ.చూ. వెల్లజిగిపల్గు. వి. హంస. **వెల్లజిగిపుల్గు** రూ. వెల్లజిగి పులు(గు. వి. హంస శ్వేతగరుత్తు. ఉ.రా. 5.12. **వెల్లటేను(గు** వి. ఐరావతం, తెల్లనిఏనుగు. దశా. 2.18. <వెల్ల[1]+ఏనుగు. **వెల్లడాల్పద(తి** వి. సర్వశుక్ల, సరస్వతి. **వెల్లడాల్వీడు** వి. స్వర్గం. **వెల్లదమ్మి(-తమ్మి)** రూ.చూ. వెలిదమ్మి. వి. తెల్లతామర, పుండరీకం. **వెల్లదీవి** వి. శ్వేతద్వీపం. ఆము. 6.84. **వెల్లన** రూ.చూ. వెలన. వి. తెలుపు, ధావళ్యం, వెలవెలబాటు, వివర్ణత. **వెల్లనగు** అ.(క్రి. తెల్లనగు వెలవెల పోవు. భార. అరణ్య. 6.244. <వెల్లన+అగు. **వెల్లని** విశ. తెల్లని. **వెల్లనిఅప్పము** వి. బెల్లంతో వండినఅప్పం. ద. హిం. శా సంపు. 6. శా. సం. 845. (క్రీ.శ. 1273. **వెల్లనిడాల్గలయింతి(-ఇంతి)** వి. సరస్వతి **వెల్లనిడాల్పరద(తి** వి. సర్వశుక్ల. సరస్వతి. **వెల్లనిడాల్వీడు** వి. స్వర్గం **వెల్లనివేద్యము** వి. బెల్లం. నైవేద్యం, ద.హిం. శా. సంపు. 6. శా. సం. 845. (క్రీ.శ. 1.273. **వెల్ల(దనము** వి. 1. తెల్లదనం, వెలవెలపాటు. భార. విరా. 2.106 ; 2. స్వచ్ఛత, నిర్మలత్వం. భీమ. 2.134 ; 3. దైన్యం. పద్మ. 10.34. **వెల్లపుట్టము** వి. తెల్లనివస్త్రం. ద. హిం. శా. సంపు. 4. శా. సం. 1034. (క్రీ.శ. 1038. **వెల్లపోలిక** వి. క్షు(ద్రజలచరం. **వెల్లముత్తైదువ** వి. సరస్వతి. **వెల్లమొదవు** వి. తెల్లనిఆవు, కామధేనువు. ఉ.రా. 3.388. **వెల్లమోర పులు(గు** రూ.చూ. వెల్ల మోరపుల్గు. వి. గరుత్మంతుడు. **వెల్లమోరపుల్గు** రూ. వెల్లమోర పులు(గు. వి. గరుత్మంతుడు. **వెల్ల(బాటు(-పాటు)** వి. తెల్లనవ్వటం, తెల్లదనం. కవిక. 4.186. **వెల్ల(బాఱు(-పాఱు[3])** అ.(క్రి. తెల్లపడు, వెలవెల పోవు. హరి. ఉ. 3 180. **వెల్ల(మాను** వి. కవృక్షం. **వెల్లయెలుక( ఎలుక)** రూ. వెల్లెలుక. వి. తెల్లఎలుక. మను. 4.25. **వెల్లయేను(గు(-ఏను(గు)** రూ. వెల్లయేన్గు. వి. 1. ఐరావతం ; 2. తెల్లఏనుగు. **వెల్లయేన్గు(-ఏన్గు)** రూ.చూ. వెల్లయేను(గు. వి. 1. ఐరావతం ; 2. తెల్ల ఏనుగు. **వెల్లయొదలితే(డు** వి. బలరాముడు. వ్యు. తెల్లశరీరం కలరాజు. <వెల్ల[1]+ఒడలు+-ఇ[3]+ తే(డు. **వెల్లవాపువము** వి. ఉచ్చైః(శ్రవం. వెలిమావు. దశా 2.226. **వెల్లవాఱు(-పాఱు[3])** అ.(క్రి. వెలనగు, వెలవెలబోవు. కేయూ. 4.188. **వెల్లవే(గు** అ.(క్రి. పూర్తిగా తెల్లవారు. **వెల్లవేయు** అ.(క్రి. (గోడలకు) సున్నంపూయు. **వెల్లవోవు(-పోవు)** అ.(క్రి. తెల్లపడు. ద్వి. పరమ. వి. 2.66. **వెల్లసీరలు(-చీరలు)** వి.బ.వ. తెల్లనివస్త్రాలు. ద. హిం. శా. సంపు. 5. శా. సం. 1172. (క్రీ.శ. 1293. **వెల్లసున్నము** వి. గోడకు కొట్టటంకోసం కలిపినసున్నం. **వెల్లెడ్లు** వి.బ.వ. తెల్లని ఆడపశువులు. (మేకలు, గొ(రెలు మొ.వి). ఈఅర్థంలో (ప్రాచీనకాననాల్లో మాత్రమే కనిపిస్తోంది. ద.హిం. శా. సంపు. 6. శా. సం. 109. (క్రీ.న. 1076. <వెల్ల[1]+ ఎడ్లు. **వెల్లెలుక** రూ.చూ. వెల్లయెలుక. వి. తెల్లఎలుక.

**వెల్ల[2]** వి. తెరచిఉండటం, బట్టబయలు.

త. వెళ్ళిప్పు. బయలు, బాహ్య(ప్రదేశం ; మ. వెళి, బహిర్దేశం.

**వెల్లడి[1]** వి. 1. తెరచిఉంచటం, బట్టబయలు ; 2. సందు, రాళ్ళవరసలమధ్య ఉన్నస్థలం. **వెల్లడిచేయు** స.(క్రి. తెలిసేటట్లు చేయు. **వెల్లడించు** స.(క్రి. వెల్లడిచేయు. (ప్రకటించు. **వెల్లడిపఱచు** రూ.చూ. వెల్లడిపఱుచు. స.(క్రి. తెలిసేటట్లుచేయు. **వెల్లడిపఱుచు** రూ. వెల్లడిపరచు. స.(క్రి. తెలిసేటట్లు చేయు. **వెల్లాటకత్తియ** రూ. వెల్లాటకత్తె,

వెల్లాటపుకత్తియ, వెల్లాటపుకత్తె. వి. **1.** వేశ్య. విప్ర. **5.78; 2.** జారస్త్రీ. త. వెళ్ళాట్టి. పనిమనిషి, ఉంపుడుకత్తె మ. వెళ్ళాట్టి. మంత్రసాని, పనిపిల్ల. < వెల్ల[2] + ఆటకత్తియ. **వెల్లాటకత్తె** రూ.చూ. వెల్లాటకత్తియ. వి. **1.** జారస్త్రీ. శుక. 1.816 ; **2.** వేశ్య. **వెల్లాటకము** రూ. వెల్లాటము. వి. ప్రసిద్ధి. భీమ. 1.88. **వెల్లాటపుకత్తియ** రూ.చూ. వెల్లాటకత్తియ. వి. వేశ్య. **వెల్లాటపుకత్తె** రూ.చూ. వెల్లాటకత్తియ. వి. వేశ్య. **వెల్లాటము** రూ.చూ. వెల్లాటకము. వి. వెల్లడి, ప్రసిద్ధి. **వెల్లావుఁగత్తియ** రూ.చూ. వెల్లావుఁగత్తె. వి. వేశ్య. **వెల్లావుఁగత్తె** చూ. వెల్లాటకత్తియ. రూ. వెల్లావుఁగత్తియ. వి. స్వైరిణి. మల్ల. 2.84.

**వెల్లకిల** చూ. వెల్లకిలు.

**వెల్లకిలఁబడు** చూ. వెల్లకిలు.

**వెల్లకిలు** రూ.చూ. వెలికిలు అ.క్రి. **1.** వీపుకిందగా పరుండు ; **2.** వెలికిలబడు, ఉత్తానమగు.

**వెల్లకిల** రూ.చూ. వెలికిల. క్రి.విశే. ఉత్తానంగా. < వెల్లకిలు + -అ[7]. **వెల్లకిలఁబడు** రూ.చూ. వెలికిలఁబడు. అ.క్రి. వీపు కింద అయ్యేట్లుపడు. < వెల్లకిలు + -అ[7] + పడు.

**వెల్లంకి** రూ.చూ. వెల్లఁకి. వి. గడ్డ, వేరు, దుంప. రం.రా.యు. 286. 8పం.

**వెల్లఁకి** రూ. వెల్లంకి. వి. గడ్డ, దుంప. కుసం. 6.35.

**వెల్లడి[2]** రూ. ఎల్లడి[2]. వి. వెడల్పు, పొట్టిగా ఉండేవైపు. దాని కొలత.

**వెల్లడిపట్టి** రూ. ఎల్లడిపట్టి. వి. దూలంమీద వేసిన ముట్టె, పట్టెమీద వేసేపట్టె.

**వెల్లమద్ది** వి. వ్యవసాయ పనిముట్ల తయారీలో, బండ్ల తయారీలో గృహ నిర్మాణానికి దీనికలపను ఉపయోగిస్తారు (Anogeissus latifolia).

**వెల్లల** రూ. వెళ్లాల. వి. తమిళుల్లో ఒకజాతి.

త. వెళ్ళాళన్. వేళాళ జాతిమనిషి, వేలాళన్. ఉదారబుద్ధి కలమనిషి. వేళాళ్. ఒకజాతి, వేళాళజాతి మనిషి, వైశ్యుడు, శూద్రుడు.

< త. వేళాళ.

**వెల్లాటకత్తియ** చూ. వెల్ల[2].

**వెల్లాటకత్తె** చూ. వెల్ల[2].

**వెల్లాటకము** చూ. వెల్ల[2].

**వెల్లాటపుకత్తెయ** చూ. వెల్ల[2].

**వెల్లాటపుకత్తె** చూ. వెల్ల[2].

**వెల్లాటము** చూ. వెల్ల[2].

**వెల్లావుఁగత్తియ** చూ. వెల్ల[2].

**వెల్లావుఁగత్తె** చూ. వెల్ల[2].

**వెల్లాయి** రూ. వెళ్లాయి. వి. (బట్టలకు) గంజిపెట్టటం, చలవ చేయటం.

**వెల్లి[1]** రూ. వెల్లుక, వెల్లువ. వి. **1.** పరంపర. భార. ఉద్యో. **4.342 ; 2.** ప్రవాహం. భార. శాంతి. 1.262.

తు. బొళ్ళ. వరద, ప్రవాహం ; త. వెళ్ళమ్. ప్రవాహం, సముద్రం, కెరటం, నీరు : మ. వెళ్ళమ్. నీరు.

**వెల్లికొలుపు** రూ.చూ. వెల్లిగొలుపు. స.క్రి. **1.** వెల్లువ వచ్చి ముంచు ; **2.** ప్రవహింపచేయు ; **3.** వ్యాపింపచేయు ; అ.క్రి. ఆనందం చేయు. **వెల్లికొల్పు** రూ.చూ. వెల్లిగొలుపు. స.క్రి. **1.** వెల్లువ వచ్చిముంచు ; **2.** ప్రవహింపచేయు ; **3.** వ్యాపింపచేయు ; అ.క్రి. ఆనందంచేయు. **వెల్లిగొను (-కొను)** అ.క్రి. **1.** ప్రవహించు. కుసం. **5.84 ; 2.** అతిశయించు. హరి. పూ. 7 63 ; **3.** మునుగు, మగ్నమగు. శివరా. 1.51 : **4.** పరంపరగా వెడలు. పారి. 5.16 ; **5.** వ్యాపించు, పచరించు. కవిక. 6.180. **వెల్లిగొలుపు (-కొలుపు)** రూ. వెల్లికొలుపు, వెల్లికొల్పు, వెల్లిగొల్పు. స.క్రి. **1.** ప్రవహింపచేయు. భార. విరా. 5.78. **2.** పరంపరగా వెడలించు. హరి. ఉ. **2.51 ; 3.** వ్యాపింపచేయు. వరాహ. **3.11 ;** అ.క్రి. ఆనందం చేయు. **వెల్లిగొల్పు** రూ.చూ. వెల్లిగొలుపు. అ.క్రి. **1.** పరంపరగా వెడలివచ్చు. భాస్క. రా.యు. 1480 ; **2.** ప్రవహింప చేయు ; **3.** వ్యాపింప చేయు ; అ.క్రి. ఆనందం చేయు. **వెల్లిఁగలిపిన చింతపండు** వి. ప్రవాహంలో కలిపిన చింతపండు, నిష్ఫలం. కాశ. **3.111. వెల్లిజల్లు (-చల్లు)** స.క్రి. చెరచు, పాడుచేయు. జాహ్నవి. **3.12.** **వెల్లితల** వి. ప్రవాహపు పురోభాగం, ప్రవాహనికి ముందరి భాగం. విప్ర. 2 18. **వెల్లిదొట్టు (-తొట్టు)** అ.క్రి. అతిశయించు. కవిక. **6.182. వెల్లిపొదుచు** రూ.చూ. వెల్వొదుచు. అ.క్రి. **1.** ప్రవహించు. హరి. పూ. **3.90 : 2.** ఉప్పొంగు. మను. **3.9. వెల్లిఁబోవు (-పోవు)** అ.క్రి. వ్యర్థమగు, నిష్ఫలమగు. ఉ. హరి. **4.300. వెల్లివడు (-పడు)** అ.క్రి. ప్రవాహమగు. వేంక. పంచ. 1.255. **వెల్లివాఱు(-పాఱు[2])** అ.క్రి. ఎడతెగక ప్రవహించు, అతిశయించు. వరాహ. 7.31. **వెల్లివిరి** విశే. వెల్లడైనది. ప్రకటితం. ఉ. హరి 5.198. త. వెళిచ్చమ్. ప్రచారం ; మ. వెళిచ్చమ్. ప్రచారం. **వెల్లివిరియు** రూ. వెలివిరియు. అ.క్రి. **1.** ఉబుకు, ఉప్పొంగు. భార. విరా. 2.146 ; **2.** వ్యాపించు. భాస్క. రా.యు. 495 ; **3.** ప్రవహించు. హార. **4.57 ; 4.** చెదరి పోవు. భాగ. 10పూ. 764 ; **5.** వృద్ధిపొందు, అతిశయించు. వేంక. పంచ. **1.530 ; 6.** వెల్లడగు, ప్రకటితమగు. అచ్చ. రా.యు. 500. **వెల్లివిరిసేయు (-చేయు)** స.క్రి. ప్రకటించు. భార. శాంతి. 6.208. **వెల్లిపీఁగు** అ.క్రి. అతిశయించు. మిక్కుటమగు. కృ.శత. 2.124. **వెల్లివొదుచు (-పొదుచు)** రూ.చూ. వెల్వొదుచు. అ.క్రి. **1.** ప్రవహించు. పాండు. **2.152 ; 2.** అతిశయించు ; **3.** మునుగు ; **4.** పరంపరగా వెడలు ; **5.** వ్యాపించు. **వెల్లిసూపు (-చూపు)** అ.క్రి. ప్రవహించు. కుసం. 9.56. **వెల్వొదుచు** రూ. వెల్లిపొదుచు, వెల్లివొదుచు. అ.క్రి. పొంగు. కాశీ. 5.112. < వెల్లి[1] + పొదుచు.

**వెల్లి[2]** చూ. వెలి[2]. రూ. వెల్లిక[2] వి. తెలుపు, శుక్లవర్ణం ; విశే. తెల్లనిది, ధవళం, శుక్లం.

క. బెళ్లి. తెలుపు ; త. వెళ్లై.

**వెల్లిగడ్డ** రూ. వెల్లగడ్డ. వి. తెల్లఉల్లి. **వెల్లిగుల్ల** వి. శం.

వెల్లిపాయి వి. తెల్లగడ్డ. వెల్లిమెకము వి సింహం. కకుత్స. 4.59. వెల్లుల్లి వి. తెల్లఉల్లిగడ్డ, లశునం. భీమ. 4.130. <వెల్లి[2] + ఉల్లి.

వెల్లిక[1] రూ.చూ. వెల్లి[1]. వి. ప్రవాహం. వసు. 4.52.

వెల్లిక[2] చూ. వెలి. రూ.చూ. వెల్లి[2]. వి. తెలుపు, శుక్లవర్ణం. విశ. తెల్లనిది, ధవళం, శుక్లం.

వెల్లుక రూ.చూ. వెల్లి[1]. వి. 1. పరంపర ; 2. ప్రవాహం.

వెల్లుడు రూ. ఎల్లుడు. వి. తొక్కుడు, గోడకట్టేటప్పుడు మును ముందు పెంచుకోవటానికి ఆనవాలుగా ముందుకు పొడు చుకొని వచ్చేటట్లు పేర్చిన పెచ్చురాయి.

వెల్లుల్లి చూ. వెల్లి[2].

వెల్లువ రూ.చూ. వెల్లి[1]. వి. 1. ప్రవాహం. భార. భీష్మ. 2.44, 45 ; 2. బృందం, మంద. భాగ. 9.36 ; 3. వాహిని, సేన. యయా. 3.28 ; 4. పరంపర. కవిక. 2.207; 5. ఇటిక గోడల ఇంటిచూరు ; 6. ఎక్కువగా ఉండటం.

వెల్లువకట్ట వి. పొల్లు కట్ట. వెల్లువగట్టు (-కట్టు) అ.క్రి. 1. ధారా రూపంగా స్రవించు. మను. 5.38 ; 2. మడుగు కట్టు. కాను. 2.60. వెల్లువపెట్టు రూ. వెల్లువవెట్టు. అ.క్రి. ధారారూపంగా స్రవించు. దశా. 2.308. వెల్లువలుకట్టు స.క్రి. ప్రవహించు, మడుగుకట్టు. పారి. 2.53. వెల్లువ వెట్టు (-పెట్టు) రూ.చూ. వెల్లువపెట్టు. అ.క్రి. ధారారూపంగా స్రవించు.

వెల్లెకి వి. వృక్షవిశేషం, ఒకానొకచెట్టు.

వెల్లెకిమ్రాను వి. వృక్షవిశేషం. E.I. సంపు. 5.శా. సం. 10. క్రీ.శ. 1102.

వెల్లెర్లు చూ. వెల్ల[1].

వెల్లెలుక చూ. వెల్ల[1].

వెల్వ వి. సంఖ్యావిశేషం, ఒకానొకలెక్క. సీతావి. 2.32.

వెల్వడము రూ.చూ. వెలువడము. వి. సస్యవిశేషం. రసిక. 1.48.

వెల్వడు చూ. వెలు-.

వెల్వరించు చూ. వెలు-.

వెల్వఱచు చూ. వెలు-.

వెల్వఱించు చూ. వెలు-.

వెల్వఱుచు చూ. వెలు-.

వెల్వుచు చూ. వెలు-.

వెల్వెల చూ. వెలి[2].

వెల్వెలచేయు చూ. వెలి[2].

వెల్వెలన చూ. వెలి[2].

వెల్వెలనగు చూ. వెలి[2].

వెల్వెలనబాఱు చూ. వెలి[2].

వెల్వెలబాఱు చూ. వెలి[2].

వెల్వెలబోవు చూ. వెలి[2].

వెల్వెలుకబాఱు చూ. వెలి[2].

వెల్వెల్ల చూ. వెలి[2].

వెల్వెల్లబాటు చూ. వెలి[2].

వెల్వొడుచు చూ. వెల్లి[1].

వెళకు రూ.చూ. వెళసు. వి. విలాసం.

వెళలు రూ చూ. వెలఁడు. అ.క్రి. వెడలు. కువ చ. 2.115.

వెళసు రూ. వెళకు, వెఱుకు. వి. విలాసము. ఆం.భా. 1.139. సం. విలాస – లీల.

<సం. విలాస-.

వెఱుకు రూ.చూ. వెళసు. వి. విలాసం. ఆం.భా. 1.139.

వెఱుపు రూ.చూ. వెదల్పు. వి. వెడల్పు. వైజ. 3 136.

వెల్పు రూ.చూ. వేల్పు. వి. దేవత, దైవం.

వెళ్లగాయు చూ. వెళ్ల.

వెళ్లగొట్టు చూ. వెళ్ల.

వెళ్లగ్రక్కు చూ. వెళ్ల.

వెళ్లజల్లు చూ. వెళ్ల.

వెళ్లనంపు చూ. వెళ్ల.

వెళ్లనాడించు చూ. వెళ్ల.

వెళ్లనాడు చూ. వెళ్ల.

వెళ్లనీఁదు చూ. వెళ్ల.

వెళ్లదన్ను చూ. వెళ్ల.

వెళ్లడీయు చూ. వెళ్ల.

వెళ్లదోయు చూ. వెళ్ల.

వెళ్లబడు చూ. వెళ్ల.

వెళ్లబెట్టు చూ. వెళ్ల.

వెళ్లబొడుచు చూ. వెళ్ల.

వెళ్లబోసికొను చూ. వెళ్ల.

వెళ్లవిడుచు చూ. వెళ్ల.

వెళ్లాయి రూ.చూ. వెల్లాయి. వి. గంజిపెట్టటం, చలవచేయటం (బట్టలకు).

వెళ్లాల రూ.చూ. వెల్లల. వి. 1. గాణాపోరుతైన మొదలి యార్లు ; 2. కృషికులు.

వెళ్లించు చూ. వెళ్ల.

వెళ్లిపోవు చూ. వెళ్ల

వెళ్ల రూ.చూ. వెలఁడు. అ.క్రి. 1. బయలుదేరు. భాగ. 10ఉ. 844 ; 2 బయలువెడలు. వరాహ. 1.6 ; 3. పోవు. వరాహ. 4 35 ; 4 కడచు, అతిక్రమించు, వరాహ. 7.7 ; 5. పుట్టు, మొలచు. రుక్మాం.చ. 5.123 ; 6. పైకివచ్చు సారంగ. 2.233.

వెళ్లగాయు స.క్రి నోటినుంచివదులు. <వెళ్ల+-అ[7] +కాయు. వెళ్లగొట్టు స.క్రి. 1. వెళ్లిపోయేట్టుచేయు. పల్నా.పు. 449 ; 2. విడిపించు. <వెళ్ల+-అ[7]+కొట్టు[1] వెళ్లగ్రక్కు స.క్రి. వెడలగ్రక్కు, బయటికిప్రసరింపచేయు. ఉ.రా. 6.235. <వెళ్ల+-అ[7]+క్రక్కు. వెళ్లజల్లు స.క్రి. పారజల్లు. దశా. 3.172. <వెళ్ల+-అ[7]+చల్లు. వెళ్లనంపు స.క్రి. జాతరఅయిన తర్వాత అగ్రామదేవతను ఊరిపొలి మేరకు తీసుకొనిపోయి వెలిమొగంపెట్టిఉంచి తలపగల గొట్టివచ్చు; అ.క్రి. ఇష్టంలేనివారిని పంపివేయు. <వెళ్ల +-అ[7]+అంపు. వెళ్లనాడించు స.క్రి. స్పష్టంగా పలికించు. ప్రభా. 4.31. <వెళ్ల+-అ[7]+ఆడించు. వెళ్లనాడు అ.క్రి. స్పష్టంగాచెప్పు. <వెళ్ల+-అ[7]+ఆడు. వెళ్లనీఁదు స.క్రి. దాటు, కడచు. <వెళ్ల-అ[7]+-ఈఁదు. వెళ్లదన్ను

న.క్రి. వెళ్ళగొట్టు, తరిమివేయు. ఆం.భా. 3.119. <వెళ్లు +-అ[7]+తన్ను. వెళ్లఁదీయు చూ. వెలి. న.క్రి. బయటకు తీయు. తాళ్ల.సం. 8.195. <వెళ్లు+-అ[7]+తీయు. వెళ్లఁదోయు న.క్రి. బయటకుగెంటు. తాళ్ల.సం. 10.61. <వెళ్లు+-అ[7]+త్రోయు. వెళ్లఁబడు(-పడు) అ.క్రి. 1. బయలుపడు. వరాహ. 12.85; 2. (పర్యాదులు) ప్రవ వించు. <వెళ్లు+-అ[7]+పడు. వెళ్లఁబెట్టు న.క్రి. పైకి ప్రసరింపచేయు, వ్యాపించు. నిరంకు. 4.91. <వెళ్లు+-అ[7]+పెట్టు. వెళ్లఁబొడుచు న.క్రి. ఈవలనుండి ఆవలకు దూరిపోయేట్లు పొడుచు. కువ.చ. 2.176. <వెళ్లు+-అ[7] + పొడుచు[1]. వెళ్లఁబోసికొను అ.క్రి. తనదుఃఖాన్ని ఒకరి ముందు కథలాచెప్పుకొని ఏడ్చు. <వెళ్లు+పోయు+-ఇ[3] +కొను. వెళ్లవిడుచు న.క్రి. తోలు. తాళ్ల నం. 6.126. <వెళ్లు+-అ[7]+విడుచు. వెళ్లించు న.క్రి. 1. వెడలచేయు, వెడలఁకక్కు. భాగ. 4.92; 2. పోఁజేయు. తీర్చుకొను. గౌ.హరి.ఉ. 990పం. <వెళ్ళు+-ఇంచు[3] వెళ్లిపోవు స.క్రి. 1. వెడలిపోవు; 2. చనిపోవు. <వెళ్ళు+-ఇ[3]+పోవు.

**వెవదానము** వి. తెరపి.

సం. వ్యవదాన - అడ్డు, విరోధం.

<సం. వ్యవదాన-.

**వెవరణకాలము** వి. అధికారసమయం. ద.హిం.గా. నంపు. 5. గా.సం, 1205.

సం. వ్యవహరణ – వ్యవహారం, వ్యవహరించటం కాల – నమయం; ఒ. బెహరణ, నాయకత్వం, యాజమాన్యం.

<సం. వ్యవహరణ-+సం. కాల-.

**వెవసాయము** వి. కృషి. తాళ్ల.సం. 9.175.

సం. వ్యవసాయ – కృషి.

<సం. వ్యవసాయ-.

**వెవహారము** వి. వ్యాపారం.

సం. వ్యవహార – నడవడి, పని, వృత్తి, వ్యాపారం, వాణిజ్యం, వర్తకం, ఆచారం, తగవు.

<సం. వ్యవహార-.

**వెవ్వెఅలాడు(-ఆడు)** అ.క్రి. వెవె అని అధిక్షేపించు. పండి.చ, 5.871పు.

**వెవ్వేరు** వి. మిక్కిలి వేరైనది.

<వేఱు+వేఱు.

**వెస** చూ. వీచు. వి. వేగం. భార. ఉద్యో. 1.37; క్రి. విశ ద్రు. శీఘ్రంగా, వేగంగా. విక్ర. 1.86.

సం. వాజి-. సీఱు, వేగం, విచి-.తరంగం.

**వెసనము** వి. వ్యసనం, కామక్రోధాదులవల్ల కలిగేదోషం. హంస. 1.218.

సం. వ్యసన–. అపద, కష్టం, నాశం, దురభ్యాసం, అమితాభ్యాసం. ప్రా. వసణ-, విపత్తు, దుఃఖం, రాజాది కృతమైన ఉపద్రవం, వసణీ. వ్యసనం కల వాడు; అ.మా. వసణ-. నొప్పి, దుఃఖం, బాధ, నాశం, నష్టం;

క. బసవ, బెసవ, మెసవ, వెపన. ఆపద, దుర దృష్టం, నాశం, పరాజయం; మ. విసనం. వ్యసనం.

నం. వ్యసన-.

**వెసరు** రూ.చూ. వెసల. వి. 1. వంటపాత్ర, కుండ; 2. తపేలా.

**వెసల** రూ. వెసరు, వెసలె. వి. 1. వంటపాత్ర. కుండ. సిం. ద్వా. 3.45; 2. తపేలా.

**వెసలిచ్చు** చూ. వెసులు. అ.క్రి. చేయూతనిచ్చు, సాయపడు. ఉ.హరి. 4.50.

**వెసలె** రూ.చూ. వెసల. వి. 1. వంటపాత్ర, వెడల్పుమూతిగల చిన్న మట్టిపాత్ర; 2. తపేలా.

**వెసురు** చూ. ఎసరు. వి. 1. వేడి, వెట్ట. తాళ్ల.నం. 13.44; 2. ఊర్పు.

**వెసులు** విశ. వీలైనది.

వెసులుబాటు(-పాటు) వి. 1. వీలు; 2. తీరిక, తీరు బాటు.

**వెహరణము** వి. పరిపాలన. వి. 1. నంపు. 5.గా.సం. 4. క్రి. శ. 1309.

నం. వ్యవహరణ-. వ్యవహారం. వ్యవహరించటం; ఒ. బెహరణ. నాయకత్వం, యాజమాన్యం.

<సం. వ్యవహరణ-.

**వే[1]** రూ.చూ. వెయి. సర్వ. 1. వేయి, సహస్రం, అనేకం, పెక్కు. భార. ఆది. 6.190. ద.హిం. గా.నంపు. 10. గా. నం. 365, నె.శా. పొడిలి. 1155; 2. పెక్కు.

వేగంటి చూ. కన్ను. వి. దేవేంద్రుడు, సహస్రాక్షుడు. రామాభ్యు. 6.104. వేగంటికచేరి రూ.చూ. వేగంటిక చ్చేరి. వి. 1. స్వర్గం; 2. సుధర్మ. దేవసభ. వేగంటికచ్చేరి రూ. వేగంటికచేరి. వి. 1. స్వర్గం. సాంబ. దేవ. 18; 2. దేవసభ. సుధర్మ. వేగంటికొమరుఁడు వి. అర్జునుడు, ఇంద్రునికొడుకు. సాంబ. దేవ. 16. వేగంటిగొంగ వి. రాక్షసుడు, దేవతలశత్రువు. వేగంటిజక్కి వి. ఉచ్చైః శ్రవం. వేగంటినగరి వి. ఇంద్రుని రాజధాని, స్వర్గం. ద.శా. 7.212. సం. నగరీ. నగరం. వేగంటియెక్కుఁడు వి. అయిరావతం. వేగంటిరౌతుగాంచినదణి(-కాంచినదణి) వి. సముద్రం. వేగంటివేలుపు రూ.చూ. వేగంటి వేల్పు. వి. ఇంద్రుడు, సహస్రాక్షుడు. వేగంటివేల్పు రూ. వేగంటి వేలుపు. వి. ఇంద్రుడు, సహస్రాక్షుడు. ఇందు. ప. 5.5. వేగంటిసైదోఁడు వి. విష్ణువు. సాంబ. దేవ. 4. వేగండ్ల కుండ రూ.చూ. వెయ్యికండ్లకుండ. వి. చిన్న చిన్న చిల్లులు పెట్టిన కాల్చని మట్టిపాత్ర. వేగన్నులతఁడు విశ. సహస్రాక్షుడు, ఇంద్రుడు. యయా. 1.19. వేగన్ను లదొర(-కన్నులదొర) వి. సహస్రాక్షుడు, ఇంద్రుడు. మల్లప. 2.5. వేగన్నులదొరద్రుమము వి. కల్పవృక్షం, ఇంద్రునిచెట్టు. వేగన్నులసామి (-కన్నులసామి) వి. సహ స్రాక్షుడు. వేచందములు వి.బ.వ. వేయివిధాలు. ద్వి. పరమ. వి. 2.61. వేచుంగలపాగ వి. సహస్రఫణుడు, శేషుడు. వేతలలపాము వి. శేషుడు, అనంతుడు. అచ్చ. రా. ఆరణ్య. 48. వేమాఱులుఁజెప్పు (-చెప్పు[1]) న.క్రి. అనేకపర్యాయాలు చెప్పు. వేనోళ్లఁబొగడు రూ.చూ. వెయి

నోళ్ల(బొగడు. స.క్రి. మిక్కిలిస్తుతించు. వేవోళ్లు వి.బ.వ. అనేకవిధాలు. ఇందు. 6.82. వేమరు రూ.చూ. వేమఱు. క్రి. విశ. మాటిమాటికి. ఉ.రా. 4. వేమఱు రూ. వేమరు, వేమారు, వేమాఱు. క్రి. విశ. పలుమారు. కు.సం. 3.18. వేమాటికి క్రి. విశ. మాటిమాటికి. వేమారు రూ.చూ. వేమఱు. క్రి. విశ. మాటిమాటికి. రామాభ్యు. 1. వేమాఱు రూ.చూ. వేమఱు. క్రి. విశ. మాటిమాటికి. నృసింహ. 1.95. వేలక్షగుండు వి. దండెదగ్గర పరుగులో దూర్చిన చువ్వ కిందికి జారకుండా దారంకట్టి దండె అవతలకు వేలాడదీసినరాయి. వేలచ్చగుండు వి. దండెదగ్గర పరుగులో దూర్చినచువ్వకిందికి జారకుండా దారంకట్టి దండె అవతలకు వేలాడదీసినరాయి. వేవన్నెలపసిండిగట్టు వి. మేరుపర్వతం. వేవురు రూ. వేగురు. సర్వ. బ వ. వేయి మంది, అనేకులు, పెక్కంద్రు. భార. సభా. 1.14. వేవెలుంగు వి. వేయికిరణాలు కలవాడు, సూర్యుడు. బహుళా. 1.8. వేవెలుంగులదొర వి. సూర్యుడు, సహస్రాంశువు. మను. 1.18. వేవెలు(గు రూ. వేవెల్గు. వి. వేయికిరణాలు కలవాడు, సూర్యుడు. బహుళా. 1.8. వేవెలుంగులవేల్పు వి. సూర్యుడు. కకుత్థ. 2.94. వేవెల్గు రూ.చూ. వేవెలు(గు. వి. వేయికిరణాలు కలవాడు, సూర్యుడు. వేవేలు సర్వ. బ.వ. పెక్కువేలు, వేనవేలు, అనేకాలు. శృం.నై. 3.129.

వే² క్రి. విశ. 1 వేగంగా, త్వరగా. భార. భీష్మ. 3.40; 2. శీఘ్రంగా, వెంటనే. భార. ద్రోణ. 2.219.

సం. వేగ-.వడి, త్వర, ఉద్రేకం, శక్తి; ప్రా. వేఅ-. పా. వేగ-. <ప్రా. వేఅ-.

వేగాల్పు (-కాల్పు) వి. ఆములో కుండలుసరిగాకాలని తీరు.

వేవే రూ. వేవేగ. క్రి. విశ. అతిశీఘ్రంగా. ద.హిం.గా. సంపు. 5. గా.సం. 628. క్రీ.శ. 1224.

వేవేగ రూ.చూ. వేవే. క్రి. విశ. అతిత్వరగా. అతివేగంగా. భార. భీష్మ. 2.369.

వేక రూ.చూ. యాక. వి. మట్టిపాత్రను సర్వేటప్పుడు అడుగు పైభాగంలో చుట్టూ వెన్నులాగా నిలిపిన అంచు.

వేకదేకీన వి. అన్నంవండటానికి వాడే మట్టిపాత్ర.

వేకరము వి. ఉపద్రవం.

సం. అపకర-.చీపురు మొ. వాటితో ఊడ్చిన చెత్త.

వేకాడు వి. ఉక్క.

వేకువ చూ. వేగు¹.

వేకువజాము చూ. వేగు¹.

వేగ వి. 1. వేగం, వడి. భార. ఆది. 1.114; 2. త్వర, వేగిరపాటు. భార. ఉద్యో. 3.25; క్రి. విశ. త్వరితంగా. భార. విరా. 4.57.

సం. వేగ-.త్వర, వడి, శక్తి, ఉద్రేకం, సంతోషం; క. బేగ. త్వరితంగా, వేగ. అలజడి, వేగం.

<సం. వేగ-.

వేగపడు అ.క్రి. తొందరపడు, త్వరపడు. నిర్వ.రా. 7.29. వేగపాటు వి. తొందరపడటం, వేగిరపడటం. భార. విరా. 2.260.

వేగరి చూ. వేగు².

వేగలము రూ. వేగాలము. వి. 1. సంక్షోభం, కలత. వేంక. పంచ. 3.147; 2. వేగం.

క. వేగాల్య. మిక్కిలివేగం.

<క. వేగాల్య.

వేగాలము రూ.చూ. వేగలము. వి. వేగం. చంద్రాంగ. 2.77.

వేగి వి. వ్యవసాయపనిముట్లు, గృహోపకరణ సాధనాల తయారీలో కలపగా ఉపయోగపడే చెట్టు. ఈ చెట్టునుంచి వచ్చే ఎర్రటి జిగురును (కినో) మందుల తయారీలో ఉపయోగిస్తారు (Pterocarpus marsupium).

వేగించు చూ. వేగు¹.

వేగిపోవు చూ. వేగు³.

వేగింపు చూ. వేగు¹.

వేగిరకత్తియ చూ. వేగిరము.

వేగిరకత్తె చూ. వేగిరము.

వేగిరకా(డు చూ. వేగిరము.

వేగిరపడు చూ. వేగిరము.

వేగిరపఱచు చూ. వేగిరము.

వేగిరపాటు చూ. వేగిరము.

వేగిరపెట్టు చూ. వేగిరము.

వేగిరము వి. వేగం. భార. ఉద్యో. 1.68; 2. తొందర. ఆము. 6.28; క్రి. విశ. త్వరితంగా. కాశీ. 2.121.

సం. వేగ-; పా. వేగ-, వేఅ. శీఘ్రగతి, అ.మా.పా. వేగ-;

క. బేగ; తు. బేగ, వేగ; త. వేకమ్; మ. వెక్కం.

<పా. వేగ-.

వేగిరకత్తియ రూ.చూ వేగిరకత్తె. వి. వేగిరపాటు కలది, త్వరపడేది. వేగిరకత్తె రూ. వేగిరకత్తియ. వి. వేగిరపాటుకలది, త్వరపడేది. విజయ. 3.204. <వేగిరము+-కత్తె. వేగిరకా(డు వి. వేగిరపాటు కలవాడు, త్వరపడేవాడు. విజయ. 7.204. <వేగిరము+-కా(డు. వేగిరపడు అ.క్రి. తొందరపడు, త్వరపడు. భార. ఉద్యో. 4.391. <వేగిరము+పడు. వేగిరపఱచు స.క్రి. త్వరపరచు, తొందరపెట్టు కృ.శకు. 1.49. <వేగిరము+పఱచు. వేగిరపాటు వి. తొందర. భార. ఉద్యో. 1.115. <వేగిరము+-పాటు వేగిరపెట్టు స.క్రి. త్వరపెట్టు, తొందరపెట్టు. భార. విరా. 5 267. <వేగిరము+పెట్టు. వేగిరించు అ.క్రి. వేగిరపడు, తొందరపడు. హరి. ఉ. 1.75. <వేగిరము+-ఇంచు³.

వేగిరించు చూ. వేగిరము.

వేగిలి వి. నువ్వుచేను అడుగు.

వేగిలివారు. చూ. వేగు¹. అ.క్రి. తెల్లవారు.

వేగు¹ రూ. వేగువ, వే(గి³, వే(గు¹, వేవ. అ.క్రి. 1. తెల్లవారు, ప్రభాతమగు. భార. భీష్మ. 2.167; 2. (కాలం) కడచు. హరి. పూ. 5.230; 3. శుభోదయమగు, హరి.పూ. 983; 4. ఉదయించు, పుట్టు, కలుగు. ఉ. హరి. 3.115.

క. బయ్, బగ్గె. సాయంకాలం. సాయంసంధ్య, కొడ. బయిటి. సాయంకాలం; త. వైక (వైకి-). నిలుచు, ఆప,

తెల్లవారు, అరుణోదయమగు, వైకాఱై, వైకుఱు. ఉదయమగు; మ. వైకుక. రాత్రి నిలిచిపోవు, ఆలస్యమగు, వైకు-నేరమ్, వైనేరమ్. సాయంకాలం; కుఇ. వేగ. తెల్లవారు, ప్రభాతమగు; పర్జి. వేవ్-. (వేయ్-); నా. వేగ్; గ. వేగ్; కురు. బిజ్జ్-; మాల్తొ. బిజ్-.

మూ.మ.ద్రా. మూ.ఢ.ద్రా. *వయ్-క్-/వెయ్-క్-.

<మ్యూ.ద్రా. *వయ్-/*వెయ్.

**వేకువ** వి. ప్రభాతం, తెల్లవారుజాము. భార. విరా. 1.92. **వేకువజాము** వి. తెల్లవారుజాము. **వేగించు** స.క్రి. 1. (కాలం) గడపచేయు, గడుపు. పుచ్చు. రం.రా. బాల. 13పు. 19పం; 2. సహించు, ఓర్చు. రం.రా. అయోధ్యా. 60పు. 3పం; 3. చేయు, నిర్వహించు. శివరా. 3.125; 4. నెగ్గించు. <వేగు[1]+-ఇంచు[3]. **వేగింపు** వి. 1. జాగరం; 2. శోధనం. **వేగుజాము** వి. తెల్లవారుజాము, సూర్యోదయానికి ముందు ఏడున్నర గడియల కాలం. భార. ఆరణ్య. 5. 398. **వేగుఁజుక్క(-చుక్క[1])** వి. శుక్రనక్షత్రం. వేకువజామున పొడిచే నక్షత్రం. మను. 3.55. **వేగుఁజుక్క వారము** వి. శుక్రవారము. **వేగుపాటు** వి. ప్రభాతం, వేఁబోక వేంక. పంచ. 4.316. **వేగుఁబోక(-పోక)** రూ. వేఁబోక. వి. ప్రభాతం, ప్రత్యూషం, తెల్లవారుజాము. భార. ఆరణ్య. 3.274. **వేగురిక్క** వి. శుకచక్షత్రం, వేకువజామున వచ్చే నక్షత్రం. **వేగురుఁజుక్క(-చుక్క[1])** వి. వేగుచుక్క. పారి. 2.53. **వేగులవారు** అ.క్రి. తెల్లవారు, వేగిలివారు. **వేగోజాముబడి** వి. ప్రాతఃకాలంపడి. ద.హిం.శా. సంపు. 10.శా. సం. 340.క్రి.శ. 1253. **వేఁబోక** రూ.చూ. వేగుఁబోక. వి. ప్రభాతం. భార. విరా. 2 238.

**వేగు[2]** రూ. వేవు[2]. వి. 1. చారుడు. భార. శాంతి. 2.279; 2. రాజకీయ సమాచారం. ప్రభా. 1.114.

క. బేగు, బేహు. (రహస్యం) పరిశోధించటం; తు. బేడు, రహస్యసమాచారం; త. వేయ్(-ప్ప్-,-త్త్-). కనిపెట్టు, రహస్యంగా పరిశోధించు, ఫేవు. వే. పరిశోధన, వేయర్. వేగులవాళ్ళు, రహస్యపరిశోధకులు, చారులు; మ. వేవు, (రహస్యం) పరిశోధించటం; కో.వె.జ్. తొంగిచూచు; తొ. పెఫ్. పొంచిఉండు; మాల్తొ. బంగె.

**వేగరి** వి. చారుడు, వృత్తాంతంతెల్పేవాడు, తెల్పేది, వేగువాడు. భాస్క రా యు. 1610. <వేగు+-అరి. **వేగునడచు** అ.క్రి. రాయబారం జరుగు. **వేగునడపించు** స.క్రి. రాయబారం జరిపించు. **వేగునడపు** స.క్రి. రాయబారం జరుపు. **వేగురులు** వి.బ.వ. వేగరులు, వేగువాళ్ళు. **వేగులవాఁడు** విశ. రాజ్యసమాచారం తెలిపేవాడు, చారుడు. భార. విరా. 3 29. **వేగువాఁడు** విశ. రాజ్యసమాచారం తెల్పేవాడు, చారుడు, సందేశహరుడు. భాస్క రా.యు. 172.

**వేగు[3]** రూ.చూ. వ్రేఁగు. అ.క్రి. బాధపడు, క్లేశంపొందు. కు. సం. 4.85.

**వేగిపోవు** వి. చాలాశ్రమపడటం. <వేగు[3]+-ఇ[13]+ పోవు. **వేచు[2]** స.క్రి. బాధపెట్టు, క్లేశాన్ని కలిగించు. భార విరా. 3.44.

**వేగురు** యా.చూ. వేవురు. వి.బ.వ. వేయిమంది, సహస్రసంఖ్య కలవారు, అనేకులు, పెక్కుండ్రు. యయా. 3.50.

**వేగుపు** రూ.చూ. వేగు[1]. 1. అ.క్రి. తెల్లవారు, ప్రభాతమగు; 2. (కాలం) గడచు; 3. శుభోదయమగు; 4. ఉదయించు, పుట్టు, కలుగు; 5. బాధపడు, క్లేశం పొందు.

**వేగోజాముబడి** చూ. వేగు.

**వేఁకి** రూ.చూ. వేఁకి. వి. జ్వరం. నవనాథ. 4.133పు.20పం,

**వేఁకటి** చూ.వ్రేఁగు. రూ. యాకటి, వ్రేఁకటి. వి 1 గర్భం. చూలు. కాశీ. 4.213; బరువైన.

**వేఁకము** విశ. 1. వెగటు. శాశ్వ. సం. 17.308; 2. వెక్కసం.

**వేఁకరము** వి. 1. ఆపద; 2. ఇక్కట్టు.

**వేఁకరి** రూ.చూ. ఎనఁకరి. వి. కిరాతుల్లో ఒకతెగకు చెందినవాడు. ఆం.భా. 2.289.

**వేఁకి** రూ. వేంకి. వి.1. వేడిమి. కు.సం. 5.117; 2. జ్వరం ఉ.హరి. 6.77; 3. అగ్ని. హర. 7.84.

క. బేగె. వేడిమి; త. వెక్కై.

వేఁకివెచ్చయగు(-అగు) అ.క్రి. జ్వరంవచ్చు. కాశీ. 3.114.

**వేఁగఁబడు** చూ. వేఁగు[2].

**వేఁగారు** చూ. వేఁగు[2].

**వేఁగి[1]** చూ వేఁగి[4]. వి. వేగిదేశవిశేషం, ఆంధ్రదేశంలో అంతర్భాగం. ఆము. 1.36.

**వేఁగినాడు** రూ. వెంగినాడు. వి. వేగిదేశం. హంస. 1.53.

**వేఁగి[2]** రూ. వేఁగిస. వి. పీతసాలం, ఒకజాతి మద్దిచెట్టు. వేంక. పంచ. 4.522.

**వేఁగి[3]** రూ.చూ. వేగు[1]. వి. వేకువజాము, తెల్లవారుగడ.

**వేఁగి[4]** వి.పులి. ఆం.భా. 2.82.

సం. వ్యాఘ్ర-. వ్యాఘ్రీ పులి; ప్రా. వి.అగ్ఘ-వగ్ఘ-, వగ్ఘీ; పా. బ్యగ్ఘ వెయ్యగ్ఘ, వ్యగ్ఘ. వియగ్ఘినే; అప. వగ్ఘ, వగ్ఘీ, వియగ్ఘ. వ్యాఘ్రం, వక్క-; క. బుగ్గ, ఒగ్గు. చెంచు, బాగ్.

<ప్రా. విఅగ్ఘ-.

**వేఁగిస** రూ.చూ. వేఁగి[2]. వి. పీతసాలం, ఒకానొకచెట్టు. పి. శకు 2.14. (Pterocarpus Marsupium).

తు. బీణ్ణ, బెంగ. ఎర్రచందనం; త. వేంకై. ఒకానొక చెట్టు; మ. వేణ్ణ; గోం. వెంగా; కుఇ. వేంగిడి. పీతసాలం, ఒకానొకచెట్టు; పర్జి. వెనుఁక. ఒకచెట్టు.

**వేఁగు[1]** రూ.చూ. వేగు[1]. అ.క్రి. తెల్లవారు.

**వేఁగు[2]** రూ.చూ. వ్రేఁగు. అ.క్రి. 1. కాలు, దగ్ధమగు. నిర్వ. రా. 8.63; 2. తపించు, తాపంపొందు. భార. స్త్రీ. 1.180; 3. పరితపించు, దుఃఖపడు. రం. రా. అయోధ్యా. 139పు. 11పం; 4. కాలంగడుపు. హరి. హ. 5.214; 5. చచ్చు, నశించు. వీర. వి. 2.70; 6. క్షీణించు. వరాహ. 3.47; 7. (కాయధాన్యం మొ.వి) తప్తమగు; వి. భారం. బరువు. చెన్నబసవ. 2.20.

**వేఁగఁబడు** అ.క్రి. వేగు, పరితాపం పొందు. కేయూ. 3.184 <వేఁగు[2]+-అ[7]+పడు. **వేఁగారు** అ.క్రి. భారమగు, బరువగు. ట్వ. పరమ. వి. 2.56పు. 11పం.

<వేఁగు+అరు[1]. వేఁచికాల్చు స.క్రి. ఎక్కువగా బాధించు. <వేఁచు+-ఇ[13]+కాల్చు. వేఁచిపోఁత వి. వేగించటం, తపింపచేయటం. వరాహ. 6.103. వేఁచిపోయు స.క్రి. వేగచేయు, తపింపచేయు. వేఁచు రూ. వ్రేఁచు. స. క్రి. 1. తపింపచేయు. మను. 3.33; 2. పరితపింపచేయు. ప్రభా. 3.97; 3. వేగచేయు, భర్జించు. ఉ.రా. 3.323. వేఁపి రూ.చూ. ఏపి[1]. వి. కుక్క, వేటకుక్క. చంపూరా. 7.33. వేఁపికాఁడు విణ. కుక్కల సహాయంతో వేటాడేవాడు. మను. 4.40. వేఁపు రూ. వ్రేఁపు. వి. వేచటం. వేపుడు. భాగ. 10-4-1924. వేఁపుడు రూ. వ్రేఁపుడు. వి. 1. వేచటం, భర్జనం, వేచినకూర. రాజ వా. 2.100; 2. వేచే చట్టి, బాణలి; విణ. వేచినది. బహు ళా. 4.13. వేఁపుడుచట్టి వి. వేచుకునేచట్టి.

**వేఁగెములాడు** అ.క్రి. ఒప్పు. ద్వి. పరమ. వి. 4.579.

**వేచు**[1] స.క్రి. ఎదురుచూచు, ప్రతీక్షించు. భార. విరా. 1.47.

పో. చూ. కో. వేజ్. తొంగిచూచు; గోం. మెహ్-. బోధించు, చూపు; కుఇ. మెహ్వ (మెహ్-). చూచు, పరీక్షించు; కువి. బెహ్-. తొంగిచూచు, బే-చ్-. చూచు; మాల్తో. బన్. ప్రతీక్షించు.

<మూ.ద్రా. *వెయ్/*వే-.

**వేచు**[2] చూ. వేగు[2].

**వేంచేపు** చూ. వేంచేయు.

**వేంచేయు** అ.క్రి. 1. వచ్చు. భార. ఉద్యో. 2.304; 2. (దేవతలు, ప్రభువులు మొ. వారు) వెళ్ళు, వెళ్ళిపోవు. పరమ. 3.51; 3. (దేవతలు, ప్రభువులు మొ. వారు) కూర్చుండు. పాండు. 4.184; 4. (దేవతలు, ప్రభువులు మొ. వారు) వసించు. విప్ర. 3.77; 5. ఊరేగు. పాండు. 4.144.

సం. విజయ-, గెలుపు.

<సం. విజయ-+-ము+చేయు.

వేంచేపు వి. (దేవతలు, ప్రభువులు మొ. వారి) ప్రవేశం. వేంక. మా. 2.112.

**వేఁచికాల్చు** చూ. వేఁగు[2].

**వేఁచిపోఁత** చూ. వేఁగు[2].

**వేఁచిపోయు** చూ. వేఁగు[2].

**వేఁచు** చూ. వేఁగు[2].

**వేట్** వి. 1. పెద్దడబ్బా; 2. పెద్దతొట్టి.

ఇం. Vat. పెద్దతొట్టి.

<ఇం. Vat.

**వేట** రూ.చూ. వేఁట. వి. గొర్రెల్ని, పోతుల్ని బలి ఇవ్వటం.

**వేటము** వి 1. వేడుక, 2 వినోదం, ముచ్చట.

**వేటు** చూ. వేయు[1].

**వేటుకుంచె** చూ. వేయు[1].

**వేటుకుంచెతీయు** చూ. వేయు[1].

**వేటుగజ్జెలు** చూ. వేయు[1].

**వేటులాడుకొను** చూ. వేయు[1].

**వేటులాడుగొను** చూ. వేయు[1].

**వేటేడుతునుకలుగఁజేయు** చూ. వేయు[1].

**వేట్క** రూ.చూ. వేడుక. వి. 1. సంతోషం; 2. ముచ్చట.

**వేట్కలరు** రూ. వేడ్కలరు. వి. వేడినీళ్ళలో ఉడకబెట్టి తయారుచేసే రంగు.

ఇం. Vat Colour. ఒకరకం రంగు.

<ఇం. Vat Colour.

**వేట్లాడు** చూ. వేఁట.

**వేడబము** వి. 1. వంచన, మోసం. ఉ. హరి. 4.182; 2. వేషం. కాశీ. 7.46; 3. కపట ప్రవర్తనం, మాయ. భాగ. 10పూ. 129; 4. నడవడి, ప్రవర్తన. కృ.శకు. 1.39; విణ. మనోజ్ఞం, చక్కనిది. రసిక. 4.43.

సం. విడంబ-. కపటవేషం, వంచన, తిరస్కారం; ప్రా. వేడంబ-, వేడంబిగ-, వేలంబ, విడంబ-, విడంబణా.

<ప్రా. వేడంబ-.

వేడబించు స.క్రి. మాయచేయు, వంచించు, దగాచేయు. వేడబము+-ఇంచు[3].

**వేడబించు** చూ. వేడబము.

**వేడము** రూ.చూ. వేలాము. వి. 1. మండలాగ్రం, కత్తి. రామాభ్యు. 7.180; 2. డేరా, శిబిరం.

**వేడించు** స.క్రి. 1. పరివేష్టించు, ముట్టడించు. రం.రా.యు. 348వ. 29పం; 2. చుట్టివచ్చు. అష్టమ.క. 5.262వ. 4పం; అ.క్రి. వ్యాపించు, ప్రసరించు. ద్వి. పరమ. వి. 3.170వ.

సం. వేష్ట్. చుట్టు, వేష్ట-వంపు, తాడు; ప్రా వేఢ-. చుట్టటం.

<ప్రా. వేఢ-+-ఇంచు[3].

**వేడుక** రూ.చూ. వేడ్క. వి. 1. సంతోషం. భార. ఆది. 5.206; 2. కుతూహలం, ఉబలాటం. భార. ఆది. 8.242; 3. అవలీల, హేల. కాశీ. 1.33; 4. వినోదం. శృం. నై. 3.98; 5. అభిలాష, కాంక్ష. భోజ. 4.235; 6. ఉత్సవం, సంతోషకరమైన పని. విక్ర. 2.152; 7. విలాసం. శుక. 2.115.

క. బేటు, బేంటు. కామవాంఛ; త. వేట్. కోరిక, వేల్. కోరిక; మ. వేల్. కోరిక, వాంఛ, కామం, వేట్ప. ప్రేమ, ఆప్యాయత; పర్జి. వెఱ్క. సంతోషం, కోరిక.

వేడుకకత్తియ రూ.చూ. వేడుకకత్తె. వి. 1. వేశ్య. కకుత్స్థ. 4.141; 2. వ్యభిచారిణి, జారిణి. వేడుకకత్తె రూ. వేడుకకత్తియ, వేడ్క కత్తియ, వేడ్కకత్తె. వి. 1. వేశ్య. కాశీ. 3.107; 2. వ్యభిచారిణి, జారిణి. వేడుకకాఁడు రూ. వేడ్కకాఁడు. వి. 1. కుతూహలం కలవాడు, ఉబలాటంకలవాడు. భార. శాంతి. 3.192; 2. క్రీడాసక్తుడు. హరి. ఉ. 3.227; 3. విలాసవంతుడు. కాశీ. 6.172; 4. వినోదకరుడు. భాగ. 10పూ. 446; 5. కాంక్ష కలవాడు, అపేక్ష కలవాడు. రాఘవ. 2.78; వి. 1. ఉపపతి, జారుడు. శివరా. 3.18; 2. విటుడు. ఉ. రా. 4.204. వేడుకకొమ్మ రూ.చూ. వేడ్కకొమ్మ. వి. 1. వేశ్య; 2. జారిణి. వేడుకచెలి రూ. వేడ్కచెలి. వి. వేశ్య. పాండు. 2.13. వేడుకచేయు రూ. వేడుకసేయు,

వేడ్కచేయు, వేడ్కసేయు. అ.క్రి. కుతూహలపడు. జాహ్నవీ. 1.26. **వేడుకజూదము** రూ. వేడ్కజూదము. వి. వినోదంకోసం ఆడే ఆట. **వేడుకపడు** రూ.చూ. వేడ్కపడు. స.క్రి. కోరు, అపేక్షించు. భార. శాంతి. 2.245; అ.క్రి. కుతూహలపడు, ఉబలాటపడు. భోజ. 2.112. **వేడుకలకత్తియ** రూ.చూ. వేడుకలకత్తె. వి. 1. వేశ్య; 2. జారిణి, వ్యభిచారిణి. **వేడుకలకత్తె** రూ. వేడుకలకత్తియ, వేడ్కలకత్తియ, వేడ్కలకత్తె. వి. 1. వ్యభిచారిణి, జారిణి. భాగ. 9.380; 2. వేశ్య. **వేడుకలుకొనలెత్తు** రూ.చూ. వేడ్కలు కొనలెత్తు. అ.క్రి. కోరికలు ఎక్కువగు. **వేడుకలు చూపు** రూ. వేడుకలునూపు, వేడ్కలుచూపు, వేడ్కలు నూపు, అ.క్రి. సంతోషంగొలుపు. రుక్మా. చ. 4.70. **వేడుకలునూపు(-చూపు)** రూ.చూ. వేడుకలుచూపు. అ.క్రి. సంతోషం కొలుపు. **వేడుకసలుపు** రూ. వేడ్కసలుపు. అ.క్రి. 1. క్రీడించు, భోగించు. విష్ణు. 4.224; 2. విహరించు. గౌ.హరి. 1.1272-73పం. **వేడుకసేయు(-చేయు)** రూ.చూ. వేడుకచేయు. అ.క్రి. కుతూహలపడు.

**వేడెము** వి. 1. మండలగతి, చుట్టుతిరగటం. వసు. 6.97; 2. అశ్వగతి విశేషం, గుర్రాలమండలాకారగతి. రాజ. చ. 2.29.

సం. వేష్టన-. వేష్ట-. ఆవరణం; ప్రా. వేఢిఅ. ఆవరణం, వేట్టణ-. రుమాలు, తలపాగ; శౌ. వేఢిద-; అ.మా. వేఢ-. చుట్టటం, వేఢగణ. భూషణం. వేఢిఇ. చండాలిక, వేఢఅ; పా. వేఠ-, వేఠక-, వేఠన-;

క. వెడె. ఆవరణం, ఆక్రమణం, వలయం. కంచె, వెడెయ. కంచె; బ్రా. వేడ్.

< ప్రా. వేఢిఅ.

**వేడెమువెట్టు(-పెట్టు)** అ.క్రి. చక్రభ్రమణం చేయు. వర. రా. సుం. 13.24 **వేడెంపుగట్టు** వి. చక్రవాళ పర్వతం. రామాభ్యు. 7.65. **వేడెవెట్టించు** స.క్రి. పరివేష్టించు. చుట్టుకొను. భాగ. 9.289. < వేడెము + పెట్టించు. **వేడెవెట్టు** స.క్రి. 1. పరివేష్టించు, ముట్టడించు, చుట్టుముట్టు. జైమినిభా. 7.147; 2. పరివేష్టింపచేయు. < వేడెము + పెట్టు.

**వేడెంపుగట్టు** చూ. వేడెము.

**వేడెవెట్టించు** చూ. వేడెము.

**వేడెవెట్టు** చూ. వేడెము.

**వేడ్క** రూ. వేట్క, వేడుక. వి. 1. కుతూహలం. భార. ఆది. 1.128; 2. వినోదం. భార. విరా. 1.140; 3. అపేక్ష, కోరిక. భార. విరా. 2.88; 4. సంతోషం. విక్ర. 1.19; 5. ఉత్సవం. నీలా. 3.46.

**వేడ్కకత్తియ** రూ.చూ. వేడుకకత్తె. వి. 1. వేశ్య; 2. జారిణి. **వేడ్కకత్తె** రూ.చూ. వేడుకకత్తె. వి. విలాసవతి అయినస్త్రీ. క్రీడా. 1.129; 2. వేశ్య. **వేడ్కకాఁడు** రూ.చూ. వేడుకకాఁడు. వి. జారుడు. పండి. ఐ. 2.116. **వేడ్కకొమ్మ** రూ. వేడుకకొమ్మ. వి. వేశ్య; 2. జారిణి. **వేడ్కచెలి** రూ.చూ. వేడుకచెలి. **వేడ్కచేయు** రూ.చూ. వేడుకచేయు. అ.క్రి. కుతూహలపడు. **వేడ్కజూదము** రూ.చూ. వేడుకజూదము. వి. వినోదం కోసం ఆడే ఆట. **వేడ్కపడు** రూ. వేడుకపడు. స.క్రి. అపేక్షించు. భార. విరా. 2.98; అ.క్రి. వేడుకపడు, కుతూహలపడు. శృం.నై. 3.33. **వేడ్కలకత్తియ** రూ.చూ. వేడుకలకత్తె వి. 1. వేశ్య; 2. జారిణి. **వేడ్కలకత్తె** రూ.చూ. వేడుకలకత్తె. వి. 1. వేశ్య; 2. జారిణి. **వేడ్కలుకొనలెత్తు** రూ. వేడుకలుకొనలెత్తు. అ.క్రి. కోరికలు ఎక్కువగు. హంస. 1.169. **వేడ్కలుచూపు** రూ.చూ. వేడుకలుచూపు. అ.క్రి. సంతోషం కొలుపు. **వేడ్కలునూపు(-చూపు)** రూ.చూ. వేడుకలుచూపు. అ.క్రి. సంతోషం కొలుపు. **వేడ్కసలుపు** రూ.చూ. వేడుకసలుపు. అ.క్రి. 1. క్రీడించు, భోగించు; 2. విహరించు **వేడ్కసేయు(-చేయు)** రూ.చూ. వేడుకచేయు. అ.క్రి. వేడుకచేయు. కుతూహలపడు. వేడుకచేయు,

**వేడ్కలరు** రూ.చూ. వేట్కలరు. వి. వేణ్ణీళ్ళలో ఉడకబెట్టి తయారుచేసేరంగు.

**వేణ్డు** రూ.చూ. వేఁడు[1]. స.క్రి. వేడుకొను. ద.హిం.గా. సంపు. 10. శా. సం. 593.

**వేండు** రూ.చూ. వేఁడు[1]. వి. ఆరునొక్కటి, నె.గా. నెల్లూరు. 30. క్రీ.శ. 1270.

**వేంద్రపడు** చూ. వేంద్రము.

**వేంద్రము** వి. వేడిమి. ఉ. హరి. 6.78; విశ. 1. మిక్కిలి వేడిమి అయినది. రం. రా. అయోధ్యా. 96పు. 23పం; 2. శౌర్యవంతం. భాగ. 10పూ. 1522; 3. తీక్ష్ణం, వాడైనది. అహల్యా. 197; 4. పరుషం. అచ్చ. రా. బాల. 148.

**వేంద్రపడు** అ.క్రి. కోపించు. హంస. 3.150. < వేంద్రము + పడు.

**వేండ్లు** చూ. వేఁడి[1].

**వేఁట** రూ. వెంట[2], వేట. వి. 1. మృగయ, అడవిలో మృగాల్ని పక్షుల్ని సంహరించటం. భార. ఆది. 4.27; 2. మేకపోతు, దేవతలకు బలి ఇవ్వటానికి ఏర్పరచిన మేకపోతు. హంస. 2.91; 3. తగరు, పొట్టేలు. ఆం. భా. 3.58.

క. వేటె, బెటె, బేంటె. బెంటబెట్టు; కొడ. బొ.టె. వేటాడు; తు. బేంటె, భోంటె, బేటె. వేటాడు. వేట; త. వేట్టమ్, వేత్తై. వేటాడు, వెంబబెట్టు, సంహరించు, వేట్టు. వేటాడే వృత్తి, వేటు. వేటాడటం, వేటాడే వాడు; కో. వె.ట్. వేటాడటం; తొ. పె.ట్. వేటాడు.

**వేట్లాడు** రూ.చూ. వేఁటలాడు. అ.క్రి దెబ్బలాడు, కొట్లాడు. ఘటికా. 2.146. **వేఁటకరి** వి. వేటకాడు. మను. 4.50. **వేఁటకాఁడు** రూ. వేఁటగాఁడు. వి. 1. వేటాడే వాడు. భార. శల్య. 2.36; 2. నశింపచేసేవాడు. అచ్చ. రా. అయోధ్యా. 42; త. వేట్టున్, వేట్టువన్. వేటకాడు, వేటచ్చి. వేటిచ్చి. వేటాడేస్త్రీ. **వేఁటకుక్క** వి. వేటాడటంలో నేర్పు ఉన్నకుక్క. విశ్వకద్రువు. **వేఁటగాఁడు** రూ.చూ. వేఁటకాఁడు. వి. 1. వేటాడేవాడు, మృగయుడు; 2. నశింప చేసేవాడు, సంహారం చేసే వాడు. **వేఁటగిరి** వి. వేటాడి జీవించేబోయ, వ్యాధుడు. రాజవా. 3.57. **వేఁటచాఱ్ల** వి.బ.వ. ఒకదినుసు వస్త్రాలు.

